# అనుక్రమణిక

—:•:—



———




సంపుటి 2. | సంపాదకుడు : తిరుమల రామచంద్ర | సంయుక్తసంపాదకుడు : తిమ్మావజ్ఝల కోదండరామయ్య | సంచి

# మనవిమాటలు

ఇటీవల జరిగిన రెండు సంగతులలో ఒకటి హర్షించ దగినది; మరొకటి హర్షించ దగనిది.

మొదటిది కీర్తిశేషులు శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' నేటి తెనుగుసారస్వతంలో ఉత్తమోత్తమంగా పరిగణితమై బహూకృతం కావడం; ఇది ఆంధ్రులకు గర్వహేతువు.

రెండవది అంతరాంతరాల్లో అణగిఉన్న ఈర్ష్యాద్వేషాలకు సాహిత్యరూప మిచ్చి కింవదంతులు, అపవాదాలు కల్పించేచిత్తవృత్తి.

అదేమి దైవదుర్విలసితమో ! కావ్యంకర్తృత్వాన్ని శంకించడం, కవులపై అపవాదు మోపడం మనకు శతాబ్దులుగా అలవాటు !!

భారతం నన్నయ రచన కాదు; అతని కన్నడమిత్రుడు నారాయణభట్టు రచించినది. కవిజనాశ్రయకర్త మల్లయరేచన కాదు; భీమన. భాస్కరరామాయణం రచించినది హుళక్కి భాస్కరుడా ? మంత్రి భాస్కరుడా ? రంగనాథరామాయణం రంగనాథునిదే కాని గోనబుద్ధారెడ్డి ఎలా చెప్పగలడు ? క్రీడాభిరామం శ్రీనాథుడు చెప్పి, వల్లభార్యుని పేరు పెట్టినాడు. వల్లభార్యుడు అంతటివా డయితే మరొక రచన ఏదీ ? బుద్ధి తెలిసినప్పటినుంచి యుద్ధాలతో గడపినకృష్ణరాయలు ఆముక్తమాల్యదను అల్లగలడా ? పెద్దన పాండిత్యప్రకర్షే అది. ఉత్తరరామాయణం చెప్పినవాడు పుష్పగిరి తిమ్మనార్యుడా ? కంకంటి పాపరాజా ? చిన్నయసూరి "మును మదుపజ్ఞంబు" అని బాలవ్యాకరణం స్వోపజ్ఞంగా చెప్పుకున్నాడు. కాని శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారి సంస్కృతకారికలను 'కాపీ' కొట్టినవాడే ! —ఇలాటిదే నేడు కన్యాశుల్కకర్తృత్వంపై చెలరేగినకుశంక.

కింవదంతులపై కుతూహలం కలవారు ఈ కుశంకలను హర్షిస్తారేమో గాని, సాహిత్యమర్మజ్ఞు లైనసహృదయు లెవరూ సంతసించరు; సహించరు.

దేశిరచనలు :



# దండకవాఙ్మయము



శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు





ఆంధ్రవాఙ్మయచరిత్రలో పరిశోధనకు మిగిలినశాఖలలో దండకవాఙ్మయశాఖ యొకటి. తెనుగుభాషలో దండకములు నన్నయ మొదలుగా [1]నేనాటివఱకును వరిల్లు చునే యున్నవి. కాని ప్రత్యేకపరిశ్రమ చేయదగినశాఖగా నిది పరిగణితము కాక పోవుటచేత నా పరిశ్రమ జరుగలేదు. నేడు శతకములు, యక్షగానములు మొదలగు దేశి రచనాశాఖల చరిత్రయందు ప్రత్యేకపరిశ్రమ జరుగుచున్నది గాన, నీ శాఖాచరిత్రమును 'పరిశోధన' మూలమున వీలైనంతవఱకు నివేదింతును.

దండక మొక వృత్తభేదము. కాని యిది యిరువదియాఱక్షరములకు మించిన పాదములు గలది యగుటచేత ఉద్ధరమాలావృత్తములలో పరిగణిత మైనది. దండకము సంస్కృతభాష లోను, తెనుగుభాషలోనే కాక, తమిళ, కన్నడ, మలయాళ ద్రవిడ భాషలయం దున్నవి. కాని తెనుగుభాషయం దీ వృత్తమున కున్న ప్రాచుర్యము గాని ప్రసిద్ధి గాని మఱే భాషకు లేదని చెప్పవచ్చును. తెలుగుభాషలోవలె మహా కావ్యములం దవి కన్పట్టవు. మఱియు ప్రత్యేకముగా దండకవృత్తములోనే, ఒక కథ గాని, మఱియొక వృత్తాంతము గాని మొదలనుండి తుది వఱకు గ్రంథరూపముగా రచించు పద్ధతి తెలుగుభాషలో కలదు. కాని తక్కినభాషల యం దిది విరళము. మొదట నాయా భాషల యందు దండకలక్షణము లెట్లున్నవో వివరించు చున్నాను.

## సంస్కృతదండకములు - వాని లక్షణములు

క్రీస్తుశకము 725 ప్రాంతమున నున్నభవభూతి మహాకవి తన మాలతీమాధవములో పంచమాంకమున (23) కాపాలికునిచేత నొక దండకమును చెప్పించినాడు.[2] ఈ దండకము ప్రారంభమున రెండు నగణములు, ఆపైనుక 16 రగణములు గలవు. ఇందు 54 వర్ణములు, 4 పాదములు గలవు.[3] మాలతీమాధవ చ్ఛందోవివరణములో దీనికి సంగ్రామ దండకమను పే రున్నట్లు చెప్పబడియున్నది. అప్పకవి చెప్పిన దండకభేదములలో నీపేరు లేదు. అందు రెండు నగణములపై 14 రగణములవఱకు గల దండకములే యున్నవి. ఇవి 16 రగణములు

1. దండకరచన యీనాడు లుప్తమైన దనుటకు నాధారము లేదు. రెండు మూడేండ్ల క్రిందటనే శ్రీ కలుగోడు అశ్వత్థనారాయణరావు గారు దండకరామాయణము (వాఙ్మయములో కెల్ల పెద్దదండకము) వెలువరించినారు. దానిగూర్చి ముందు తెలియగలదు.

2. "ప్రచలితకరికృత్తిపర్యంత చంచన్నఖాఘాతభిన్నేందునిష్యందమానామృత
శ్చ్యోతజీవత్కపాలావలీముక్తచండాట్టహాసత్రసద్భూరి భూతప్రవృత్తస్తుతి।
శ్వసదసితభుజంగ భోగాంగద గ్రంథినిష్పీడన స్ఫారఫుల్లత్ఫణా పీఠనిర్యద్వి
షజ్యోతి రుజ్జృంభణోడ్డామర వ్యస్తవిస్తారిదోః ఖండపర్యాసి తక్ష్మాధరం
జ్వలదనల పిశంగ నేత్రచ్ఛటా సాటభీమోత్తమాంగ భ్రమిత్వభ్రిస్తుతాలాత చ
క్ర క్రియాస్యూత దిగ్భాగముత్తుంగ ఖట్వాంగ కోటిధ్వజోద్భూతి విక్షిప్త తారాగణం
ప్రముదిత కటపూతనోత్తాల వేతాల తాలీస్ఫుటత్కర్ణ సంభ్రాంత గౌరీఘనా
శ్లేషహృష్యన్మనస్త్ర్యంబకానంది వస్తాండవమ్ దేవిభూయా దభీష్టైచహృష్టైచనః"

3. Malati Madhava. Edited by R. D. Karmakar. A Note on metr Page 336. Poona 1935,

కావున నప్పకవి చెప్పని దండకభేదము లింకను గల వని యెన్నవగును. ఈ దండకభేద ములు వృత్తరత్నాకరమున గలవు.

## శ్యామలాదండకము

పై దండకము తరువాత సంస్కృతభాషలో మిగుల ప్రచారము చెందినది శ్యామలాదండకము. ఇది తెలుగుదేశముననే కాక తమిళదేశము లోను, ముఖ్యముగా మళయాళదేశమునను చాల ప్రచారమున నున్నది. ఈ దండకమును కాళిదాసు రచించినట్లుగా కాళిదాస చరిత్ర ప్రకరణము, భోజప్రబంధము మున్నగుగ్రంథ ములయం దున్నది. ఆంధ్రకవి పండితలోకమున గూడ నిది కాళిదాసురచనగానే వ్యాప్తిలో నున్నది. క్రీస్తుశకము 1400 ప్రాంతమున జక్కనకవి విక్రమార్కచరిత్ర (2-5!') లో నీ దండకము ననుసరించి కాళీదండకము రచి యించి యున్నాఁడు.

శ్యామలాదండకము —— కాళీదండకము

"జయ జననీ సుధాసముద్రాంతరుద్యన్మణీ... ద్వీపసంరూఢ బిల్వాటవీమధ్య కల్పద్రుమా కల్పకాదంబకాంతార వాసప్రియే కృత్తి వాసప్రియే ... హేమకుంభోపమోత్తుంగభారా వనమ్రే త్రిలోకావనమ్రే......నమ్రదిక్పాల సీమంతినీకుంతలస్నిగ్ధనీలప్రభాపుంజ సంజాత దూర్వాంకురా శంకసారంగ సంయోగరింఖన్న ఖేందూజ్జ్వలే......"

"జయ జయ జగదంతరానందమూర్తే శతా నందసంస్తుత్యకీర్తే, నమద్దివ్యసీమంతినీకాంత సీమంతసంక్రాంతసిందూరబాలాతప ప్రస్ఫుర త్పాదపంకేరుహే హేమకుంభీలసత్కుంభ వక్షోరుహే...సుధాసాగరాంతర్మణి ద్వీప నీపాటవీ పాటలీ వాటికాకల్ప కల్పద్రుమ ప్రాంత చింతామణి శ్రేణికా గేహసీమా శివాకార......"

శ్యామలాదండకము కాళిదాస కృత మని తంజావూరి రఘునాథ నాయకుఁ డిట్లు ద్విపద నలచరిత్రలో వ్రాసి యున్నాఁడు.

"శ్యామలాకరుణాకటాక్షసంలబ్ధ
కోమలకవితానిగుంభగవిలాసు
కాళిదాసు గణించి......"

క్రీస్తుశకము 16 వ శతాబ్దప్రథమపాదమున నిట్టి ప్రవాద మున్నను నా వెనుక పరిశోధనల వలన శ్యామలాదండకము 'పురాంతక కవి' రచియించినట్లు స్పష్టపడినది.[1] దీనిని తొలుత తెలుపుక పఱచినవారు పరిశోధక పరమబుధులు శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు[2].

ఈ పురాంతకుఁ డనుకవి క్రీస్తుశకము 1011 లో భోజమహారాజు కాలములో నున్నవాడు. సర్వమంగళాస్తుతిపర మైన శ్యామలాదండకము రచించి, యాతనివలన నూఱగ్రహారములను బహుమతిగాఁ బడసెను. దీనికి శాసనప్రమాణమే గలదు. కాని నేటివఱకు నీవిషయము సాహిత్య పరిశోధకుల కెఱుకపడ లేదు.

ఈ దండకము వెనుక శృంగారనైషధమున శ్రీనాథమహాకవి వ్రాసినసంస్కృతభారతీ దండకము పేర్కొనదగినది. మూలములో శ్లోకరూపమున నుండగా వానికి దండక రూపము నిచ్చి స్తోత్రముగా చేసిన శ్రీనాథుని ఛందఔచిత్య మెంతయు ప్రశంసనీయము.

వృత్తరత్నాకరము తృతీయాధ్యాయమున దండకలక్షణ మిట్లు నిర్వచిత మైనది.

"ఇదానీం సమవృత్త ప్రసంగేన సమవృత్త రూపాన్ దండకా నాహ:—

"యది హి న యుగళం తతః సప్తరేఫా
స్తదా చండవృష్టిప్రపాతో భవే ద్దండకః,
..........................

1. దీనిని కృష్ణమాచార్యులవా రనువదించినారు. History of Classical Sanskrit Literature. M. Krishnamachariar. 504 Page 492.

2. 1916-1917 సంవత్సరాది సంచికలో నీ విషయము తెలిపినారు.

ప్రతిచరణ వివృద్ధరేఫాః స్యు రర్ణార్ణవవ్యాల జీమూతలీలాకరోద్దామ శంఖాదయః.

"యద్యపి ప్రతిచరణం వివృద్ధో రేఫో రగణో యేషు తే తథేతి వ్యుత్పత్త్యా ప్రథమే పాదే సాతతోష్టౌ రేఫాః, ద్వితీయే నవ, తృతీయే దశ, చతుర్థే ఏకాదశేతి వృద్ధిరిత్యర్థః ప్రతీయతే, తథాపి, గ్రంథాంతర విరోధాత్ ప్రతి దండకం చరణేషు వివృద్ధా రేఫా యేష్వితి విగ్రహేణో త్తరో త్తరదండకేషు చరణచతుష్టయే ఽప్యేకైక రేఫవృద్ధి రిత్యర్థాశ్రయేణ గ్రంథాంతరాఽవిరోధః కార్యః. తతశ్చ నాభ్యాం రగణాష్టకేన చ ఘటితపాదోఽర్ణాఖ్యో దండకః, రగణనవకే సాఽర్ణవః, దశభి ర్వ్యాళః, ఏకాదశభి ర్జీమూతః, ద్వాదశభి ర్లీలాకరః, త్రయోదశభి రుద్దామః, చతుర్దశభిః శంఖః. సర్వత్రాదౌ నగణద్వయం కార్యం. ఆదిశబ్దాత్ పంచదశాది రగణై రారామ-సంగ్రామ-సురామ-వైకుంఠ-సోత్కంఠ-సార-కాసార-విస్తార-సంహార-నీహార-మందార-కేదార-సాధార-సత్కార-సంస్కార-మాకంద-గోవింద-సానంద-సందోహ-నందే త్యేవమాది నామకా ఏకైక రగణ వృద్ధ్యా న ద్వ్యోత్తరైక త్రింశ దధిక శతత్రయ రగణ ఘటితైకోన సహస్రాక్షర పాద పర్యంతం కవి ప్రయోగానుసారేణ దండకా జ్ఞేయాః." 1

మరికొందఱు లాక్షణికు లిచ్చిన నిర్వచనము లివి.

²దండకః

"దండకో గణవృత్తాది
 భేదేన బహుధా భవేత్,
పదై స్స్వరై ర్విరచితో
 నానాయతివిభూషితః,
యథోచితేన తాళేన
 రాగై రపి చ గీయతే
ఏవం దండక ఉద్దిష్టః
 ................" [హరిపాలః]

"అయం తాళై స్స్వరై ర్యుక్తో
 మధ్యే పాఠవిరాజితః,
పునః పదసమాయుక్తో
 గాతవ్యో దండకో బుధైః."
[సోమేశ్వరః]

"నిర్యుక్తసంజ్ఞా కథిత స్త్రిధాతుః
 త్ర్యంగోఽపి తాళేన పదైః స్వరైశ్చ,
నిబద్ధ ఏతై రుదితై ర్విశేషైః
 సోఽయం భవే ద్దాభరనికాఖ్యజాతిః."
[రఘునాథః]

తమిళభాషలో దండకము (తాండకమ్)

³ఎణ్ణుకేనెన్ సొల్లియెణ్ణుకేనో
 వెంపెరుమాన్ఱిరువడి యే యెణ్ణినల్లాల్,
కణ్ణిలేన్ మఱ్ఱోర్కళై కణిల్లేన్
 కళలడి యేకైతొళుదు కాణినల్లా
లొణ్ణుళే యొన్పదు వాసల్ వైత్తా
 యొక్కవడైక్కుం పోదుణరమాట్టేన్,
పుణ్ణియా వున్నడిక్కే పోదుగిన్ఱేన్

1. పై వానిలో 'సంగ్రామ' దండకము భవభూతి రచించినది.

2. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారి భరతకోశము. పుట 266.

3. எண்ணுகே னென் சொல்லி யெண்ணுகேனோ
 வெம்பெருமான் றிருபடியே யெண்ணினல்லாற்
கண்ணிலேன் மற்றோர்களை கணில்லேன்
 கழலடியேயை தொழுது காணினல்லா
லொண்ணுளே யொன்பது வாசல் வைத்தா
 யொக்க வடைக்கும் போதுணர மாட்டேன்
புண்ணியா வுன்னடிக்கே போதுகின்றேன்
 பூம்புகலூர் மேவிய புண்ணியனே,

పూన్ పుఘలూర్ మేవియ పుణ్ణియనే.

[1] ఒరువనై యుం మల్లాదునరాదుళ్ల
మూణచ్చిత్తరు మాట్టత్తుళ్ళేనిన్ఱ
విరువరై మూవరైయుం మెన్మేలేవి
యిల్లాద తరవఱు త్తాయ్‌క్కిల్లేనేల
క్కరువరై శూఴ్‌కాన లిలంకై వేందన్
కడున్ తేర్మీ దోడామై కాలాఱ్ సెట్ర
పొరువరై యాయున్నడిక్కే పోదుఘిన్ఱేన్
పూంబుఘలూర్ మేవియా పుణ్ణియనే.

పైదానికి తాండకమని పేరు. ఇట్టి ఛందస్సునే అప్పరుస్వామి యనుశివభక్తుఁడు నాయనారు (ఇతనికే తిరునావుక్కరసు అని పేరు) మిక్కుటముగా శివస్తోత్రముల పాడుటవలన పెరియ పురాణకర్త 'శెక్కిళార్' అతనిని 'తాండక వేందు' అని, 'తాండకచతురర్' అని పేర్కొన్నాడు. తాండకము నొక వృత్తభేద మని యాతడే పేర్కొన్నాడు. (మున్నుణర్విన్ ముయఱ్చి యినాల్ తిరువిరుత్తమ్ పలమొళిందార్) (తిరునావుక్కరశు పురాణము-426 పద్యము).

## కన్నడభాషా దండకము.

నాగవర్మ ఛందోంబుధిలో తృతీయాధికారమున ఏడవ ప్రకరణమున- దండకప్రకరణమున (పుట 62-63, పద్య 24-25) నీ విధముగ పేర్కొన్నాడు.

దండక సామాన్యలక్షణం.

వ. అఱుదండకంగళింకిక్కుందండకదలక్షణం.
అమరగణ యుగ్మదిం, ముం
ద మదేభ్యం శిఖిగణం బరల్ దండకదా
ప్రముదితలక్షణ మక్కుం
కమలముఖీ తిళిదు కోళ్వు దన్నయమతదిం.
అమరయుగద ముంద బందగ్నిగళ్ చండవృష్టి
ప్రపాతక్కె యేళిప్పుదెం టిప్పుద
త్తమనిసి దోఱడె యణ్ణ మొంబత్తఱిం
దణ్ణఱిం పత్తఱిం వ్యాళజీమూతకా
గ్రిమద బరల దొందు లీలాకరం[మత్తమ
గ్రక్కొదొందోగ్మతాం] సందిగల్ పుట్టుగుం
కమలవదనె కేళ్ ప్రసిద్ధంగళే దండకంగళ్
కరం కంతు కాంతోపమే (నాకదోళ్).

కన్నడభాషయందు పై నాగవర్మ ఛందోంబుధియందలి దండకలక్షణము తప్ప వేఱు గ్రంథములలో నీ లక్షణములు కానరావనియు, కావ్యవాఙ్మయములో నెక్కడను దీనికి లక్ష్యములు లేవనియు, నీలక్షణము సంస్కృతము నుండి గ్రహింపబడిన దనియు, విద్యావయోవృద్ధులును, కన్నడ వాఙ్మయపారావార పారంగతులు నగు శ్రీమాన్ హెచ్. శేషయ్యంగారు చెప్పుచున్నారు.

## తెలుఁగుదండక లక్షణములు.

ఆంధ్రలాక్షణికులు నిర్వచించిన దండకలక్షణములను క్రమముగ నుదాహరించుచున్నాను.

[2] కవిజనాశ్రయము :—

"అమరఁగ ననహంబులం దాదిగా నొండె కాదేని నాదిన్ దకారంబుగా నొండె, లోనం దకారంబు లిమ్మైగకారావసానంబుగాఁ జెప్పినన్ దండకం బండ్రు దీనిం గవీంద్రుల్".

(ఉద్ధగమాలావృత్తాధికారము : పుట 35).

కావ్యాలంకారచూడామణి :—

'కృతి నాదినసహంబు లొండెం దకారంబు లొండెం బ్రకల్పించి యామీద నెల్లం దకార ప్రధానంబు గుర్వంతమై క్రాల నిచ్ఛానురూపాకథింజేర్చి నిర్మించుచో మించిత త్తద్గణవ్రాతమున్ వృత్త్యనుప్రాసధుర్యంబులై యర్థవర్యంబులై మోదితార్యంబులై సాధుసారస్యహార్యంబులై రీత్యలంకారవంతంబులై, పుష్టిమంతంబులై యింపు లంతంత కింపారఁ గల్పింపఁగా దండకం బున్నమస్మండలం బయ్యె."

(అష్టమోల్లాసము: పుట 12).

[3] ఛందోదర్పణము :-అనియతాక్షరం బైన దండకము.

---

1. ஒருவனையு மல்லா துணரா துள்ள முணர்ச்சித் தடுமாற்றத் துள்ளே நின்ற
இருவரை மூவரையு மென்மேலேவி யில்லாத தரவறுத் தாய்க்கில்லே னேலக்
கருவரை சூழ்கானலிலங்கை வேந்தன் கடுந்தேர்மீ தோடாமைக் காலாற்செற்ற
பொருவரையா யுன்னடிக்கே போதுகின்றேன் பூம்புகலூர்மேவியபுண்ணியனே.
Sekkilar's Periapuranam- Edited by Sindilvel Mudaliar 1903. Pp 218.

2. కవిజనాశ్రయము - సంపాదకుఁడు-నిడుదవోలు వేంకటరావు. పరిష్కర్త - తిమ్మావజ్ఝల కోదండరామయ్య. వావిళ్ల ప్రకటితము. 1950.

3. ఛందోదర్పణము - అనంతుని ఛందస్సు. వావిళ్ల ప్రకటితము. 1947.

"సిరి నేలు రసికుండు శ్రీవత్సవత్సుండు, నీరజహస్తుండు, నిత్యాసద్వృత్తుండు, త్రైలోక్య సంరక్షణోపాయదక్షుండు, మాపాలిదేవుండు, ధీరుం డుదారుం డితం డిచ్చు మాయిచ్చకున్వచ్చు సౌఖ్యంబు లంచున్ స్మరింగోరి పెద్దల్ నకారంబుతో సంగతంబై నహాంబాది నొందెన్; దకారాదిగా నైన, లో నెల్లచోటం దకారంబులం బెల్లు చెందన్ గకారావసానంబులై దండకాకార మేపారఁ గీర్తింతు రెల్లప్పుడున్"

(ద్వితీయాశ్వాసము 135).

[1]అప్పకవీయము:—

ధూర్తుల్నకారంబులు గ్రెంటిపైన సప్తరేఫంబులం
గూర్చినన్ జండవృష్ట్యాఖ్య మయ్యె
న్నకారంబులు గ్రెంటిపై నష్ట రేఫంబులం
గూర్చ నర్ణాఖ్య మయ్యె
న్నకారంబులు గ్రెంటిపై రత్నసంఖ్యాక
రేఫంబులం గూర్చిన న్నర్ణవం బయ్యె నోలి
న్నకారంబులు గ్రెంటిపై మీఁదం దశఖ్యాత
రేఫంబులం జెప్పినన్ వ్యాళ మయ్యె
న్నకారంబులు గ్రెంటిపై రుద్రసంఖ్యాక
రేఫంబులం న్నిల్ప జీమూత మయ్యె
న్నకారంబులు గ్రెంటిపై నొప్పు పంద్రెండు
రేఫంబులం జెంది లీలాకరం బయ్యెఁ జేర్మి
న్నకారంబులు గ్రెంటిపై మించు పద్మూఁడు
రేఫంబు లున్నంత నుద్దామ మయ్యె
న్నకారంబులు గ్రెంటిపై రూఢిఁ బధ్నాల్గు
రేఫంబుల న్శంఖ మద్దండకం బయ్యె
నీరీతితోడ న్నకారంబులు గ్రెంటి తర్వాత
నేడాదిగాఁగా రకారంబు
లొప్పారఁగా నంగ్రఘు లొక్కొక్క టెక్కించి
కావించినన్ జండవృష్ట్యాది
నానాలసద్దండకంబుల్ పిసాళించుఁ
గాకుండె నాల్గంఘ్రులుం జేయఁగా
వచ్చు నీరీతి నేకోనసాహస్రపర్యంతమున్
గూర్చి యిచ్ఛావిధిం జెప్పఁగా
వచ్చు గాంతంబుగా రాధికాజార!
శ్రీ రుక్మిణీమానచోరా! (4-258)

ఇప్పటికి సరిగా నిరువదియేండ్ల క్రిందట జరిగిన ముచ్చట-నేనును, నా మిత్రుడును, కీర్తిశేషుడును అయిన శృంగారశాస్త్రి - లేక ఖద్దరుశాస్త్రి - లేక గంటిశాస్త్రియు తెలుగు భాషలోని దండకముల నన్నిటిని ప్రకటింపవలె ననుమహాశయముతో పని ప్రారంభించితిమి. ముందఱ దండకములను కాలక్రమానుసారిగా ముద్రింపదలచితిమి. గంటిశాస్త్రి దీనికి 'దండక మండలి' అని పేరు పెట్టినట్టయితే బాగుండదా అని అన్నాడు. నేను "ఆపేరు చాలా బాగా కుదిరినది; సార్థక మైనదీ కూడా. ఏమంటే, దండక మండలి చదివితే, దండకమండువు (కమండలి) ప్రాప్తించక పోతుందా" అన్నాను. దండకపఠనము నివృత్తిమార్గమునకు దోహద మిచ్చు నని, చాల బాగున్న దని శాస్త్రి "కల్యాణి" పత్రికలో కొన్ని దండకములు ప్రకటించెను. ఆ తరువాత ఆ పత్రిక ఆగినది ఆపని ఆగినది. ఆ పత్రికాధిపతి లేడు. మరల నే డీ పరిశ్రమ చేయుట కవకాశము లభించినది.

1. అప్పకవీయము - పంచమముద్రణము పరిష్కర్తలు:
(1) నిడుదవోలు వేంకటరావు. (2) తిమ్మావజ్ఝల కోదండరామయ్య. (3) కందాడై కృష్ణమాచార్యులు. వావిళ్ల ప్రకటితము 1951.

సాహిత్యమీమాంస :

# ఆంధ్రనాటకపితామహుని హాస్యరసపోషణ

శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు

శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు వేమన యుపన్యాసములలోఁ జెప్పినట్లు మనలో నయముతోఁ గూడిన నిర్మల మైనహాస్యము చాల తక్కువ. ఎక్కడఁ జూచినను అశ్లీలములతోఁ గూడిన కటువాక్యములే మనలో హాస్యమున కునికిపట్టులు. సంస్కృత నాటకకర్తలు తమ నాటకములలో విదూషకపాత్ర ద్వారా కొంత హాస్యమును బ్రదర్శించిరి. కాని యది చాలమట్టు కాతని కుక్షింభరిత్వముతోఁ గూడినట్టిదిగా నుండును. కాళిదాసు తన ప్రథమ నాటక మైనమాళవికాగ్నిమిత్రమునఁ గొంత చుఱుకుఁదనము గలవిదూషకుని సృష్టించెను. కాని యే కారణముచేతనో తరువాతి రెండు నాటకములలో మరల నా తిండిపోతు విదూషకునే యచ్చుకొట్టెను. సంస్కృతపుఁ బోకడలనే యనుకరించు తెలుఁగువారు సైతము తమ నాటకములలో నట్టి మొఱకు విదూషకునే సృష్టించిరి. పూర్వు లైనపురాణకవులును ప్రబంధకవులును నెక్కడనో తక్క మనఃపూర్వకముగా హాస్యము పొంతకే పోలేరు. తెనాలి రామలింగని వని చెప్పఁబడు నాసానచాటువులందును, జగ్గకవి చంద్రరేఖావిలాపమునందును గొంత హాస్య మున్నను అందు మొదటిది కేవలము వ్యక్తిగత మైన దగుటచేతను రెండవదసభ్యతాదోషమున కాకర మగుటచేతను నయమునను నిర్మలత్వములలోను గొఱవడి యున్నవి. వేమన తన పద్యములలోఁ బెక్కుచోట్ల నయముతోడి హాస్యమును బ్రదర్శించెను. సభ్యమును నిర్మలము నైనహాస్యమునకుఁ దెలుఁగు వాఙ్మయమున మొట్టమొదట భిక్ష పెట్టినవాఁడు సన్న్యాసి యైనను వేమనయే. తరువాత నాధునికులలో శ్రీ వీరేశలింగం పంతులుగారు కొన్నిచోట్ల సభ్య మైనహాస్యమునకై యత్నించిరి. కాని కాలక్రమమున సంస్కారదృష్టి ప్రబల మగుటచే నాయన యుత్తరకాలమునఁ బ్రదర్శించినహాస్యము కొంతవఱకుఁ గలుషిత మైనది. కాఁగా నైర్మల్యవిషయమునఁ గన్యాశుల్కమునందలి హాస్యమును మించినది వేఱొకటి లేదు. మన పండితులు మాటాడునప్పుడు చతుర మైనహాస్యమును బ్రదర్శించు నలవాటు కలవారే యయ్యు వ్రాయునప్పు డేలొకో లేనిగాంభీర్యమును దెచ్చుకొని దాని మాట యైనఁ దలపెట్టరు.

ఆంధ్రనాటకపితామహులు తమ నాటకములలో హాస్యమును బెక్కుచోట్లఁ బ్రదర్శించిరి. ఆయన విషాదనాటకములలో మాత్రము హాస్యరసమయము లైనరంగములు మృగ్యము లై యుండును. అసలు కరుణమునకును హాస్యమునకును బొత్తు కుదురదు. కావున విషాదనాటకములలో హాస్యమును బ్రదర్శించుట యొకొక్కప్పుడు రసాభాసమున కాకర మగుచుండును. ఇందుచేతనే కాఁబోలు నాచార్యులుగారు సహజముగా హాస్యప్రియు లయ్యు విషాదాంతములలో దానిని జాలఁ దగ్గించివైచిరి. సంస్కృతనాటకములందలి విదూషకపాత్రలను బోలి కేవలహాస్యముకొఱకు సృష్టింపఁబడిన పాత్రలు వారి నాటకములలో మూఁడు కలవు. వారి నాటకము లన్నిటిలో సావిత్రీచిత్రాశ్వమునఁ బ్రాచ్యనాటకలక్షణములు సంపూర్ణముగా గోచరించును. అందలి విదూషకుఁ డైనసుమాలి పాత్ర మీ విషయమును మఱింత దృఢపఱుచుచున్నది. వరూధినిలోని శతానందునిపాత్రమును, ప్రమీలార్జునీయమునందలి సుయోగుని పాత్రమును సంస్కృతనాటకములందలి విదూషకుని కనుకరణములే. పై మూఁడు నాటకములందు నా విదూషకుల ప్రవేశనము హాస్యరస ప్రదర్శనమునకు మంచి యవకాశము నొసంగినది. ఇతర మోదాంతనాటకములలో హాస్యరస పోషణమునకై ప్రయత్నపూర్వకముగా సృజింపఁబడిన యట్టి పాత్రలు లేకపోయినను హాస్యరస నైర్మల్యము గలసన్నివేశము లెన్నియో కలవు.

ఆచార్యులుగారు హాస్యము ననేకవిధములుగాఁ బ్రదర్శింతురు. అందుఁ బాత్రల శరీరముయొక్క కాని యవయవములయొక్క కాని వైకల్యముచేఁ గలిగించుహాస్య మొకవిధము. పాత్రల యవయవసంఘటనమున నేదేని లోప మున్నప్పుడు కాని వాని యాకారమున సాధారణరూపముకంటె భిన్న మైన వింతఁ

దనము గోచరించినప్పుడు కాని సామాజికులలో హాస్యము జనించును. మంథర గూనియును, గుంటికాలును, సుయోగుని గోయ్యమీసములును నిట్టి హాస్యమునకు మూలములు. సాధారణముగా నిట్టి వైరూప్యము దుష్టపాత్ర లందువలె సత్పాత్రలందు గోచరించినప్పు డంతగా హాస్యము కలిగింప నేరదు. ఏల యన నప్పుడు సామాజికు లా పాత్రల సౌశీల్యముచే ముందే యాకర్షింపఁ బడినవారై యుండుటచే వారి వైరూప్యమునకుఁ గనికరము వహింతురే కాని హాస్యము ననుభవింపఁ జాలరు. సుబుద్ధి పిచ్చితన మిట్టిదే. అతఁడు వైద్యుని ప్రశ్నములకు "దాసి, చిత్రాంగి, ప్రమాణము" మొదలగు జవాబు లిచ్చునప్పు డవస్థాంతరములో నవ్వు కలుగుట కవకాశము కలదు. కాని యా సందర్భమున మాత్ర మది హాస్యమును గలిగించుటకు బదులు విషాదనైశిత్యము నే పెంపొందింపఁ జాలుచున్నది. లీయరు నాటకములోని 'ఫూల్' హాస్యము కూడ నిట్లే యచ్చటి విషాదభావమున కుత్కర్ష కలిగించుచుండును. దైవమూలకము లైన యంధతా బాధిర్యము లీ విధముగనే శోచనీయము లైనను నవి పాత్రలబుద్ధి లోపముచేఁ గాని భ్రాంతిచేఁ గాని కలిగినప్పుడు తప్పక నవ్వు పుట్టించును. బృహన్నల నాటకమున హాళాయుధుఁడు భీముఁడు తన సోదరునిఁ జంపినపగ తీర్చుకొనుటకై దుర్యోధనాదులతోఁ జేరి పాండవుల యజ్ఞాతవాసస్థలము నెఱింగి యపకారము కావింప నెంచెను. కాని శక్తి ప్రభావముచే నాతఁ డతిహైన్యమును గాంచుటయే కాక మూకత్వమును గూడఁ బొందవలసి వచ్చెను. దుర్యోధనాదు లాతనిఁ బాండవుల యునికిపట్టునుగూర్చి ప్రశ్నింప నాతఁడు తనకుఁ దెలియు నని తల యూపుచు వారు వేసిన కొన్ని వేషములఁ దెలుపుటకై వికృతము లైనసైగలు చేయును. దుర్యోధనాదు లా సైగలు బోధపఱుచుకొనలేక లేనిపోని యర్థములు కల్పించుకొందురు. ఇచ్చట నీ సన్నివేశ మెంతో హాస్యమున కాకర మై యున్నది. ఇట్లే చిరకారిలో మోహిని కల్పించిన చమత్కారము మిక్కిలి హాస్యరసభరితమై యున్నది. చంద్రశేఖయును తిలకయును మోహిని పల్కులను విశ్వసించి యొండొరులను బధిరలుగా భావించి ప్రేగులు తెగునట్లుగా నఱతురు. తరువాత నది యంతయు మోహినీకల్పిత మైనచమత్కార మని యెఱిఁగినప్పుడు వారికే నవ్వు కలిగెను. ముక్తావళి నాటకమునందలి ద్వితీయాంక ప్రథమరంగమున బాదరాయణుని ప్రశ్నములకు బధిరుఁ డైన వీరబాహుఁ డొసంగినసంబంధము లేని యుత్తరములు నవ్వు పుట్టించును గాని దానికి వీరబాహుని బాధిర్యముకంటెఁ బ్రశ్నోత్తరములకుఁ గలయసందర్భమే యెక్కువ కారణము. ఇట్టంగవైకల్యముచేఁ గలుగుహాస్య మితర విధములకంటెఁ గొంచెము లఘు వైనది. నిరక్షరాస్యు లైనపామరులు సైత మిట్టి హాస్యమును స్పష్టముగా గ్రహించి యనుభవింతురు.

నాటకస్థ పాత్రల యాచార వ్యవహారములు కాని ప్రవర్తన కాని సాధారణ మైనవానికంటె భిన్నముగా నున్నప్పుడు హాస్యము కలుగును. సర్వవిధముల నున్నత మైనపాత్ర మేదో స్వప్రయోజనము నాశించి నీచసేవ చేసినప్పుడు కాని తన గాంభీర్యమునకుఁ బొందని మఱి యే కార్యమునైనఁ జేసినప్పుడు కాని నవ్వుకలుగును. కీచకుఁడు మిక్కిలి పరాక్రమవంతుఁడు, రాజు తరువాత రాజు నంతవాఁడు. అతఁడు కామాంధుఁడై ద్రౌపదిని వెంబడించుటయు, నామె నెట్లైనఁ గూర్పు మని బృహన్నల పాదములపైఁ బడుటయు నతనియున్నతికి విరుద్ధ మైనయనాగరికతను బ్రకటించుచు హాస్యసంజనకము లగుచున్నవి. అందును బృహన్నల యర్జునుఁ డగుటయు నపుంసకుఁ డగుటయు నిచ్చటి హాస్యమునకు మఱింత పుష్టి కలిగించుచున్నది. సావిత్రీ చిత్రాశ్వమునందలి ప్రథమాంక తృతీయరంగములో నెచ్చట నైన జలాశయ మున్నదేమో చూచి రమ్మని సత్యవంతుఁడు పంపఁగా, సుమాలి నేలపైఁ బండుకొని సైఁగలతో దాహమును దౌర్బల్యమునుజూపును. ఆ సందర్భమున సుమాలివంటి విదూషకులుతప్ప నట్టి వికృతచర్యల నాచరింపరు. ప్రపంచ విషయములును నాచారవ్యవహారములు నెఱుంగని యనాగరికుఁడు నాగరికసంఘమున నుండి వికృతకృత్యము లాచరించునప్పుడును, బలువురు స్త్రీలమధ్య నొక పురుషుఁ డేమి చేయుటకును దోఁపక విన్నఁదనము పొందునప్పుడును హాస్యము జనించుట కవకాశము కలదు. సుయోగుఁడు ప్రమీలసభలోని కేగి యొనర్చిన యనాగరికచేష్ట లన్నియు హాస్యమున కాకర

ములై యున్నవి. అశ్వపతి మొట్టమొదట ద్యుమత్సేనునిఁ జూడ నేతెంచినప్పుడు "సుందర్యున మైనది కావున నింకఁ దమరు వెళ్లవచ్చు"నని సుమాలి చెప్పుటయందలి మోటుఁదనము కూడఁ దప్పక నవ్వు పుట్టించును. చిరకారిలోఁ గామసుందరుని మనోహరాదులు బలవంతముగా వేశ్యాగృహమున కీడ్చుకొని పోవుటకూడ హాస్యజనకముగానే యున్నది.

ఇట్లే పాత్రల శీలమునందలి పూర్వాపరవైరుద్ధ్యముకూడ హాస్యరసమున కాలంబన మగుచుండును. ఏదైన ఘనకార్యము నొనర్చెద నని ప్రజ్ఞావాదము లొనర్చి యట్లు చేయలేక తద్విరుద్ధముగా వర్తించుటయు, దురాశచే నందని ప్రాని పండ్ల కఱ్ఱులు సాచుటయు, హృదయమునందలి నిజమైనయభిప్రాయమును గప్పిపుచ్చి సమయానుకూలముగా నెదుటివారి స్వభావము ననుసరించి కపటముగా మాటాడుటయు, నిట్టి శీలసంబంధి హాస్యమునకుఁ గారణము లగును. బృహన్నలతో నుత్తరుఁడు కౌరవసేన నొక్కఁడనే దునుమాడఁ గల్గుదు నని ప్రగల్భములు పల్కి చివరకు శత్రుసేనను జూచినంత మాత్రమున భీతుఁడై రథము దిగి పరుగెత్తఁబూనుటయు ప్రమీలార్జునీయమున సాత్యకి, సయోగుఁడు, మేఘనాథుఁడు మొదలగుమహాయోధు లొక్కక్షణములో యాగాశ్వము నెత్తు మని యర్జును నెదుట వీరాలాపము లాడి యాస్త్రీలను జూచినంతనే మోహితులై ప్రణయప్రసంగములకు దిగుటయు హాస్యము నుత్పాదించుచున్నవి. ఈ యోధులు కారాగారమునఁ గనకలతాదులపరోక్షమున నుద్రిక్తులై యుద్ధము చేయుటకు నిశ్చయించి వారు రాఁగనే యామాట మఱచి యొండొరులఁ గౌఁగిలించుకొనఁబూనుట కూడ నవ్వు పుట్టించుచున్నది. ఇచ్చటి హాస్యము నాచారసంబంధి యని చెప్పినను దోషములేదు. మంథర వైరూప్యముల కెల్ల నాటపట్టగుటయే కాక వయసు మీఱినముదిజంత. ఆమె తన మాయోపాయముచేఁ గైకను మోసగించి యామెచే భరతునికిఁ బట్టాభిషేకము చేయుమని దశరథు నడిగించెను. నిజముగా రాముఁ డరణ్యమున కేగుటకుఁ గాని రాజ్యము భరతునికి సంక్రమింపఁ జేయుటకుఁ గానియామెయే కారణము. తా నొనర్చినమహోపకారమునుగూర్చి యామె వెంటనే భరతునికిఁ దెలియపఱచెను. అతని



మనస్సును సరిగా గుర్తించినది కాకపోవుటచే నతఁడు తాఁ జూపినమతికౌశలమున కలరి తన్ను వివాహ మాడు నని తలంచెను. తనవార్ధకమును గాని వైరూప్యమును గాని తలంపక తనకంటె వయస్సునఁ గొంచెము చిన్నదే యైన భరతుని వంటి రాజసుతుఁడు తన్ను వివాహ మాడు నని యామె తలంచుట మిక్కిలి హాస్యమును గలిగించుచున్నది. నారదుఁడు పరమభాగవతుఁడు. ప్రహ్లాదుని యపారమైనవిష్ణుభక్తి కతని బోధయే కారణము. కుమారుని బుద్ధి మళ్లింప లేక హిరణ్యకశిపుఁడు విచారించుచుండఁగా నారదుఁ డచ్చటి కేగి సమయోచితముగా "చిన్నపాపఁడు వాఁడు నిన్నంత తిరస్కరించి నాఁడా? నీ తమ్ముని జంపిన మహావిరోధి నీ చిన్నబాలుఁడు నీ యెదుటనే నుతించునది విని యోర్చుటకు సాధ్య మగునా? అట్టి యహంకారబుద్ధి మాత్రము పెరుఁగ నీయరాదు. తుదకు వాఁడు పోయిన నేమి? మీ రిరువురు చల్లగ నున్న నెంద ఱట్టి కుమారులు కలుగరు?" అని పలుకుట కడుపుబ్బ నవ్వు పుట్టించుచున్నది.

నాటకకవి కేవలహాస్యరసపోషణముకొఱకు కొన్ని సన్నివేశములు కల్పింపవచ్చును. ఇందు శీలాచారసంబంధి హాస్యము కూడ నిమిడి యుండుట తటస్థించును. సాధారణముగాఁ బాత్ర లొండొరుల వేషాంతరధారణాది కారణములచే నెఱుంగఁ జాలక పోయినప్పుడును, సమయమునుబట్టి తమ స్వభావమునకు విరుద్ధముగా వర్తించునప్పుడును, బరస్పర విరుద్ధస్వభావము గలపాత్రలు కలసి ప్రసంగింపవలసి వచ్చినప్పుడును నిట్టి హాస్యము గోచర మగును. ఆచార్యులుగారి నాటకములలో హాస్యమయములైన యట్టి సన్నివేశము లెన్నియో కలవు. సావిత్రీ చిత్రాశ్వమున సుమాలి వృద్ధవిప్రవేషము వేసికొని యడవినుండి సావిత్రీప్రణయమును గూర్చి చింతించుచు వచ్చుచున్న సత్యవంతునికిఁ దా నశ్వపతి పురోహితుఁ డనియు, సత్యవంతుఁ డెవతెనో భిల్లాంగనను వివాహ మాడె నని తాఁ జెప్పియుండుటచే నశ్వపతి తన కుమార్తెను ఘటకేతుని కుమారుని కిచ్చి పెండ్లి చేయుటకు నిశ్చయించె ననియుఁ జెప్పుట మిక్కిలి హాస్యపరిపోషకముగ నున్నది. ఇట్లే వరూధినిలోని సరస్వత చక్రవంతుల సంభా

షణమును (III-1) చిత్రనళీయమునందలి పర్ణాద సుదేవుల సంభాషణమును చిరకారిలోఁ బురుష వేషధారిణి యైనమోహిని చంద్రరేఖను బలాత్కరించుటయు నెంత గంభీరుని కైనను నవ్వు పుట్టింపక మానవు. అర్జునుఁడు యతి వేషధారి యై ప్రమీల యంతఃపురమును బ్రవేశించెను. చారుమతి యాతఁ డర్జునుఁ డని యంతకు ముందే తెలిసికొనెను. ఆతనిఁ బట్టు కొమ్మని యాస్త్రీలు పలుకఁగా నర్జునుఁడు పరుగెత్త నారంభించెను. సుయోగుఁడు పకపక నవ్వ మొదలుపెట్టెను. ఈ సన్నివేశమున నర్జునుని పలాయనమునకును సహజమైన యాతని వీరత్వమునకును గలయంతరము హాస్యరసము నకుఁ బ్రభవమై యున్నది. వరూధిని నాటకమునఁ బరమనైష్ఠికుఁ డైనప్రవరుని నప్సరోవతంస మైనవరూధిని కామించుట మిక్కిలి హాస్యజనకముగా నున్నది. ఈ విషయము చదువునప్పుడుకంటె రంగమునఁ జూచునప్పుడు ప్రవరుని ఛాందసవేషమునకును వరూధినిగణికా వేషమునకును గలయంతరము మిక్కిలి స్పష్టముగా గోచరించుటచే హాస్యరస ముత్కర్ష నొందుట కెక్కువ యవకాశ మున్నది. ఈ నాటకముననే శతానందుఁడు వీరసేనుని కామ పరవశత్వము నవ్యాపదేశముగా నపహసించు సన్నివేశము హాస్యరసపుష్టి కలిగి యున్నది. ఆంగ్లేయకవులు పలువురు తమ నాటకములలో సన్నివేశముల ద్వారా హాస్యమును గలిగించు పద్ధతినే యవలంబించి యుండిరి.

సమయోచితముగాఁ బదముల నవ్యార్థస్ఫూర్తి కల్గునట్లు ప్రయోగించుట కూడ హాస్యరసమును గలిగించును. ఎట్టి హాస్యమున కైనను బదములే యవలంబనము లై యుండును. పద సాహాయ్యము లేని కేవలసన్నివేశాదులు హాస్యరసము నంతగాఁ గలిగింప నేరవు. అందుచేఁ బైని పేర్కొనఁబడిన యుదాహరణములలో సైతము పదజనిత మైనహాస్యము కల దనుటలో సందియము లేదు. పదజనిత మైన హాస్యము ప్రధానముగా మూఁడు రకములు. అందు నాటకపాత్రలుమనస్సంక్షోభముచేఁ గాని యజ్ఞానముచేఁ గాని పదములను సరిగా నుచ్చరింప లేక పోవుట యొకటి. ప్రమీలార్జునీయమున సుయోగుఁడు ప్రమీలసభలో "మహారాణీ! మనత్కారము. నన్ను రాయభారి అర్జునుఁడుగా — కాదు రాయబారికి అర్జునుఁ డమ్మా! అయ్యో బాబు (బాబు)" అని పల్కుటయు వరూధిని నాటకమున స్వరోచిభటులు కంధర మంధరులు వరణానదిని గూర్చియుఁ బ్రవరుని గూర్చియు బాటసారులఁ బ్రశ్నించునప్పుడు ధర్మానది యనియు, మర్మానది యనియు, బుణాపద యనియు, నిత్యాగ్ని యనియు, సత్యాగ్ని యనియు నేదో పలుకుటయు నవ్వు పుట్టించుచున్నది. ఎవరైన నడిగినప్రశ్నకు విరుద్ధ మైనజవాబు సంగుట కాని యవ్యాపదేశముగాఁ బాత్రల నపహసించుట కాని రెండవ పద్ధతి. ద్యుమత్సేనుఁడు తన పట్టణము ఘటకేతునిచే నరికట్టఁ బడినప్పుడు సుమాలిని బిలిపించి తన మనోజాడ్యము నెఱింగించెను. అంత సుమాలి "ఇట్టి మహాజాడ్యమునకు నే నొక మందే యెఱుఁగుదును. వేషాంతర ధారణ మనునవుపానమునఁ బలాయనరస మింత సేవించినఁ జాలును" అని జవాబు సంగుట హాస్యసంజనకముగా నుండును. ఆ నాటకముననే సావిత్రీసత్యవంతులు మాటాడుకొనుట స్వయముగాఁ జూచినసుమాలి తాను రెండు పెద్దపులులఁ జూచె ననియు, ఒకటితో నొకటి సరస మాడుచు నుండి తనధ్వని విన్నంతనే యొకటి పరువెత్తి తన చెంతకు వచ్చె ననియు నవ్యాపదేశముగా వారిని బులులతోఁ బోల్చి చెప్పుటలో హాస్యము చిప్పిలుచున్నది. వరూధిని నాటకమున వీరసేనుఁడు "ఆ వధూమణి యొద్దకుఁ బోవలె నన్న నాకు ఱెక్కలు కట్టినట్లగును. ఆ చెలిచెంతఁ బాసి రావలె నన్నఁ గాళ్లకు గుండ్లు కట్టినట్లుండు"నని చెప్పినప్పుడు శతానందుఁడు "అప్పుడు నీ వీదులాడఁ బోయిన బాగుండు"ననుట సమయవిరుద్ధ మైన యుత్తరమగుటచే హాస్యమును కలిగించుచున్నది. సాధారణమానవాచారములకు భిన్నముగాఁ బల్కుట మూఁడవపద్ధతి. ఇదివఱకుఁ జెప్పఁ బడినట్లు సుమాలి యశ్వపతి నింకఁ దమరు వెళ్లవచ్చు ననుటయు, యముఁ డేమి వరము కావలె నన్నప్పుడు ధర్మదేవతవై మానవుల కగోచరుఁడ వైననిను నీ సౌమ్య మగుబ్రాహ్మణరూపమున నిట దర్శించుభాగ్యము కంటిమి. మా పుణ్యముల కీడు లేదు. అయినను మాత్రము నీ పునర్దర్శనము మాకు లేకుండ ననుగ్రహింపు" మనుటలో హాస్యరసము కలదు. ఆచార్యులుగారి నాట్య

ములలో వాక్యజనిత మైన యిట్టి హాస్య మింక ననేకస్థలముల నున్నది.

హాస్యమువలెనే చమత్కారము (wit) కూడ వారి నాటకములలోఁ బెక్కుచోట్లఁ గాన నగును. హాస్యచమత్కారములకు సూక్ష్మమైన తారతమ్యము గలదు. హాస్యమును శీల సన్నివేశములద్వారా సైతము కొంత వ్యక్తము చేయవచ్చును. చమత్కారము కేవలశబ్దాశ్రయము. ఇది విద్వత్ప్రియుక్తము. శబ్దచిత్రమే (Word play) దానికి జీవాతువు. హాస్యజనకము లైనపాత్రములకుఁ దమలోని హాస్యస్ఫోరక మైనగుణ మేదో తెలియదు. చమత్కారము ప్రయత్నపూర్వకముగాఁ జేయఁబడును. "వింతవస్తువును యథాస్థితముగా వర్ణించుట హాస్యము. దానిని వేఱువస్తువులతోఁ బోల్చి హాస్యమును వెల్లడించుట చమత్కారము" అని (హాజ్‌లిట్) నుడివెను.1 "విద్యావివేకశాలి యగుపండితుఁడు కాని సామాన్యుఁడు కాని యితరులలోని యసామాన్య గుణములఁ జూచి నవ్వుట చమత్కారము. వింతమనుష్యుఁడు తనలోని వింతఁ దనమునకే యజ్ఞాతముగా నవ్వుట హాస్యము" అని ప్రొఫెసర్ నికోల్ చెప్పెను.

ఆంధ్రప్రబంధములలోఁ జమత్కార మచ్చటచ్చటఁ గలదు. ప్రబంధకవులు పుష్పలావికలను వర్ణించునప్పటి శబ్దచిత్రములోడి విటవిటీసంవాదమున నిట్టి చమత్కార మధికముగాఁ గానవచ్చును. ఆచార్యులుగారు తమ నాటకములలోఁ జమత్కారమును వాడినచోట్లు కొన్ని గలవు. ప్రమీలార్జునీయము నందలి ద్వితీయాంక ప్రథమరంగము దీనికి మంచి నిదర్శనము. ఇట్లే సుమాలి శతానందాదుల పలుకులందును హాస్యముతోపాటు చమత్కారము కూడ గోచరించును. (సావిత్రి II-2; వరూ I-3).

హాస్య మెప్పుడును సాంఘిక మైనది. ఒంటరిగా నున్నప్పుడుకంటెఁ బలువురు కూడియుండినప్పుడు దానికిఁ బుష్టి యెక్కువ. పుస్తకము నందలి హాస్యమయరంగమును మన మొంటరిగాఁ జదువుకొనునప్పుడు నవ్వు రాకపోవుటయుఁ గలదు. కాని సంఘముగాఁ గూడి యాదృశ్యమునే రంగమునఁ జూచునప్పుడు నవ్వు పుట్టి తీరును. ఆచార్యులుగారు హాస్యము నుపయోగించినవెంటనే యుపహాసిత మైనపాత్రముచే "నన్ను హాస్యము చేసెద వేల" యని యనిపించుచుందురు. ఆయన నాటకములలో హాస్య మున్నచోట్ల నెల్ల నీ సూచన కానవగును.

ఆచార్యులుగారి హాస్యము సాధారణముగా మధ్యమపాత్రల నాశ్రయించియే యుండును. ఉత్తమపాత్ర లెచ్చటను దాని పొంతకుఁ బోనే పోవరు. సుమాలి, సుయోగుఁడు, శతానందుఁడు, అలాయుధుఁడు మొదలగువారందఱును నీ విషయమునకు నిదర్శనములు. ఈ నాటకములలో హాస్య మెల్లయెడల వచనమునందు మాత్రమే గోచరించును. సుమాలి యశ్వపతి నింకఁ దమరు వెళ్లవచ్చునని చెప్పినచోట మాత్ర మది పద్యములో నున్నది.

ఆచార్యులుగారి నాటకములలో సన్నివేశములలోఁ జక్కఁగా నతుకుకొనుహాస్యమే పెక్కుచోట్ల నున్నను కేవలపామరజనులకై ప్రయత్నపూర్వకముగాఁ గల్పింపఁబడిన హాస్యము కూడఁ గొన్నిచోట్ల గానిపించును. చిరకారిలోని చెవిటివారి వినోదము, వరూధినిలోని సరస్వత చక్రవంతుల సంవాదము, కీచకుఁడు బృహన్నల పాదములపైఁ బడుట మున్నగున విట్టివి. వారిహాస్యములో నచ్చటచ్చట సభ్యతాదూరము లైనపదములు దొర్లుచుండుటయుఁ గలదు. దీనిని విని పామరులు సంతోషించినను బండితులు ఏవగించుకొందురు. ఇట్టివి తఱుచు శృంగారరససందర్భములందే కానవగును. చిరకారిలో మోహిని పురుషవేషము వేసికొనుట కేవలచమత్కారముకొఱకే. కాని తరువాతికార్య మంతయు దాని యవ్యవ

1. Humour is the describing the ludicrous as it is in itself; wit is the exposing it by comparing or contrasting it with something else. ఇతఁడే చమత్కారమునుగూర్చి యిట్లు పల్కెను. Wit is thus as we have already seen purely conscious. The wit sets himself to raise a laugh. He plays with words. His fancy works swiftly and out of the movement of his fancy he orders phrases and ideas in such a manner that others laugh along with him.

తెనుగుతోబుట్టువులు :

# బసవపురాణం-తమిళపరివర్తనం

## శ్రీమతి ఆదిలక్ష్మిగారు

ఆంధ్రగ్రంథమాల రెండవ పుష్పముగా నీ నడుమనే ప్రకటితమైన బసవపురాణ పీఠిక[1]యందు, భాషాంతరీకరణ ప్రసక్తిలో నిట్లు గలదు. "తెనుఁగున నితర భాషలలోనికి పరివర్తనము జెందినకృతులలో బసవపురాణమే మొదటిది. దీనికి తమిళ భాషలోగూడ భాషాంతరీకరణము కలదు." కాని యా తమిళ భాషాంతరీకరణమును గూర్చినవిషయము లేవియు నింతవఱకు ప్రకటితములు కాలేదు

ఎన్ని భాషలయందు పరివర్తితమైనను మూలాధారము పాల్కురికి సోమనాథుని తెనుగుకృతియే కావున తమిళ భాషయందలి బసవపురాణమునుగూర్చిన వివరములను తెలిసికొనుట తెనుగువారికి ఆవశ్యక మగుచున్నది.

బసవపురాణము తమిళములో పద్యకృతి[2]గా పరివర్తితమైనది. రచయితను గూర్చినవివరములు తెలియరావు. క్రీ. శ. 1981లో శ్రీ నాగిసెట్టి గారి విపులవ్యాఖ్యలో ప్రకటితమైనది. రాయలు సైజు 124 పుటలు గలవు. దీనికి ఆంగ్లభాషలో V. V. రామన్ గారి రెండుపుటల పరిచయము గలదు. తమిళ భాషలో నాలుగు పుటలలో శ్రీ నాగిసెట్టిగారి పీఠిక గలదు. ఆపైని ఈగ్రంథ ప్రకటనమును ప్రశంసించు ఈ క్రిందివారల పద్యరూపకాభిప్రాయములు కలవు.

1. తిరుప్పాదిరిప్పులియూర్ సన్నిధి వీధిలో నుండు శ్రీమత్ జ్ఞానియార్ మఠాలయమునకు జెందిన శివషణ్ముగ మెయ్‌జ్ఞాన శివాచార్యస్వామి.
2. చెన్నపురి హిందు తియలాజికల్ హైస్కూలు ప్రధానతమిళపండితులు శ్రీ కో. వడివేలు సెట్టిగారు.
8. చెన్నపురి రాయపేట వేదప్రవచన మందిరపు శ్రీ చతుర్వేది-శివధ్యానానంద మహర్షిగారు.
4. చెన్నపురి ప్రెసిడెన్సీ కళాశాల ప్రధాన తమిళపండితులు శ్రీ కా.రా. నమశ్శివాయ మొదలియారుగారు.
5. చెన్నపురి పచ్చయప్ప పాఠశాల తమిళాధ్యాపకులు 'తమిళరసు' పత్రికా సంపాదకులు నగు శ్రీమణి తిరునావుక్కరసు ముదలియారుగారు.
6. చెన్నపురి పచ్చయప్ప కాలేజి తమిళపండితులు శ్రీ కా. రా. గోవిందరాజ ముదలియారుగారు.
7. ప్రొఫసర్. శ్రీమత్ కో. వడివేలు సెట్టి

---

(11 వ పేజీ తరువాయి)

హితఫలముగానే పరిణమించినది. ఇట్లు తేలికయైనట్టియు నప్రధానమైనట్టియుఁ జమత్కారమునకే కథలో మిక్కిలి ప్రాధాన్య మొసంగుట లాఘవాపాదకముగా నుండును.

ఈ నాటకములలో సమయమునకు సరిపడని యసందర్భహాస్యము కూడఁ గొన్నిచోట్లఁగలదు. ద్యుమత్సేనుఁడు కోట శత్రుసమాక్రాంత మగుటకు చింత నొందుచుండ సుమాలి హాస్యమునకై కడంగుట హాస్యాస్పదముగా నున్నది. మఱియు నింటికి వచ్చినయతిథిని అందును నొక మహారాజును వాతఁ డవమానపఱుచుట మోటుఁదనము నాకరముగా నున్నది. చిత్రాశ్వుఁడు "సుమాలీ! నీవు హాస్యము చూపుట కిదియా సమయము" మని ప్రశ్నింప, "హాస్యమునకు సమయము కావలెనా? క్రొత్తఫక్కి తెచ్చితి" వని పల్కెను. ఈతని హాస్యము పెక్కుచోట్ల నసామయికముగానే యున్నది మోహిని హాస్యమును దల్లియెడనే ప్రయోగించుటయు, శతానందుఁడు తన మిత్రునికి ప్రియాసంగమోపాయమును జెప్పుటకు బదు లాతని మేర మీఱి పరిహసించుటయుఁ గూడ నిట్టిదే.

---

1. పీఠికాకర్త శ్రీ నిడుదువోలు వేంకటరావుగారు. ప్రథమ ముద్రణ పీఠికయందు కీర్తిశేషులు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు కూడ నిట్లే తెలిపియున్నారు.
2. ఈ గ్రంథము చెన్నపురి 'గుహబసవా' అండ్ కంపెని లిమిటెడ్ వారిచే ప్రమోదూత సంవత్సర మకరమాసమందు ప్రకటితమైనది (1981) Jan.

గారి శిష్యులును వేలూరి ఊరిస్ కళాశాల తమిళాధ్యాపకులునైన శ్రీ కే. వేణుగోపాల నాయకర్ గారు.

8. చిత్తూరి పెర్కను ఉన్నతపాఠశాల ప్రధాన తమిళపండితులు శ్రీమాన్ పూ. శ్రీనివాసులు నాయుడుగారు.

9. వల్లమా నగరపు విద్వాన్ శ్రీ వైద్యలింగం పిళ్ళై గారు.

10. ప్రొఫసర్ శ్రీమత్ కో. వడివేలు సెట్టి గారి శిష్యులు, చెన్నపురి హిందూ తియలాజికల్ హైస్కూలు తమిళపండితు లైన శ్రీ చ. కందసామి ముదలియారుగారు.

11. మసిరి ఉన్నతపాఠశాలా ప్రథమ తమిళాధ్యాపకులు 'వీరశైవ' పత్రికా సంపాదకులు. శ్రీ వీ కుమార వీరైయరుగారు.

12. చెన్నపురి St. Gabriels High School తమిళపండితులు శ్రీ అ. నా. కన్నయ్యగారు.

ఈ పై జాబితానుబట్టి తమిళ సాహితీ లోకమున కీ గ్రంథము సుపరిచిత మని వ్యక్తమగుచున్నది. వ్యాఖ్యాత యగు నాగిసెట్టిగారు సేలం పట్టణమందలి సెవ్వాపేట వాస్తవ్యు లగు చెన్నబసవసెట్టిగారి కుమారులు. నాగిసెట్టిగారు తమ అరువదియైదవయేట దీనిని రచించిరి. ఇంతకు యిరువది యేండ్లకు క్రితము సంస్కృతమందలి వీరశైవమతగ్రంథ మగుసిద్ధాంతశిఖామణి తమిళ పద్యానువాదమునకు సంపూర్ణమైన వ్యాఖ్యను రచించిరి. నాగిసెట్టిగారు గొప్ప శైవమతప్రవర్తకు లని, గొప్ప విద్వాంసు డని ఈ వ్యాఖ్యానముబట్టి తెలియనగును.

ఇక గ్రంథవిషయము. గ్రంథావతారిక వినాయకస్తుతితో మొదలిడినది. ఆవెనుక బసవని స్తుతి, నందీశ్వర స్తుతి, శివజ్ఞాన పాలయ స్వామిస్తుతి కలవు. ఈ శివజ్ఞాన పాలయ స్వామి మైలమునకు (పుదువై) పుదుచ్చేరికి సమీపమున నున్న బొమ్మయాపాళెమందలి వీరశైవ సింహాసన మఠమునకు సంబంధించిన వారని వ్యాఖ్యాత వివరించి యున్నాడు. ఇది ఈ తమిళపరివర్తన కాలనిర్ణయమునకు భావి పరిశోధకులకు కొంత తోడ్పడగలదు.

తర్వాత శ్రీశైలప్రశంస. అందలి ప్రథమ రాంబా మల్లికార్జునుల స్తుతులు, తర్వాత వీరభద్రుని, స్కందుని స్తుతులు కలవు. పిమ్మట రచయిత అల్లమప్రభువును, రేవణారాధ్యుని, మరుళారాధ్యుని, ఏకోరామారాధ్యుని, పండితారాధ్యుని స్తుతించి యున్నాడు. మఱియొక పద్యమున వెంటనే తిరుజ్ఞానసంబంధస్వామిని, తిరునావుక్కరసును (వాగీశుడు) సుందరమూర్తిని (ఒడయనంబి) మాణిక్కవాచకుని ప్రశంసించి శివభక్తు లందరికి, శ్రీశైలమందు నివసించు యోగులకు తన నమస్కారముల నర్పించినాడు.

కవి తాను తమిళమందు పరివర్తించుటకు గల కారణము నిట్లు చెప్పుకొన్నాడు. [1] చెన్నబసవేశ్వరుడు మున్నుగు కాంచీపురమందలి తపోధనులు నశించుచున్న ధర్మమును పునరుద్ధరించుటకై ప్రచారమందున్న భాషలో వ్రాయు మని యాజ్ఞాపించినందున యీ కార్యమునకు పూనుకొన్నాను. —మరియు భవబంధ విమోచనమును మోక్షసిద్ధి కుపకరణము నగు నందికేశ్వరుని విజయచరిత్రమును వ్యాపికి దెచ్చుటే ఈ కావ్యోద్దేశ మని స్పష్టముగా చెప్పియున్నాడు.

తన రచన కాధార మగుకావ్యములు భీమ కవి కన్నడమున రచించిన బసవపురాణ మని, అది తెలుగున పాల్కురికి సోమనారాధ్యునిచే రచిత మైనబసవపురాణమునకు పరివర్తన మని కవి యిట్లు చెప్పియున్నాడు.

> "కులవు పాలక్కురిక్కి సోమీశుర
> నులగిన్ మున్నమురైత్త తెలుంగినై
> యిలగు వీమకవి కన్నడన్దరు
> నలపురాణన్దమిழா నవిట్రువామ్."

దీనినిబట్టి ఈ తమిళానువాదము కన్నడ బసవపురాణ రచనానంతరము అనగా 1369 తరువాత కొంతకాలమునకు కాని రచితమైయుండదు జాల దని చెప్పవచ్చును.

1. அருளுஞ் சென்ன வசவேசரதியாம்
பெருவில் காஞ்சி புரஞ்சேர் தபோதகர்
மருவுஞ் செஞ்சொல் வசவச் சிதைதமுற்
றரும் சிங்கா துரை யெனச் சாற்றுவாம்.

గ్రంథాంతమున భీమకవి ప్రశంస లేదు కాని పాల్కురికి సోమన ప్రశంస యిట్లు కలదు

"పుంగవర్ బసవదేవర్
పుగళ్ళినై విరిత్తు మణ్ణోర్
పంకమ దగల మున్నమ్
పగర్న్ద <u>పాలకుర్కిల్</u>
<u>తంగు సోమేశన్ తుయ్య</u>
తాళ్ మలర్ వణంగవన్ద
వింగిత విప్పిఅప్పై యిఱైంచి
నింజ్తేత్తల్ సెయ్వాం".

అనగా 'భగవంతుఁడైన బసవని కీర్తిని వ్యాప్తి చేసి, లోకము నుద్ధరించుటకు కారణజన్ముఁడై యవతరించిన పాల్కురికి సోమనాథుని పాదకమలములను స్తుతించుభాగ్య మబ్బిన నా మానవజన్మము ధన్యము.' వ్యాఖ్యాత యగు నాగిసెట్టిగారు 'పాల్కురికి ఎన్నుం స్థలం కర్నూల్ జిల్లావి లుళ్ళదు' అని వ్రాసియున్నారు. (పుట 923.)

తమిళ బసవపురాణమందు గలభక్తుల కథలు:-

పాయిర చరుక్కమ్ – (గ్రంథావతారిక) బసవ శబ్దప్రభావము చరిత్రము.
తిరుక్కైలాసచ్చరుక్కమ్
ఉపదేశచరుక్కమ్
దండనాయకచరుక్కమ్
తిరువిళైయాడల్ చరుక్కమ్
తిరుక్కూట్ట చరుక్కమ్
తిరువాదు చరుక్కమ్
అథయవోళి
అమ్మవైయెంద్రుమ్ బెజ్జమహాదేవియార్ పురా[ణము
అరియమాఱైయర్ (అరిమరాజుగారి కథ)
అలాయుదర్ పురాణము (హలాయుధుని కథ)
అల్లమప్రభు పురాణము
అల్లైయర్ మదువైయర్ పురాణము (అల్లయ్య మధుపయ్యల కథ)
ఆడైవళర్న్ద తిరువిళైయాడల్
ఆయై-నూయై
ఉబ్భట దేవర్
ఏకాంతరామైయర్ పురాణము
ఏకాంతరామైయర్ వాదు (వాదము)
కక్కైయర్
కలిగణనాథర్ పురాణము
కలియననాగర్ పురాణమ్
కల్లైకేత్తబ్రహ్మైయర్ పురాణమ్
కల్లైయర్
కళ్ళర్ కరుళియపురాణమ్ (వంకాయలు లింగము లైనకథ)
కన్నబ్రహ్మైయర్ పురాణమ్
కాట్టకోట్టైయర్ పురాణమ్
కాళిదేవర్
కిన్నరబ్రహ్మైయర్ పురాణమ్
కిన్నరైయర్ పురాణము
గుడ్డవ్వైయార్
కంబావి బోగయ్యర్
కోట్టుచ్చవ్వై (గొడగూచి)
గోవింద బట్టారకర్
కోవూర్ బొమ్మైయర్
సహదేవదండనాథర్ పురాణమ్
సకలేశమాదిరాజయ్య పురాణమ్
సంగమప్రాణియాన పురాణమ్
శంకరదాసయ్యర్ పురాణమ్
శాళిగైప్పెట్టియళైప్పిత్త పురాణమ్
చిక్కమాదైయర్ పురాణమ్
సిద్ధరామైయర్ పురాణమ్
శివసిద్ధర్
శివనాగమైయర్
శివనాగమైయర్ వాదు
శ్రీపతి పండితర్
సుందరప్పెరుమా నాయనార్ పురాణమ్
సుబ్బైయర్
సురిగై శవుండయ్యర్ పురాణమ్
చెన్నబసవ పురాణమ్
తిలకవ్వై
తెలుంగచోమైయర్ పురాణం (తెలుగు జొమ్మయ్య కథ)
నమిత్తాండినాయనార్ పురాణం
నిమ్మవ్వై పురాణం
నెట్టిరిణ్ కీట్ట పురాణం
పశుపతి నాయనార్ పురాణం
పావూర్ బొమ్మైయర్ (బావూరి బ్రహ్మయ్య కథ)
బిబ్బబాచైయర్
పుగళ్చోళన్
పులిక్కైసోమేశన్
మంచైయర్
మడివాలమాచయ్యర్ పురాణము
" " వాదు

మాకాళర్
మాచలదేవి
మాదరదూడయ్యార్
మాదిరాజ చెన్నయ్యార్
మాఱుడిగై ఇరియమాచయ్యార్
ముసుండి శివుండయ్యార్ పురాణం
ముత్తసంగైయర్ పురాణం
(ముగ్ధ సంగయ్య కథ)
మేతాకిత్తైయర్ పురాణం
మొఱటపంకైయర్
మోళిగ మారైయర్ పురాణమ్
పంకైయర్ పురాణం
పంచనై వడిగమాదవర్ పురాణం
వణికమల్లైయర్ పురాణం (బల్లేశుమల్లయ్య కథ)
వాచ్చైయర్
వాచ్చైయర్ వాదు
విడముణ్డవాదు
వీరశంకరర్
వైశవ్వై (వైజవ్వ కథ)

బసవనగా నందికేశ్వరుఁడు జన్మించుటకైన కారణము తొలుత 56 పద్యముల (నాలుగు పాదములు గలవి) లో వర్ణితము. దీనికి తిరుకైలాయశరుక్కమని పేరు. ఇందు కైలాస వర్ణన, నారదుఁడు కైలాసమునకు వచ్చి భూలోక వృత్తాంత మెఱిగించుట, శివుఁడు పార్వతితో నందికేశ్వరుని వృత్తాంతము చెప్పుట, శిలాదుడను ముని తపస్సు, శివుని వరము, నందికేశ్వరుని అవతారము, భూలోకమున ధర్మము నిలువబెట్టుటకై శివుడు నందికేశ్వరుని బసవేశ్వరునిగా జనింప బంపుట అను విషయములు కలవు. తెనుఁగు బసవ పురాణమందలి కథనే యీ విషయము లనుసరించుచున్నవి. తెనుగున ప్రథమాశ్వాసముననే బసవనకు సంగమేశ్వరుఁడు ప్రత్యక్షమగువరకు గల కథఁ చెప్పఁబడినది. కాని ఇచ్చట తిరువవతార ఘట్టమని పేరిడి కన్నడదేశ వైభవము ఇరువది పద్యములలోను హింగుళాపురి వర్ణన 7 పద్యములలోను గలదు. అందలి మాదిరాజయ్యకు సంతానములేకుండుట అతని భార్య మాదాంబ నందికేశ్వరవ్రతము చేయుట, గర్భవతియగుట అప్పటి వర్ణన అంతయు మన సోమనగ్రంథము ననుసరించి చేయబడినది. బసవావతారము బాల్యము, బసవన ఉపనయనము వలదని తండ్రితో వాదించుటలో ఈఘట్టము ముగియును. ఇందు 105 పద్యములుకలవు. ఉపదేశచ్చరుక్కమనుమూడవఅధ్యాయముబసవేశ్వరునితిరుకళ్యాణముతో ప్రారంభమైనది. సోదరియగు నాగమాంబ కూతురు గంగాంబను వివాహమైకూడల సంగమేశ్వరుని దర్శింప బోవుట, సంగమేశ్వరుఁడు బసవనకు ప్రత్యక్షమై లింగ సహితులై యున్న భక్త బృందముల బ్రోవుమని శివమత ధర్మముల నుపదేశించి మరల లింగముగా మారిపోవుట అను విషయములిందు కలవు. ఇందు 58 పద్యములున్నవి. దండనాయకచ్చరుకమంను బిజ్జలుఁడు బసవనికి దండనాయక పదవి నొసగుట, బసవేశ్వరుని శివాచారనిరతి, పండ్రెండువేల జంగములకు సకల భోగభాగ్యములను సమకూర్చుట అను విషయములు కలవు. 73 పద్యములు. తర్వాత చెన్నబసవ పురాణమను నధ్యాయమున, బసవేశ్వరుని సోదరి నాగమాంబ పుత్రుఁడు చెన్నబసవని మహిమ వర్ణితమైనది. 12 పద్యములు. పిమ్మట అల్లమ ప్రభు పురాణమను అధ్యాయమున 33 పద్యము లున్నవి. ఇందు అల్లమప్రభువు బసవేశ్వరుని దర్శించుట కేతెంచుట. బసవన అతనికి విందు సేయుట ; ప్రసంగవశమున నుట్లంకితమైన పార్వతి ప్రమథులకు విందుపెట్టు కథ, అల్లమ ప్రభువు బసవనికి వరములొసగుట అను విషయములు కలవు. తిరువిళైయాడర్చరుక్కమ్ అను నది దీని తరువాతిది. ఇందు దొంగ జంగములు వంకాయలను లింగములుగా ధరించి రాగా, అవి నిజలింగములైన కథ 8 పద్యములలో చెప్పబడినది. తెలుగు బసవ పురాణమున రెండవ ఆశ్వాసమునగల బల్లేశు మల్లయ్యకథ 'వణిక మల్లయర్ పురాణము' అను పేర 8 పద్యములలో చెప్పబడినది. వడ్లు కొలుచు కుంచము శివలింగముగా మారిపోవుట యీ కథ యందలివిశేషము. కాట కోటయ్యకథ 13పద్యములు గలది. ఇంతవరకు కథాక్రమము తెనుగు కృతిని యథాతథముగా పోలియున్నది. కాని తర్వాత పంచనై వడిగమాదవర్ పురాణము, పంకయ్యకథ, సిద్ధరామయ్యకథ, బసవన జంగములకై ఖర్చుచేసిన ద్రవ్యమునకంటె ఎక్కువ గనేధనము బొక్కసము ననుండుటను బిజ్జలుఁడు చూచి ఆశ్చర్యపడుట అను కథలున్నది. ఇక్కడ తెనుగు బసవపురాణమునను కన్నడ

బసవపురాణమున జొన్నలు ముత్యములైన కథ కలదు. కథాక్రమమున కన్నడ బసవపురాణ విషయములను యథాతథముగా నీ తమిళ కవి గ్రహించ లేదనవచ్చును. మఱియు నతఁడు కన్నడ గ్రంథమును తాననువదించుచున్నానన లేదు. కాని తెలుఁగున ఏ గ్రంథను పాల్కురికి సోమసాధుఁడు రచించెనో, దేనిని కన్నడమున భీమకవి సంతరించెనో, దానిని తాను తమిళమున వ్రాయుచున్నానని మాత్రమే చెప్పినాఁడు. విషయము పై గ్రంథములనున్నదే యైనను కవి తన యిష్టానుసారముగా బసవనమహిమ తెలుపు కథలక్రమమును మార్చియున్నాఁడు. తెనుగు బసవపురాణమున లేని కథలు కొన్ని కన్నడ పరివర్తనమున ఉన్నట్లు శ్రీనిడదవోలు వేంకట రావుగారి పీఠిక[1]నుబట్టి తెలియనగును. ఆ కథలు పండితారాధ్య చరిత్రయందు కలవు. తమిళ కవియు వానిని గ్రహించి సందర్భానుకూలముగా వాఁడుకొన్నాఁడు. బసవపురాణములు మూడింటియందును ముగింపు ఒకే తీరున నున్నది. బసవన లింగైక్యము చెందుటతో నివి సమాప్త మగుచున్నది. బిజ్జలునివధ తెలుగు బసవపురాణమున మాత్రమే కలదు. జగదేకమల్లయ, అల్లయ, మధుపయ్యలు అర్ధరాత్రివేళ బిజ్జలుని భవనము ప్రవేశించి అతనిని తుదముట్టించినట్లు కలదు. తమిళమున నీ విషయము ప్రస్తావితము కాలేదు. ఫలశ్రుతి తెనుగు కావ్యము నందువలెనే కలదు.

ఇతివృత్తమొకటే యైనను కథాకథనమున తమిళ కవి యెట్టి మార్పులను గావించినాఁడో తెలుపుటకు రెండు మూడుదాహరణముల నిచ్చుచున్నాను. తెలుఁగు బసవపురాణములోని కథలను తమిళములో పురాణములని వాడబడినది.

## కళ్లర్ కరుళియ పురాణమ్

"ఒరుదినం బసవరాజరోంగియ
మడత్తిట్టిరియ్య
పొరుళిసైక్క వర్వాన్ కళ్వర్
పుగవరితాకి యీశన్
ద్రురు మనట్టిరవర్ పోఱ్ఱ్
సెన్నాఱ్ఱ్ తవరిలై యొనవఱిన్దు
కరువఱ్ఱు దుంగాయాలై
నేరుత్తంగఱ్ఱుత్తిఱ్ కట్టి

కొణ్డు కణ్డిగై విబూది కూషుదలిన్ఱి సెన్ఱే
యొణ్డువరముదు సెయ్యక్కాలై యినుట్
పోయ్చ్చేర
వణ్డవరల్లానంద మడన్దనిల్ వారారెన్నద్
దణ్డనాయకర్ మగిళ్న్దు శరణార్థియొనక్కై
కూప్పి.

బందియిలిరుత్తిప్పైశై పణ్ణుమెన్ఱెక్క వఙ్గఙ్
వెందుయర్కొణ్డు మేని వియర్త్తుళ్ సదుఙ్గివాడి
వందు నామగప్పట్టోమే మగణమ్ వన్దు వేయొన్న
నొందారుత్తరై యొరుత్తర్ నోక్కియుణ్ణాడు
ఙ్గక్కాలై

## వంగకాయలు లింగములైన కథ

వెండియు నొకనాడు దండనాయకుఁడ
ఖండిత భక్తి వికస్వరలీల
జంగమార్చనసేయు సమయంబునందు
దొంగలు బందివెట్టంగ నూహించి
లింగవంతులుకాని లెంగుల కతని
అంగణాంతరమున కరుగరాదనుచు
వంగకాయలు కట్టుకొంగుల బొదిలి
లింగసన్నిహితుల భంగి వట్రిల్ల.

చనుదెంచి యా బసవన దండనాథు
గని భయం పడిమ్రొక్క గన్నుల నవ్వి
'లింగవంతులుగాని లెంగుల కీశ్వ
రాంగణమున కెట్టులరు దేరవచ్చు
నింక భక్తులకాక యీశ్వరార్చనలు
కొంకక చేయుదు గూర్చుండు' డనిన

ఉల్లముల్ గలగ నొండొరుల జూచుచును
జల్లనగుండె దిగుల్లన నవయ
భావించి "మనమెట్టు బందిఁ జిక్కితిమి
దేవర గలిగెనా చావు దప్పెడిని
మనకింక సెమ్మెయి మగిడిపోఁ బోల
దని కృతనిశ్చయులై కూరుచుండి

1. ఆంధ్రగ్రంథమాల బసవపురాణ పీఠిక పుట 88.

ఆయిడైయవర్గళ్ కళ్ళమతినిదవర్ బవిగళ్తు
తీయవెఞ్జోపరాగిదేశిక రెఴున్దపోదు
సేయరా నన్దిదేవర్ నిత్తర్ వేడత్తర్ నిత్త
రేయున వఴుదుణఙ్గాయి లింగమాయిరున్దవత్తే.
కోరక్క యాళనేయన్దున్నియ కరుత్తరాగి
సేరిన్ మన్దిరోపదేశ సెఴియిలానిఱైయ పెట్ఱు
వీరశైవాశారత్తు విదియుళమిగ విళఙ్గిప్
పారమామ్ పెరియోరొప్పమ్ పాన్మైయా
మేన్మైకొణ్డార్.
పఴుదిలానన్దిదేవర్ బావనై నోక్కినాలే
వఴుదుణైయిలింగమాన వళన్దనై మగత్తో
శేత్తత్
తొఴుదవణ్ వసవదేవర్ తొణ్డరియార్
శెయ్దవత్తిన్
విఴుమియశెయ్ది తన్నై విరిత్తుమున్
విళమ్బ నిన్ఱార్.

"సరసర మును లింగసహితులపోలె
కరములు సాచుడు గట్టుకొంగులను
భంగిగా బసవయ్య భావసంగతిని
వంగకాయలు ప్రాణ లింగంబులయ్యె"

## వణికమల్లైయర్ పురాణమ్.

"వళియరిట్రిలైవరానోర్ మఱైయ రెన్నోరన్బర్
శశిముడియత్తనారై సన్దియాదుణవు కొళ్ళా
రుశితవత్తగత్తిన్ మేలే యోరయల్ పదియిల్
శెన్ఱు
నిళియుమాయ్ ప్పళియుమాగి నిత్తరాలయ
జ్ఞానామల్,
వరున్దిడ వుడనిరున్ద మైత్తునరివరయన్దా
దరున్దనా మొఴిదన్ఱిణి యన్దవూరయలోర్
కూట్రిన్
పెరుమ్పడి రొఴున్దవెత్తు వాయిల్ పోల్
పిరిత్తుకట్టిత్
తిరుమ్బి వన్దిలిఙ్గన్దోమ్ వరుది
రన్ఱిరర్కుచ్ చెప్ప,
వరుది రన్నురైత్తు నిన్ఱ మైత్తున రుడన్ఱాఙ్గు
శెన్ఱ్
గరుళునే యత్తరాగి యవర్ కళక్కిట్రికొట్ట
త్తెరియుమొయ్ పుళగ మెయ్దిత్తొణ్డని
టైఴున్దు పొట్రి
యిరుమై శేరత్తన్ కోయిల్ వలమ్వన్దు విడై
కొణ్డేగి.
శరుత్తిన న్నియమముట్టిక్క శిప్పినాలుణ
వరున్దిల్
తిరుత్తరాయినుక్కఱ్కై మైతునర్
శిరిత్తెఴున్దు

## బల్లేశు మల్లయ్యకథ

"అట్టి దకౌద మున్వ్యవహారమేఁగి
నట్టిచో లింగాలయంబు లేకున్న
సంతత లింగసంస్పర్శన నియమ
మంతరించిన చచ్చునని సెట్టియనుచు
కుంచితమతి పూరిగుడిపన్ని యచట
కుంచంబు కొండగోగుల పూజసేసి
కలకంఠగుడియిది కంటిమేమనుచు
బెజికసెట్లాతని బిలిచి చూపుడును

నా యతభక్తి "శివాయనమోన
మో"యన యుండదప్రొక్కి ముమ్మారు
వలగొని ఇంటికివచ్చి కుడ్చుడును
"ఇల లింగమనుచునిహీ! మల్లభావ
కుంచంబునకు ప్రొక్కి కుడిచె బొట్టార
కుంచంబుకొని రండు కొలువగవలయు
అఁకటి కక్కఱకైనది వేఁడ్ప
వేఁకువ కుంచంబు వెండియువలయు"

పరుత్తదోర్ శొడియుళ్ వైత్త పడియునై
పణిన్దార్ వన్దార్
పొరుళ తళమ్ పళిళణిన్దార్ పెరియవర్ వణికరెన్ఱు.

అళన్దిడ పడియిన్ఱోడి యచ్చెడియూడిరుక్కుమ్
వళజ్ఞోక్కణాప్పయై యొడుత్తు వారుమినెన
మత్తైయర్
కేళర్నైప్పు కోపరాగిక్కిరిమిగళ్ కణవరెన్ఱు
శెళిన్దిలిర్ తీయళోన్నిర్ శివావెన శెవిళణ్
మూడి.

అనుమానా శివుదేవు నపహసింపంగ
వినగూడదని చేయి వీనులకేర్చి

పణ్డరే మిణ్డరేయిప్పడి పరియాశకన్దాన్
మణిసీరురైక్కు మాత్తైన్ వారుమిన్ మదనకోల
నణ్డర్ నాయకనైక్కొట్ట వెన్నవర్ తమె
యణ్ణాప్పత్తుక్
కొణ్డుపోయ్క్కురిత్తుప్పార్క్క చ్చెడిపెరుం
కోయిలాగి.

"ఘా కుక్కలార సాక్షాల్లింగమూర్తి
గాక కుంచము కనుకని మొఱంగెదరు
నమ్మరే రండు పినాకి జూపెదను
గ్రమ్మన"నని యేగగా దొంటియొడను

శిగరనల్ గోపురఙ్గ డిరుమదిలాగియుళ్ళే
పగరుమణ్డప్పు తానే పరమన్ మెయ్య
లింగమాగి
నిగరిలానన్దిమున్నె నిగప్పదర, వొళియార్
దీపమ్
పుగరిలా దొళిరక్కణ్డ బువియుళోర్
వణఙ్గిప్పోట్ట్రి.

ప్రాకారమును ముఖభద్ర మండపము
శ్రీకరంబుగ స్వర్ణశిఖరంబు గుడియు
విరచితంబై యొప్ప వృషభేంద్రుడెదుర
నరయగుంచము లింగమయ్యె, నతండు

మైత్తునర్ వైత్తు వన్దవళ్ళత్తిన్ పేరినాలే
నిత్తర్వ శ్లేశరెన్ఱునిగప్పత్తువర్ మణ్ణోరిన్ఱుమ్
బత్తియే ముత్తిమూలమ్ పగర్తరిన్ మట్రోరన్ప
రిత్తగై సెటియార్ కొట్టకోక్కట్టైయరెన్ఱుమ్
పెయరార్."

ఎల్లలోకముల బల్లీశ్వర దేవ
మల్లయ్య నానొప్పి మరి యట్లుగాక.
కొటకోటదు నాగగల డొక్కగొల్ల."

పైని యుదహరించిన రెండు కథలలోను తమిళములో కొంచెము క్రొత్త కూర్పున్నట్లు తెలియనగును. కన్నడ బసవ పురాణమున తొమ్మిదవ సంధిలో నీ రెండు కథలును తెలుగులో నున్నట్లుగానే పదానుసరణముతో గూడ ప్రపంచితములైనవి. తమిళములో చేసిన యీ క్రింది మార్పులెంతయు మనోహరములై ముందు వానికి వ్యాఖ్యానరూపములై యొప్పుచున్నవి. మరియు నీ మార్పులవలన ఆయా కథలకు కొంత స్వాభావికత యేర్పడుచున్నది. తమిళమున వంకాయలు లింగములగుటకన్న దొంగలు జంగములగుటకు ప్రాధాన్యత యియ్యబడినది. మరియు మఠమున జంగమార్చనచేయు సమయమున దొంగలు వంకాయలను కట్టుకొని ప్రవేశించినట్లు స్పష్టీకరింపబడినది. అచ్చట నుపస్థితుడైయున్న గురువు (దేశికర్) దొంగలు లింగార్చన చేయలేకుండుటను చూచి వారు భవులని, బంతిని వదలిలేచిపోవుట కుద్యమించుట దొంగలుకూడ శివస్వరూపులే అని బసవన భావించుట. వెంటనే వారి వంకాయలు

లింగములగుటతోపాటు, లింగార్చన, పంచాక్షరీ మంత్రోచ్చారణాది వీరశైవాచారములు వారికప్రయత్నముగా నలవడుట జరిగినట్లు వర్ణితమైనది.

ఇఁక బల్లేశు మల్లయ్యకథకు తమిళమున వణికమ త్తియర్ పురాణమని పేరు. తెలుగున, కన్నడమున మల్లయ్య వ్యవహారమేగినట్లు, శివాలయ మచ్చట లేకుండుటచే మల్లయ్య తిండిలేక ప్రాణములు వదలునని 'బెతికిపెట్లు' గుంచమును పూరిగుడిసెలో బోర్లించినట్లున్నది. తమిళమున మల్లయ్య బావమరది (మైతునర్) ఆ యూర నుండినట్లు చెప్పబడినది. బావ భుజించనిదే తాను భోజనము చేయలేక, యూరి వెలుపల పెద్దవృక్షము క్రింద కుంచము (పెరుంపడి) బోర్లించి- కొమ్మలపై గొంతగడ్డ కప్పి లింగము కనబడినదని నీ నియమమును పూర్తి గాంచుకొనుమని చెప్పినట్లు, అతడట్లే చేసి తృప్తితో భుజించి విశ్రమించియున్నతఱి బావమఱది, యదార్థము నాతనికి నవ్వుచు చెప్పినట్లు, అతఁడు దుఃఖములో ఆ ప్రదేశమునకేగగా కుంచము లింగముగాను, చెట్టు దేవాలయముగాను మారినట్లు వర్ణితమైనది. ఈ కథలో బావమరదుల హాస్యధోరణి స్వాభావికము. అచ్చటి ఈశ్వరునకు వళ్లేశుఁ డని పేరు వచ్చుటకు కారణము తమిళమునకుంచమునకు వళ్లమని పేరుండుటయే. దానినిబట్టియే తెలుగున మల్లయ్యకు బల్లేశుమల్లయ్య అను పేరు కలిగినది.

స్థాలీపులాకన్యాయముగ రెండు కథలను మాత్రమే గైకొనవలసివచ్చినది. మిగిలిన భక్తుల చరిత్రములలో గల విశేషములు పెరియపురాణము మొదలగు తమిళగ్రంథములను పరిపోల్చి చూచి ముందు నివేదింతును. తమిళ బసవపురాణము తెలుగు కన్నడ బసవపురాణముల కెన్నో యేండ్లతరువాత రచితమైనదగుటచే అందిమార్పులను చేయుటకు రచయిత కవకాశ మేర్పడినది. కథా కథనమున పాల్కురికి సోమనాథుని రచనమే ప్రామాణికము. దీనినిబట్టి దాక్షిణాత్య సంస్కృతిలో తెలుగు వాఙ్మయ మెంత ప్రముఖస్థానమును గడించుకొన్నదో యూహింపనగును.

## చెలికాని సీతారామయ్య

సీ॥ నీకీర్తి కెనవచ్చు నిర్ఝరవాహిని
యమునానదీసంగ మబ్బకున్న
సరివచ్చు నీధైర్య సరణికిఁ గనకాద్రి
కాపుగా జంభారి గదియకున్న
భానుండు నీప్రతాపస్ఫూర్తి కెనవచ్చు
నరులు బింబము దూరి యరుగకున్న
సమమౌను నీకాంతిఁ జందురుఁ డనిశంబు
భాస్కర సఖ్యంబు పడయకున్నఁ
గీ॥ గావునను కీర్తి ధైర్య ప్రతాప కాంతి
వితతులను ముఖ్య భువిలోన వెలసి తౌర!
వుడమి చెలికాని వంశాబ్ధి పూర్ణచంద్ర!
భవ్యగుణసాంద్ర సీరామ పండితేంద్ర!

# తమిళవాఙ్మయపరిచయము

శ్రీ చల్లా రాధాకృష్ణశర్మగారు

## కడసంగము:

### సంకలన గ్రంథములు.

కడసంగమున కొన్ని సంకలన గ్రంథములు ప్రచారములోనికి వచ్చినవి. అప్పటికే పూర్వకవులు చెప్పిన పద్యములు వ్యాప్తిని కోల్పోవుచుండుటను చూచి కొందఱు సంగకవులా ముక్తకములను గ్రథనము చేయ దొడగిరి. అట్టి సంకలన గ్రంథములలో ఎట్టుత్తొగై, పత్తుప్పాట్టు, పదినెణ్ కీழ்క్కణక్కు అనునవి సంభావ్యములు. ఈ కావ్యములు బహుగ్రంథకర్తృకములు. వేర్వేరు కాలములలో చెప్పబడిన పద్యములు వీనియందు చేర్పబడినవి. ఈ కవులు భిన్నమతములకు చెందినవారు. కొందఱు కవయిత్రులు చెప్పిన పద్యములు కూడ వీనియం దగపడుచుండుట యొక విశేషము. మఱియొక విశేషమేమనగ, అలనాటి తమిళరాజులయు, మంత్రివరేణ్యులయు, దండనాథులయు జీవితవిశేషము లీ కావ్యములనుండి మనకు తెలియవచ్చుచున్నవి. తమిళుల సాంఘిక జీవనవిధానమును గూడ తెలిసికొనుట కివి మిక్కిలి తోడ్పడుచున్నవి.

ఎట్టుత్తొగైలో ఎనిమిది గ్రంథములున్నవి. నత్రిణై, కుఱుందొగై, ఐంగుఱునూఱు, పదిఱ్ఱుప్పత్తు, పరిపాడల్, కలిత్తొగై, అగనానూఱు, పుఱనానూఱు-అనునవి ఆ యెనిమిది గ్రంథములు. అటులనే పత్తుప్పాట్టులో పది కావ్యములు కలవు. పదినెణ్ కీழ்క్కణక్కులో పదునెనిమిది కావ్యము లున్నవి. ఈ కావ్యములందు పదరచనలే కాని వృత్తరచనలు కనబడవు. ద్విపద షట్పదాది పదరచనలు దేసి సాహిత్యమునకు చెందినవి. ఉత్పల చంపకమాలాది వృత్తరచనలు సంస్కృత సాహిత్య సంపర్కమునకు పిమ్మటనే ద్రావిడ వాఙ్మయమునందు ప్రవేశించినవి. కనుక ఈ కావ్యములు దేసిసాహిత్య సంప్రదాయములను గూడ కనుగొనుట కుపకరించుచున్నవని నుడువదగును.

పద సంఖ్యను పురస్కరించుకొని సంకలనకర్త లీ గీతికాగుచ్ఛములకు పేర్లుపెట్టిరి. అగనానూఱు, పుఱనానూఱులలోని గీతములందు 13 మొదలుకొని 37 వఱకును పాదములు కలవు. కనుక ఈ రెంటిని నెడుందొగై అని వ్యవహరింతురు. కుఱుందొగై యందు నాలుగు మొదలు ఎనిమిది వఱకుగల పాదములుగల గీతములుగలవు. కావున ఈ గ్రంథమునకు కుఱుందొగై యనుపేరు వచ్చినది. నత్రిణైలో తొమ్మిది నుండి 12 వఱకు గల పాదములతోడి గీతములు కలవు. పత్తుప్పాట్టులోనివి చాల దీర్ఘములైన గీతములు. ఇక ఈ కావ్యములందు మిక్కిలి ప్రశస్తములైనవిగా గణింపబడుచున్న అగనానూఱు, పుఱనానూఱులను పరికింతము.

అగనానూఱు (అగం + నానూఱు).

అగం అనుమాటకు స్థూలముగ ప్రేమ అని అర్థము చెప్పవచ్చును. కాని అది పవిత్రప్రేమ. ఏకమనస్కులయిన నాయికానాయకులు సంతోషమనుభవించినపిమ్మట వారు వ్యక్తీకరించు తదనుభూతియే అగం అనబడును. ఇట్టి ప్రేమగీతము లీ కావ్యమునందు నన్నూఱు కలవు. కావుననే యీ గ్రంథమునకు అగనానూఱు అని సహేతుకముగ పేరిడబడెను. ఇది పాండ్య భూపతియగు ఉగ్రపెరువழுది అనునతని సమాదరణమున రుద్రశన్మ(ర్మ)న్ అను పండితునిచే సంకలనము చేయబడినది. ఈ గీత చతుశ్శతిని 144 గురు కవులు చెప్పిరి. కాని మూడుగీతముల కర్తృత్వము మాత్రము తెలియరాలేదు. ఈ కవులలో కొందఱు చాల ప్రాచీనులనియు, మఱికొందఱు క్రీ. శ. 4,5 శతాబ్దులకు చెందినవారనియు పండితులవిశ్వాసము.

ప్రేయసీప్రియుల వివాహపూర్వ ప్రణయము, వివాహానంతర ప్రణయము, పిమ్మట వారికి సంభవించు ఎడబాటు, అప్పుడు సఖీజనము నాయిక ననునయించుట - యున్నగు విషయము లీ గీతము లందలి ముఖ్యాంశములు. వీనిలో అతిశయోక్తులు కనబడవు; ఉదా

వ్యాహృతములైన భావములు సహజసుందరములు. రథారూఢుడైన ప్రియుడొకడు తన ప్రేయసిని కలిసికొను నుద్దేశముతో రథచోదకునితో చెప్పిన మాటలను గమనింపుడు. "వాన కురిసి చాల దినములయ్యెను కాబోలు! కప్పల బెకబెకలు వినవచ్చుచున్నవి. రెండు జింక లా మడుగులో నీరు త్రాగుచున్నవి. చెట్లు పువ్వులు రాల్చినవి. పడగలు విప్పుకొన్న నాగములవలె కొన్ని పూవులు వికసించియున్నవి. గుఱ్ఱముల గిట్టలచప్పుడు మాఱుమ్రోగునట్లుగా రథమును నడుపుము. ఏలయన నాకై నిరీక్షించుచున్న నా ప్రేయసిని కలిసికొనవలయును".

కార్యార్థమై వెడలిన ప్రియునుద్దేశించియొక ప్రేయసి తన ప్రియసఖితో ఇటుల నుడువుచున్నది. "ఇతరులను యాచింపకుండ ధర్మబద్ధమైన జీవితమును సాగించుటకు ధనమావశ్యకమని యెంచి నా ప్రియుడు ధనార్జనమునకై వెడలియున్నాడు. పోవునప్పుడు నన్నెంతయో యనునయించి యతడు వెడలినాడు. కాని అతడు పోయిన మార్గమంత మంచిది కాదు. ఆ త్రోవలో జలాన్వేషణార్థమై యేనుగులు బయలుదేరినవి. వాని వెనుక పులు లున్నవి. ధట్రాజు చేతియందలి మద్దెల నడిమిభాగమున నున్న తెల్లనిభాగమువలె, ఆ పర్వతప్రాంతమున నీళ్లులేని ప్రదేశము మీదుగా నా ప్రియుడు వెడలినాడు." మన కావ్యనాయిక లనుభవించు విరహవేదన యింత మృదులముగ నుండదు! అగనానూఱులోని ప్రేమ గీతావళి యందలి భావము లీ తీరుననే యుండు ననుట గమనింపదగిన విషయము.

పుఱనానూఱు (పుఱం + నానూఱు)

తమిళులు ధర్మార్థకామములకు నొసగినంత ప్రాధాన్యము మోక్షమున కొసగలేదు. అఱమ్ (ధర్మము) పొరుళ్ (అర్థము) ఇన్బం (కామము)- ఈ మూటిని తమిళు లాదరించిరి. అగనానూఱు ప్రేమ గీతముల సంపుటమైనచో పుఱనానూఱు వీరగీతముల సముచ్చయము. ధర్మార్థముల సమన్వయమును పుఱం అని వ్యవహరింతురు. ఈ కావ్యమునందు గూడ నన్నూఱు గీతములుండుటచే దీనికి పుఱనానూఱను పేరు వచ్చినది. ఈ కావ్య మెవరి ప్రోత్సాహముననెవరు సంకలనము చేసిరో తెలియవచ్చుట లేదు.

పుఱనానూఱు చారిత్రకముగా ప్రశస్తమైన కావ్యము. ఇందు తమిళరాజత్రయ మనబడు చేర, చోళ, పాండ్య వంశీయులను గూర్చియు, వారి సామంతులనుగూర్చియు, వీరవతంసులను గుఱించియు పెక్కు విషయములు కండ్లకుకట్టునట్లుగ నుదాహరింపబడినవి. ఇందలి కొన్ని గీతములకు తుదిని గద్యలుకూడ చేర్పబడినవి. వీనిని బహుశః తరువాతి కవులెవరైనను చేర్చియుందురని విశ్వసింపబడుచున్నది. భారతమును సంతరించిన పెరుందేవనార్ పాడిన దేవతాస్తుతి గీతముతో పుఱనానూఱు ప్రారంభమగుచున్నది. కాని యీతని కాలము వివాదగ్రస్తమైనది. ఇతడు చాల ప్రాచీనుడని కొందఱును, క్రీ. శ. 9వ శతాబ్దికి చెందినవాడని కొందఱును తలచుచున్నారు.[1]

పుఱనానూఱులో నొక వీరమాత యిటుల వర్ణింపబడినది. "ఆమె వృద్ధాంగన. ఆమెకొక్కడే కుమారుడు. అతడు యుద్ధవీరుడు. అతడొక తూరి రణరంగమునకు వెడలినాడు. సమరాంగణమును వీడి అతడు పలాయనమంత్రము పఠించెనని వదంతిగ చెప్పుకొనుచున్న యీ విషయ మా వృద్ధ చెవినిపడెను. తోడనే యామె కృత్తి చేబూని కన్న కుమారునకు పాలొసగిన తనపాలిండ్లను మొదలంట ఛేదింప సన్నద్ధయైనది. అంతలో నేదో భావము స్ఫురింపగా, ఆమె కత్తి బూనిన చేతితోడనే కదనభూమికి వెడలినది. అట పడియుండిన వీరకళేబరముల నామె రక్తనేత్రాలతో పరికించెను. తుద కొకచోట ఆమెకు తన కుమారుని మృతశరీరము దృగ్గోచరమయ్యెను. అంతులేని సంతోషముతో నా యవ్వ కలకల నవ్వెను."

ఒక చేరభూపతి కరికాలచోళునిచే నొక యుద్ధమున పరాజితుడయ్యెను. ఆ చేరరాజు వెన్ను గాయములతో నిండియుండెను. అటుల వీపుగాయములు గలుగుట ఆనాళ్లలో పిఱికితనమునకు లక్షణముగ గణింపబడుచుండెనట! కావున చేరభూపతి రాజ్యముచేయుట కంగీకరింపక నిరాహారుడై యుద్ధభూమి యందే

1. చూడుడు History of the Tamils. పుట. 158.

అసువులు వీడెను. ఆ విషాద దృశ్యమును తిలకించిన యొక కవి కన్నీరుమున్నీరుగా విలపించుచున్న చేరదేశీయుల దుస్థితి నిట్లు వర్ణించెను.

"ఇక విజయభేరులు మ్రోగవు. తూర్యారావములు వినబడవు. పెద్దపెద్ద క్షీరభాండములు శూన్యములై యున్నవి. మధుపములు సేకరించిన మధువు నెవ్వరును గ్రోలరు. కర్షకులు తమ పొలములను దున్నరు. జనపదములందలి పచ్చిక బీడులలో తీర్థప్రజవలె ప్రజలు గుమిగూడరు. చంద్రోదయము కాగా సూర్యభగవానుడు కొండలచాటున అస్తమించినట్లుగా శత్రురాజుచే పరాజితుడైన మా రాజసింహుడు కరవాలమును విసర్జించెను గదా! ఎట్టి దుర్దినము లివి!"

తమిళరాజులలో కరికాలచోళుడు మహా పరాక్రమశాలి, వదాన్యుడనియు, కవి జన పోషకుడనియు నతడు చిరయశస్సు సముపార్జించినాడు. అట్టి యశోవిశాలుడగు కరికాల చోళుని మరణమునకు చింతాక్రాంతుడైన యొక కవి యిటుల నుడివెను. "వైరివీరుల దుర్గములను నాశము గావించినాడు. గాయకులను, వారి కుటుంబములను పోషించినాడు. విధ్యుక్తధర్మ నిర్వహణము నందారితేరిన పురోహితుల కనుసన్నలలో మెలగినాడు. సుగుణ సంపన్నలగు రాణులచే మన్ననలు పొందినాడు. వేదోక్తముగ పవిత్ర ప్రదేశములందు యజ్ఞములు చేసినాడు. అకటా! అట్టి మహారాజులుంగారు నేడు లేడుగదా! అతనిని గోల్పోయిన యీ ప్రపంచపు దురదృష్టము పండినది. వేసవికాలములో తమ గొర్రెమందల మేతకై గొర్రెకాపరు లాకులు రాల్పగా వెలవెల బోవు నేరేడుచెట్టు కొమ్మలవలె నేడు నగలూ సౌఖ్యములు త్యజించిన అతని రాణులు వెలవెల బోవుచున్నారు గదా!"

ఇటుల పుఱనానూఱు నాటిసాంఘిక చారిత్రక విషయములను సుస్పష్ట మొనర్చుచున్నది. ఈ గ్రంథమును మఱి యితరగ్రంథముల నాధారముగ చేసికొని ప్రాచీన ద్రావిడ సామాజిక జీవన విధానమును తెలిసికొననగును.

ఆనాటి తమిళరాజు లొకరితో నొకరు సతతము కలహించుకొనుచుండిరి. వారిలో వారికి సఖ్యము తక్కువ యనియే స్పష్టమగుచున్నది రాజులు భాషాపోషకులై కవి పండితులను పోషించుచుండిరి. కళాకారులు కూడ రాజులచే సమ్మానితు లగుచుండిరి. నాటి ప్రజలకు రాజభక్తియే కాని దేశభక్తి తెలియదు. ఆర్యుల యాచారవ్యవహారము లప్పటికే తమిళనాడులో గూడ వ్యాప్తిలోనికి వచ్చుచుండెను. అయినను ప్రజలును రాజులును తమ ప్రాచీనాచారవ్యవహారము లందే గాఢానురక్తులై యుండిరి. యవనదేశమునుండి కొని రాబడిన మద్యమును రాజులు సేవించుచుండిరి. ప్రజలలోగూడ మద్యపానము సామాన్యాచారమై యుండెను. నాట్యప్రదర్శనములు, సంగీత సభలు, దేవోత్సవములు మున్నగు వానిలో ప్రజలు పాల్గొని సంతోషము నెందుచుండిరి. యుద్ధవీరులు రణరంగమున మరణించుటయే శ్రేయస్కరమని యెంచుచుండిరి. యుద్ధమునుండి పాఱిపోవుటయో, వెన్నుపై గాయపడుటయో యవమాన హేతువులుగా గణింపబడుచుండెను.[1]

తమిళుల యాచారవ్యవహారము లందెట్టి ప్రత్యేకత కానవగునో, అట్టి ప్రత్యేకత వారి ఛందస్సాహిత్య సంప్రదాయములందును కానవగును. సంగయుగమున వెలుగులోనికి వచ్చిన గ్రంథములలో నీత్యుద్బోధక గ్రంథములు చాలకలవు. వైద్యగ్రంథములు కూడ కొన్ని సంతరింపబడెను. కావ్యవస్తువులను తమిళకవులు సంస్కృతసాహిత్యము నుండి గ్రహింపలేదు. పదరచనలు చేసిరే కాని వృత్తరచనల జోలికి పోలేదు. వర్ణనలయందును వారు తమ ప్రత్యేకతను ప్రదర్శించిరి. సంగ (ఘ) యుగపు కవులలో చాలమంది బ్రాహ్మణేతరులే. తరువాతి కాలముననే బ్రాహ్మణకవులు ప్రబలిరి. కవి పండితులకు రాజాశ్రయము లభ్యమగుటయే కాక రాజసంపూజితు లగుచుండిరి. కవయిత్రులు కూడ చాలమంది సంగకాలమునందు కనబడుచుండుట పేర్కొనదగు విషయము. సంగకవులు తమ ప్రత్యేకతను సంరక్షించుకొనుచుండినను, సంస్కృతశబ్దము లా యుగమునందు వెలసిన కొన్ని గ్రంథములందు ప్రవేశించినవి. అనగా సంస్కృతసాహిత్య ప్రభావమునకు పునాదులు సంగకాలపు చరమదశలో నేర్పడిన వని నుడువవలసి యున్నది.

1. ఇంకను వివరములు కోరువారు చూడుడు The Tamils: Eighteen Hundred years Ago.

**టీక - టిప్పణి :**

# ఉత్తరహరివంశం-ఆశ్వాసాదిపద్యాలు

శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు

—:*:—

సాధారణముగా ప్రాచీనకావ్యములను బఠించునప్పు డందలి యాశ్వాసాద్యంత పద్యములను, కృతికర్తృ కృతిపతివంశాభివర్ణనములను, షష్ఠ్యంతములను పాఠకులు వదలివేయుచుందురు. రసవత్తరమయిన కథాభాగమును జదువుటయందలి యుత్సాహాతిశయము వారి కంతఃకలుగక పోవుటయే దానికిఁ గారణము. పఠనసంప్రదాయమును బాటించుటకొఱకై యాశ్వాసాద్యంతములయందలి పద్యముల నొకవేళఁ జదివినను వానిని శ్రద్ధాసక్తులతోఁ బఠించుట యరుదనియే చెప్పవచ్చును. కాని ప్రాచీనకవీశ్వరుల రచనములలోని యాశ్వాసాద్యంతపద్యములును, కృతిపతి కృతికర్తృవంశాభివర్ణనములును, షష్ఠ్యంతములును జారిత్రకముగా మిక్కిలి విలువ గలిగినవని పరిశోధకుల యభిప్రాయము. తెలుఁగుకవుల జీవితవృత్తాంతములు తెలుపుచారిత్రక గ్రంథములు మనకు లేకపోవుటచే వారి జీవితవిశేషములను, నితరవిషయములను తెలిసికొనుటకు మనము కావ్యాదులయందలి కృత్యవతరణికలనే యాశ్రయింపవలసి యున్నది. కృత్యాద్యవస్థగా రచింపఁబడిన యాశ్వాసాదిపద్యములు కొన్ని ప్రాచీనకావ్యములయందు విశిష్టకవితాసంప్రదాయముతో-వైచిత్ర్యశిల్పవిన్యాసముతో విరాజిల్లుచున్నవి. ప్రాచీనకావ్యములలోనే కావ్యములోని యాశ్వాసాదిపద్యములను బరిశీలించినను మనకీ విషయము యథార్థమని తేటతెల్లము కాఁగలదు.

వ్యాఖ్యాసాపేక్షము లయిన ప్రౌఢాంధ్రప్రబంధములలో నాచన సోమనాథుఁడు రచించిన యుత్తరహరివంశ మొకటి యని వేఱుగాఁ జెప్ప నవసరములేదు. తిక్కనవలెనే తన గ్రంథమును హరిహరనాథాంకితము గావించిన నాచనసోమనాథుఁడు తనకావ్యమునందు వలెనే తన గ్రంథములోని యాశ్వాసాది పద్యములయందును హరిహరాద్వైతమును స్థాపింపఁ బూనినట్లు తెలియుచున్నది. తిక్కన రచించి వదిగా విరాటపర్వాదిని చేకొనఁబడిన

'కి మస్థిమాలాం కిము కౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వం?
కిం కాలకూటః కిము వా యశోదా
స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే!'

అను శ్లోకములోని శిల్పము నాచనసోమనాథుని యాశ్వాసాదిపద్యరచనావిధానమునకుఁ బ్రేరకమయి యుండఁబోలును. హరిహరనాథునికే యంకితము గావించిన తిక్కన గ్రంథములోని యాశ్వాసాదిపద్యములందుఁ గూడ నిట్టి 'హరిహరాద్వైత శిల్పము' కానరాదు. నవీనగుణసనాథుఁ డయిన యాతని యాశ్వాసాది పద్యములలో నెలకొలుపఁబడిన శిల్ప మిట్టిదని మనకుఁ దెలిసినప్పుడు గాని మన మాయాయి పద్యములకు సరియయిన యర్థము నెఱుఁగఁ జాలము. అట్లయ్యు నుత్తరహరివంశములోని యాశ్వాసాదిపద్యములు నేఁటికిని బలువురకు దుర్గ్రాహ్యములుగానే యున్నవి. అనేకస్థలముల నన్వయము కుదురక చిక్కుగొలుపుచున్నవి. ఇది యర్థము, ఇట్టిది యన్వయ మని నిర్ధరించి చెప్పుటకు వీలు లేకున్నది. ఇటీవల నాపద్యములను సవిమర్శముగా నేను జదువుచుండఁగా నాకుఁ దోఁచిన యర్థములను, నన్వయములను, నందందుఁ గలిగిన సందేహములను పండితలోకమునకుఁ దెలియఁ బఱుచుచు నే నన్వయించుకొనినరీతిగాఁ గడపటఁ బ్రతిపద్యమునకును వ్యాఖ్య రచించి యిందుఁ బొందుపఱుచుచున్నాఁడను. సహృదయులగు పండితవరేణ్యులు దీనిని దిలకించి యిందలి బాగోగులను జర్చింతురు గాక యని యర్థించుచున్నాఁడను.

ఉత్తరహరివంశములోని తొలి నాలుఁగాశ్వాసములకును శ్రీ గురువర్యులు వేటూరి ప్రభాకర శాస్త్రులుగారు సమగ్రవ్యాఖ్యానము రచించిరి. కాని యది నేఁటిదాఁక ముద్రితము కాకుండుటచే దానిఁ జూచు భాగ్యము నాకుఁ గలుగలేదు. కాని వారికడ నంతేవాసినై యుండినప్పుడు వారప్పుడప్పుడు ఉత్తరహరివంశములోని కొన్ని పద్యములనుగూర్చి యర్థవిచారము సేయుచునందందుఁ గొన్ని వివరణలను

తెలివిచ్చుచుండిరి. వానిలో నాశ్వాసాదిపద్యములకు సంబంధించి జ్ఞాపక మున్నదానిని నిందుఁ బొందుపఱతును. స్వయముగ వారి వ్యాఖ్యాన మెట్టిదో నే నెఱుఁగక పోవుటచే వారి వివరణలుగా నేను చేర్కొన్నవి నా జ్ఞాపకముమీఁద నాధారపడి చెప్పినవే కాని ప్రమాణములు మాత్రము కాఁజాలవని మనవి చేసికొను చున్నాఁడను.

క॥ శ్రీసర్వమంగళాకుచ
వాసంతీవకుళగంధవద్వనమాలా
వాసుకివిలాసవేద
వ్యాసమునిమనో నివాస హరిహరనాథా!

ఇది ప్రథమాశ్వాసమునందలి యాశ్వాసాది పద్యము. నాచన సోమనాథుఁడు పాటించిన 'హరిహరనాథాద్వైత శిల్ప' మిందుఁ గల దనునభిప్రాయముతోనే మన మీ పద్యమున కర్థము చెప్పుకొనవలసి యున్నది. అందుచేతనే శ్రీ సర్వ.....మాలా, వాసుకివిలాస అని వేఱువేఱుగఁ గాక శ్రీ సర్వ మంగళా...... వాసుకివిలాస యున్నంతదాఁక హరిహరాద్వైతమును బ్రతిపాదించు నొక్క సమాసముగానే మనము దానిని బరిగ్రహింపవలసియున్నది. అదియును గాక యంత్యానుప్రాసమును బాటించు సంప్రదాయము గల సోమన - వాసుకివిలాస, వేదవ్యాసమునిమనో నివాస - యని ప్రయోగించి యుండె ననియు, నందుచేతనే గంధవద్వనమాలా యనుచోటఁ బదచ్ఛేదము చేసి దానినిగూడ సంబుద్ధిగాఁ గైకొనరా దనియు మనము తలఁపవలసి యున్నది. ఈ నిర్ణయము చేసికొన్నపిదప మన మీ పద్యమున కీరీతి నర్థము చెప్పుకొనవచ్చును.

అర్థము—

శ్రీ=లక్ష్మీదేవి యొక్కయు, సర్వమంగళా=పార్వతీదేవి యొక్కయు, కుచ=పాలిండ్లయందు, వాసంతీ=అడవిమొల్లల యొక్కయు, వకుళ=పొగడపూల యొక్కయు, గంధవత్=పరిమళమును గల, వనమాలా=వనమాల యొక్కయు, వాసుకి=వాసుకి యొక్కయు, విలాస=విలాసము గలవాఁడా! వేదవ్యాస=వేదవ్యాసుని యొక్కయు, ముని=మునుల యొక్కయు, మనస్=మనస్సులు, నివాస=నివాసముగాఁ గలవాఁడా!, హరిహరనాథా=హరిహరస్వరూపుఁడ వయిన యో భగవంతుఁడా!

ఇందుఁ గ్రమాలంకారము పాటింపఁ బడి యున్నది.

లక్ష్మీదేవి తనవక్షస్స్థలమున ధరించియుండిన యడవిమొల్లల యొక్కయు, పొగడపూవుల యొక్కయుఁ బరిమళము - విష్ణుదేవుఁ డామెను గౌఁగిలించుకొనినప్పు డాతని వక్షస్స్థలముపై నున్న వనమాలను జెందినవి. అట్టి వనమాల యొక్క విలాసము కలవాఁడు హరి (విష్ణుదేవుఁడు).

పార్వతీదేవి తన వక్షస్స్థలమున నడవిమొల్లలను, పొగడపూవులను ధరించి యుండఁగా వాని పరిమళమునకుఁ జొక్కి యర్థనారీశ్వరుఁ డయిన పరమేశ్వరుని వక్షస్స్థలముపై నుండిన వాసుకి విలాసముగ నాట్యమాడెను. అట్టి వాసుకియొక్క విలాసము (క్రీడ) గలవాఁడు హరుఁడు (పరమేశ్వరుఁడు).

వేదవ్యాసమహర్షి మనస్సున నివసించినవాఁడు హరి. మునుల మనస్సులయందు నివసించినవాఁడు హరుఁడు. ఇట్లు హరిహరనాథాద్వైతపరముగా నీ పద్యమున కర్థము కుదురుచున్నది.

క. శ్రీపార్వతీ కుచాగ్రా
రోపిత ముక్తాంశు కాంత రోచిర్నిచితా
కూపార శైలహరణ
ప్రాపితమణిరుచిసనాథ! హరిహరనాథా!

ఇది యుత్తరహరివంశములోని ద్వితీయాశ్వాసమునందలి యాశ్వాసాది పద్యము. పై పద్యమువలెనే యిందును నంత్యానుప్రాసము పాటింపఁబడి యుండుటచే 'శ్రీ పార్వతీ' నుండి 'రుచిసనాథ' వఱకు నొకే సమాసముగానే మనము పరిగణింపవలసి యున్నది. అప్పుడు '...మణిరుచిసనాథ!', 'హరిహరనాథా!' యని యంత్యానుప్రాసము కుదురును. ఇచ్చటఁ గూడఁ బైపద్యము వలెనే క్రమాలంకారము చొప్పున నర్థము చెప్పుకొనవలసి యున్నది.

అర్థము :—

శ్రీ=లక్ష్మీదేవి యొక్కయు, పార్వతీ=పార్వతీదేవి యొక్కయు, కుచ=పాలిండ్ల యొక్క, అగ్ర=మీఁది భాగములయందు, ఆరోపిత=ఆరోపింపఁబడిన (ఉంపఁబడిన),

ముక్తా=ముత్తెముల యొక్కయు, ఇందు=చంద్రుని యొక్కయు, కాంత=ప్రకాశించుచున్న, రోచిస్=కాంతిచేత, నిచిత=పెంపుఁబడిన, అకూపార=సముద్రము యొక్కయు, శైల=పర్వతము యొక్కయు, హరణ=హరించుటను, వ్యాపారణ=వ్యాపించుటను గల, రుచి=కాంతితో, సనాథ=కూడుకొనినవాఁడా! హరిహరనాథా!=హరిహరస్వరూపుఁడవగు నో భగవంతుఁడా!

ఈపద్యమున కర్థము చెప్పుట మిక్కిలి కష్టము. అర్థ మేదోరీతిని జెప్పుకొనినను భావము దురవగాహము.

'ముక్తేందు కాంతి రోచిర్నిచితా' యని వ్రాఁతప్రతి పాఠము. కాని 'కాంతి' 'రోచిస్' అని పునరుక్తి యగుటచే నాపాఠము పరిహరింపఁబడి 'కాంత' యనుపాఠము పరిగ్రహింపఁబడినది. కాని 'యిందుకాంత' యన్నప్పుడు చంద్రకాంతశిల యని యర్థము చెప్పుకొనినచో నిచట చంద్రకాంతశిలకుఁ బ్రసక్తి కానరాదు. అందుచేతనే,—ఇందు=చంద్రుని యొక్క, కాంత=ప్రకాశించుచున్న,—యని యర్థము చెప్పఁబడినది. 'ప్రాపితమణిరుచిసనాథ' యనుపాఠముకంటె 'హరణ వ్యాపారణ రుచి సనాథ' యనుపాఠమే గుణవత్తరము. హరణ, వ్యాపారణ యనుటచే అకూపారపక్షమున హరణము, శైలపక్షమున వ్యాపారణము నను క్రమము సరిపోవును. ప్రాపితమణిరుచిసనాథ యనినచో నీ సొగసు కానరాదు.

లక్ష్మీదేవి తన కుచములపై ధరించియుండిన ముత్యాలహారము యొక్క (పాలవంటి) తెల్లని కాంతి యంతటను వ్యాపించి యామె పుట్టుకకు నెలవైనపాలసముద్రమునే హరించినది. ఆమెను కౌఁగిలించుకొనినప్పుడా కాంతి విష్ణుదేవుని బొందఁగా నాతఁడట్టి కాంతితోఁ గూడినట్టివాఁడయ్యె నని భావము.

పార్వతీదేవి పాలిండ్లయందుఁ బరమేశ్వరుఁడు శిరస్సు మోపి పరుండఁగా నాతని శిరస్సుమీఁది నెలవంక కాంతి వారధివసించియున్న కైలాసపర్వతమునందంతటను వ్యాపించినది. పరమేశ్వరుఁడట్టి కాంతితోఁ గూడినట్టివాఁడయ్యె నని భావము.

ఇట్లొకవిధముగా నీ పద్యమున కర్థము, నన్వయము కుదురుచున్నవి గాని యిట్టిదే యర్థమని నిర్ధరించుటకు, నిర్ధరింపఁదగినంత తృప్తికరముగా నిది లేదు. విద్వాంసులు దీనిని బర్యాలోచింతురు గాక యని యభ్యర్థించుచున్నాను.

క. శ్రీదుర్గాకుచదుర్గ
స్వేదాంభోహారయష్టివిభ్రమశాలీ
శ్రీ దత్తాభయమదనా
హ్లాదక్రీడావినోద హరిహరనాథా!

ఇది యుత్తర హరివంశములోని తృతీయాశ్వాసమునందలి యాశ్వాసాది పద్యము. ఉత్తర హరివంశములోని యాశ్వాసాది పద్యములలో నెల్ల నిది మిక్కిలి దుర్గ్రహ మయినది. ఉన్నది యున్నట్లుగాఁ బద్య పాఠమును గైకొని చూడఁగా శ్రీదుర్గా...శాలీవఱకు నొక సంబుద్ధిగాను, శ్రీదత్తా...వినోదవఱకు నొక సంబుద్ధిగాను, హరిహరనాథా యనునది మఱియొక సంబుద్ధిగాను స్థూలదృష్టికి గోచరించును. కాని శాలీ యనుచోటఁ బదచ్ఛేదము చేసి దాని నొక సంబుద్ధిగఁ గైకొనినచో నా సమాసమునకు సరి యయినయర్థము కుదురుట లేదు. ఇది గాక పూర్వ, పూర్వతర పద్యములలో నంత్యానుప్రాసమును బాటించినసోమన యీ పద్యమునఁ గూడఁ బాటించియుండుట సంభావ్యము. అట్లు చూడఁగా 'శ్రీదుర్గా' మొదలుకొని 'వినోద' వఱకు నొక్క సమాసముగానే మనము పరిగ్రహింపవలసి యున్నది. అప్పుడు క్రీడా వినోద హరిహరనాథా యని యంత్యానుప్రాసము కుదురును. కాని యప్పుడును దొలిసమాసమున కర్థము తిన్నగాఁ గుదురుట లేదు. వ్రాఁతప్రతులలో విభ్రమశాలీ యనుచోట శాలీ యని దీర్ఘాంతముగాఁ గాక శాలి యని హ్రస్వాంతముగా నున్నది. కాని దానివలనఁ గూడ మనకు నర్థవిచారము విషయమున నెట్టి ప్రయోజనమును గలుగుట లేదు. ఈ పద్యమునకు సరి యయిన యర్థము కుదుర్చుటకై శ్రీ గురువర్యులు వేటూరి ప్రభాకరశాస్త్రులుగారు రెండుచోట్ల రెండు చిన్న సవరణలను సూచించినారు. శాలీ యనుచోట సాల యనియు, క్రీడా యనుచోట క్రీడా యనియు వారు సవరించిరి పయి సవరణాలు మూలపాఠమునకు మిక్కిలి దగ్గఱగా నుండి సరస మయినయర్థమును సముపార్జించుచున్నవి. తాళపత్రమూలప్రతి... నలవాటు గలవారికి శాలీ సాలలును, క్రీడా క్రీడాలును లిపిలో మిక్కిలి ...సన్నిహితములుగా

యుండునట్లు గోచరింపక మానవు. ఇంతియును నవి యర్థపుష్టికి దోహదములు సేయుసవరణ లగునప్పుడు వానిని మనము పరిగ్రహింపవలసియే యున్నది. పయి సవరణలు చేయక పద్యమున కర్థము చెప్పుట యసాధ్య మనియే నా తలఁపు. పద్యమున కర్థ మిట్లు చెప్పుకొనవలయును.

అర్థము :—

శ్రీ=లక్ష్మీదేవి యొక్కయు, దుర్గా=పార్వతీదేవి యొక్కయు, కుచ=పాలిండ్లనెడి దుర్గ=దుర్గములయందు, స్వేదఅంభస్=చెమటనీటితోఁ గూడుకొనిన, హారయష్టి=బెత్తముల వంటి హారములచే, విభ్రమ=భ్రమ గలిగించుచున్న, సాల=ప్రాకారముల యొక్క, శ్రీ=సంపదచేత, దత్త=ఒసఁగఁబడిన, అభయ=వెఱపులేమి గల, మదన=మన్మథునికి సంబంధించిన, ఆహ్లాద=సంతోషప్రదము లయిన, క్రీడా=పనులయందు, వినోద=సంతోషించువాఁడా!, హరి హర నాథా!=హరిహర స్వరూపుఁడ వగు నో భగవంతుఁడా!

లక్ష్మీదేవి యొక్కయుఁ బార్వతీదేవి యొక్కయుఁ బాలిండ్లు దుర్గములవలెఁ జెన్నారుచుండెను. ఆ పాలిండ్లపై వారు ధరించియుండిన హారయష్టులు వ్రేలాడుచుండినవి. ఆ హారముల ప్రక్కగా స్వేదజలము క్రమ్మి యుండినది. అందలి హారయష్టులు దుర్గప్రాకారముల వలెను, వానిపజ్జఁ గ్రమ్మియుండిన స్వేదజలము ప్రాకారమునకు వెలుపల నున్న యగడ్తలయందలి జలము వలెను నుండె నని భావము. అట్టి ప్రాకారములు గలదుర్గములయందు మన్మథుఁడు నెలకొనియుండుటచే నాతనికి నితరులవలన నెట్టి భయమును లేకుండెను. అట్టి మదనునికి సంబంధించిన క్రీడలయందు హరియు, హరుఁడును వినోదించుచుండి రని భావము.

సాల, క్రీడా యని పూర్వపాఠములను సంస్కరించుటచేత నే యీ పద్యమున కిట్టి సరసార్థము సమకూరుచున్నది. ఈ సవరణలు పయికిఁ జాలఁ జిన్న సవరణలుగాఁ గానవచ్చినను నవి మనస్సునకుఁ దోఁచనప్పుడు పద్యార్థము విషయమునఁ గలుగు చిక్కును దలపోసినప్పుడీ సవరణలవిలువ యెంతటిదో, యెట్టిదో మనకుఁ దెలియఁగలదు. ప్రభాకరశాస్త్రిగారు తమ చిరకాలానుభవములోఁ గావించిన యీ సవరణలు సముచితములు, సరసార్థసంపాదకములు నని చెప్పుట కెట్టి సందియమును లేదు.

తిరుపతిలో శ్రీ వేంకటేశ్వరప్రాచ్యకళాశాలాపండితులు శ్రీ గొరిపెద్ది రామసుబ్బశర్మగారీ పద్యమున కెట్టి సవరణలను జేయకయే యర్థము కుదుర్చుకొన వచ్చు ననుచున్నారు. వారు చెప్పునర్థ మిట్లున్నది—

అర్థము—

శ్రీ=లక్ష్మీదేవియొక్కయు, దుర్గా=పార్వతీదేవియొక్కయు, కుచ=పాలిండ్లనెడి, దుర్గ=దుర్గములయందు, స్వేదఅంభస్=చెమటనీటితోఁ గూడుకొనిన, హారయష్టి=బెత్తములవంటి హారములయొక్క, విభ్రమ=విశేషమయిన కాంతిచేత, శాలీ=ఒప్పువాఁడా! (ఉభయపక్షములకును సమము.

శ్రీ=(హరిపక్షమున) లక్ష్మీదేవిచేత, దత్త=ఒసఁగఁబడిన, అభయ=వెఱపులేమికల, మదన=మన్మథునికి సంబంధించిన, ఆహ్లాద=సంతోషములో, వినోద=వినోదించువాఁడా! శ్రీ=(హరపక్షమున)పార్వతీదేవిచేత, దత్త=ఒసఁగఁబడిన, అభయ=అభయముకల, మదన=మన్మథునికి సంబంధించిన, వ్రీడా=సిగ్గుచేత, వినోద=వినోదించువాఁడా!

స్వేదము సాత్త్వికభావములలో నొకటి. అది కలుగునట్లుగా హరిహరు లిరువురును లక్ష్మీపార్వతులతో నుపభోగించినారు. అపుడు వారి కుచములమీఁది హారములు నూత్నకాంతులలోఁ దేజరిల్లినవి. అట్టి హారములచేత హరిహరు లిరువురు నొప్పుచుండి రని మొదటి సమాసమునకు భావము.

లక్ష్మీదేవిచేత నొసఁగబడిన యభయమును గల మదనసంబంధియాహ్లాదమునందు హరి వినోదింపఁగా, తనకంటిచూపుచేత రూపుగోలుపడిన మన్మథుఁడు తన భార్య యయినపార్వతీదేవిచేతఁ బునరుజ్జీవింపఁబడి యభయము పొందఁగా నట్టి మన్మథుని విషయమై యొకవంక సిగ్గుపడుచు హరుఁడు వినోదించుచుండినాఁ డని రెండవ సమాసమున కర్థము.

ఇందు మదనాహ్లాద, వ్రీడావినోద యనుపదములకు హరిహరుల పక్షమున నొక సరసార్థము సంపాదింపఁబడుచున్నది.

శ్రీ=పార్వతీదేవి యనుటకుఁ బ్రామాణిక ప్రయోగ మున్నది. కాని శాలీ యనుచోట విడిచి

యర్థము చెప్పుటచే సోమన యంత్యానుప్రాస నియమము చెడుచున్నది. కాని యన్ని పద్యము లందును నీనియమమును బాటింపలే దని మనము సమాధానము చెప్పుకొనవచ్చును.

వీనిలో నే యర్థము పరిగ్రాహ్యమో పండితులు చర్చింపఁగలరు.

క. శ్రీహైమవతీకలహా
స్నేహావిరామప్రణామసీమంతపద
గ్రాహిసురసింధుకహ్లా
రాహితసిందూరలాక్ష హరిహరనాథా!

ఇది యుత్తర హరివంశములోని చతుర్థాశ్వాసమునందలి యాశ్వాసాది పద్యము. ఇందు హరిహరాద్వైతశిల్పము చక్కగా నెక్కొని యున్నది. సోమనచే నీ పద్యమునందుఁ బ్రతిపాదింపఁబడిన భావము సరిగా బోధపడినఁ గాని యిందలి శిల్పము బోధపడదు.

అర్థము :—

శ్రీ = లక్ష్మీదేవి యొక్కయు, హైమవతీ = హిమవంతుని కుమార్తె యగు పార్వతీదేవి యొక్కయు, కలహ = కయ్యము (పాలయాలుక) యొక్కయు, స్నేహ = నెయ్యము యొక్కయు, విరామ = విరామమునందుఁ జేయఁబడిన, ప్రణామ = నమస్కారమునందు, సీమంత = పాపటచేతను, పద = పాదములచేతను, గ్రాహి = గ్రహింపఁబడిన, సురసింధు = ఆకాశగంగయు, కహ్లార + అహిత = తామరలకు విరోధి యగు చంద్రుఁడును గల, సిందూర = కుంకుమమును, లాక్ష = లత్తుకను గలవాఁడా!, హరిహర నాథా! = హరిహరస్వరూపుఁడ వగు నో భగవంతుఁడా!

లక్ష్మీదేవి తనపాలయలుక తీరఁగా విష్ణుదేవునికి సాష్టాంగముగా నమస్కరించినది. అపుడామె సీమంతము విష్ణుదేవుని పాదములపై నుండఁగా నామె తనఫాలమునందు ధరించిన సిందూరము విష్ణుదేవుని పాదములయందుఁ బుట్టినయాకాశగంగను గలదై పవిత్రమయినది. అట్టి సిందూరమును గలవాఁడు హరి (విష్ణుదేవుఁడు).

పార్వతికిఁ దనప్రియుఁడగుపరమేశ్వరునిపైఁ బాలయలుక యేర్పడఁగా నపుడామెను దేర్చుటకై పరమేశ్వరుఁ డామెకు సాష్టాంగపడినాఁడు. అపుడామె పాదములపైఁ బరమేశ్వరుని శిరస్సుమీఁది నెలవంక నెలకొనినది. ఆమె తన పాదములకుఁ బూసికొనిన లత్తుక పరమేశ్వరుని శిరస్సుమీఁది నెలవంకను గలదయినది. అట్టి లత్తుకను గలవాఁడు హరుఁడు (పరమేశ్వరుఁడు).

ఇందు హరిపక్షమున నర్థము చెప్పుకొనినపుడు లక్ష్మీదేవి విష్ణుదేవునకు నమస్కరించినట్లును, హరునిపక్షమున నర్థము చెప్పుకొని నపుడు పార్వతి పాలయలుక దీర్చుటకై యాతఁడే యామెకు నమస్కరించి నట్లును మనము గ్రహింపవలసియున్నది. ఇట్లే యర్థము చెప్పుకొనవలయు ననుటకు 'సీమంత-పద' యను పదములును, 'సిందూర-లాక్ష' యను పదములును సహాయకములుగా నున్నవి. ఇంతకంటె సరియయిన, సత్యమయిన యర్థము నాకుఁ గుదురుట లేదు. ఎవ్వరైన నట్టి వ్యాఖ్యము గట్టుకొనినచో దానిని గ్రహించుటకు నేను సర్వదా సిద్ధముగా నున్నాను.

ఈ పద్యమున కలహ-స్నేహ పదములు, సీమంత-పద పదములు, సురసింధు-కహ్లారాహిత పదములు, సిందూర-లాక్ష పదములు క్రమముగా హరిపరములు, హరపరములు నగుజంటపదములు. ఒక పక్షమున నొక పదము, మఱియొక పక్షమున నొక పదముగ దీని కర్థము చెప్పుకొనవలయు ననుటను నీజమిలిపదములే సూచించుచున్నవి కదా! ఇందును గ్రమాలంకారమే కలదు.

క॥ శ్రీనిశ్రేయసకాంక్షా
నూనవ్రతభార దక్షిణోదార సప
ర్యానందితచేతోని
ధ్యాన తనుద్యుతినవీన! హరిహరనాథా!

ఇది యుత్తరహరివంశములోని పంచమాశ్వాసమునందలి యాశ్వాసాదిపద్యము. ఇందు శ్రీనిశ్రేయస మొదలుకొని వ్రతభార వఱకు నొకసమాసము. అంత్యానుప్రాసనియమము పాటించుటచే దక్షిణోదార యనునది రెండవ సంబుద్ధి. ముద్రితగ్రంథమునందు 'సపర్యానందితచేతోనిధ్యానతనుద్యుతినవీన' యని యేకసమాసముగానే ముద్రితమై యున్నది. కాని సపర్యానందితచేతోనిధ్యాన, తనుద్యుతినవీన యని రెండు సంబుద్ధులుగా వానిని గ్రహించుట లగ్గు. పూర్వపద్యములయందలి శిల్పములవలెఁ గాక యిందు భిన్నమయినశిల్ప

మవలంబింపఁ బడినది. పూర్వపద్యములయం దొకే సమాసమున రెండు పక్షములకును క్రమముగా నర్థము చెప్పుకొనఁగా, నిందొకే సమాసమునకుఁ గ్రమాలంకారప్రమేయము లేకయే యుభయపక్షములకును నర్థము కుదురుచున్నది.

అర్థము—

శ్రీనిశ్రేయసకాంక్షానూన వ్రత భార- (హరిపక్షమున) శ్రీ=లక్ష్మీదేవియొక్క, నిశ్రేయస = మేలునందు, కాంక్ష = కోరికచే, అనూన=తక్కువ కాని, వ్రత=నియమము యొక్క, భార=బరువు కలవాఁడా!, (హరపక్షమున) శ్రీ=మంగళప్రద మయిన, నిశ్రేయస=మోక్షమునందలి, కాంక్షా=కోరికచేత, అనూన=తక్కువ కాని, వ్రత = నియమము యొక్క, భార=బరువు కలవాఁడా!, దక్షిణోదార - (ఉభయపక్షములను) దక్షిణ=ఎల్ల నాయికలయందును సమాన మయినయాదగము కలవాఁడా! ఉదార=ఉదారస్వభావము కలవాఁడా!, సపర్యానందితచేతోనిధ్యాన - (ఉభయ పక్షములకును సమము) సపర్యా= శుశ్రూషలచేత, ఆనందిత = సంతోష పెట్టఁబడిన, చేతస్=మనస్సుయొక్క, నిధ్యాన= ఎక్కువ యేకాగ్రత గలవాఁడా! తనుద్యుతి నవీన - (ఉభయపక్షములకును సమము) తను= శరీరముయొక్క, ద్యుతి=కాంతిచేత, నవీన= నూతనముగాఁ దోఁచువాఁడా!, హరిహర నాథా!=హరిహరస్వరూపుఁడ వగు నో భగవంతుఁడా!

విష్ణుదేవుఁడు లక్ష్మీదేవికి మేలు కలుగవలయు నని యనూనవ్రతభారము పూనినవాఁడు. దక్షిణనాయకుఁడు. ఉదారుఁడు. ఊడిగము చేయువారి సపర్యలచేత సంతోషించినహృదయము గలవాఁడు. శరీరకాంతిచే నెప్పటి కప్పుడు క్రొత్తగాఁ దోఁచువాఁడు.

పరమేశ్వరుఁడు మోక్షమును గోరి యనూన వ్రతభారము పూనినవాఁడు. దక్షిణనాయకుఁడు, ఉదారుఁడు. మునీశ్వరుల సపర్యలచేత సంతోషించినహృదయము గలవాఁడు. తన శరీరకాంతిచేత నెప్పటి కప్పుడు క్రొత్తగాఁ దోఁచువాఁడు నని భావము.

క॥ శ్రీకలితయోగిహృన్నా
ళీకాంతర్నిజనివాస లేఖాధిపసం
ధ్యాకాలమూలజపన
స్వాకారోంకారరూప హరిహరనాథా!

ఇది షష్ఠాశ్వాసమునందలి యాశ్వాసాదిపద్యము. ఇందును బూర్వపద్యమువలెనే యొక్కొక్క సమాసమునకును నుభయపక్షములను నర్థము చెప్పుకొనవలసి యున్నది.

అర్థము —

శ్రీ=(తపస్సనెడి) సంపదతో, కలిత= కూడుకొనిన, యోగి=యోగీశ్వరులయొక్క, హృత్=హృదయము లనెడి, నాళీక=తామరలయొక్క, అంతస్ = లోపలిభాగములను, నిజ=తనయొక్క, నివాస=నివాసస్థానముగాఁ గలవాఁడా! (ఉభయపక్షములకును సమము), లేఖాధిప=దేవతలకు రాజగు దేవేంద్రునిచేత, సంధ్యాకాల = ప్రాతస్సాయం సంధ్యాకాలములయందు, మూలజపన = ప్రధానముగా జపింపఁ బడుచున్న, స్వ+ఆకార=తనయాకారమే యగు, ఓంకార=ఓంకారమునే, రూప=రూపముగాఁ గలవాఁడా! హరిహర నాథా!=హరిహరస్వరూపుఁడ వగు నో భగవంతుఁడా!

హరిహరు లిరువురును దపోనిధు లగుయోగిజనుల హృదయపద్మములను నివాసములుగాఁ గలవారు. వారి యాకారమే యగు ఓంకారమును నుభయ సంధ్యాకాలముల యందును దేవేంద్రుఁడు జపించుచుండు నని భావము. నివాసమును, రూపమును హరిహరుల కిరువురికి నొక్కటే యని చెప్పుటచే నిందు హరిహరాద్వైతసిద్ధాంతము పద్యార్థమునందును సముచితముగ సంపాదింపఁబడినది.

ఉత్తరహరివంశములోని యాశ్వాసాదిపద్యములకు యథాశక్తిగా నన్వయము కుదిర్చి యర్థము చెప్పుట కిందుఁ బ్రయత్నించితిని. ఇందలి బాగోగులను జర్చించుటకు సహృదయులు ప్రమాణము. ఇందలి రెండు, మూఁడు, నాలుఁగాశ్వాసములు వివిధ విశ్వవిద్యాలయములలోఁ బెద్దపెద్ద పరీక్షలకు పఠనీయములు. అడుగులో హంసపాదిగా నున్న యీ యాశ్వాసాది పద్యములకేని నర్థము కుదుర్చుకొనుట మన కర్తవ్యము. ఏతత్ప్రయత్నమున సహృదయు లగు విద్వాంసులు తమ యమూల్య సాహిత్యానుభవమును బ్రదర్శింతురు గాక యని కోరుచున్నాఁడను.

పురాతత్త్వం :

# ఆంధ్రదేశశాసనపరిచితి

శ్రీ గడియారం రామకృష్ణశర్మగారు

భారతీయులు వేదకాలమునుండియు లేఖన పద్ధతి నెఱిగినవారని అథర్వవేద మంత్రములు చెప్పుచున్నవి. కాని అప్పటి లిపి ఎట్లుండెనో తెలిసికొనుటకాధారములు కానరావు. ఇటీవల బయలుపడిన హరప్పా, మొహెంజోదారో శిథిలములలోని కొన్ని ముద్రికలపై ఏవో లిపులు కానవచ్చుచున్నవి. దానిని చిత్రలిపి అనుచున్నారు. ఈ లిపి నింతవఱకు పరిశోధకు లెవరును చదువలేక పోయినను క్రీ. పూ. 3000 ఏండ్లక్రిందట ఇట్టి లిపి వాడుకయం దుండవచ్చునని ఊహించుచున్నారు. బౌద్ధవాఙ్మయములోని 'లలిత విస్తరము'నందు అరువది భారతవర్షీయ లిపులు పేర్కొనబడినవి. అవి గూడ మనకు లభ్యములు కాలేదు. క్రీ. పూ. మూడవశతాబ్దమున నుండిన మౌర్యాశోకచక్రవర్తి భారతదేశపు నలుమూలల వేయించినశిలాశాసనములే చరిత్ర కందినప్రథమ లేఖనములు. అప్పటినుండియే చారిత్రకయుగ మారంభ మయ్యెనని పండితు లభిప్రాయ పడుచున్నారు.

అశోకశాసన లిపిని బ్రాహ్మీలిపి అందురు. దానికే మౌర్యలిపి అని గూడ పేరు. ఈ లిపియే క్రమపరిణామము చెంది నాగరి మొదలగు ఔత్తరాహ లిపులకును, తెలుగు, కన్నడము తమిళము మొదలగు దాక్షిణాత్య లిపులకును మాతృక యైనది. ఈ లిపి పరిణామ భాషా విశేషముల నెఱుఁగగోరువారు ఆయా దేశ శాసనముల నే పరిశీలింపవలసి యుండును. దేశ చరిత్రకు శాసనములు ముఖ్యసాధనము లని తెలుపవలసినపని లేదు. ఆంధ్రదేశమునందలి శాసనములను స్థూలముగ పరిచయము చేయుటయే ఈ వ్యాసరచనోద్దేశము.

శాసనములు సాధారణముగ రాజాజ్ఞ ననుసరించి శిలలపై, రాగిరేకులపై, విగ్రహములపై చెక్కబడి యుండును. తెలుగుదేశపు శాసనములను భిత్తిస్తంభశాసనములు, తామ్ర శాసనములు, శిలాశాసనములు అని స్థూలముగ మూడు విభాగములు చేయవచ్చును. కాలము ననుసరించి భిత్తిస్తంభశాసనములు క్రీ. పూ. మూడవ శతాబ్దమునుండి క్రీ. తరువాత 3వ శతాబ్దము వరకును, తామ్రశాసనములు, క్రీ. శ. నాలుగవ శతాబ్దమునుండి 10వ శతాబ్దము వరకును, శిలాశాసనములు క్రీ. శ. 11వ శతాబ్దమునుండి ఈవలి వరకును ఉండినవానినిగ పరిగణింపవచ్చును. ఆయా యుగములలో నాయా శాసనముల ప్రాధాన్యమును సూచించుటకే ఈ విభాగము కాని తామ్రశాసన యుగములో శిలాశాసనములు లేవనియు, శిలాశాసనయుగమున తామ్రశాసనము లుండవనియు కాదు. భిత్తిస్తంభశాసనములు బ్రాహ్మీలిపియందు ప్రాకృతభాషలో చెక్కబడినవి. తామ్రశాసనములలో కొన్ని ప్రాకృతములో నున్నను విశేషభాగము సంస్కృతభాషలో నున్నవి. వీని లిపిని (బ్రాహ్మీనుండి పరిణామము చెందిన) వేంగీలిపి అందురు. 9, 10 శతాబ్దులనాటి తామ్రశాసనములలో ప్రాత తెలుగులిపి కానవచ్చును. తరువాతి శిలాశాసనములు ప్రాత తెలుగులిపిలో తెలుగు కన్నడ భాషలయందు వేయబడి యున్నవి. అట నట సంస్కృతశాసనములు గూడ లేకపోలేదు.

క్రీ. శ. నాలుగవ శతాబ్దమునుండి ఆరవ శతాబ్దమువఱకు నుండిన సంస్కృత శాసనములలో గ్రామనామములు సంస్కృతవేషము ధరించిన తెలుగులో నున్నవి. ఉదాహరణకు "కంబు' రాంచెరువే, గొల్లతెంకీః, చెరుకు మడ్లుళ్ళ, పోతురాయుః" అనునవి. తరువాత ఆరవశతాబ్దమున చాళుక్యులు తెలుగును ఆదరించుటతో తెలుగు శాసనములు వెలసినవి. మన కింతవఱకు లభించిన మొట్టమొదటి తెలుగు శాసనము 6వ శతాబ్దమునందలి రేనాటిచోళ సత్యాశ్రయ మహారాజాది. ఇది కడపజిల్లా 'పొట్లదుర్తిమాలెపాడు'లో లభించినది. దీని తరువాత విప్పర్ల - లక్ష్మీపురశాసనములు గూడ ప్రాముఖ్యము కలవి. ఆంధ్రభాషాపరిశోధకుల

కివి పెన్నిధులు. ఈవిషయముల నింతటితో వదలి ప్రకృతము ననుసరింతము.

శాసనము లీక్రింద సూచించిన క్రమము ననుసరించి యుండుట కానవచ్చును. సాధారణముగ శాసనములలో (౧) మంగళశ్లోకములు. (౨) దాతృవంశప్రశస్తి (౩) కాలము (౪) విషయము (౫) ఉపసంహారశ్లోకములు (౬) శాసనకర్త (౭) చెక్కినవానిపేరు అనుక్రమము పాటింపబడి యుండును. కొన్నిటిలో ౬ - ౭ భాగములు లేకపోవచ్చును. శాసనము నారంభించుటకు మొదలు పైభాగమున కొన్నిగుర్తులు వేయబడును. శైవశాసనములపై లింగపానవట్టములును, వైష్ణవశాసనములపై శంఖచక్రములును, జైనశాసనములపై పల్యంకాసనస్థితుడైన తీర్థంకరునిమూర్తియు చెక్కబడును. కొన్నిటిపై వీని పర్యాయము లనదగిన నంది, గరుత్మంతుడు, దూడకు పాలిచ్చుగోవు, వెలుగుచున్న జ్యోతి, సూర్యచంద్రులును కానవచ్చును. తరువాత శాసనమారంభ మగుట కలదు. పై క్రమము శాసనములలో నాయా కాలములం దెట్లనుసరింపబడెనో పరిశీలింతము.

## ౧. మంగళశ్లోకములు.

దేనినైన వ్రాయ దలపెట్టినప్పుడు మంగళవాచకముతో నారంభింపవలెననుట భారతీయ సంప్రదాయము. అది "ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశ" రూపమున నుండవచ్చునని పెద్దలు నిర్ణయించినారు. కావ్యాదులలో నీనియమమే పాటింపబడినది. అట్లే శాసనములలోను కానవచ్చును. అశోకశాసనములలో "దేవానాం ప్రియదర్శీ" అనువస్తునిర్దేశరూప మంగళవాచకముపయోగింపబడినది. శాతవాహన-ఇక్ష్వాకు వంశీయుల శాసనములందు "సిద్ధం" అనియు, విష్ణుకుండి శాసనములలో "స్వస్తి" అనియును ప్రయోగింపబడినది. శైవశాసనములలో సాధారణముగ

నమస్తుంగశిరశ్చుంబి
చంద్రచామర చారవే।
త్రైలోక్య నగరారంభ
మూలస్తంభాయ శంభవే॥

అనుశ్లోకము ఉండును. ఇంది బాణభట్టారకుని హర్షచరిత్రమునందలిది.

వైష్ణవశాసనములలో,

"జయత్యావిష్కృతం విష్ణో
ర్వారాహం క్షోభితార్ణవం
దక్షిణోన్నతదంష్ట్రాగ్ర
విశ్రాంతభువనం వపుః.

జైనశాసనములలో,

శ్రీమత్పరమగంభీర
స్యాద్వాదామోఘలాంఛనం,
జీయాత్త్రైలోక్యనాథస్య
శాసనం జినశాసనం

అనుశ్లోకము లుండును.

## ౨. రాజవంశప్రశస్తి.

మంగళవాచకము తరువాత దాతయొక్క, అతని నేలు మహారాజుయొక్క వంశప్రశస్తి. ఒక్కొక్క రాజవంశమున కొకవిధమైన బిరుదావళి యుండును. అశోకశాసనములలో - "దేవానాం ప్రియదర్శీ" అని మాత్రమే కలదు. మౌర్యవంశ ప్రశస్తి కానరాదు. శాతవాహనశాసనములలో నిట్లున్నది.

"సిద్ధం. రాఞో వాసిఠీపుతస - సిరిపుళమాయిస-సవఛరె-ఎకునవీసె-౧౯ గింహానపఖే-బితీయే ౨ దివసె-తెరసె౧౩ రాజరాఞో-గోతమీపుతస"-(ప్రాకృతము) (నాసికశాసనములు) (సంస్కృతచ్ఛాయా) సిద్ధం। రాజ్ఞో వాసిష్ఠీపుత్రస్య శ్రీ పుళమాయస్య సంవత్సరే ఏకోనవింశతి గ్రీష్మే పక్షే ద్వితీయే ౨ దివసే త్రయోదశ్యాం ౧౩ రాజరాజస్య గౌతమీపుత్రస్య.

ఇక్ష్వాకువంశప్రశస్తి.

"సిధం - మహారాజస - అసమేధయాజిస అనేక హిరంణకోటి గోసత సహస హలసత సహస పదాయిస సవథేసు అపతిహత సంకపస వాసిఠీపుతస ఇక్ష్వాకుస సిరిచాత మూలస దుహుతా రఞో సిరివిరపురిస దతస."

(Epigrapa-Ind-XX-P. 18.)

శాలంకాయన ప్రశస్తి.

"సిరివిజయ వేంగీపురా భగవతో చిత్రరథ సామి పాదాను జ్ఞాతస్స బప్ప భట్టారక పాదభత్తస్స పరమ మాహీస్సరస్స సాలంకాయనస్స అస్సమేధ యాజినో మహారాజా సిరివిజయదేవ వమ్మస్స, "

(Epigraph-Ind-IX-P. 56)

విష్ణుకుండిన ప్రశస్తి.

"స్వస్తి విజయ దెందులూర వాసకాద్భగవతః శ్రీ పర్వతస్వామి పాదానుధ్యాతో విష్ణుకుండిన ఏకాదశాశ్వమేధావభృతావధౌత జగత్కల్మషస్య క్రతుసహస్ర యాజినః సర్వమేధావాప్త సర్వభూత స్వారాజ్యస్య బహుసువర్ణ పౌండరీక పురుషమేధ-"

(Epigraph-Ind-IV-P. 193)

బాదామీచాళుక్య ప్రశస్తి.

"శ్రీమతాం సకల భువన సంస్తూయమాన మానవ్యస గోత్రాణాం, హారీతిపుత్రాణాం, సప్తలోకమాతృభి రభివర్ధితానాం, కార్తికేయ పరిరక్షణ ప్రాప్త కల్యాణపరంపరాణాం, భగవన్నారాయణ ప్రసాద సమాసాదిత వరాహలాంఛనేక్షణ వశీకృతాశేష మహీభృతాం చలుక్యానాంకుల మలంకరిష్ణోః అశ్వమేధావభృథస్నాన పవిత్రీకృత గాత్రాణాం."

(Epigraph-Ind-X-P. 15)

తూర్పుచాళుక్యుల ప్రశస్తి.

"స సకల రిపునృపతి మకుట తటఘటిత మణిగణ మధుకర నికర పరిచుంబిత చరణ సరసిరుహయుగలో యులోచన పదకమల విలస ద్విరేఫాయమాణో మానోన్నతోద్ధతః సమస్తలోకః సమస్తభువనాశ్రయ శ్రీ విజయాదిత్య మహారాజాధిరాజ పరమేశ్వరః పరమభట్టారకః పరమబ్రహ్మణ్యః"

(Epigraph-Ind-IX-P. 131)

పశ్చిమచాళుక్య ప్రశస్తి.

"స్వస్తి సమస్తభువనాశ్రయ శ్రీపృథ్వీవల్లభ మహారాజాధిరాజ పరమేశ్వర పరమభట్టారక సత్యాశ్రయకుల తిలకం చాళుక్యాభరణం శ్రీమత్త్రిభువన మల్లదేవర విజయరాజ్య ముత్తరోత్తరాభివృద్ధి ప్రవర్ధమానం."

(తెలంగానా శాసనములు)

కాకతీయ ప్రశస్తి.

"శ్రీ స్వస్తి సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర, అనుమకొండపుర వరాధీశ్వర, మూరురాయ జగదాళ, విదితవిక్రమశీల, పరమమాహేశ్వర, వీరలక్ష్మీనికేశ్వర, చలమర్తిగండ, కదనప్రచండ శ్రీ స్వయంభూదేవ దివ్యశ్రీపాద పద్మారాధక పరబలసాధక నామాది ప్రశస్తసహితం." (తెలంగానా శాసనములు.)

విజయనగరరాజ ప్రశస్తి.

"శ్రీ మద్రాజాధిరాజ పరమేశ్వర అరిరాయ విభాళ భాషిగతప్పువ రాయరగండ మూరు రాయర గండ, కండనాడ కొండుకొండ నాడ కొడదు పూర్వదక్షిణ పశ్చిమ సముద్రాధీశ్వర ఇందురాయ సురత్రాణ శ్రీ వీరప్రతాప శ్రీ వీర కృష్ణరాయ మహారాయరు."

(South-Ind-Insc-IV-No. 249)

సామంత మండలేశ్వరుల ప్రశస్తికి ఉదాహరణముగ నొకదానిని తెలిపెదను:

"తత్పద పద్మోపజీవి స్వస్తిచరణ సరోరుహ విహితవిలోచన త్రిలోచన ప్రముఖాఖిల పృథ్వీశ్వర కారిత కావేరీతీర కరికాల కుల రత్నప్రదీప కుమారాంకుసం, కాంచీపుర త్రిపురమహేశ్వరం, శ్రీ మన్మహామండలేశ్వర నిరుగని చోడమహారాజులు."

(తెలంగానా శాసనములు)

ఇట్టి వంశప్రశస్తులలో దాతనుగురించి తెలుపబడును.

## ౩. దానకాలము.

భిన్నకాలములలో భిన్నవిధములుగ కాలమును తెలుపుచుండిరి. ఆయిదవ శతాబ్దము వరకు వేయబడినశాసనములలో రాజుయొక్క రాజవర్షముగాని ప్రభవాదివర్షములుగాని గణింపబడెను. మాసమునకు ముందు 'మహత్' శబ్దము చేర్చి మహావైశాఖ-మహామాఘ అని వ్యవహరించినారు చాళుక్యుల కాలమునుండి సామాన్యముగ శకవర్ష సంఖ్య, ప్రభవాది నామములు, అయన, మాస, పక్ష, తిథి, వార, పర్వాది దినముల ఉల్లేఖము కానవచ్చుచున్నది. పశ్చిమచాళుక్య శాసనములలో కొన్నిట చాళుక్య విక్రమ శకవర్ష సంఖ్య ఈబడినది. సాధారణముగ శకవర్ష సంఖ్యను తెలుపుటకు కొన్నిటిలో సంకేతశబ్దములు వాడబడియున్నవి. అంకెలను క్రిందిసంకేతములలో శాసనములందుపయోగించినారు.

౧ అంకకు సోమ - సుధాకరాది చంద్ర నామములును, ఐరావతము, పరబ్రహ్మ - ధ్రువ - ప్రపంచ శబ్దములు వాడబడినవి.

౨ ,, నేత్ర - బాహు - కర్ణ - ఓష్ఠ - పక్ష - యుగ, ఇత్యాదులు.

౩ ,, అగ్ని-రామ-పుర-లోక-గుణ-సంధ్యా, ఇత్యాదులు.
౪ ,, అబ్ధి-సాగరాది సముద్రనామములు- ఉపాయ- యోగ-వేద- ఆశ్రమ- వ్యూహ-వర్ణ-జాతులు.
౫ ,, ఇంద్రియ- ఇషు- భూత-ప్రాణ- బాణ-కన్యా- పాండవాదులు.
౬ ,, శాస్త్ర - రుచి ఋతు-రస-ఇత్యాది.
౭ ,, శైల - ద్వీప - వాయు-ముని-వార-రాజ్యాంగ-స్వర-విభక్తి.
౮ ,, గజ - దిక్పాల-సిద్ధి యోగ - వసు-అనుష్టుప్.
౯ ,, రత్న-నిధి-ఖండ-ద్వార-గ్రహ-ధేను.
౦ ,, ఆకాశ-శూన్య-ఇత్యాదులు.
౧౦ ,, హస్తాంగుళి - దిక్ - రూపక-అవతార-నాట్య.
౧౧ ,, రుద్ర-కారణ-త్రిష్టుప్.
౧౨ ,, అర్క-మాస-రాశి.
౧౩ ,, విశ్వేదేవ-తాంబూలగుణ- అతిజగతీ.
౧౪ ,, విద్యా-యమ - మను - భువన-శాక్వరీ.
౧౫ ,, తిథి-స్త్రీకలా-అతిశాక్వరీ.
౧౬ ,, ఇందుకలా-అంబికా
౧౮ ,, ద్వీప-పర్వ.
౨౦ ,, రావణభుజ-అంగుళి.
౧౦౦ ,, ధార్తరాష్ట్రి.
౧౦౦౦ ,, జాహ్నవీవక్త్రి - వేదశాఖా-శేషశీర్ష.

(Karnatak-Epigraphy.)

వీని పర్యాయములను, మరికొన్ని సంకేతములను గూడ ఉపయోగించెదరు. ఈ సంకేతములు తెలియనిచో దానకాలమును తెలిసికొనుట కష్టము. పై సంకేతములవలన తెలిసిన యంకెను "అంకానాం వామతో గతిః" అన్న సూత్రము ననుసరించి తలక్రిందుగ చదివినచో శాసనకాలము తేటపడును. ఉదాహరణకు

"శాకాబ్దే శశిదంతిశంకరమితే
సిద్ధార్థి సంవత్సరే,
చైత్రే మాసి సితత్రయోదశీ తిథౌ
వారే గురో శ్శోభనే."
(కాకతి రుద్రదేవశాసనము - తెలంగాణా శాసనములు పుట 54.)

ఇందు-శశి ౧ దంతి ౮. శంకర ౧౧ = ౧౮౧౧ వచ్చినది. తలక్రిందుగ చదివిన ౧౧౮౧ అయినది. పై శాసనకాలము శాలివాహనశక వర్షములు ౧౧౮౧ అని తేలినది. దీనికి ౭౮ చేర్చినచో క్రీస్తుశకవర్షములు వచ్చును. + ౭౮ = ౧౨౫౯.

కృష్ణరాయుల శాసనము—

"సోఽయం శ్రీవర కృష్ణరాయనృపతి
ర్జిత్వోదయాద్రిం తతః
కృష్ణం దేవ ముపాయతః స్వనగరీం
నీత్వా మణీమంటపే,
శాలీయాబ్దరసాగ్ని వేదవిధుయు
గ్భావే తపస్యేసితే
కార్తీయే దివసే ప్రవిష్టేపి విధివత్
కృష్ణప్రతిష్ఠా వ్యధాత్"

(South. Ind-Ins. IV. P.)

రస ౬, అగ్ని ౩, వేద ౪, విధు ౧=౬౩౪౧. వామతోగతిః ౧౪౩౬. ఇట్లే తక్కినశాసనములలో గ్రహింపవలెను.

## 4. శాసనవిషయము.

సాధారణముగ శాసనవిషయము దేవాలయ ధర్మములు, విద్యాదానములు, గోశకీమఠ రామానుజకూట స్థానాపతులకు ఏర్పరచిన వృత్తులు, ధార్మిక సూత్రములు, శత్రువిజయములు, గ్రామపాలనకు చేసికొన్న నిబంధనలు మొదలైనవానికి సంబంధించినదై యుండును. ఈ విషయములనుబట్టి ఆయాకాలములందలి దేశ రాజకీయవిభాగములు, ఆర్థికపరిస్థితులు, వ్యాపారపద్ధతులు, విద్యాధార్మిక భాషా విశేషములు మొదలైనవానిని చక్కగా తెలిసికొనవచ్చును.

## 5. ఉపసంహారశ్లోకములు.

శాసనాంతమున సామాన్యముగ అన్ని శాసనములలోను ఉపసంహారశ్లోకము లొకే విధముగ నుండును. అట్టివాని నుదాహరించెదను.

స్వదత్తాం పరదత్తాం వా
యో హరేత వసుంధరాం,
షష్టి ర్వర్ష సహస్రాణి
విష్టాయాం జాయతే క్రిమిః.

స్వదత్తా ద్విగుణం పుణ్యం
పరదత్తానుపాలనం,
పరదత్తాపహారేణ
స్వదత్తా నిష్ఫలా భవేత్.

దానపాలనయో ర్మధ్యే
దానాత్ శ్రేయోనుపాలనం,
దానాత్ స్వర్గ మవాప్నోతి
పాలనా దచ్యుతం పదం.

న విషం విష మిత్యాహుః
దేవస్వం విష ముచ్యతే,
విష మేకాకినం హంతి
దేవస్వం పుత్రపౌత్రకం.

ఏకైవ భగినీ లోకే
సర్వేషా మేవ భూభుజాం,
న భోజ్యా న కరగ్రాహ్యా
విప్రదత్తా వసుంధరా.

సామాన్యోయం ధర్మసేతు ర్నృపాణాం
కాలే కాలే పాలనీయో భవద్భిః,
సర్వా నేతాన్ భావినః పార్థివేంద్రాన్
భూయో భూయో యాచతే రామచంద్రః.

బహుభి ర్వసుధా దత్తా
బహుభి శ్చానుపాలితా,
(బహుభి ర్వసుధా భుక్తా
రాజభి స్సగరాదిభిః), (పాఠాంతరము)

యస్య యస్య యదా భూమిః
తస్య తస్య తదా ఫలం.

మద్వంశజాః పరమహీపతివంశజా వా
పాపా దపేతమనసో భువి భూమిపాలాః
తే పాలయంతు మమ ధర్మ మిమం సమగ్రం
తేషాం మయా విరచితోంజలి రేవ మూర్ధ్ని.

శత్రుణాపి కృతో ధర్మః
పాలనీయః ప్రయత్నతః,
శత్రు రేవ హి శత్రు స్స్యా
ద్ధర్మ శ్శత్రు ర్న కస్యచిత్.

యావ చ్చంద్రశ్చ సూర్యశ్చ
యావ త్తిష్ఠతి మేదినీ,
యావద్రామకథా లోకే
తావత్ క్షేత్రం ప్రపాల్యతే.

అకరస్య కరాదానాత్
గోసహస్ర వధ స్థిరః
సకరస్య కరత్యాగాత్
గోకోటిఫల మశ్నుతే.

శాసనము తెలుగుభాషలో నున్నను చివర నీ ఉపసంహారశ్లోకములలో కొన్ని తప్పక ఉండును. కొన్నిటిలో శ్లోకములకు బదులు మనోహరములైన ఉపసంహారగద్యలు వేయబడినవి.

"ఈ ధర్మాన కెవ్వరే ననుకూలురైన వారికి సర్వసంపదలగు ప్రతికూలురైరని తమ సంపద క్షయమగు. దేవవృత్తి గొనినేని దమ మలమూత్రాలను దాన భక్షించిన వారౌను."

"ఈ ధర్మము నెవ్వరేం బ్రతిపాలింతురు వారికి అనంత పుణ్యము. ఈ ధర్మానకు ఎవ్వరే బాధ సేయుదురు వారికి అనేక బ్రహ్మకల్పాలు పాయక నరకములు ఇవి కదా పెద్దల వచనములు."

(తెలంగాణా శాసనములు-పే-38-39)

## ౬. శాసనకర్త.

శాసనముల చివర కొన్నిటిలో శాసనకర్త పేరును, కొన్నిటిలో చెక్కినవాని పేరును ఉండును. సాధారణముగ కన్నడ శాసనములను "శానబోవ" వ్రాయును. కన్నడదేశములో మన 'కరణము'ను 'శానభోగ' అందురు. సుప్రసిద్ధ పండితులు ఆయా మహారాజుల ఆస్థానములలో శాసనాధికారులుగ నుండినట్లు నిదర్శనములు కలవు.

తూర్పుచాళుక్యసార్వభౌముడు రాజరాజు వేయించిన నందమపూడి శాసనములో శాసనకర్త నన్నయభట్టు, లేఖకుడు గండాచార్యుడును పేర్కొనబడినారు. వేమభూపాలుని ఆస్థానమున శ్రీనాథకవిసార్వభౌముడు విద్యాధికారిగను, శాసనాధికారిగను ఉండినాడు.

గద్వాలతాలూకా పూడూరు శాసనముల చివర "కాంచనసేన భట్టారకు"ని ప్రశంస కలదు.

దిఙ్మాత్రముగ చేయబడిన ఈ స్థూలపరిచయము 'పరిశోధనము'నం దభిలాష గలప్రాథమికుల కుపయోగపడఁగలదు.

పంచకావ్యపాత్రలు :

# సుశీల విందు

శ్రీ జి. ఎన్. రెడ్డిగారు.

"శ్రవణింతు నొక్క శ్రీభా
గవతచరిత్రంబుఁ బరమకల్యాణసము
ద్భవభవనంబుఁ జతుర్దశ
భువనమహారత్నసూత్రముగ దగుసరణిన్."

అని యిట్లభినవప్రబంధనిర్మాణకౌతూహలాయత్తచిత్తుఁడై" తెనాలి రామకృష్ణకవి పాండురంగమాహాత్మ్యప్రబంధమును రచించినాఁడు. కాదు. 'శ్రవణించి'నాఁడు. 'శ్రవణింతు' ననుటలో స్థానికమును, శాబ్దికమును నగు రెండు విశేషము లున్నవి. ఎత్తుగడలోనే క్రియను వేయుటచేఁ దన రచనాసంకల్పమును, కావ్యవస్తువునందుఁ దనకుఁ గల యభిమానమును సూచింపబడినవి. శాబ్దికముగా - కావింతు, నిర్మింతు, రచియింతు, అను క్రియ లుండ 'శ్రవణింతు' అను శబ్దమును బ్రయోగించి యుండుటలో నొక నిశ్చయము కలదు. శ్రవణి ఒక స్వరస్థాయి. రచనకుఁ బర్యాయముగా 'శ్రవణింతు' అని ప్రయోగము చేసినవారిలో తెనాలివాఁడే మొదటివాఁడు. 'శ్రవణింతు' నన్నపుడు తనరచన సామాన్య రచన కాదనియు, ధ్వనింపఁజేయు రచన యనియుఁ గవియుద్దేశము కాఁబోలు! "ఒక్క శ్రీ భాగవత చరిత్రంబు చతుర్దశభువన మహారత్న సూత్రముగ"—మనపెద్దలు పేర్కొన్న లోకములు పదునాలుఁగు. మన కున్న పరమ భాగవతులు పదునాలుగురు. వారిలో నొక్కఁడైనపౌండరీకుని చరిత్ర కవి గ్రహించినకథావస్తువు. "పౌండరీక విభుచరిత చతుర్దశభువన వినుతముగ శుభవశమతి నా పేర నుడువు"మని కృతిపతి విరూరివేదాద్రి పల్కినాఁడు. 'చతుర్దశభువన మహారత్నసూత్రముగ' నిర్మింపఁ గవియు మొదటనే సంకల్పము చేసికొని యున్నాఁడు గదా! ఇట్లు కావ్యప్రారంభములోనే కవి 'చతుర్దశ' శబ్దమును రెండుమూడు మాఱులు నొక్కి వక్కాణించినాఁడు. ఈ పదమువలన లోకసంఖ్యను, పరమ భాగవత సంఖ్యను దెల్పుటయే గాక, తన ప్రబంధము 'చతుర్దశ' కథలతోఁ గూడి యున్న దనుటను గూడ ధ్వనింపఁ జేసినాడు. ప్రధానేతివృత్తమును మ్రింగివేయఁదగినన్ని యుపాఖ్యానములు కలిగి, యాయుపాఖ్యానముల ప్రాధాన్యముచేఁ బ్రసిద్ధి పొందినప్రబంధ మీ పాండురంగమాహాత్మ్యము. ఆధికారికకథావస్తు నిర్వహణమువలనఁ గాదు; ఉపాఖ్యానరచనా శిల్పమునుబట్టియే దానికిఁ బ్రౌఢత, ప్రచారముఁ గలిగినవి.

"బహుళపక్షంబు చీకటి బహుళ మగుట
చాయవెన్నెల తరితీపు చేయుకరణి"

నని కవి యొకచో టన్నట్లీ ప్రబంధమునఁ బ్రధానకథ బహుళపక్ష మైనది. ఉపాఖ్యానములు 'చాయవెన్నెల తరితీపు చేయుకరణి' నయినవి. ఉపాఖ్యానముల వలననే యీ కావ్యము రసాస్వాదయోగ్య మయిన దన్న సాహసము కాదు. ఉపాఖ్యానరచనలో తెనాలివాని శిల్పము తెనాలివానిదే. కావ్యములోని యొక్కొక్క యుపాఖ్యానములోను నొక్కొక్కవిధ మగునైపుణిని బ్రదర్శించినాఁడు. నిగమశర్మోపాఖ్యానము తరువాత దానితో నన్నివిధముల సరితూగఁ గల కావ్యభాగము సుశీలోపాఖ్యానమే. ఇది నాలుగవ యాశ్వాసములో నెనుబది గద్యపద్యములలోఁ జక్కఁగా, సమగ్రముగా, సుప్రసన్నముగా రచింపఁబడినది. శ్రీకృష్ణుని వేణునాదము విన్న యాశ్రమధేను వొకటి పరవశత్వమున క్షీరధారలు ప్రవహింపఁ జేయఁగా వాయువశమున నాక్షీరబిందు వొకటి వేణుగోపాలుని మూతి మీఁదఁ బడుట-యా పుణ్యమువలన నాయావు జన్మాంతరమున సుశీలగా జన్మించి, యన్వర్థనామధేయురా లగుట, విష్ణువు మాయావటువు రూపమున నామెను బరీక్షింపఁ గోరి వచ్చి వేగించి పిండారగించి వరము లిచ్చి పోవుట యీ భాగమందలి కథ. ఈ విందు కథను రచించుటలోఁ గవి మనకుఁ గవిత్వపు విందును మెండుగాఁ బెట్టినాఁడు. ముందు 'కావ్యాపోశనము' మాత్రము చేసి [illegible].

## కథాప్రారంభము

క. హరిమౌళిపతితనిజదు
గ్ధరసోత్కరఫేనకణాకృతపరమసుకృత
స్ఫురణంబున నొక వైష్ణవ
వరునకుఁ దనుజాతయగుచు వసుధం బుట్టెన్.

వ. సుశీలాభిధాన యగునబ్బాల గుణగణ
భాస్వరయై యథోచితకాలంబున,

ఉ. తాళి విభుండు గట్టినది మొదల్
పతిదేవత యా సుశీల పెన్
గోలతనంబునన్ మగఁడు కొట్టినఁ
దిట్టిన రట్టు పెట్టినన్
దాళి దినంబుఁ దచ్చరణతామర
సంబులు గొల్చు......"

కథాప్రారంభముననే కవి మనలను కథ మధ్యలోనికి నెట్టినాఁడు. తెనాలివాని కథాకథనములో ఒక చిత్ర ముండును. కథను ప్రారంభించిన ట్లుండును కాని కథాప్రారంభములోనే మధ్యకథలో నుండును. కథ క్రమపద్ధతిలోఁ జెప్పఁబడక కొంత యాభాస మైన దనిపించును. ఇదేమిటి యని పాఠకులు ప్రశ్నించి కథకు నడ్డకాలు వేయుటకు నవకాశ ముండును. కాని కవి వెంటనే పాఠకునిదృష్టిని మఱొక వైపునకు మరలించి కేంద్రీకరింపఁ జేసి నోరు కట్టి వేయును. నిగమశర్మ, సుశర్మోపాఖ్యానములలోను నింతే. అయితే ప్రారంభములోనే పాఠకునిలోఁగలుగు సందేహాల సంగతి యేమి యందురా? వానికిఁ దగు సమాధానములు కథలోఁ దర్వాత నక్కడక్కడ ముందువెనుకలు కొంత ముడి పెట్టుకొనవలెను. అపుడే తెనాలివాని కథలు సుప్రసన్నము లగుట, అతని నైపుణి వ్యక్తమగుట.

ఈ ఉపాఖ్యానమునకు నాయిక యయిన యబ్బాలను కవి "వైష్ణవవరునకుఁ దనుజాత" "సుశీలాభిధాన" "గుణగణ భాస్వర" అని యొక్క మూఁడుమాటలలోనే పెంచి పెద్ద చేసి పెండ్లి చేసి "రట్టు పెట్టించి"నాడు. మూఁడు పద్యాలలోనే యింతికథను నితర ప్రబంధకవు లెవ్వరును కూర్చి పెట్టుటకు సాహసించి యుండరు. పూర్వసుకృతముచే వైష్ణవజన్మముఁ బడసినసుశీల కిట్టిగతి గలిగెనే యని పాఠకులు మనస్సున నొచ్చుకొందురు. రచనలో నొప్పించి నవ్వించుట తెనాలివాని కొంటెకోణంగితనము, అందుకొఱకే వెంటనే సుశీల గొల్చు ఆచరణతామరసంబులవానిని మన యెదుట నిలుపఁ బెట్టి నిలువెత్తున వర్ణించినాఁడు. అతఁడు

"రూపహీనుఁడు మహాక్రోధనుఁ డతిలోభి
బద్ధమత్సరుఁ డన్యబుద్ధి మాయి
చంచలస్వాంతుండు సకలబంధువిరోధి
బహుళపక్షోత్కీలంపటుఁడు శఠుఁడు
సంతతావిశ్వాససస్యప్రరోహుండు
గర్వపర్వతమస్తకస్థితుండు
కలహాశనుఁడు కుతర్కక్రియాకుశలుండు
సంగతోన్మాదోత్తమాంగకుండు"

ఇవి పూర్వజన్మసుకృతి యైనసుశీలకుఁ గలిగిన భర్త రూపగుణములు! ఇంతకును వాని పేరు పాండిత్యముల ప్రశంస లేదు. వానిని గుఱించి యప్పటిలోఁ గవి చెప్పఁడు. కథ చివర చెప్పును. అప్పటి కతఁ డనామకుఁడే. పే రున్నవానికి నొక్కపేరే. పేరు లేనివానికి నెన్ని పేరులైనను బుట్టుకొని వచ్చును. మన కవి యీతని గర్వప్రఖ్యాతకు పై సీసపుఁ బోతలో నెన్ని పేరులో పోసి పేరులుగాఁ జుట్టినాఁడు. పాత్రల గుణదోషములనుగుఱించి కాని, స్వభావప్రవర్తనలనుగుఱించి కాని తెనాలి కవి చెప్పవలసి వచ్చినపు డపూర్వ మగుపదముల కూర్పు, సమాసఘటన చేసి చమత్కారముగాఁ జెప్పును. గర్వి యను చిన్న చిటికవంటి మాటకు బదులు గర్వపర్వతమస్తకస్థితుఁ డన్నాఁడు. ఉన్మాది యనిన సరిపోవుమాటకు 'సంగతోన్మాదోత్తమాంగకుఁ' డని యేదో స్తుతిగాఁ జెప్పినట్లు చెప్పినాఁడు. ఇదే కావ్యములోనే రెండక్షరాల కాకిని

"యమరాడ్దూతశిఖావతంసము,
చిరప్రాణంబు, దూరప్రియా
గమశంసిస్ఫుటకాకలీకలన
మేకప్రక్రియాపాతవీ
క్షము శిక్షితబలీయ మొక్క
బలిభుగ్రాజంబు"

అనుచు వర్ణించినాఁడు. ఇట్టి పదముల కల్పన, కూర్పు తెనాలివాని కవిత్వములోఁ గొల్ల. "పాండురంగని పదబంధనము"లో నిదొక వైఖరి కాఁబోలు! ఇట్టిచోట్ల నొక్క చమత్కారమే కాదు. అతినిగూఢ మైన

హాస్యము కూడ నుండును. అట్టి హాస్యము నానందించుటకు నా పద్యములను మాటలను కథలో నుండి వేఱు చేసి పరిశీలించుట ముఖ్యము. ఒకప్పుడు రాయల యాస్థానములోనికి వచ్చి యష్టదిగ్గజములను సవాలు చేసిన యుద్దండ పండితు నొకనిని తెనాలివాఁడు 'తిలకాష్ఠ మహిషబంధ ప్రబంధ' ప్రశంసతోఁ బరుగెత్తు నట్లు చేసినాఁడట! కావ్యములోని కొన్ని పదబంధములు కొంతవఱకు నిట్టివే యనిపించును.

కథానాయిక యగుసుశీల

"అగున యేనియు నటువంటిమగనితోడఁ
గాపురము సేయు సతి దొడ్డగరిత యగుచు
గనఁడికోఁతకు నోర్చి లో విసికొనక
ధాత దూఱక తండ్రిసేఁతకు వగవక.

అతిప్రాంశునివేఁడి కోర్చి మనుభాయాదేవి యుంబోలె" తన భర్తతోఁ గాపురము సేయుచుండెనఁట! కావ్యములో సాధారణముగా తెనాలివాఁ డతివర్ణన చేయఁడు. ఒక వస్తువును గాని, విషయమును గాని, బహుళముగా వర్ణించి పాఠకునికి గోచరింపఁజేయఁ బ్రయత్నించుట కన్న స్వల్పముగా సూచించి, పాఠకునిలో భావ చిత్రణకు నవకాశ మిచ్చుట యుత్తమరచనా శిల్పము. 'అతిప్రాంశునివేఁడి కోర్చి మనుభాయాదేవియుంబోలె' అన్న వాక్యముమీద నాయనుకూలదాంపత్యజీవితమును పాఠకు లెంతైనను సాక్షాత్కరింపఁ జేసికొనవచ్చును. ఈ దాంపత్యములో సతీపతుల సరససంభాషణ సున్న. ముక్కుధాన్యములు కొన్ని లెక్కపెట్టి భార్య యిచ్చునపుడే భర్తగారి నోటిముత్యాలు కొన్ని రాలును.

"కొన్ని గొణంగి కొన్నినిసి
కొన్ని తుటారము లాడి మానరా
కన్నిక నిన్ని వ్రాళ్ళ కివి
యున్నని కూటికిఁ బిచ్చపాటి కొ
మ్మన్న మహాప్రసాద మని
హర్షరసోల్లసదాననాబ్జ యై
యన్నులిసాక్షి భర్త యిడి
నన్నియు గైకొను ముక్కుధాన్యముల్"

ఇటువంటి యిల్లాలు సుశీల 'ధాత దూఱక తండ్రిసేఁతకు వగవక' కాపురము సేయుచున్న పతివ్రత. భర్త దరిద్రుఁడు కాదు. కూనిముల్లుడిచి గుమ్ముల కొల్చు పై మిత్తు లూడ్చుడు వస్తైన నుండుఁ గాని "ఎట్టి చుట్టంబేని, యింటి కేతెర రెండవపూటికముఁ దెల్పి యవలఁ జొదుపు" ఇట్టి "వివిధకుటిలాచారచతురుఁ డగుజీవితేశ్వరుని నీశ్వరుంగాఁ దలంచుచుఁ దదుపాసనంబు తనకు నిహపరసిద్ధి సంసూచకంబుగ" నమ్మినది.

ఇట్టి సుశీలను బరీక్షించుటకు విష్ణు వొకనాఁడు కుహనాబటువురూపమున వచ్చినాఁడు. కడపదగ్గర నిలుచుండి కొంత సందడి చేసినాఁడు. గ్రామాంతరాగతుం డగుప్రాణనాథుండు తనుం బిలిచిన ట్లయిన లోనింటినుండి తొంగి చూచి సుశీల యెవ్వరా యని మొగసాలకు రాఁగా వచ్చినవ్యక్తి స్వస్త్యస్తు తే అని యాశీర్వదించినాఁడు. సుశీల కృతనమస్కార యై

సీ. "ఎందుండి రాక? యిం దేతేరఁగత మేమి?
గ్రాసార్థి భావంబు గానవచ్చె"
'వగు' నన్న నట్లేని మొగసాల నుండుఁ డా
యన యూర లేఁడు యామార్ధమునకు
కావింతు నన్నసంస్కారంబు, మీ రార
గింతురు గాని వేగిరమె యనుడు
మాణవకుఁడు పల్కు మగువ నేఁ డేన్నాళ్ళ
నుండియుఁ గుడువఁ గూడొదవకునికి
తే. వేఁడి యగు గాక నోరువ మాఁడు గలిగఁ
బులిసినది గల్గె నన్నంబు పోఁక యంత
యొసఁగి క్షుత్తాప్ప నెసఁ జల్ది మెసవ నైన
పాప ముడిపింపుకొందుఁ దపంబుకలిమి.

ఇది సుశీలాతిథుల సంభాషణ. చలిదితినుట సదాచారము కాదు. "అవరవ" సమాచార"ము. దీని కాయిల్లా లేమనుకొనునో యని ముందుగనే "చల్ది మెసవ నైనపాప ముడిపించుకొందుఁ దపంబుకలిమి" నన్నాఁడు. ఇక్కడఁ బాత్రపోషణపర మైనచమత్కార మొకటి కలదు. ఒక దాసరివాఁడు ప్రొద్దుపొడుపుతో నొకకాపుటిల్లాలి యింటికి వెళ్ళి గుక్కెడుకూటినీళ్లు పోయవమ్మా! నీకు ఆకలి లేకుండఁజేయు మం దిచ్చెద నన్నాఁడట! అట్లగునఁ జలిఁది దిన్నపాపమును బోగొట్టుకొను తపంబుకలిమి కలిగిన యతిథి యా కలిమిచేతనే తనకుఁ గలిగిన కించిత్తు క్షుత్తును బోగొట్టుకోలేఁడా? ఈ యాలోచన సుశీలకు స్ఫురించలేదు. చాల నమాయకపుటిల్లాలు. వాని దైన్యముఁ జూచి యామార్ధకాలమాగలేఁడని "క్షణములోనఁ గావింతు, భుజియించి వలయునెడ లేఁగు' మన్నది.

ఈమె సులభముగాఁ జలిది వడ్డింప దని గ్రహించినాఁడు వటువు. వెంటనే చలిది తినుటకుఁ దనకుఁ గలయోగ్యతలను గుఱించి యుపన్యసించినాఁడు. శ్రోత గమియించు చోట అవరవర్ణసమాచార మైన బ్రాహ్మ్యము చెడదట! 'ఒక యింత మెదు కిన్ని నీళ్లు నొసఁగి ప్రాణరక్ష నెఱపవలెనట!' 'అభ్యాగతః స్వయంవిష్ణు రనఁగ వినవె' అన్నాఁడు. ఈ నుడి యిక్కడఁ జమత్కారపూర్వక మైనది. 'కూటిబీద లోఁడు దప్పిన తెఱంగున నిచ్చటం దడసితి' 'క్షుధాతురాణాం న రుచి ర్న కాల' మన్నాఁడు. ఇన్ని మాటలకును సుశీల సుముఖురాలు కాలేదు. ఇట్టిమాటలవలన లాభము లే దని కొంత ముఖస్తుతికిఁ బూనుకొని నాఁడు. లోకములో ముఖస్తుతులకు మురిసిపోని వా రెవరు? అందులోను స్త్రీలు

"ఎంత భాండశుద్ధి! ఎటువంటి గృహశుద్ధి!
యెట్టి చిత్తశుద్ధి! యిచటఁ జలిది
కూడు దక్కెడఁ బురోడాశమునకు నో
యమ్మ! సాటి వచ్చు......" అన్నాఁడు.

వటువు వేసినపాచిక చక్కగా పాఱినది. తన యిల్లు! తనవంట! తాను చేయునతిథిసత్కారము! సుశీల స్వాతిశయముతోఁ బొంగి పోయినది. తనభర్త లెక్కపెట్టి బిచ్చపాటి యిచ్చు ముక్కధాన్యముల వంటను మఱచి వెంటనే

"తొలుతనే వేఁడినప్పుడు చలిది నీకు
ననఘ! నే నెట్టు లిడుదాన నంటిఁ గాన
యశనశేషస్థితికి సందియంబు వలదు
చాలుఁ జాలదో యనువృథాశంక వలదు"

అని గంభీరముగాఁ బల్కినది. ఈ మాట లనుచుండఁగనే యావటువు "దురదురఁ జని పెనట్టింటఁ గూరుచుండి" నాఁడు. గడుసరివాఁడు. ఆయన మఱి యూరు లేఁడు. సుశీల తనలోఁ దాను వితర్కించుకొనినది. చూడఁబోయిన 'పసిబిడ్డ', 'ఆకటిచే నలయుచున్నాఁడు'. చలిది వడ్డించినఁ దనకుఁ బాపము ముట్టును. "మినుకు (సాళెము) నొకటి యిచ్చిపొమ్మన్న పోవునో పోఁడో" "వంట యగుదాఁక నుండఁడీ వడుగు" ఏమొ "బండిమీఁద పోవుచున్నాడు". "అయిన దయ్యెడుఁ గా కేమి" యని సుశీల 'రారయ్యా' యని కాళ్లుచేతులు కడుగ నిచ్చి, కూర్చుండఁ బెట్టి—

"నీ-రారంబండినప్రాఁతరాజనపు
దివ్యాన్నంబు నొక్కింత వా
ర్ధారాధారితముఁ గుండ యొడ్చి యిడి
యొకో గంభాపలాశంబునన్".

ఇట్లు సవ్యంజనం బైనదధ్యోదనంబు వడ్డించి "ఆరగింపుఁడు, క్షమియింపుఁ డనుచు" ఒక అడుగు అటు పెట్టి తిరిగి చూచినంత మనవాఁడు "సిక్థ మొక్క టేనియుఁ జిక్కనీక మ్రింగి మీఁగులు చూచుచు"న్నాఁడు. అడుగక పోయిన నేయమ్మయుఁ బెట్ట దనుకొన్నాఁడు కాఁబోలు!

"చూడు మీసారి భాండ మోశోభనాంగి!
భిస్సటం బొండెఁ దాఱి తప్పినది యొండె
కలుగు లే కుండ నూడ్చి తె మ్మలఘుజఠర
జాతవేదంబు హెచ్చె నీస్వల్పభుక్తి"

అని ఫిర్యాదు చేసినట్టు పలికినాఁడు. కడచిన రాత్రి సుశీల తన కని వండుకొనినయన్నమును భర్త పల్లియ కేఁగి యుండుటచే భుజింపలేదు. ఆయన్న మున్నది. లే దనుట యెట్లు? ఆ "అభినవౌదనంబును ఆలపాలును వడ్డించినది. ఆకులో వడ్డించినదానిని 'అవలి వారలచేతికి నంది యిచ్చువడువున' మన యతిథి మాయము చేసినాఁడు. "భుజియించి మఱియుఁ దె మ్మని గజిబిజి చేసినాఁడు". దధ్యోదన మైనది. క్షీరాన్న మైనది. ఉన్న దంతయు నూడ్చిపెట్టిన సుశీల యిం కేమి చేయును? హస్తాంబుజములు మొగిడించి

"అన్నం బొండొక లేదు చల్ది
యది వి న్నధ్వశ్రమారూఢ! తె
మ్మన్నం దెచ్చెద సాధుగుప్తములు నవ్యం
బుల్ కజాయంబు లిం
దన్నే నున్నవి శ్రోత్రియట్టికలఁ
గాదే లేచి వార్చుండు శే
గన్నిర్మించెదఁ గూడు గూర
మఱియుం గైకోలు మేల్భుక్తికా".

అని వేఁడుకొన్నది. లేచి వార్చుట యాలస్య మగు నని, యనవసర మని మన యతిథి యభిప్రాయము. అక్కడనే కూర్చుండి "ఓ వనితామతల్లి! ఓ పావనశీల! తైలపరిపక్వము లెన్నియుఁ దెమ్ము కా దనక". వాఁడు కాదని యెందు కనును? "లేవడి యైన భుక్తి గాని" మఱి లేవలే నన్నాఁడు. వాని కడుపులోని కొంత

తిఁగవేసినను "దిగంబడ దాఁక లింతయున్". అది రొంగఁబడుచునే యున్నది.

"అనినన్ వడ్డింపఁ జొచ్చెన్ హరిణ
నయన నిండారు డెందంబులో వే
గన భావిప్రాణనాథాగ్రహసహ
నతితోఁ గమ్మనై కారమై నే
తన వండం బొల్చి చేతం దడవిన
దుముకై తాలుటల్ లేక సద్యో
జనితంబుల్ వోలెఁ జాలం జవు లూదవు
సమత్స్యండికాపూపపంక్తుల్".

ఇట్టి 'సాధుగుప్తముల'ను వడ్డించునపుడు సుశీలకు 'భావిప్రాణనాథాగ్రహము' స్ఫురణకు వచ్చినది. పాఠకులకుఁ గూడ భర్త రాక తర్వాత నీ యన్నపూర్ణమ్మగారి కట్టి శాంతి యగునో యన్న సందేహము కలుగక పోదు; మఱి యీ 'సాధుగుప్తములు' సామాన్యమైనవి కావు. అయినను సుశీల యాతిథేయధర్మమును బాటించి వడ్డించినది. వడ్డించిన దంతయు నా భూసుర కుమారుఁడు నిరవశేషముగా నాహారించినాడు." వటువునకు భోజనము పెట్టుటలో సుశీల యుత్సాహము, తొందర, వటువు గబగబ యామె యిడినభోజనమును భుజించుట సూచితము లగునట్లుగా కవి ఛందము మార్చి స్రగ్ధరావృత్తమును బ్రయోగించినాఁడు. పాఠకునికీ స్రగ్ధరావృత్త పఠనముచే వారిరువురును బడిన తొందర యంతయు వ్యక్తమగును. అపుడు సుశీల 'యిసుమంత లేఁడీ పసిబాలుఁడు బహుభక్ష్యరాసులు మ్రింగినాఁడని' "మాయపుబిడ్డ యీనిసువు మానిసిపుట్టువు కాదు, దేవతానాయకుఁడో, చతుర్ముఖుఁడో, నాభవబంధము లూడ్ప నున్న నారాయణమూర్తియో యెఱుఁగరా దొకయించుకయున్" అని వితర్కించుకొన్నది. అతిథికి నాహారతృప్తి కల్గించుటకా పతివ్రత యగ్నిదేవునిఁ బ్రార్థించినది. వెంటనే పిండివంటలు రాసులు రాసులుగా వచ్చిపడినవి. అపుడా సుశీలయొక్క "నిత్యసత్యశమస్థైర్యౌదార్యసంశుద్ధులం జాలన్ మెచ్చి వటుత్వముం దొలఁగి" విష్ణువు సాక్షాత్కరించి.

"సుచరిత్ర! నేఁడు నీచే
తిచలిఁది భుజియింపఁ జాలఁ దృప్తి యొదవ
బచరణాగా దిమ్ముల మును [వెడిం
రుచియింపదు శబరివిందు ద్రోవదివిందున్"

అని మెచ్చుకొని భర్తయొక్క పూర్వవృత్తాంతమును జెప్పి 'నోము లెల్ల నోచి నూఱేండ్లు బ్రదికి నీ భర్తతోడఁ బరమపదము గను'మని యనుకూలదాంపత్యమును బ్రసాదించి వెళ్లెను.

ఇది యీ కావ్యమందలి సుశీలవిందు కథ. ఈ విందు మెక్కిన విష్ణువునకు శబరివిందు ద్రౌపదివిందు రుచింపలేదఁట! అవును. ఈ కావ్యములోఁ గూడ నీ విందుకథ చదివిన తర్వాత మఱియే కథయూ రుచింపదన్న సాహసము కాదేమొ! సరసరచన, పాత్రోచిత సంభాషణ, హాస్యపోషణ యింతఁ బాఠకుఁ డాస్వాదింపఁ దగినంత యున్నవి.

## ముద్దువడుగ (విజయ) క్ష్మాపతి

క. శ్రీమంతుఁడవై పదనత
సామంతుఁడవై మనీషిసన్నుతవిలస
ద్ధీమంతుఁడవై వర్ధిలు
రైమంతా ముద్దువడుగరాజవతంసా!

కవిహృదయం :

# ఉన్న పాఠాలు : సంస్కరణ

-: * :-

గ్రంథపరిష్కారణము నిజమున కొక కళ యని చెప్పఁదగును. ప్రాచీనలిపిలేఖన పరిజ్ఞానము, చరిత్రజ్ఞానము, కవిహృదయమును బసిపట్టఁగలరసహృదయము, శాస్త్రాదిజన్యజ్ఞానము, వీని నన్నిటి మించి లోకజ్ఞానము మొదలగునవి మెండుగా నుండినఁ గాని ప్రాచీన గ్రంథపరిష్కారణము సాధ్యము కాదు. *నన్నిచోడుని కుమారసంభవమున కున్న వ్రాఁతప్రతి యొక్కటే. అందులో సరి యయినపాఠము దొరకనికారణమున నన్వయము చక్కఁగాఁ గుదురనిపట్టు లనేకములు కలవు. వానిలోఁ గొన్నిటి నిందుఁ జర్చించుచున్నాను. సహృదయులు పరిశీలింతురు గాక !

'గుఱు తెఱిఁగి వస్తుచయమున
కొఱగాదు నాదీపవర్తియును బోలె నిజ
మ్మెఱిఁగి కృతవస్తుసమితికి [తుఁ'.
వఱలఁగ మది తెఱుఁగు విబుధవర్గముఁ దలఁ

౧ ఆ. 26 ప.

మూఁడవపాదమున 'కృతివస్తుసమితికి' నని, నాలుగవపాదమున 'వఱలఁగ మది నొఱగు' నని యుండవలయును.

'నెఱయ రసవంత మగుకృతి కెఱఁగ నేర
దల్పగసకృతి కెఱుగుదు రలుల కెల్లఁ
జెఱకు విడిచిన రసమున కెఱఁగి రాక
పిప్పి కరిగెడునీఁగల పెల్లువోలె.'

౧ ఆ. 30 ప.

ఈ పద్య మిట్లుండవలయును.

'నెఱయ రసవంత మగుకృతి కెఱఁగ నేర
రల్పరసకృతి కెఱఁగుదు రల్పు లెల్లఁ
జెఱకు పిడిచినరసమున కెఱఁగి రాక
పిప్పి కరిగెడునీఁగల పెల్లువోలె.'

మఱియొక పద్యము.

'తజ్ఞానం బెఱుఁగనగుఁ గవితావిశేష
మజ్ఞానం బేమి యెఱుంగంగ నగు సమస్త
కనకవర్ణోత్కర మ్మొరగంట నొరసి
చూచి కా కెఱుఁగ వచ్చునె సుద్దరాత.'

౧ ఆ. 32 ప.

ఈ పద్యమున తొలిపాదమున, రెండవపాదమున, నాలుగవపాదమున గణభంగము. ఈ పద్య మిట్లుండవలయును.

'తద్జ్ఞానం బెఱ్గ నగుఁ గవితావిశేష
మజ్ఞానం బేమి యెఱుఁగంగ నగు సమస్త
కనకవర్ణోత్కర మ్మొరగంట నొరసి
చూచి కా కెఱ్గ వచ్చునె సుద్దరాత.'

'చతురోక్తుల నుతపద బహు
గతుల నలంకారభావకాంతిసార్ద్రో
న్నతిఁ గృతి నతిరసికులు వర
సతిగతి నెఱిఁగింపవలదె సౌభాగ్యమునన్.

౧ ఆ. 39 ప.

ఈ పద్యమున, 'చతురోక్తుల నుతపద బహుగతుల' నని యుండవలయును.

దేవాధీశ ! సమస్తముం బడయు
నుద్దేశించి మున్ భక్తి నీ
దేశున్ సర్వపదార్థమూర్తి నిఖిల
శ్రీరత్నమున్ నీకు నే
నావాహించితి మీరు సన్నిధు
నచర్యాసక్తి మైకొన్న నా
కీ విశ్వోదయకార్యసిద్ధి యగు
వాణీంద్రామరేంద్రార్చితా !

౧ ఆ. 72 ప.

'నీకు నీ నావాహించితి' నని యుండవలయును.

కరిమదగంధమునకు మధు
కరములు పిండుకొని ముసరి కటితటముల భా
సుర మయ్యె నగలటంబులఁ
బరువడి మొగు లెఱఁగి పేరఁబడినవిధ
మునన్.

౧ ఆ. 88 ప.

'ముసరి కటతటముల భాసుర మయ్యె' నని యుండవలయును.

హృదయాహ్లాదములోడఁ బాయక
సదానేకప్రకారంబులన్
మదనాసక్తిఁ బెనంగుచున్న
విలసన్మత్తేభవిక్రీడితం

---

* కుమారసంభవము - వావిళ్లవారి ముద్రణము.

బది దాక్షాయణి జూచి కౌతుక
రతైకాలీనభావాభిలా
షదృగత్యుజ్జ్వలదీధితుల్ వెలిపె
వీణాపాననాబ్జంబుపైన్.

౧ ఆ. 101 ప.

తొలిపాదమున 'సదానైకప్రకారంబులన్' అని యుండవలయును. సదా నైక (న+ఏక) ప్రకారంబులన్ అని, సదాన+ఏక+ప్రకారంబులన్ అని రెండు తెఱఁగులను బదచ్ఛేదము చేసికొనఁ దగును. 'సదానేకప్రకారంబులన్' అని యుండరాదు.

'జానతి పశుపతి నుఱక వి
తానమహారంభుఁ డైనదక్షుం డనున
జ్ఞానికి మునుకొని వచ్చున
మానం బన నమరి సతివిమానము వచ్చెన్'

౨ ఆ. 15 ప.

'విమానం బన నమరి సతివిమానము వచ్చెన్, అని యుండవలయును. వి+మానము - అవమానము అని యర్థము.

హరిపితామహాదివిబుధేశ్వరాది దిగధి
పతుల సురమునిద్విజాల రాఁ బనిచి వరదు
నభవుఁ బరమేశు రావింప వైతి నీవు
దలఁచి పిలిచిన భక్తవత్సలుఁడు గాఁడె.

౨ ఆ. 19 ప.

'తలఁచి పిలిచిన భక్తవత్సలుఁడు రాఁడె' అని యుండవలయును.

'బలిమిఁ బట్టకలిగి పాశు
పతము దొడుగ నేఁటి క
గ్గలిక మాలుకకాయ కత్తు
గల్లు గొనఁగ నేల ము
న్నెలుకవేఁట కుఱుమతిండి
రోల నీకు వలుగఁగాఁ
దలము గలదె నన్నుఁ
బనుపు దక్షుఁ బట్టి తెచ్చెదన్'

౨ ఆ. 59 ప.

'బలిమిఁ బిట్ట కలిగి పాశుపతముఁ దొడుగ నేఁటి' కని యుండవలయును. బసవపురాణములో

'పశుకిఁ దొడ నేల పాశుపతంబు
ఈశుతీశ్వరుఁ డన నెంతటివాడు' అని

కలదు. 'పిచ్చుకమీఁద బ్రహ్మాస్త్రమా' యను సామెతను కూడ నిట ననుసంధించుకొనవలయును.

'తొడరునడుగు లిడుచు దుఃఖాతిశయమునఁ
దల్లడిల్లుచున్నదక్షు ధర్మ
పత్ని వచ్చి పురుషభైక్షంబు వేఁడుచు
జాల దవుల నభవుబ్రోలఁ బడియె.'

'జాలి దవుల నభవుబ్రోలఁ బడియె' నని యుండవలయును. అభవుబ్రోలఁ బడియె ననుటచేఁ 'జాల దవుల' యనుట సంగతము కాఁజాలదు.

లయగ్రాహి. ఉర్వర సలింపఁ గులపర్వతచయం బడరఁ
బర్వి భువనంబు నిధు లౌర్వశిఖి యాడన్.

౨ ఆ. 98 ప.

'ఉర్వర సలింపఁ గులపర్వతచయం బడరఁ
బర్వ భువి నంబునిధు లౌర్వశిఖి యాడన్'
అని యుండవలయును. అందే మూఁడవ పాదము.

'సర్వగుణముఖ్యులును సర్వగుణభూతములు
నార్వ నహిభూషణము లోర్వ దిశలం గం'
అని కలదు. ఇందు 'సర్వగణముఖ్యులును' నని యుండవలయును.

లయహారిణి.

కఱగళము ఘనఘనము
లెఱుఁగనఁగ నుతికలును
గఱడిజులు ద్రిపుదలును
గిఱిడియలఁ బెలై
యుఱుము లన వడిఁ జెలఁగఁ
గొఱనెఁయు దనరుచాలు
మెఱుఁగు లన దళదిశల
మెఱవఁ దలమీఁదన్.

౨ ఆ. 100 ప.

ద్వితీయపాదము 'యుఱుము లన వడిఁ జెలఁగఁ గొఱనెలయుఁ దనరుచులు' నని యుండవలయును.

'మరుఁ బ్రణుతించి మందపవ
మానుఁ దలంచి వసంతుఁ గొల్చి చం
దురునకు మ్రొక్కి మాతవవలోయజ
సంహతిఁ దేల్చి కోరికా
పరభృతచంచరీకశుకబర్హిణపంక్తికిఁ
దృష్టి చేసి సు
స్థిరవిహాధిదేవతలఁ జిత్తమునం
గొనియాడి భక్తితోన్.

౫ ఆ. 147 ప.

(65 వ పుట చూడుఁడు.)

# అలంకార విచారము

శ్రీ కుంటిమద్ది శేషశర్మగారు

నవనీత విలి ప్రముఖుడు
  కువలయ నీలుండు బాలగోపకునకుఁ గే
ల్గవమోడ్చి, యలంకృతులకు
  వివరింతు విమర్శ పూర్వవిజ్ఞుల సరణిన్.
కలదేని గుణంబది పూ
  ర్వులదే; దోషంబు నాది; బుద్ధిని దోష
జ్ఞులుం గమనించి గుణం బౌ
  దలఁ దాల్తురు శివుడు చంద్రుఁ దాల్చినరీతిన్.
గీర్వాణభాష నైకాం
  తర్వాణులు శాస్త్రజలధి తరిచి, నవసుధా
ధూర్వహాసిద్ధాంతముల న
  పూర్వవిధిన్ నిర్ణయించి, పొల్చిరి కృతులై.
ఆ భామహ జగన్నాథ
  మాలంకారిక మండలిన్
ఔదలన్ వంచి సేవించి
  యారంభించెద నీకృతిన్.
ప్రత్ననూత్న కవిబ్రహ్మ
  పరంపరకు నంజలుల్,
ఇందు దావ్యాప్తికై కొందు
  నే వారి కృతి రత్నముల్.
మన్నింతు రంచు భావింతుం
  బ్రాగర్వాక్పండితోత్తముల్,
యల్లక్ష్య లక్షణౌఘంబు
  న్యక్కృతంబగు నీ కృతిన్.
జిజ్ఞాసు జ్ఞాన విస్ఫూర్తి
  చికీర్షా క్లృప్త చిత్తతన్
గాని, పాండిత్య గర్వానఁ
  గాదు తత్కార్య దూవణల్.
"స్పర్ధచేనగు విద్యాభి
  వర్ధనం"బని చెప్పుటన్,
అభినందింప మద్యత్న
  మ్మింతు రసికౌఘముల్.
సంతసింతు నితాంతంబు
  సంఖ్యావంతులు దెప్పినన్;
పండితంమన్యు లాగోపింప
  కుందు రిట దోషముల్.
ప్రచండతర వైదగ్ధ్య
  పండితోత్తమ శోభి శ్రీ
వేంకటేశ్వర గీర్వాణ
  విద్యానిలయ శిష్యుడన్.
ప్రఖ్యాత పండిత శ్రీని
  వాసాచార్యుల పౌత్రుడన్
శ్రీ కుంటిమద్ది పౌరుండ
  శేషశర్మాభిధానుడన్.

* * *

ఇందు విచారణీయము కావ్యాలంకార వర్గము. కనుక తొలుత కావ్యస్వరూపము సోదాహరణముగ నిరూపింతును.

"అందమైన యర్థమందించు శబ్దంబు కావ్యము. (అనఁగఁ బరగు.)"

శబ్దము "ధ్వన్యాత్మకము, వర్ణాత్మకము" అని ద్వివిధము. భేరీ మృదంగాదుల మ్రోత ధ్వన్యాత్మకము. మనుష్యులాడుమాటలు వర్ణాత్మక శబ్దము. ఇట్టి వర్ణాత్మకమగు ప్రతి శబ్దమునకును ఒక యర్థముండును. ఆ శబ్దము విన్నంతనే ఆ యర్థము వినువారికి గోచరించుచుండును.

"కమలము" అన్న పదమును విన్న వెంటనే, బాలభానుని కిరణములతో వికసించు స్వభావము గల, మెత్తని రేకులతో సొబగు మీరు, మకరంద తుందిలమగు పువ్వు మనోవీథిని గోచరించును. "కమలము"ను పదమునకును పై పదార్థమునకునూ ఎడతెగని సంబంధమొకటి యుండవలయును. దానినే నైయాయికులు, "ఈశ్వర సంకేత"మనిరి. అదియే శక్తి. దానికే, "అభిధ" అను నామాంతరము.

ఈ శబ్దార్థ సంబంధ సామాన్యమును "వ్యాపారము"ని వ్యవహరింతురు. పై అభిధా వ్యాపారముచేత అనుస్యూతముగ లోకవాడుక వల్ల సాక్షాత్సంకేతితమైన యర్థమును బోధించు శబ్దము వాచకము. బోధింపబడు నర్థము వాచ్యము.

ఈ యభిధ, "రూఢి, యోగము, యోగరూఢి", అని ముత్త్రివిధము.

"ముద్దన్న, రామప్ప" అను పదములు ఆయావ్యక్తులయందు స్థిరమై, అవయవార్థ

నపేక్షితముగ తదర్థబోధకము లగుచున్నవి. ఇందలి శక్తి రూఢి.

“వంటవాడు, ఈతగాడు” మొదలైన పదములు అవయవశక్తి గలవియై అర్థబోధకములు గాన ఇందలి శక్తి యోగము.

“రేవెలుగు”=చంద్రుడు. రాత్రిప్రకాశించు నక్షత్రములు, మెరుపు దీపములూ ఉన్నా చంద్రునే బోధించు శక్తి యోగరూఢి.

ఈ మువ్విధమైన అభిధావ్యాపారమువల్ల తెలియనగు నర్థములు అభిధేయములు.

“వ్రాతయందు కుశలుడు; మా కితడను కూలుడు,” అనుచో, “కుశల, అనుకూల” పదములకు “దర్భలు కోయువాడు, తీరము వెంట నుండువాడు” అను అర్థము లభిధేయములు. కాని అవి యిందు పొసగవు. కనుక వాచ్యార్థమునకు బాధకలిగినది. కుశలు డన్నచోట దర్భలుకోయు వానికి సంబంధించినది నేర్పరి తనము. హెచ్చరిక కలిగి కడు నేర్పుతో గాని కోయకున్న దర్భలవల్ల చేతులు తెగును. కనుక, కుశలు డనుటకు నేర్పరి యని యర్థము. కుశల పదము, ముఖ్యార్థబాధకలిగి ముఖ్యార్థ సంబంధముగల అన్యార్థమును రూఢివల్ల ప్రతిపాదించుచున్నది. అటులనే అనుకూల పదము, “ఒద్దికగల వాడు” అని.

ఇందలి వ్యాపారము ‘లక్షణ’. అదియు ‘నిరూఢలక్షణ.’

“ప్రభు మడిచిన యాంగ్లశ్యని
కలకల వీ డెల్ల నవ్వ కిట్లెలు మోసెన్.”

అనుచో, వీడు=పట్టణము. అది నవ్వుట బాధితము. అట్లే

“బాజారేతిరిగిచూచి ఫక్కున నవ్వెన్.”

అన్నప్పుడును, “అందలి జనులు” అని లక్ష్యార్థము. ఇది పూర్వమువలె రూఢివల్ల నేర్పడలేదు. “ఊరిలోని వారు, బజారులోని వారు, ఆబాల వృద్ధము, ఒక్కరిని విడువక అందరు పరిహసించిరి; నవ్విరి.” అని అభిప్రాయప్రయోజనముగ ఇచ్చట లక్షణా ప్రవృత్తి. ఇది “సప్రయోజన లక్షణ” అర్థము లక్ష్యము.

“భాను డస్తమించెను.” అనిన, “ప్రొద్దుమునిగె” నని వాచ్యార్థము తెలియుచుండ, ఆయా ప్రకరణానుగుణముగ, వటువునకు “సంధ్యవార్చు”మని, వ్యాపారికి “అంగడి కట్టిపెట్టు”మని, ఆలగాపరికి “లేదూడలఁ గట్టివేయు”మని, నవోఢకు “ప్రియుడు రాబోవును. అలంకరించుకొను”మని పొందదగు నర్థములు ప్రతీయమానము లగుచున్నవి. ఇందు పదముల కాయా యర్థములయందు సంకేతములేదు. కాన అభిధగాదు. ముఖ్యార్థమునకు బాధలేదు. కనుక లక్షణ కవకాశములేదు. అందువల్ల నిచ్చటి వ్యాపారము “వ్యంజన.” అర్థము వ్యంగ్యము.

ఇంతకూ, శబ్దము :-వాచకము, లక్షకము, వ్యంజకము; అర్థము :-వాచ్యము, లక్ష్యము, వ్యంగ్యము; వ్యాపారము :-అభిధ, లక్షణ, వ్యంజన; అని త్రివిధములని ఫలితార్థము.

“అందు వాచక లక్షక వ్యంజకంబు
లనగ శబ్ద ప్రపంచంబు వినుతికెక్కు
త్రివిధమై యర్థజాతంబు తేజరిల్లు
నవని వాచ్యంబు, లక్ష్యంబు, వ్యంగ్యమనగ.
శబ్దవృత్తులు నభిధ లక్షణయనంగ
వ్యంజన యనంగఁ బెనుపొందు : నందు నభిధ
సతతసంకేతి తార్థ గోచర సుశబ్ద
ధామమై యోగరూఢి భేదములఁ జెలగు.”

అని కావ్యాలంకార సంగ్రహము.

పై మూడింట నే వ్యాపారము చేతనైనను, “అందమైన”—లోకోత్తర చమత్కారజనకమైన, “అర్థమును,” “అందించు”—ప్రతిపాదించు, శబ్దము కావ్యము అనబరగును.

“నీకు కొడుకుపుట్టెను,” “నాపగవాడు మడిసెను.” అనునవి ఆయా వ్యక్తులకు కొంత ఆనందమును గలిగించినను, లోకోత్తర చమత్కార జనకములు గావు. కాన నవి కావ్యపద వాచ్యములుగావు. మరికొందరు :

“వివిధగుణము లలంకృతుల్ వెలయఁగల్గి
యరయ దోసములేని శబ్దార్థములను
గద్య పద్యాత్మకంబగు కావ్యమనుచు
పల్కుదురు కావ్య విదులైన ప్రాజ్ఞు లెల్ల”

అని, (ఆంధ్రప్రతాపరుద్ర యశోభూషణము.)

“విగతదోషంబులును గుణానిత్వము లధిక
లసదలంకార భావోప లక్షితములు
నైనశబ్దార్థములు కావ్య మనఁజెలంగు”

అని (కావ్యాలంకార సంగ్రహము) కావ్యలక్షణమును నిర్ణయించిరి. ఇందు, “శబ్దార్థములు కావ్యము” అనుటను కొంత విచారింతము.

“కావ్యమును గట్టిగ చదువుచున్నాడు,

కావ్యమునుండి అర్థము తెలియుచున్నది. కావ్యము వింటినికాని, అర్థము తెలియలేదు'' ఇత్యాది లోకసాధారణ వ్యవహారములవల్ల, "శబ్దవిశేషమే కావ్య''మని, "శబ్దార్థములు కలిసి కావ్యముకాద''ని విశదమగుచున్నది.

"అట్లు గాదు. కావ్యపదమునకు శబ్దార్థముల రెండింటియందును శక్తి. పై వాక్యముల యందు ముఖ్యార్థమునకు బాధ యేర్పడినందున, లక్షణా వ్యాపారమువల్ల, ఒక్క శబ్దమే అర్థము.'' అంటే:

"శబ్దార్థములు రెండునూ కావ్యము.'' అనుటకు తగిన ప్రబల ప్రమాణముండేనేని, పై లోక వ్యవహారములయందు లక్షణ అంగీకరింప వచ్చునై యుండెడిది. అదియే కానరాదు.

మరి, "కావ్యప్రధానలక్షణము చమత్కారము గలిగించుట గదా! అది శబ్దార్థముల రెండింటనూ సమానము. కాన రెండూ కావ్యమే.'' అంటే:

రాగాలాపనయూ చమత్కార జనకమే. నాట్యాంగము లన్నియూ నట్టివే. కనుక నవియూ కావ్యములే కావలసియుండును. అదీగాక, "శబ్దార్థములు కావ్యము.'' అనిన, రెండునూచేరి కావ్యమా? లేక, ప్రత్యేకమా? చేరియే యన్న, పద్యవాక్యము కావ్యముకాక పోవచ్చును. ప్రత్యేకమన్న ఒక్క పద్యము నందే రెండు కావ్యము లేర్పడ వలసియుండును. కాన శబ్దార్థములు రెండును కావ్యమనుట తగదు.

"భాను డస్తమించె'' ననుటయందు, గుణములులేవు. అలంకారములునూ అంతే. ఐనా అదికావ్యమే. రమణీయములైన అనేకార్థములు ప్రకరణానుసారము స్ఫురించుట ముందు గమనించితిమి. కాన నిది కావ్యము కాదనరాదు. పట్టుదల "కిది కావ్యము కాద''ంటే, ప్రతి దానినీ అటులనే నిషేధింపవచ్చును.

"దుష్టకావ్యము'' అన్నప్పుడు, దోషమున్నను కావ్యపద వ్యవహారమునకు బాధ కనిపించుటలేదు. అదీగాక,

"మేను శబ్దార్థములు; మరి మేటివ్యంగ్య
మగును జీవిత; ముపమాదు లగును హార
ముఖ్యభూషణములు; శ్లేషమున్నుగాఁ
దనరు గుణములు శౌర్యాదులనగ నొప్పు;
నాత్మకాధిక్యమును గూర్చునట్టి వగుట.''

(ఆంధ్రప్రతాపరుద్ర యశోభూషణము.)

"తనువగు శబ్దార్థంబులు;
ధ్వనిజీవ; మలంక్రియావితానము సొమ్ముల్;
తనరుగుణంబులు గుణములు
ఘనవృత్తులు వృత్తులౌర కావ్యేందిరకున్!''

(కావ్యాలంకారసంగ్రహము.)

అన్నందున, శౌర్యాదులవలె నాత్మధర్మములగు గుణములను, హారాదులకైవడి ఆహార్యభూషణములగు నలంకారములను శరీరైకదేశములుగ నంగీకరింపవలనుగాదు. అందుచేత, అదోషసగుణ సాలంకార శబ్దార్థ యుగలమును కావ్యమనుట ఉచితముగాదు.

"రసవత్తు కావ్యము.'' అనుటయు పాడిగాదు. మహాకవులచే కావ్యముగ నిర్ణయింపఁబడిన వస్త్వలంకార ధ్వని కావ్యములయందు కావ్యలక్షణము ప్రసరింపక అవ్యాప్తమగును. కనుక,

"అందమైన యర్థమందించు శబ్దంబు
కావ్య మనఁగఁబరగు : కావ్యమునకు
ఒప్పు నాల్గు తెరగు లుత్తమోత్తమ ముత్త
మంబు మధ్యమాధమములును—''

ఉత్తమోత్తమము, ఉత్తమము, మధ్యమము అధమము అని కావ్యభేదములు నాలుగు.

"......................ఎందు
అప్రధానంబులైన శబ్దార్థములను
వ్యక్తమగు చారుతమమర్థ మాద్య మదియ.''

ఎందు శబ్దార్థములసౌందర్యమునకన్న వ్యంజనావ్యాపారవేద్యమగు నర్థము లోకోత్తరానందకారియో అది ఉత్తమోత్తమ కావ్యము.

చారుతమ మనువిశేషణము గూఢవ్యంగ్య, స్ఫుటవ్యంగ్యక కావ్యములఁ బోనాడుటకు. అందు వ్యంగ్యము రమణీయముగాదు. ఉత్తమ మధ్యమ కావ్యములయందు వ్యంగార్థములు రమణీయములేయైనను, అవి శబ్దార్థప్రాధాన్యము గలవి గాన ఉత్తమోత్తమ కావ్యస్థానమునకెక్కఁజాలవు. వానిఁ దొలగించుటకు, "అప్రధానంబులైన'' అను విశేషణము.

(సశేషము)

# రసరామణీయకం

## శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు



అన్ని వాఙ్మయములందలి ప్రతి కావ్యమునకును పరమ ప్రయోజనము రసము. రసవిలసితము కాని కావ్యమునకు వేద, పురాణ వైలక్షణ్యము, కాంతాసమ్మితత్వము కుదురవు. అట్టి కావ్యము కావ్యానుకరణమగును; కాని కావ్యము కాజాలదు. ఈ సిద్ధాంతము కావ్యవాఙ్మయ మారంభమయిన నాటనుండియు ననుస్యూతముగ వచ్చుచున్నది.

ఆంధ్రవాఙ్మయమున రసతత్త్వ మరయుటకు ముందు దన్మూలమగు సంస్కృతమునందలి దాని తత్త్వమును పరిశీలింపగలసియున్నది. నవీనులగు సంస్కృతాలంకారికులు కావ్యమున రసమే ప్రధానమని చెప్పియున్నారు. ప్రాచీనాలంకారికులు విభిన్నములగు వానికి ప్రాధాన్యము నొసగియున్నారు. భరతుడు నాట్యము, భామహుడు దండి ఉద్భటుడు అలంకారములు, వామనుడు గుణములు, ఆనందవర్ధనాచార్యుడు ధ్వని కావ్యమున ప్రధానములని చెప్పినారు. కుంతకుడు వక్రోక్తిని, మహిమభట్టనుమితిని, క్షేమేంద్రుఁ డౌచిత్యమును కావ్యాత్మలుగ గ్రహించినారు. పయి వారి మతములు విభిన్నము లయినను ప్రధానమగు రసమును మాత్రము వారు, తాము ప్రధానము లని యనుకొనినవానియందే స్వీకరించిరి. నాట్యము ప్రధానమనిన భరతముని మతమున రసము నాట్యస్వరూపము.[1] అలంకార ప్రాధాన్యమునంగీకరించిన భామహ, దండ్యాచార్యుల మతమున రసమలంకారములందే చేర్పఁబడినది.[2] గుణప్రాధాన్యవాదియగు వామనుని మతమున రసము లన్నియును కాంతిగుణమునందంతర్భవింపఁ జేయఁబడినవి.[3] ఉద్భటుడు రసమును అలంకారముగనే చెప్పినాడు. కావ్యమునకు ధ్వనియే ఆత్మయని నిర్వచించిన యానందవర్ధనాచార్యులు రసము ప్రధానమగు ధ్వనియని నిర్వచించెను;[4] ధ్వన్యాలోకవ్యాఖ్యాతయగు నభినవగుప్తులు రసధ్వని ప్రాధాన్యమును చక్కగ వివరించిరి.[5] అనుమితివాదియగు మహిమభట్టు 'రసము కావ్యమున కాత్మ యగుటలో నెవ్వరికిని విప్రతిపత్తిలేదని' స్పష్టముగఁ జెప్పియున్నాఁడు. కుంతకుఁడు రసమును వక్రోక్తియందే యిమిడ్చెను.[6] క్షేమేంద్రుఁడు రసమును కావ్యమునఁ బ్రధానమని, రసపరమగు కావ్యమున నౌచిత్యము తప్పక యుండవలెనని చెప్పియున్నాఁడు. మమ్మటాదులానందవర్ధనుని మతమునే యనుసరించిరి. ప్రాచీనులలో రుద్రటుఁడు, నవీనులలో సాహిత్యదర్పణకారుఁడు రసమునకే ఎక్కువ ప్రాముఖ్యము నొసంగిరి. రుద్రటుఁడు తక్కినవారివలె రసమును వేఱొక కావ్యాంగమునం దిమిడింపక ప్రత్యేకముగనే కావ్యాత్మగ 'వాక్యం రసాత్మకం కావ్య'మ్మని చెప్పినాఁడు. అతని మతమున వస్త్వలంకారములు వ్యంగ్యము లయినను కావ్యాత్మలు కాజాలవు.

---

1. నాట్యం చ రస ఏవేతుత్యుక్తప్రాయమ్. [లోచన: పు- 182]
2. రసవద్దర్శిత స్పష్ట శృంగారాది రసం... [కావ్యాలం: 3-6]
   ...రస వద్రసపేశలమ్. [కావ్యాదర్శ: ద్వితీ]
3. దీప్త రసత్వం కాన్తిః.
   దీప్తా రసాః శృంగారాదయో యస్యసః, తస్య భావః, దీప్తరసత్వమ్, కాన్తిః. యథా-
   'ప్రేయాన్ సాయ ముపాగతః—' ఇత్యాది. ఏవంరసాన్తరేష్వప్యుదాహరణీయమ్.
   [కా. సూ. వృత్తి.]
4. కావ్యస్యాత్మా ధ్వనిః, (పు. 2.) కావ్యస్యాత్మా స ఏవార్థః. (పు. 26)
   సఏవేతి. ప్రతీయమాన మాత్రేఽపి ప్రక్రాన్తే తృతీయ ఏవ రసాదిధ్వనిరితి మన్తవ్యమ్.
   [ధ్వన్యాలోకః, సలోచనః.]
5. కావ్యస్యాత్మని సంజ్ఞని రసాదిరూపే నకస్యచి ద్విమతిః.
6. అలంకారా స్త్వలంకారాః గుణా ఏవ గుణాః పునః,
   ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్. [ఔచిత్య: 1.]

ఆంధ్రాలంకారికులు నవీనసంస్కృతాలంకారికుల మతము తీసికొనుటచే నాంధ్రకావ్యములలో రసమునకే ప్రాధాన్యముండవలెనని తన్మతమని చెప్పవలెను. ఆంధ్రశబ్ద చింతామణి యందు 'సారాగ్ర్యా రసవృత్తిః' అని, 'సాధ్యో హి రసో యథాయథం కవిభిః' అని పయి యంశమే తెలుపఁబడినది. నన్నకోట పెద్దయ కవి 'భావరసప్రసంగమునఁ బర్వ(ఁ)నలంకృతి లక్షణంబు' అనియు; మూర్తికవియు 'అసదృశ రసప్రధాన శబ్దార్థములును' అని పయి యభిప్రాయమునే సూచించిరి. అప్పకవి చింతామణి సూత్రముల నాంధ్రీకరించుచు, 'రసమే కావ్యమునఁ బ్రధాన'మని నొక్కి చెప్పినాఁడు.[1] పెద్దయయు, అప్పకవియును వేఱొకయెడ వామను ననుసరించి 'అఖిలకావ్యములకు రీతు లాత్మ' లని చెప్పియున్నను, ప్రధానముగ వారు తేల్చినది రసప్రాధాన్యసిద్ధాంతమే యనవలెను.

సంస్కృతాలంకార వాఙ్మయమున కాది గ్రంథమగు భరతనాట్యశాస్త్రమునందే రసస్వరూప మొకమాదిరిగ నిర్వచింపఁబడినది. 'విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రసనిష్పత్తిః' అని నాట్యశాస్త్రమందలి రస నిర్వచన సూత్రము. ఈ సూత్రముపయి ఆధారపడి అనేకులగు నాలంకారికులు పెక్కురీతుల సమన్వయములకు దొరకొని, తమ కిచ్చవచ్చిన మతములను నిరూపింపసాగిరి. కొందరు పయి సూత్రమునకు విచిత్రముగను రసనిర్వచన మొనర్చిరి. సూత్రముపయి రసనిర్వచనముంగూర్చి పదునొకండు మతములు బయలువెడలినవి. అందు ఎనిమిది మాత్రము సూత్రమున కనుగుణములు : ఆయెనిమిదింటనుగూడ ముఖ్యమైనవి నాలుగే ! వానినే చాలమంది వివరించి తక్కిన వానిని విడిచిరి. రసగంగాధరమున మాత్రమన్ని మతముల తత్త్వము వివరింపఁ బడినది.

రసనిర్వచనమునఁ బ్రసిద్ధములగు నా నాలుగు మతములు నివి. 1. భట్టలొల్లటుని యుత్పత్తి వాదము; 2. శ్రీశంకుకుని యనుమితివాదము; 3. భట్టనాయకుని భుక్తివాదము; 4. అభినవగుప్తుని వ్యక్తివాదము. ఇం దభినవగుప్తాచార్యుల వాదమునకు సర్వాలంకారికప్రామాణికుండగు నానందవర్ధనాచార్యుల ధ్వనివాదము మూలము; సహృదయ హృదయావర్జకమును, యుక్తియుక్తమునగు వ్యక్తివాదమే యందరి చేత నామోదింపఁబడినది. దానికిఁ గారణములు మున్ముందు చూపఁబడును.

విభావము, అనుభావము, వ్యభిచారిభావము నను మూఁడు విధములగు భావముల సంయోగమును పొంది, పరిపోషింపఁబడిన స్థాయిభావమే రసమగునని యించుమించుగ నన్ని మతముల వారు నంగీకరించియున్నారు. స్థాయిభావము రసముగ మాఱునపుడు—లేనిస్థాయి యుత్పన్నమగుటచే రసముత్పన్నమగుననియు, అనుమితములగు స్థాయిభావములంబట్టి రసమును గ్రాహింపవలెననియు, సత్త్వోద్రేకము వలన రసము సామాజికులచే ననుభవింపఁ బడుననియు, సహృదయహృదయములందు వాసనారూపమున నున్న స్థాయిభావమే విభావాదులచే వ్యక్తమయి రసమగుననియు, క్రమముగ భట్టలొల్లట - శ్రీశంకుక-భట్టనాయక, అభినవగుప్తుల మతసారములు. స్థాయియే రసముగ మాఱుననుటలో ఏ రొవ్వరికిని విప్రతిపత్తిలేదు. భరతముని స్థాయిభావములే రసములుగ మాఱునని స్పష్టముగఁ జెప్పియున్నాఁడు.[2] ఆలంకారికులందఱు నించుమించుగ ఈ యభిప్రాయమునే తీసికొనిరి. వారి ననుసరించిన యాంధ్ర

1. గీ. తగరసాశ్రయ వాక్య సంతతులఁ గూర్చి,
కావ్యము రచించు వారె పో కవులనంగ!
నట్లు గావున నేభాషనైనఁ గవిత,
పలుకు వారికి సాధింపవలయు రసము. [1 ఆ.]

2. అథ స్థాయిభావాన్ రసత్వ ముపనేష్యామః. [నాట్య: 6 అ.]

లాక్షణికులు నట్లే వివరించిరి. [1]స్థాయిభావాతిరిక్తముగ రసమను నొక అపూర్వపదార్థము లేదని పయివారి మతము.

విభావము లనఁగా రసాభివ్యక్తి కనుగుణము లగు కారణములు; అవి యాలంబనములనియు, నుద్దీపనములనియు రెండు విధములు. ఏవి లేనిచో రసమభివ్యక్తము కాదో; అవి ఆలంబన కారణములు; 'రసమునకు సమవాయకారణమాలంబన విభావ'మని సంస్కృతాలంకారికు లందురు. నాయకుఁడు, నాయిక ఆలంబన కారణములు. స్థాయి వ్యక్తమగుటకు సహకారు లగునవి ఉద్దీపనకారణములు. [2] అయ్యవి ఆలంబనగుణము, చేష్ట, అలంకారము, తటస్థము నని నాలుగు విధములు. అయ్యవి యౌవనము, సౌందర్యము, హావ, భావాదులు, హారాంగదాదులు, మలయానిలము, చంద్రుఁడు మొదలగునవి యగుచుండును. శరీరమునఁబుట్టిన వాల్చూపు మొదలగు కార్యము లనుభావములు. [3]పరుల సుఖదుఃఖములచేఁ దనకు సుఖదుఃఖములు కల్గునటుల భావించెడి సత్త్వమువలనఁ బుట్టునవి సాత్త్వికభావములు. [4] ఈ భావములు అనుభావాభిన్నములని చాలమంది తలంపు. ప్రాచీనాలంకారికులు వీనిని వేఱుగ లెక్కింపక అనుభావములలోనే చేర్చియున్నారు. నాట్యశాస్త్రమునందలి రససూత్రములోని 'అనుభావ'ముచే పయి ఉభయవిధములగు భావములను గ్రహింపవలెను. (కంపము, కన్నీరు, గద్గదతము. సాత్త్వికములు) సముద్రమునందలి తరంగములవలెఁ బుట్టుచు, విలీనములు కావలసినపుడు విలీనములగుచు, మరలఁ బుట్టుచు, చరించుచు, [5] రసాభివ్యక్తికి సహకారమొనరించునవి వ్యభిచారిభావములు; ఇవియే సంచారిభావములనియుఁ జెప్పఁబడును. ఎన్ని నదులు సముద్రమునఁ గలిసినను దాని రూపమును మార్పుచేయని రీతిని సజాతీయములుకాని, విజాతీయములుకాని యగు భావములచే ఏమియు మార్పుచెందని (స్థిరమగు) భావమే స్థాయిభావము. [6] ఈ స్థాయిభావము లెనిమిదని కొందఱును, తొమ్మిదని కొందఱును, పదియని కొందఱును, వానికి సంఖ్యానియమము లేదని, భావము లెన్నియున్నలో అన్నియు స్థాయిభావములు కావచ్చునని కొందఱును చెప్పుచున్నారు. కాని వీని ననుసరించిన రసములు తొమ్మిదని చాలమంది వివరించుటచే స్థాయిభావములు తొమ్మిదియని చెప్పవచ్చును. అవి రతి-హాసము-శోకము మొదలగునవి.

---

1. క. ఉక్తవిభావాదులచే వ్యక్తనవస్థాయిరూప భావంబులు సు
వ్యక్తములై నిజగుణ సంసక్తములై రసములన రసత్వము నొందున్ [చూడా : 2-4]
క. పులకండంబులు కలిపిన నలువగుసలిలము రసాయనంబగు పగిదిన్
లలిత విభావాదులచే నలఘుతరస్థాయిభావ మలరున్ రసమై. [నరస: 3-4]
2. క. ఈ రసమునకు త్పాదనకారణము విభావ మనఁగఁ గల దది ద్వివిధం
బై రంజిలు నాలంబన, మారయ నుద్దీపనంబు ననఁగ ధరిత్రిన్.
క. వనితయుఁ బతియును నాలంబనమగు; నుద్దీపనంబు ప్రాయంబును సా
మ్మ్యను శేషయు మదనాదులు, ననఁదగు...... [నరస: 3-27, 28.]
3. కార్యభూతో ౽ను భావః స్యాత్కటాక్షాదిః శరీరజః. [ప్రతాప :-రస]
...ప్రారూఢకటాక్షాదిక మారయ ననుభావమయ్యె. [నరస : 3-34]
4. క. పరగత సుఖదుఃఖాదుల నరయఁగ భావించి యట్లు యలరుట సత్త్వ
స్ఫురణము, తద్భవభావము లరయఁగ సాత్త్వికములయ్యె— [నరస : 3-36]
5. క. అహరహము రసోత్పత్తికి సహాయభావంబు లెలమిసంచారులగున్. [నరస: 3-47.
(విశేషేణ ఆసమన్తాత్ చరంతీతి వ్యభిచారిణః. (వి+అ+అభి+చారిణః)
6. విరుద్ధైరవిరుద్ధైర్వా భావై ర్విచ్ఛిద్యతే న యః,
ఆత్మభావం నయత్యాశు స స్థాయీ... [దశరూపకమ్ : 4.[
తే. గరిమనదు లెన్ని గలిసినఁ గప్పుకొనుచు, జలధి గనుపట్టురీతి సంచారిభావ
సంచయము లెన్ని గలిసిన మించనీక, తాన కనుపట్టు భావంబు స్థాయిదలఁప.
[నరస : 3-5]

పయి స్థాయి భావములకుఁ బుష్కలమగు విభావాది సామగ్రి లభించినపుడే అవి యథార్థములగు స్థాయిభావములు. అట్లుకానిచో-అనఁగా-విభావాది సామగ్రి వానికిఁ జాల దక్కువయగుచో స్థాయిత్వముపోవును. అపుడవి వ్యభిచారిభావములే అగును. [1] రసమును బాగుగఁ బోషింపఁ దలఁచిన వారు విభావాదులను సముచితమగునట్లు నిబంధింపవలసియున్నది.

పయిస్థాయిభావములు చిత్తవృత్తి విశేషములు; (జ్ఞానవిశేషములు;) అవి క్రొత్తగాఁ బుట్టునవి కావు. తగిన యుద్బోధము కలిగినచో అవి వ్యక్తములగును; లేని యెడలఁగావు. ఆ భావము లా రీతిని లేనివారికి రసాస్వాదము కలుగఁజాలదు. కావున సహృదయులకే గాని ఇతరులకు రసాస్వాద యోగ్యతలేదు. వాసనారూపమగు భావము అందఱి యెడఁదల నుండి తీరవలెనని నియమములేదు.

రససూత్రమున విభావానుభావ వ్యభిచారులే చెప్పఁబడినవి; మూలములోలేని సాత్త్విక, స్థాయిభావములను చెప్పుట మూల విరుద్ధమని కొందఱు సందేహింపవచ్చును. కాని అట్టి సందేహమున కవకాశము లేదు.

పయిరససూత్రము ననుసరించి ప్రాచీనాలంకారికులు పెక్కురు-అనఁగా ధ్వనికారుఁడు, అభినవగుప్తాచార్యులు, మమ్మటాచార్యులు మొదలగువారు, సాత్త్వికభావములను వేఱుగఁజెప్పలేదు. ధనంజయుఁడు, ధనికుఁడు, విద్యానాథుఁడు మొదలగు కొందఱు సాత్త్వికభావములను వేఱుగ లెక్కించిరి. పెద్దయ, మూర్తికవి విద్యానాథుని ప్రతాపరుద్రీయ మార్గమునే అనుసరించినారు. [2] ఇదివఱకు జెప్పఁబడిన లక్షణములను బట్టి అనుభావములు, సాత్త్విక భావములుకూడ కార్యములే యని తెలియుచున్నది. అనుభావములు శరీరమునఁ బుట్టునవి; సాత్త్వికభావము లంతఃకరణోత్పన్నములు. కార్యములు మొదట సాత్త్వికావస్థ యందుండి తరువాత ననుభావములుగ మాఱును. కావున రెండు నభిన్నములే యను నభిప్రాయమున ప్రాచీనులు వానిని వేర్వేఱుగఁ జేర్కొనలేదు. [3] భరతముని యెనిమిది స్థాయి భావములను, ఎనిమిది అనుభావములను, ముప్పది మూఁడు సంచారిభావములను - మొత్తముపయి నలుబదితొమ్మిది భావములను పేర్కొనెను. ప్రాథమికావస్థాభేదములను నిర్దేశింపఁ దలఁచిన కొందఱు వీనిని వేర్వేఱుగఁ జూపిరి. కావున ఏమతమునకును భంగము కలుగదు.

లోకమునందు కారణములు, కార్యములు, సహకారి కారణములు అగునవియే కావ్యనాట్యములయందు వరుసగ విభావములు, అనుభావములు, వ్యభిచారి భావములు ననిచెప్పఁబడుచున్నవి. ఏదయిన నాటకప్రదర్శనమును చూచునపుడుకాని, ఏదైన కావ్యమును వినునపుడుకాని వాని తత్త్వమును బాగుగ గుర్తించి, అనుభవమునకుఁ దెచ్చికొను సుముఖులగు సహృదయులకు, విభావాది భావములు తొలుత అవి ప్రత్యేక వ్యక్తి సంబద్ధములయినను, వ్యక్తి సంబంధమును విడిచి సర్వసాధారణములుగ గోచరించును. ఇట్టి సామాన్యజ్ఞానము కావ్యములందు కంటె నాటకములందే వేగముగఁగల్గును. కావున మనమొక నాటకమునే దృష్టాంతముగఁ

---

1. రత్యాదయః స్థాయిభావాః స్యుర్భూయిష్ఠ విభావజాః
స్తోకైర్విభావై రుద్దిష్టా స్తఏవ వ్యభిచారిణః. [సంగీత రత్నాకరః]

2. విభావైరనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః
ఆనీయమానః స్వాదుత్వం స్థాయీభావో రసఃస్మృతః.
విభావానుభావసాత్త్వికవ్యభిచారి సామగ్రీసముల్లాసిత స్థాయీభావో రసః.
[ప్రతాప: రస]

గీ. అట్టి విజ్ఞానకలితమై యలరుభావ మాత్మఁ బ్రవ్యక్తమై విభావానుభావ
సాత్త్విక వ్యభిచారి సంజ్ఞలఁ దనర్చు, నాల్గు దెఱఁగుల రసనిదానంబు గాఁగ.
[మూడా: 1-20.]

సాత్త్విక భావంబులు నెనిమిదింటి నేర్పడ నలరింతు [నరస: 8-88.]

3. ఏవం సర్వేమిళిత్వా ఏకోనపంచాశద్భేదాః [నాట్య: 6-అ.]

దీనికొనుట మేలు. శాకుంతల నాటకము ప్రదర్శింపఁబడుచున్న దనుకొందము. అందు శకుంతలా దుష్యంతు లాలంబనవిభావములు; సహృదయుఁడగు సామాజికునికి ఆ విభావములు వ్యక్తి విశేషరూపమునఁ గాక సామాన్యరూపముగఁ దోఁచును. అనఁగా విభావములందు శకుంతలాత్వ దుష్యంతత్వములు నశించిపోవును. ఇట్లే యనుభావ, సంచారిభావములు వ్యక్తివిశేషసంబంధమును వదలి సామాన్యము లగును. ఇట్టి భావసామాన్యత కావ్యము సులలిత పదబంధ బంధురమై, ప్రదర్శించు నటులు తత్తద్భావ ప్రదర్శనమున నిపుణులై యుండు నపుడే రసాస్వాదన సమర్థులగు సహృదయులకే కలుగును.

అట్లు సాధారణములగు విభావాను భావ వ్యభిచారి భావములవలన విలక్షణమగు నొక వ్యాపారము పుట్టుచున్నది. అదియే వ్యంజన. ఈ వ్యాపారమువలననే సహృదయ హృదయములయందు వాసనారూపమునఁ బ్రతిష్ఠిత పూర్వములగు రత్యాది స్థాయిభావము లభివ్యక్తములగును. అనఁగా-ఉన్న స్థాయిభావములే వ్యంజనా వ్యాపారమువలనఁ బ్రకాశితములగును. సహృదయ హృదయములందు స్థాయిభావములు తొలుతనుండియు నున్నను, వాని నజ్ఞాన మను మూఁత కప్పివైచుటచే వ్యక్తములు కాఁజాలవు; వ్యంజనా వ్యాపార మా యావరకమగు అజ్ఞానమును పోఁగొట్టును. అజ్ఞానము నశించిన పిదప లోనున్న స్థాయిభావము, దానితోడిదే యగు నానందమును ప్రకాశించును.

మానవునికి మమత్వము అజ్ఞానజనితము. అజ్ఞానము నశించినపుడు మమత్వమును నశించును. అపుడు సహృదయునకుఁ దానొక వ్యక్తివిశేషమ నను జ్ఞానము నశించును. అతఁడు సాధారణ వ్యక్తియే యగును. దుష్యంతాదులగు విభావములు దుష్యంతత్వాది వ్యక్తి విశేష సంబంధమును వీడి సామాన్యులగుటను, సహృదయ సామాజికుఁడును సామాన్యుఁడగుటను, పయివిభావమునకు, సామాజికునకు నభేదము కలుగును. అపుడు సామాన్య రూపలగు శకుంతలాదినాయికలయెడ సామాజికులకు స్వకాంతాత్వ జ్ఞానముకలిగి అనురాగము కల్గుట కాటంక మేమియులేదు. ఇట్టి యనురక్తుఁడగు సామాజికునకు స్థాయిభావము వ్యక్తమయి, విగళిత వేద్యాంతరమగు నానందమును కల్గించును. అట్టి స్థాయిభావవిశిష్టమగు చిదానందమే రసము. ఈరసము సహృదయులగు వారందఱికిని అస్వాదన క్షమము. ఇది శృంగార రసప్రతీతి మార్గము. తక్కిన రసములకు నిదియే పద్ధతి. పయిది వ్యక్తివాదుల మతము, ఇదియే సిద్ధాంతితమగుటచేఁ దొలుదొల్త నిరూపింపఁబడినది. తక్కిన మార్గములును, వాని యందలి యనుపపత్తులును క్రింద నిరూపింపఁ బడుచున్నవి.

'విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః' అను భరత రససూత్రము నందలి 'సంయోగ, నిష్పత్తి' శబ్దములకుఁ దమకుఁ దోఁచిన రీతిని పలువురు పండితులు పెక్కర్థములను నిర్వచించుటచే వాదములు పెరిగినవి. ఉత్పత్తి వాదులగు భట్టలోల్లట ప్రభృతులు 'విభావములవలనఁ బుట్టి, అనుభావములవలనఁ బ్రతీతియోగ్యమయి, సంచారి భావములచేఁ బోషింపఁబడిన స్థాయిభావము రస'మని చెప్పిరి. రసము రామాదినాయకనిష్ఠమని, నాయకవేషము ధరించుటచే నటుని యందును అది గోచరించునని వీరి యాశయము. ఈ మతమున సూత్రమునందలి 'సంయోగ' పదమునకు మూఁడు విధములగు నర్థముల నంగీకరింప వలెను. స్థాయి, విభావముల సంయోగము కార్యకారణ భావము; స్థాయ్యనుభావ సంయోగము జ్ఞాప్యజ్ఞాపక భావము; స్థాయి, సంచారి సంయోగము పోష్యపోషక భావము: ఈ మతమున 'నిష్పత్తి' పదమునకు 'ఉత్పత్తి' అని యర్థము. ఈ మతము సరి కాఁజాలదు. ఉన్న స్థాయిభావమే ప్రకాశితమగును గాని క్రొత్తగాఁ బుట్టునది కాదు. రసమెన్నివేలయేండ్ల క్రిందటనో యుండినరామాదినాయకనిష్ఠమే యైనచో సామాజికులకు రసాస్వాదము కలుఁగఁజాలదు. అది సామాజికనిష్ఠమయియే యుండవలెను. సంయోగ పదమునకుఁ బయిరీతిని చాల అర్థములను కల్పించుటయు సరికాదు.

అనుమితివాదులగు శ్రీశంకుకులు లోకమునఁ బ్రసిద్ధములగు సమ్యక్, మిథ్యా, సంశయ, సాదృశ్యప్రతీతులకంటె విలక్షణమగు ప్రతీతి కలదని, అది చిత్రమునుజూచి 'ఇదిగో గుఱ్ఱము' అను కొను దానివంటిదని, అది రామపాత్ర

ధారి యగు నటునియెడ 'వీడుగో రాముఁడు' అను బుద్ధిని కల్గించునని చెప్పుదురు. సరసమగు నాట్యమువలనను, నిపుణుఁడగు నటునిచేష్టల వలనను నటునియందు లేనిభావము లచట నున్నట్లే సామాజికులు గ్రహింతురు. కాఁగా రసము నాయకనిష్ఠమైనను, నటునియం దనుమేయమయి సామాజికులచే ననుభవింపఁబడును. ఇదియే వారి మతము. ఈ మతమున 'సంయోగ' పదమునకు అనుమాప్యానుమాపకభావ మర్థము. 'నిష్పత్తి' యనఁగా అనుమితి. ఈమతముకూడ సరికాదు. నటుఁడు తటస్థుఁడగుటచేఁ దద్గతముగ ననుమితమగు స్థాయిభావము సామాజికులకు విగళితవేద్యాంతరమగు నానందమును కలిగింపఁజాలదు; అనుమిత మగునది సరిగ ఆస్వాదమునకు రాదు; రామాదినాయకనిష్ఠమగు రసము (ఒకరియందుండురసము) సామాజికులకు (వేఱొకరికి) ఆస్వాదయోగ్యమగుట అనుభవమునకువిరుద్ధము. కావున ఈ వాదమున రసముయొక్క యథార్థస్వరూపము సుస్పష్టముకాదు.

భుక్తివాదులగు భట్టనాయకప్రభృతులది మూఁడవమతము. లోకవ్యతిరిక్తముగ కావ్యనాటకములందు క్రొత్త రసవ్యాపారములు రెండుకలవు. అవి ౧. భావకత్వము; ౨. భోగము. అందు మొదటి వ్యాపారముచే విభావానుభావవ్యభిచారి భావములు వ్యక్తివిశేషసంబంధమును విడిచి సర్వసాధారణములగును. పిదప సాధారణరూపముననున్న స్థాయిభావము భోగవ్యాపారమువలన సామాజికులచే నాస్వాదింపఁబడును. భోగవ్యాపారమే సత్త్వరజస్తమో గుణములలోని రజస్తమోగుణముల నణఁచి సత్త్వము నుద్రేకింపఁజేసి రసము నాస్వాదమునకుఁ దెచ్చును. ఆ భుజ్యమానమగు స్థాయియే రసమని పయివారి మతము. ఈ మతమున 'సంయోగ' పదమునకు 'సాధారణీకరణసంబంధ'మని యర్థము. 'నిష్పత్తి' యనఁగా భుక్తి లేక యనుభవము. ఈ వాదముకూడ సరికాదు. ఈ మతమునఁ గ్రొత్తగ భావకత్వ, భోగవ్యాపారముల నంగీకరింపవలసియుండును. రసము సామాజికభుజ్యమాన మగుటచే రసము పుట్టుననికాని, జ్ఞాప్యమగునని కాని నిశ్చయముగఁ జెప్పుటకు వీలులేదు. అది యభివ్యక్తమనుటయే యుచితము; కాని భుక్తివాదులు వ్యక్తివాదుల మతమున కణుమాత్రము నవకాశమునీయరు. పయికారణములంబట్టి యేసందేహమునకును అవకాశములేని వ్యక్తివాదమే యుచితమైనది. అందే రసము స్వరూపమును బాగుగఁ దెలిసికొన వీలుకలదు.

వ్యక్తివాద సిద్ధాంత మిదివఱకే వివరింపఁబడినది. ఆ మతమున రససూత్రములోని 'సంయోగ'మునకు 'వ్యంజనావ్యాపారసంబంధ' మనియు, 'నిష్పత్తి'కి 'అభివ్యక్తి' అనియు నర్థములు.

పయిని వివరింపఁబడిన విషయమునుబట్టి రసము లన్నింటివలన నానందమే కలుగుననియు, దుఃఖము కలుగదనియుఁ దేలుచున్నది. రసస్వరూప నిరూపణమున నిపుణుఁడును, ప్రామాణికుఁడను అగు అభినవగుప్తాచార్యుఁడా రీతినే చెప్పియున్నాఁడు. చాలమంది యాలంకారికు లతని మతమునే యనుసరించిరి. కాని యిచట నొక సందేహము కలుగవచ్చును. సుఖహేతువులగు రతి హాసాదులవలన — శృంగార హాస్యాదిరసములవలన ఆనందము కలుగవచ్చును; దుఃఖహేతువులగు శోక, భయాదులవలనను — కరుణ, భయానకాదిరసములవలనను ఆనంద మెట్లు కలుగును ?

కాని పయిప్రశ్నకు సమాధానము లేకపోలేదు. కావ్యప్రపంచము లోకవిలక్షణము. లోకమునందు సుఖహేతువులవలన సుఖము, దుఃఖహేతువులవలన దుఃఖము కలుగుట నియమసిద్ధము. కవిబ్రహ్మసృష్టి విలక్షణ మగుటచే దుఃఖ హేతువులవలనఁగూడ సుఖమే — కావ్యనాట్యములందుఁ గలుగును; అదియు సామాన్యసుఖముకాదు; విగళితవేద్యాంతరమగు ఆనందమే ! దుఃఖహేతువులవలనను ఆనందము కూర్పఁగలవాఁడే కవి. హాలాహలమునుండి యమృతము చిలికింపఁగల సామర్థ్యములేని కవి యథార్థకవికాఁడు. శ్రోతకాని, ద్రష్టకాని కేవలము దుఃఖము ననుభవింపవలెనను నాశయమునఁ గవి కావ్యమునుగాని, నాటకమునుగాని వ్రాయఁబూనఁడు. తనకు దుఃఖము కలుగవలెనని కోరి సహృదయుఁడు కావ్యపఠనమునకుఁగాని, నాటకదర్శనమునకుఁగాని దొరకొనఁడు. దుఃఖాంతములగు కావ్య, నాట్యములం బ్రవర్తించిన సహృదయుఁ డట్టి దుఃఖమువలనను మనస్సున కొకరీతి శాంతికలిగి యానందము కలుగవలెనను కోరికతోడనే ప్రవర్తించును,

మఱియు సహృదయులు కవి దుఃఖవిషయములను నిరూపించుటయందు ఎంతవఱకు నెగ్గెను? కరుణరసమును పోషించుపట్టుల మనలను రామాదులతోఁబాటు ఏడిపించగలిగెనా? లేదా? అని యాలోచింతురు. అట్లొనరించినపుడే వారు కవిని మెచ్చుకొని యానందింతురు. (ఇది యనుభవసిద్ధము.) సంస్కృతాలంకారికులు ఇంచుమించుగ నందఱును కరుణాదిరసముల వలనను ఆనందమే కలుగునని చెప్పినారు. నాట్యదర్పణకర్తలగు రామచంద్ర, గుణచంద్రులు మాత్రము సుఖాత్మకత్వ, దుఃఖాత్మకత్వ భేదములవలన రసములు రెండు విధములనియు, రసములు కొన్ని (కరుణాదులు) దుఃఖస్వరూపము లనియు వివరించి యున్నారు. [1] కాని వీరిమతము నితరులెవ్వరు నామోదించలేదు. వీరి గురువగు హేమచంద్రాచార్యులు గూడ పయి మతమును సూచింపనైనను లేదు. [2] లోకోత్తరమగు నానందమునకుఁ గారణము లెట్టివయినను కావచ్చును. అవి యానంద స్వరూపమును మార్పఁజాలవు.

ఆంధ్రాలంకారికులు కూడ అన్ని రసముల వలనను ఆనందమే కలుగునని ఒప్పుకొనిరి. మూర్తికవి ఈ యంశమునే 'వానిరి దుఃఖమైన సుఖమైన భవమైన విటీవిటాళియం దారయఁ బూర్ణమై సహృదయాత్ములఁ గేవల హర్షమై తగున్' అని చెప్పినాఁడు. ఇచ్చటి 'హర్షము' నకు 'ఆనంద'మను నరము చెప్పవలెను. వ్యక్తమగు స్థాయిభావముతోఁగూడ విగళిత వేద్యాంతరమగు నానందము కలుగునని యిది వఱకుఁ జెప్పఁబడినది. రసానందములు రెండును భిన్నములా? అభిన్నములా? అను సందేహమొకటి కలుగుచున్నది. ఈ విషయమున సంస్కృతాలంకారికులు రెండు విధములుగను చెప్పియున్నారు. మమ్మటాచార్యులు కావ్యప్రకాశమున 'రసాస్వాదనమువలన విగళిత వేద్యాంతరమగు నానందము కలుగు'నని యొకచోటను, 'రసము బ్రహ్మానందముతో సమానమగు'నని వేఱొకయెడను చెప్పియున్నాడు. [3] రసగంగాధరము నందలి రసస్వరూపమును బట్టి స్థాయికంటె ఆనందము వేఱనియు, ఈ రెండింటికిని అవినాభావ సంబంధమున్నదనియుఁ దెలియుచున్నది. [4] పండితరాజు స్థాయిభావముతోఁ గూడిన యానందము రసమా? లేక యానందముతో నున్న స్థాయి రసమా? అని విమర్శించి శ్రుతిని ప్రమాణీకరించుచు రత్యాది స్థాయిభావవిశిష్టమగు చిదానందమే రసమని సిద్ధాంతీకరించియున్నాఁడు. [5] రసమానంద స్వరూపమనియే శ్రుత్యర్థము. రసలక్షణమునందలి 'నిజస్వరూపానందేనసహ గోచరీక్రియమాణః ... రత్యాదిరేవరసః' అను నంశము పయియర్థమునకు సమర్థకము. ఇట్లొకరిమతముననే రెండు విధములగు నభిప్రాయములు నుండినట్లు తోఁచుచున్నది. పయివానికి సమన్వయము చేయఁ దలఁచినచో ఒకమార్గము కలదు. రసము, నానందమును వేర్వేఱయినను, రసము ఆనందమునకు హేతువగు కారణమున-హేతు, హేతుమంతముల కభేదము చెప్పుట యుక్తిసారము కానందున, రసానందముల కభేదము చెప్పినను చెప్పవచ్చును. ఆంధ్రాలంకారికులలోఁ బెద్దయ కవి మతమేమో తెలుపవీలులేకున్నను, మూర్తి కవి మతమున మాత్రము రసానందముల కభేదము కలదని 'భావము........ఆవలఁ బూర్ణమై సహృదయాత్ములఁ గేవల హర్షమై తగున్' [పుట 63.] అను నతని నిర్వచనమును బట్టి తెలియుచున్నది.

---

1. నాట్య దర్పణమ్: అ. 3. [G. O. Series]
2. కావ్యానుశాసనమ్. [నిర్ణయసాగరప్రతి]
3. సకలప్రయోజన మౌళిభూతం సమనన్తరమేవ రసాస్వాదన సముద్భూతం విగళిత వేద్యాంతర మానందం... [కావ్యప్ర: ప్రథమోల్లాసః]
   బ్రహ్మాస్వాదసబ్రహ్మచారీ...రసః. [కావ్యప్ర: చతు.]
4. స్వప్రకాశతయా వాస్తవేన నిజస్వరూపానందేన సహ గోచరీక్రియమాణః ప్రాగ్వినివిష్ట వాసనారూపో రత్యాదిరేవ రసః. [రసగం:ప్రథ]
5. వస్తుతస్తు వక్ష్యమాణ శ్రుతిస్వారస్యేన రత్యాద్యవచ్ఛిన్నా భగ్నావరణాచిదేవ రసః. 'రసో వై సః, రసం హ్యేవాయం లబ్ధ్వానందీ భవతీ'తి శ్రుతిః. [రసగంగాధరః. పు. 20.]

రససంఖ్యాపరిగణనమునఁ బ్రాచీనకాలము నుండియు మతభేదములు కలుగుచున్నవి. స్థాయి భావము లెన్నియున్న అన్నిరసములు కలవని చెప్పవలెను. భరతముని యెనిమిది స్థాయిభావములనే నిర్వచించియున్నాఁడు. దానింబట్టి యతనిమతమున ఎనిమిది రసములేయని చెప్పవలసి వచ్చును; రసములు తొమ్మిదని చాలమంది చెప్పుచున్నారు. కొందఱు చెప్పని ఆ రసము శాంతము; భరతుఁడును శాంతరసము లేదని యెచ్చటను చెప్పలేదు. 'అష్టౌ నాట్యేరసాః స్మృతాః' అనియే నాట్యశాస్త్రమునఁ గలదు. దానింబట్టి నాట్యరసము లెనిమిదని, నాట్యాతిరిక్తముగఁ గావ్యమందు శాంతరసము కలదని అతనిమతమును కొందఱు వివరించుచున్నారు. అభినవగుప్తాచార్యులు శాంతరసమునుగూర్చి ప్రసంగించుచు, అది భరతముని సమ్మతమని 'మునినాఽప్యంగీకృతం, 'క్వచిచ్ఛమః'— ఇత్యాదినా' అని అతని వచనమును బ్రమాణీకరించినాఁడు. దానింబట్టి శాంతరసమునకు శమము స్థాయియని మునిమతమయినట్లును తెలియుచున్నది. నాట్యశాస్త్రమున 'రతిర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా. జుగుప్సా విస్మయశ్చేతి స్థాయిభావాః ప్రకీర్తితాః' అని స్థాయిభావములు నిరూపింపఁబడిన పిదప 'నిర్వేదగ్లాని శంకాఖ్యాః' అని సంచారిభావములు ప్రస్తుతింపఁబడినవి. కాని శమము స్థాయిభావమని కాని, భావమాత్రమని కాని చెప్పఁబడి యుండలేదు. కావ్యప్రకాశకారుఁడు శాంతమునకు నిర్వేదము స్థాయి భావము అని చెప్పియున్నాఁడు. నిర్వేదము మంగళప్రాయమగుటచే దానిని తొలుతఁ జెప్పరాదనియు, అట్లు చెప్పుట నిర్వేదమొకపుడు స్థాయి కావచ్చునను సంశయమును తెలియఁ జేయుననియు, నిర్వేదము స్థాయిగాఁగల శాంతరసము కలదనియు నతని మతము. [1] విద్యానాథాదులు శమమునే శాంతస్థాయి భావముగఁ జెప్పియున్నారు. [2] పండితరాజు నిర్వేదమునే యొప్పుకొన్నాఁడు. [3] ఇటుల శాంతస్థాయి భావముంగూర్చి యభిప్రాయభేదములున్నట్లు తెలియుచున్నది. విచారించి చూచినచో శమము, నిర్వేదము నొక్కటియే యని, నిర్వేదమునకు శమము నామాంతరమని తెలియును. భరతముని శమము నంగీకరింపనిచో అభినవగుప్తుని మతము కుదురదు. పయిరెండును తృష్ణాక్షయరూపములే. రెండింటికి నభేదమును తలంచియే భరతముని 'క్వచిచ్ఛమః' అని చెప్పియుండవలెను. ఆంధ్రాలంకారికులు శమమునే శాంతిస్థాయిగాఁ జెప్పిరి. ఏది చెప్పినను ఒకటియే!

రసములు తొమ్మిదని సనాతన సిద్ధమగు వాదము. కాని కొందరీ పద్ధతి నొప్పుకొనలేదు. శృంగార ప్రకాశమును వ్రాసిన భోజదేవుఁడు [4] శృంగార మొక్కటియే రసమని, గతానుగతికన్యాయమున వీరాద్భుతాదులు రసములయినవని వివరించియున్నాఁడు. రూపగోస్వామి 'ఉజ్జ్వల నీలమణి' యందు 'ఉజ్జ్వలపదమగు శృంగారమొక్కటియే రసమని వివరించెను. ప్రాచీనాలంకారికుఁడగు రుద్రటాచార్యుఁడు తొలుతఁ బదిరసములను పేర్కొని, యంతతోఁ దనివినొందక మధుర పదార్థముల యాస్వాదనమువలన వివిధ రసములు కలుగునట్లు, అన్ని భావముల యాస్వాద

1. నిర్వేదస్యా మంగళప్రాయస్య ప్రథమమనుపాదేయత్వేఽప్యుపాదానం సంచారిత్వేఽపి స్థాయిత్వ ప్రతిపాదనార్థమ్. తేన నిర్వేద స్థాయిభావోఽస్తి, శాంతోఽపి నవమోరసః [కావ్యప్ర: చతు.]
2. జుగుప్సా విస్మయశమాః స్థాయిభావాః... [ప్రతాప: రస: సాహిత్య దర్పణమ్]
3. రతిశ్శోకశ్చ నిర్వేదం...... [రస గంగాధరః: పు-30.]
4. వీరాద్భుతాదిషు రసేషు రసప్రసిద్ధిస్సిద్ధా కుతోఽపి వటయక్షవ దావిభాతి లోకే గతానుగతికత్వవశా దుపేతా మేతాం నివర్తయితు మేషప రిశ్రమో నః, శృంగార వీర కరుణాద్భుత హాస్య రౌద్ర బీభత్స వత్సల భయానక శాంతనామ్నః అమ్నాసిషు ర్దశరసా నపరే; వయం తు శృంగారమేవ రససా ద్రస మామనామః. [కీశ.]

నము వలనను రసాస్వాదనము కలుగవచ్చునని, అందుచే నిర్వేదాదులన్నియు రసములు కావచ్చునని వివరించి యున్నాఁడు.[1] అధునాతన విమర్శకులు కొందఱు రససంఖ్యను నియమించుటకు వీలులేదనియు, భావానుసారముగ ఇచ్చకు వచ్చినన్ని రసములుండవచ్చునిని యు నొనరించు సిద్ధాంతమునకీ రుద్రటవాదమెంతయు అనుగుణమగుచున్నది. రసస్వరూపవివరణ సందర్భమున జగన్నాథ పండితుఁడుకూడ స్థాయిభావము లయినను భూయిష్ఠ విభావజనితము లగునపుడే స్థాయి భావములని, లేని యెడల వ్యభిచారు లగునని చెప్పియున్నాఁడు కదా! ఆ రీతినే తక్కిన భావములు భూయిష్ఠవిభావజములగుచో రసములగుటలో అనుపపత్తిలేదు. ఇట్లు రససంఖ్యావిషయమయి వివిధములగు అభిప్రాయము లున్నవి. రస సంఖ్యాపరిగణనమున జగన్నాథ పండితుఁడు చాల విమర్శించి తుదకు తొమ్మిది రసములనే యంగీకరించెను. ఆ విషయము సంగ్రహముగ క్రింద నీయఁబడును.

దేవ, గురు, పిత్రాది విషయకమగు రతి భావమనియు, అదియే కాంతావిషయకమగుచో రస మగుననియు నాలంకారికుల సిద్ధాంతము. ఆస్వాదనముపట్టుల భేదములేనియపుడన్నియు రసములేయని కాని, అన్నియు భావములేయని కాని ఏల అనరాదు? లేదా, స్త్రీ విషయకరతి భావమయి, దేవ, గురు, పిత్రాది విషయకమే రసమేల కారాదు? పయిరీతి సందేహము లనేకములు కలుగవచ్చును. అట్టి ప్రశ్నలకు సమాధాన మొసఁగుటకు బదులు ప్రథమాలంకారికుఁడు, ప్రామాణికుఁడునగు భరతముని చెప్పినదానినే శరణుఁజొచ్చుట యుత్తమము. ముని చెప్పిన తొమ్మిదే రసములని, తదతిరిక్తములు భావములని చెప్పవలెను. వీనికిఁ జేరిలోనే భేదము; ఫలమున నన్నియు నొక్కటే.[2] ఆంధ్రాలంకారికులును రసములు తొమ్మిదని చెప్పియున్నారు.

రసము నాయకనిష్ఠమా? సామాజికనిష్ఠమా? నటనిష్ఠమా? అని సందేహము కొందఱికిఁ గలుగవచ్చును. అభినవగుప్తులమతమును బట్టి—రసము సామాజికులచే ననుభవింపఁబడుటచే దానికి తన్నిష్ఠతయే యుచితమైనది. కొన్ని మతములలో నాయకనిష్ఠము; కాని యా మతములు యుక్తములు కావని యిదివఱకే చెప్పఁబడినది. కావ్యమునందు శ్రోతలకును, నాట్యమునందు ద్రష్టలకును రసము కలుగునని చెప్పుచు పెద్దిరాజు (పెద్దయ కవి) పయిమతమునే యామోదించినాఁడు.[3] ప్రతాపరుద్రీయమునందభినవగుప్తుని మతమే యనుసరింపఁబడినది. అందలి 'భావేస్థాయిని' అను శ్లోకమునే ఆంధ్రీకరించిన మూర్తికవి మతమును వేఱుగఁ జేర్కొనఁబనిలేదు. కావున రసము సహృదయుఁడగు సామాజికుని యందే యుండునని చెప్పవలెను. కొన్ని శతాబ్దముల క్రిందట నుండిన నాయకనిష్ఠము కాఁజాలదు. అట్లైయైనచో సామాజికులకు రసాస్వాదము కలుగక పోవలసివచ్చును. అది నటనిష్ఠ మంతకన్నను కాదు. నటుఁడు కేవల మభినయాదుల ననుకరించునే గాని ఆయా భావము లాతనికి కలుగుట లేదు. ఒకపుడతఁడు తన్మయుఁడయి రసము ననుభవించెనేని—అపుడతఁడు నటుఁడు కాక సామాజికుఁడేయగును. నటునకు శిక్షాభ్యాస పాటవమున భావానుకరణ యోగ్యతయే కలదు; రసాస్వాద యోగ్యతలేదు.

ఈ రసస్వరూప వివరణములోని కొన్ని యంశములు మనవారి కనుభవవిరుద్ధములుగ తోఁచవచ్చును. ప్రాచీనార్వాచీన లాక్షణికు లందఱును పయిరీతినే యనుసరించిరి. వారి నిర్వచనము అనుభవానుసారియై యుండవలెను.

---

1. శృంగార వీరకరుణా బీభత్సభయానకాద్భుతా హాస్యః,
రౌద్రః శాన్తః ప్రేయా నితి మంతవ్యా రసాః సర్వే.
రసనాద్రసత్వమేషాం మధురాదీనా మివోక్త మాచార్యైః,
నిర్వేదాదిష్వపి త న్నికామ మస్తీతి తేఽపి రసాః. [కావ్యాలంకార: 8-8,4]
2. భరతాది ముని వచనానామేవాత్ర రసభావత్వాది వ్యవస్థా పరత్వేన స్వాతంత్ర్యా యోగాత్. అన్యథా పుత్రాది విషయాయా అపి రతేః స్థాయిభావత్వం కుతో నస్యాత్ ...రసానాం నవత్వగణనాచ మునినియంత్రితా భజ్యేత... [రసగంగాధరః: పు-46.]
3. ప్రోఁడలకుఁ గావ్యములయందుఁ బొందు రసము;
ద్రష్టలకు నాట్యములయందుఁ దనరు రసము; [చూడు: 2-7.]

# కవిసంజీవనీ లక్షణవిశేషములు

## శ్రీ రావూరి దొరస్వామిశర్మగారు

(గతసంచిక తరువాయి)

ద్వితీయతరంగము :

(1-6) రఘువు-రఘు, బాహువు-బాహు, రాహువు-రాహు, ఊరువు ఊరు, మేరువు-మేరు—అని యీరీతి వువర్ణకమునకు లోపము వికల్ప మగు.

ప్రథమైక వచనేతర విభక్తి పరకత్వమందే వువర్ణకమునకు లోపము వికల్ప మని, రాహు బాహు శబ్దద్వయమునకు మాత్రము ప్రథమైక వచనమందును వు లోపము వికల్పముగా నగు నని మహాకవిప్రయోగములమూలమున నరయ నగుచున్నది.

(7-14) పులక, అలక, హంస-అను వానిము వర్ణకమునకు లోపము వైకల్పికము. చరిత్రాది గణమున సూరి వీనిం జేర్చెను. రామన పై వ్యాఖ్యలో 'తరంగములు—తరఁగలు' అనురూపముల నిచ్చెను. కాని తరంగశబ్ద వైకృతము తరఁగ. ఇది పులకాది గణమునఁ జేర్పఁదగినది గాదు. అట్లు చేర్చిన 'తరంగము-తరంగ' అనురూపము లుంట యుక్తము. 'తరఁగ 'లను శబ్ద మాచ్ఛికము. 'కరడనఁ గడలనఁ గర యనంగఁ దరంగమునఁ దరఁగ యనంగ నల యనంగ' (సీసపాదము-ఆంధ్ర భాషార్ణవము-1-154.)

(15-16) అమహత్తులకు మహద్వికల్ప- ఉరగుఁడు, సముద్రుఁడు.

(17-19) చను, చన్ను, కను, కన్ను శబ్దములు హల్లు పరం బగునపు డూఁదుట గలదు. అనఁగాఁ బూర్ణబిందు వగు ననుట. చనుఁగవ, చన్నుంగవ, కనుఁగవ, కన్నుంగవ. ఇది నేఁటి యొదంత స్త్రీ సమములకు నుగాగమ సంధి విధాన మగును.

(20-22) చరిత్రము - చరిత్ర—(7-14) పులకాదిగణమునఁ జేర్పఁదగు.

(23-24) పరీక్షితుఁడు, ఇంద్రజితుఁడు—హలంతతత్సమరూపములు.

ఇందుఁ జెప్పఁ బడలేదు గానిపై శబ్దములకుఁ దత్సమమున 'పరీక్షిత్తు, ఇంద్రజిత్తు, ఇంద్రజి' అనురూపములు పూర్వకవిప్రయుక్తములు గల వనియరయునది.

(25-28) కలిగి యనునర్థమున 'ఐ' యను పదప్రయోగము.

(29-30) కేలు (నిత్యైకవచనము), ఇరులు (నిత్యబహువచనము)

ఇరులు నిత్య బహువచనాంత మనుట ప్రసిద్ధము గాని యేకవచనప్రయోగ మీ క్రిందిది గలదు.

'ఇరులున నొంటిఁబోఁ బరసతి సెట్టుట'- విజ్ఞా-ప్రా. 105 (సూ. ని. పు. 536)

(31-32) జిష్ణునికంటె, జిష్ణుకంటె.

పంచమీవిభక్తి కూడుచో మధ్య నకార లోపము వికల్ప మని లక్షణము. ఇట్టి పట్టున నివర్ణ ముండఁ గాని నకార ముండదు. కవి నివర్ణ మునే యుద్దేశించె నేమో ? కంటె వర్ణకంబు పరం బగు నపుడును గొన్నియెడల నగాగమంబు చూపట్టెడి (ప్రౌఢవ్యా-శబ్ద-20). ఈ కార్య మమహత్తులందే కానఁబడు చున్నది. ఉ॥ త్రిక్రతుశతంబునకంటె, రుధిరాభీలాన్నంబున కంటెను. 'జిష్ణున కంటె' ఇత్యాదుల ప్రసిద్ధములు.

(33-34) షష్ఠీవిశేషణమునకుఁ బ్రథమ.

(35-36) మహతీతరంబు లగు స్త్రీలింగంబుల విశేషణంబులకుఁ గ్లీబత్వంబు విభావనగు.

ఉ॥ యశోదాతనయు కృపాదృష్టి సౌఖ్య దాయకము.

(37-38) బహువచనముల కేకవచన విశేషణము.

ఉ॥ కులిశధారల్ కుంఠితం బయ్యె.

(39-40) దూత—నిత్య స్త్రీసమరూపము (రామనమతము).

కాని దూతుఁ డనుపుంలింగరూపమును బ్రయోగములఁ గాన నగు. కవిజనసంజీవని (2-39).

'దూతపదము స్త్రీలింగము

రీతిఁ బ్రవర్తిల్లు సకలకృతులఁ బరఁగుటన్'

తిమ్మన దూతుఁ డను రూపము సైతము గల దని పై లక్షణపద్యమునే యందుకొని యిట్లు సవరించె.

'దూతపదము స్త్రీలింగము,
రీతిం బుంలింగమట్లు గృతులఁ దనర్చున్,
దూత యన దూతుఁడనఁగా,
భూతేశ మహేశ నిఖిలభువనాధీశా'

(సర్వలక్షణ-1-24)

లక్ష్యము—'దూతుని జంపుట నరక మూట గ్రుడవ మని రాక్యల్' (శాంతిపర్వము).

(41-44) ధూర్త, నీచ, మూర్ఖ, వృద్ధ శబ్దంబులకు 'డు' వర్ణకలోప వైకల్పికత్వము.

తృతీయతరంగము :

(1-3) పన్నగేంద్రుఁడు, పతగనాథుఁడు, అశ్వోత్తముఁడు—

తిర్యక్కులకు శ్రేష్ఠవాచకములందుఁ బుంస్త్వము.

(4-7) పడ్వాదిసంధి—

పడు, పఱచు, పెట్టు, పాటు-పడ్వాదులు.

పడ్వాది పరకత్వంబున సంస్కృత (తత్సమ) శబ్ద 'ము'వర్ణమునకు లోప మగునని రామన లక్షణమునందలి యుదాహృతులవలనఁ దెలియుచున్నది. (4-ప) కాని, ప్రియాభయశబ్దములమీఁద బిందువు నిల్చు నని తర్వాతి లక్షణమున (5 ప) రచితము.

పడ్వాదులు పరంబు లగునపుడు మువర్ణకముల కెల్ల (అనఁగాఁ దత్సమాచ్ఛికశబ్దములం దెల్ల ననుట) లోపపూర్ణ బిందువులు విభాష నగు నని ప్రయోగములంబట్టి యెఱుఁగనగు.

(8-12) మిశ్రసమాసము—

అయిదాఱక్షరముల తెలుఁగు పదముతో సంస్కృతశబ్దము సమసింపఁ జేయవచ్చు.

ఉ. కలిమిచెలిచెలిమివిభుఁడు -

ఇది యాఱక్షరములకు మించి యున్నది. 'సంస్కృతపదేన పరిమిత మాంధ్రపదం కర్మధారయో భవతి'అని చింతామణి. అపరిమితి 'ఆంధ్రం షడ్వర్ణపర్యంతం సంస్కృతేన సమస్యతే' యని యథర్వకారిక యాఱక్షరము లని నిర్దేశించె.

కవిసంజీవని చూపినప్రయోగములు—

పునుఁగుందావి నవోదనంబు (ఆముక్త) - ఇం దయిదక్కరముల తెలుఁగు పదము గలదు. కటికచీఁకటి తిండికరములు (మను) - ఇది పరిమితి నతిక్రమించినది. వ్యాకర్తలు వ్యాఖ్యాతలేతాదృశప్రయోగముల నెట్లెట్లో సమర్థించెదరు. వాని నాయాగ్రంథములఁ జూచునది.

(13-14) సంస్కృత సమాస మధ్యగత స్త్రీలింగ శబ్దాంత దీర్ఘములకు హ్రస్వము తెనుఁగుకృతులందు సమ్మత మగు.

ఉ॥ అగణితకాళిందితటవనావళులు

(కాళిందీతటము)

తమసతీరసికతావిలసనములు. (తమసాతీర)

ఇందు రెండవ యుదాహృతి రాఘవపాండవీయస్థము. శ్లేషనిర్బంధముచే హ్రస్వము రాకమానదు. (మహిమంగల తమ-సతీరసికతా, మహిమన్ - కల - తమస - తీర- సికతా అని ఛేదము)

చతుర్థతరంగము :

(1-2) నకారమునకు సంధియందు సంశ్లేషము—

ఓర్చున్ + అఘములు—ఓర్చు న్నఘములు.

ధైర్యయుక్తి కిన్నరుదుగ (అరణ్యపర్వము)

'లుక్సంశ్లేషౌ నాచి' యను చింతామణి సూత్రముచొప్పున స్వరము పరం బగుచో నకారమునకు లోప సంశ్లేషంబులులేవు. సంశ్లేష విధానము దుస్సంధి యని లాక్షణికులు పేర్కొని యద్దానిని నిరాకరించిరి.

'దొర వీవు న్నజుఁడు ననిన దుస్సంధి యగున్.'

కవిజనాశ్రయము (దోషప్రకరణము)

'అతఁడు, న్నతఁడు నని యూఁది పలికిన సతతము దుస్సంధి యండ్రు.' అనంతుని ఛందము—(4-20)

'ఎందును దుస్సంధి సమా
ఖ్యం దిరమగు నందు నిందు ననుచో నందు
న్నిందు నని పైననచ్చులు,
పొంద సముచ్చయ నకారములు కృతిమీఁదన్'

అప్పకవీయము (సంధి: 5-12)

కాని స్వరపరకత్వమున నకార సంశ్లేషము మహాకవిప్రయోగములం గానంబడియెడి.

(3-4) అచ్సంధి—

ఎంత + అధికము - ఎంతధికము; కినుక + ఉడుగు - కినుకుడుగు.

(5) క్రియాంతశేషస్వరలోపము—

ఉ. క్రుంకుదు ర్నిలువలేక (క్రుంకుదురు నిలువ లేక)

అకారమునకు నిట్టి స్వరలోపము గలుగుటకు లక్షణమునఁ జెప్పఁబడకున్నను నిందుఁ బ్రయోగము చూపఁబడియె.

ఉ. భృత్యుల్ భూమి మాటొడ్డుచున్.

## కవిజనసంజీవనిలో గానరాని పద్యములు :

కవిలోక సంజీవనియందుఁ బండ్రెండు యతులున్న వని కస్తూరిరంగకవి తన ఛందమునఁ జేర్కొనియె (8-14-వచనము). ఆ యతుల పేళ్లు చెప్పఁబడలేదు. ఉపలబ్ధ కవి సంజీవని ముద్రణప్రతి యసమగ్రము. ఇందు నేఁడు గానవచ్చు యతిభేదము లీ క్రిందివి.

1. అభేదయతి (వ-పలకు)-(52 పద్యము)
2. శకంధ్వాదియతి (55)
3. వృద్ధియతి (69)
4. నఞ్సమాసయతి (78)
5. సరసయతి (85)
6. అఖండవడి (89)
7. నిత్యసమాసయతి (98)
8. ఉపసర్గయతి (110)
9. రివడి (115)

(ప్రథమ తరంగము)

ఈ పైయతుల మధ్యమధ్య ధర్మవు, అచ్చొటు, ఒక్కొఁడు, డిగు, దిగు, ఒనరు, పొనరు, అందోళా, ఎగయు, నెగయు, పొఁడిమి, పోణిమి, తాయెతు మున్నగు శబ్దరూపములకు నిర్ధారకములుగా లక్ష్యలక్షణములు గలవు. వీనిని బ్రత్యేక యతిభేదములుగాఁ బరిగణింప వీలుపడునట్లు లేదు. రంగకవి చెప్పిన 12 యతులలో 9 మాత్రమే నేటి ప్రతిలోఁ గానఁబడియెడు. తక్కిన మూఁడెవియో ? పై శబ్దరూప నిర్ణాయక లక్షణములందే యా భేదము లిమిడియున్న వేమో!

సులక్షణసారమున 'తాయెతులు నుయ్యెలయు' ననుపద్యము యావడి క్రింద లక్షణముగా గ్రహింపఁబడినది. (చూ. క్రొత్త ప్రతి. యావడి-పు. 95)

కవిజనసంజీవని లోనిదిగా సులక్షణసారమున నీ క్రింది పద్య ముదాహృతము.

గీ॥ లక్షణాన్వితముగ నక్షశబ్దంబుపైఁ
దనర నూహి ననుపదంబు వెలయు
నపుడు వృద్ధి సెప్ప నగు గుణంబును జెల్లు
నాగుణం బఖండమై చెలుంగు.

(చూ. క్రొత్తప్రతి అఖండవడి-పు 128)

అక్షోహిణి, అక్షౌహిణి యను రూపద్వయ మం దఖండవడి చెల్లుటను జెప్పుచున్నది పై లక్షణము. ఈ విషయ మీ పరిశోధన పత్రికా ప్రథమసంచికలో అక్షౌహిణి-తద్గతయతి విశేషాలను వ్యాసములోఁ జర్చింపఁబడినది.

సర్వలక్షణ సారసంగ్రహములో నీ క్రింది పద్యములు ముద్దరాజు రామన్న చెప్పినాఁడని వ్రాయఁబడినవి.

1. జ్ఞాతివైరంబు లంది ప్రాసంబులందు
2. సారిది భోజకన్య నరదంబుపై నిడి

శకటరేఫ ప్రకరణము. 3, 4 పద్యములు.

3. బమ్మెర పోతరాజ కృత భాగవతంబు సలక్షణంబు గాక (3-263; పు 243)

ఈ మూఁడుపద్యము లప్పకవీయమునఁ గవియే చెప్పినట్లు గానవచ్చెడు.

(చూ. పై పద్యములు-అప్పకవీయము-2ఆ-229, 231, 234 ప)

సర్వలక్షణసార సంగ్రహములోని యీ పద్యమును బరికింపుఁడు.

ఆ॥ కాకునూరి యప్పకవి యహోబలపతి
ముద్దరాజురామ ముఖ్యు లెల్ల
పోతరాజు కబ్బమున జాలు రేఫలు
గదిసె నంచుఁ బలికి రది పలుకక్కి.

(పు-242, 3 ఆ. 262 ప)

నేఁటి కవిసంజీవనిలో శకటరేఫ ప్రకరణము గాని, దానిం గూర్చి తెల్పు కతిపయ లక్షణములు గాని కానరావు. పోతన కవితలో రఱసాంకర్యము నగ్గడించినాఁడట రామన. ఈ భాగమంతయు నేటి ప్రతిలో లుప్తము గాఁబోలు !

శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు కవి సంజీవనిలో నెక్కటివళుల క్రింద స్వరతత్త్వ సారము, కాశీశతకము, ముద్రారాక్షసము, భారతానుశాసనికము, నన్నెచోడ కుమార సంభవము అను గ్రంథములలోని పద్యము లుదాహృత మనియు, నన్నెచోడుని కలావిలాసము, పెద్దపాటి సోమనాథ కవి యరుణాచల పురాణమునందలి పద్యములు నందు గృహీతము లనియుఁ దమ కుమారసంభవ పీఠికలోన్ను;

మఱియు వల్లభరాయని వీథి నాటకములోనిదిగా 'కుసుమం బెట్టిన' పద్య ముదాహృత మని క్రీడాభిరామ పీఠికలోను వ్రాసియున్నారు. ఈ కవిగారివద్ద నేటి ముద్రిత ప్రతికి భిన్నముగా సమగ్రముగాఁ బ్రత్యంతర ముండు నని తోఁచెడు. అద్దానిని సంపాదించి నేఁటిప్రతితో సంప్రతించి పునర్ముద్రణము గావించుటకు లాక్షణికు లగు పండితులు గడంగవలయు.

## కవిసంజీవనిలోని ప్రయోగవిశేషములు:

(1-1) శ్రీ మించుందనకాంతి - ఉదంత తద్ధర్మారక విశేషణమునకు హల్పరకత్వమున నుగాగమసంధి.

(1-2) తళుకుఁ వజ్రము—స్థిరపరకత్వమున నుగాగమసంధి. ముద్దు తేజిదొరతో- తేజీ యను దీర్ఘాంతశబ్ద మిది, ఆచ్ఛికము. దీర్ఘాంత దేశ్యములకు హ్రస్వము రా దని చింతామణి 'దీర్ఘాణాం హ్రస్వస్స్యాత్, నచదేశ్యపదే.' ఇట్టి హ్రస్వప్రాప్తి కాకరము 'హ్రస్వో దేశ్యేతు వా క్వచి' త్తను బాధర్వణము.

(1-4) తి,క్కన యజ్వప్రముఖ నిఖిల+ కవిమూర్తిమణీ-ఇది నామాఖండయతి- వ్యంజన మైత్రి.

(1-75) పొనరింతు న నేకకార్య+ములు హరి కనఁగఁ—పోలికయతి. పై రెండువళ్లు నేటి ప్రతిలోఁ జేర్కొఁబడలేదు.

(1-78) ససమాస నఞ్సమాసము

లసమంబుగ నచ్చు హల్లు+లకు యతిచెల్లుఁ

—ఇది యఖండవడి.

(1-105) అఖిలా, నిమిషారులఁ దనిరొ నురువ+ణించి యనంగఁ.

న-ణ యతి, ఇయ్యతిభేదము నేఁటి ప్రతిలోఁ గానరాదు.

(2-28) కృతిని నమాగమములు త

క్కృత కారాంతంబు లుందగం దేలఁగ...

తక్కఁ-నాంతపదము తక్కఁదకారాంత మని సంధి చేయవలయు. అట్లైని ప్రాసభంగ మగు. అవ్యయముపై గసడదవాదేశము రామన మున వికల్పము. (చూ. 1-12 లక్షణము)

(2-41) ధూర్తముఖ్యపదచతుష్టయంబగు నుత్వ

మేని దుత్వమేనిఁ+గృష్ణువలన.

ఇది ఋత్వసంబంధవళి-ఇదియు నీ ప్రతిలో లేదు.

(3-8) తెలుఁగుల నై డాఅక్షర

ములపైసంస్కృతపదంబు+పొసఁగింపఁదగుఁ

—పోలికవడి.

(3-13) తగు స్త్రీ లింగము తెలిఁగిం

పఁగ నెంత సమాసమధ్య+మంబున నైనన్-

ఇందు బిందుయతి మైత్రి గలదు. ఇది లక్షణమునఁ జెప్పఁబడినట్లు లేదు. మఱి యిందు ఖండాఖండబిందుప్రాస గలదు. దీర్ఘముల మీఁదనే యీ ప్రాసమైత్రి చెల్లు నని రామన చెప్పె. కాని యిందు రామనచేతనే హ్రస్వములమీఁద నీ ప్రాసమైత్రీ విశేషము ఘటితమై యున్నది.

ఇందాఁక నుపలబ్ధా సమగ్ర ముద్రిత ప్రతి ననుసరించి కొన్ని విషయముల సంగ్రహముగాఁ దెలిపితి. సమగ్ర ప్రతికై ప్రయత్నము సలుప వలయుట లాక్షణికుల ముఖ్యకర్తవ్యము. మద్రాసు అడయారు లైబ్రరీలో దీని వ్రాఁత ప్రతి (సమగ్ర మఁట) కలదని వినికి; పరిశీలింప వలసియున్నది. ఇంకెవరివద్దనేని సమగ్ర ప్రతి యున్న నా యీ పయత్న శేషమునకుఁ జేయూఁత యొసఁగ సహృదయుల కిదే నావిన్నపములు.

అముద్రితరచనలు :

# అగుమంచికథ

(ప్రాచీనజానపదకావ్యము)

(శ్రీ వేటూరి ఆనందమూర్తి పరిష్కృతము)

(గతసంచిక తరువాయి)

మొరగడ్డపాడులో నేమానో తల్లి !
కానివార్తలు విన గాంతుమో యేమొ
రాగసరము నేల రాలినందులకు
దేవేంద్రతమకము తెరువులో నేడు
తేలెనో రక్తాన తెలియకుండేను'
అని చెప్పితీసె తా నాచీర నగలు.
అయితన్న తనమీద దయతోడ నిడ్డ
నాచీర సొమ్ముల నగుమంచి తీసె.
మహిమీద వెల లేనిమాంధాళి గప్పి
కైకొని ముత్యాల కంఠమాలికను
చెలువైనకరకంచుచీర తా గట్టి
అలివేణి తా నిల్వుటద్దంబు చూచె.
అద్దంబులోపల నా చీర నగలు
చెలువైనముత్యాలు సిరిదప్పి యపుడు
ముత్యాలసరములు మొగి కాంతి దప్పి
పరగంగ మాంధాళి పట్టుచీరయును
గరిమతో తెలుపుగా కనుపింపసాగ.
అందుల కగుమంచి యాశ్చర్య మంది
''నందుల సిరిదేవి నాతల్లి వినవె !
అయితన్న యిచ్చినయవి కళ దప్పె.
అయితన్న కచ్చ లేమాయెనో తల్లి !
రట్టడిపగతుర రణములో చంపి
గట్టిగా యెదురొమ్ము గాయాలు నాటి
సిరివీరకల్లుగ చెల్లకుండేన !
మాయన్న అయితన్న మహి చెల్లునేని
పోయి మందలు చేరి పాడుకకుండేర !''
అని చెప్పి తీసె దా నాచీరనగలు.
వరుసతో బట్టావులవల్లభన్న యిడ్డ
పట్టంచుతో నున్న ప్రతిమలచీర
గట్టిగా చుట్టెను కమలాక్షి తాను.
భావించి పచ్చల పదకంబు బెట్టి
ఆ వేళ తా నిల్వుటద్దంబు చూచె.
శ్రీమంతుచెల్లికి సిరి దప్పె నగలు.
వామాక్షిచీరపై ప్రతిమల కల్ల
తోడ ప్రాణము వచ్చి దుఃఖింపసాగె.
కడుమంచి పదకంబు కనుల చూడంగ
గురువింద దండయై గురుకొనియుండె.
అక్కన్న యది చూచి కటు చిన్నబోయి
చెక్కిట చెయి జేర్చి సిరిదేవి బిలచి
''వలభన్న యిచ్చినపట్టంచుచీర
పట్టుపై వ్రాసిన ప్రతిమల కల్ల
నిక్కై ప్రాణము వచ్చి యీక్షణముననె
తోచక తమలోను దుఃఖింప సాగె.
నిర్జీవప్రతిమలు నేడు దుఃఖింప
దుర్జనవైరుల తునుమాడి చంప
బట్టావులన్నకు బల్లేలు నాటి
అటు ఘోర యుద్ధాన హతము కాబోలు !
వేడుక మాయన్న వెలిమంద లెల్ల
చూడ నెపము లేదె చూపు తీరంగ''
అని చెప్పి తా దీసె నాచీరనగలు.
కర్రియావులరాజు కరుణతో నిడ్డ
బంగారు నగలును బన్నసరములు
సొంపుగా బెట్టి తా జూచె నద్దంబు.
అద్దంబులోపల నా చీరనగలు
బంగారు నగలకు పసి మెల్ల దప్పె,
సంగతి నామెకు సరిపోక యుండె.
అందుల కగుమంచి యాశ్చర్య మంది
''నందుల సిరిదేవి నాతల్లి వినవె
కర్రియావులరాజు కరుణతో నిడ్డ
సొమ్ములు చీరలు సొంపు దప్పినవి.
అచ్యుతుడు కరియావులన్న పాలేట
పోరాడి వీరుల పోటుల జీల్చి
ఉరుకడి బాణాలు ఉరమున నాట
మాయన్న కలనిలో మడియకుండేన !''
అని చెప్పి తా దీసె నాచీరనగలు.
భీముడు రెరనన్న పేర్కొని యిడ్డ
తామరపూచీర దండిగా గట్టి
అమీద తా నిల్వుటద్దంబు చూచె.
అద్దంబులోపల నాచీర నగలు
సిద్ధమై పసపాడు చీరగా దోచె,

సుద్దనీళ్లను ముంచి చూపినట్లుండె.
భామయా నది చూచి బంధుల జూచి
"సోమశిలమువార చూడుండు మీరు
యరనన్న యిచ్చిన యా చీరనగలు
సరిపోనియందుకు శకునంబు వెరతు.
ఎద్దులు యరనన్న యుద్ధంబు చేసి
సిద్ధిరాజులవారి సేనలు గూల్చి
శిరములు యీటెలు జగ్గరి నాటి
యెరనన్న యీరీతి నేగకుండేన!"
అని చెప్పి తా దీసె నా చీరనగలు.
వాసిగా ముమ్మయ్య వరుసతో నిద్ద
ముద్దులు కులికేటి మురువులు చుట్టి
సందిటకడియాలు సఖియ తా బెట్టి
బంగారుకుచ్చుల బవిరంచుకమ్మ
పొంగుచు నలివేణి పాసగంగ బెట్టి
పసిడివడ్డాణమ్ము బాగుగా బెట్టి
అలివేణి తా నిల్వుటద్దంబు చూచె.
అద్దంబులోపల నా చీరనగలు
ఆరీతిదేహమ్ము నంటక యుండె.
సందిట కడియాలు జాతిపాములుగ
దొలిగొని తమలోను మెలగుచు నుండె.
మురువులు సంతలో ముత్తునిసు లయ్యె.
రవి దప్పి ధరణిపై రాలినట్లుండె.
అది చూచి నాచ్చమ్మ అగుమంచి తాను
పలికెను తల్లితో బాంధవుల్ వినగ
"ముమ్మయ్య యిచ్చినను గిన్నలు నాకు
అమ్మలారా నేడు అనువు గాకుండె.
కల్లందు పోచయ్య సిగ్గున నిద్ద
బాలముమ్మయ్య తా బాలోరు తల్లి
సరినేయ వెల్పాడి సిద్ధిరాజులను
వీరుల బలి చేసి వీరులను కొన
నివ్వాలిరాశిలో నిప్పులో బట్టు
తావులు చెప్పుదు తల్లిరో వినవె.
పోచయ్య ముమ్మయ్య పురహరు గొల్వ
సన్నిధినిల్తురు సత్య మీమాట.
నిండిన దొరకొండ నీలాటిరేవు
దోవలు వాగులై దొంతలు పగులు.
శివలోకపైనాలు చేర్వయ్యె మనకు.
రేపు మాడోజాము దాపైన వేళ
ఆపద పాలేట నావార్త గొంచు
బసువన్న తెచ్చేన పైనాలు మనకు"
అని చెప్పి తా దీసె నా చీరనగలు.
వాసిగా బీరన్న వరుసగా నిద్ద
పట్టుచీరను గట్టి పడతి యగుమంచి
కరమున బంగారు కడియాలు బెట్టి
వేడ్కతో నద్దంబు వేమారు చూచె.
బంగారు కడియాలు భావింప నంత
కంచుకడియములై కనిపించి యుండె.
కొంచక కన్నీళ్లు గోళ్లజిమ్ముచును
"యెలనాగ వినవె యిదేమి చోద్యంబొ
కత్తిపల్లి సింహము ఘనుడు బీరన్న
భక్తితో నిచ్చిన బంగారు నగలు
కళ దప్పినందుకు కారణం బేమొ!
బిరుదుగోసంగులు పరగ బీరన్న
బోడావుల చెన్నయ్య పోరులో నరికి
వాడికరయోన్గుల వధియించినారు
గుజ్జాలు లొటిపిటల్ గట్టలై కూల
మంగొల్లిపాటను మడియకుండీర!
కొంగవాల్ కత్తులు కూలకుండేన!
పట్టకత్తులు వైరిపాలు కాకున్న!
పట్టుచీరగ బంటు భద్రపఱిచితి.
పగవారి శరముల పాలు జేసితివి.
మగవాడు బీరన్న మడిసెనో యేమొ!
ఏవేళ కేవార్త యేరీతి యగునో"
అని చెప్పి తా దీసె నా చీరనగలు
అన్న లిచ్చినసొమ్ము లనువుగా ననుచు
వన్నెగా పురుషుని వారాలసొమ్ము
లగుమంచి తాలిమి నలరంగ బెట్టె.
పూలమాంజిష్టను పూని తా గట్టె,
పులిగోరు ఒంకికను పూని తా దొడిగె,
మొలకచన్నులమీద మొగి బన్నసరము
అత్తుకొన ముత్యాలహారాలు బెట్టె,
సందిటకడియాలు సఖియ తా జుట్టె,
బంగారుకుచ్చుల బవిరంచుకమ్మ
పొంగుచు నలివేణి పాసగంగ బెట్టె,
పసిడివడ్డాణమ్ము బాగుగా జుట్టె,
చెంగైన బంగారు చెరగులచీర
రంగుగా ధరియించె రత్నాలసొమ్ము
లగుమంచి తాలిచె నందాలభరిణె
వేడ్కతో నద్దంబు వేమారు చూచె,
నద్దంబులోపల నా చీరనగలు
పుడమిలో చెల్లికి పూలమాంజిష్ట
పొంక మై యుండెను, పులిగోరు అవిక
పిక్కటిలి యపుడు బిగువుగా నుండె,
అరయంగ సొమ్ముల కటు కాంతి వచ్చె,
మేనికి బంగారు మేలిమి హెచ్చె,

తనువల్లి కాంతికి తా వెరగంది
కన్నతల్లిని జూచి కలకల నవ్వి
"చూచితివే తల్లి చోద్యమ్ము కాని
పుట్టింటివా రిడ్డ భూషణా లేవి
యమరవాయెను గాని అత్తవారిడ్డ
సొమ్ములే యమరెను శుభము కాబోలు!
పురుషు డిచ్చిన యట్టి పూలమాంజిష్ఠ
వార్షమై మేనికి నమరినందులకు
కామనాలసింహము ఘోరాజిలోను
తిమిరేటిమూకల తెగువతో జంపి
యెదురొమ్ము బల్లేలు వీపున వెడలి
చెదరక నారాజు చెల్లె కాబోలు!
నిది నాకు మోక్షంబు యిది నాకు జయము
కాపాడగదరమ్మ కల్ల గాకుండ.
పని బూని కైచేసి పయనంబు రేపు
నందులసిరిదేవి నల్లచెరువులో
వల్లవులతో మంద వాగు వీరనక
పుణ్యపునీరాడ పోగద్దు మనకు.
వైకుంఠపయనాలు వచ్చెగా రేపు.
అమ్మరో!" పెద్దన అర్ధాంగలక్ష్మి
మక్కువ కొమరక్క మరియు నిట్లనియె
"నింతేసి పంతాలు యింతి యగుమంచి
పంతంబు లేటికే బాంధవుల్ మీద.
మనియుండ నిటువంటి మాటలు నీకు
అనగాదు పాపము అన్నలమీద."
పిన్నపెద్దలవారు పలికినంతటనె
అన్నలచెల్లెలు అక్కన్న పలికె
"పగ కల్గె యనుటయా పంతాలు తల్లి!
జగి తప్పి సొమ్ములు చీర లుండంగ
నెరుగగ జెప్పితి మేమి నేరంబు

## గంగను వేడబోవుట

గంగను వేడను గ్రక్కునమీరు
అంగనామణులార! ఆయత్తపడుడు
యదువంశములవారి యాదవసతుల
పిలువక దొనకొండ పెద్ద లందరిని"
మక్కువ విని అగుమంచి మాటలను
వరుసతో బిల్చిరి వారి నందరిని
"పందుముల యో పాప! బండారులచ్చ!
కందువ రారమ్మ గంగను వేడ
నన్నయ్య యో నాగ! నలినాక్షులార!
పన్నుగా రారమ్మ భాగీర్థి వేడ
చట్టువారి చాన! చల్ల నాగమ్మ!
గట్టిగా రారమ్మ గంగను వేడ
మకుటకోటి మల్లమ్మ! మర్ల యెల్లమ్మ!
తటుకు దామసాని! తల్లిగో రాగో
గోదారి సిద్దమ్మ! గొట్టేటి పెద్దమ!
ఆలగోవిందమ్మ! ఆవులనాగ!
దండు బోయిన యెర్ర! తరుణలా మీరు
నాడువేడుకతోడ నెలతలు రండు
గంగనువేడను కదలి రారండు
జుట్టు బోయిన వెంగ! బుడదారిగంగ!
గట్టిగా రారమ్మ గంగను వేడ"
అమరగంగ నంగు మంచి యప్పల బిలచి
వ (ఒ) ప్పగ నగుమంచి వదినల బిలిచె.
"భర్తుని నలమేడ! పయనమై నీవు
అతివేగ రావమ్మ ఆవులన్నగంగ!
అయితన్న యో పోత అర్ధాంగలక్ష్మి
పయనమై రావమ్మ భట్టావులనూర!
కర్రియావుల నాగ! గంగను వేడ
నెరసన్న యోబమ్మ! వేగ రారమ్మ
ముమ్మయ్య చినమల్లు! మొగిసిరి గిరమ్మ!
కమ్మకొని రారమ్మ గంగను వేడ"
అందరి పైనాలు అతివేగ జెప్పి
చందనగంధులు సముఖాన నిలువ
అక్కన్న గంగమ్మ కతినిష్ఠతోను
మక్కువతో నేస మరివేగ జేసి
అరయంగ జవ్వాది అగరు ధూతియును
సిరి మించు బంగారు చిటిగిన్నతోను
రంగుగా నిడుకొని రమణి యగుమంచి
అంగనామణి యప్పు డతివేగమునను
ఆదివారపుబావి చేది దెప్పించి
గరిమతో బంగారు కలశాల నించి
చామంతి కురువేరు చెంగల్వ పూలు
వేమారు మల్లెలు వికసించు మంచి
పొన్నలు మల్లెలు బొండు మల్లెలను
వన్నెగా జాజులు వాసించుపూలు
పరగ దాంగర్లతో పట్టించె నంత.
అరయంగ నగుమంచి యతివేగమునను
ఒప్పుగా గందమ్ము నొసరంగ గాజు
కుప్పెలలో నిండ కుదురుగా నుంచి
ఆటకలి పట్టించి యగుమంచి తాను
మేటిరాజుకు చెల్లె మెలత యగుమంచి
దీవించి బోనాలు తెలివితో నంత
భావించి యగుమంచి పట్టించె నంత.

వీరగందపు కుప్పె వెలదుల చేతి
కరయంగ నిచ్చెను అతినిష్ఠతోను.
బంగారు నివ్వాళి పళ్యాలు తెచ్చి
సంగతి సాంబ్రాణి సరస వేయించి
రాజుల చెల్లెలు రమణి యగుమంచి
పూజల్ల కెత్తించె పూల దండల్లు.
కాట్రాజు చెల్లెలు గంగను వేడ
పైనమై వచ్చెను పణతి యగుమంచి.
చుట్టాలు పక్కాలు మామవారలతో
రణభేరి మ్రోయంగ రమణి తా గదిలె
కుచ్చుల ముత్యాలు కూర్చిన యట్టి
పచ్చల పాలకి పద్మని తల్లి
దండైన నీలాలు దాపిన యట్టి
వెండి పాలకిలోన వెలది యగుమంచి
కనకభూషణములు కళల గ్రుక్కెటి
అనువైన పాలకి నమ్మ కౌమరమ్మ
మణులు భూషణములు మాటి యున్నట్టి
అనసుల పాలకి నమ్మ సిరి దేవి
వరుసగా నెక్కిరి వార లందరును.
పల్లవులు నగరిలో వాకిలి ముందు
చలమైన బాజాభజంత్రీల వారు
నరగలు రుంజులు నైతి కైముల్లు
సన్నవీరణములు శంఖులధ్వనులు
కనకతప్పెట్లును కాళికొమ్ములును
భోరన చెలగంగ భూనాథు చెల్లె
గారవంబున నేగె గంగను వేడ.
అంగడివీధిని హనుమంతుగమిని
రంగుగా వచ్చిరి రమణిగోపికలు.
గమిని దాటంగాను గంగమ్మ గుడిపై
రలిమించు బంగారు రత్నాలకుంట
కనిపించె యాదవకాంతల కపుడు.
పల్లకీలు దిగిరి భామినీమణులు,
అందలాలు దిగిరి అంగనామణులు.
పాదచారు లగుచు భామ లందరును
ముదముతోడుత వచ్చి మ్రొక్కిరి భక్తి.
తూర్పుగమినికి బోయి తోయజముఖులు
నేర్పుతో గుడికిని నెలతలు మ్రొక్క
భూతకోట్లకు నెల్ల పురుషుడైనట్టి
పోతరాజుకు వారు పొందుగా మ్రొక్కి
యూగి యాకాంతలు అప్పుడు వేడ్క
భోగిని యెదుటను బోనాలు దించి
తిరుమందదాగుల తీరుగా నిలచి
తిరుకాపు దియ్యగా సెరగొప్ప బలికె.
తిరుకాపు దియ్యంగ తిరుమందు లంత
నక్కన్న మొదలైన యాదవసతులు
మక్కువ లోనికి మరి పోయి రంత.
నాగభూషణునికాంతకు మ్రొక్కి భక్తి
పట్టుపటాభళ్లు పరపించి వేగ
పట్టి దింపించెను పాదపూజంత.

## గంగ నలంకరించుట

చక్కని గంగకు సంపంగి నూనె
అక్కన్న శిరసంటె నతినిష్ఠతోడ.
శిగసంటి గంగకు చెలియ కస్తూరి
పసుపునల్గుల దీర్చి పణతి శీకాయ
అటకలి తగ నిడి అతివేడ్కతోడ
కలకంఠి బంగారుకలశాల ముంచి
జలకంబు లార్చిరి జాహ్నవి కపుడు.
మేలిమిపట్టున మే నెల్ల తుడిచి
విప్పుచు గంగకు వీరజడ లల్లి
తుప్పల తలయార్చి ధూపాలు వైచి
కడువేగ బంగారు కాంతిగలట్టి
పొడువైన బంగారు పుట్టంబు గట్టి
అగురుగందము మేన నలది కస్తూరి
నగలు రా బూసిరి వామాక్షి కపుడు.
కాటుక తగ నిడి గంగకు నపుడు
దీటుగా కస్తూరి దిద్ది రొకబొట్టు.
బవిరెలు కుంకెండ్లు పసుజాకమ్ములను
సవరించె కర్ణాల సఖియ గంగకును.
పగడాల సరములు పచ్చపదకాలు
జగదేకమాతకు సరవితో నిడిరి.
కీర్తులు కడియాలు కీల్ కంకణాలు
పుత్తిలిగాజాలు స్ఫూర్తిగా దొడిగి
కర మొప్పగా వ్రేళ్ల కనకముద్రికలు
ధరియింపగా జేసె తరుణి యగుమంచి.
పసిడివడ్డాణమ్ము బాగుగా నిడిరి.
పసమించ నగుమంచి బాగుగా దిద్ది
శివుని యిల్లాలికి చెలువుగా బెట్టె
నవరత్నఖచిత మానవకిరీటమ్ము.
పంద్రెండు చేతుల భాగీర్థి కపుడు
మెండైన సొమ్ముల మెరుగులు హెచ్చె.
గంగకు సొమ్ములు ఘనముగా బెట్టి
సింగారములు చేసి చెలియ యగుమంచి.
ఘుమఘుమఘుమ యని కమ్మవాసనల
భ్రమరాంబరకును కుప్పెపన్నీరు జల్లె.
వెలయంగ కస్తూరి నలిపించి యపుడు

చెలువుగా గందంబు చిలికించి యపుడు
పాలేటి కేగిన ప్రభువుల దలచి
పాలోని అన్నల పోలికల్ జూచె.
అన్నల పోలికలటు చిన్నబోయి
వన్నె దప్పుచు రక్తవర్ణమై యుండె.
అందుల కగుమంచి యాశ్చర్య మంది
"నందులసిరిదేవి ! నా తల్లి వినవె
దుర్వాసశాపమ్ము దొనకొండ కిపుడు
దుర్వారమై యుండు దోషమ్ము కలదు.
పాలుయెర్రనైన పోలిక వినుడి
ఆలమందలు రిత్తలయ్యీని తల్లి"
వాలాయముగ నెంచి వార్తలు తెలిసి
తాలిమి బోనాలు తగగ దెప్పించి
వరికొత్తబోనాలు (ఒ) వకప్రక్క నుంచి
కొఱకొత్తబోనాలు కొంనక నుంచి
నూటొక్క అట్టును నూటొక్కముద్ద
వాటముగా నిల్పె వనిత యగుమంచి.
పాటించి యాలోన పణతి యగుమంచి
మేలుముద్దగ జేసి మెండుగా నిల్పి
పప్పును నేయును పలుశాకములను
వ (ఒ) ప్పుగా వడ్డించె వనిత యగుమంచి.
వారిబోసి యగురు వరుసతో బూసి
పేరుపేరున బిల్చె పెద్ద లందరిని.
"నివ్వాళి యియ్యరో ! నిలుచుండి యెదురు
అక్కన్న మొదలైనయాదవస్త్రీలు
పండుముల యెరణప్ప పైడివారితల్లి
కందువనివ్వాళి గంగ కియ్యంగ
నన్నయ్య ముద్దయ్య నాగయకొమ్మ
పన్నుగా నివ్వాళి భాగీర్థి కియ్య
చట్టువారిచాన జడవారిచాన
ఘట్టిగా నివ్వాళి గంగ కియ్యంగ
పులిమద్దులపాత్రి భూమాడిపాత్రి
కలగక నివ్వాళి గంగ కియ్యంగ
పండుముల యోపాప బండారులచ్చ
కందువనివ్వాళి గంగ కియ్యంగ
భక్తుని నలమేడ పణతి వీరగంగ
భక్తితో నివ్వాళి పడతి కియ్యంగ
అయితన్న యోపోత వలనన్నసూర
కయికొని నివ్వాళి గంగ కియ్యంగ
కరియాపుల నాగ గొరనన్నబయ్య
గరిమతో నివ్వాళి గంగ కియ్యంగ
పోనయ్య సిరిగిరి ముమ్మయ్యమల్లి
ఘనముగా నివ్వాళి గంగ కియ్యంగ"
అగుమంచి మొదలైనయాదవస్త్రీలు
పాడి చాలించిరి పళ్లెముల్ దించి.
అటు వెన్క మాతంగ అయిదువల్ వచ్చి
నీటుగా నీలాల నివ్వాళి దెచ్చి
మొగమంటపంబున మొత్తమై నిల్చి
తగు నెత్తి పాడిరి తాము నివ్వాళి
పాడి చాలించిరి పళ్లెముల్ దించి
పాదుకొని నిలువ భామ లిర్గడల
ధీమంతు చెల్లెలు దిట్టతనాన
వేమారు గంగను వేడుకోసాగె
"ఆదిశక్తివి నీవు అఖిలమాతవు నీవు
నాదిరంబులు నీవు నవబ్రహ్మ నీవు
భువనంబులు నీవు భూములు నీవు
రవిచంద్రులు నీవు రాగంబు నీవు
భోగంబులును నీవు బుధులు నీవు
యోగంబులును నీవు ఉదధులు నీవు
పురువంబులును నీవు కదనంబు నీవు
మనుజులెల్లను నీవు మాయలు నీవు
కాల మెల్లను నీ వకారంబు నీవు
వేడివానలు నీవు వెలుగులు నీవు
పాడిపంటలు నీవు పశువులు నీవు
నక్షత్రములు నీవు నభములు నీవు
పక్షులు యక్షులు పన్నగౌఘములు
కారంబు నీవు ఓంకారంబు నీవు
సారంబు నీవు సంసారంబు నీవు
మెలగు వాయువు నీవు మేఘంబు నీవు
అల వేదములు నీవు అమరులు నీవు
అండంబు నీవు బ్రహ్మాండంబు నీవు
కొండగృహము నీవు కోనలు నీవు
సంధ్యలు తపములు జపములు నీవు
తత్త్వంబు నీవు మహత్వంబు నీవు
గంగరో మాపాల కలిగుంటివైన
రంగుగా పాలేట రాజుల శుభము
మాతోను జెప్పవే మము గన్నతల్లి
భూతలపతు లైన పుణ్యసోదరులు
యెరగడ్డపాటను యెట్లున్నవారో !
యెరుగను ఓ తల్లి యెవరి వేడుదును !
మాకు దిక్కవు నీవు మహియందు గాన
చేకొని నీసేవ జేతు నిత్యమ్ము.
పరులమె మాతోడ పలుకవు నీవు ?
ఊరకే యున్నావు ఓ యమ్మ నేడు"
అక్కన్న వేడితే అప్పు డెరుకమ్మ
ఉక్కుబొమ్మావలె నుండెను గంగ.

అప్పుడు గంగను నందరు జూచి
తప్పక తమలోను తలపోసి రంత.
"పాలతులారా ! యిన్ని బోనాలు తెస్తే
కలకల నవ్వుచు కనువిచ్చు గంగ
అమ్మలారా ! యిదో యాగడం బౌను
కమ్మక యీ గంగ కళ దప్పె గాన"
అక్కన్న యంతట నాదుర్గ జూచి
మక్కువతో వేడి మరియు నిట్లనియె.
"వేటలు బోనాలు వేగ దెమ్మనుచు
పాటించి నాతోడ పలుక గా దటవె ?
చేడెరో మాయన్న క్షేమమ్ము వింటే
పాడించి పదివేల పాడిగొఱ్ఱెలను
చాలగా నరికింతు శక్తిగో నీకు.
వంతు కెక్కిన యట్టి వారి కీనాడు
సంతోష మాయె నా జాహ్నవీ గంగ
మత్తాయిరో నీకు మనసుకు గాక
ఈ తరఫు గమిని నూరేగ జేతు.
ఆలమందలరాజు లన్నలనుండి
మేలువార్తలు విన్న మించిన ప్రేమ
దక్షిణపు గమిని దామెనవేట
తీక్షణమే యిత్తు నింతిరో నీకు.
చక్కని మాయన్న సంగ్రామజయుడు
కక్కసపు వైరి కంఠీరవుండు
సేనలు తానును క్షేమాన వస్తే
మానిని ! యెత్తైన మలల నున్నట్టి
యేపెలు నరికించి యిల బండిసిల్లు
మాపటి కాడింతు మాతల్లి నీకు.
చల్లవాగేగురు సాహసఘనులు
చల్లనై వస్తేను సంతోషమునను
ముందు జడ లిడుదు ముదితగో నీకు.
యెద్దులు బొల్లావు నెలమి నయితన్న
నెలతరో ! క్షేమమ్ము నే వింటినైన
చేతివూటిత్తును శాంభవి నీకు
ఆవులన్నల క్షేమ మటు వింటినైన
మూపు గండల నిత్తుముదితగో నీకు.
పలికొండ పెద బావ పద్మరాఘవుడు
చుట్టువారెఱ్ఱయ్య చిట్టినామరది
లేమగో పాలేట లెస్సగా నుంటే
భామరో యెత్తింతు పదివేల దివ్వె.
నాదెళ్ల నాయుడు నాదుపోచయ్య
వాసిగా తిరుమంద వరుసలవారు
తిన్నగా నుంటేను తీరుగా నీకు
పన్నుగ కుంకుమ బండ్లు తోలింతు.
ప్రాణనాథుడు తన్ను పాయనిమగడు
రాణుకనుత్తమ రాజు పాలేట
క్షేమాన నుంటేను శాంభవి నీకు
భక్తితో గట్టింతు బంగారుగుడియు.
రాతిగుడియు నీకు రమణ గట్టింతు.
మాయన్న బీరన్న మన్నీల వైరి
కాయజు సాటి మా ఘనుడు చెన్నయ్య
మేలైన ధీరులు మేటిగోసగులు
పాలేటి దక్షిణభాగమ్మునందు
తీరుగా నున్నట్లు తెలిసితి నేని
భారి గుండము జొత్తు భాగీర్థి నీకు.
బసువన్న గోకులపరమపుణ్యుండు
వెసలక్ష్య యాదవవీరకంపటము
నక్షయ మొనరించి యాదుకో తల్లి
దక్షిణపాలేట తల్లిగో గంగ !"

## గంగ దుఃఖించుట

అగుమంచి వేడగా నప్పు డెకమ్మ
మిగులంగ మేఘముల్ మెరసిన ట్లుండె.
పటపట మని గుడి పగిలిన ట్లాయె.
కటకట యేడ్చెను కన్నులపాప.
జొటజొట కన్నీరు జోరున కురియ
గడగడ వణికెను కంభ మాదిగను.
రవ్వలు చెదిరెను రత్నాలు రాలె.
మువ్వలు గజ్జెలు మురమురలాడె.
యెరువమ్ము గందమ్ము యెఱ్ఱనై పోయె.
పరగంగ మాంధాళి పచ్చనై పోయె.
గంధము యెఱ్ఱనై కాంతియు దప్పె.
అందంబు తప్పె నయ్యాలివమే నెల్ల.
పువ్వులతోమాలు భూమిపై రాలె.
పువ్వుల రేకులు పుటపుట రాలె.
కుడికంట రక్తము కురియంగ సాగె.
యెడమ కంటను నీరు యేరులై పారె.
దడదడమని గంగ తల్లడ మందె.
గుడిలోని గంగమ్మ గుడియెత్తు పెరిగె.
గర్భగృహములోని గంగను జూచి
బొబ్బలు పెట్టెను పోతులరాజు.
భాగీర్థి యడలంగ పడతులు చూచి
తెగువతో దుఃఖంబు తెచ్చి రందరును
సిరిదేవి పొందైన చెలువ లందరును
తాటాకుమంటలై తల్లడ మంది
కుమిలిపోయిరి మేను కుమ్మరావముగ.
తామరనీరుగా తల్లడ మంది

తొటతొట కన్నీరు తొరగి రందరును.
వామాక్షి గంగ కీర్వంకలం బైరి
ఆగంగ దుఃఖమ్ము నగుమంచి యపుడు
ఆ గంగ జూచెను అతివ తా నపుడు
" శాంతమె రుద్రాణి! శాంతి భద్రాణి!
శాంతమె చండిక! శాంతి అపర్ణ!
శాంతమె జమదగ్ని! శాంతి జగదంబ!
శాంతమె శివు భామ శాంతి మహామారి!
శాంతమె పరంజ్యోతి! శాంతమె నీకు"
అనబెట్టిన గంగ యగుమంచి పల్కు
మునుకొని తా శాంతమూర్తి యై నిల్చె.
ధీరుని చెల్లెలు దిట్టతనాన
దూరంగ సాగెను తోయజముఖిని.
" అమ్మరో నీ కిట్టు లతిదుఃఖ మైతే
కమ్మక పాలేట కల్గు మావారి
కంతంబులును చేరు వారొ కాబోలు!
యింతిగో యాదవుల కిలవేల్పు వనగ
కాంతి మాసిన దేమి గతి యేమి మాకు?
మున్ను మా కెల్లను పాదముతో నీవె
మిన్ను విరిగి వచ్చి మీద వ్రాలినను
అరచేత నాపెద నంటవో తల్లి.
అరచేత నాపక నన్నలమీద
దయతప్పి విడచితే తల్లిరో గంగ.
భయపడి పోతివే బాగిద్ద గంగ?
కన్నుల నిద్రలో కలవరించినను
యెన్నడు నితరము లెఱుగమో తల్లి.
వాటమై చేకూరువద్ద పోల్రాజు
డీటుగా చెల్లినదినము లిప్పటికి
నరువది యేండ్లాయె యంతంబు వచ్చె.
అరమర లేలమ యాడు మొక మాట.
నడుభూమి నున్నట్టి నావారి గొంచు
పడద్రోసి వస్తివే పాలేటినడుము?
నిను వేడినందుకా నెలతరో గంగ
చిన్నబోయున్నావు సిద్ధంబుగాను.
మొక్కితిమో తల్లి మోసంబు లేక
దిక్కు మాలినపక్షి తీరాదు మేమి?
నాగూడి పలుక వన్యాయమా నాకు
నాగూడు నిలుపవు న్యాయమా నీకు
మేఘము కప్పగా మీనాక్షి యుండె
పగవారు మా మీద బారు లెత్తెదరో!
గడగడ లాడుచు శాంత యుండంగ
పుడమిమీకుమందల పాడువకుండేర!

కన్నుల పాపలు గంగ శోకింప
కన్నార! దొనకొండ కాకపాడేమొ!
కంచాలు గడగడ కదలి నందులకు
కుంభిని దొనకొండ కూలె కాబోలు!
ఉరము భూషణము లుర్రూగినందులకు
మెరచెడి పాపన్న మేడ రాలేనొ!
యొగువమ్మ గందము లెర్ర నగుటకు
పాకనొ రక్తంబు పాలేరు నిండ!
సేసలు వడివడి చెదరినందులకు
పస చెడి దొనకొండ పాడయ్యె నేమొ!
పూవులతో మాలు భువిని రాలుటకు
భావింప మొండెముల్ సాగాడు నేమొ!
ఆశీల శివపురి కందగ కిపుడు
కలిగెని! నమ్మగే! కన్నార మీరు.
చుక్కలు రాలుట చూచితి నేమి
గ్రక్కున పైనాలు కలిగెని తమకు
దడదడమని గంగ తల్లడిల్లుటకు
గుడియెత్తు గంగమ్మగుడిని లేచుటకు
గర్భ గృహముకడ కన్నార! తమకు
శోబానగుండాలు సొద లేర్పడీని!
గొనకొని పోతయ్య కూత పెట్టుటకు
దనకొండ పట్నమ్ము దగ్ధమయ్యాని!
పక్షులు చీకాకుపడి కూయుటకును
పక్షులై ప్రజ లెల్ల పారకుండేగ?"
పరిపరివిధముల పలుమారు మారి
గరిమెతో నగుమంచి గంగతో పలికె.
" ఇప్పుడు మానితే నీ నాటిరాత్రి
కర్పూరగంధి! నా కలలోను వచ్చి
యొప్పంగ మేలును నొసరంగ కీడు
చెప్పవే అన్నల క్షేమంబు నాకు"
అనుచును నగుమంచి యప్పా డిట్లనియె.
" పదరమ్మ పోదాము పట్నాని కికను"
మధురాక్షి అగుమంచి మాటలు వినిరి.
" కలకంఠి! దూరంగ గంగ నేమాయె?
బాలరాజుల కిపుడు పాలేటి నడుమ
కాలము చేర్వయ్యె గంగేమి జేయు?
ఎంత వారికి నైన నీశ్వరు మహిమ
దొంతుల దాచినం దాగునటమ్మ
అట్టి గంగను దూర నక్కన్న! తగదు"
గట్టిగా నందరు కలియంగ జేరి
తెగువతో గంగకు దెచ్చినయట్టి
బోనాలు కొన్కలు పూజల్ల కిచ్చి
నానతి యిచ్చుచు నక్కన్న కదిలె.

వారు పాలకి లెక్కి పరుసతో వచ్చి
మచ్చిక వల్లవులు మగువల బిలిచి
హెచ్చైన తిరుముందు లింతుల బిలచి
ఆవేళ నగుమంచి యందర నంపె.
అప్పుడు అక్కన్న యరుదెంచి వచ్చి
రంజిల్లు వజ్రాల రత్నకూటమున
వనరంగ గూర్చుండె తాపంబు దీర.
ఉవిదలు చెంబుల నుదకాలు దెచ్చి
ముఖమజ్జనము జేసి ముందర నిలచి
బంగారు పళ్ళెముల పాయసాన్నములు
సంగతి వడ్డించి సఖియ లందరును
బంతిగా గూర్చుండి పంతు లందరును
మద్రసోపేత మా నరసాన్నములను
ఆ యెడ భుజియించి రందరు గూడి.
వడి దప్పి యక్కన్న వాతెరబూన
కళ దప్పి యన్నము కవురాయె నంత.
అందుల కగుమంచి యాశ్చర్య మంది
"యెందుకు వగతు నే నేమి సేయుదును ?
కాశికి బోయిన ఘన భక్తిరన్న
రాకపోవుటకు నై రాగడిల్లుదు నే !
పావురాలయన్న పరిణామ మేమొ
తెలియనంగలకు చింతిల్లుదు నేమి !
తలకొని యంతంబు దాపాయె నేమొ"
"సారెకు నీ కేల శకునాల రెంన
నేరీతి జరగిన నేమి జేసేము?
యేడుతిరాల్ పెద్ద లేరమ్మ యిపుడు ?
వాడవాడల నెల్ల వారు లేరమ్మ ?
వాలాయముగ బ్రహ్మ వ్రాసి యుండంగ
తాలిమితో నిండి ధరణిలోపలను
చావును బుట్టువు సరి జేసెనమ్మ"
అని యల్క దీర్చిరి యంగ నామణులు.
ఉచితంబు కా దని యూరడింపుచును
కాంత లందరు చేరి గారవింపుచును
పాలును మీగడ పంచదారయును
బంగారుగిన్నెల బాగుగా నించి
యారగింపగ జేసి రక్కన్న కపుడు.
రేములు తల్లి కాలింగన మ్మిచ్చి
భామలతోడుత పాలకి నెక్కి
కొమరమ్మ నగరికి గొబ్బున వచ్చె.
అంతట సూర్యుండు నస్తాద్రి గ్రుంకె.

## అగుమంచి కల

మలయుచు నక్కన్న మందిరంబునను
సరసత పఱచినజాజులశయ్య
సవరించి యగుమంచి శయనించె నంత.
అర్ధరాత్రివేళ నరుదెంచె గంగ
వల్లవు లందరు వసుధ పాలేట
చెల్లినవారలు శక్తి తా నెరిగి
మొల్లసుగంధి తా ముస్తీగు చేసి
పండ్రెండు చేతుల భద్రాయుధములు
తా (నే) సగిన్నెయు చేత చక్రమ్ము బట్టి
నారాయణును పేర నాట్య మైనట్టి
యొరువమ్మ తేజీని యెక్కి తా గదిలె.
నిరతము దొనకొండ నిరజనేత్రి
గట్టిగా తరుణికి గల చెప్పవచ్చె.
రంగు మీరగ వచ్చు రమణికి నపుడు
గందపట్టెల మంచి ఘన మైన తలుపు
కనకశూలము జూప గడియలు దొలగె.
చప్పుడు సేయక చంద్రశాలకడ
కర్పూరగంధి తా కర్పూరదివ్వె
తప్పక మలిపెను దానసంహారి.
మచ్చెకంటి యపుడు మాధవుని చెల్లె
లక్కన్న దగ్గర కటు తాను వచ్చి
పచ్చనకోతలను పై బడచల్లె.
గంగ తా ముత్యాల గద్దెపై చేరి
చెప్పంగ సాగెను శీఘ్రమే తాను.
"అక్కరో! యేమంగు నక్కడి విధము
నేమి నిద్దరబోదు విటి యక్కన్న ?
వామాక్షి ! నిద్రయాపద లెఱుంగదె !
నన్నెల దూరితి నామాలపినవె.
రాసతో మీవారి వార్త చెప్పేను.
శ్రీ తాళదెబ్బను శివునకు త్తంగ
నలరచమురు చింది యదరెను లేవె.
అమ్మన్న! దొనకొండ కాపదబుట్టె.
పాయక దివ్వెలు పాలేట మలిగె.
తప్పక యగుమంచి! ధరమీద చెల్లి
యొప్పదప్పచు వార లోరిగిరి లేవె.
అయిగుకొండలచుట్టు నవ్వాలచుట్టి
వహిచెడపోయిరి వారలు లేవె.
కరుణతో గంగవాల్ కత్తులమీద
చిరుదైన బెబ్బులి బిరుదాంకములును

(సశేషము)

Edited and Published by T. Ramachandra, 2/583 Pycrofts Road, Madras 5.
Printed by G. Bhavanarayana at the Weldun Press, 146, T. H. Road, Madras-21.



# పరిశోధన

(సారస్వత ద్వైమాస పత్రిక)

మన్మథ - గ్రీష్మం

8

ఒక రూపాయ

జూన్-జూలై 1955

# అనుక్రమణిక

—: * :—



ంపుటి 2. | సంపాదకుడు : తిరుమల రామచంద్ర | సంయుక్తసంపాదకుడు : తిమ్మావజ్ఝల కోదండరామయ్య | సంచిక

పురాతత్త్వం :

# శత్రుదమనమహారాజు - దూగాము శాసనము

శ్రీ కజ్జి వేంకటసుబ్బరాయశాస్త్రిగారు

ఈ శాసనము శ్రీకాకుళముజిల్లా తిలారు రైలుస్టేషనునకు పడమట మైలుదూరమున గల పెద్దదూగాము అను గ్రామమున నొకరైతునకు పొలము దున్నుచుండగా దొరికినది. దాని నాతడు ప్రాఁతరాగిగా అమ్మివేయగా టంకాల అప్పల నరసింహులుగారు కొన్నదానిని జూచి నేను శాసనపాఠము ప్రతి వ్రాసికొంటిని. శాసనము రేకులు వారు శ్రీకాకుళము మండలకరగ్రాహి కిచ్చివేసినట్లు తెలిసినది. అది యెందైన ప్రకటింపబడునేమో యని వేచియుండియు నిరాశుడనై పరిశోధనలో బ్రకటింప నుబలాటముతో బంపితిని.

## ఆకారము :

శాసనము మూఁడు రాగిరేకులు. ఇంచుమించు ఏడంగుళములు పొడవు, 3½ అంగుళములు వెడల్పును, ప్రాఁతకాలపు కొనియంతటి దళసరి గలిగి, యెడమవైపున అంచుసమీపమున గల రంధ్రములో దూర్చబడిన రాగికడియముచే బంధింపబడినది. కడియము సుమారు 8 అం॥ పొడ వుండును. కడియము కొసలు రెండు ఒక దిమ్మలోనికి దూర్చఁబడి అతుకఁబడినవి. దిమ్మ పైభాగము అక్షరములు పోత పోయుట కనువుగా నున్నదిగాని దానిపై నక్షరములు కాని రాజలాంఛనము లేవి కాని లేవు. అవి అసలు లేనే లేవో లేక అరిగిపోయినవో యూహింప ననువు కాలేదు.

## శాసనవిషయము :

శత్రుదమనమహారాజు బట్టువగ్రామ వాస్తవ్యుఁడగు యజ్ఞశర్మకుమారుఁడు, కాండిన్యస గోత్రుఁడు, తైత్తిరీయ సబ్రహ్మచారి యగు బప్పశర్మకును, శర్వశర్మకును మూఁడుగ్రామములు దానము గావించినాడు. శాసనము విజయ

సింహపురమునుండి ప్రకటింపఁబడినది. శత్రుదమనుఁడు తన కులగోత్రము లేవియు తెలుపలేదు. మహారాజు నని మాత్రమే తెలుపుకొన్నాఁడు. శాసనాక్షరము లగు ప్రాచీన వేంగి లిపివలన నితడు హస్తివర్మవలె ప్రాచీను డేమో యను సంశయ ముదయించుచున్నది. త్రిలింగ తామ్రశాసనము, హస్తివర్మ ఉర్లాము, నరసింగపల్లి శాసనములును, ఇంద్రవర్మ జర్జంగి తామ్రశాసనము, ఈ ప్రకృత తామ్రశాసనమును మాత్రమే కళింగమున నుపలబ్ధము లైనవానిలో వేంగిచాళుక్యలిపిలో నున్నవి. తక్కినవి నందినాగరిలోను, ప్రాచీన తెలుగు కన్నడ లిపిలోను చెక్కబడినవి. కాఁగా నితడు లిపినిబట్టి ప్రాచీనుఁడే యనదగును. సాధారణముగా గాంగ గంగరాజుల కులదైవత మగు గోకర్ణేశ్వరస్వామి ప్రశంస యిందు లేదు. రాజు తాను "దమనేశ్వర పాదానుధ్యాతుడ" ననియు "భట్టారక పాద పరిగృహీతుడ" ననియు చెప్పుకొన్నాఁడు. ఈ శాసనమున నొక్కచో గల కళింగ పదము దక్క నీశాసనము కళింగమందలి దని తెలుపు సాధారమే లేదు. దానివలననే శాసనోట్టంకితము లగు గ్రామము లన్నియు గుర్తింపబడినవి. ఈతడు సకల కళింగాధిపతి నని గాని త్రికళింగాధిపతి నని కాని చెప్పుకొనలేదు. కోలువర్తనీ, వరాహవర్తనీ, కంటకవర్తనీ, క్రోష్టుకవర్తనీ మొదలగు దేశప్రాంతీయ విభాగములను చేర్కొన లేదు. ఇట్టి సర్వశూన్య మగుశాసన మైనను నిది కేవలము అప్రమాణ మని ఉపేక్షింపదగినది మాత్రము గా దని నా నమ్మకము.

ఈ శాసనమున చేర్కొనబడిన గ్రామము లన్నియు శ్రీకాకుళంజిల్లాలో కలవు. దేవగిరి యనుపదము దేవాద్రి యనుటకు పర్యాయముగా నుపయోగింపబడినది. ఆ శబ్దమందలి చివరి రేఫము లోపించి "దేవాది" యని వ్యవహరింపబడు గ్రామము గలదు. దానిని దేవిడిగా చరిత్ర మెఱుగని జమీందారులు వ్యవహరించినను నెల్లరును దేవాది యనియే వ్యవహరించుచున్నారు. దుమగ్రామము దూగా మనుపేరను, వసువాటకము బసివాడగను, గోవాటము గొట్టివాడగను, వర్ధమానాగ్రహారము బడ్డవానిపేటగను వ్యవహరింపబడుచున్నవి. ప్రతిగ్రహీతల నివాస మగు బట్టువగ్రామము 'బాడాము' కాని బట్టేరు కాని అయియుండును. శాసనమున చేర్కొనబడిన దుమగ్రామము (దూగాము) నందే ఈ శాసనము దొరికినది. ఆ గ్రామముననే దాత యిష్టదైవ మగుదమనేశ్వరస్వామి యాలయ ముండెడిది. ఆ ప్రాచీనాలయము శిథిలము కాగా క్రొత్తగా నీ నడుమనే యొక తెలుకులభక్తుడు నూతనాలయము నిర్మించినాడు. దుమగ్రామము దూగా మైనట్లే దమనేశ్వరుని పేరుగూడ దానేశ్వరు డని జనవ్యవహారమున మాఱినది. ఇంత ప్రబలసాక్ష్య ముండగా శాసనము అప్రమాణ మని యెట్లు చెప్పగలము? శాసనము విజయసింహపురమునుండి ప్రకటింపబడినది. ఈ సింహపురము సింగుపుర మనుపేర వ్యవహరింపబడుచు శ్రీకాకుళమునకు సుమారు ఏడుమైళ్లదూరమున గలదు. సింగుపురమున నొక ప్రాచీన శివాలయమును గొన్ని ప్రాచీన శిలాశాసనములును గలవని వినియున్నాను. కాఁబట్టి అదియే విజయసింహపురము కాదగును. లేదా దంతాపురమునకు సింహపుర మనునామాంతరము గలదని శాసనములవలన తెలియుచున్నది కదా? అయినచో నా దంతపురము ప్రస్తుతము దంతవక్త్రుని కోట దంతాపురపుకోట యని జనులచే వ్యవహరింపబడుచున్నది. ఇప్పటికి స్థలనిర్ణయము గావింపబడినది. ఇంక కాలనిర్ణయమునకు వత్తము.

## దానకాలము :

దాతకాలము తెలిసిన గాని దానకాలము నిర్ణయింప నలవు గాదుగదా? "ఇత్యేవ లిఖిత సంవత్సరే నవమే ఆషాఢమాస దివసో దశమో" అని శాసనలేఖనకాలము తెలుపబడినది. దాతయగు శత్రుదమనుని పాలనకాలము 9వ యేట నని దీనివలన తెలియును. కాని దాత యేకాలమువాడో నిర్ణయించు టెట్లు? శాసన లిపి, భాష, ప్రకటింపబడిన స్థలము, దాతవంశాదికమును, కాలమును నిర్ణయించుట కాధారము లగును. ఈ రాజు తన కులగోత్రములు చెప్పుకొనలేదు సరిగదా? తన యేలుబడి రాజ్యమైనను చేర్కొన లేదు. పోనీ రాజు కాడందుమా? మహారాజు బిరుద ముపయోగించుకొన్నాడు. అట్లని అందరు రాజులు ఆజ్ఞాపించిన ట్లాజ్ఞాపించలేదు. మీదుమిక్కిలి "యుష్మాభి శ్శ్రోతవ్య మాజ్ఞా చ కర్తవ్యా" యని సర్వాన్ వ్యాణపురోగ గ్రామాధికారులను గోరు

చున్నాడు. పరస్పరవిరుద్ధము లగు నీ విషయము లెట్లు సమన్వయ మగును? ఈ విరుద్ధవిషయము లెట్టి శాసనమున గలిగినవి యని యాలోచించి చూడ శాసనరచయిత తా నేభాషలో శాసనము రచింప దలంచెనో ఆ భాష నే నలిపి నలిపి హత్య చేసి పారవైచినాడు. పదముల పరస్పర సంబంధము తెలుపు కారకమర్యాద యాతని చేతిలో నీఱుగారిపోయినది. లింగవిభక్తి వచనములు గంగలో గలిసినవి. శాసనము జదున నిది సంస్కృతభాషయేనా? యను సంశయ ముదయింపక తీరదు. పోనిండు. ప్రాకృత మేమో యందమన్న నిదియు ప్రాకృత కర్మానుభవమునకే యాతని పాలబడిన దనవచ్చును? "త్రీణిగ్రామకాదత్తా, బప్పశర్మణాయ, శర్వశర్మణాయచ" మొదలగు శబ్దములను జూచిన పై విషయము బోధపడును. చిన్నబిడ్డల మాటలలో కర్తృకర్మక్రియలు సరిగా లేకున్నను సందర్భమువలన భావ మెట్లు గ్రహింతుమో అట్లే యీశాసనమున గూడ భావము గ్రహింపవలసియుండును. కావున కాలనిర్ణయమునకు భాష యించుకయు నుపయోగింపదు. న్యాయముగా దెలుపవలసిన సాధారణ విషయములు గూడ నా రచయిత తెలుపడయ్యెను. అయినను శాసనలిపియును శాసనోక్తము లగు నొండు రెండు విషయములు మాత్రము మిక్కిలిగా నుపయోగించుచున్నవి.

కొన్ని కళింగశాసనములం దీ శాసనములలిపిని బోలినలిపి యున్నది. ఇది ప్రాచీనమైన వేంగీచాళుక్యలిపి. వేంగీశాలంకాయనుల శాసనము లీ లిపిలోనే కలవు. కళింగాధిపతుల శాసనములలో త్రిలింగశాసనమునను, హస్తివర్మ ఉర్లాం, నరసింగపల్లి శాసనములందును, ఇంద్రవర్మ జర్జంగి తామ్రశాసనమునందును గలదు ఈ లిపి మిక్కిలి ప్రాచీనమయినదని చారిత్రికులు నిర్ధారణ గావించియున్నారు. ఇందలి లిపి శాలంకాయనులలో రెండవ నందివర్మ శాసనమును సర్వవిధములం బోలియున్నది. కాబట్టి క్రీస్తుశకము 5 వ శతాబ్ది కడపటి భాగమందలిది కావలెను. ఈ విషయము స్థిరపరచు శాసనవిషయము లొండు రెండు గలవు. ఈతడు దానము విజయ సింహపురమునుండి కదా ప్రకటించినాడు. సింహపురమునుండి దానములు ప్రకటించినరాజులు కొందరు గలరు.

వారు కళింగరాజులలో మిక్కిలి ప్రాచీనులు. వారు తమ కులగోత్రములను జెప్పుకొనలేదు. శివభక్తుల మనియు బప్పభట్టారకపాద పరిరక్షితుల మనియు జెప్పుకొన్నారు. దాన ప్రతిగ్రహీతల కులగోత్రములు మాత్రము చెప్పినారు. శ్రీ రాళ్ళబండి సుబ్బారావుగారు కళింగదేశచరిత్ర 472 - 473 పుటలలో ప్రకటించిన యీ క్రింది వాక్యములు చిత్తగింపుడు.

"మహారాజశ్రీ వాసిష్ఠీపుత్ర శక్తివర్మ రాగోలు శాసనమునుబట్టి అతడు మాగధకులమునకు జెందినవాడై పిష్టపురము రాజధానిగా గల్గి కళింగవిషయము నేలె ననియు, అందలి రాకలువ గ్రామమును (నాగావళీ తీరమున శ్రీకాకుళమునకు చేరువ నున్నది.) తన 13 వ రాజ్య సంవత్సరమున వైశాఖ పౌర్ణమినాడు కుమారశర్మ యనుబ్రాహ్మణునికిన్ని అతని 8 మంది కుమారులకున్ను దాన మిచ్చె ననియు తెలియుచున్నది. శాసనము వ్రాసినవాడు అతని మంత్రి అజ్ఞనదత్త. శాసనపు లిపి శాలంకాయనుల లిపిని బోలియున్నది. అందుచేత నాల్గవ శతాబ్దాంతపుదై యుండును. ఇదే లిపిని బోలియుండు మరియొక శాసనము (ఉమవర్మ బృహత్ప్రోష్ట శాసనము) విశాఖపట్టణం జిల్లాలోని పాలకొండ గ్రామమున దొరికినది. పై శాసనము, ఇదియు సంస్కృత భాషయందున్నవి. ఉమవర్మశాసనమున్ను మహారాజ చండవర్మ కోమర్తి శాసనమున్ను భాషా లిపులందొక్కరీతిగా నున్నవి. ఈ రెండును సింహపురమునుండియే యివ్వబడినవి. ఈ యిద్దరు రాజులును కళింగాధిపతు లనుబిరుదు లొందిరి. ఇద్దరు బప్పభట్టారకపాదభక్తులు. ఉమవర్మ తన 30 రాజ్యసంవత్సరమున బృహత్ప్రోష్ట గ్రామమును హరిదత్త యనుబ్రాహ్మణుని కిచ్చెను. దాన మిచ్చినగ్రామమును దంతాయువాగు భోగమునుండి విడదీసి తత్పూర్వము ప్రతిష్ఠింపబడిన 36 అగ్రహారములకు చేర్చెను. మహారాజ చండవర్మ తన యారవ పరిపాలన సంవత్సరమున వాజసనేయశాఖకు జెందిన బ్రాహ్మణుడగు దేవశర్మకు కోహిత్తూ రనుగ్రామము దాన మిచ్చెను. ఇతనికి కళింగాధిపతి యనియు పితృభక్తుడనియు బిరుదులు గలవు. శ్రీకాకుళమునకు చేరువ నున్న సింగుపురమున్ను రాజధాని

రైన సింహపురమున్ను ఒక్కటియే. పై శాసనములను బోలిన మరియొక శాసనము కళింగాధిపతి యైననందప్రభంజనవర్మది. శ్రీ కాకుళమున దొరికినది. (Vide Ind Ant Vol 13) ఈతడు సారిపల్లినగరమునుండి దేవర (రా) త గోత్రు లైనచారణులకును, హరిశ్చంద్రస్వామి యను బ్రాహ్మణునికిన్ని దేయవట గ్రామమును దాన మిచ్చెను. చండవర్మ నందప్రభంజనవర్మల శాసనలిపు లొక తీర్లై యున్నవి.”

ఉదాహృతమగు శ్రీ సుబ్బారావుగారి గ్రంథభాగము దూగాము శాసనకాలము నిర్ణయించుటకు మిక్కిలిగ నుపయోగించునది. ఇంతియకాదు. ఇది తక్క నితరోపాయములు లేనేలే వని కూడ చెప్పవచ్చును. శక్తివర్మ, ఉమావర్మ, చండనంద ప్రభంజనవర్మల కాలము లిపివలననే కదా నిర్ణీతము లైనవి. ప్రస్తుతపు శాసన లిపి గూడ నా శాసనముల లిపిని బోలినదే. సింగుపురమే యీ రాజు రాజధాని. ఈతడు శాసనమున పేర్కొన్న గ్రామము అన్నియు చండవర్మశాసనము లభించినకోమర్తికి సమీపముననే కలవు. ఇతడు తనకుల గోత్రములు పేర్కొనక ప్రతి గ్రహీతల కౌండిన్య గోత్రమును, తైత్తిరీయ సబ్రహ్మచారిత్వము నుగ్గడించినాడు. శైవుడు, భట్టారకపాద పరిగ్రహీతుడు. ఇతని విషయమున బప్ప శబ్దము లేకున్నను, ప్రతిగ్రహీత యొకడు బప్ప శర్మ యగుటచే ‘బప్ప’ శబ్దసంబంధ మీతనికి గలదు. ఉమా చండవర్మల శాసనములందు బప్పభట్టారక పాదరక్షితు లనియో, పరిగ్రహీతు లనియో యుండుటకు బదులు బప్ప భట్టారకు లని మాత్ర ముండుట లేఖక ప్రమాద మై యుండును. శాలంకాయనుల శాసనమునం దెల్ల ‘బప్ప భట్టారకపాదభక్తః’ అను విశేషణము గలదు. మన దూగాము శాసనము చూచిన వారికి లేఖకుల తప్పులు వింత కాదుగదా!, వాసిష్ఠీపుత్ర శక్తివర్మమంత్రి అర్జునదత్త. ఉమవర్మ దానపరిగ్రహీత హరిదత్త. మన శాసనము కర్తయో శాసన లేఖకుడో, యితరాధికారియో వైద్యకృష్ణదత్త. ఈతని శాసన ముద్రయం దేమి కలదో తెలుపుటకది బాగుగా నరిగిపోవుటచే వీలు కాలేదు. కాని నంది మొదలగు విగ్రహములు గాక యేవో అక్షరములు మాత్రమే ఉండెడి వని తోచుచున్నది.

కళింగాధిపతి యనుబిరుదము లేదు గాని మహారాజశ్రీ శత్రుదమన దేవగిరి కళింగ వర్ధమానాగ్రహారే యనువాక్యమందలి ‘కళింగ’ పదము కళింగాధిపతి యనుట సూచించుచున్నది. అది ‘మహారాజశ్రీ’ పదమునకు ముం దుండ దగినది. ఆసందర్భము నా వేఱుచోట చెక్కబడిన దనియు గ్రహింపనగును. అట్లయినప్పు డీతడు కూడ కళింగాధిపతి బిరుదము గలవాడే యని తేలును. శాసనలేఖకుల ప్రమాదములు విపరీత మయిన చిక్కులు గలిగించును గదా! వర్మరాజుల శాసనములందలి అర్జునదత్త, హరిదత్త శబ్దము లే లింగములు? ఏ విభక్త్యంత మున్నవి? అవి యే భాషలో నుపయోగింపబడినవి?-యని విచారించినచో నీ విషయము తెల్లమగును. దూగాము శాసనలేఖకుడును బైహారికం టె నేడాకులు ఎక్కువ చదివినవాడు. విభక్త్యంతములు లేకుండ హరిదత్త, అర్జునదత్త, కృష్ణదత్త, శత్రుదమన మొదలగు ప్రథమాంతముల ప్రయోగించుట నాడును గోపాలకృష్ణ, వి. యస్. క్రిష్ణ, రాజేంద్రవిహార మొదలగు పదము లుపయోగించినట్లు వ్యవహార సంప్రదాయ మై యుండు నేమో? ఈ రీతి కళింగాంధ్రములందును గలవు. హరవిలాస శారద, గౌరాంగ, కొండాలక్ష్మణ మొదలగు పేళ్లిట్టివే. ప్రకృత మనుసరింతము.

శాసనము సింహపురమునుండి ప్రకటించుట, లిపి శక్తివర్మ ఉమవర్మ చండవర్మల శాసనముల లిపిని బోలియుండుట, దత్తగ్రామములు గండవర్మ కోమర్తి గ్రామముల సమీపముననే యుండుట, దాత “దమనేశ్వరస్వామినః పాదానుధ్యాతః” అని తన శైవత్వము ప్రకటించుకొనుట, భట్టారకపాద పరిగ్రహీతుడగుట, తనకుల గోత్రము తెలిగింపక గ్రహీతల కులగోత్రము లుగ్గడించుట, దూగామునం దుండెడి దమనేశ్వరస్వామి ప్రాచీనాలయము శిథిలావశేషములు మిక్కిలి ప్రాచీనతను దెలుపుట మొదలగు కారణములచే నీరాజు కూడ ఉమ చండవర్మలవలె ప్రాచీను డనుటకు సందేహము నొంద నక్కర లేదు. విశేషించి యీతడును శకవర్షములు పేర్కొనక పై రాజులవలె దన రాజ్యకాలమందలి తొమ్మిదవ సంవత్సరమును పేర్కొనుటచే నీతడు నారాజుల కోవలోనే యుంచుట కర్హు డై యుండును.

శాలంకాయనుల సంబంధ మీ రాజులకు గల దని కొందర భిప్రాయపడు చున్నట్లు శ్రీ సుబ్బారావుగారు వ్రాసినారు కదా! అది వాస్తవమే అని నేను దలంచుచున్నాను. శక్తి, ఉమా, చండ, నంది ప్రభంజన వర్మలును, త్రిలింగ శాసనకర్తయు, హస్తివర్మ, ఇంద్ర వర్మలును, ఈదూగాము శాసనకర్తయు దమ శాసనములను వేంగీ చాళుక్య లిపి యనబడు ప్రాచీన తెలుగు లిపిలో వ్రాయించిరి. శాలంకాయన రెండవ నందివర్మ శాసనమునకును దీనికిని సారూప్య మతిమాత్రముగ నున్నది. శాలంకాయనులు గొందఱు కళింగ దక్షిణ భాగమును బాలించుట ప్రసిద్ధమే కదా? వారి సంబంధమే లేకున్న వేంగీ చాళుక్య లిపి యీ ప్రాంతమున కెట్లు రాగలుగును? శాలంకాయను లనునది గోత్రనామమో, వంశనామమో స్పష్టపఱుప సాధనములు లేవు. గంగులు గాంగులు మొదలగునవి వంశనామములు కాని గోత్రనామములు గావు గదా? గోత్రము వేఱుగను, వంశము వేఱుగను నుపయోగించుట చాళుక్యుల, గాంగుల శాసనములందు కలదు. శాలంకాయనుడను నొక ఋషి కలడని పురాణములవలన నెఱుక పడుచున్నది. అతని వంశము వారే యగుచో శాలంకాయనులు బ్రాహ్మణ, క్షత్రియులు కాదగుదురు. గోత్ర మైనచో కళింగవర్మరాజు హస్తివర్మకు పూర్వులును శాలంకాయను లనియు దేలును. కావున వేంగీ శాలంకాయనులకును కళింగ ప్రాచీన వర్మరాజులకును సంబంధ ముండుట స్పష్టమే. శత్రుదమనునకు వర్మాభిధానము లేదో, ఉన్నను లేఖకుడు దానిని విడిచెనో చెప్ప వీలులేదు. ఏమైనను నీతడును శాలంకాయనులతో సంబంధము గల ప్రాచీనుడే యని నమ్ముట కభ్యంతరము లేదు. ఇతడు సరిగా రాజ్యపాలన మేకాలమున జేసెనో నిర్ధారణము సేయుట కాధారములు లేవు. తొమ్మిదేండ్లు పాలించినా డను మాత్ర మీ శాసనము చెప్పుచున్నది.

## శాసన మూలము

### మొదటిరేకు రెండవపెడ

1. ఓం విజయసింహ పురాద్భగవతో దమనేశ్వర
2. స్వామినః పాదానుధ్యాతో భట్టారక పాదపరిగృ
3. హీతో మహారాజశ్రీ శత్రుదమన[1] దేవగిరి[2]
4. కళింగ[3] వర్ధమానాగ్రహారె దూహాగ్రామే వసువాటకే

### 2 వ రేకు మొదటిపెడ

5. గోవాటకే సద్బ్రాహ్మణ పురోగాన్గ్రామా[4] ఇచ్ఛరీరాది కుశల[5]
6. స్పృష్ట్వాలి[6] ఖత్యభ్యేతేమయా గ్రామకా[7]త్మనః పున్యా[8]ప్యాయన
7. నిమిత్త[9] బ్రాహ్మణా[10] పట్టువగ్రామ వాస్తవ్యాయ
8. కౌండిన్య సగోత్రాయ తైత్తిరీయ సబ్రహ్మచారిణే
9. యజ్ఞశర్మణః పుత్ర[11]వప్పశర్మణాయ శర్వశర్మ

### 2 వ రేకు రెండవపెడ

10. ణాయ చత్రీ[12]ణ్యపి గ్రామకాదత్తా[13] ఆభ్యా[14] బ్రాహ్మణదేయ[15] కృత్వా
11. ద్విజభోగావిసృష్ట స్తద్యుష్మాభి శ్రోతవ్య మాజ్ఞా చ కర్తవ్యా
12. అత్ర చ శర్వశర్మ[16]ణాయ వృత్తిద్వయ[17] వప్పశర్మణాయ

13. చ వృత్తిరేకా సర్వేచ సముచిత[18] గ్రామాణా పుణ్యాయ[19]
14. ....యాదిముపనేస్యథ భవంతి చాత్రశ్లోకాయం క్రియాధర్మ[20]
15. సంయుక్తా మనసాప్యభినందతి వర్ధతేస యథేష్టన

3 వ రేకు మొదటి పెడ

16. శుక్లపక్షే[21] ఇవాస్యామా॥ బహుభిర్వ[22] సుధాదత్తా
17. వసుధావసుధాధిపైః యస్యయస్య యదా[23]భూమి
18. తస్యతస్య తదా ఫలం॥ పూర్వ[24]దత్తా ద్విజాతిభ్యో
19. యత్నాద్రక్ష యుధిష్ఠిర మహీమ్మ[25] హిమతాంశ్రేష్ఠ
20. దానాచ్ఛ్రేయోనుపాలన॥[26] షష్టి[27]వర్షసహస్రాణి

3 వ రేకు 2 వ పెడ

21. స్వర్గే మోదతి భూమిదః ఆక్షేప్తా చానుమన్తాచ
22. తాన్యేవనరకేవసే॥[28] ఇత్యేవ లిఖితం సంవత్సరే
23. సపమే ఆషాఢమాస[29] దివసో[30] దశమో[31]
24. ....[32]దుతో వైద్య కృష్ణదత్త[33]

ఆంధ్రానువాదము :

విజయసింహపురమునుండి భగవంతుడగు దమనేశ్వరస్వామి పాదభక్తుడు భట్టారక పాద పరిగృహీతుడగు కళింగాధిపతి మహారాజశ్రీ శత్రుదమనుడు దేవగిరియందు వర్ధమానాగ్రహారమందు వసువాటకమందు గోవాటకమందు వసించెడి సద్బ్రాహ్మణులు మొదలగువారిని గ్రామాధికారులను శరీరాది కుశల మడిగి శాసనము వ్రాయించుచున్నాడు. నేను నాయొక్క పుణ్యము వృద్ధికొరకు బ్రాహ్మణుడు, పట్టవ గ్రామవాస్తవ్యుడు, కౌండిన్యసగోత్రుడు, తైత్తిరీయస బ్రహ్మచారి, యజ్ఞశర్మ పుత్రుడగు బప్పశర్మకును, శర్వశర్మకును మూడు గ్రామము లిచ్చితిని. వీరికి బ్రాహ్మణదేయముగా జేసి ద్విజ భోగము విడువబడినది. దానిని మీ రాలించి యాజ్ఞ చేయవలెను (నాయాజ్ఞ పాలింపుడు). వీరిలో శర్వశర్మకు రెండువృత్తులు. బప్పశర్మకొక్కవృత్తి. మీ రందరును సముచితగ్రామిణులు. పుణ్యమును బొందుడు. ఈ విషయమున శ్లోకములు. ధార్మికు లెవ్వని కార్యము మనము లందైన (నోటచెప్పకున్న) నభినందింతురో యాతడు శుక్లపక్షచంద్రునివలె నిష్టలాభమున వర్ధిల్లును. రాజులనేకులు అనేకవిధములుగా భూమిదానము గావించిరి. ఆభూమి నెప్పు డెవ్వడు పాలించునో వానికే ఆ భూదాన ఫలము చెందును. మతిమంతులలో శ్రేష్ఠుడవగు యుధిష్ఠిర ! బ్రాహ్మణులకు పూర్వులచే నీయబడిన భూమి నతిప్రయత్నమున రక్షింపుము. తాన స్వయముగ నిచ్చుటకంటెను యితరు

1. దమనః 2. దేవగిరౌ 3. కళింగాధిపతిః అని 3 బంతిలో మహారాజ పదమునకు ముందుగా నుండవలెను 4. ఇక్కడక్షరములు సరిగా తెలియలేదు. గ్రామాధికార్యాదీన్ అని ఉండదగు 5. కుశలం పృష్ట్వా 6. లిఖిష్యతి 7. గ్రామమకోః ఆత్మనః 8. పుణ్యా 9. నిమిత్తం 10. బ్రాహ్మణాయ 11. బప్పశర్మణేశ్వర శర్మణేచ 12. త్రయోపి 13. దత్తాః 14. అన్యం 15. బ్రాహ్మణదేయం 16. శర్వశర్మణే 17. ద్వయమ్ బప్పశర్మణేచ 18. గ్రామిణాః 19. పుణ్యాయ...(ఇక్కడ అక్షరము తెలియలేదు. క్రియాది అని ఉండదగు) 20. యః క్రియాం 21. ఇవాంశుమాన్ 22. బహుభి ర్బహుధా 23. భూమిః 24. పూర్వదత్తాం 25. మహీమ్మతి మతాం 26. పాలనమ్ 27. షష్టిర్వర్ష 28. వసేత్ 29. మాసే 30. దివసే 31. దశమే 32. అక్షర మెలుకువడ లేదు 33. దత్తః

ఇతిహాసం :

# మహాదేవకవి బసవపురాణ అవతారికలో విశేషాలు

శ్రీమతి ఆదిలక్ష్మిగారు

వీరశైవవాఙ్మయస్రష్ట యైన పాల్కురికి సోమనాథుఁడు బసవనచరిత్రమును బసవపురాణము నను పేర ద్విపదలో వెలయించి ఆంధ్ర ద్విపద వాఙ్మయమునకు శ్రీకారము చుట్టినాఁడు. సారస్వతదృష్టిచేత నే కాక వీరశైవమత దృష్టిని కూడ నీ గ్రంథము ప్రధాన మై యున్నది. చారిత్రక పురుషుఁడును వీరశైవమతోద్ధారకుఁడును నగు బసవన చరిత్రము తొలుదొల్త చెప్పినది సోమనాథుని తెలుఁగుగ్రంథమే కావున నది వీరశైవము వ్యాపించిన ద్రవిడ కర్ణాట దేశీయుల కందఱకు మూలగ్రంథ మైనది. కన్నడ, [1]తమిళములందే గాక సంస్కృతమున కూడ దీనికి పరివర్తనము లుండుట యీ గ్రంథముయొక్క గౌరవస్థానమును నిరూపించుచున్నది. బ్రౌనుదొరవారి కాలమున బసవపురాణమందలి విషయము లాంగ్లభాషలో రచితము లై పాశ్చాత్య పరిశోధకులకు మతవాఙ్మయ చరిత్రకారులకు నుపాదేయము లైనవి.

తెలుఁగున సోమనాథునివెనుక బసవని చరిత్రను పద్య, ద్విపద, శతక, యక్షగాన రూపముల కవులు రచించి యున్నారు. ఈ కవు లందఱును శైవులే యని వేఱుగ చెప్పఁ బనిలేదు. వీరిలో ప్రథముఁడు పిడుపర్తి సోమనాథకవి. పదునాఱవ శతాబ్దిమధ్యమున వెలసినవాఁడు. ఆవెనుక ద్విపదలో [2]బసవవిజయ మనుపేర రచించిన నాగనారాధ్యుఁడును, దాని ననుసరించి [3]పద్యకావ్యము రచించిన తుమ్మలపల్లి నాగభూషణకవియు పేర్కొనఁదగినవారు అను మోద సన్యాసికవి రచిత మగు [4]బసవకల్యాణ మను యక్షగాన మొకటి వీని ననుసరించినదే కలదు.

పై వానిలో పిడుపర్తి సోమనాథుని కావ్యము తప్ప తక్కినవి, బసవనచరిత్రలో నేదో కొన్ని ఘట్టములను వర్ణించినవే కాని, పాల్కురికి సోమనాథుని గ్రంథము ననుసరించి సమగ్రముగా వ్రాయబడినవి కావు. పిడుపర్తి సోమనాథుఁడు ద్విపద బసవపురాణమును పద్యానువాదము గావించియున్నాఁడు. మూలమందలి పదజాలమునే పద్యరూపమున మక్కికి మక్కిగా కూర్చినట్లు స్పష్ట మగును.

(6 వ పేజీ తరువాయి)

లిచ్చినదానిని రక్షించుటే శ్రేయస్కరము. భూమి నిచ్చువాఁ డరువదివేలేండ్లు స్వర్గమున సుఖించును. ఆక్షేపించువాఁడును, దాని నవమానించువాఁడు నంతకాలమే నరకమున వసింతురు. ఇట్లు తొమ్మిదవ సంవత్సరమున నాషాఢమాసమున దశమిదివసమున లిఖింపబడెను. చెక్కినవాఁడు వైద్యకృష్ణదత్తుడు.

విచిత్ర మగునీ శాసనమున నేడూళ్ళ నామములు - సింహపురము - దేవగిరి - వర్ధమానాగ్రహారము - దుహాగ్రామము - వసువాటకము - గోవాటకము - బట్టువగ్రామము అని పేర్కొనబడినవి. మూడూళ్లు దానము చేసినట్లు చెప్పబడినది. ఐనను మంగళసూత్రధారణము లేని పెండ్లివలె దత్తగ్రామముల నామము లేవో తెలుపనే లేదు. ఇది లేఖకుని వింతలలో కెల్ల వింత కాదా! బహుశః దుహాగ్రామము, వసువాటకము, గోవాటకముల దత్తగ్రామము లేమో యని తలంప వీలు గలదు.

---

1. తమిళబసవపురాణము - వ్యాసము, పరిశోధన, సంచిక 7.
2. R. 565. ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము, మద్రాసు.
3. R. 861. ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము, మద్రాసు.
4. R. 464 „ „ - „

పాల్కురికి సోమనాథుని బసవపురాణము నే వస్తువిషయమునను, కథాక్రమవిషయమునను ననుసరించుచు కవితావిషయమున పిడుపర్తి సోమనాథునివలె గాక, తన యసమానపాండిత్యమును, కవితానైపుణ్యమును బ్రదర్శించి సమగ్రముగా మూలమునకువలె నేడాశ్వాసముల యుద్గ్రంథమును బద్యరూపమున వెలయించిన వాఁడు మహాదేవకవి. ఈతని [1]బసవపురాణము మనకు మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున లభ్యమై పరిశోధకులకు పరిచితమై యున్నను, నిది అవతారికారహితమై మొదలునుండియు అచ్చటచ్చట గ్రంథపాతములతో గూడినదగుటచే నీగ్రంథమునుగూర్చిగాని కవినిగూర్చిగాని వివరము నీవరకు వాఙ్మయచరిత్రకర్తలకు నవకాశములు లేకపోయినవి. అడయారు దివ్యజ్ఞాన సమాజమువారి పుస్తకభాండాగారమున నీ కావ్యమునకు సంపూర్ణ [2]తాళపత్రప్రతి కలదు. అది సమగ్రమై యుండుటయే గాక ప్రశస్తకవి, బహుశైవగ్రంథరచయితయు నైన పోచిరాజు వీరనచే లిఖింపబడుటవలన నిర్దుష్టమై యున్నది.

ఈ విషయమును గ్రంథాంతమునఁ గల యీ క్రింది పద్యము వ్యక్తపఱుచుచున్నది.

చ. రసికుఁడు పోచిరాజకుల
రంజనుఁ డీవని నామపట్టణా
వసథుఁడు వీరమంత్రి వ్యయ
వత్సర ఫాల్గునమాసమందు నీ
బసవపురాణ మాంధ్రకృత
పద్యకదంబము వ్రాసి యిచ్చె ధ
గ్మనుగుణకీర్తిశాలి యగు
[3]మామిడి వేంకయ వైశ్యమౌళికిన్.

దీనినిబట్టి ఈ ప్రతిలేఖనకాలము క్రీ. శ. 1826 అగుచున్నది.

గ్రంథకర్త యగు మహాదేవకవినిగూర్చియు నాతని వంశమునుగూర్చియు విపులముగా నవతారికలో తెలియనగును. ఈ అవతారిక యీ నాఁటి వాఙ్మయలోకమున కపరిచితమగుటచే నిందనుబంధముగా నిచ్చుచున్నాను. మహాదేవకవి యాంధ్రదేశమున పండితత్రయ మని ప్రఖ్యాతి గాంచిన ముగ్గురు శివదేశికులలో ప్రథముఁడగు శ్రీపతిపండితుని వంశీయుఁడు. అందుచే తన వంశావతారికకు ముందు శ్రీపతి పండితుని మహిమను వర్ణించి యున్నాఁడు. విజయవాటిక అనఁగా నేఁటి బెజవాడయందలి మల్లేశ్వరాలయమున శ్రీపతిపండితుఁడు అగ్నిహోత్రుని తన యంగవస్త్రమున బంధించినాఁడు. అచ్చటి మల్లేశునికే యీకృతి అంకితమైనది. ఇంకను గ్రంథోత్పత్తికి కారణభూతములైన యారాధ్యసంప్రదాయ విషయములెన్నో యవతారికయందు గలవు.

మహాదేవకవి యీ గ్రంథావతారికలో తన వంశక్రమ మిట్లిచ్చియున్నాఁడు. శ్రీపతి పండితారాధ్యుని మహిమలు వర్ణించిన వెనుక నా వంశమున జన్మించిన నాగలింగగురునితో వంశము ప్రారంభించినాఁడు.

నాగలింగము
|
మహాదేవుఁడు (భార్య వీరమ్మ)

శంభులింగము (లింగమాంబ) మల్లేశ్వరుఁడు

మహాదేవమూర్తి వీరభద్రుఁడు ఉమాపతి మృత్యుంజయుఁడు

1. R. 359. 2. 32. B. 14.

1. ఈ మామిడివేంకయ ఆర్యవైశ్యకులోద్ధారకుఁడై సంస్కృతాంధ్రభాషాపండితుఁడై "శ్రీమతి మహారాణిచక్రవర్తినీ (విక్టోరియా) దత్తసహస్రదీనార పండితరాయ బిరుద ప్రసిద్ధుఁ"డైనవాఁడు. తెనుగున ఆంధ్రదీపిక యను అకారాది నిఘంటువును రచించినపండితుఁడు. ఇతని జీవితకాలము క్రీ. శ. 1764-1334.

పైవారిలో శంభులింగము ప్రథమపుత్రుఁడగు మహాదేవమూర్తియే మన కవి. తన యుపాస్యదైవములఁగూర్చి దేశికులనుగూర్చి యిట్లు చెప్పియున్నాఁడు.

"సృష్టిపథమున శివ, సదాశివ, మహేశ
తత్త్వములు మూఁడు వర్గత్రితయము, దేశి
కత్రయము, నా కుపాస్యలింగత్రయంబు
గావునఁ దలంతు నెపుడు సద్భావమందు"

ఉపాస్యలింగములు :

బెజవాడ మల్లేశ్వరలింగము = భావలింగము
చేబ్రోలి నాగేశ్వరలింగము = ప్రాణలింగము
ఈవని అగస్త్యేశ్వరలింగము = ఇష్టలింగము

మాదల యను నగ్రహారమున నెలకొన్న యుద్భటారాధ్య వంశీయుఁ డగు ముదిగొండ పర్వతారాధ్యునికి, పేరమాంబకు జన్మించిన మల్లనారాధ్యుఁ డతని ముద్దుమఱఁది. అతని ప్రోత్సాహముననే మహాదేవకవి యీ గ్రంథ రచనకు ప్రారంభించినాఁడు.

మహాదేవకవియు నాతని తండ్రి శంభులింగమును శ్రీపతి పండితారాధ్య సింహాసనము నధిష్ఠించిన మహాపురుషులు. ఈతని తండ్రి యగు శంభులింగారాధ్యులు, మహోద్దండ పండితుఁడును, విద్వత్కవియు, వీరమాహేశ్వరాచార్యవర్యుఁడును, దేవీభాగవతాది గ్రంథకర్తయు నగు ములుఁగు పాపయారాధ్యులవారి గురు వని యీ క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

సీ. ఆరాధ్యసింహాసనాంబురాశికిఁ బూర్ణ
రాకాసుధాంశుఁ డే రమ్యమూర్తి
శిష్యహృద్గతతమశ్ఛేదనాపాదనా
ర్చిష్మంత మెవ్వాని శిక్షణంబు
పద్దర్శనీవచస్సాహిత్యవిధిసరో
విహారస్మరాళ మే విబుధమనము
భక్తిభావాంధూనిబంధశాంధవమహా
సింధురం బెవ్వని చిదభివృద్ధి

గీ. పటుశమీశాఖికాశిఖాపటనిరుద్ధ
జాతవేదప్రమాణనిశ్శంకబిరుద
మెవని కీ రేడు జగముల నెసగ నట్టి
శంభులింగార్యదేశికస్వామిఁ గొలుతు.

ప్రస్తుత బసవపురాణకర్త మహాదేవకవి కృతికర్తయే గాక కృతిపతి. బసవపురాణమును లిఖించిన పోచిరాజు వీరన తన "విభూతి రుద్రాక్ష మాహాత్మ్యము" అను ద్విపదకావ్యమును నీతనికి కృతి నిచ్చియున్నాఁడు. ఆ గ్రంథమునందలి ప్రథమాశ్వాసాంత గద్య పై విషయమును నిర్ధారణ సేయును.

అని యి వ్విభూతిమాహాత్మ్య మిబ్భంగి
అనుదిన శివసపర్యాసక్తు పేర
అభియుక్తి వీరశైవాచారు పేర
శుభకరోద్యద్గుణశోభితు పేర
విజయవాటీపురవిభు కృపాలబ్ధ
నిజమహత్త్వౌదార్యనిర్ణయు పేర.

మహాదేవకవి తాను శ్రీపతి పండితుని వంశీయుఁడ నని యీ గ్రంథమునందు స్పష్టముగా చెప్పుకొని యున్నాఁడు. ఇతనికి కృతి నిచ్చిన పోచిరాజు వీరన కవి కూడ తద్వంశీయుఁ డనియే చెప్పియున్నాఁడు. మహాదేవకవి కాశిక గోత్రుఁడు. నేఁడు శ్రీపతి పండితుని వంశము వా రందఱికి నిదియే గోత్రము. కాని శ్రీపతి పండితుని వంశీయుల మని చెప్పుకొను కాశీనాథునివారు ఆత్రేయగోత్రులు. కాశీనాథుని వీరనారాధ్యుఁడు రచించిన 'ధర్మగుప్తాభ్యుదయ మను గ్రంథమునందు మొదటి శ్రీపతి పండితుని చరిత్రను మహాదేవకవి వర్ణించినట్లే చెప్పియున్నాఁడు. కొన్ని తరము లైనవెనుక మహాదేవకవి వంశవృక్షమును, కాశీనాథునివారి వంశవృక్షమును వేఱుగుచున్నవి. ఎంత వేఱుగ నున్నను, నెంత కాలము గడచినను నొకే వంశీయు లైనయెడల గోత్రము భేదించదు. పైగా నిచ్చట నింటిపేరు కూడ భిన్నముగా నున్నది. దీనినిబట్టి చూడగా శ్రీపతి పండితారాధ్యుల గురుపరంపరలలో నొక గురువునొద్ద కాశీనాథునివారి మూలపురుషుఁడు శివదీక్షను స్వీకరించి, ఆ గురునామధేయమునే తన వంశనామముగా గైకొని యుండవచ్చును. కావుననే గోత్రభేద మిచ్చట గానవచ్చుచున్నది. ఇట్లు గురునామధేయమును వంశనామముగా స్వీకరించుట శైవులలో క్రొత్త గాదు. మహాప్రసిద్ధులగు ములుఁగు పాపయారాధ్యులు తమ గురువగు వేమనారాధ్యుల పేరే తమ వంశనామముగా స్వీకరించి గద్యలలో కూడ వేమనారాధ్యుల సంగమేశ్వరారాధ్యుల విరచిత మని వ్రాసికొన్నారు. ఈ సంప్రదాయమును తెలియక వీరేశలింగము పంతులవారు తమ ఆంధ్రకవుల చరిత్ర తృతీయభాగమున నీ పేరితోనే పాపయారాధ్యుల చరిత్రను వ్రాసి యున్నారు,

సోచిరాజు వీరన రచించిన కాలమునుబట్టి మహాదేవకవి పదునెనిమిదవ శతాబ్దాంతమున పందొమ్మిదవ శతాబ్ద ప్రారంభమున నుండె నని చెప్పవచ్చును.

మహాదేవకవి బసవపురాణగ్రంథరచనకుఁబూర్వము ఆధ్యాత్మకీర్తనలు, ఇందుశేఖరశతకము, సోమవార వ్రతమాహాత్మ్యము, శృంగారపద్య శతకము అను కృతులను రచించె. తనమఱది మల్లనారాధ్యులు చెప్పినట్లుగా కవి వ్రాసికొనిన యీ క్రిందిపద్యము ఈగ్రంథముల విశేషములఁ దెలుపఁగలవు.

సీ. శ్రీకరకవితావిశేషపరిజ్ఞాన
శీలుండ నై సుప్రసిద్ధలీల
సంస్కృతాంధ్రోక్తభాషారసజ్ఞత గల్గి
సాహిత్యపరిపాటి సంధిలంగ
లయఁ దప్పకుండ సల్లక్షణాన్వితముగా
సంగీతపద్ధతి చెంగలింపఁ
బరఁగ శాంభవభక్తిపారవశ్యంబున
ఘనతరాధ్యాత్మకీర్తనము లెలమి
గీ. నింపు మీఱ రచించితి విందుశేఖ
రాఖ్యశతకంబు వీరశైవాత్మకముగ
షట్స్థలాచారయుక్తులు సంగ్రహించి
వెలయఁ జెప్పితి వీవు సంవిత్ప్రదముగ.
మ. ధర బ్రహ్మోత్తరఖండమధ్యమున స
త్ప్రఖ్యాత మై యొప్పును
స్థిరమాహాత్మ్యకథావినోదవిలసత్
శ్రీ సోమవారవ్రతా
చరణం బెల్లఁ దెనుంగునం ద్విపద నా
శ్వాసత్రయీగ్రంథ మీ
వరయం జోద్యముగా రచించితివి భ
వ్యార్థప్రయుక్తంబుగన్.
గీ. అదియుఁ గాక యిప్పు డసమానశృంగార
కలితపద్యశతకకల్పనంబు
సేయఁ బూని యదియుఁ జెప్పుచున్నాఁడవు
మఱియు నొక ప్రబంధమహిమఁ జెప్పు.

పై పద్యములవలన మహాదేవకవి సాహిత్యమునందే కాక సంగీతమునందు కూడ ప్రజ్ఞ గలవా డని తెలియుచున్నది. పై కృతులలో ప్రత్యేకముగ పేర్కొనబడిన సోమవారవ్రత మాహాత్మ్యము "సీమంతిని కథ" యను పేరితో ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో నున్నది. ఆ[1]భాండాగారనివేదికలో నీగ్రంథము గూర్చి యిట్లు వ్రాయబడి యున్నది.

"గ్రంథకర్త పేరు వీరభద్రకవి. ఈతని గ్రామ వాస్తవ్యుఁడు. శ్రీపతి పండితారాధ్య వంశ్యుఁ డగుమల్లనారాధ్యుల కిది యంకితము సేయఁబడినది."

దీని ననుసరించి పండితారాధ్యచరిత్ర [2]పీఠిక లోను, వీరశైవాంధ్ర వాఙ్మయము[3]లోను నిది వీరనకృతిగా పేర్కొనఁబడినది. కాని యది ప్రామాదికము. సీమంతినీ కథయందు గలవంశ వర్ణన భాగముల నీక్రింద నిచ్చుచున్నాను. ఆ భాగము బసవపురాణావతారికతో సరిపోవు చున్నది. మఱియు నిందు పేర్కొనబడిన మల్లనారాధ్యుఁడు శ్రీపతి పండితుని వంశము వాఁడు కాఁ డనియు నాతఁడు ముదిగొండ వంశీయుఁడనియు నవతారికవల్లనే తెలియనగును.

ఇందలి ద్వితీయాశ్వాసాంతమునందలిగద్యము పై విషయమును స్పష్టపఱచుచున్నది.

కలయ బ్రహ్మోత్తరఖండమధ్యమునఁ
బలికిన తెఱఁ గెల్లఁ బరశివరూప
మైన శ్రీపతిపండితారాధ్యవంశ
భానుఁ డౌ సజ్జనప్రస్తుతశంభు
గురున కంకితము గా కొని యక్కుమార
వరమహాదేవార్యవిరచితంబుగను
ఘనతరద్విపదాఖ్య కావ్యంబునందు
ననుపమంబుగ ద్వితీయాశ్వాస మయ్యె.

చివఱ తృతీయాశ్వాసమున కొంతభాగము మాత్రమే యున్నది గావున ప్రతి యసమగ్ర మైనది. మఱియును నీ గ్రంథావతారికలో నిచ్చిన యీ క్రింది వంశవిషయములు మహాదేవ కవి కర్తృత్వమును నిర్ధారణ సేయుచున్నవి.

కామరొప్ప శంభుసద్గురునకు భార్య
యమలసద్గుణవతి యైనలింగాంబ
వారిరువురకును వరతనయుండ
భూరిశాంభవలింగపూజాన్వితుండ
వీరభద్రుఁ డనువిదితనాముండు
పారువయుతుఁ డుమాపతి యనునాఁతఁడు
నిత్యయశుం డగుమృత్యుంజయుండు

1. Trinniel Catalogue of Telugu Mss. 1919-22.
Vol. IV. Part 3. Telugu Pages 1655-1658. R. 658.
2. ఆంధ్రగ్రంథమాల ప్రతి. 3. తిరుపతి దేవస్థానము వారిచే ప్రకటితము

అత్యంతనుగుణు లయ్యనుజన్ములకును
నగ్రజుం డగువాఁడ నవనీతిపరుఁడ
దిగ్రమ్యజయవాడ దివ్యపురంబు
మందిరం బై యున్న మల్లీశ్వరుఁడు
కుందసన్నిభవర్ణగురుశరీరుండు
భావలింగస్వరూపము గాన నతనిఁ
గేవలభక్తితో సేవించువాఁడ.

పై వంశవర్ణనము ముందు నేను చూపిన బసవపురాణవంశవర్ణనము నొకటియే కదా! కావున కర్త మహాదేవకవి యనుట స్పష్టము.

పటుశమీశాఖానిబద్ధవస్త్రాంత
ఘటితవైశ్వానరకల్పను పేర
పంచాక్షరీమంత్రభావను పేర
సంచితభవసమాచారమత్ద్వి
పాంకుశభావమహాదేవు పేర
సంకితంబుగఁ బ్రథమాశ్వాస మయ్యె.

ఈ గ్రంథమునుగూర్చి గూడ ముం దుదాహరించిన ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార నివేదిక (1919-22) పుట 1606 లో నిట్లు వ్రాయఁబడియున్నది.

"బ్రహ్మోత్తర ఖండమున పోచిరాజు వీరయకవి ద్విపదరూపమున రచియించిన విభూతి రుద్రాక్ష మాహాత్మ్యములకు ననువాద మిది. ఇది బెజవాడలో నద్భుతమహిమలు చూపిన శ్రీపతి పండితారాధ్యుడు కాక బసవపురాణ కృతి కర్త యగు మహాదేవకవియే యని [1]గ్రంథావతారికయందలి యీ క్రింది పంక్తులు తెలుపుచున్నవి.

"కాశికగోత్రసంకలితు నిస్తులితు
దేశికోత్తమపూజ్యు దృఢగుణప్రాజ్యు
నాగలింగారాధ్యునకుఁ బుత్రుఁ డైన
ధీగరిష్ఠుని మహాదేవుని పౌత్రు
శంభులింగసుపుత్రు సశివాక్షగాత్రు
శంభులింగార్చనాసక్తు నసక్తు
భసితనిస్తంద్రు శ్రీపతిపండితేంద్రు
నసమప్రభావు మహాదేవుఁ దలఁచి."

మహాదేవకవి పిడుపర్తి సోమనాథునిరచనమును గాని బసవవిజయమును గాని పేర్కొనలేదు. అతఁడు సోమనాథుని గ్రంథమునే తూచా తప్పక యనుసరించినట్లుగ నాశ్వాసాంతగద్యలవలన తెలియుచున్నది. ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారప్రతిలో చాలచోట్ల గ్రంథపాతములు గలవు. గ్రంథవిస్తరభీతిచే విరమించితిని. మహాదేవకవి రచన మంచి పటుత్వము గలది చతుర్విధకవిత లల్లగల నేర్పు గలవా డని యాతని రచన తెలుపుచున్నది. వేఱొక వ్యాసమున నా కవితారీతులను కథావిమర్శనమును గావించెదను. ప్రస్తుతము గ్రంథవిషయము తెలుపుట మాత్రమే యీ వ్యాసోద్దేశము.

---

అనుబంధము

## అవతారిక

శా. శ్రీ కల్యాణగుణాకరా శ్రితజనాస్తీర్ణోల్లసద్బుద్ధిని
ర్వ్యాకల్పార్జితభక్తియోగమహితైశ్వర్యాతిసౌఖ్యప్రదా!
లోకాధారహిమాచలప్రియసుతాలోకేక్షణాహ్లాద! నే
నీకున్ మ్రొక్కెద నిష్టసిద్ధి గలుగన్ నిత్యంబు మల్లేశ్వరా! (1)

ఉ. శ్రీ జయవాటికానగరశేఖరమధ్యమదివ్యమందిర
భ్రాజితచామరత్నమయబంధురపీఠనిషణ్ణకృష్ణవే
ణీజలనిత్యసేచనవినిర్మలపూజన మల్లికేశ! నిన్
బూజ యొనర్చెదన్ మదినిఁ బొంగుచు సర్వఫలప్రదాయకా! (2)

శా. నీలేందీవరపత్రసుందరరుచిన్ నిర్జించి వెల్గొందు దీ
ర్ఘాలోలంబులు..............................
గ్లీలన్ వెల్వడుచూడ్కులో నొసఁగుకల్మిన్ సజ్జనశ్రేణికిన్
జాలా కాంచనదుర్గ యా సుదతి నీసద్భార్య మల్లేశ్వరా! (3)

---

1. దాని నిందులో ముద్రించుచున్నాము.

సీ. అరయ శ్రీపతిపండితారాధ్యవంశప్రదీపితసింహాసనోపగతుఁడు
భూతిరుద్రాక్షవిభూషితాంగోల్లసత్ప్రణవపంచాక్షరప్రాణసహితుఁ
డాణవప్రబలమాయామయకార్మికకలుషవిధ్వంసదీక్షాప్రదాత
వరశిష్యభావసుస్వాంతకరస్థలస్థాపితశివలింగసామరస్యుఁ
గీ. డగుచు నొప్పెడుశంభులింగాఖ్యగురుని, యాకృతిని సుప్రసన్నుండ వై భవాబ్ధి
తారణోపాయ మొసరించుధన్యమూర్తి, నిన్నుఁ బ్రణుతింతు దాక్షాయణీసమేత! (4)
క. భువి నిగమాగమసరణిన్, శివుఁడ గురుం డనుచు విబుధశేఖరు లెల్లన్
వివరింతు రదియుఁ గావున, సవినయముగ గురుని వినుతి సల్పెదఁ బ్రీతిన్. (5)
క. కలియుగమున రుద్రాంశము, వలనన్ జన్మించి శైవవరదేశికుఁ డై
విలసచ్ఛ్రీపతిపండితుఁ, డిలఁ బరమారాధ్యుఁ డనఁగ నెన్నిక వెలసెన్. (6)
ఆ.వె. ఇంద్రకీలపర్వతేంద్రసన్నిధిభూమి, వెలయుచున్న కృష్ణవేణిదరిని
విజయవాటి యనఁగ విశ్రుతం బగుపురం, బందు మల్లికేశునాలయమున. (7)
చ. అలరుచు నాగురుం డధికుఁ డై భవిభక్తుల నేర్పరించి, చి
ద్విలసితలింగనిష్ఠ గలవిశ్రుతభక్తులు గోష్ఠి సేయఁగా
వెలయుశివాంగిషట్స్థలనివేదనపూర్వముఁ గాఁగ నర్చనన్
సలుపుచు నీశ్వరున్ మదిని సంస్మృతిఁ జేయుచు నున్న యత్తఱిన్. (8)
మ. జయవాటీపురమందె యుండి నిఖిలాశాగామినిన్ భూమి ని
ర్భయతన్ బొందుచు నేలుచున్న ధరణీపాలాగ్రగణ్యుండు స
త్యయశోవంతుఁ డనంతపాలితుఁడు భృత్యాకారుఁ డాశిష్యుఁ డై
నియతిం దద్గురునాథుపూజ సలుపున్ నిర్వాణసంసిద్ధికిన్. (9)
శా. నానాభూములనుండి భూమిసురవర్గం బాదిగా శైవవి
జ్ఞానాపేక్షకు లైనసజ్జనులు విశ్వాసాత్ములై యాగురుం
గానంగాఁ జనుదెంచి ముఖ్యమనుదీక్షాదానసంసిద్ధిని
త్యానందంబునఁ గొల్చి యుందురు విశుద్ధాచారసంపన్ను లై. (10)
క. శ్రీపతిపండితసద్గురుఁ, డీపగిది నశేషసౌఖ్యహేతుస్వదయా
దీపితలోకగురుత్వ, వ్యాపారం బమరి యుండు నతులితశీలన్. (11)
సీ. ఆగమామ్నాయతిదంతపురాణేతిహాసాదినిఖిలవిద్యాప్రణీత
వీథుల నుమహిత విశ్వంభరామర, వర్ణాదిసజ్జనవారమునకు
నుపదేశ మొసఁగి సర్వోత్తరనిర్మల, వీరశైవాచారవిదితకర్మ
విజ్ఞానసద్భావవేదితశివతత్త్వ, మహిమప్రపూర్ణసామర్థ్యసరణిఁ
గీ. దెలుపుచుండెను గురునాథు దివ్యపాద, పద్మయుగళంబుపై వ్రాలి భక్తుఁ డొకఁడు
దృఢనిజవ్రతనియమంబు తెఱఁగు దాని, విఘ్నహేతువు నిట్లని విన్నవించె. (12)

వ. దేవా! భవదీయానుగ్రహవిశేషంబున సర్వోత్తర వీరశైవాచార సంపన్నుండ నై యే నొక్క నిత్యవ్రతనియమంబునం బ్రవర్తింపుచు గురుచరేశ్వరులఁ బూజింపుచు భక్తమహేశ్వర ప్రసాది ప్రాణలింగి శరణైక్య షడ్విధాంగస్థల వ్యవస్థా పరిజ్ఞాతత్వంబున తదనుష్ఠానపారగుండ నై భవిభక్తవిభేదం బెఱింగి అంగత్రయంబుల జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థాత్రయ క్రమంబున నిష్టలింగ ప్రాణలింగ భావలింగంబుల నుపాసింపుచు, క్రమోపయోగంబునఁ దత్సమర్పితంబు లైన రూప రుచి తృప్తి ప్రసాదస్వరూపంబు లెఱింగి త్రివిధోదక సేవనా పూర్వకంబుగ క్రియార్పణావధానంబున త్రివిధప్రసాదంబుల ననుభవింపుచు నేకీకృతలింగ ప్రసాద స్వరూపకుండ నై జ్ఞానార్పణావధానం బవలంబించి, అద్వితీయైక సచ్చిదానందమగులింగం బుపాసనార్థంబు త్రివిధం బయ్యె, తత్త్రివిధంబు లైన భావప్రాణేష్టలింగంబుల షడ్విధంబు లై మహాలింగ, ప్రసాదలింగ, భవలింగ, శివలింగ, గురులిం, గాచారలింగంబు లయ్యె తల్లింగంబులలో బహిరంతరంబుల జ్యోతిర్మయాకారం బై వెలుంగుచున్న యొక్క మహాలింగంబు జ్ఞానేంద్రియ కర్మేంద్రియోభయాత్మకం బగుచు నంత

రింద్రియం బసం బరఁగు హృద్గగనంబున భావించి, శ్రోత్రాది పంచజ్ఞానేంద్రియ వాగాది పంచ కర్మేంద్రియంబుల ననుక్రమంబున ప్రసాదాది పంచలింగంబులగుఱించి లయక్రమంబున పూర్వోక్త భక్తస్థలాది స్థలషట్కంబులోన పృథివ్యాది పంచభూతాంగంబులైన భక్తాది శరణాంత పంచ స్థలంబుల విహరింపుచు నాచారాది ప్రసాదాంత పంచలింగంబులకు శబ్దాది పంచజ్ఞానేంద్రియ విషయంబులను, వచనాది పంచకర్మేంద్రియవిషయంబులను ముఖసుఖైక భక్తి శక్తి భేదం బెఱింగి తత్క్రమానుసరణంబున సమర్పణంబు గావించి తత్ప్రసాద సేవనం బాచరింపుచు నాత్మచైతన్యాంగం బగు నైక్యస్థలంబున వర్తింపుచు, విభక్తిస్ఫురిత మహాలింగంబునకు సమగ్రభక్తియుక్తుండ నై భావ హస్తంబున స్మృతివిషయార్పణం బొనర్చి తత్ప్రసాద సేవనంబు సేయుచు సర్వాంగలింగ ప్రకాశ వశంబునఁ దన్మయుండ నై పరబ్రహ్మాభిధానపరశివానందంబున దినంబులు గడుపుచు చరలింగ ప్రాణి నై దాసోహం భావనఁ జెలంగ నిరంతరంబు సూర్యోదయానంతరంబున - ఘటికాద్వాదశ కంబులోన నార్గురు మాహేశ్వరుల నర్చించునియమంబుఁ జేసి తల్లోపం బయ్యెనేని శిరచ్ఛేద ప్రమాణంబు పలుకబడి చేసి యున్నంత. (13)

గీ. ఈశివసమందరయొక్క మాహేశ్వరుంశా, తక్కని యున్న మదిని వితర్క మొనరఁ
జెలఁగి మీదుసన్నిధియందుఁ జేరినాఁడ, యేవిధంబున ననుమతి యిచ్చెదరొకో? (14)

క. అనుచు నఖండితనిష్ఠా, సునిశితశీలవ్రతుండు సొంపుగఁ బలుకన్
విని యా సద్గురునాథుఁడు, ఘనభక్త్యుద్గారభావకలితుం డయ్యెన్. (15)

క. ముగురైన పండితారా, ధ్యగురూత్తము లందు మొదలఁ దద్గురునాథుం
డగు నిత ఎది (?) శివునకుఁ, దగినమహాభక్తు డధికతాయుతు డనుచున్. (16)

శా. శ్రీ మన్మంచనపండితుండు నిఖిలశ్రీనాథముఖ్యామర
స్తోమంబందుఁ బ్రకృష్టుఁ డంచు శివునిన్ శ్రుత్యాగమార్గంబులన్
వేమాకంధరు నోడి వారిఁ బలుకన్ విఖ్యాతిఁ జెన్నొంద నీ
భూమిన్ పేర్పునఁ గార్యయత్నమున సంభూతుండు దాఁ గావునన్. (17)

గీ. మల్లికార్జునపండితమహితగురుఁడు, షణ్మతంబులలో వీరశైవమతము
శ్రేష్ఠమగు నని యాగమస్మృతిపురాణ, వేదవేదాంతములచేత వినఁగఁ బలుకు. (18)

మ. అరయన్ శ్రీపతిపండితాఖ్యపదపూర్వారాధ్యవర్యుండు సు
స్థిరశంభుస్థితభక్తిసిద్ధివిలసద్ధీరాత్ము శివ్వార లా
నరులన్ బ్రాహ్మణులైన నీచకులులైనన్ వారలే యుత్తముల్
ధరలో సత్కులజాతు లంచు నిగమార్థం బొప్పఁ బల్కున్ వెసన్. (19)

క. ధర శివభక్తాధికతో,ద్ధరణార్థం బవతరించుధన్యుఁడు గనుకన్
బరమాభిమానమున నీ, వారభక్తుని వ్రతము పూర్ణ మగుఁ గాకనుచున్. (20)

చ. గొడగరిజాతివాఁ డనుచుఁ గుచ్చిత మేమియు లేకవేడ్కతో
నొడియలఁ గూడి తత్సదన మొయ్యనఁ జొచ్చి మెలంగి నాల్గుమా
డ్గడియలలో శివార్చనము గ్రక్కునఁ జేసి తదీయనిష్ఠ యిం
పడరఁ బ్రపూర్ణ యానటుల నాచరణం బొనరించి వచ్చినన్. (21)

ఉ. భూసురు లెల్లఁ గూడి చని భూపతితోడ విసంగఁ బల్కినన్
మోసము వచ్చె నం చతఁడు ముఖ్యజనంబులతో విచిత్రమున్
వేసట లేక చెప్పుచును విన్నను తద్గురుఁ జేరి మ్రొక్కి సం
త్రాసవిహీనుఁ డై యడుగఁ దథ్య మటంచు వచించి నంతటన్, (22)

సీ. నిఖిలవిశ్వంభరానిర్జరవర్యులు, పల్కిరీతనికి మా బాంధవంబు
సంగతి సద్గోష్ఠి జాడలు లేవిక, భోజనం బెల్ల మీ పురుషునింట
నన్నియాచింప మన్నెగ్నిఁ బెట్టుము మేము, బాహ్యత్వసరణి యేర్పడియె ననుచుఁ
బలికిన తద్ద్విజప్రచయంబు భయ మొంద, గురునాథుఁ డప్పుడు కుతలమందు

తన మహత్త్వంబు దెలియింపఁ దలఁచి రాజు, మొదలుగాఁ గలజనుల కద్భుతము దోఁప
నష్టమూర్తులు గలరుద్రునంశ మైన, యగ్నిదేవుని ముడి వేసి యంబరమున. (23)

శా. పంచక్రోశవినిర్ణయస్థలపరిభ్రాజన్మహాపట్టణో
దంచద్వహ్నిని దెచ్చి యా ముడియపై హత్తించి శమ్యగ్రమం
దుంచెన్ శంభునివాసమధ్యమున నత్యుగ్రప్రభావంబునన్
మించెన్ దద్గురునాథుఁ డప్పుడు సమున్మీలల్లలాటాక్షుఁ డై. (24)

లయగ్రాహి. పెక్కు శివభక్తగృహదిక్కులను పూర్వమునఁ జక్కఁగ వెలుంగుగతి గ్రుక్కక వెలుంగున్
దక్కనగృహంబులను జొక్కముగ మానవులు క్రిక్కిఱిసి చూడ నలు పెక్కుచుఁ గడంగన్
జిక్కి గురునాజ్ఞగతి నొక్క నియమంబు చల మెక్కనను మీఱ కురు కెక్కుచును రాఁగా
నిక్కరణి నగ్ని నలుదిక్కులఁ బురంబున మఱెక్కడను లేక ముడి పిక్కటిలుచుండెన్. (25)

వ. తదనంతరంబ. (26)

గీ. భస్మరుద్రాక్షమాలికాభరణుఁ డగుచు, శైవపద్వర్ణమంత్రార్థసహితనిష్ఠఁ
గరతలంబున శివలింగకళగురుంచు, చేరి చూచుచు స్వసుఖాసీనుఁ డయ్యె. (27)

వ. ఇవ్విధంబున నవ్వీరశైవదేశికశ్రేష్ఠుని మహాప్రభావకళంబున నయ్యగ్నిదేవుండు వస్త్రాంత
ఘటితుం డగుచు శ్రీమన్మల్లేశ్వరాభిధాన శివాలయ ప్రాకారాంత సంజాత శమీ భూజాత
సమున్నత శాఖాగ్రకలితుం డై పటుతరాభ్రంకషానేకజ్వాలాసమాకలితుం డగుచు భయంక
రాకారంబుగ నేడహోరాత్రంబు లొక్క రీతిఁ బ్రజ్వరిల్లుచున్నంత. (28)

క. శివసమయపాలు రగునా, శివభక్తుల నితరు లెల్లఁ జేరి యడిగినన్
భవిజనుల కగ్నిఁ బెట్టుము, శివధర్మం బిదియ మాకు సీ! పొ మ్మనుచున్. (29)

వ. ఇట్లు శివభక్తులచేతఁ దిరస్కృతు లై యమ్మహీరాద్యశేషజనులు తమలో నిట్లనిరి. (30)

గీ. అగ్నిఁ బెట్టుము దాని మే మడుగ మనుచు, మునుపు బల్కినపల్కుల ఘనత యిపుడు
ఫలిత మయ్యె నిఁ కేమని తలఁచు వార, యాత్మకృత మైనయట్టి యనర్థగతికి. (31)

గీ. ఇమ్మహాత్మునిచే నావహింపఁబడుచు, భవిగృహంబుల నుండక పావకుండు
దొలఁగ నిఁక నే యుపాయంబుఁ దోచ దనుచు, ఖేద మొందిరి మిగులఁ దర్కించి జనులు. (32)

క. నానావిధముల జనులు కృశానుం డప్పట్టణమున సమసినకతనన్
దీనత నొందుచు నన్నవిహీనతచే డస్సియుండి రేడుదినంబుల్. (33)

క. శిశువులు మొదలుగఁ బురజను, లశనాతురు లగుచు రాజు ననిరి శుభార్థం
బశుభార్థ మైన రెంటిని, గుశలతఁ బాలింప నీవ గుణనిధివి నృపా! (34)

ఉ. రుద్రుఁ డనంగ సంహరణరోషసమన్వితుఁ డైనభంగి న
చ్ఛిద్రపరాక్రమస్ఫురణఁ జెందియు శాంభవభక్తదూషణో
పద్రవయుక్తు లౌజనుల భస్మము సేయఁదలంచుసద్గురున్
భద్రము గాఁగ వేఁడికొని పాలన మిప్పుడు సేయు భూపతీ! (35)

గీ. ఈశ్వరుని భక్తు లైనమాహేశ్వరులను, ధరణిఁ బ్రత్యక్షరుద్రు లౌధన్యు లనుచు
నెఱుఁగ నేరక తచ్చర్య లరసి రేని, కోపదావానలములోనఁ గూలఁ బడరె? (36)

క. అది గావున జననాశన, మిది ప్రాప్తము గాక మున్నె యేమును నీవున్
బదములఁ బడి గురునాథుని, వదలక వేఁడుదము శాంతి వరమవనీశా! (37)

వ. ఇట్లనేకప్రకారంబులఁ దత్పురజనంబులచేత విబోధితుం డై శ్రీ గురుస్వామి ప్రియశిష్యుండు
గావున, నయ్యనంతపాలకుండు స్వకీయం బగు రాజధర్మం బవశ్యకర్తవ్యం బని విచారించి శుభా
శుభంబులు లెక్క సేయక తదనుగ్రహాయత్తచిత్తుం డై వృద్ధు లైనవిప్రోత్తముల ముందు నిడుకొని
యత్యంతభయభక్తిసంపన్నహృదయుం డగుచు సవినయంబుగా నాగురుమూర్తి సన్నిధిం
బ్రవేశించి సాష్టాంగదండప్రణామమాత్రంబుం బాచరించి ముకుళితకరకమలుం డై మహానుభావా!
యస్మదీయప్రభావం బెఱుంగక యొనరించిన యస్మదీయాపరాధసహస్రంబులు క్షమ సేయ

వలె నని, బ్రాహ్మణులుం దానును సమస్తపౌరజనులుం గూడికొని పునః పునః ప్రణామంబులు సలుపుచుఁ గృతాంజలు లై యిట్లని విన్నవించిరి. (38)

మత్తకోకిల. దేవ మద్గురుదేవ మమ్ముల దీనులన్ గృపఁ జూడు మీ
భావమందుల కోప ముంచక భక్తశాంతి వహించుమీ
శైవభక్తుల సత్ప్రభావము జూడ కేమి యెఱుంగకే
సేవకావళి సేయు నేరముఁ జెల్వ మీఱ సహించుమీ. (39)

చ. శ్రీ గురునాథ ! యీపురి నశేషజనంబులు వీతిహోత్రసం
యోగవిహీనతం గలఁత నొందుచు నన్నము లేక దప్పి పర్వస
ద్భాగములన్ భవన్మహిమ దాల్చుచు సన్నుతి సేయుచుండి రీ
వేగతి నైన సత్కరుణ నేలుము మమ్ము జగత్ప్రసిద్ధిగన్. (40)

వ. అని యివ్విధంబున బహునమస్కారపూర్వకంబుగా సన్నుతించి యపరాధక్షమాంగీకారంబున రక్షించు మని ప్రార్థించి రంత.

ఉ. శ్రీపతిపండితాఖ్యగురుశేఖరుఁ డప్పుడ మేటిసత్కృపా
ప్రాపితదృష్టిఁ జూచి శివభక్తులపట్ల భయంబు సంతతా
రోపితభక్తి గల్గి యతిరూఢవివేకముతో వసించి ని
ష్పాపముగా సుఖింపుఁ డని సారెకుఁ బల్కుచు వారి కిట్లనున్. (42)

క. మీ మీగృహముల యెప్పటి, సామగ్రియుఁ గల్గి యశనసంపన్నతచేఁ
గామితము లనుభవింపుచు, నేమముతోఁ బ్రదుకుఁ డనుచు నిలిచె ధరిత్రిన్. (43)

గీ. కాశికాఖ్యగోత్రకలితుఁ డైనట్టి యా,దేశికాగ్రగణ్యు దివ్యవంశ
మాశశాంకతారకార్కముగా భూప్ర,దేశమందు వృద్ధి దృఢత నొందె. (44)

వ. తదీయోత్తమాన్వయసముద్భూతు లగు శ్రీ గురుశ్రేష్ఠులలో నొక్క మహాత్ముండు జాతిభ్రమంబున స్వసన్నిధి సేవాచరణార్థి యైనచండాలుని చాక్షుషీదీక్షాప్రభావంబున నుత్తమబ్రాహ్మణునిఁ గావించె; నొక్క మహానుభావుండు శతసంవత్సరాతీతవార్ధకాన్వితుం డై శిష్యప్రార్థనంబున స్వభాగ్యలలాటంబున విభూతిధారణంబు చేసి యొక ముహూర్తంబున నవఘటికామాత్రకాలస్థితసద్యోగర్భంబునఁ బుత్రపంచకంబును గనియె; మఱియొక్క మహాత్ముండు శ్రావణభాద్రపదమాసంబుల సంపూర్ణవాహిని యైనకృష్ణవేణిమధ్యంబున గురుశిష్యు లన్యోన్యావలోకనార్థంబుగా నోడ నెక్కి వచ్చుచు నెదురుకొని తదుపరిభాగంబువలన మహాగభీరజలమధ్యంబున దిగనుతికి తద్దర్శనక్రియాచరణం బాదిగా పునస్తదారోహణ పర్యంతం బైనకాలంబు ప్రమాణంబు జేసి తావన్మాత్రప్రదేశంబును నుదకవిరహితం బగునట్లు గరుణించె నివ్విధంబున జగత్ప్రసిద్ధ యై శ్రీపతి పండితారాధ్య వంశోద్భవ శ్రీ గురు గురుపరంపర జరుగుచున్నంత. (45)

శా. తద్వంశ్యుం డగు నాలింగగురుఁ డిద్ధాత్రిన్ మహారాధ్యుఁ డై
విద్వత్సన్నుతరుద్రమంత్రి విలసద్వేదోక్తశాఖోన్నతిన్
సద్విద్యాబలనిర్జితాన్యమతవిస్తారోదయుం డై శివా
ద్వైతాత్మకభక్తి నిల్పు నిమిశిష్యశ్రేష్ఠచిత్తంబులన్. (46)

శా. తత్పుత్రుం డఖిలాగమాంతలిఖితార్థజ్ఞానసంసిద్ధి చే
విత్పన్నుం డని సజ్జనుల్ పొగడఁగా విఖ్యాతిఁ జెన్నొందె స
చ్చిత్పూర్ణప్రమదాత్మలింగరతుఁ డై శ్రీ మన్మహాదేవనా
మోత్పన్నుం డగుసద్గురుం డమరె నీయుర్విన్ బ్రకాశింపుచున్. (47)

గీ. ఆ మహాగురువునకును నమ్రగుభార్య, కామసతి నైన సౌందర్యగారవమున
ధిక్కరింపుచు నిత్యసుధీమతి యగు, వీరమాంబిక సాధ్వి యై వెలయఁ జూడ. (48)

క. వారికి నందను లిరువురు, భూరిమతో శంభులింగ గురుఁడును శైవా
కారుఁడు మల్లేశ్వరుఁడును, వారక జన్మించి రనఘవర్తను లగుచున్ (49)

క. జ్యేష్ఠుఁ డగుశంభుగురుఁడు క,నిష్ఠాన్యమతోక్తవాదనిరసనుఁ డై స
న్నిష్ఠార్చితమాహేశ బ,లిష్ఠాత్ముం డయ్యెఁ బ్రాణలింగస్థలుఁ డై. (50)

శా. కర్మజ్ఞానయుగైక్యశక్తిమహాగౌరీశభక్తిస్ఫుర
న్మర్మోదంచితశైవశాస్త్రశ్రుతినిర్మగ్నార్థవాదంబులన్
నిర్మాయుం డగుశంభుసద్గురుఁడు నిర్ణీతప్రబోధోక్తిచే
నిర్మాలిన్యత నొందఁజేయు సుజనానీకంబు నెల్లన్ భువిన్. (51)

గీ. ధరణిఁ బ్రత్యక్షశంభుఁ డై తనరుచున్న, శంభులింగాఖ్యగురునికి జాయ యగుచు
లింగమాంబ యనౌపమ్యశీల నర్వ, మంగళాకార యా భానురాంగి వెలసె. (52)

క. అత్యంతనియతిఁ బతి సాం,గత్యము చే లింగమాంబ ఘనశరణులకున్
నిత్యార్చ సేయు పాతి,వ్రత్యం బే మనుచు జిహ్వ వచియింపఁ దగున్ (53)

సీ. ఆ దంపతులు నాల్గువేదంబులో యనఁ బరఁగునందనులను వరుసతోడఁ
గనిరి; వారికి నామకరణ మెట్లన్నను, మొదల మహాదేవమూర్తి పేర
భద్రఁ డుమాపతి భాసిల్లు మృత్యుంజ,యుండు నన్వారు భూమండలమున
వరయశోవంతు లై వరిల్లుచున్నంత, నం దగ్రజుండ యై యలరుచుండి
సృష్టిపథమున శివసదాశివమహేశ,తత్త్వములు మూడు; వర్గత్రితయము; దేశ
కత్రయము నా రుపాస్యలింగత్రయంబు, గావున దలంతు నెపుడు సద్భావ మెసఁగ. (54)

ఉ. శ్రీ గురులింగదృష్ట మగుచిన్మయలింగముఁ బూజ చేసి శై
వాగమతత్త్వవిత్తమచరాకృతి లింగములన్ సదా నిజ
శ్రీగతు లైనవా రని ప్రసిద్ధిగఁ దత్పదపద్మముల్ శిరో
భాగమునందు సోకఁగ సుభక్తి నమస్కరణంబు చేసెదన్. (55)

గీ. భువి మహాదేవనామవిస్ఫూర్తి నొంది, సవినయంబుగ గురుచరేశ్వరులఁ బూజ
సేయువాఁడ మదిష్టార్థసిద్ధి మల్లి,కేశ్వరస్వామి కే మ్రొక్కి యనుచుఁ బ్రీతి. (56)

క. శ్రీపతిపండితశర్మని, రూపారాధ్యాన్వయమున రూఢి జనన మై
దీపింపుచున్నవాఁ డన, నా పూర్వభవప్రయుక్తనయ మెట్టిదియో? (57)

సీ. ఎన్నిక శ్రీశైల మింద్రకీలనగంబు, నర మొప్పఁ బాతళగంగ కృష్ణ
తత్తీరమున విశ్రుతం బగు బెజవాడ, శ్రీ పర్వతోపరిస్థితపురంబు
నంచితభ్రమరాంబ కాంచనదుర్గంబ, మల్లికార్జునుఁడు దన్మల్లికేశుఁ
డని బుధుల్ చెప్పెడు దరి గాన నాభావ,లింగంబు తాదృశలింగమూర్తి
గీ. వెలయు చేబ్రోలిపట్టణ విదితనాగ,లింగ మగు నాదు ప్రాణాఖ్యలింగమూర్తి
యీశనీ పుర్యగస్త్యేశుఁ డిష్టలింగ, మనుచు భావించి పూజింతు ననుదినంబు. (58)

సీ. ఆరాధ్యవర్యుల కగ్రహారం బగుమాదల యనునొక్క మహితపురము
నిజనివాసంబుగా నెలకొని మదిగొండ, వంశాంబునిధిశీతలాంశుఁ డనఁగ
నుతి కెక్కి సౌగుణ్యవతి పేరమాంబ యా, సతి గూడి లింగాంబ సామరస్య
భరితుఁ డై విలసిల్లు పర్వతారాధ్యుని, తనయవర్గమ్ములోన వినయరతుఁడు
గీ. మానినీయుభరద్వాజమహితగోత్రుఁ, డుద్భటారాధ్యసంప్రదాయోద్భవుండు
సాధ్యవిమతాళి మల్లనారాధ్యమౌళి, నాదు ముద్దుమఱంది యా నయ మెలర్ప. (59)

గీ. పార్వతీనామ మామె కేర్పరచి ముద్దు, గనుచు బుచ్చమ్మ రమ్మ నీ వనుచు బిలుతు
మట్టి ముద్దియతోఁ బుట్టు వనుగుఁ జెల్లె, లగుచు నాతోడ నెనరుతో నలరుచుండు. (60)

మత్తకోకిల. అత్తలోదరి నిచ్చ శోభన మర్థయుక్తము గాఁగ మా
చిత్తముల్ గడు వేడ్క నొందఁగఁ జేసి కూర్చినభాగ్య మా
యత్త మై కనుపట్టి యుండఁగ నవ్యభూమణి... శై
వోత్తమాఖ్యుఁడు మల్లికార్జునుఁ డొప్పె భూమిఁ బ్రశస్తిగాన్. (61)

గీ. నాదు ముద్దుమఱఁది నా మనోగృహదీప, మాపదద్రివజ్రి యాప్తబంధు
ముఖ్యుఁ డమలశరణమూర్తి నా కగు నంచుఁ, దత్సహాయు మెపుడు దలఁచి యుండు. (62)

క. ఇటు లుండి శైవశాస్త్ర, స్ఫుటయోజననిశ్చితార్థములు సేయుచు ని
ష్కుటిలతచే నుందుము మే, మట యీవనినగరకల్పితావాసములన్. (63)

వ. ఇవ్విధంబునఁ బ్రవర్తింపుచుండి మదీయమనోరంజకుం డగు మల్లనారాధ్యుం డొక్కనాఁడు ప్రసాదభోగానంతరంబునఁ బూర్ణానందభరితుఁ డై తాంబూలచర్వణము సేయుచు నిజాలయ విరచితం బైనమృదులాస్తరణశోభితం బగు వేదికోపరిభాగంబున సుఖాసీనుం డగుచు బావా! రమ్మని యత్యంతప్రేమతో నన్నుఁ జేరఁ బిలిచి కూర్చుండ నియమించి మందహాసవికసన్ముఖుం డై నాతో నిట్లనియె. (64)

సీ. శ్రీకరకవితావిశేషపరిజ్ఞాన, శీలుండ వై సుప్రసిద్ధలీల
సంస్కృతాంధ్రోక్తభాషారసజ్ఞత గల్గు, సాహిత్యపరిపాటి సంధిలంగ
లయ దప్పకుండ సల్లక్షణాన్వితముగా, సంగీతపద్ధతి చెంగలింపఁ
బరఁగ శాంభవభక్తిపారవశ్యంబున, ఘనతరాధ్యాత్మికీర్తనము లెలమి
గీ. నింపు మీఱ రచించితి విందుశేఖ, రాఖ్యశతకంబు వీరశైవాత్మకముగ
షట్స్థలాచారయుక్తులు సంగ్రహించి, వెలయఁ జెప్పితి వీవు సంవిత్ప్రథమున. (65)

మ. ధర బ్రహ్మోత్తరఖండమధ్యమున సత్ప్రఖ్యాత మై యొప్పు సు
స్థిరమాహాత్మ్యకథావినోదవిలసచ్ఛ్రీసోమవారవ్రతా
చరణం బెల్లఁ దెనుంగునన్ ద్విపద నాశ్వాసత్రయీగ్రంథ మీ
వరయన్ జోద్యముగా రచించితివి భవ్యార్థప్రయుక్తంబు గాన్. (66)

గీ. అదియుఁ గాక యిప్పు డసమానశృంగార, కలితపద్యశతకకల్పనంబు
సేయఁ బూని యదియుఁ జెప్పుచున్నాఁడవు, మఱియు నొక ప్రబంధమహిమఁ జెపుము!. (67)

క. ఈశ్వరసుమహానుగ్రహ, శాశ్వతకవితాప్రభావసహితుఁడ వగుచున్
విశ్వమున వెలసినాఁడ వ, నశ్వరశివభక్తివర్థనస్థితిమీఱన్. (68)

ఉ. కావున శంభుభక్తిజనకార్యవిహారకథాప్రసంగసం
భావిత మైన యట్టి యొక భవ్యచరిత్రము పద్యకావ్య మై
భూవిదితంబుగా నిఖిలపుణ్యసమేతముగాఁ బ్రబంధమున్
నీవు రచించుమీ యనుచు నేర్పునఁ బల్కెఁ బ్రమోదయుక్తుఁ డై. (69)

వ. ఇవ్విధంబున మల్లనారాధ్యుం డత్యంతప్రేమార్ద్రచిత్తుఁ డై పలికినవాక్యం బర్ధాంగీకారంబుగా గ్రహించి పూర్ణాంగీకారంబుగా నవలంబించక విచారించెద నని ప్రత్యుత్తరం బిచ్చితి. తదనుజ్ఞాతుండ నై మామకీనగృహంబుఁ బ్రవేశించి యారాత్రి సుఖసుప్తుండ నై యున్నంత. (70)

క. కల గంటి నపుడు సద్యః, ఫలితం బది భక్తిముక్తిపద మెట్లనినన్
నలి మోహనాకృతి మెయిన్, వెలసెన్ మల్లేశ్వరుండు విశ్రుతకరుణన్. (71)

శా. ఆ మాహేశ్వరుఁ డిట్టివేషమునఁ బ్రత్యక్షంబుగా వచ్చి నా
నేమం బంతయుఁ జెప్పెదన్ భువి సమున్నిద్రప్రభావోద్భటో
ద్దామారాధ్యకులైకభూషణదిగంతవ్యాప్తవేద్యైకస
త్తామాత్రస్థితభావలింగరతుఁడున్ దా వీరభద్రాఖ్యుఁడున్. (72)

క. ఆరాధ్యశేఖరుఁడు లో, కారాధ్యుఁ డశేషశాంభవాగమవిద్యా
పారగుఁ డుత్తరశైవో, ద్ధారకుఁ డావీరభద్రతాత్త్వికగురుఁడున్. (73)

శా. ప్రాగాశానుగతాననుం డఖిలవర్ణవ్యక్తచిత్రత దా
భోగాంభోరుహనామమాపబసవత్ప్రాజ్యాసనాసీనుఁడున్
రాగద్వేషవిహీననిశ్చలమనోరాజన్మహాలింగియున్
శ్రీగంధాదికభూతిలేపవికసచ్ఛృంగారగాత్రుండునున్. (74)

క. రుద్రాంబక త్రయోద్భవ, రుద్రాక్షమణులు ధరించి రూఢిగ మెఱసెన్
భద్రముగఁ గరగతుండగు,రుద్రునిఁ జూచుచుఁ బ్రసన్నరుద్రునిభంగిన్. (75)

వ. ఇవ్విధంబున భక్తవత్సలుఁడైన శ్రీమన్మల్లేశ్వరుం డుద్భటారాధ్య వంశామృత పారావార పూర్ణ రాకానిశాకరుం డగు వీరభద్రారాధ్యుండై మదీయస్వప్నావస్థయందుఁ బ్రత్యక్షాకారంబుగా నిలిచి 'మహాదేవా! రమ్మని సనామకంబుగా నన్నుఁ బిలిచి స్వసన్నిధానంబునఁ గూర్చుండ నియమించి నవీనం బగులిఖితంబును లేఖనీకంబును మదీయోభయహస్తంబుల సమర్చి, స్వకీయ ప్రాఙ్ముఖత్వ మదీయోదఙ్ముఖత్వంబుల నేర్పరించి కరుణాకటాక్షవీక్షణుండై నాతో నిట్లనియె. (76)

క. శివకవచము సాఙ్గకముగ, వివరించెద వ్రాయు మనుచు విశదంబుగ నా
చెవిఁ బడ నుపదేశించిన, సవినయముగ వ్రాయుచున్న చందముఁ గంటిన్. (77)

క. నే లిఖియించిన సన్నపుఁ, జాలు మెఱసి యున్నలిపి విచారింపుచు స
ల్లీలం జూచుచు పుస్తక,లాలిత్యము మెచ్చుచున్నలా గమరెఁ గలన్. (78)

ఉ. అక్కల గాంచి మేల్కని మహాద్భుత మంచుచు నామనంబునన్
మక్కువ నాప్తబంధుఁ డగుమల్లనదేశికుఁ డన్నవాక్యమున్
జక్కఁగ సత్య మాయె నని సారెకు నీశుని సంస్మరించుచున్
మిక్కిలి వేడ్కతో మఱఁది మెచ్చఁగఁ జెప్పిన నాకు నిట్లనన్. (79)

గీ. మల్లికార్జునదేవుని మహదనుగ్ర,హామున నే నన్న వాక్యంబు విమల మయ్యె
గాన నవరసయుక్తమై వీను లలరఁ, బద్యకావ్యము విరచింపు భాసురముగ. (80)

వ. అని యిమ్మాడ్కి నమ్మల్లనారాధ్యుం డానతిచ్చినవాక్యం బప్పుడు పూర్ణాంగీకారంబుగా గ్రహించి తృణీకృతబ్రహ్మపురందరులై మహానుభావులైన శివభక్తులలోన నే భక్తుని మహత్త్వంబు విరచింతునో యని మామకీనాంతరంగంబున వితర్కింపుచున్నంత. (81)

క. అలరుచు నాకూరిమి తమ్ములలోపల జ్యేష్ఠుఁడైన ముఖ్యశివాచా
రలలితుఁడు వీరభద్రుఁడు, కలలో నొకలిఖితపుస్తకము నా కొసఁగెన్. (82)

గీ. అతిపురాతనంబు లగుతాళపత్రముల్, గలుగుపుస్తకంబు ఘనతఁ గాంచి
యంత మేలుకొనుచు నాత్మగతంబున, నిట్టిస్వప్నఫల మిదే మొ యనుచు. (83)

చ. మనమునఁ గొంతసేపు శివమగ్నవిచారుఁడనై శుభప్రదం
బని కడు నిశ్చయించి ప్రమదాంబుధిఁ దేలుచు నున్నయంత శం
భునిరతభక్తిభక్తజనపుణ్యకథాత్మతవీరశైవసా
ధనబసవేశ్వర స్తుతినిధానపురాణముఁ దోఁచె బుద్ధిలో. (84)

గీ. సారిది పాలకుఱికి సోమనారాధ్యాఖ్య,ధానవీరశైవధనుఁడు మున్ను
ద్విపదకావ్యముగను దెనుఁగున రచియించె, బసవసత్పురాణ మసదృశముగ. (85)

క. ఈ బసవేశు చరిత్రము, నాబుద్ధి ప్రేరక త్రినయనకృపాదృ
ష్ట్యాబద్ధవాక్యసరణిని, నే బాగుగఁ బద్యకావ్యనిర్మితి సేతున్. (86)

చ. ఇది గురులింగజంగమసమిద్ధచిదాత్మకభక్తిసాధనం
బిది వరపుష్కరాకృతిసమేతవికల్పశివత్వభావనం
బిది సకలార్థసంపదల నిచ్చుచు నుండెడికల్పభూరుహం
బిది చతురాఖ్యముక్తులకు హేతువునై చెలువొందు ధాత్రిలోన్.

ఉ. కావున నీపురాణ మతికాంతిఁ దెనుంగునఁ బద్యకావ్యమున్
నే విరచింపఁ గల్గు టిది నిక్కము జన్మము ధన్యతాయుతం
బై వెలసెన్ మహాత్పదవి నందితి భక్తకృపాకటాక్షవీ
క్షావిహితుండనైతి నని సారెకు నామదిలోఁ దలంచితిన్. (88)

గీ. ఇట్లు నిశ్చయించి యిహపరంబులు నాకు, గణన నొందవనుచు గట్టిబుద్ధి
లోన దివ్యలింగలోలాత్మకుండనై, ముద మెలర్పఁ గవిత మొదలుకొంటి. (89)

క. నిగమార్థసారసారం, బగుణనిరంజనలసన్మహాలింగాకా
రగురుచరణప్రచింతన, విగళదవిజ్ఞాన మిది వివేకప్రదమున్. (90)

గీ. ఈ పురాణంబు ప్రీతితో నెవరు వినిన, వ్రాసి చదివినఁ జెప్పినవారలకును
శివపదాంబుజసద్భక్తి చెందుఁ గాన, భుక్తి ముక్తియుఁ గల్గు సద్బోధకముగ. (91)

వ. అని యివ్విధంబున నిశ్చయించి మద్రచనీయ ప్రబంధ కల్పనా కార్యోపక్రమణోద్దేశంబున
మదీయాభీష్టఫలావాప్తినిమిత్తం బై తత్ప్రబంధాదియందు గురుచరస్వరూపకుం డగుమల్లే
శ్వరునిఁ బ్రార్థించి నమస్కరించి శ్రీ గురుమాహాత్మ్యకథనపూర్వకంబుగ మదీయవంశావతారం
బెఱింగించితిఁ గావున నిప్పుడు తదనుగ్రహప్రేరితమనస్కుండ నై భవిష్యద్గ్రంథకల్పనావ్యవ
హారంబున నిర్విఘ్నకరసమాప్తి ప్రసిద్ధాప్రమేయ వాగర్థ ప్రతిపత్తి సమగ్ర కవిత్వమహత్వ
సంపత్సిద్ధినిమిత్తంబుగాఁ దన్మల్లేశ్వర పరివారరూప సంస్థితులను విఘ్నేశ్వరాదిదేవతలం
బ్రార్థించి నమస్కరించెద— (92)

చ. మొదల నమస్కరించెదఁ బ్రమోదమునన్ విధిముఖ్యదేవతా
భ్యుదయపరంపరాఫలసమున్నతవృద్ధివిధాయకున్ సుహృ
ద్విదితవరప్రదాయకుని దివ్యవిభామయవారణాననో
న్మదజలబింద్వలంకృతసుమానుషకాయుకు విఘ్ననాయకున్. (93)

మ. అతిగంభీరనినాదపూరితవిరించ్యండాంతరాళున్ లస
చ్చతురామ్నాయపదోపపాదితసమస్తజ్ఞానభక్తిక్రియా
మతధర్మోద్ధృతలోకవిగ్రహుని సన్మధ్యస్థితోమేశ్వరున్
నతి గావింతు వృషాధిపుం దలఁచి నే నానార్థసంసిద్ధికిన్. (94)

శా. చిత్తంబందుఁ దలంచి మ్రొక్కెదను నే శ్రీవీరభద్రున్ మదో
న్మత్తక్షుద్రనిసర్గదక్షకృతయజ్ఞధ్వంసరౌద్రున్ గృపా
యత్తాలోకనదత్తభక్తజనసుశ్లోకోరుభద్రున్ జగ
ద్ధృత్తేజోఽపహారీసముద్రు నిజశక్తిస్తంభితచ్ఛిద్రునిన్. (95)

శా. అఖిలాకృతి హేమవేత్రధరు సువ్యక్తప్రభావాకరున్
శ్రీధీమాంతరగారపాలనపరున్ శీతాంశుమచ్ఛేఖరున్
శోభాంచద్గణరుద్రసంచయవరున్ శూలాయుధోద్యత్కరున్
నే భావించి నమస్కరింతు మదిలో నిత్యంబు నందీశ్వరున్. (96)

చ. మదిని దలంచి సారెకు నమస్కరణం బొనరింతు శూలికిన్
ముదము జనింపఁగా భువనమోహన మై విలసిల్ల నాట్యమున్
జొదలుచు సేయుశక్తి గుణముక్తశరీరుని చారువిస్మితా
స్పదములు భృంగినామగణపాలుని భక్తివినోదశీలునిన్. (97)

ఉ. భక్తి నమస్కరింతు మది భావనఁ జేసి హిమాద్రిజామనో
రక్తికరప్రభావుని శరస్ఫురితోదయభావునిం గృపా
యుక్తనిజస్వభావుని షడూర్మివిహీనశివైక్యజీవునిం
వ్యక్తషడాననాంబురుహవర్ధితశైవు గుమారదేవునిన్. (98)

ఉ. తలఁచెద నా మనంబున సదాశివసేన కధీశుఁ డై మహా
బలయుతుఁ డై ముఖాంబురుహపంచకభాసురుఁ డై త్రిశూలము
ఖ్యలలితభీకరాయుధచయప్రలసద్దశహస్తపద్ముఁ డై
వెలయుచుఁ జండనామమున విశ్రుతి నొందుమహాస్త్రనాయకున్. (99)

మ. యువతీరూపముకుందశంభువరసంయోగప్రభావాద్భుతో
ద్భవుఁ బాణిస్థకపాలశూలడమరూద్దండాయుధున్ విస్ఫుర
త్ప్రవసాహారవిభూషణాంచితుని దిగ్భాగాంబరున్ క్షేత్రసం
స్తవనీయాధిపుఁ గాలభైరవుని మత్స్వాంతంబునం గొల్చెదన్. (100)

శా. స్వర్గేశప్రముఖాదితేయవినుతన్ సంస్తుత్యరుద్రాంగనా
వర్గోపేతను పార్వతీచరణసేవాతత్పరన్ సాయుధన్
ఖడ్గస్వచ్ఛతరాలయోత్తరహరిత్ప్రాంతస్థితన్ సుందరిన్
దుర్గాదేవిని బుద్ధిలోఁ దలఁచెదన్ గుర్వప్రమోదంబునన్. (101)

శా. నానారీతి ముఖాంగవర్ణయుతులన్ నానాయుధోద్వాహులన్
నానాస్త్రాహితపార్శ్వసంచరుల నక్షుద్రస్వభావాప్తవి
జ్ఞానాకారుల నిత్యముక్తుల జనాసంఖ్యేయసామర్థ్యులన్
శ్రీ నందీశ్వరముఖ్యులన్ బ్రమథులన్ సేవింతు నుద్యన్మతిన్. (102)

మ. వరుణాంభోధరపంక్తిజృంభణలసద్వర్ణత్విషాకీర్ణదు
ర్ధరగాఢాంధతమోవినీలగళులన్ దారాదిపారావతం
సరుచిక్రాంతకిరీటులన్ త్రివిధదృక్సారూప్యయుక్తప్రభా
కరులం గొల్చెద నాత్మలో నమితసంఖ్యాభద్రులన్ రుద్రులన్. (108)

శా. కాలాభ్రప్రతిమానవర్ణవిలసత్కాయున్ సముద్యద్దవ
జ్వాలాహీంద్రపరిష్కృతున్ ద్రిణయు నేత్రాతీక్ష్ణదంతప్రభా
ఖేలాస్యున్ గరపంకజాష్టకధృతస్ఫీతాసిముఖ్యాయుధున్
లీలన్ గొల్చెద రక్తవస్త్రధరు హృల్లేఖాఖ్యఘోరేశ్వరున్. (104)

ఉ. మేళనృసింహవేషభయహేతుపరాక్రమసంహరున్ నిశా
ధీశదినేశలోచనుని హృజ్జఠరస్థితభైరవానలున్
గాళలనిర్జితాహితనికాయుని భక్తజయప్రదాయకున్
శ్రీశరభేశ్వరున్ దలఁచి చేయుదు నత్యధికప్రణామముల్. (105)

ఉ. ఐందవబింబవర్ణలలితాంగవిభూషితశుభ్రవస్త్ర నిం
దిందిరవేణి నంబురుహదీధితిపాణిలసద్విపంచికన్
జందనగంధి యాత్మభవచక్రధరాఖిలదేవయుక్తసం
క్రందనవందనార్హను సరస్వతిదేవిని బ్రస్తుతించెదన్. (106)

సీ. కాశికాగస్త్య మార్కండేయ దుర్వాస శుక వామదేవ విశ్రుతదధీచి
గౌతమాత్రి మునీంద్ర కపిశక్తి మయరామ, బాణదేవేంద్రాది పరమపాశు
పతులను సర్వాంగభసిత పుణ్యస్నాన, కలితత్రిపుండ్రరేఖాయుతులను
రుద్ర నేత్రోద్భవ రుద్రాక్షధరులను, ఘనతరోంకారసంఘటితశైవ
గీ. పంచవర్ణోల్లసన్మంత్రపఠన రతుల, నుపనిషత్సూక్తనిమ్నసాళయోపగతుల (?)
నాగమాంతోపపాదిత యోగపరుల, నతులపుణ్యులఁ దలఁచెద నాత్మలోన. (107)

సీ. శ్రీకర పూర్వదక్షిణ పశ్చిమోత్తర, వదనాబ్జములఁ గ్రమాభ్యుదితు లగుచు
వరలు సదాశివేశ్వర రుద్ర ఘనమహేశ్వరులు సత్కృతయుగచర్యయందు
వారి యంశాంబులవలన షడక్షర, పంచాక్షరత్ర్యక్షరాక్షరైక
సంఖ్యాక్షరాఖ్యుల సంభూతులైన త్రేత,యన జనుయుగకాలమున గదదంశ
గీ. భవుల రేణుకదారుకుల్ భవ్యశంక, కర్ణుఁడును బుధవినుత గోకర్ణుఁ డనఁగ
ద్వాపరాఖ్యయుగంబునఁ దనరు వీర,శైవదేశికవర్యుల సన్నుతింతు. (108)

సీ. వెలయఁ దదీయాంశముల నుద్భవించిన, రేవణసిద్ధుండు శ్రేష్ఠమరుళ
సిద్ధుఁ డేకోరామచిన్మయాచార్యుండు, పండితారాధ్యవర్యుం డనంగ
మహి నొప్పు నలువురు మహనీయగురువులై, కలియుగసమయసంకలితసుజన
వితతికి నుత్తరవీరశైవరహస్య, ముపదేశ మొసఁగి మహోన్నతముగ
గీ. శంభుసాయుజ్యశాశ్వతసౌఖ్యరూప, లలితకైలాసపదమహాఫలదమైన
శ్రీకరజ్ఞాన మందంగఁ జేయుపుణ్యచరితులను గొల్చి మ్రొక్కెద సమ్మదమున. (109)

సీ. బహుజన్మకృతపుణ్యఫలమున నవసాన, దేహసంపన్ను లై దృఢవిరక్తి
సాధించి శోధించి సదసద్వివేకు లై, భవదుఃఖహరగురుభజనయుక్తి
నవికలనియమవ్రతాచారబంధుర, శీలసంపాదితస్థిరసుభక్తి
సహితు లై గౌరీశుసదనుగ్రహంబున, దర్వ్యముక్తి సంధానముక్తి
గీ. భావ మాపాంగలింగసంబంధు లగుచుఁ, బంకజోద్భవదేవేంద్రపదము లెల్లఁ
దృణములుగఁ జూచుహరభక్తగణములకును, వందనం బొనరింతు నానంద మొదవ. (110)
క. శివభక్తివర్ధనార్థము, శివలోకమువలన భువికిఁ జేరి యభీష్టో
త్సవయుక్తు లైనబసవా,ద్యవతారుల ఘనులఁ దలఁతు ననవరతంబున్. (111)
క. శివలీలాకథనంబులు, శివభక్తమహాత్వ్యములును శివయోగాభ్యా
సవిశేషములు వచింపుచుఁ, బ్రవిమలు లగుసుకవిజనులఁ బ్రస్తుతి చేతున్. (112)
గీ. కలయ బహువీరశైవసద్గ్రంథరచన, గోరి యొనరించు పాలకురికి సోమ
నాథుఁ డాదిగఁ గలుగుపినాకధరుని, కవివరుల సన్నుతించెద సవినయముగ. (113)
క. ధీమంతు లలర నిపు డే, నేమియుఁ జందంబు జూడ లెఱుఁగక యైనన్
శ్రీ మదుమేశ్వరు కృప నజ,రామంబుగ నీ ప్రబంధరచన యొనర్తున్. (114)
క. వరకవులను లక్షణకవి, వరులను మది మెచ్చ హర్షవహనను లేకన్
నిరసించుకుకవిగణమును, బరిభవ మొనరింతుఁ గుటిలభావము దొలఁగన్. (115)
క. ఘనదేశికశివచరులకు, తనువు మనంబును ధనంబుఁ దక్రమమున వం
చన లేక నిచ్చి మెయి నేఁ, గొనియాడుచు మ్రొక్కు లిడుదు గురుతరభక్తిన్. (116)
వ. అని యిట్లు విఘ్నేశ్వర, వృషభేశ్వర, వీరేశ్వర, నందీశ్వర, భృంగీశ్వర, కుమార స్వామి చండేశ్వరులకు నతిపూర్వకము నమస్కారంబును, కాలభైరవ దుర్గాదేవి స్తోత్రంబును, ప్రమథగణరుద్రవందనంబును, అఘోరేశ్వర శరభ సాళువేశ్వరస్మరణ పూర్వకాభివందనంబును, కాళికాగస్త్యాది పరమ పాశుపతస్మరణంబును, చతుర్యుగ షోడశ వీరశైవాచార్య పాదారవింద ధ్యాన పూర్వక నమస్కారంబును, శివభక్తగణ ప్రణామసమర్పణంబును, శ్రీ బసవాద్యవతార భక్తగణస్తోత్రంబును, సోమారాధ్య ప్రముఖ శివకవి గణాత్యంత భక్తి పూర్వక నమస్కరణ సమర్పణంబును, నీశ్వరానుగ్రహ ప్రసిద్ధ స్వాహంకార నిరసనంబును, కుకవిజన పరిభవంబును, శరణగణ సంకీర్తన పూర్వకానేక నమస్కారార్పణంబును గావించి శ్రీ మన్మల్లేశ్వరానుగ్రహప్రబోధితతద్విఘ్నేశ్వరాది దేవతా కరుణాకటాక్ష వీక్షాలబ్ధమనః ప్రసన్నతా ప్రసిద్ధ నవరసాలంకార కవితా ప్రచారధురీణుండ నై మద్రసనాసంభూత వాక్యాకృతి విరాజత్కృతి కన్యకారత్నంబును శ్రీ మన్మల్లేశ్వరునకు విజ్ఞానఘృతార్పణవిధానంబున సమర్పింపఁదలంచి తదీయాభివర్ణనాకలితషష్ఠ్యంతసంఘటితంబు లగుకందపద్యంబులు వివరించెద. (117)

షష్ఠ్యంతములు :

క. శ్రీమత్కాంచనదుర్గా, నామప్రఖ్యాతకీర్తనగరాట్ప్రభవ
ద్భామాకుచకలశలస, ద్వామకరాంభోరుహునకు ధవళాంగునకున్. (118)
క. అక్షయసర్వోత్తరశివ, దీక్షామాహాత్మ్యజనితదృఢవిజ్ఞాన
ప్రేక్షార్యమనుజవితర, న్మోక్షునకున్ సకలదేవమునివంద్యునకున్. (119)
క. కమలాప్తకమలసంభవ, కమలావిర్భూతిహేతు కనలాక్షునకున్
గమలేశకమలజార్చిత, కమలోపమచరణునకును గౌరీశునకున్. (120)
క. గంగాప్రవాహినీజల, సంగతవిద్యుల్లతోల్లసద్బంధురరు
క్పింగజటోర్ధ్వపరిష్కృత, మంగళతరమకుటమధ్యమస్థేందునకున్. (121)
క. అసదఖిలవిశ్వవిలయా, వసుధైకాకృతిని మూఢవర్త్మగసత్తా
ల సదను మేయ చైత,న్యసుఖమయాంగునకు నర్ధనారీశునకున్ (122)
క. సకలప్రపంచవనదా,వకబాడబవహ్నిసదృశహాలాహలభ
క్షకునకు మెచకకరా,సకలితకంఠునకు గుహతనూజాతునకున్,

# తమిళవాఙ్మయపరిచయము

శ్రీ చల్లా రాధాకృష్ణశర్మగారు

(గతసంచిక తరువాయి)

*

## జైనబౌద్ధులయుగము :

తమిళవాఙ్మయ చరిత్రలో సంగయుగమునకు తిరువాతిది జైన బౌద్ధులయుగము. ఈ యుగమునందు మణిమేకలై సిలప్పదిగారంవంటి కావ్యరాజములు వెలుగులోనికి వచ్చినవి. జైన బౌద్ధుల సమాదరణమున ఈ కావ్యములు వెలయింపబడెను. కావున జైన బౌద్ధుల యాచార వ్యవహారములు, తాత్త్వికరహస్యములున్నగునవి వీనియందు ప్రతిబింబించుచున్నవని నుడువదగును. ఇట్లనుటచే జైన బౌద్ధుల యుగమునందు సంతరింపబడిన గ్రంథములు కేవలము మతసిద్ధాంత గ్రంథములని తలచుట పొరపాటు. ఆ నాటి తమిళుల ప్రశాంత జీవనము నభివర్ణించుచున్న యా కావ్యముల నుండి తమిళుల రాజకీయ, సాంఘిక, నైతిక విషయము లనేకములు మనకు తెలియవచ్చుచున్నవి.

## మణిమేకలై (మణిమేఖల)

తమిళకావ్య పంచకమునందు రచనాకాలమును బట్టి ప్రథమగ్రంథముగా పరిగణింపబడుచున్న యీ కావ్యమును సీత్తలై శాత్తనార్ అను కవివరేణ్యుడు సంతరించినాడు. సీత్తలై యనునది యీతని విఖ్యాతనామమని తెలియుచున్నది. చీముకారు తలయని యా మాటకర్థము. భాషయందుగాని, భావములోగాని దోషమేదేని కనబడినచో వెంటనే శాత్తనారు తాను వ్రాయుచుండిన యినుప గంటముతో శిరస్సుపై పొడుచుకొనెడి వాడట! ఈ కఠిన నియమమునకు ఫలితముగా నా కవిప్రవరుని శిరోభాగమున గాయము లేర్పడి చీము కారుచుండెను. ఈ హేతువుచే నీతనికి సీత్తలై శాత్తనా రను వ్యవహారనామ మేర్పడెనని యందురు. ఇతడు క్రీస్తుశకము 100-130 ప్రాంతముల జీవించెననియు, మధురానగర ధాన్యవర్తకుడనియు తెలియవచ్చుచున్నవి. తర్కశాస్త్రములో గూడ నితడు మహాఘటికుడు. సిలప్పదిగార కృతికర్తయగు ఇళంగో అడిగళ్, కపిలుడు మొదలగు వా రీతని మిత్రులు.

శాత్తనార్ కవితయందు సారళ్యమెక్కువ. అర్థవంతములు, రసవత్తరములునైన సమాస రచనలో నితడు సడి సన్నవాడు. ఈతని ప్రకృతి వర్ణనములు నిరుపమానములని తమిళ పండితులు పేర్కొనుదురు. ఈతని కావ్యమగు మణిమేఖలలో నాటి బౌద్ధసంఘము కండ్లకు కట్టునట్లుగా చిత్రింపబడినది. ముప్పది గాథలుగా విభజింపఁబడిన యీ గ్రంథములో 4,857 పజ్తులు గలవు. ఈ కావ్యమునకు మణిమేఖలాసన్న్యాస మనునర్థము నిచ్చు "మణిమేకలైత్తుఱవు" అను నామాంతరము కూడ గలదు.

---

క. అలికాక్షిజనితఘోరా,నలతీవ్రశిఖాప్రదగ్ధనారాయణపు
త్రలయూనకుఁ దచ్ఛరీరా,మలభస్మవిలేపనునకు మహితాత్మునకున్. (124)

క. జయవాటీపురకృతవి,స్మయకరగాంగేయరచితసదనాంతరర
త్నయుతాసనోర్ధ్వసంస్థితి, మయహృత్సంకాశునకును మల్లేశునకున్ (125)

వ. అత్యంతప్రీతికరంబుగా నిరంతరసుఖాభ్యుదయ పరంపరాభివృద్ధి యగునట్లు జ్ఞానమకాంగీకారంబున శ్రీమత్కనక దుర్గాసహాయుం డగు విజయవాటికా మల్లేశ్వరస్వామికి సమర్పింప నుద్దేశించి నా రచియింపం బూనినపద్యకావ్యం బగుబసవపురాణంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. (126

మణిమేఖలయను ముద్దుగుమ్మ మాధవియను వేశ్యకు ప్రభవమందిన ముద్దులకొమరిత. ఈమె జీవిత విశేషాదికమును చిత్రించు కావ్యమే మణిమేఖల. మాధవి, తన ప్రియుడైన కోవలుడను నతడు దుర్విధి ప్రభావమున దైవికము చెందగా, సర్వస్వమును పరిత్యజించి యొక మున్యాశ్రమమును జేరెను. ఆమెననుసరించి మణిమేఖలకూడ మున్యాశ్రమమును జేరెను. అప్పటి కామె పదునారేండ్ల పడుచు! మణిమేఖలను ఉదయకుమారుడను రాకుమారు డొకడు వలచియుండెను. ఆమెను తన వశంవదను చేసికొన నతడు విశ్వప్రయత్నము జేసెను. కాని యతడు నిష్ఫలుడయ్యెను. మణిమేఖల అఱవణ పూజ్యపాదులను నొక మునివలన బౌద్ధమత ధర్మోపదేశము బడసి తన యావజ్జీవితమును బౌద్ధమత వ్యాపనమునందు ధారవోసెను. వేశ్యాగృహమునందు జన్మించియు సచ్ఛీలయని సన్నుతిబడసిన సారసాక్షియీమె![1] "కులము ప్రధానమె గుణము లేకున్న ?" అను గారనామాత్యుని వాక్యమున కీమె దివ్య చారిత్రము లక్ష్యభూత మగుచున్నది.

## సిలప్పదిగారం(సిలంబు+అదిగారం)

1,652 పద్యములు గలిగిన యీ మహాకావ్యము తమిళకావ్య పంచకమున ద్వితీయమైనను నిది యద్వితీయ కావ్యమని పేర్కొనదగును. ఇది క్రీస్తుశకము రెండవ శతాబ్దమున సంతరింపబడినది. ఇందు సతీదేవి యని ప్రజాసన్నుతి సముపార్జించిన కణ్ణకి దివ్యచారిత్రమభివర్ణింప బడినది. బతకమ్మ గాథను దలపించుచున్న యీ కణ్ణకికథ తమిళుల జాతీయ గాథ. ఈ కావ్యమందలి కతపోకడలు కూడ నాటి జాతీయవిధానమున కనుగుణ్యముగానే యున్నవి. తమిళుల సామాజిక జీవనము, భోజనవిధానము, పట్టణములు, పల్లెలు-మున్నగు వానికి సంబంధించిన విశేషాంశములు, వర్తకుల స్థితిగతులు, తమిళనాడులో కొండాడబడు [2] ఇంద్రోత్సవము, తదుత్సవావసరమున జరగు వింతలు వేడుకలు, సముద్రతీరమున జరగు వింతలు విశేషాలు, సంగీతనృత్య ప్రదర్శనములపై తమిళులకుగల యాదరాభిమానములు, భోగపు జవరాండ్ర తళుకు బెళుకులు, సముద్ర వ్యాపారము, మత్స్యకారుల జీవితము— ఇత్యాది విషయముల నన్నిటిని సమగ్రముగను, రసవంతముగను నీ కావ్యము చిత్రించుచున్నది. కావున సిలప్పదిగార మానాటి తమిళ సామాజిక జీవనమును ప్రతిబింబించు మేలి దర్పణమని నుడువుట యత్యుక్తి కానేరదు.

సిలప్పదిగార కావ్యమును వెలయించిన వాడు రాజకవియైన ఇళంగో అడిగళ్ అను నతడు. చోళమహీపతియగు కరికాలచోళుని మనుమడు; చేరరాజగు సెంగుట్టువన్ సోదరుడు. ఒకప్పుడు కార్తాంతికులు కొందఱు సెంగుట్టువన్ కంటెను ఇళంగో విశాష్టకము సావరించు పేరు పెంపులుగడించు సమ్రాట్టగునని నుడివిరి. అందువలన భ్రాతృగౌరవముచే రాజ్యలక్ష్మిని వరింపక ఇళంగో సన్న్యాసము స్వీకరించెను. ఇతడు జైనమతావలంబకుడు. కావుననే యీతని కృతియగు సిలప్పదిగారము జైనమతాచారముల వైశిష్ట్యమును వివరించు ప్రశస్త ప్రశస్తి కావ్యముగ ప్రతిభాసించుచున్నది. నాటకముగా సంతరింపబడిన యీ కావ్యమునకు "ఇయల్ (పద్యము) ఇసై (సంగీతము) నాటక పొరుళ్ తొడర్నిలై శెయ్యుళ్" అనియు, "నాటక కాప్పియం" (నాటక కావ్యము) అనియు నామాంతరములు గలవు. కనుక సిలప్పదిగారం సారస్వత సంగ్రహమనియు, దృశ్య కావ్యముగ రచింపబడిన పద్య కావ్యమనియు నుడువదగును.

ఈ కావ్యమునందలి యితివృత్తము కణ్ణకి జీవితగాథయని యితఃపూర్వమే పేర్కొనబడినది. ఇక కథా వివరములను రేఖామాత్రముగ పరికింతము. చోళమండలమునకు రాజధానీ నగరము కావేరీపూంపట్టణమను రేవు పట్టణము. తన్నగరము వర్తకవరేణ్యులకు కాణాచి. మహానాయకుడు, మహాసత్త్వుడను నిరువురు వర్తక శిఖామణులా నగరమున గలరు. మహానాయకుని కుమార్తెయే కణ్ణకి. ఆమెకు పదునాడవయేట మహాసత్త్వుని కుమారుడగు

1. కథా వివరములు కోరువారు నా "తమిళ పంచకావ్య కథ" అను పుస్తకమును చూడనగును.

2. నన్నయభట్టుకూడ ఇంద్రోత్సవ ప్రశంస సెలవిచ్చియున్నాడు.

కోవలునితో వైవాహికోత్సవము జరగెను. కొంతకాలము కణ్ణకీ కోవలులు సౌఖ్యావహముగ సాంసారిక జీవనము నెఱపిరి. కాని కోవలుడు మాధవియను భోగస్త్రీకి వశంవదుడై కణ్ణకిని విస్మరించెను. మాధవీకోవలుల ప్రణయ ఫలితముగ, వారికి మణిమేఖల యను నొక కొమరిత కలిగెను. కొంతకాలమునకు పిమ్మట మాధవి సౌశీల్యమును సంశయించి కోవలుడామెను వీడి కణ్ణకిని జేరెను. అప్పటి కతడు నిర్ధనుఁడయ్యెను. కావున వ్యాపారార్థమై యతడు కణ్ణకితో గూడి పాండ్య రాజధాని యగు మధురానగరమునకు వెడలెను. అట దురదృష్టవశమున నీతనిపై నొక నేరము మోపబడెను. తత్ఫలితముగా కోవలుడు హత్యగావింపబడెను. భర్తృ మరణానంతరము క్రోధావేశపరవశయైన కణ్ణకి, తన పాతివ్రత్య ప్రభావముచే మధురానగరమును పరశురామప్రీతి గావించెను. పిమ్మట నామె చేరదేశమునకు ముఖ్యపట్టణమైన వంజినగరమును జేరి, అట భగవదనుగ్రహమువలన భర్తను గలిసికొని దేవలోకమునకు జనెను. నాటి నుండియు కణ్ణకి సతీదేవి యని వార్తకెక్కెను. ఇట్లామె కథ 'ద్రావిడ రాజ్యత్రయము' నకు చెందిన పాండ్య చేర చోళరాజ్యములతో ముడివడియుండుటచే తమిళజాతి నేటికిని కణ్ణకిని సతీదేవి యని యారాధించుచున్నది.

మణిమేఖల, సిలప్పదిగారములకు పిమ్మట పేర్కొనదగిన కావ్యము జీవకచింతామణి. ఇది తమిళ కావ్య పంచకమున మూడవది. శృంగారప్రధానమగు నీ కావ్యమును తిరుత్తక్కదేవర్ అను నొక జైనముని సంతరించెను. ఈతడు మదరాసునందలి మైలాపూరులో జననమందె నని యైతిహ్యము. 'చోళకులాబ్ధిశంఖము'గా నీతడు పేర్కొనబడియుండుటచే తిరుత్తక్కదేవుడు చోళవంశీయు డని నుడువదగును. ఇతడు క్రీ. శ. 5 వ శతాబ్దమునకు చెందినవాడని పండితులును, క్రీ. శ. 10 వ శతాబ్దపువా డని పరిశోధకులును తలచుచున్నారు.

జీవకచింతామణికి 'ముడిపొరుళ్ తొడర్ నిలైసెయ్యుళ్' అను నామాంతరము గలదు. ధర్మార్థ కామ మోక్షము లను చతుర్విధ పురుషార్థము లిందు వివరింపబడి యుండుటచే దీనికీ పేరు కలిగెను. జైనుల తాత్త్వికరహస్యములు, విశ్వాసములు, నాటి సాంఘికాచారములు మున్నగునవి యీ కావ్యదర్పణమునందు ప్రతిఫలించుచున్నవి. జీవకచింతామణియందు జీవకుడను నొక రాకుమారుని జీవితము మనోజ్ఞముగ చిత్రింపబడినది. అతడు తొలుదొలుత భోగిగా నుండి పిమ్మట యోగియై ముక్తిమార్గమును గనుగొనెను. జీవకుని చరిత్రమును క్షత్రచూడామణి, గద్యచింతామణి, శ్రీపురాణము — మున్నగు సంస్కృత గ్రంథములుకూడ నభివర్ణించుచున్నవి. కాని యీ గ్రంథములలో జీవకచింతామణి కేది మాతృక యయ్యెనో యిత్థమిత్థమని నుడువుట కష్టము. మనోహరమగు వర్ణనలతోడను, మంజులశైలితోడను చెలువారుచున్న యీ కావ్యము తరువాతి తమిళకవులకు మార్గదర్శక మయ్యెను. కావున నేతత్కావ్య ప్రాశస్త్యము నుగ్గడించుటకు పై విషయ మొక్కటి చాలును.

ఇంకను కుండలకేశి, వళయాపతి అను గ్రంథములు గలవు. ఇవికూడ జైన బౌద్ధుల కర్తృకములే. కాని యీ కావ్యములు నామమాత్రములుగానే తెలియుచున్నవి. ఈ కావ్యకర్తల నామములుకూడ తెలియరాలేదు. ఇటుల జైన బుద్ధుల కాలమునాటి గ్రంథములు మతసిద్ధాంతపరములే యైనను వానియందు నాటి సమాజము ప్రతిబింబించుటచేతను, ఉత్తమ కవితాలక్షణము లగపడుచుండుటచేతను నవి కావ్యయశస్సును గడించి తమిళ కావ్య ప్రపంచమునందును సముచితస్థానమును సంపాదించినవి. మొత్తముమీద జైన బౌద్ధుల యుగము తమిళ వాఙ్మయవికాసమునకు మిక్కిలి తోడ్పడె నని నుడువదగును. ఇక నా గ్రంథములనుండి తెలియవచ్చుచున్న రాజకీయ, సాంఘిక, మత విషయములను దిఙ్మాత్రముగ పరిశీలింతము.

ప్రాచీనకాలమున తమిళనాడులో చేర చోళ పాండ్యము లను మూడురాజ్యములు వర్ధిల్లెను. సిలప్పదిగారం కథాకాలమునాటికి చేరరాజ్యమును సెంగుట్టువన్ మన్నీడును, చోళనాడును కరికాలచోళ భూపతియు, పాండ్యదేశమును నెడుంజెలియన్ మహీపతియు పాలించుచుండిరి. వీరందఱు పరమత సహనమును ప్రదర్శించిన విశాలహృదయులు; తమిళ

(తరువాయి 68 వ పుటలో)

# సరస్వతీమహాల్



శ్రీ ఆరుద్రగారు

సరస్వతీమహాల్ విద్యానిలయం. విజ్ఞానఖని. వినోద వాఙ్మయవని. జ్ఞానతృష్ణతో వచ్చిన వాళ్ల దప్పికని విద్యాశీతల జలాలతో తప్పక తీర్చే వియద్ధుని. సాంస్కృతిక మూలధనం కావలసిన సారస్వతవ్యాపారికి సిద్ధంగా ఉన్న తపనీయ సంప్రదాయనిధి. సరస్వతీ మహల్ తెలుసుకొన్న వాడికి కలకుల నున్నతంగేటి జాన్న, అంకస్థితాగ్రపేటి. ఇక్కడి గ్రంథరాసులు హృద్యంగా ఉంటాయి, అపూర్వంగా ఉంటాయి, ఎరుకని సమగ్రం చేస్తాయి. ఆఘని బర్హాణం కావిస్తాయి. ఇక్కడ పుస్తకాలు "కప్పురంబులు కుప్పలుగాఁ బోసినట్లు, కుంకుమ పైపై గుప్పినక్రియ విరిపొట్లము విప్పిన గతి ఘుమ్మున" చెప్పినకవిత్వం గల పుస్తకాలు. విరి పొట్లము విప్పిన గతి? ఏ పువ్వులు? "మొల్లపువ్వులపొట్లములు విప్పినట్లు." అంతేనా ..."చల్లగా పన్నీరు చల్లిన తీరు." ఈ గ్రంథాలయంలోని కావ్యాలు "చెవులకుఁ జవులై చల్లగఁ గవులకుఁ దవులై సమస్తకావ్యకళాబంధువులై" ఉంటాయి. "ఒక్కొక్కరొడఁ జీనిచక్కెరపానకం బానినట్లాహ్లాద మావహిల్ల, నొక్కొక్కరొడఁ దావి నెక్కొన విరజాజిసరములెత్తినరీతిఁ బరిమళింప, నొక్కొక్కరొడఁ బల్వలుప్పతిల్లఁగ మంద మారుతంబులు వీచుమహిమ చెలఁగ నొక్కొక్కరొడ మేనఁ జొక్కు సంపాదించు వెలఁదివెన్నెల తేటవిధము మించ" గల కవితలీ భాండాగారంలో చైతన్యవంతంగా నిద్రపోతూ ఉంటవి. కావ్యాలేనా ఇక్కడ ఉంటాయి? కాదు. శాస్త్రాలు, పురాణాలు, లక్షణగ్రంథాలు, ప్రమాణాలు ఎన్నో ఉన్నాయి. ఒక్క సాహిత్యం గురించే కాదు. సంగీత గ్రంథా లున్నాయి. నాట్యశాస్త్రా లున్నాయి. వైద్యగ్రంథా లున్నాయి. ఏ భాషలో? తెలుగు, తమిళం, సంస్కృతం, మరాఠీ-ఓహో. మనదేశీయ భాషల్లో. అంతే కాదు. ఇంగ్లీషుభాషలో? ఇంగ్లీషుభాషలోనా? ఒక్క ఇంగ్లీషుభాషలోనేనా? ఫ్రెంచి, గ్రీకు, లాటిన్, ఇటాలియన్ భాషల్లో కూడా పుస్తకా లున్నాయి. ఇది నిజంగా సరస్వతీ మహలే. ఇక్కడనే వాణి జీవిస్తున్నది.

ఎక్కడ? ఎక్కడుందీ సరస్వతీ మహల్? తంజావూరులో!

ఎప్పట్నుంచీ?

రమారమి మూడువందల సంవత్సరాలనుంచీ.

ఎవరయ్యా ఇంత మంచిపని చేశారు? ఇంత చక్కటి పుస్తకాలదేవాలయం నిర్మించారు?

తంజావూరు నాయకరాజులు నిర్మించారట. ఎవరా? పెదచెవ్వప్ప నాయకుడు, అచ్యుతప్ప నాయకుడు, రఘునాథ నాయకుడు, విజయ రాఘవనాయకుడు.

వీళ్లు ఎప్పుడు పరిపాలించారు?

మల్లంపల్లి సోమశేఖర శర్మగారి లెక్క ప్రకారం పెదచెవ్వప్ప నాయకుడు మొదట తంజావూరులో ఆంధ్రనాయక రాజ్యాన్ని క్రీస్తుశకం ౧౫౪౯ తరవాత స్థాపించాడు. (అది బహుశా ౧౫౫౦ కావచ్చు). అతడు బతికుండగానే అతని కొడుకు అచ్యుతప్ప నాయకుడు ౧౫౬౦ నుండి ౧౬౦౦ దాకా నలభయి సంవత్సరాలు పాలించాడు. అతడి తరవాత అతని కొడుకు రఘునాథ నాయకుడు ముప్ఫయి నాలుగు సంవత్సరాలు పాలించాడు. రఘునాథ నాయకుడి అనంతరం అతని కుమారులలో ఒకడైన విజయ రాఘవుడు పట్టం కట్టుకొని ముప్ఫయితొమ్మిది సంవత్సరాలు పరిపాలించాడు. ఇతడే నాయకరాజులలో ఆఖరివాడు.

అయితే ఈ నాయకరాజులలో ఎవరు గ్రంథాలయాన్ని నిర్మించారు? సరస్వతీమహాల్ అనే పేరు వారే పెట్టారా?

లేదు. ఈ పేరు వాళ్లు పెట్టలేదు. వాళ్ల తరవాత తంజావూరిని పాలించిన మహారాష్ట్ర భూపతులు పెట్టారు.

అయితే సరస్వతీమహాల్ని నాయకరాజులు స్థాపించా రంటారేం?

అంతా మరి అలాగే అంటారు. అంతా ? ఎవరీ అంతా ?

ప్రస్తుతం సరస్వతీ మహల్ని నిర్వహించడానికి ప్రభుత్వం నియమించిన కమిటీవారు గ్రంథాలయాన్ని పరిచయం చేయడానికి రాసిన ఇంగ్లీషు ప్రకటనలో దీన్ని నాయకరాజులు స్థాపించారు అంటున్నారు.

వర్తమానాంధ్రకు సరస్వతీమహల్ గురించి తెలియచేసిన వాళ్లలో బహుశా మొట్టమొదటివారైన వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'తంజావూరు ఆంధ్రరాజుల చరిత్ర' అనే పుస్తకానికి 'తొడిమ' రాస్తూ అందులో "విద్యా విశారదులు కనుక ఆ నాయకరాజులు సరస్వతీ భాండాగారం ఒకటి నెలకొల్పినారు. అద్భుత గ్రంథములు అనేకం అందులో వున్నవి" అని వ్రాశారు.

ఇప్పుడు సరస్వతీమహల్లో పుస్తకాలయ పండితుడుగా పని చేస్తున్న విఠలదేవుని సుందర శర్మగారు ఆ గ్రంథాలయం ప్రచురణలలో ఒకటైన 'కుశలవోపాఖ్యానం' అనే ద్విపద కావ్యానికి ఉపోద్ఘాతం రాస్తూ ఇలా చెపుతున్నారు. "ఆంధ్రనాయక మహారాజు లాంధ్ర భాషాభివృద్ధికై యొనర్చినకృషికేకైకనిదర్శన మీ తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయమనుటలో నతిశయోక్తి కానంబడదు...పూర్వకవులచే రచింపబడిన యనేక గ్రంథములను సేకరించియు, సమకాలికులైనకవులయొక్క గ్రంథములను భద్రపఱచియుఁ దామే స్వయముగఁ గొన్ని గ్రంథముల రచించియు కవులఁ గవయిత్రుల గ్రంథనిర్మాణార్థమై ప్రోత్సహించియు నా మహామహులు తమ జీవితమును సార్థకముఁ జేసిరి."

పూర్వం గ్రంథాలయోద్యోగిగా పని చేసిన కురుగంటి సీతారామయ్యగారు తమ 'తంజాపురాంధ్ర నాయకరాజ చరిత్రము'లో ఏమన్నారంటే 'తంజావూరునందలి పుస్తకాలయమునకు సరస్వతీ మహల్ అను పేరు మహారాష్ట్రరాజులు పెట్టినను దానికి పునాది నాయకరాజుల కాలములో వేయబడెను. ఇప్పటికిని తత్పుస్తకాలయమున నాయకరాజులు స్వోపయోగమునకై వ్రాయించినగ్రంథములు కలవు. ఇవి గాక నాయకరాజులయొక్క సమకాలికులగు కవులును, కవయిత్రులును వ్రాసినగ్రంథములయొక్క ప్రతు లొక్కటొక్కటిచొప్పున కలవు. వీటి నన్నిటినిబట్టి తత్పుస్తకాలయమునకు బీజ మీ నాయకరాజుల కాలమున పడెనని దృఢముగా చెప్పనగును. అది అచ్యుతుని కాలమో లేక రఘునాథుని యారంభకాలమో యని యనుమానము. ఎట్లయినను మన యూహ నిక్కువము' అని వా రంటారు.

అయితే అది నాయకరాజుల వరసలో రెండవ రాజు అచ్యుతప్పనాయకుడి కాలంలో కాదని గట్టిగా చెప్పవచ్చు. 'మధుర తంజావూరు నాయకరాజుల నాటి ఆంధ్రవాఙ్మయ చరిత్ర' అనే పుస్తకంలో డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు "చెవ్వప్ప నాయకుడు గాని యచ్యుతప్ప నాయకుడు గాని విద్యాభిమానము గల దొరలుగఁ గన్పింపరు" అని రాశారు. వెంకటరమణయ్యగారంత ప్రముఖ పరిశోధకులు ఇలా చెప్పినతరవాత ఈ సరస్వతీ మహల్ కి బీజం అచ్యుతప్ప నాయకుడి హయాంలో పడలేదని నిశ్చయింపవచ్చు.

పోతే కురుగంటి సీతారామయ్యగారి ఊహ ప్రకారం ఇంక రఘునాథుని ఆరంభకాలంలో పడాలి. దీనికి కూడా సాక్ష్యం దొరకదు. ఏమంటే రఘునాథుని కుమారుడు విజయరాఘవుడు వ్రాసిన రఘునాథ నాయకాభ్యుదయం అనే ద్విపదకావ్యంలో ఈ పుస్తకాలయం గురించి ఏమీ వర్ణించలేదు. అందుచేత రఘునాథుని యారంభకాలంలో కాదు సరిగదా అవసాన కాలంలోనైనా పుస్తకాలయ స్థాపన జరిగి ఉండదు. విజయరాఘవుడు తాను పట్టంగట్టుకొన్న తరవాతే రఘునాథ నాయకాభ్యుదయం రాశాడని విశ్వసించవచ్చు. అందులో వివిధ భవనాలూ, మందిరాలూ వర్ణించాడు. అవన్నీ రఘునాథ నాయకుడి కాలంలోనివే. ఈ వర్ణనలో కనబడనందున ఏ రూపంలోనూ ఈ పుస్తకాలయం అప్పటికి లేదని ఊహింపవచ్చు.

కురుగంటి సీతారామయ్యగారు ఊహించిన ఇద్దరి నాయకరాజుల కాలాలలోనూ ఈ పుస్తకాలయం స్థాపన జరగలేదని తేలింది. అయినా అందరూ నాయకరాజుల కాలంలోనే దీనికి బీజం పడిందంటారు. చెవ్వప్పనాయకుడు గాని, యచ్యుతప్పనాయకుడు గాని విద్యాభిమానం గల దొరలు కారు. రఘునాథుడి

కొంచెస్థాటి భవనాల జాబితాలో ఇది లేదు. పోతే ఇక విజయరాఘవుడి కాలంలో దీనికి ఏర్పాట్లు జరిగాయా?

అదీ సందేహామే......

విజయరాఘవుడి సాహిత్యసాయ పెండారాన్ని అతని సభలోని శారదాధ్వజాన్ని వర్ణించిన కవులు ఈ పుస్తకాలయాన్ని వర్ణించినట్లు కనబడదు. తాను చేసినసత్కార్యాలనీ, ఘనకార్యములనీ స్వంతంగా వర్ణించుకొన్న విజయరాఘవుడు కూడా పుస్తకాలయం గురించి ఏం చెప్పుకోలేదు.

రఘునాథ నాయకాభ్యుదయంలో తన కులగురువు శతక్రతు తాతాచార్యుడు విజయరాఘవుడితో ఇలా చెప్పిన ట్లుంది.

''పట్టాభిషేకవైభవము గైకొన్న
యట్టి సంవత్సరమం దొకనాట
నవలీలగాఁ బదియాఱు దానములు
సవరించి ద్విజుల కొసంగితి వీవు
వీరుఁడో సవరము వేంకటపతిని
పాలుబోలించి నీ పనుపులచేత
బట్టైన సీమలో వందనెల్లూరు
కట్టించితివి ఘటికామాత్రమునసె...
రత్నాంగియుఁ గిరీటరాజంబు దివ్య
రత్నభూషణములు రథగజాశ్వములు
ప్రాకారగోపురప్రాసాదములను
వైకుంఠసభ పుష్పవనతటాకములు
ప్రకటించి రాజగోపాలదేవునకు
సకలకైంకర్యముల్ సంఘటించితివి
నవనవంబుగ రఘునాథపురాది
వివిధాగ్రహారముల్ వెలయఁ జేసితివి.''

అని చాలా పెద్ద జాబితా ఉంది. విజయరాఘవుడే గాని, వివిధకావ్యాలూ, శాస్త్రాలూ పురాణాలు సేకరించి ఒకచోట నిలిపి ఉంటే అది ఈ జాబితాలో చేరి ఉండేదేకదా! చేర లేదు. రఘునాథ నాయకాభ్యుదయంలో 'రామభద్రశాల', 'లక్ష్మీవిలాసం' 'లలితనాకపురీ విలాసగేహం', 'శ్రీగాను ప్రాధాధిరాజం', ''విజయభవనం'' 'ఇందిరామందిరం' అనేవాటిని పేర్కొన్నాడు.

సరస్వతీదేవి పేరుమీదుగా ఏ ఒక్కమందిరం లేదు. అందుకే సరస్వతీమహల్‌లోని పుస్తకాలయానికి బీజం విజయరాఘవుడి కాలంలో కూడా పడలే దనిపించుతుంది.

''ప్రాచీనరాజసౌధములు'' అనే వ్యాసం రాస్తూ అందులో సరస్వతీమహల్ గురించి శ్రీ తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు ఇలా రాశారు. నాయకరాజుల యనంతరము తంజాపూరును మహారాష్ట్రభూపతులు పరిపాలించిరి. వారిలో శరభోజీ మహారాజు కాలమున సరస్వతీమహాలు నిర్మాణము గావింపఁబడినది. అందు గొప్పతాళపత్రగ్రంథ భాండాగారము కలదు.[1]

శరభోజీ కాలంలో ఈ కట్టడం కట్టారన్నది సత్యదూరం. నాయకరాజుల రోజులలో నిర్మించబడ్డ భవనంలోనే ఈ గ్రంథాలయం ఉంది. మహారాష్ట్రరాజుల కాలంలో నిర్మించబడ్డ వాటిలో కొయ్య ఉపయోగించారు. నాయకరాజుల కాలంలో ఎక్కడా అది ఉపయోగించలేదు. ''శ్రీరామసౌధం'' అనే భవనం గురించి వ్రాస్తూ కురుగంటి సీతారామయ్యగారు ఇలా అన్నారు. తత్కాలపు భవన నిర్మాణపద్ధతి యీ భవనమువలన తేటపడగలదు. కొయ్య యెచ్చటను నుపయోగించియుండ లేదు. మహారాష్ట్రరాజు లేతత్సభామంటపమును వదలి ప్రత్యేకముగా వేరుదర్బారు హాలును కట్టుకొనిరి. అది యిప్పటికిని కుడ్యచిత్రకర్మసమేతమై ప్రకాశించుచున్నది. చూపువలన నే వెనుకటి దానికంటె యిది యధునాతనమని తెలియగలదు.''[2] సీతారామయ్యగారు చూపించిన సబువు సరస్వతీమహల్ విషయంలో వర్తించుతుంది.

ఇది తప్పకుండా నాయకరాజుల రోజుల్లో కట్టిన భవనమే. అయితే యిందులో అనాడు పుస్తకాలయం లేదు. రఘునాథుడి కాలంలో దీనిని 'విజయచిహ్నములచే వెలయుచునున్న విజయభవనరాజం' అని పిలిచేవా రని నా ఊహ. ఎలాగ? మనవి చేస్తాను.

తూర్పుద్వారంలోనించి కోటలోకి ప్రవేశిస్తే కనబడేభవంతులని రఘునాథ నాయకాభ్యు

1. భారతి-ఫిబ్రవరి 1954
2. తంజాపురాంధ్రనాయకరాజచరిత్రము-౨౮౫ పేజీ.

విషయంలో విజయరాఘవుడు వర్ణించాడు. అవరసలో:

"రంగైన యచ్యుతరంగకూటంబు
లలితనాకపురీవిలాసగేహంబు
కులగిరిఁ బోలులాగులచప్పరంబు
కవివర్ణనీయమా గరడికూటంబు
నవరత్నమయ మైననాటకశాల
మదనావతారుఁ డై మన్నారుఁ డున్న
మదనగోపవిలాసమందిరాంగణము
పట్టాభిరాముని భావచిత్రంపు
గట్టిబంగారు చెక్కడపుఁజప్పరము
నీలంపుఁజాయలు నీడలు దేరఁ
జాల విప్పై యొప్పుచల్వరాజగతిఁ
గలిగి రెండవపుష్పకవిమాన మనఁగ
నలరు శ్రీరామసౌధాధిరాజంబు
విజయచిహ్నములచే వెలయుచు నున్న
విజయభవనరాజవేదికాస్థలిని
గంచుకీవర్గంబు కాచియున్నట్టి
కాంచనోరుకవాటఘటితమార్గంబు."

మొదలయిన వర్ణన లున్నాయి.

ఇందులో శ్రీరామసౌధాధిరాజాన్ని ఇప్పుడు నాయకరాజుల దర్బారు హాలని చూపునట్టి భవనంగా కురుగంటి సీతారామయ్యగారు గుర్తుపట్టారు.[1] ఇది వాస్తవమే అవుతుంది. విజయరాఘవుడు వర్ణించినక్రమంలో నవరత్నమయ మైననాటకశాల ఒకటుంది. దానిని ప్రస్తుతసంగీతమహాలుగా గుర్తుపట్టవచ్చు. "The Sangita Mahal which is now an object of wonder in accoustics existed from the early part of the 16th century." అని ప్రస్తుత పుస్తకాలయం అధికారులు ఒక కరపత్రంలో ప్రకటించారు. ఈ సంగీతమహాలుని దర్శించి దక్షిణంగా వెళితే ప్రస్తుతం ఆర్టుగేలరీ ప్రవేశద్వారానికి వెళతాము. ఇందులోంచే శ్రీ రామసౌధాధిరాజానికిప్రస్తుతం మార్గంఉంది తంజావూరు ఆర్టుగేలరీ అని ఇప్పుడుపిలుస్తున్న ఆవరణలోనే ఉత్తరాన ఉన్న నాయకరాజుల పూజామందిరం, శ్రీరామసౌధాధిరాజం, గూఢ గోపురం దిగువ నున్నవిశాలశాల ఉంటున్నవి. నాటకశాల తరవాత విజయరాఘవుడి వర్ణనక్రమంలో 'మదనావతారుడై మన్నారు డున్న మదనగోప విలాసమందిరాంగణం' అనేది ఉంది. ఈ నాడు ఆర్టుగేలరీ ఆవరణగా ఉన్నదే ఆ అంగణం కావచ్చు; లేక ఆర్టుగేలరీలోకి ప్రవేశించగానే బ్రహ్మవిగ్రహం ఉన్న ప్రదేశం కావచ్చు. ఈ మందిరాంగణాన్ని క్రమించాకే శ్రీరామసౌధాధిరాజానికి వస్తాము. శ్రీరామసౌధాధిరాజానికి ఎదురుగానే ప్రస్తుతపు సరస్వతీమహాలుంది. విజయరాఘవుడి వర్ణనలో కూడా యీ సౌధాధిరాజం తరవాత విజయభవనరాజాన్ని వర్ణించాడు. కాబట్టి ఆనాటి విజయభవనరాజమే ఈనాటి సరస్వతీమహాల్ అని ఊహించవచ్చు. విజయభవనరాజంలో వేదిక ఒకటి ఉందని కూడా విజయరాఘవుడు చెప్పాడు. నేటి సరస్వతీమహాల్‌లో కూడా ఒక విశాల మైన ఇటుక కట్టడం వేదిక ఉంది. దీనిమీదనే మేజాలు వేసుకొని లేఖకులు ప్రస్తుతం లిఖితపుస్తకాలనుంచి కాపీలు రాసుకొంటున్నారు.

సరస్వతీ మహాలుకి కుడిచేతిపక్క నాయకరాజుల దర్బారుహాలు ఉంటే ఎడమ చేతివైపు మహారాష్ట్రరాజుల దర్బారుహాలు ఉంది. ఈ దర్బారుకీ సరస్వతీమహాలుకీ మధ్య దక్షిణం వైపు నేటికీ స్తంభాలతో ఆర్చీలతో కట్టిన ఒక పురాతనమార్గం కనబడుతుంది. ఈమార్గంలోంచే మహారాష్ట్రుల దర్బారులోకి మంత్రులూ మొదలైన ప్రముఖులు వెళ్లే వారని గ్రంథాలయం పండితులు చెప్తారు. విజయరాఘవుడు విజయభవనరాజం తరవాత వర్ణించిన "కంచుకీవర్గంబు కాచియున్నట్టి కాంచనోరుకవాట ఘటిత మార్గం" ఇదే అనవచ్చు.

క్రమం తప్పకుండా విజయరాఘవుడి పట్టికలోని సౌధాలని గుర్తుపట్టాము. కాబట్టి నేటి సరస్వతీ మహాలు ఆనాటి విజయభవనం అని కచ్చితంగా చెప్పవచ్చు. కట్టడం నాయకరాజులదే. అయితే అందులో ఆనాడు పుస్తకాల నుంచలేదు. విజయచిహ్నాలు ఉండేవి.

రఘునాథనాయకుడు అనేక విజయాలను సాధించాడు. జింజి, దేవికోట, జాఫ్నా, తోపూరు మొదలైన యుద్ధాలలోని విజయచిహ్నాలను తీసుకొచ్చి ఈ విజయభవనరాజంలో

1. తంజాపురాంధ్రనాయకరాజచరిత్రము_౨౭౮ పేజీ.

2. Peeps into Saraswathi Mahal by S. Gopalan.

వెలిసి ఉండవచ్చు. [1]విజయరాఘవుడి ఆరంభకాలంనాటి కీమందిరం విజయ చిహ్నలచే వెలయుచున్న మందిరం. అయితే ఇది అపురూప అద్భుతగ్రంథాలతో ఎప్పట్నుంచీ వెలయడం మొదలెట్టింది ?

విజయరాఘవుడి కాలంలోనా ? కాకపో వచ్చు. విజయరాఘవవిలాసమందిరం వేరే వుంది. అందులోనే అతని శారదాధ్వజం ఉండేది. కాబట్టి అతడు తన ముప్పయిలొమ్మిది సంవత్సరాల రాజ్యకాలంలో ఒక వేళ పుస్తకాలు సేకరించినా వాటిని శారదాధ్వజం ఉండే విజయ రాఘవ విలాసమందిరంలోనే ఉంచవచ్చు. వాటిని రఘునాథనాయకుడి విజయచిహ్నలచే వెలయుచున్న విజయభవనంలో ఎందుకు జాగ్రత్త చేస్తాడు. ? ఆ విజయచిహ్నలని తొలగించి విజయరాఘవుడు తాను సేకరించినపుస్తకాలు పెట్టుకొంటాడా ? ఇలా జరగడానికి వీలు ఉండదు.

అయితే విజయరాఘవుడికాలంలో అపూర్వ పుస్తకాలసేకరణ జరిగి ఉండదా ? జరిగి ఉంటుంది. ఎందుచేత అంటే అతడు అష్టభాషా ధురీణుడు. వివిధభాషల గ్రంథాలు తెప్పించి ఉంటాడు. అతడి భోగపత్ని రంగాజి "విచిత్ర తరపత్రికా శతలిఖిత వాచికాగ్రావగాహన ప్రవీణ. తత్ప్రీతి పత్రికాశతస్వహస్తలేఖన ప్రశస్తకీర్తి..." అందుకే విజయరాఘవుడి కాలంలో అపురూప, అద్భుతగ్రంథాలు విస్తారంగా ఉండవచ్చు. అయితే వీటన్నిటినీ ఒక్క చోట చేర్చి ఉండక పోవచ్చు.

అయితే విజయభవనానికి సరస్వతీమహాల్ అని పేరు పెట్టి యిక్కడికి పుస్తకాలు చేర్చినది మహారాష్ట్రరాజులై ఉంటారు.

ఎవరా మహారాష్ట్రరాజులు ? విజయరాఘవుడి తరవాత అచిరకాలంలో మహారాష్ట్ర భూపతి ఏకోజీ తంజావూరుని ఎనిమిదేళ్ళే పాలించాడు. "తంజావూరి మహారాష్ట్ర భూపతులు; ఆంధ్రసాహిత్యము" అనేవ్యాసంలో మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఇలా రాశారు. "ఏకోజీ మహారాష్ట్రుడే కాని యతనికి తెలుగు తేటదనమును తీయదనమును తెలియక పోలేదు. ఏకోజీకంటెను ఈతని తనయుడు షాహజీకి తెలుగన్న నత్యంతఅనురాగాభిమానములు." [2]కనుక కొత్తగా తన ప్రభుత్వం స్థాపించుకొని తన ఎనిమిదేళ్ల పాలనలో రాజ్యాన్ని సుభిక్షాన్ని చేసుకోనడంలో, సుస్థిరం కావించుకోనడంలో నిమగ్నమైనఏకోజీకన్నా అతని కొడుకు షాహజీయే కోటలో ఉన్నగ్రంథాల నన్నీ ఒక చోట చేర్చవచ్చు.

కురుగంటి సీతారామయ్యగారు వ్రాసినట్టు "మహారాష్ట్రులు ప్రత్యేకముగా వేరు దర్బారు హాలును కట్టుకొనిరి... వెనుకటి నాయకులు కట్టినట్టి ఒక కోటను మార్చినట్లు స్పష్టము" [3] ఈ మార్పుడంలోనే విజయభవనం సరస్వతీ మహల్ గా మారి ఉంటుంది. ఇది షాహజీ కాలంలోనే జరిగి ఉంటుంది.

ఏమంటే షాహజీకాలంలోనే విజయరాఘవుడికాలంలో మాదిరిగా కవిత మళ్లా విలాస వైభోగాలను అనుభవించింది. విజయరాఘవుడు ముప్పయికిపైగా కృతులు తన ముప్పయిలొమ్మిదేండ్లపాలనలో రచిస్తే, ఈశాహజీ తనయిరవైయేండ్లపాలనలో ఇరవైయొక్క నాటకాలు రచించాడు. ఈశాహజీ కాలంలో చాలామంది విద్యావిశారదు లుండేవారు. వారి రచన లన్నీ శాహజీకి వారు సమర్పించే రేమో! తెలుగు మీద అభిమానం చేత శాహజీ ప్రాచీనగ్రంథాలను తెప్పించే డేమో ! మహారాష్ట్రదేశం నుండి వచ్చిన ఆభాషలోని గ్రంథాలతోపాటు అన్నీ ఒకచోట చేర్చాడేమో !

ఆంధ్రనాయకప్రభుత్వం పోయి మహారాష్ట్రులపాలన ఏర్పడ్డాక దాన్నిగురించి నేలటూరు వెంకటరమణయ్యగారు ఇలా రాశారు... "మహారాష్ట్రు లాంధ్రులను జయించి తమ ప్రభుత్వమును స్థాపించినను ఆంధ్రులచే వారును పరాజితులైరి మహారాష్ట్రుల విజయము రాజకీయము. ఆంధ్ర విజయము సాంస్కృతికము మహారాష్ట్రరాజు లందరు తెనుగు నభ్యసించిరి.

---

1. తన విజయాలకు చిహ్నంగా ఈ భవనాన్ని రఘునాథుడు కట్టించాడని తిమ్మాగజ్ఝల కోదండరామయ్యగారు అభిప్రాయపడుతున్నారు. వారి వ్యాసం ప్రాచీనరాజసౌధములు భారతి ఫిబ్రవరి 1954

2. భా[illegible]సెంబరు 1953.

3. తంజావూరు ఆంధ్రనాయకరాజచరిత్రము ౨౪౫ పేజీ.

సభయందు తెనుగు మాటాడిరి. తెనుగు విద్వాంసులను, కవులను, గాంధర్వవిద్యావిశారదులను, గాయనగాయనీ జనులను జేరదీసి నాయక రాజులవలె నాశ్రయ మొసగిరి.'' [1] ఈ చేరదీయడంలో గ్రంథాలను కూడా సేకరించి ఉండవచ్చు. కాబట్టి షాహజీ కాలంలోనే సరస్వతీ మహలుకి పేరు పెట్టి ఉంటారు. పుస్తకాలయానికి పునాది వేసి ఉంటారు.

ఈ శాహరాజేంద్రుడు ౧౭౧౨ దాకా యిరవై ఎనిమిది సంవత్సరాలు పరిపాలించాడు; అతడు వినోదవిలాస వాఙ్మయసృష్టి చేశాడు; కృతులు నిర్మించాడు. కృతులు అంకితం పుచ్చుకొన్నాడు. కవిత్వమే కాదు; అతడి అభిమానానికి సంగీతనాట్యాలు కూడా పాత్రమయాయి. శాహరాజు సంగీతంపై...''సంకలితము చేసిన లక్ష్యగ్రంథములు ఇరువది తాళపత్ర గ్రంథములలో ఇప్పటికిని తంజావూరి సరస్వతీమహాలు గ్రంథభాండాగారములో భద్రముగానున్నవి. శాహజీ యీ లక్ష్యములను ముందుంచుకొని తన యాస్థానసంగీతవిద్వాంసుల సాయముతో తన కాలములో వాడుకలో నుండిన రాగముల కన్నిటికి లక్షణములను నిర్ణయించెను. ఈ లక్షణగ్రంథములు పది తాళపత్ర సంపుటములలో నున్నవి''... [2] అని మల్లంపల్లి సోమశేఖర శర్మగారు వ్రాశారు.

శాహజీ తరవాత ౧౭౧౨ నుండి ౧౭౯౮ దాకా ఎనభైఆరుసంవత్సరాలలో ఏడుగురు తంజావూరుగద్దె నెక్కారు. వీళ్లలో రమారమి అందరూ లలితకళలని పోషించారు; గ్రంథాలు రాశారు; గ్రంథాలను అంకితం పుచ్చుకొన్నారు; పుస్తకాలయాన్ని కూడా అభివృద్ధి చేసి ఉంటారు.

౧౭౯౮ లో శరభోజీరాజా గద్దెనెక్కాడు. అయితే రాజ్యపాలన భారాన్ని ఇంగ్లీషువారికి అప్పచెప్పాడు. విజ్ఞాన సముపార్జనం, పుస్తక సేకరణం, గ్రంథపఠనం మొదలైన సాంస్కృతిక వ్యాసంగాలకి జీవితాన్ని అంకితం చేశాడు. ఇతని రాజ్యకాలం సరస్వతీమహాలు చరిత్రలో స్వర్ణయుగం. ఇంగ్లీషు, ఫ్రెంచి, తదితర యూరోపియను భాషలు ఇతడికి క్షుణ్ణంగా వచ్చు. మరాఠీ, సంస్కృతం నేర్చుకున్నాడు. ఆనాడు వెలువడ్డ ఇంగ్లీషు గ్రంథాలన్నీ తెప్పించుకొన్నాడు. ప్రతి పుస్తకంమీదా 'శరఫోజీ రాజా' అని తన సంతకం పెట్టుకొన్నాడు. ఈనాడు సరస్వతీమహాల్‌లో మూడువేల ఎనిమిదివందల ముప్ఫయి ముద్రితపురాతన ఆంగ్ల పుస్తకాలున్నాయి. సర్ వాల్టర్‌స్కాట్ సంపుటాలు, ఎన్నో స్పెన్సరుకవితా సంపుటాలు, షేక్స్‌పియరు నాటకసంపుటాలు ఎన్నో యిందులో ఉన్నవి. లాటిన్, యిటాలియన్, ఫ్రెంచి గ్రీకు గ్రంథాలు కూడా తెప్పించాడు శరభోజీ. ఇతడు ఆనాటి సజీవవిజ్ఞానసర్వస్వం.

శరభోజీరాజా పూనుకోకపోతే సరస్వతీ మహల్ యీ నాడు యీ రూపంలో, ఇంత ఔన్నత్యంలో ఉండేది కాదు. అందుకే యీ పుస్తకాలయాన్ని ఇప్పుడు 'తంజావూరు మహారాజా శరభోజీ సరస్వతీమహల్ పుస్తకాలయం' అని పిలుస్తారు.

ఈ భాండాగారంగురించి తెలుసుకొనడానికి, దీన్ని కూలంకషంగా చూడడానికి, దీనిగురించి విపులంగా చెప్పడానికి ఎంత తీరుబాటు దొరికినా, ఎంత వ్యవధి యిచ్చినా అది అతిస్వల్పమే అవుతుంది. మన పూర్వతరాలవాళ్లు మనకోసం నిక్షిప్తం చేసినవిజ్ఞానంముందు నిలబడగానే మన అల్పత్వం స్ఫురించి వినమ్రభావం కలుగుతుంది. ఇక్కడ విద్యాభ్యసనం చేయాలనేవిధేయభావం పుడుతుంది. ఈ విజ్ఞాన మందిరానికి నమస్కరించాలనిపిస్తుంది. అందుకే శరభోజీరాజాఅంజలి ఘటించినవిన్యాసంలో తన విగ్రహాన్ని చేయించుకొని యీమందిరానికి అభిముఖంగా నిలుపుకొన్నాడు. సర్వకాలాల్లో సరస్వతీ మహాలుకి సవినయంగా నమస్కరించడంకన్నా అతడు కోరుకొన్నది లేదు. అది కూడా మనం నోచుకోలేం.

అయితే అతడు విడిచిపెట్టిన విజ్ఞానవారసత్వాన్ని అనుభవించేఅదృష్టం మనకు ఉంది. దాన్ని సద్వినియోగం చేసుకొనడం మన కర్తవ్యం.

1. మధుర తంజావూరు నాయకరాజులనాటి ఆంధ్రవాఙ్మయచరిత్ర.

2. భారతి డిసెంబరు 1953.

శృంగాటకం :

# దక్షిణదేశీయాంధ్రవాఙ్మయము

తెలుగువారికి నేటిదాకా తెలుగుజాతి సమగ్రచరిత్రను చదువుకొనే భాగ్యం కలుగలేదు. సమగ్రనిఘంటువు, సమగ్ర వ్యాకరణం నేటికీ వారికి తీరనికోర్కెలుగానే వుండిపోయినవి. అలాగే సమగ్రాంధ్రవాఙ్మయ చరిత్రము కూడా. కందుకూరి వీరేశలింగంపంతులుగా రానాడు దీక్షతో రచించబట్టి కాని లేకపోతే తెలుగుకవుల చరిత్రకు కూడా మన మీనాడు దేవుళ్ళాడుకొనే పరిస్థితి కలిగివుండేదేమో! మానవల్లి రామకృష్ణకవి, చిలుకూరి నారాయణరావు, వేటూరి ప్రభాకరశాస్త్రి మొదలయిన హేమాహేమీల కాలంలో వాఙ్మయచరిత్ర పరిశోధన మాత్రమే జరిగింది. కాని చరిత్ర నిర్మాణం జరగలేదు. కాగా వాఙ్మయ చరిత్రకు సంబంధించిన వివిధశాఖలలో ప్రత్యేకపరిశ్రమ చేసినవ్యక్తులచే రచింపబడిన విజయనగరాంధ్రవాఙ్మయచరిత్రవంటి గ్రంథములే తప్ప సమగ్రాంధ్రవాఙ్మయచరిత్ర నేటిదాక వెలయనే లేదు. అనేకత్వంలో ఏకత్వం దర్శించడంగానే వుంది నేటికీ మన భాషాజిజ్ఞాసువుల స్థితి!

ఇటువంటిస్థితిలో ఒక్క దక్షిణదేశవాఙ్మయానికి సంబంధించినంతవరకైనా ఒక సమగ్రమయినగ్రంథం మదరాసు విశ్వవిద్యాలయం వారు ప్రకటించడం ఒక శుభసూచన. తెలుగుదేశానికి దక్షిణాన వున్న మధుర, తంజావూరు, మైసూరు, పుదుక్కోట మొదలయిన ప్రదేశాలలో వెలసినగ్రంథజాలం అంతా ముద్రితం కాక వాఙ్మయచరిత్రకారులకు అందుబాటులో లేకపోవడంచేతనైతేనేమి, ఆయా ప్రదేశాలు పరిశోధకులకు చాలా దూరంలో ఉండడంచేతనైతేనేమి దక్షిణదేశాంధ్రవాఙ్మయాన్ని గురించి మొన్నమొన్నటి దాకా వ్యాసరూపంలోనూ, పీఠికారూపంలోనూ తప్ప సమగ్ర చరిత్రగ్రంథం వ్రాయడానికి వీలులేకపోయింది. దానికి కారణం వారికి ప్రామాణికసాధన సంపత్తి లభ్యం కాకపోవడమే. దక్షిణదేశాంధ్రసాహిత్యాన్ని గూర్చి తొలిసారిగా తెలుగువారికి యెఱుక పఱిచినవారు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. వారు తంజావూరు ఆంధ్రనాయకరాజులచరిత్రకు తొడిమ వ్రాస్తూ తొలిసారిగా తంజావూరులోని అనేకగ్రంథాలను గూర్చి, కవులను గూర్చి తెలిపారు. అక్కడి కవీశ్వరుల గ్రంథాలనుకూడా కొన్నిటిని వారు అచ్చువేయించి పీఠికలు వ్రాశారు. ఆ తరువాత శ్రీ కొరుగంటి సీతారామభట్టాచార్యులుగారు కూడా తంజావూరుకు సంబంధించినంతవరకు తంజాపురాంధ్రనాయకరాజ చరిత్రము, తంజావూరు కవులు-పండితులు అనే రెండు గ్రంథాలను రచించారు. అక్కిరాజు ఉమాకాంతంగారు, జయంతి రామయ్యపంతులు గారు, గల్లా సత్యనారాయణగారు, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు మొదలయినవారుకూడా దక్షిణదేశవాఙ్మయాన్ని గూర్చి ప్రత్యేకపరిశ్రమ చేసినారు. ఇటీవల తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీ వారిచే తంజావూరు వాఙ్మయానికి సంబంధించిన కొన్ని ప్రాచీనగ్రంథములు ముద్రింపబడినవి. ఈ విధంగా యీ వాఙ్మయ శాఖకు సంబంధించిన వివిధరంగాలలో జరిగిన పరిశ్రమ కారణంగా దాని కిటీవలే ఒక సమగ్ర స్వరూపం కలిగే అవకాశం యేర్పడ్డది.

ఇటీవల మదరాసు విశ్వవిద్యాలయఆంధ్ర శాఖాధ్యక్షులు శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు రచించిన 'దక్షిణ దేశీయాంధ్రవాఙ్మయము' అన్న బృహద్గ్రంథం పయిశాఖకు సంబంధించినంతవరకు ఒక సమగ్రమయిన ప్రామాణికమయినగ్రంథమని చెప్పడానికి ఎలాంటి సందేహమూ వుండ నవసరం లేదు.

ఇందులో శ్రీ వెంకటరావుగారు తంజావూరు, మధుర, పుదుక్కోట, మైసూరు మొదలయినప్రదేశాలలో వెలసిన వాఙ్మయాన్ని గూర్చి మాత్రమే కాక తుఱైయూరు, వెంగనూరు, తలమల, ఎట్టియాపురము మొదలయిన స్థలాలలో వెలసినవాఙ్మయమునుగూర్చి కూడా తెలిపి వుండడం ఒక విశేషం. దక్షిణ దేశంలో ఆనాడు సంగీతసాహిత్యాలు రెండూ

ప్రమాణంగా పరిగ్ణింపబడినవి. సమానంగా రాజాదరణ పొందినవి. ఆకాలంలో వర్ధిల్లిన పదకవుల చరిత్రం కూడా యిందులో చేర్చబడ్డది. ఒక్కొక్క కవిని గూర్చి, గ్రంథాన్ని గూర్చి తెలపడం మాత్రమే కాక ఆయా గ్రంథాలకు సంబంధించిన కథాకవితావిమర్శ కూడా వీరు చేసి వున్నారు. ఇది భాషావిద్యార్థులకు మిక్కిలి ఉపయోగకరం అనడంలో యెట్టి సందేహమూ లేదు. వీరి విషయ ప్రామాణికతకు-ఆయా విషయాలకు సంబంధించి యితరులు వ్రాసిన వ్యాసములను, గ్రంథములను, గ్రంథపీఠికలను పేర్కొనడం ఒక గొప్ప దృష్టాంతం. గ్రంథాంతంలో వీరిచ్చిన వ్యాస, వ్యాసరచయితల సూచికలు (Bibliography) ఈ వాఙ్మయాన్ని గూర్చి సవివరంగా తెలుసుకొనగోరే విద్యార్థులకు మిక్కిలి సహాయకారిగా వుండగలదు. ఒక విషయాన్ని గురించి యెవరెవరు ఎప్పుడెప్పుడు తేయే వ్యాసములను రచించినారో యీ పట్టికలను బట్టి తెలుసుకొనుటకు వీలుగానున్నది. ఇది భావిపరిశోధకులకు చాలా అవసరం.

ఈ గ్రంథం 'దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయం' గూర్చి రచింపబడడంచేత ఆ కాలంలో అలాంటి వాఙ్మయరచనకు కారణభూతము లయిన చారిత్రకసాంఘికపరిస్థితులెట్టివో వాఙ్మయపరిణామప్రక్రియాసహితంగా శ్రీ వెంకటరావుగారు వివరించి వుండవలసింది. అప్పుడు గాని వాఙ్మయవిద్యార్థులకు తద్వాఙ్మయస్వరూపం సుబోధం కాదు. ఇది కాక తారాశశాంకవిజయం మొదలయిన ప్రసిద్ధ గ్రంథాలకు కథాసంగ్రహం మొదలయిన వివరాలు, కవిత్వశైలి కుదాహరణములుగా యిచ్చిన పద్యాలు మొదలయిన కొన్ని అనవసరవిషయాలచేత గ్రంథం చాలా పెరిగింది. వాటిలో కొన్నిటిని పరిహరించి, కొన్నిటిని తగ్గించి వున్నా గ్రంథయోగ్యతకు యెట్టి లోపమూ రాదు. పైగా మరింత గుణవత్తరంగా వుండి వుండేది. శ్రీ వెంకటరావుగారు కొన్నిచోట్ల కారణాలు తెలుపకనే కొన్ని నిశ్చయాలు చేశారు. వారు అలా చేయక ఆయా విషయాలనుగూర్చి తమ అభిప్రాయమేమిటో తెలిపి వుంటే బాగుండేది ఉదాహరణకు శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి గారిచే సంపాదింపబడిన చాటుపద్యరత్నాకరములో, 'రమ్మనెరా తనదే నేర మ్మనెరా' మొదలయిన యేడు పద్యాలు వెంకటకృష్ణప్ప నాయకరచితములుగా పేర్కొనడం. సముఖం వెంకట కృష్ణప్పనాయకుడు విజయరంగ చొక్కనాథుని కాలములో నుండినంత మాత్రాన - అతని మీద తత్సంబంధులుగా రచింపబడినచాటుపద్యాలను అతడే రచించిన వనడం సాహస మేమో! ఆయిపద్యాలు వెంకటకృష్ణప్ప నాయకుడి వయియుండ వచ్చునని తమ యభిప్రాయముగా శ్రీ వెంకటరావుగారు తెలిపి వుంటే మరింత ప్రామాణికంగా వుండి వుండేది. పరమప్రామాణికంగా వుండవలసిన యీ గ్రంథంలో చాలా అచ్చుపొరబాట్లు ఉండడం శోచనీయం.

పయిని చూపినలోపాలవంటి చిన్నలోపాలు కొన్ని వున్నప్పటికీ శ్రీ వెంకటరావుగారు రచించిన 528 పుటలు గల యీ గ్రంథం దక్షిణాంధ్రసాహిత్యాన్ని గూర్చి తెలిపే సమగ్ర మయినగ్రంథం అని చెప్పడానికి యెటువంటి వెనుదీయరు. ప్రామాణికాధారాలతో వారిటీవల చేసినపరిశ్రమసర్వస్వమే యీ గ్రంథంగా రూపొందింది. దక్షిణాంధ్ర వాఙ్మయసర్వస్వంగా ఈ గ్రంథం భావి పరిశోధకులకు, పండితులకూ ఉపకరిస్తుం దని-వారికి ఆవాఙ్మయశాఖకు సంబంధించి నంత వరకూ మార్గదర్శి కాగలుగుతుం దని చెప్పడం అతిశయోక్తి కాదు. ఇందులోని లోపాలను గూర్చి యిటీవల బయలుదేరిన ఆక్షేపణలకు 'నడచుచు నుండువాని చరణంబులకే గద రాళ్ల తాకుడుల్' అని మా సమాధానం.

గ్రంథం పుటలు : 528. కాయలు సైజు. మూల్యం: పదిహేనురూపాయలు. ప్రాప్తిస్థానం. మద్రాసు విశ్వవిద్యాలయం, చేపాక్, మద్రాసు.

—:o:—

# అలంకార విచారము

శ్రీ కుంటిమద్ది శేషశర్మగారు

(గతసంచిక తరువాయి)

-:o:-

ప్రియుని ప్రక్కలోన
  శయనించియును గూడ
కోరికలను దీర్చి
  కొనుట కింత
చొరవ లేక దయిత
  యరమూతకనులతో
కాంతు మోముదమ్మిఁ
  గాంచు చుండె.

ఇది నవోఢానురక్త నాయికాశృంగార వర్ణనము.

బంధుజనము దరిదాపుల లేని ప్రత్యేక శయనగృహమునందు ఏకశయ్యపై ముగ్ధ నాయిక, ప్రేమార్ద్రహృదయు డగుభర్తతో పాటు పవళించి యున్నది. వాకొని, పైకొని, కోరికలఁ దీర్చికొను చొరవ లేదు. తేరిపారఁ జూడను గూడ వీ లీక కనుమూయుచున్న లజ్జను కాంక్షోత్కర్షముచేతొలఁగఁద్రోయుచు, తెరచీ తెరవని కనుదోయితో ప్రియుని వదనారవిందమును గాంచుచున్న దీ కాంత.

ఇందు నాయికాగతముగ వ్యజ్యమాన మగు రతి స్థాయిభావము, నాయకాలంబనమై ప్రక్కన పవళించుటచే తెలియనగు నేకాంత ప్రదేశముచేత నుద్దీపితమై, అట్టి చూపులచే ననుభావితమై, సిగ్గు ఔత్సుక్యము లను సంచారిభావములచే సమ్మిశ్రితమై శృంగార రసరూపమున చర్వణావిషయ మగుచున్నది.

ఇందు, "నాయకుడు చెక్కునఁ జెక్కు చేర్చనేని, బిగి గౌగలించి గాటముగ ముద్దిడుకొందును." అను ప్రియురాలి కోరికయే వ్యంగ్యము అనరాదు. "కోరికలను దీర్చి కొనుట కింత చొరవ లేక-" అనుటచేత, "పలుకోరికలు ఈమె హృదయమున నుబుకుచున్నవి." అను అర్థము వాచ్య మగుచున్నది. ముద్దాడ గోరుటయు నందులోని దొకటియే. సామాన్యరూపముగ వాచ్యమైనకోరిక నే, "ముద్దాడ గోర్కె" అని, విశేషరూపమున వ్యంగ్య మనుట యంత రమణీయము గాదు. వాచ్యసంపర్కము లేనివ్యంగ్యమే చమత్కారకారణ మనుట యాలంకారికసిద్ధాంతము. ఆ చుంబనేచ్ఛ గూడ రత్యంగ మయినప్పుడే గాని యానందజనకము గాదు. కనుక రతియే ప్రధానవ్యంగ్య మనవలయును.

అటులనే, "అరమూత కనులతో" అన్నందున వ్యక్త మగుసిగ్గు ప్రధానము గాదు. కనుమూతవడుట లజ్జాజనితమేయైనను, కాంచుట లజ్జవల్ల గాదు. నానబలిమిచేత పూర్తిగ వాలిపోవుచున్న రెప్పల నాపి కాంతు మోము నోరచూపులఁ గాంచుట రతిమాత్ర కార్యము. వచ్యార్థమున రతి కార్య మగు కనుగొనుట యందు లజ్జా కార్యమగు కనుమూతవడుట అప్రధానమైనట్లు, వ్యంగ్యార్థమున రతికి లజ్జ గుణీభూత మనుట సమంజసము.

మఱొకటి : —

తమ్మిమొకుళముతో నేను తన్న వేయ,
  నళినలోచన పెద్దల నడుమనుండి,
నాల్క చివరను గఱచి, కుండలము లదర,
  బొమలు ముడివడఁ గెంపుచూపులు
    నిగిడ్చె.

పరువపుమత్తున కన్న గానని వలపుకాఁడు తాఁ జేసిన చెయిదములను నెచ్చెలికి తెలియఁ జేయుచున్నాడు.

ప్రియురాలు ఇంటినడుమ అత్త ఆడుబిడ్డ తోడికోడలు తక్కుంగల స్త్రీజనము మధ్య కూర్చొని యున్నది. ఎంత సేపటికిని లేచి వచ్చునట్లులేదు. పడకటింట ప్రియుని కొంటరిపాటు దుస్సహ మగుచున్నది. అందుచే నతడు పెద్దలకు కానరాకుండ తామరమొగ్గతో ప్రియను వేసినాడు. అత్త యేమనుకొనునో, ఆడబిడ్డలు వదిన మరదండ్లు పరిహసింతురో అని వారి సంభావనలఁ బ్రొద్దుపుచ్చుచున్న కాంతను, "లేచి రమ్మని" తడవోర్వలేని ప్రియుడు సైగ చేసినాడు. "ఔరా! యెంత

పని చేసితివి? పెద్దల నడుమ నున్నప్పుడా చిలిపి చేష్టలు? పెద్దలు వీరెంత సిగ్గు లేని వారు అని తలంపరా?'' అని మందలించు చూపు లోని కెంపు దనముచేత నాయికాగత మగు నమర్షము. నాయకాలంబన మై, పెద్దల సామీప్యముచే నుద్దీపితమై, వాల్కకొనను గొరుకుట బొమముడి పాటులచే ననుభావిత మై ప్రధానముగ చర్వణావిషయ మగుచున్నది.

వేఱొకటి :—

నేత్రపక్ష్మలపై క్షణమాత్ర ముండి,
మోవి నొక్కి, పయోధరాభోగపాత
శకలతను బొంది, వళులలో స్ఖలన మొంది
చేరె తన్నాభి తొలివానచినుకు లంత.

ఇందు, తప మొనరించుపార్వతియొక్క దేహముపై బడిన తొలివాన చినుకుల క్రియా స్వభావరూప మగువాచ్యార్థముతో తప స్సమాధికిఁ దగిన పార్వత్యవస్థానసన్నివేశము సూచిత మగుచు, చాల కాలము గ్రీష్మతప తప్తదేహము పైబడి సుఖపారవశ్యసంభ్రమ మును గూర్పఁజాలిన తొలివాన చినుకులవలనఁ గూడ చెక్కువోని యామె తపస్సమాధి ధ్వనితమగుచున్నది.

సమాధివంతుల యవస్థాన మిట్లుండవలయు నట.

ముందునకు రొమ్ము విరిచియు, ముక్కుకొనను
చూపులను మోపి సంవృతాస్యత్వ మొంది
అచలుఁ డగుచును తన హృదయాంతరమున
ధ్యాన మొనరింప వలయు దేవాధిదేవు.

పై పద్యమున తొలివాన చినుకులు, ''నేత్ర పక్ష్మలపై క్షణమాత్ర ముండి,'' అనుటచేత, ముక్కుకొనమీద చూపును నిలుపు అరమూత కనులు గల్గియుండుట వ్యక్త మగును. పూర్తి తెఱచిన, రెప్పవెంట్రుకలు ఊర్ధ్వాగ్రము లగుట చేతను, బొత్తిగా మూసినచో, అధోగ్రము లగుట వల్లను పక్ష్మములపై జలబిందువుల స్థితి పొసగదు. అచటనుండి జారినవి నోటఁ బ్రవేశింపక మోవిపైఁ బడి క్రిందికి రాలె ననుట చేత సంవృతాస్యత సిద్ధించుచున్నది. అట నుండి రాలిన వానికి స్తనపాతాది వర్ణనతో రొమ్ము ముందుకు విరిచి కూర్చున్నట్లు తెలియుచున్నది. సోమరివలె వీపువంచి కూర్చున్న కుచములు లోనికి సంకుచించు కున్నందున, కుచాభోగముపై బిందుపతనావకాశము లభింపదు. ఒక వేళ లభించినను వళులఁ జేరినయవి యడ్డముగఁ దిరుగునే గాని, పొక్కిలి డాయలేవు. డాసినను అవి మూసికొని యుంటచేత వాని కందు ప్రవేశము సాధ్యము గాని పని. పక్ష్మములనుండి క్రమముగ నధరాదు లందు పాతము వర్ణించుటచేత నిశ్చలత్వ మవగత మగుచున్నది. ముఖాదులు చలించిన బిందువు లకు క్రమగతి సిద్ధింపదు. మనస్సు బాహ్య విషయాసక్త మైనసుఖపారవశ్యముచేత దేహ చలనము సంభావితము. అందుచే మనః కాయ ముల రెంటను నిశ్చాంచల్యము ద్యోతితము.

ఇంతేగాక, యీ విశేషణములతోడనే దేవి యొక్క అతిలోకసౌందర్యము వ్యక్త మగు చున్నది. అదెట్లన నేత్రపక్ష్మలపై తొలివాన చినుకులు ''ఉండి'' అనుటతో, ''పక్ష్మములు దట్టములని'', ''క్షణ'' మనుటతో అవి స్నిగ్ధము లని, పక్ష్మములనుండి జారి శిథిల వేగము లగుబిందువులతో ''మోవినొక్కుడు వడె'' ననుటచే, ''అధర మతిసుకుమార''మని ''అవి పయోధరాభోగపాత శకలతను బొందె'' ననుటతో, ''కుచము అతికఠినము'' లని, రొమ్ము విరిచి కూర్చున్నను వళులయందు ''స్ఖలితము'' లనుటచే, ''వళులు విస్పష్టము''లని ''చినుకు లన్నియు నాభి చేరె'' ననుటచేత, నాభి యతిగభీరమని, వ్యక్తమగు చున్నది.

రతి, అమర్ష మను భావము, సమాధ్యవస్థా సౌందర్యములను వస్తువులు పై పద్యము మూడింట క్రమముగ వ్యంజనావ్యాపారగమ్య ములై, శబ్దార్థములకన్న ప్రధానము లై హృద యానందజనకము లైనందున నివి యుత్తమోత్త మకావ్యములు.

ఇది పరికించుడు :—

స్తన తటలిప్త చందనము
సర్వము, వాతెర కెంపు, కజ్జలం
బును నయనాంత సంగతము
పోయెను బో; పులకించె నంగముఁ
వనిత! యసత్యవాదినివి
వాపికిఁ బోతివి కాన మాడ, వా
నిని బిలువంగఁ బోయితివి
నీచు? సఖీమద నార్తిఁ గంటివే?

ఒక గుబ్బెత కాంతునికై యెదురు చూచి చూచి, విసిగి వేసరి, తడ వోర్వలేక, విరహ వేదనకు నంగము తెరియు, నార్తిఁ గుందుచు

పిల్లతెమ్మెరకల దుందుడుకులకుఁ బొదరింటి వల్లరులనుండి జల్లున రాలు పువువింటివాని యలుగులకు నుల్లము తల్లడిల్లఁ గాంతుని తోడి తేర దూతికను పుచ్చినది. దూతియు చతుర. నాయిక పజ్జకు అడపదడప నరుదెంచు కాంతుని యంద చందముల కబ్బురపడి, కవయ నుంకించి, అనువు గాక కూటమి కువ్విళ్ళూరుచుండినది. నాయకుడును, "వసుధలో పూర్వ సువిదితా ప్వాదు డెవడు విశృతజఘనను కాముకిన్ విడువఁ జాలు" అన్న తెగకు చేరినవాడు. పిలువఁబోయిన దూతిక "దొరకు నవకాశమును కడద్రోయఁ జనదు" అని తెస్సగ నుపయోగించుకొని వచ్చినది. కల్లబొల్లిమాటలతో నాయికను మోసగింప నెంచి, "నేను నీప్రియునికై పోయి పలుతావుల వెదకితిని. ఎందు నే నాతిని గూడి కంతుకేళిఁ దేలుచున్నాడో కనుపించలేదు" అని పలికినది.

కాని దూతిక అంగమచ్చము పరికించి వృత్త వృత్తాంతమును పసిపట్టిన నాయిక యాడిన ములుకులను బోలినపలుకు లివి.

"నీవు స్నానమాడ వాపికిఁ బోతివి గాని, వానిని పిలువఁబోలేదు. వానికై పోతి నని యూరక కల్ల లాడుచున్నావు." అని వాచ్యార్థము.

"నీవు వానికడకుఁ బోయియిచ్చటికి పిలుచుకొని రాక వానితోడఁ గవగూడి వచ్చితివి" అని పై పద్యమునందలి, "నీచ" పదముచేత ప్రధానముగ ధ్వనించుచున్నది. అంగుకు, "స్తనతటలిప్తచందనము సర్వము -- " ఇత్యాదివాక్యములు తోడ్పడుచున్నవి.

కాని,

"ఇచ్చట కాంతు నుద్దేశించి నాయిక "వానినిఁ బిలువంగఁ బోయితివె నీమణీ!" అని ప్రశ్నించుచున్నది. తన కాంతునికి తానన్న నీచత జాతిచేఁ గాని పనిచేతఁగాని యేర్పడవలయును. నీచజాతిపురుషుని నుత్తమనాయిక కోరునా? కోరినచో దానిని గణించునా? కాన నామె యన్న నీచత అతనికి జాతిచేఁ గాక, అత డొనర్చిన మనోవేదనాకరమైన పని చేతనే యేర్పడవలయును. అదియును దూతి పంపుటకు పూర్వము కావించిన దేని వాకొనఁదగినది గాదు. దాని నోర్చియేగద దూతిఁ బంపుటకే తెన్న దూతి పంపుటయే పొసగదు. కనుక తా నంపినదూతితో సంగమించుటయే దూతీ స్వరూప లక్షణాదులతో తెలిసికోబడి, నీచ కర్మగా తేలుచు "నీచ" పదముచే వ్యక్తమగుచున్నది. "స్తన తట లిప్త చందనము సర్వము పోయెను." మొదలగు వాచ్యార్థములు సంగమలక్షణములను వెల్లడించుచు వ్యంగ్య వ్యంజనయందు తోడ్పడుచున్నవి. ఎట్లన, "స్తన తట లిప్త చందనము సర్వము పోయెను." అన్నప్పుడు, "పయ్యెద రాపిడితో గందపుపూత కొంత పోయి యుండిన నుండవచ్చును. కాని సర్వముపోవుట వాపీస్నానమువల్లనే" అన్న వాచ్యార్థ సమర్థనకు "సర్వము" అన్న విశేషణము. ఇది అనంతర వాక్యములకును అన్వయించును. విడెము వేసికొని చాలసేపై నందున మాసినదిగా దీ వాతెర కెంపు. అటులేని కొద్దిగ తొలగియుండెడిది. సర్వము తొలగుట స్నానమువల్లనే. ప్రొద్దున పెట్టిన కాటుక కొంచెము పోయిన పోవచ్చును. సర్వలోపము స్నానకృతమే. కనుక నీవు వానిని పిలువను గాక వాపీస్నానమునకే పోయితివి. అని వాచ్యార్థ మవగతమగుచుండ, నీవు వాపికి పోలేదు. వానికడకే పోయి వానితో రమించి వచ్చితివి. నీ స్తనతటము చ్యుతచందనము. స్నానమువల్లనేని కుచాభోగమం దంతటను గంధము తొలగెడిది. అటు గాక నీకు తటము నందే—పైభాగమునందే. అది పురుషాలింగనోపమర్దనములవల్లనే. అటులనే స్నానమువల్లనేని వాతెరల రెండింటి రాగము తొలగెడిది. నీకు ఒక్క "వాతెర కెంపు" తొలగినది. పై పెదవి సరాగ మై యుండ క్రిందిమోవి కెంపు మాయుట చుంబన జనితమే. స్నానమువలనైన కన్నుల కంతట కాటుక పోయెడిది నయనాంతముల నుండే తొలగుట చుంబనకృతమే. కనుక నిర్వివాదము అని వాచ్యార్థవశమునందు వాపీస్నానపరకు లయ్యు వ్యంగ్యార్థమును ప్రతిపాదింపఁజాలిన పై వాక్యముల తోడ్పాటుతో, "నీచ" పదము, "నీవు స్నానానికై బావికిఁ బోతివి" అను వాచ్యార్థమునకన్న రమ్యమైన "అతనిఁ గవయనే పోయితివి." అను అర్థము ప్రధానముగ వ్యక్తమగుచున్నది. కాన నిది ఉత్తమోత్తము కావ్యము."

అని సమన్వయించుఁ గూడ [illegible] మార్గ విచారపద్ధతి గాదు. పైగ నందును

విరుద్ధము. గమనించుడు.

పై సమన్వయము మేరకు, "స్తనతటము, ఒక్కటైన వాతెర, నయనముల అంతములు," అను పదములు వాచ్యార్థ వాపీస్నానమునందు అనన్వితము లగుచున్నవి. అందుచే వాచ్యార్థము బాధిత మై విరోధలక్షణచేత వాపీస్నానమునకు పోలేదు. అ నీచుని చెంతకే పోయితివి అని అర్థ మగుచున్నది.

"ఎంత నిండిన దన్న! యీ యూరికో నేరు
పొర్లాడుచూ జనులు మునిగి తేలేరు."

అన్నప్పుడు, నిండిన సరోవరములో పొర్లాడుచూ స్నానమాడుట బాధితము. కాన నిండిన దనుటకు నిండలేదని విరుద్ధార్థము వచ్చుచున్నది. అది వాచ్యార్థబాధవల్ల తెలిసిన లక్ష్యార్థమే గాని వ్యంజనావ్యక్తము గాదు.

కనుక, "స్తన తట లిప్త చందనము" మొదలగు వాక్యములలోని, "స్తనతటాది పదములకు స్నానవ్యావృత్తిద్వారా సంభోగమాత్ర మందే అన్వయప్రతిపాదనము. "సంభోగమున కాతనికడకే పోయితివి" అనుటను వ్యంజనావ్యాపారముచే సాధించుటకు ప్రతిబంధకము. ప్రాచీనగ్రంథవిరుద్ధమును.

కావ్యప్రకాశమున:—

గోదావరీతీరకుంజాంతరాసన్న
మదమత్తపంచాస్యమారితమ్మై భిషక
మీదినమె ధార్మికా! యికమీద నిచ్చోట
విస్రబ్ధచిత్తు డై విహరింపుమా నీవు

గోదావరీతీరములోని పొదరింటిని సంకేతస్థానముగ జేస్కొనుచున్న మిటుకులాడి, ఆ పొదరింటి పూలకై ఆ పట్టులలో సంచరించెడి ధార్మికుని చూచి, తనివల్ల తన యథేచ్ఛా విహారమున కంతరాయము గల్గునని, తన నికుంజము కుసుమశూన్యమై వెలవెలవోవునని, అతని సంచారమును వారించు తలపుతో నాతనిని హెచ్చరించుచున్నది.

"ధార్మికా! ఇక భయము వీడి స్వేచ్ఛగ తిరుగుము. నిన్ను బెదరించుచుండిన ఆ పిచ్చి కుక్క గోదావరీతీర పరిసరములలో నుండిన పోతరించిన పంచాస్యము,—అబ్బ! ఆ నోరు చూచిన ఒడలు గడగడవడకును. ఎంత పెద్దగున్నది అదీ దాని నోరూ,—ఇప్పుడే చంపి వేసినది." అని వాచ్యార్థము, తెలియుచుండ, "ఓ ధార్మికుడా! సహజభీరువవూ!! కుక్కకే భయపడువాడా!!! ఇక నిచ్చట తిరుగకుము. ఇంతకుమునుపే ఒక సింహము కుక్కను చంపి వేసినది. అది యీ పరిసరాలనే మనికిపట్టుగా నొనర్చుకొన్నట్లున్నది. ఎప్పుడు మీదికి దూకునో చెప్పజాలము. మరెచ్చటను పూలు దొరకవా? ఈ యపాయస్థలమే యేల? ఉసురుడిగినమీద పూలేల? పూజ యేల? పొమ్ము. త్వరగ నీచోటు వదలిపొమ్ము." అను భావము వ్యంజనావ్యాపారవేద్య మగుచున్నది.

ఇచ్చట "భీరుసంచార మేది కలదో అదంతయు భయకారణ నివృత్తిజ్ఞాన పూర్వకము. గోదావరీతీరము సింహ ముండుటచేత భీరుసంచారానర్హము." అని హేతుజన్య సాధ్యజ్ఞాన రూపకమైన, అనుమానప్రమాణమువల్లనే భీరుసంచార నిషేధము తెలియుచుండ, దీని సాధింప వేఱువ్యంజనావ్యాపార మేల?" అను మహిమభట్టుమతమును నిరాకరించు మమ్మటభట్టు,—

"భీరు వైనంతమాత్రమున భయకారణమున్నచోట తిరుగరాదు అను నియమము లేదు. గురువు నానతిచే గాని ప్రభు శాసనమువల్ల గాని, ప్రియానురాగముచేత గాని యందు తిరుగవచ్చును. కాన పై హేతువు నియతమైనదిగాదు. పైగా తాకు నని కుక్కకు భయపడినను, పిచ్చికుక్కకు బెదరినను, వీరుడేని సింగమునకు జడియకుండవచ్చును. అట్లేని సింహముండుట సంచారమునకు ఆటంకము గాక అనుకూలము కావచ్చును. అంతే గాక సింహస్థితి ప్రత్యక్షానుమానములవల్ల నిశ్చితము గాదు. ఇతరుల మాటవల్ల తేలినది. ఆ వ్యక్తి అప్తుడని తేలువరకు తద్వాక్యము ప్రమాణము గాదు. కాబట్టి అనాప్తోక్తమై అనియత మైనహేతువుతో నా వ్యంగ్యార్థము ఎట్లు సాధ్యము?"

అని నిరాకరించుచు,

"స్తనతటలిప్తచందనము ఇత్యాది వాక్యార్థాలు ఇతర హేతువల్లను గలుగవచ్చును. కనుకనే రతికార్యము లనియే గాక స్నానకార్యము లనియు చెప్పబడినవి. కనుక పైవాక్యాలు వాచ్యవ్యంగ్య సాధారణములే గాని, వ్యంగ్య మాత్రాన్వితములు గావు."

అని సిద్ధాంత మొనర్చెను.

కనుక పూర్వగ్రంథ విరోధమువల్ల, అతి

విదగ్ధనాయికోక్త విశేషణాలను వాచ్యార్థ సాధారణము లనవలయును గాని పూర్వము సమన్వయించినట్లు వ్యంగ్యార్థ మాత్రమునందే అన్వితములనుట అనుచితము లేకున్న వ్యజ్యమాన మగు దూతీ సంభోగ రూప మగునర్థము, "తట, వాతెర, అంత" రూపవాచ్యార్థము నకు ఉపపత్తి సాధక మై గుణీభూత మగును. కనుక నా కావ్యము ఉత్తమోత్తమ మన నొప్పదు. కాన,—

"ఓసీ! స్నేహితురాలి మదనవేదన నెఱుగ లేనిదానా! స్వార్థపరురాలా! ప్రియుని తోడితేర నేను పంపినను స్నానమునకు ప్రొద్దు పోవు నని వాని కడకు పోయితివి. అంతే గాని ప్రియాసంతాపమును గ్రహింపలేక వెతలఁ బెట్టు నానీచునికడకు నీవు పోలేదు. అదిగో చూడు:—బావిగట్టున సన్న కోడెగాండ్రను మాచి, సిగ్గుపడి, భుజములపై మెలివేసిన చేతు లుంచి, నీట మునుగుటచే, ముంజేతుల రాపిడి వలన ఉన్నత కుచాగ్రమందలి చందనము మాత్రమే తొలగినది. మిగత భాగమందు అంతను అటులనే నిలిచిపోయినది. ప్రొద్దు పోవు నని లెస్సగ తోమనందున, పలుదోము ప్రేలి తాకిడిచే ఒక్క క్రింది మోవి రాగమే వీడినది. పై పెదవి కెంపు అటులనే నిలిచినది. బాగుగ తుడుచుకొన కున్నందున చెంపలకు చల్లుకొన్న నీటిచేత నయనాంతముల యందే కాటుక మాసినది. మిగత అటులనే నిలిచినది. నీకు స్నాన మెక్కుడయ్యెగాన, సఖీవేదన గణింపక, త్వరగ రావలయు నని నదికిని బోక వాపికడకే పోయి, వాని కడకు పోయితి నని బొంకుచున్నావు."

అని వాచ్యసాధారణముగ సమన్వయించుట యుక్తము. వాక్యార్థములు వాచ్య సాధారణము లైనందున ముఖ్యార్థ బాధ లేదు. లక్షణ కవకాశము లేదు.

అటుమీద సమయవ్యక్తి సన్నివేశములఁబట్టి "పూర్వము చెప్పినప్రకారము రాక సంతాపకరు డగుటచే నీచతను తెల్పు, 'నీచ' పదము, వ్యంజనావ్యాపారముచేత దూతీసంభోగ నిమిత్తముగ దుఃఖదాయకు డగుటచే నీచతను తెల్పుచున్నది" అనుట అలంకారిక సిద్ధాంతము.

"అప్రధానంబె యయిన వ్యంగ్యార్థ మెందు
కాంత మగు నందు రెండవ కావ్య మదియ"

ఏకావ్యము నందు వ్యంగ్యార్థము అప్రధానముగానే యుండి రమణీయమో అది ఉత్తమ కావ్యము.

"ప్రియుని ప్రక్కలోన—" అను పద్యమున, "అరమూత కనులతో" అనుటవల్ల వ్యజ్యమాన మగు లజ్జ అప్రధానము, రమణీయమును. దాని వల్ల నా కావ్యము ద్వితీయకావ్య మనరాదు. "అప్రధానంబె" అను అవధారణ చేత, "ఏ కావ్యమందలి వ్యంగ్యము అప్రధానమే అయ్యుండునో" అని తెలియుచున్నది. ప్రధాన మగురతిరూప వ్యంగ్యము వల్ల నా కావ్యము ఉత్తమోత్తమమే యగును.

లీన వ్యంగ్యకి వాచ్యము గల చిత్రకావ్యముల యందు అతివ్యాప్తి లేకుండుటకు లక్షణమున కాంత మను విశేషణము. అందు వ్యంగ్యార్థము నకు రమ్యత లేదు.

ఎట్లన వసుచరిత్రము నందు:—

విశ్వామిత్రునిఁ గొల్చి రాము డతడు
ర్విం జెందెఁ గల్యాణముల్
విశ్వామిత్రులు గొల్వ రాము డితఁ
డుర్విన్ జెందెఁ గల్యాణముల్
శశ్వత్కీర్తులు రాము లయ్యిరువురున్,
సాధించు కల్యాణలా
భైశ్వర్యంబులు ధర్మనిర్మథన
ధర్మాలంబనవ్యక్తముల్.

అనుచో శ్రీ రామచంద్రునకన్న రామప్రభువు గుణవంతు డనువ్యంగము వాచ్యార్థమునకన్న రమణీయము గాదు. కాన నిది యుత్తమశ్రేణికిఁ జెందినది గాదు.

ఉదాహరణము:—

శిశిరమున రాము విరహాగ్ని శిఖలఁ గ్రాగు
సహ్యగిరిశృంగముల సుఖశయను అయిన
కపులు, రావణు లంకను గాల్చి వచ్చి
యున్న హనుమంతుఁ గోపింతు రుగ్రు లగుచు.

సీత యెచ్చట నుండునదీ, అసలు జీవించినదీ లేనిదీ తెలియక రామచంద్రుడు తద్వియోగ వ్యథా దందహ్యమాను డగుచున్నాడు. అతని తాప మింతని చెప్పఁ దరము గాదు. "ఆ తాపమునకు పర్వతాధిత్యకలు వేడెక్కినవి." అనిన కొంతకు కొంత అతని తాపమూహింపవచ్చును. అది శిశిరఋతువు. గడగడ వడకించు చలిగాడ్పు

లకు మేనుకొంకరలు వోవును. అట్టి తరి కపులకు శ్రీరామ విరహాగ్నితప్త సహ్యగిరి శృంగములు హాయి గొల్పుచున్నవి.

హనుమంతుడు లంకనుండివచ్చి జానకీ కుశలవార్త తెల్పగనే రామునికి నెమ్మది యేర్పడినది. తాపము కొంతకు కొంత శాంతించినది. సహ్యగిరి శృంగములు చల్లబడినవి. కపులకు శీతబాధ యినుమడించినది. దీనికి నిదానము హనుమంతుడు. అందుకు కపుల కతని మీద అలుక.

"సీతను వెదుకఁబోయిన హనుమంతుడు విజయవంతముగ లంకనుండి చనుదెంచి జానకీ కుశలవృత్తాంతము నెఱిగించుటచేత శ్రీరాముడు చల్లబడెను" అను వ్యంగ్యము హనుమంతుని పై కపుల యకారణకోపము నుపపాదించుచు వాచ్యసిద్ధ్యంగ మైననూ దుర్విధివల్ల దాస్య మనుభవించు రామాలివలె కొండొక సొంపు నింపుచున్నది.

మరొకటి :—

జాషువాగారి శల్యసారథ్యమున :—

ఖాండవమునర్జునుడు కొల్చు కాలమందు
పరువులెత్తిన ముసలిసర్పమును వింటఁ
దొడిగి నాఁడవు భళిభళీ! విడువ వలవ
దబ్జనాభుఁడు గరుడవాహనుఁడునుమ్ము

ఇచట అబ్జనాభుడు గరుడ వాహను డనుట చేత, "అహి భయంకరుడై పాతాళమును గగ్గోలొనర్చిన గరుత్మంతుడు కృష్ణునికి వశంవదుడు. అతని ముందు ఎట్టి మదోన్మత్త కాలభుజంగ మేని చచ్చినట్టు పడియుండును. అట్టిగరుడ వాహను డర్జునుని సారథి. అరథికుని నీ ముసలిసర్ప మేమి చేయఁగలదు. నీ పూనిక వృథాప్రయాసము." అను వంగ్యార్థము, 'విడువవలవదు.' అను వాచ్యార్థోపపాదకమై గుణీభూత మగుచున్నది.

మరొకటి విజయవిలాసమున :—

తెమ్ము బంగారుకుండ జలమ్ము లనుచు,
తెమ్ము లతకూన మంచి కుసుమమ్ము లనుచు,
తెమ్ము బాగైన కొమ్మ ఫలమ్ము లనుచు,
మించుబోటిని నేరుపు మీఱఁ బలుకు.

ఇందు హృదయగతానురాగమును ప్రతిబింబింపఁజేయు "బంగారుకుండ, లతకూన, కొమ్మ" అనుపదములు, వాచ్యార్థదశయందు జలాదిసంబంధిబోధకము లయ్యు, వ్యంగ్యదశయందు సంబుద్ధి బోధకములు, ఆ సంబోధన రూప వ్యంగ్యార్థములు, "నేరుపు మీఱఁ బలుకు" అను వాచ్యార్థ మగు నేరుపునకు ఉపపాదకములు గాన ప్రధానములు గావు. ఇందలి వ్యంగ్యము శబ్దశక్తిమూలకము. పూర్వోదాహరణము లర్థశక్తిమూలకములు అగుట విశేషము. మఱి:—

"అయనము పట్టుచోటికిఁ బ్ర
యాణము గట్టినప్రాణవల్లభున్
బయనము మాన్పఁ జేయును స
బాష్పగలజ్జలలోచనాంత యై,
దయితుడ నీవు వత్తువు గదా
ఒక జాముకొ రెంటికో మహా
అయినను బ్రొద్దు గ్రుంకుతరి"
కంచు నవోఢ సగద్గదోక్తులన్.

ప్రియుడు దూరదేశమునకుఁ బ్రయాణ మగుచున్నాడు. పోవుటకే ఆరునెలలు పట్టును. అచ్చట పని యెంతటిదో! ఎంత త్వరగ ముగిసినను సంవత్సరము లోపల నిల్లు చేర వీలులేదు. అందాక ప్రియుని యెడబాటు సైపరానిది. ప్రయాణసన్నద్ధు డగుకాంతుని గాంచినంతనే దయితకు కనుల నీరు తిరిగినది. ప్రయాణసమయమున కన్నీరు రాల్చుట యమంగళము. బలవంతముగ బిగ్గ బట్టుటచేత గొంతు బొంగురు వోయినది. అంతేగాని కన్నీరు నిలువక కను గొనల నుండి దొరగుచునేయున్నది. చెక్కులపై జాలువాఱు కన్నీటితో బొంగురువోయిన యెలుగుతో, 'ప్రియా! త్వరగ వత్తువు గదా? మరల నిలు సేరుటకు జాము సేపు పట్టునా? పని గొప్పదేని, రెండుజాముల కేని వీలగునే? కాదేని కొట్టకొనకు ప్రొద్దుగూకు తరికైన వత్తు వను కొందును.' అని యెడబాటు నోర్వలేని, ప్రేమను పట్టియిచ్చు పలుకులు, పోవల దనలేక పలుకుచున్నది— ప్రియురాలు.

పై వాచ్యార్థమువల్ల, 'నేను నీ విరహమోర్వలేను. విధి లేకపోయె కేనిఁ, బ్రాణముల బిగబట్టి బలవంతమున ఒకటిరెండు జాములం వెళ్ళఁద్రోసినఁ ద్రోయఁగల నేమో! అంతకు మించి సాధ్యము గానిపని. సూర్యుడు మునుగు లోపల నిలు సేరవేని, ప్రాణములతో నన్ను చూడలేవు.' అని వ్యంగ్య మేర్పడుచున్నది. అది, 'పయనము మాన్పఁజేయును.' అను వాచ్యార్థోపపాదకము, కనుక గుణీభూతము.

అయినను రమణీయము. కాన నిది ద్వితీయ కావ్యము. అని ప్రతిపాదించరాదు.

'సగద్గదోక్తులకా పయనము మాన్పఁ జేయును.' అనుచో కరణార్థమున తృతీయకు బదులుగ వచ్చిన ద్వితీయ, సగద్గదోక్తులు ప్రయాణము మాన్పఁజేయు సాధన మని స్పష్టముగ తెలియఁబరచుచున్నది. కనుక వ్యంగ్యాపేక్ష లేకయే కన్నీటితోడి సగద్గదోక్తులే ప్రయాణ ప్రత్యాహాకరణధురీణము లై యుండ వ్యంగ్యమునకు వాచ్యోపపాదకత నంటఁగట్టి గుణీభూత మనుట యనుచితము.

ఒకవేళ 'వ్యంగ్యము గూడ ప్రయాణ నివారణకు ప్రబలసాధనము గాదా?' అన్న, అంత మాత్రముచేత వాచ్యసిద్ధ్యంగము గాదు. అట్లైన, 'స్తన తట లిప్త చందనము—' అను పద్యమునందును, వ్యంగ్య మగుగూఢసంభోగము వాచ్య మగునీచతను ప్రతిపాదించును గాన నదియు గుణీభూత వ్యంగ్యమే కావలసి యుండును.

పోనీ, 'వత్తువుగదా ఒక జాముకో —' ఇత్యాది గలజ్జలనయనాంత సగద్గదోక్తులు త్వరగ రమ్మనుటయందే చరితార్థములు. 'అంతకు మించి మేను భరింపలేను.' అను వ్యంగ్యమే ప్రయాణ నివారణ ధుర్వహము.' అని భీష్మించిన,

నాయికాగతరతి, నాయకాలంబన మై, బాష్పాద్యనుభావిత మై, చింతావేగాది సంచారీ సమ్మిళిత మై, విప్రలంబ శృంగారరూపమున సహృదయ చర్వణాగోచర మగుచుండ, దాని నెవరు వారింపఁగలరు? కాన నిది ధ్వనికావ్యమే గాని గుణీభూతవ్యంగ్య మగు ద్వితీయశ్రేణికిఁ జెందినది గాదు.

"వ్యంగ్యరమ్యత లేనివాచ్యంబ యెందు
మానసానందకర మది మధ్యమంబు."

ఎందు వ్యంగ్యచమత్కారము లేక వాచ్యచమత్కృతియే హృదయానందకారియో అది మధ్యమకావ్యము.

ఉదాహరణము : —

కడలి యడుగునఁ బడినకొడుకు మైనాకాద్రి
నెమకంగ జాపినది హిమవంతుబాహు విది;
సగరతనయశ్రేణి సుగతిపదనిశ్రేణి
గంగలో భక్తి మునుగంగఁ గలుగును ముక్తి.

'అడుగునఁ బడిన యనుగు పట్టి మైనాకు డెందు గలడని వెదకుటకై సముద్రాధోభాగము వరకు జాపిన హిమవంతుబాహు వనుటలో గంగయొక్క చల్లఁదనము, తెల్లఁదనము, పొడవును; 'కపిలముని శాపమున బూడి దైనసాగరుల సుగతికి నిచ్చెన' అనుటచేత పావనత్వమును వ్యంగ్యము లగుచున్నవి. ఆ వ్యంగ్యచమత్కారము వాచ్యమయిన గమ్యోత్ప్రేక్షా చమత్కృతియందు అంతరించి, పల్లెపడుచు అలదిన గందపుఁ బూతయందు మరుగుపడిన దాని యొడలి సొబగువలె రాణించుట లేదు. ఇందలి యుత్ప్రేక్షాచమత్కృతియే హృదయానందకరము. కనుక నిది మధ్యమకావ్యము.

పై యుత్తమ మధ్యమ కావ్యములయందు రెంటను వ్యంగ్యము గుణీభూతము. ఐనను, ఉత్తమకావ్యమున తేజోవంత మయి యుండ, మధ్యమమున వెలవెల వోవుచుండును.

ఈ రెండు తెగలయందు అప్రస్తుత ప్రశంసాది రమ్య వ్యంగ్యకములు, ఉపమాది రమ్య వాచ్యార్థములు నైన అలంకారము లన్నియు నంతర్భూతములు.

"చారుతర మర్థ సంస్కృతశబ్ద మెందు
నధమము (అందురు దానిఁ గావ్యాఖ్య విదులు.)"

వాచ్యార్థచమత్కారముతో గూడనశబ్దచమత్కారమే యెందు రమణీయమో అది యధము కావ్యము.

ఉదాహరణము, చాటువు :

నరసింహ కృష్ణరాయని
కరమరు దగుకీర్తి యొప్పె కరిభిద్గిరిభిత్-
కరికరిభిద్గిరిగిరిభిత్
కరిభిద్గిరిభిత్తురంగ కమనీయం బై.

మఱియొకటి వసుచరిత్రమున :—

అలనాజనాపాంగ వలనావసదనంగ
తులనాభికాభంగ దోఃప్రసంగ
మలసానిల విలోల దల సాసవరసాల
ఫలసాదర శుకాలపనవిశాల
మలినీ గరుదనీక మలినీకృతధునీ క
మలినీ సుఖితకోకకుల వధూక
మతికాంతసలతాంత లతికాంతర నితాంత
రతికాంత రణతాంత సుతనుకాంత
మకృతకామోద కురవకావికలవకుల
ముకుల సకల వసంతప్రమోదచలిత
కలిత కలకంఠ కుల కంఠకాకలీవి

భాసురము వోల్చు మధుమాసవాసరంబు.

పై పదములు కృష్ణరాయల కీర్తివసంత ఋతు శోభల వర్ణనాపరములు. వానియందు అనుప్రాస పరిష్కృత శబ్ద సౌందర్యమే ప్రాధాన్యము వహించియున్నది.

'అర్థచమత్కారశూన్యమై కేవలశబ్దగ్రథన విశ్రాంతము లైనకావ్యములు అప్పకవీయము లోని ;—

రాధా సాధా తరళిత
సాధక రథతానరసుత సరసనిధానా
నాధానిసరస తసురస
తాధరతాధర కధసాతళిరతధాసాధారా'

అను పద్య భ్రమకాదులును; కవిమనోరంజనములోని,

మా మానినీన నేనా
నేమమున ననూన నాము ని న్నెన్నను నా
నాముని మనోన్మని మను
నామనమున నమ్మినాను ననోన్నము మనా!

అను ద్వ్యక్షర పద్యములును; కళాపూర్ణోదయములోని

మాయమ్మాన మనీవే
రాయల వైకొన దేవరా జేజేజే
మాయాతుమ లానిన యది
పాయక సంతోసమున్న ఫలమిల సామీ.'

ఇత్యాది భాషాద్వయపద్యములును; బంధగర్భ కవితలును అధమాధమములు.' అని పంచమ గోష్ఠికిఁ జెందినవిగా గణింపవచ్చును గాని, వానియందు, 'అందమైన యర్థ మందించుట అను కావ్యసామాన్య లక్షణము కొఱవడియుండుటచే యథార్థమునకు నవి కావ్యములేవు.

పాండిత్యప్రకర్షకు మహాకవులు ప్రాచీన సంప్రదాయమును అనుసరించి తమ కావ్యముల నిబంధించినను వానిని కావ్యము లనుట కన్న శబ్దవ్యాయామ మనుట సమంజసము.

కొందరు లాక్షణికులు వీనిని గూడ నాల్గుతెగలుగ విభజింపక,

'వ్యంగ్యము ప్రధాన మైనను నప్రధాన
మైన స్ఫుట మైనఁ గావ్యము త్రిసంఖ్య
నమరు నుత్తమమధ్యమాధమత; ధ్వని గు
ణీకృతవ్యంగ్యమును జిత్ర మై కడంగి.'
(కావ్యాలంకార సంగ్రహము.)

అని మువ్విధముగ విభజించిరి. కాని సువ్యక్తభేదములగు అర్థచిత్ర శబ్దచిత్రములను:-

'చిత్రము శబ్దార్థోభయ చిత్రము లనఁ ద్రివిధగతులఁ జెలగు.' అని యొకే అధమజాతికిఁ జేర్చుట అయుక్తము.

'నరసుత శౌర్యవైభవస
నాథ నృసింహధరాధినాథ నీ
వరజయభేరిభాంకృతిర
వంబుదివిం బరిపూర్ణ మయ్యె నా
సురగణికాపరంపరకుఁ
జోద్యముగా ననురూపవాయక
స్థిరపరిరంభ సంభ్రమ వి
శేషముఁ దెల్పఁగ నేఁగు కైవడిన్'.
(కావ్యాలంకార సంగ్రహము)

అను నుత్ప్రేక్షా చమత్కృతి బంధుర మగు కావ్యమునకు,

'సమద విపక్ష శిక్షణ ని
చక్షణ దక్షిణ దోరనుక్షణ
భ్రమదసి దుర్నిరీక్ష సమ
రక్షపిత క్షితిప క్షతక్షర
త్సమధిక శోణితక్షణ క్ష
తక్షణ గక్షిత పక్షిలోక నిక్ష
గమలదలాక్షు హేలు బల
గౌరవ సింహ నృసింహభూవరా!'
(కావ్యాలంకార సంగ్రహము.)

అను పామరజన శ్లాఘ్య శబ్దాలంకార ప్రధాన మగుకావ్యముతో సజాతీయతవాకొనుట తగ వగునే?

రెండింటికి నీ తారతమ్యము విశదముగ నున్నను ఏకజాతీయత నిర్ణయించిన, కొద్ది భేదము గల ధ్వని గుణీభూతవ్యంగము లను ప్రత్యేకపరిగణన యెందులకు?

శబ్దార్థముల రెండింటి చమత్కారములు ఒకే పద్యమున మేళవించిన వాని తారతమ్య మరసి దాని స్థాయి నిర్ణయించ నగును. తుల్య ప్రాధాన్య మేని మధ్యమకావ్య మనుట పాడి.

ఉదాహరణము :—హంసవింశతియందు,

కందర మాచెలి పొక్కిలి
కందర మా విలసనమ్ము కచము రదమ్ముల్
కుందరమా సమములు మా
కుందరమా పొగడనల కుకుందర సుకటిన్.

ఇందు నాయికా వర్ణనమున ప్రథమశ్రుత శబ్దసౌందర్యమువలెనే రూప కోపమాద్యర్థాలంకార సౌందర్యమును హృదయానంద సంధాయకము.

ఇది గ్రంథారంభప్రకరణము.

# గుణములు - అలంకారములు

శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు

మానవునికి శౌర్యధైర్యములవలెనే కావ్యమునం దాత్మరూపమగు రసమున కుత్కర్షను కలుగఁజేయునవి గుణములు. శౌర్యాదులవలె నివియు నాత్మధర్మములు. గుణములు కావ్యమున ఎట్టివో భామహుని మతమున నిరూపించుట కష్టము; దండి 'ఇతి వైదర్భమార్గస్య ప్రాణా దశగుణాః స్మృతాః' అని వైదర్భమార్గమున కివి ప్రాణము లని చెప్పినాఁడు. సమాధిగుణమును — వైదర్భమార్గము ననుసరించిరేమి — కావ్యసర్వస్వముగఁ జెప్పినాఁడు. [తదేత త్కావ్యసర్వస్వం సమాధిర్నామ యో గుణః.] తన మతమున గుణముల స్థానమేమో స్పష్టముగఁ దెలుపలేదు. కావ్యమునకు శోభను కలిగించుధర్మము అలంకారము లని యతని మతము[1]. వామనుఁడు కావ్యశోభను కలిగించుధర్మములు గుణము లని, అలంకారములు గుణసంపాదితశోభకు ఉత్కర్షఁ గలుగఁజేయున వనియు నిర్వచించినాఁడు[2]. వామనుని మతమున గుణము కావ్యాత్మ యగుట దాని కెక్కువ ప్రాముఖ్యము కలిగినది. ఆనందవర్ధనాచార్యులు 'అంగి యగుధ్వని నాశ్రయించునవి గుణము లని, అంగము లగుశబ్దార్థముల నాశ్రయించునవి గుణము లని చెప్పియున్నాఁడు. మమ్మటాదు లామార్గమునే అనుసరించినారు.[3] గుణము లాత్మధర్మములే యైనచో 'రచన మధుర మయినది; బంధ మోజస్వంతము' అను వ్యవహారములు కుదుర వని తలఁప నక్కఱ లేదనియు, 'ఆకారమే శూరముగ ఉన్న' దనురీతి వ్యవహారమునుబట్టి లక్షణను గ్రహించవలె ననియు మమ్మటాదుల మతము. గుణములు రసధర్మములే కాక శబ్దార్థరచనాధర్మములును కావచ్చు ననియు పండితరా జభిప్రాయపడెను.[4]

భరతముని గుణములు పదియని చెప్పెను. అవి ౧. శ్లేష; ౨. ప్రసాదము; ౩. సమత; ౪. మాధుర్యము; ౫. సుకుమారత; ౬. అర్థవ్యక్తి; ౭. ఉదారత; ౮. ఓజస్సు; ౯. కాంతి; ౧౦. సమాధి అనునవి. దండి భరతమునినే యనుసరించెను. వామనుఁడు పయిగుణములనే అంగీకరించుచు అవి యర్థగుణములు, శబ్దగుణములు కావచ్చునని చెప్పెను. అతని మతమునఁ బది శబ్దగుణములు, పది యర్థగుణములు (మొత్తముపై నిరువదిగుణములు.)

భామహాచార్యుఁడు మాధుర్యము, ఓజస్సు, ప్రసాదము ననుమూఁడుగుణములనే యొప్పుకొనెను. ఆనందవర్ధనుఁ డామతమునే తీసికొనెను. మమ్మటుఁ డానందవర్ధనుని సమర్థించుచు దండివామనాదుల మతములను ఖండించి 'గుణములు మూఁడే కాని పది కా' వని నొక్కి చెప్పెను. అతని మతమునఁ గొన్నిగుణములు కొన్నిటియం దంతర్భవించును; కొన్ని దోషాభావమాత్రప్రయోజకములు; కొన్నిగుణములు కొండొకయెడ దోషము లగును. ఎట్లన — శ్లేష, సమాధి, ఉదారతయు ఓజోగుణమునం దంతర్భవించును. అర్థవ్యక్తి ప్రసాదమునఁ జేరును. క్లిష్టత్వరూపదోషము లేకుండుటకయి సుకుమారతయు, గ్రామ్యమును పరిహరించుటకయి కాంతియు స్వీకరింపఁబడినవి. సమత యంతటను గుణము కాఁజాలదు. ఒక్క పద్యమునందే సందర్భమునుబట్టి రచనయు మాఱుచుండును.

పండితరాజు మూఁడుగుణములనే యంగీకరించుచు ప్రాచీనులమతము ననుసరించి దశగుణస్వరూపమును కూడ వివరించినాఁడు.

భోజదేవుఁ డీ రెండుమార్గములకంటె విలక్షణముగ నిరువదినాలుగు గుణములను అంగీకరించెను. విద్యానాథుఁడు భోజుని మతమునే

---

1. 'కావ్యశోభాకరాన్ ధర్మా నలంకారాన్ ప్రచక్షతే.' [కావ్యా 2-1]
2. కావ్యశోభాయాః కర్తారో ధర్మా గుణాః
తదతిశయహేతవ స్త్వలంకారాః. [కా. సూ. వృ.]
3. తమర్థ మవలంబంతే యేఽంగినం తే గుణాః స్మృతాః
అంగాశ్రితా స్త్వలంకారా మన్తవ్యాః కటకాదివత్, [ధ్వన్యా. ద్వితీ]
4. రసగంగాధరః, పు. 55.

యనుసరించెను;[1] అందలి గుణములు కొన్ని కొన్నిటియందు గతార్థ మగునట్లును, కొన్ని దోషాభావములు కను బడునట్లు నతఁడే వివరించెను.

చూడామణికారుఁడు చాలవఱకుఁ బ్రతాపరుద్రీయము ననుసరించినను గుణవిషయమున దండినే యనుసరించెను. మూర్తికవి ప్రతాపరుద్రీయమునే యొకమాదిరిగ నాంధ్రీకరించుచున్నను పదిగుణములనే యొప్పుకొనెను. వాని లక్షణములను మాత్రము ప్రతాపరుద్రీయానుసారముగనే నిర్వచించెను.

పెద్దయకవియు, తదనుసారి యగునప్పకవియు గుణములు కొన్ని దోషాభావమాత్ర ప్రయోజకము లని తెలుపునెడ తాము చెప్పనివి, ప్రతాపరుద్రీయమున నున్నవియు నగు గుణములను పేర్కొని యున్నారు. ఈ సంగతి వివరముగ నిదివఱకే చెప్పఁబడినది.

క్షేమేంద్రుఁడు కవికంఠాభరణమున మీఁది మతములకు విలక్షణముగ 'శబ్దవైమల్యము, అర్థవైమల్యము, ఉభయవైమల్యము' నను మూఁడు గుణములను చెప్పియున్నాఁడు. కాని యీ మతము నెవరును ఆమోదించ లేదు. ఇది శబ్దార్థస్వచ్ఛతారూప మగు ప్రసాదగుణమందే యంతర్భవించును. ఓజో మాధుర్యము లట్లు ప్రసాదమున నిమిడి యుండవు. కావున పయిమతముల నన్నింటిని బాగుగ విచారించిచో మాధుర్యౌజః ప్రసాదములు మూఁడే గుణము లనువాద ముత్తమ మని తోఁచును.

ఏదేని పద్యమునందలి ధ్వనిని గాని, గుణమును గాని, అలంకారమును గాని, తక్కిన కావ్యాంగములను గాని లక్షణసమన్వయమును బట్టియే నిశ్చయింపవలసి యున్నది. వ్యాఖ్యాత ఏమి చెప్పిన దానికే తల యూపవలసియున్నది. లాక్షణికు లుదాహరించినలక్ష్యములను విడిచి, క్రొత్తలక్ష్యములందలి గుణాలంకారాదులను వివరించుట చాల కష్టము. అందును అలంకారాదుల లక్షణములు కొంచెము విశదరీతి నుండుటచేఁ గొంతవఱకయిన నూహించి చెప్ప నవకాశము కలదు. గుణముల లక్షణము లంత స్పష్టములు కావు వానిని గుఱుతించుట దుర్ఘటము. లాక్షణికులు కూడ ఒకేపద్యమును మూఁడు నాలుగు గుణముల కుదాహరించుట కలదు. గుణములు పది యని చెప్పినపుడు అవి కొన్ని పరస్పరవిరుద్ధము లేమో యని యనుమానించుటకును వీలు కలదు. అనేకపదము లేకపదముగా గోచరించుట శ్లేష మనియు, పదములు వేర్వేఱుగ నుండుట మాధుర్య మనియు లక్షణములు కలవు. ఇది పరస్పరము విరుద్ధముగ నున్నట్లు తోఁచును. పదములు కలిసియున్నను, కలిసి యుండకున్నను కూడ గుణములే యగుచో వానిని వేర్వేఱుగఁ బరిగణించుటయు అనావశ్యక మని తోఁచక పోదు. తక్కినలక్షణముల సంగతి యెట్టు లున్నను గుణముల లక్షణములు మాత్ర మొకరి ననుసరించి యింకొకరు చెప్పినట్లు లేదు. దండి లక్షణము వేఱు; వామనుని లక్షణము వేఱు; భోజుని లక్షణము వేఱు. ఆ లక్షణములకు సాంగత్యము కుదురదు. ఒకే గ్రంథమునందే పరస్పరము వైరుధ్య మున్నటుల స్థూలదృష్టికి గోచరించినను, సూక్ష్మపర్యాలోచనమున సమన్వయము కుదురఁగలదు. కాని గుణములు మూఁడే యనుమతమున లక్షణములకుఁ బరస్పరము భేదము సుస్పష్టము. ఎట్టి లక్ష్యమునం దయిన సమన్వయమును సుసాధ్యము.

ఆంధ్రాలంకారికులు పదిగుణములనే చెప్పిరి. వారి లక్షణములు విభిన్నములు; అస్పష్టములు. అందుననే వారి గుణలక్షణవిభాగములు విమర్శనలకు లోనగుచున్నవి.

## అలంకారములు

కావ్యసామగ్రియం దలంకారములే ప్రాచీనతమములు; అధికసంఖ్యాకములు; ప్రాచీనుల

1. శ్లో. శ్లేషః ప్రసాదః సమతా మాధుర్యం సుకుమారతా
అర్థవ్యక్తి రుదారత్వం తథా కాన్తి రుదాత్తతా॥
ఓజః సుశబ్దతా ప్రేయా నార్జిత్య మథ విస్తరః.
సమాధిః సౌక్ష్మ్యగాంభీర్యే సంక్షేపో భావికం తథా.
సంమితత్వం తథా ప్రౌఢీ రీతి రుక్తి ర్గతి స్తథా.
వ్యా. తత్ర భోజరాజమతే నోద్దేశ మాహ—శ్లేష ఇత్యాది. [ప్రతా. గుణ]

మతమున నివియే ముఖ్యములు. ఈ యంశము 'న కాన్తమపి నిర్భూషం విభాతి వనితాముఖ' మ్మిత్యాదివలనఁ దెలియుచున్నది. ఏమి చెప్పినను, ఏమి చెప్పకున్నను అందఱు నలంకారములనుగూర్చి చెప్పుచునే యుండిరి. సాహిత్యశాస్త్రమున సంపూర్ణముగ కావ్యసామగ్రిని చర్చించుగ్రంథములకంటె అలంకారచర్చారూపము లగుగ్రంథములే యెక్కువ. వైదిక వాఙ్మయమందును అనేకము లగునలంకారములు కన్పించుచున్నవి. సాహిత్యశాస్త్రమున కలంకారశాస్త్ర మనుపేరు అలంకారబాహుళ్యమునుబట్టియే కలిగిన దని కుమారస్వామి సోమయాజి ప్రతాపరుద్రీయవ్యాఖ్యానమునఁ దెలిపి యున్నాడు.[1]

అలంకారములు కావ్యమునకు శోభను కూర్చున వని అందఱు నంగీకరింతురు. 'అలంక్రియతే కావ్య మనే నేతి చారుత్వహేతు రలంకారః' అనువ్యుత్పత్తి వివరణములు పయి యంశమును విశదపఱుచుచున్నవి. దండి యలంకారములు కావ్యశోభాహేతువు లని చెప్పియున్నాడు; వామనుఁడు గుణసంపాదిత మగు శోభకుఁ బరిపోషమును గూర్చున వలంకారము లని చెప్పినాఁడు. మఱియు వామనుని మతమున 'సౌందర్య' మనునర్థ మలంకారామునకుఁ జెప్పఁబడినది. గ్రంథారంభముననే యతఁడు 'అలంకార మున్నకారణమున కావ్యము గ్రాహ్యము; సౌందర్యమే యలంకారము; ఆ సౌందర్యము దోషహీనము, గుణాలంకారాదానమువలనఁ గల్గు నని చెప్పి యున్నాఁడు.[2] కొందఱు చమత్కారజనకము లలంకారము లనిరి. అందరి మతమునను అలంకారము లుపాదేయములే కాని హేయములు కావు. ఇవి శబ్దసామ్యమునుబట్టి, అర్థసామ్యమునుబట్టి భూషణస్థానీయములు.

అలంకారములు శబ్దార్థభేదములచే రెండు విధములు. ఉపమాదులు అర్థాలంకారములు; అనుప్రాసాదులు శబ్దాలంకారములు. శబ్దాలంకారములం దర్థమునను, అర్థాలంకారములందు శబ్దమునను చమత్కృతి ఉండక పోదు. అయినను శబ్దచమత్కృతి ప్రధానముగ నున్నచోట శబ్దాలంకార మనియు, అర్థచమత్కృతి ప్రధాన మగుచోట నర్థాలంకార మనియు గ్రహింపబడెను. రెండు కాని, అంతకంటె నెక్కువ గాని యలంకారము లున్నచో వానిని ప్రత్యేకముగ మిశ్రాలంకారములుగఁ జెప్పుట కలదు. అవి సంకరము, సంసృష్టి యని రెండు విధములు; తిలములు, తండులములు కలిసి యున్నట్లు కలిసి యున్న యలంకారము లున్న సంసృష్టి యగును. సంసృష్టియందు అలంకారములను వేర్వేఱుగ ఏర్చి చూపవచ్చును. పాలు, నీళ్లు కలిసిపోయి యేక మయినట్లు రెండలంకారములు కలిసిపోయిన నచట సంకరము. సంకరమున అలంకారములను వేర్వేఱుగఁ దీసి చూపుటకు వలను కాదు. అందొక్క యలంకారము తీసి వైచినచో రెండవదానికిని హాని కలుగుచుండును. సంకరము సామాన్యముగ అంగాంగిభావ సంకరము, ఏకవాచకానుప్రవేశ సంకరము, సందేహసంకరము నని మూఁడువిధములు.

పయి మిశ్రాలంకారములను వేఱుభేదముగ లెక్కింప నక్కఱ లేదు. సంకీర్ణములు గాని, సంసృష్టములు గాని యగునలంకారము లన్నియు శబ్దాలంకారము లైనఁ గావచ్చును; అర్థాలంకారము లైనఁ గావచ్చును; లేదా కొన్ని శబ్దాలంకారములును, కొన్ని యర్థాలంకారములును గావచ్చును. సంస్కృతాలంకారికులు కొందఱు ప్రత్యేకముగ మిశ్రాలంకార ప్రకరణమును వ్రాసిరి. ఆంధ్రాలంకారికు లటులొనర్ప లేదు. మిశ్రములలోని యలంకారములు శబ్దార్థసంబద్ధమాత్రము లగుటచే వానిని ప్రత్యేకముగ విభజింప నక్కఱ లేదు.

శబ్దాలంకారములకంటె నర్థాలంకారములే యెక్కువగా కావ్యమునకు శోభను గలిగించుట కుపయోగపడును. రసతత్పరుఁ డగుకవి యర్థాలంకారములం గూర్పఁ బ్రయత్నింప వచ్చును; కాని శబ్దాలంకారములఁ గూర్పఁ బ్రయత్నింప

---

1. 'యద్యపి రసాలంకారాద్యనేకవిషయకం శాస్త్రం,
తథాపి ఛత్రిన్యాయే నాలంకారశాస్త్ర ముచ్యతే.' [ప్రతా. వ్యాఖ్యా. నాయ.]

2. కావ్యం గ్రాహ్య మలంకారాత్.
సౌందర్య మలంకారః
సదోషగుణాలంకారహానాదానాభ్యామ్. [కా. సూ. 1-1-1-3]

రాదు. అవి రసమునకు భంజకములు కావచ్చును వానియంత నవి యెచ్చట నైనను పడినచో దోషము లేదు; ప్రయత్నపూర్వకముగ వానిని నిబంధించినచోఁ బ్రమాదము కలుగును[1]. కావ్యమునకుఁ బ్రధానప్రయోజన మగు—ఆత్మస్థానీయ మగురసమునకు సుదూరము లగుశబ్దాలంకారములకంటె అర్థాలంకారములే యుత్తమములు. ప్రధాన మగుశృంగారాదిరసమున కలంకారముగఁ గూర్పఁబడినరూపకాదు లగునర్థాలంకారములే యథార్థాలంకారములు[2]. ఆలంకారికు లందఱును పయివిషయము నామోదించిరి.

అలంకారము చమత్కృత్యాధాయకము. వివిధకవివతంసముల యూహలనుబట్టి, రచనలనుబట్టి చమత్కారము భిన్న మగుచుండుటచే అలంకారముల సంఖ్యయుఁ బెరుగును. మాటల తీరు లనంతములు! అట్టి చమత్కారవిశేషములు శబ్దములవలనఁ గాక అర్థములవలననే యెక్కువగఁ గలుగును; కావున నర్థాలంకారముల సంఖ్యయే క్రమక్రమముగ నూటింటికిఁ బయిగ పెరిగినది. శబ్దాలంకారము లే పదింటికో తక్కువగ నున్నవి. అందుచే ఎక్కువ చమత్కారాధాయకము లగుటచే అర్థాలంకారము లగ్రశ్రేణిలోని వని చెప్పవలెను. అర్థాలంకారములు లేనికవిత విధవవలె నుండు[3] నని యగ్నిపురాణమునఁ జెప్పఁబడినది.

అర్థాలంకారములయందును కొన్ని ప్రధానములుగను, మఱికొన్ని ప్రధానముల విశేషరూపములుగను అంగీకరింపఁబడినవి. భరతముని మూఁడర్థాలంకారములను ఉపమ, దీపకము, రూపకములను చెప్పి, అందు నుపమాప్రపంచము నే విస్తరించెను. అతని మతమునం దుపమాలంకారమే ప్రధానము. భామహుఁడును ఉపమ నే తొలుతఁ బేర్కొనినాఁడు. కాని యతిశయోక్తి వివరణ సందర్భమున వక్రోక్తి (అతిశయోక్తి) యుత్తమమనియు, అది లేకుండ నలంకారమే లే దనియు వివరించెను.[4] అతని సిద్ధాంతము ముఖము చంద్రసమానము కాకున్నను ఉండిన ట్లుచటఁ జెప్పఁబడినది కదా! దండి స్వభావోక్తినే ప్రధానాలంకారముగ నిర్వచించెను.[5] వాఙ్మయము[6] స్వభావోక్తి, వక్రోక్తి యని రెండు విధము లని యతఁడే చెప్పినాఁడు. ఆనందవర్ధనాచార్యులు వక్రోక్తి ప్రాముఖ్యమును వివరించి యున్నాఁడు. వామనుఁడు భరతు ననుసరించి యుపమ నే ప్రధానముగఁ జెప్పినాఁడు. అతని మతమున యుపమ యొక్కటే అలంకారము; ప్రతివస్త్వాదిక మగునలంకారసంచయ మంతయు నుపమాభేదమే.[7] నవీనాలంకారికు లందఱును ఉపమాలంకారమే ప్రధాన మని చెప్పినారు. స్వభావోక్తి వారిమతమున ముఖ్యము కాదు. ఒక్క నటియే యనేకవేషముల ధరించి సామాజికుల హృదయముల నాకర్షించునట్లొక్క యుప

1. 'శృంగారస్యాంగినో యత్నా దేకరూపానుబంధనాత్
సర్వేష్వేవ ప్రభేదేషు నానుప్రాసః ప్రయోజకః ।
ధ్వన్యాత్మభూతే శృంగారే యమకాదినిబంధనమ్.
శక్తావపి ప్రమాదిత్వం విప్రలంభే విశేషతః ।
రసాక్షిప్తతయా యస్య బన్ధః శక్యక్రియో భవేత్.
అపృథగ్యత్ర నిర్వర్త్యః సో౽లంకారో ధ్వనౌ మతః.' [ధ్వన్యా. 2-15-17]
2. 'ధ్వన్యాత్మభూతే శృంగారే సమీక్ష్య వినివేశితః
రూపకాది రలంకారవర్గ ఏతి యథార్థతామ్.' [ధ్వన్యా. 2-18]
3. 'అర్థాలంకారరహితా విధవేవ సరస్వతీ.' [అగ్ని.]
4. 'సైషా సర్వత్ర వక్రోక్తి రనయా౽ర్థో విభావ్యతే.
యత్నో౽స్యాం కవినా కార్యః కో౽లంకారో౽నయా వినా' [కావ్యాలం]
5. స్వభావోక్తిశ్చ జాతిశ్చేత్యాద్యా సాలంకృతిః. [కావ్యాదర్శః 2]
6. భిన్నం ద్విధా స్వభావోక్తి ర్వక్రోక్తి రితి వాఙ్మయమ్. [కావ్యా]
7. 'ఉపమానోపమేయయో ర్గుణలేశతః సామ్య ముపమా.
ప్రతివస్తు ప్రభృతి రుపమాప్రపంచః. [కా. సూ. వృ. 4-1-1,2.]

మయే యలంకారప్రపంచముగ మాఱి కావ్య తత్త్వవిదుల కాహ్లాదము కలుగఁజేయు నని అప్పయదీక్షితులు చిత్రమీమాంసయందు వివరించిరి. ఉపమ యన్ని యలంకారములందు నుండు నని పండితరాజు వాక్రుచ్చెను.[1] మమ్మటుఁడు మొదలు విశ్వేశ్వరపండితునివఱకు గలయాలంకారికులలో నేస్వల్పసంఖ్యాకులో తప్ప తక్కినవా రందఱును పయిమార్గమునే యనుసరించినారు.

ప్రాచీనాలంకారికులలోఁ జాలమంది స్వభావోక్తికే ప్రాముఖ్యమును నొసఁగిరి; కొందఱతిశయోక్తికిని, మఱికొందఱు తదంత ర్భేద మగురూపకమునకును ప్రాధాన్యము నిచ్చి యున్నారు. ఉద్భటుఁడు రూపకమునే తొలుతఁ జేర్కొనెను.[2] రుద్రటుఁ డలంకార ముల నన్నింటిని నాల్గుభాగములుగ విభజించి, వానిలో స్వభావాఖ్యానమునే తొలుతఁ జేర్కొనెను.[3] రాజశేఖరుఁడు నా మార్గ మునే యనుసరించెను.[4] కుంతకుని మతమున అతిశయోక్తి (వక్రోక్తి) కావ్యమున కాత్మగా మాఱినది. స్వభావోక్తి యలంకార్యము కాని అలంకారము కాఁజాల దని, వక్రోక్తి స్వభా వోక్తి నలంకరించున దని యతఁడు వివరించెను. స్వభావోక్తియే అలంకార మయినచో—వక్రో క్త్యాదుల కలంకార్యముగ నే దేదియు లభింప దనియే యతని యూహ.[5]

ఆంధ్రాలంకారికులలో విన్నకోట పెద్దయ కవి దండిమతము ననుసరించి జాతినామాంతము కలస్వభావోక్తియే ప్రధానాలంకార మని చెప్పి యున్నాఁడు.[6] మూర్తికవి విద్యానాథు ననుసరించి యుపమనే తొలుతఁ జేర్కొనెను.[7] అప్పకవి యలంకారవివరణసందర్భమున స్వభావోక్తినే ప్రధానముగఁ జెప్పినను వేఱొక యెడ నుపమయే ఉత్తమ మనునభిమతమును తెల్పినాఁడు. కువలయానంద కారికల నాంధ్రీ కరించిన మూర్తికవిమతము, కువలయానందము నాంధ్రీకరించిన రామయకవిమతము మూల కర్త యగుదీక్షితుల మతమున కభిన్నములు.

తక్కిన కావ్యాంగములవలెనే అలంకారము లును దొలుత స్వల్పము లయినను క్రమక్రమముగ విస్తృతిని బొందినవి. ప్రథమాలంకారికుఁ డగుభరతుఁడు 'ఉపమ, దీపకము, రూప కము' అను మూఁడు అర్థాలంకారములను యమక మనుశబ్దాలంకారము నొక దానిని వివరించినాఁడు. భామహుఁడు రెండు శబ్దా లంకారములను, ముప్పదియా అర్థాలంకారము లను వివరించెను. దండి ముప్పదియా అర్థా లంకారములను జెప్పి, శబ్దాలంకారములను విచిత్రము లగు పద్మ, చక్రాది బంధములను ఎక్కువగఁ జేర్కొనెను. ఇటులే క్రమక్రమ ముగ అలంకారముల సంఖ్య పెరిగి అప్పయ దీక్షితుల నాటి కొక్క యర్థాలంకారములే నూటయిరువది నాలిగింటివఱకుఁ బెరిగినవి. అంతటితో ఆ సంఖ్య నిలిచి పోయినట్లు తోఁచు చున్నది. చమత్కారము లనంతములు. కావున నూహాలంబట్టి యిట్టి వెం పలంకారముల కొదవవిఁది.

తెలుఁగువారిలోఁ బెద్దయకవి యించు

---

1. 'ఉపమైకా శైలూషీ సంప్రాప్తా చిత్రభూమికా భేదాన్.
రంజయతి కావ్యరంగే నృత్యన్తీ తద్విదాం చేతః' [చిత్రమీ. పు 5.]
'విపులాలంకారవర్తి న్యుపమా......' [రసగం. పు. 157.]
2. 'అనుప్రాసః సయమకో రూపకం దీపకోపమే.'
3. 'అర్థస్యాలంకారా వాస్తవ మౌపమ్య మతిశయః శ్లేషః.
ఏషా మేవ విశేషా అన్యే భవన్తి నిశ్శేషాః' [కావ్యాలం.]
4. '...వాస్తవం పుఞ్స్త్వః.......' [కావ్యమీమాంసా. పు. 1.]
5. 'అలంకారకృతాం యేషాం స్వభావోక్తి రలంకృతిః
అలంకార్యతయా తేషాం కి మన్య దవశిష్యతే.' [వక్రోక్తి.]
6. 'అవి యెవ్వి యనఁగా స్వభావాఖ్యానమును. ఉపమయు......
క. ప్రీతి స్వభావాఖ్యానము, జాతి యనఁగఁ బరఁగు...' [చూడా. 5. 2,4.]
7. గీ. 'ఈ యలంకారముల కెల్ల నిలఁ బ్రధాన,మైన దుపమయు ముందుగా నునువు కొల్పి
యొకటి కొకటికి భేదముల్ ప్రకటములుగ, సరవి నెఱిఁగింతు...' [నర. 5. 6.]

మించుగ దండి మతమునే అనుసరించెను. అతని వలెనే యితఁడును శబ్దాలంకార, చిత్రబంధ నిరూపణమునఁ దన పాండితీపటిమం గొంత ప్రకటించుకొనెను. మూర్తికవి తన మూలకర్త వలె డెబ్బదింటి నర్థాలంకారములఁ జెప్పఁ బ్రతిజ్ఞ చేసియు, రసవత్ప్రేయ ఊర్జస్వి సమాహితంబు లనునాలుగలంకారములను విడిచి పెట్టెను. ఛేక, వృత్తి, లాటానుప్రాసము లను, యమక, ముక్తపదగ్రస్తములను, బద్మ, చక్రబంధములను శబ్దాలంకారములను వివరించి, యాంధ్రమునఁ బ్రత్యేకతఁ గన్న గర్భకవిత్వ మును గొంచె ముదాహరించెను. అప్పకవి చూడామణి ననుసరించుచు, రెండలంకారము లను—సంసృష్టి సంకరముల నెక్కువగా వివరించెను.

కావ్యమునందుఁ జమత్కారమును గలిగించుటయే కావ్యాంగముల పరమప్రయోజనము. వాని స్వరూపలక్షణములు మాత్రము విభిన్నములు. ప్రతాపరుద్రీయమున 'కావ్యశోభాహేతువే యలంకారము. గుణము కూడ నట్టిదే' యని పరప్రమాణ ప్రదర్శన పూర్వకముగఁ జెప్పఁబడినది.[1] గుణములు వ్యంగ్యధర్మములు, అలంకారములు శబ్దార్థధర్మము లను కొందఱి మత మనునంశ మీ వఱకే చెప్పఁబడినది. కాని సిద్ధాంతమున గుణములు శబ్దార్థధర్మము లని పండితరాజు మతము. గుణాలంకారములకు ఆశ్రయభేదమునుబట్టియే గాని స్వరూపభేదమునుబట్టి భేదము లేదని నవీనుల యాశయము. రుద్రటుఁ డలంకారాతిరిక్తముగ గుణస్వరూపమును జెప్పలేదు. ఆంధ్రాలంకారికుల కుపాస్యుఁ డగువిద్యానాథుఁడు గుణములు సంఘటనాధర్మము లని, అలంకారములు శబ్దార్థధర్మము లని చెప్పినాఁడు. ఆంధ్రాలంకారికులు మాత్ర మీ చర్చలను విడిచిరి.

## వృత్తులు :

కావ్యమునకు శోభను గలిగించువానిలో వృత్తులు కూడఁ గలవు. వృత్తి యన వ్యాపారము; 'వృత్తయః కావ్యమాతృకాః' అను వచనము వాని ప్రాముఖ్యమును విశదము చేయుచున్నది. వృత్తులు మూఁడువిధములుగ నున్నవి. ౧. శబ్దవృత్తులు; ఇవి పరుష, గ్రామ్య లేక కోమల ఉపనాగరిక యనునవి. ఇవి అనుప్రాసమను శబ్దాలంకారమున కనుగుణములు. వీరాది రసానుగుణములు. ౨. కైశికి, ఆరభటి, సాత్త్వతి, భారతి యనునాలుగును రసానుగుణము లగునర్థవృత్తులు; ఇవి కేవల మర్థవృత్తు లని స్పష్టముగా విద్యానాథాదులు చెప్పలేదు; కాని పరుషాదివృత్తుల కర్థముతో సంబంధ ముండకుండుటంబట్టి, కైశిక్యాదుల కర్థముతో నెక్కువ సంబంధ ముండుటంబట్టి యివి యర్థవృత్తులని చెప్పుటకు వీలుకలుగుచున్నది. కావ్యాలంకారచూడామణియందు కైశిక్యాదులు కావ్యవృత్తు[2] లని చెప్పఁబడినది. కాని కావ్యవృత్తిత్వము ఉభయసాధారణము గాని, విశేషబోధకము కాఁజాలదు. నరసభూపాలీయమునందు మాత్రము మూలమునందువలెనే రచనాశ్రయము అయి రసార్థసూచకము లగు నని కైశిక్యాదు లని చెప్పఁబడినది.[3] కైశికి అత్యంత సుకుమార మగునర్థసందర్భము కలది. ఆరభటి అత్యుద్ధత మగునర్థసందర్భము కలది. కొంచెము మృదు వగునర్థసందర్భము కలది సాత్త్వతి; కొంత ప్రౌఢ మగునర్థసందర్భము కలది భారతి. కైశికి శృంగారకరుణారసములందును, ఆరభటి రౌద్ర బీభత్సములందును, సాత్త్వతి హాస్య శాంతాద్భుతములయందును, భారతి వీరభయానకములయందును వెలయును.[4] పయి రెండు విధము లగువృత్తులకు వ్యవహార మనునామాంతరము ధ్వన్యాలోకమున వ్యవహరింపఁబడినది.

---

1. 'యో హేతుః కావ్యశోభాయాః సోఽలంకారః ప్రకీర్తితః ।
గుణోఽపి తాదృశో జ్ఞేయః......' [ప్రతాప. గుణప్ర.]
2. కావ్యాలంకారచూడామణి పుట. 55.
3. గీ. మఱియు రచనాశ్రయంబులై మధురరసుని, వేశయోగ్యత వృత్తులు కైశికియును,
నారభటియును సాత్త్వతి భారతియును, నాఁగఁ బొగడొందుఁ దల్లక్షణము లొనర్తు.
4. మ. చెలఁగుం గైశికి కోమలార్థరచనాశ్రీ నుద్ధతార్థక్రమా
కలితాడంబరమూర్తి యారభటి; యీషత్ప్రౌఢసందర్భని
శ్చల యా భారతి; పొల్చు సాత్త్వతియు నీషత్కోమలార్థక్రమం
బుల నీ వృత్తులకున్ యథోచితరసస్ఫూర్తు ల్నిరూపించెదన్.

పయి ద్వివిధము లగువృత్తులును కావ్య శోభాకరము లగుటచే అలంకారములవంటివే యని చాలమంది తలంచిరి. ఇవి శబ్దార్థా లంకారానతిరిక్తము లని ధ్వన్యాలోకమునఁ గలదు.[1] ఉపనాగరికాదు లనుప్రాసాదిశబ్దా లంకారాంతర్గతములు, కైశిక్యాదు లుపమా ద్యర్థాలంకారాంతర్భూతము లని తన్మతము. నవీనులు మాత్రము వృత్తులను ప్రత్యేకముగ గణించిరి.

ఈ రెండువిధము లగువృత్తులు కాక 'శబ్ద వృత్తు' లని ప్రసిద్ధిని గనిన మూఁడువృత్తులు అభిధ - లక్షణ - వ్యంజన అనునవి కలవు. ఇవి వాచకాది శబ్దములవలన అర్థమును ప్రతిపా దించుట కుపకరించువ్యాపారములు. వీనిని శబ్ద వృత్తులుగనే విద్యానాథుఁడు వివరించినాఁడు.[2] కాని విచారించి చూచినచో అభిధాదులు శబ్ద వృత్తులును, అర్థవృత్తులునుకూడ నగునని తెలియఁ గలదు. అభిధ శబ్దవ్యాపారము కాని అర్థ వ్యాపారము కాని కావచ్చు నని రసగంగాధర మున సూచింపఁబడినది.[3] 'శక్యార్థమే లక్షక మగుటచే లక్షకత్వ మర్థవ్యాపారముగ నంగీక రించుటయే లెస్స. కాని వాచ్యధర్మము వాచక మున నుపచరించుటచే లక్షణ శబ్దవ్యాపారముగ నంగీకరింపఁబడిన' దని మూలాభిప్రాయమును వివరించి కుమారస్వామి ప్రతాపరుద్రీయ వ్యాఖ్యలో వివరించెను.[4] శబ్దమే కాక యర్థ మును వ్యంజక మగుటచే వ్యంజన ఉభయ వ్యాపార మగును.[5]

కొందఱు అభిధాదులతోఁబాటు గౌణవృత్తిని చేర్చి నాలుగువృత్తులను లెక్కించిరి. అది లక్షణాంతర్భూతమే యని విద్యానాథుఁడు చెప్పినాఁడు. అభిధాదులను పెద్దిరాజు అర్థ వృత్తులు (అర్థవర్తనములు) అని నిర్దేశించెను. అది ఉచిత మని తోఁచదు.

## రీతులు :

రీతులు కూడ కావ్యసామగ్రిలో నున్న వని కొందఱాలంకారికుల మతము. రీతివాదము భామహునికిఁ బూర్వమునను ఉండిన ట్లతని కావ్యాలంకారమువలన స్పష్ట మగుచున్నది. భామహుఁడు రీతులను అంగీకరించలేదు. దండి పయి భామహుని మతమును ప్రతిఘటించుచు వైదర్భ, గౌడరీతులు కల వని, వానికిఁ బర స్పరము భేదము కల దనియుఁ[6] జెప్పినాఁడు. దండి రీతులను 'మార్గము' లనుగా వ్రాసినాఁడు. వామనుఁడు పయివానితోఁ బాంచాలిని చేర్చి

గీ. కైశికి చెలంగు శృంగారకరుణలందు; నారభటి రౌద్రబీభత్సహారిణి యగు
నలరు భారతి (?) హాస్యశాంతాద్భుతముల; నమరు సాత్త్వతి (?) వీరభయానకముల

1. 'శబ్దార్థశరీరం తావ త్కావ్యమ్. తత్ర శబ్దగతా శ్చారుత్వహేతవ [నరస. పు. 34.] వోఽనుప్రాసాదయః ప్రసిద్ధా ఏవ. అర్థగతా శ్చోపమాదయః + + + + + తదన తిరిక్తవృత్తయోఽపి యాః కైశ్చిదుపనాగరికాద్యాః ప్రకాశితాః' [ధ్వన్యా. సలో. పు. 5. 6.]
2. అభిధా, లక్షణా, వ్యంజనాఖ్యా స్తిస్రః శబ్దవృత్తయః [ప్రతాపరుద్రీయ.]
3. 'శక్త్యాఖ్యోఽర్థస్య శబ్దగతః శబ్దస్యార్థగతో వా సంబంధవిశేషోఽభిధా.' [రసగంగాధరః. పు. 140.]
4. స్వార్థం ప్రత్యాయ్యోపరతవ్యాపారస్య శబ్దస్య పునర్వ్యాపారాంతరాయోగా దర్థ ఏవ లక్షక ఇత్యర్థవ్యాపారో లక్షణా; తథాపి వాచ్యధర్మో వాచక ఉపచర్యత ఇతి లక్షణాయాః శబ్దవృత్తిత్వ వ్యవహారః. [ప్రతా. వ్యా. కావ్యప్ర.]
5. 'సర్వేషాం ప్రాయశోఽర్థానాం వ్యంజకత్వ మిహోచ్యతే.' [మమ్మ. కా.]
'వాచ్యలక్ష్యాభ్యా మన్యోఽర్థో వ్యంగ్యః; తద్విషయ శ్శబ్దవ్యాపారః; అత్ర శబ్ద గ్రహణ మర్థస్యాప్యుపలక్షణార్థమ్; అజ్ఞాతార్థస్య శబ్దస్య విశిష్టస్య శబ్దానభిధేయస్య చార్థవ్యంజకత్వాయోగా దుభయవ్యాపారత్వాభ్యు పగమాత్.' [ప్ర. వ్యా. కావ్య.]
6. 'అస్త్యనేకో గిరాం మార్గః సూక్ష్మభేదః పరస్పరమ్.
తత్ర వైదర్భగౌడీయౌ వర్ణ్యేతే ప్రస్ఫుటాన్తరౌ.' [కావ్యా. ప్రథ.]

మూఁడురీతులను జెప్పినాఁడు.[1] సామాన్యముగ సంస్కృతాలంకారికు లందఱును వామనుని పద్ధతి ననుసరించి మూఁడురీతులనే అంగీకరించినారు. పెద్దయకవి పయివానికి మఱొకదానిని ('లాటి' అనుదానిని) చేర్చి నాల్గురీతుల నంగీకరించెను.[2] మూలానుసారి యగుమూర్తికవి మాత్రము మూఁడురీతులనే వివరించెను.

వామనుఁడు రీతి కావ్యమున కాత్మ యని చెప్పెను. ఆంధ్రులలో పెద్దయకవి, అప్పకవి అతనిచొప్పుననే నడచిరి. పయిరీతు లేరుపడుటకు దేశభేదములు, వానియందలి కవుల యభిరుచులు కారణము. కొందఱికి శబ్దాడంబర మక్కఱ లేదు; మఱికొందఱి కది కావలెను; కొందఱి కిటునటు కాక యుండవలెను. వైదర్భ, గౌడ, పాంచాలులు క్రమముగఁ బయి యభిలాషలు కలవారు; ఇట్టి కవితారుచి భేదమును బట్టి కలిగినరీతులు కావ్యముల కాత్మరూపములు కలుగవు.

'రీతి కావ్యాత్మ' యని చెప్పినవామనుఁడు కూడ రీతిసామాన్యమును ఆరీతి నంగీకరింపక వైదర్భరీతినే యొప్పుకొనెను. అందులకుఁ గల కారణ మది సమగ్రగుణములు కల దగుటయే. పయి యంశమునుబట్టి, అతని [3]రీతిలక్షణమును బట్టి వామనుఁడు గుణప్రాధాన్యవాది యనియు, తన్మూలముననే రీతి కావ్యాత్మ యని చెప్పవలసి వచ్చిన దనియు మనము నిశ్చయింపవచ్చును. గుణములను విడిచి రీతులయందుఁ బ్రత్యేకముగ నొక విశేషము లేనికారణముననే వృత్త్యలంకారములం దంతర్భవించినట్టుల రీతులకును గుణములకు నభేదము కొందఱిచేత నంగీకరింపఁబడినది. జాతి, జాతివిశిష్టముల కభేద మంగీకరించుట కలదు.[4]

## దోషములు :

కావ్యతత్త్వము నెఱుంగఁ గోరువారికి ధ్వన్యాదికావ్యాంగపరిజ్ఞాన మెంత యావశ్యకమో దోషవివేకము నంత యావశ్యకమే. మంచి యున్నను, లేకున్నను మాని; దోషములు లేకుండినఁ గాని, కావ్య ముపాదేయము కాదని ఆలంకారికుల మతము. పయియంశమును 'తదదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ', 'తదదోషౌ శబ్దార్థౌ', 'అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్యమ్', 'విగతదోషంబులును, గుణాన్వితము లధిక, లసదలంకారభావోపలక్షితములు, నైన శబ్దార్థములు కావ్యము' అను కావ్యలక్షణములే చెప్పుచున్నవి. వీనియందు 'అదోష' పదమే తొలుతఁ గూర్పఁబడినది.

కావ్యాత్మ యగురసమును సహృదయుల కాస్వాదింప వీలు కాకుండునట్లు అడ్డునది దోషము. రసము విభావాదుల నాశ్రయించి యుండును; కావున శబ్దార్థములయందును అవి సంభవించును.[5] సామాన్యముగ దోషములు పద-వాక్యార్థగతము లయి మూఁడు విధములు. ఆంధ్రాలంకారికులలోఁ జాలమంది యీ విభాగమునే ఆమోదించియున్నారు. కేవలము దోషములనుగూర్చి వివరించుగ్రంథ మాంధ్రమున లేదు. ఆంధ్రముననే కాదు. తన్మూల మగు సంస్కృతమునఁ గూడ గంగానందుఁడు రచిం

---

1. 'సా త్రిధా-వైదర్భీ, గౌడీ, పాంచాలీ చ.' [కా. సూ. వృ.]
2. క. ఈడిత లగువైదర్భీ, గౌడీపాంచాలలాటికారీతులు కా
వ్యాడంబరకరణార్థ, క్రీడలఁ జతురాహ్వయములఁ గృతకృత్యులచేన్. [పుట. 56.]
3. విశిష్టా పదరచనా రీతిః.
విశేషో గుణాత్మా.
సా త్రిధా-వైదర్భీ, గౌడీ, పాంచాలీ చ.
తాసాం పూర్వా గ్రాహ్యా; గుణసాకల్యాత్.
న పున రితరే; స్తోకగుణత్వాత్, [కా. సూ. వృ. 2-1-2-6.]
4. 'జాతిర్జాతిమతో నాన్యా. సముదాయశ్చ సముదాయిభ్యో నాన్య ఇతి వృత్తిరీతయో న గుణాలంకారవ్యతిరిక్తా ఇతి......'
[ధ్వన్యా. వ్యా. పు. 6.]
5. ముఖ్యార్థహతిర్దోషో రసస్తు ముఖ్య స్తదాశ్రయా ద్వాచ్యః.

చిన 'కావ్యాదర్శిని'[1]ని విడిచి వేఱొకగ్రంథము కానరాదు.

దోషములకును, రసమునకును గల సంబంధమునుబట్టి దోషవిచార మలంకారవాఙ్మయ భాగమే యని చెప్పవలెను. ఇంచుమించుగ కావ్యసామగ్రిని నిరూపించినయలంకారశాస్త్ర గ్రంథములందు అంతయో, యింతయో దోషవిచారణ యుండనే యున్నది. ఆంధ్రమున దోషవిచారణ ఛందో వ్యాకరణ గ్రంథములయందే యారంభింపఁబడినది. కవిజనాశ్రయము, ఛందోదర్పణము, అప్పకవీయము మొదలగుగ్రంథము లీయంశమును విశదపఱచుచున్నవి. కవిజనాశ్రయమునకు ముందు తెలుఁగున అలంకార గ్రంథములు వెలువడకుండుటచే దోషవిచారమాకాలమున ఇతరలక్షణముల కంగముగా గ్రహింపఁబడినది. దోషములు కావ్యమునకు వేరుపురుగు లగుటచే అప్పటి లాక్షణికులు కావ్యచర్చయే విషయముగఁ గల ఛందో వ్యాకరణ లక్షణములతో దోషవిచారమును జోడించి యుండవచ్చును.

దోషసంఖ్యాపరిగణనమున గీర్వాణాలంకారికులు పలుమార్గములు త్రొక్కియున్నారు. భరతుఁడు పదిదోషములను అంగీకరించి యున్నాఁడు. భామహుఁడు భరతుఁడు చెప్పని ప్రతిజ్ఞా, హేతు, దృష్టాంత హీనాద్యాది దోషములను వివరించెను. దండి భరతునివలె పది దోషములనే చెప్పినను కొన్నింటిని మార్చెను; క్రొత్తవానిని చేర్చెను. వామనాచార్యుఁ డిరువది దోషములను వివరించెను. క్రమక్రమముగ దోషములసంఖ్య కూడ అలంకారముల సంఖ్యవలెనే పెచ్చు పెరిగినది.

నవీనాలంకారికుఁ డగువిద్యానాథు ననుకరించినపెద్దయకవి, మూర్తికవి కూడ లెక్కకు మిక్కిలిగ దోషములను తెలిపిరి. ప్రాచీనచ్ఛందోలాక్షణికు లగుభీమకవి, అనంతుఁడు దండి ననుసరించి పదిదోషములనే తెలిపిరి. కావ్యాలంకారచూడామణియందు ౧౮ పద దోషములు, ౧౩ వాక్యదోషములు, ౨౨ అర్థదోషములును కలవు. కావ్యాలంకారసంగ్రహము (నరసభూపాలీయము) నందు ౧౭ పద దోషములు, ౨౨ వాక్యదోషములు, ౧౩ అర్థదోషములును చెప్పఁబడినవి.

కవిజనాశ్రయకర్త మొదలగు నిద్దఱుముగ్గురు కొలఁది దోషములనే పరిగణించినను, చెప్పినంతవఱకు తెలుఁగున కుపకరించురీతినే చెప్పినారు. వారు దోషములు గుణము లగుట, దోషములు కాకుండుట మున్నగువిశేషములను కూడ వివరించిరి. సంఖ్యను పెంచిన యాంధ్రాలంకారికులు తగినరీతిని దోషములను సవిమర్శముగ లెక్కింప లేదు.

ఆంధ్రాలంకారవాఙ్మయమున దోషనిరూపణము విస్తృతిని, ప్రాచీనస్థానమును పొందినది. కాని యీ విచారణమువలన నాంధ్రవాఙ్మయమునకుఁ గలిగినయుపకారము మాత్రము మిక్కిలి యల్పము. మన యాలంకారికులు తక్కినవాని రీతినే దోషముల లక్షణోదాహరణములను భాషాంతరీకరించిరి; భాషోపయుక్తము లగులక్షణములను నిర్మింపక పోయిరి. తెలుఁగున నెంత యుపయుక్తములు కాని వానిని పెంచి వ్రాయుచు వీరు ప్రధానదోషమగుప్రాసభంగమునే మఱచిరి.

స్వదేశవాఙ్మయము మంచి చెడుగులను ప్రకటింపఁ దలఁచునపుడు స్వతంత్రవిషయముల రీతి భాషాంతరీకరణము లుపయోగింపఁజాలవు. సంస్కృతాలంకారికులు గల్ల, కటిశబ్దములు దుష్టములని తెలుపఁగా తెలుఁగువారును వానిని పట్టుకొనియే ప్రాఁకులాడిరి. అప్రయుక్తము మొదలగుదోషములకు 'దైవతము' మొదలగు పదములను గీర్వాణపద్ధతినే యుదాహరింపఁబడినవి. తెలుఁగుతనమును విడనాడని-జనుల వాడుకలో నున్నపదము లనేకము లుదాహరింపఁదగినవి. అప్పటివి దోషములలో విశేషముగ నేమియును జెప్పకున్నను వేఱొక చోటఁ దక్కిన వారివలె 'గల్ల, కటి' శబ్దములు దుష్టము లనక వాని పర్యాయాంధ్రపదము లగు

1. సరస్వతీభవన ప్రచురము; గవర్న మెంటు సంస్కృతకాలేజి, కాశీ.

'బుగ్గ, ముడ్డి' పదములను చెప్పినాఁడు.[1] కాని యప్పకవి దోషపరిగణనము కూడ యుక్తముగ లేదు. అథర్వణసూచికయందలి పద్యమును బట్టి శ్రుతికటువులును, నశ్లీలములును కాని 'చెవులు, కన్నులు, చన్నులు, కాళ్లు, పండ్లు, జొడ్డు,' అనుపదములు దుష్టము లనుట పొసఁగదు. పయి వానిని కవు లనేకులు ప్రయోగించియున్నారు; లాక్షణికులును ప్రయోగించినారు. ఇవి రసభంజకములును కావు. మఱియు 'చెవులు, పండ్లు, కన్నులు, చండ్లు అనిసఁ దప్పనియు, 'వీనులు, కనుదోయి, పలువరుసలు (నిక్కు) చన్నుగవ' యనిన యొప్పనియు నతని వ్రాఁత. ఆ వ్రాఁతలో ఒప్పనినదే నలుగురికి వినుట కసభ్యముగ నున్నది. పయి యొప్పయిన పదములు చేసికొనినవున్నమేమో! కొన్ని 'దుష్టము' అని చెప్పఁబడుపదములు (బుగ్గ మొదలగునవి) సందర్భమునుబట్టి ఎంతయు రసావహము లగుచుండును. పసిపాపలను వర్ణించునెడ 'పాలబుగ్గలు' రసావహ మగునట్లు 'పాల చెక్కులు' కాఁజాలను కదా! కావున ఏపదము (లేక వాక్యము లేక అర్థము) సహృదయులకు శ్రవణగోచర మైనంతనే వైముఖ్యము కలిగించునో అదియే దుష్టమని యెంచుట యుచితము. కావుననే ప్రసిద్ధాలంకారికుఁ డగు క్షేమేంద్రుఁ డిన్నిదోషములను వేర్వేఱుగఁ జెప్పకుండ శబ్దకాలుష్యము, అర్థకాలుష్యము, రసకాలుష్యము ననుమూఁడుదోషములనే యంగీకరించెను.[2]

## పాకలపాటి జగన్నాథరాజు

సీ. న్యాయ మైనట్టిధనంబు సమార్జించి
యర్థిపోషణవిద్య లభ్యసించి
రాచకార్యములలోఁ బ్రబలమై రాణించి
శత్రువేధలఁ జాల సంహరించి
శ్రితజనంబుల సన్నిహితులు గా నొనరించి
మిత్రసంతతితోడ మైత్రి నెఱపి
ప్రణిధుల వేడ్క సంపాదించి పనికొని
బంధుపోషణమునఁ బ్రౌఢిఁ గాంచి
గీ. ఆహిమాచలసేతుమధ్యంబునందు
సంతతంబును వినుతింప సకలజనులు
పుడమి విరియాలవంశాబ్ధిపూర్ణసోమ!
నయగుణవిధేయ! శ్రీ జగన్నాథరాయ!

1. సీ. మదిరాక్షిచెవులు తొమ్మిది లెక్క లనరాదు, ముద్దియకనులఁ తమ్ము లనరాదు;
పికవాణి బుగ్గలు ముకురంబు లనరాదు, చెలిపండ్లు మల్లెమొగ్గ లనరాదు;
గజరాజగమనచండ్లు బంగరుగిండు లనరాదు, సతిబొడ్డుమడిని మెచ్చంగ రాదు;
సరసిజాననముడ్డి సైకతం బనరాదు, హరిమధ్య కాళ్లు కళ్లనఁగ రాదు;
క్రమముగ వీనికి వీనులు, కన్నుదోయి, చెక్కులును, బలువరుసలు, నిక్కుఁ జన్నుఁ
గవయుఁ, బొక్కిలి పిఱుఁదుఁ, జొక్కటపు టడుగు, లనుచు మును వాడి రవియు చేకొ
నఁగవలయు [అప్ప. 1.118.]

2. చూ. కవికంఠాభరణము. నిర్ణయసాగరప్రతి.

మనిషి-మనస్సు:

# అంజలి

-:o:—-

[ఇరవయ్యోశతాబ్ది పూర్వార్ధంలో పతంజలి వలె యోగచికిత్సావాఙ్మయప్రపంచంలో ప్రభాకరులుగా వెలుగొందిన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి తృతీయవర్ధంతిమహాసభలో, పెద్దకళ్లేపల్లిలో అర్పించిన 'అంజలి' ఇది.

ఈ శ్రావణ బహుళవిదియనాడు పంచమ వర్ధంతిసభలు జరుగనున్నవి. ఆ 'అంజలి' ని ఈ సంచికలో ప్రకటించడానికి అదే కారణం.]

నాకు బాగా జ్ఞాపకం: నా వయస్సు పదేళ్లుంటాయి. ఆ సంవత్సరమే 'భారతి' మాసపత్రిక వెలువడింది. ముచ్చటయిన రంగు బొమ్మలను చూచేమోజుకొద్దీ పత్రిక తిరగవేశాను. మొదటి వ్యాసం 'శివకవులు'. మాది శైవమతప్రాబల్యం కలప్రాంతం. 'శివకవులు' వ్యాసం చదివాను. ఏమీ అర్థం కాలేదు. నా చదువూ, బుద్ధీ చాల పరిమితమైనవి. ఎలా అర్థమౌతుంది ఆవ్యాసం. కాని ఎవరో గొప్ప పండితుడు, సర్వమత సమబుద్ధి కలవాడు వ్రాసింది సుమా ఈ వ్యాసం అనే భావం మాత్రం కలిగింది. దాని సారస్వతప్రాధాన్యం కొంచమైనా తోచలేదు. తర్వాత కూడా ఆ పండితుని రచనలు చదువుతూ వచ్చాను. నా మనసు మడిలో నారుగా నాటిన మొదటి భావం వేరు తన్నింది. అందరు పిల్లలలాగే నేను కూడా నా అభిమానపండితుడు, ఆజానుబాహువు, అర్ణవగంభీరుడు, మహామేధావి—ఇంకా ఏదేదో అనుకున్నాను. కాని చాల మందికి తరచు ఆశాభంగం కలుగుతుంది. నా అదృష్టం మంచిది—నా కెప్పుడూ ఈ విషయంలో ఆశాభంగం కలుగలేదు.

* * *

తర్వాత కొన్ని సంవత్సరాలకు చెన్నపురి రావడం తటస్థించింది. ప్రాచ్యలిఖిత పుస్తకాలయానికి వెళ్ళాను, మ్యూజియం చూస్తూ. అక్కడ ఒక పెద్దమనిషిని చూచాను. ఆయన మొదటిచూపులోనే నాకు ఎక్కడ లేని సంతోషం కలిగింది. చేయెత్తి నమస్కరించ బుద్ధయింది; నమస్కరించాను. 'నాయనా! ఎవరు? ఎందుకు వచ్చావు?'—అని ఆయన ప్రశ్నించినంతసేపు నన్ను సంభావించినట్లు భావించాను. 'మీ రెవరండీ?' అనబోయి అర్ధోక్తిలోనే ఆగిపోయాను; పక్కన వున్న మరొక పండితుని ప్రశ్నార్థకదృష్టికి జడిసి. 'వీ రెవరో తెలియదటయ్యా?'—అని ఆయన చూపులు చురమురగా తాకినట్టయింది. ఇద్దరు పండితులూ నా కపరిచితులే. కాని యింతలో నా మనస్సులో మెరపు మెరిసింది—నా అభిమానపండితుడు ఈయనే అయి వుంటాడా? సందేహం లేదు. ఆయనే. నేను తలపోసిన ఆకృతి. వృధా పోతే నే నూరుకోను. ధైర్యం చేసి, వేటూరి ప్రభా... అంటుండగా నే పక్కనున్న పండితుని పెదవులపై మందహాసం చిందులాడింది.

* * *

క్రమంగా మరొక సత్యం కూడా బోధపడింది. 'దూరపుకొండలు నునుపు' అన్నది సామెత. అది శాస్త్రిగారి విషయంలో నిరర్థకమైంది. ఈ కొండకు—జ్ఞానమేరువుకు—ఎంత చేరువకు చేరినా నునుపే కాని రాళ్ళూ రప్పా కనిపించ లేదు; బంగారమే కాని కంగారు కానరాలేదు. శ్రీ శాస్త్రిగారిలోని మానవం గౌరీశంకరశిఖరంలా మహోన్నతం; నానాటికీ పెరుగుటే కాని తరుగుట ఎరుగనిది. ఆయన ఆరడుగులకాయంలో మానవం తీర్థంకరుల ప్రమాణాన, గోమటేశ్వరుని ఎత్తున—అరువది అడుగుల ఎత్తున—కనిపించేది. హంపీ లేమ శిఖరం మొదలు వెనక్కు విరుచుకొని చూడవలసి వస్తే ఈ మానవాన్ని చూడడానికి మెడలు విరుచుకొని ప్రయోజనం లేక అంతర్ముఖుడు కావలసి వచ్చేది.

శాస్త్రిగారి పరిచయం నాయెడ వాత్సల్యంగా పరిణమించినకొద్దీ, నాలో అణగి మణగి వున్న చిన్నతనం చెలరేగి చిలిపితనంగా చిందులాడింది. ఈ చిలిపితనానికి ఆయన నవ్వుకొనేవారు. అజ్ఞానానికి ఆవేదన పడేవారేమో! ఆశలకు ఆశీస్సు లిచ్చేవారు.

* * *

ఒకరోజు ఆయన యింటికి వెళ్లాను. ఏదో పుస్తకం కావలసి వచ్చింది. "అమ్మాయి సుజాతా! ఇలా అందీమ్మా, పుస్తకాన్ని!" అన్నారు. "సుజాతా అంటే ఏం పేరండీ?" అని అడిగాను. 'నీవే చెప్పవోయ్' అన్నారు. 'బాగా పుట్టింది అని కదండీ వ్యుత్పత్తి. తక్కిన వారు ఎలా పుడుతారు?' అన్నాను. నా అసభ్యవర్తనకు ఆయన కొంచెం కష్టపడిన మాట నిజం. కాని 'పాండిత్యం ముదిరిందే' అని మాత్రం అన్నారు. 'నీలాటి వాడే వెనకటికి చదువు రాక ముందు పెసలు పెసలు అనేవాట్ట. చదువు ముదిరి పసులు పసులు అనడం మొదలు పెట్టాడట' అన్నారు. 'అంతకన్న మరేమిటండీ?' అని దబాయింప జూచాను. 'గౌతమునికి చల్ల యిచ్చి సేదదేర్చిన సుజాతకథ తెలియదటయ్యా?' అన్నారు. చాల సిగ్గుపడ్డాను, శతశ్లోకేన పండితః అనేకథ గురుతుకువచ్చి.

* * *

ఒకసారి 1935 లో కాబోలు నాకు మలేరియా తగిలింది. చాల బాధ పడుతున్నాను. ఏమీ తోచలేదు. తల దిమ్ముగా వుంది. మనస్సు శూన్యంగా వుంది. ఏవేవో భావాలతోపాటు లైబ్రరీ, శాస్త్రిగారూ జ్ఞాపకం వచ్చారు. శాస్త్రిగారిమీద కోపం కూడా వచ్చింది. ఇన్నిరోజులుగా జ్వరంతో బాధ పడుతున్నాను. ఎదుట మా తియ్యగా మాట్లాడుతారు. యోగక్షేమాలు కనుకోవద్దూ?...ఇలా అనుకుంటుండగా కండ్లు మూతలు పడ్డాయి. మైకం ముంచుకు వచ్చినట్టయింది. ఆ మైకంలో ఒక పాతకాలపు యిల్లు, తెల్లటిగోడ, గోడకు మూడు పటాలు వరుసగా తగిలించినట్టు కనిపించింది. మొదటిది బుద్ధుని పటం. రెండవది గాంధీజీది. మూడవది శాస్త్రిగారిది. శాస్త్రిగారి పటం ఆవరుసలో కొంత కిందికి వుంది. ఉన్నట్టుండి ఆ పటంలోని శాస్త్రిగారి రూపం కదలడం, కన్ను లెత్తి చల్లనిచూపులతో చూడడం, పెదవులు విడివడి పలకరించడం —ఇవన్నీ జరిగినట్టు తోచి గాభరాతో కండ్లు బలవంతంగా విచ్చాను. ఆలోచన పరిగెత్తింది. బుద్ధుడంటే నాకు మొదటినుంచీ మహాభక్తి. సత్యాగ్రహసమరంలో లక్షోపలక్షలు కారాగారానికి వెళ్ళినట్టే నేను వెళ్ళాను. వీరిద్దరి స్థానం నా హృదయంలో మహోన్నతం. శాస్త్రిగారిమీద అభిమానం విశేషంగా వున్నమాట వాస్తవమే. కాని, ఆయనకు వారిద్దరి స్థానం ఇవ్వగలనా? ఇంతకూ ఆయన పటం ఆ వరుసలో కొంత కిందికే వుండినదిగా? ఔనౌను. అలా వుండవలసిందే. వారిద్దరి స్థానం ఈయనకు ఇవ్వను; ఇవ్వలేను. మానవజాతి సేవకోసం జీవితం అంకితం చేసినవారికీ ఈయనకూ పోలికేమిటి?

జ్వరం తగ్గినతర్వాత లైబ్రరీకి వెళ్ళాను. శాస్త్రిగారికి మూడుపటాల సంగతీ చెప్పాను. ఆయన కొంచం ఆశ్చర్యపడ్డారు. 'అయితే నేను థర్డ్ క్లాస్ అన్నమాట!' అన్నారు. నేను జవాబు చెప్పలేదు. 'అయితే నేనే ఫస్ట్ అన్న సంగతి చూచావా?' అన్నారు. 'ఎట్లాండీ?' అని అడిగాను. 'కిందినుంచి చూడవోయ్' అన్నారు. 'ఇంతకూ నీ బుద్ధుడు చేసిందేమిటి? సుష్టుగా తిని అజీర్ణంతో బాధపడి చావడమే కదా!' అన్నారు. చావడం అనేమాట విని నాకు మనస్సు చివుక్కుమనింది. ఏదో అనబోయాను. 'సాయంత్రం ఇంటికి రా: వాదించుకుందాం గాని' అన్నారు.

సాయంకాలం యింటికి వెళ్ళాను. అదే మొదటిసారి వెళ్ళడం. చాలమంది అస్తవ్యస్తంగా కూర్చున్నారు. ఏదో ప్రార్థన చేసే ధోరణిలో వున్నారు. అంతవరకూ శాస్త్రిగారు మనశ్శక్తితో జబ్బులు కుదురుస్తారని నాకు తెలీదు. 'ఈయనకు బుద్ధుడంటే చాల గౌరవమటండీ!' అని అన్నారు ఆయన అక్కడివారందరికి నన్ను చూపుతూ. 'కళ్లు మూసుకుని నమస్కారం చేసుకుని చూడవయ్యా, ఏమౌతుందో?' అన్నారు నావైపు తిరిగి. 'నాకు ప్రార్థనపైన కొద్దిగా నమ్మకం వుంది గాని, భగవంతునిమీద అసలే లేదండీ!' అన్నాను. అక్కడ వున్నవారందరూ కడుపు చెక్కలయ్యేటట్టు నవ్వారు. 'పిచ్చి కుదిరింది అన్న సామెతలా వుంది నీ సంగతి. సరిగ్గా నీవు బుద్ధునికి శిష్యుడు కాదగినవాడివే. వాడేమో శూన్యంతో కొట్టుకున్నాడు. నీవు శూన్యం వైపు చేతులు జాపి ప్రార్థన చేస్తానంటావు. ప్రార్థనలో నమ్మకం వుందన్నావు గదా! ఎవరినిగురించి ప్రార్థన నీది?' అని ప్రశ్నించారు. 'నాది ఆటో సజెషనండీ! బాగుండాలి!

బాగుండాలి! అని మననం చేస్తూ మనస్సుకు నూరిపోసుకుంటాను ధైర్యాన్ని' అన్నాను. 'అయితే మనస్సు అనేది ఒప్పుకుంటూ వన్న మాట' అన్నారు. 'మనస్సు లేనిదే మనిషి ఎలా గండీ?' అన్నాను. 'నీ బుద్ధుడు బుద్ధి 'ప్లేను' వరకే అంగుకున్నాడోయ్. అంతకు మించిన దివ్యత్వం, అమరత్వం వున్నాయి అని నేటి పరిస్థితిలోనే తెలకోవాలి. అది గాంధీయుగం లోనే జరగాలి' అన్నారు.

*　　　*　　　*

హోటలులో పని చేద్దామని ఉందండీ!' అన్నాడు మా మిత్రులలో ఒకడు ఒకరోజు శాస్త్రిగారితో.

'వెళ్లాకోళమా?' అని ప్రశ్నించారు.

'అబ్బే! లేదండీ! నిజంగానే' అన్నాడు మా మిత్రుడు.

'అది చాల నీచమైనవృత్తి అయినట్లు, నీబోటివాడు చేయదగింది కానట్లూ అను కుంటున్నావేమో!' అన్నారు శాస్త్రిగారు.

'అలాంటి భావం ఏ కోశానా లేదండీ. అలాటివృత్తి అంతు చూద్దామని వుందండీ' అన్నాడు మిత్రుడు.

'చూచి...' అని ప్రశ్నించారు శాస్త్రిగారు.

'చదువుకూ, వృత్తికీ సంబంధం అవసరం లేదనేభావం కలవాణ్ని. ఆ భావాన్ని ఆచర ణలో పెట్టి సంతృప్తిపడదామని...' అన్నాడు మిత్రుడు.

శాస్త్రిగారి కళ్లు సంతోషంతో కలకల లాడాయి. తిరువల్లిక్కేణిలో సింగరాచారి వీధిచివర 'రామవిలాస్' అనే పెద్ద హోట లుండేది. అప్పుడు దాని యజమాని శాస్త్రిగా రంటే గురుభావం కలవాడు. శాస్త్రిగారు స్వయంగా వచ్చి యజమానికి నా మిత్రుని పరి చయం చేయించి సర్వర్ గా కుదిర్చారు.

*　　　*　　　*

ఒకరోజు నేనూ అప్పటి గృహలక్ష్మి సంపాదకుడు చదువుల రామచంద్రయ్య శాస్త్రిగారింటికి వెళ్ళాము. శాస్త్రిగారు బావివద్ద జందేనికి సబ్బు వేసి ఉతుకు తున్నారు. రామచంద్రయ్య కంగారుగా 'ఇదేమిటండీ?' అని ప్రశ్నించాడు. 'ఏముందీ! మురికయితే, సబ్బు రాచి, బాదుతున్నాను' అన్నారు. 'జందెం భుజంమీదనుంచి తీయడం తప్పంటారు కదండీ బ్రాహ్మలు?' అన్నాడు రామచంద్రయ్య. 'ఓయి వెర్రినాయనా! నీ బడాయికం నావద్దనా! గురువుకే తిరుమంత్రం ఉపదేశింప వచ్చావు! పూర్వకాలంలో యజ్ఞాది వైదికకర్మలు చేసేటప్పుడే జందెం భుజంమీద వుండేది. తక్కిన సమయాల్లో చిలుక్కొయ్యకు తగిలించేవారు. రాను రాను బ్రాహ్మణులానికి జందెం ఒక్కటే గుర్తయింది; ఎప్పుడూ మెడకు తగిలించుకున్నేచునే ఆచారం ఏర్ప డింది' అని అన్నారు. 'సరేనయ్యా. ఇంతకూ ఈ వర్ణాలేమిటి? జందేలేమిటి? అంతా ఒకే వర్గం కాబోయేకాలం ముందున్నది' అన్నారు. వర్ణాశ్రమ ధర్మవిచారం గంటసేపు సాగింది. కనుకనే, తర్వాత ఒకటిరెండు సంవత్సరాలకు శాస్త్రిగారు తమ పెద్దకుమార్తె లలితమ్మ పెళ్ళిలో అష్టాదశవర్ణాలవారికి తమ సరసనే ఏకపంక్తిని విందు చేసినప్పుడు నాకు విడ్డూర మనిపించలేదు.

*　　　*　　　*

శాస్త్రిగారికి సిఫార్సులంటే గిట్టేది కాదు. 'వాడ్ని వీడ్ని పట్టుకుని ఎక్కడికో పాకి పోదామంటావేమిటి? ఎక్కడికో వెళ్ళి చేసే దేమీ లేదు. ఇక్కడినుంచే పేరూ, ప్రతిష్ఠ వ్యాపించాలి. నీలక్ష్యం ఏమిటో నిర్ణయిం చుకో. దానికోసం ఇక్కడినుంచే ప్రయ త్నించు స్వయంగా' అనేవారు. ఇది తెలిసే ఒకమారు మాలో ఒకరు బరోడా లైబ్రరీ నౌకరీకి దరఖాస్తు పెట్టుకుని శాస్త్రిగారి సిఫార్సు కోరారు. ఆయన చేయనంటే చేయ నన్నారు. నా మిత్రుడు దానికి కొంత కష్ట పడ్డమాట నిజం. ఆ నౌకరీ మరొకరికి దక్కింది. 'మీరు సిఫార్సు చేయనందునే నాకు రాలే దండీ ఉద్యోగం' అన్నాడు శాస్త్రిగారితో ఎత్తిపొడుపుగా. శాస్త్రిగారు చాల కష్ట పడ్డారు. 'నీవు ఇప్పుడు కొంచం ఉద్రిక్తా వస్థలో వున్నావు. తమాయించు' అన్నారు. మామిత్రుడు ఏమో జవాబు చెప్పబోయాడు. 'నీ విప్పుడు ఆలోచించేస్థితిలో లేవు. నా నియ మాన్ని, ఆంతర్యాన్ని గ్రహించలేవు. నా సిఫార్సులు సాగి, నామాట చెల్లితే నేనిలా ఎందుకుంటాను. ఒక్క భగవంతుని సిఫార్సే మనకు కావలసింది' అన్నారు. అప్పటి నా మాటలు నా మిత్రునికి నచ్చకపోయినా,

తర్వాత వాటి మర్మం తెలియవచ్చిం దను కుంటాను.

* * *

ఆ రోజుల్లో సుప్రసిద్ధదంతవైద్యుడు శ్రీ ఉడిపి వెంకటరావుగారు శాస్త్రిగారివద్దకు చికిత్సకు వచ్చేవారు. ఆయనకు 'ప్లాన్ చెట్' అంటే నమ్మకం. ప్లాన్ చెట్ అంటే పర లోకంలోని వారితో సంభాషించడం. ఒక చిన్న ముక్కాలి పీటవంటి బల్ల వుంటుంది. దాని చుట్టూ జనం కూచుంటారు. పరలోక వాసులను ఆహ్వానించేఅసాధారణశక్తులు గల వ్యక్తి. చేత్తో కలమో, పెన్సిలో పట్టుకుని కాగితంమీద వ్రాస్తాడు. పరలోకవాసులు ఆయనద్వారా తమ సందేశాలను తమవారికి తెలుపుతారట. ప్లాన్ చెట్ సంప్రదాయంలో అప్పట్లో మన దేశంలో ప్రసిద్ధుడు శ్రీ ఋషి. ఒకసారి మద్రాసు వచ్చారు. వెంకటరావు గారు ప్లాన్ చెట్ మాహాత్మ్యం శాస్త్రిగారికి తెలుపుదా మని కాబోలు ఒకనాటి సాయం కాలం శాస్త్రిగారి బసలో దానిని ఏర్పాటు చేశారు. దాన్ని చూడడానికి తమ తాత ముత్తాతల సందేశాలు వినడానికి పెక్కుమంది వచ్చారు. ఋషి ఒక కాయితం కలం తీసు కుని వ్రాయడానికి పూనుకున్నారు. ఆయనకు తరచు వచ్చేఆవేశం, అనుభూతి ఆనాడు కని పించలే దని ఆయన వెంటనంటి వచ్చినఅనుచర బృందమే అన్నది. ఒక్క అక్షరం కూడ వ్రాయలేక పోయారు. ఉబలాటంతో చూస్తున్న నాబోటివారికి ఎంతో నిరుత్సాహం కలిగింది. ఆయన శాస్త్రిగారిని చూచి, 'మీ సముఖంలో ఏమీ వ్రాయలేక పోతున్నాను.' అన్నారు. 'నేను ఏదైనా మాయ చేస్తున్నట్టు అపోహ పడుతున్నారేమో? నాకున్నూడా ఈవిషయంలో జిజ్ఞాసే. విహాసేమీ లేదు. నా తండ్రి తాతలు వచ్చి సందేశాలివ్వగా వినడం నాకు మాత్రం ఇష్టం లేదా? అన్నారు శాస్త్రిగారు. ఋషి మరొకమారు ప్రయత్నించారు. కుదరలేదు. 'మా యింట్లో వీలయితే రేపు చూద్దాం లెండి! అని సర్దారు శ్రీ వెంకటరావుగారు.

మర్నాడు వెంకటరావుగారింటికి వెళ్ళాము- శాస్త్రిగారు, గన్నవరపు సుబ్బరామయ్యగారు, (అప్పటిభారతి సంపాదకులు) కంభంపాటి సత్యనారాయణ [illegible]గారు, నేను, మరికొంద రము. అక్కడ ప్లాన్ చెట్. సంగతి అసలే లేదు. నాకు మరింత ఆశాభంగం కలిగింది. శాస్త్రిగారిని మాట్లాడ వలసిం దని ఋషి కోరాడు. 'నేను ఇంగ్లీషులో ప్రసంగించ లేనండీ' అన్నారు శాస్త్రిగారు. ఋషి ఉత్తరాది వారు; దక్షిణభాష లేవీ తెలీవు. శాస్త్రిగారు తమిళంలోనూ చక్కగా ప్రసం గించగలరు. కాని ఋషికి తమిళం వాసనన్నా లేదు. సరే! శాస్త్రిగారు తెనుగులోనే ప్రసంగించడానికీ వెంకటరావుగారు ఇంగ్లీషులో తర్జుమా చేయడానికి నిర్ణయమైంది. శాస్త్రి గారి ఆనాటి మహోపన్యాసం ఎన్నటికీ మరపు రాదు. గంటసేపు అనర్గళంగా ప్రసంగించారు. శ్రోతలకు అమృతపు 'వపర్ బాత్' అని పించింది. ఋషి ప్రసంగం సారాంశం గ్రహించారు. దిగ్భ్రాంతి చెందారు. విషయం భగవత్ప్రేమ. ఆ ప్రేమలో మానవుడు కరగి పోవా లన్నారు. ఆ ప్రేమామృతాన్ని చవి గొన్నవారు కబీర్ దాస్ అన్నట్టు ఆ ఆనందాన్ని చవిగొన్నవారు దాని రుచిని ఇదమిత్థ మని చెప్ప లే రని, మూగవాడు బెల్లం తిన్నట్టు ఆ ఆనందాన్ని వ్యక్తం చేసేస్థితిలో వుండ రని అన్నారు. ఆ ప్రసంగ మొక కావ్యం. దాన్ని వ్రాసుకోవాల నన్నా తోచలేదు మాకు ఆ మైమఱపులో.

* * *

ఏమోయి! పెళ్ళి బాగ జరిగిందా?' అని ప్రశ్నించారు. పెళ్ళి చేసుకు వచ్చి నమ స్కరిస్తున్న నన్ను చూచి శాస్త్రిగారు. 'ఆ!' అన్నాను. 'శీఘ్ర మేవ సుపుత్రా ప్తి రస్తు!' అని ఆశీర్వదించి, అర్ధోక్తిలోనే 'ఇప్పట్లోనే వద్దు లే!' అని సర్దారు. 'ఏమిటండీ! అలా అంటున్నారు? ప్రజయా హి మనుష్యాః పూర్ణాః- అన్నారు గదా పూర్వులు' అన్నాను. 'అది కాదనను. అయితే నీవు పంట పండించుకుంటా వనుకో. దాని నంతా విత్తనం కోసమే దాచు కుంటావా? కొంత దాచుకుని, తక్కినది అనుభవిస్తావు. మొదట తృతీయపురుషార్థం కానీ, ప్రజ ఆనుషంగికఫలం.' అన్నారు.

* * *

గాంధీజీకి ఎదురు తిరిగిన సుభాషచంద్రు డంటే శాస్త్రిగారికి గిట్టేది కాదు. 'సుభాష్ హింసావాది. మన దేశానికి ఆయన విధానం

గిట్టదు.' అనేవారు. సుభాష్ అప్పుడు చెన్నపురికి వచ్చారు. జనం తండోపతండాలుగా ఆయన ప్రసంగం వినడానికి బీచికి వెళ్లుతున్నది. చాపల్యం కొద్దీ నేను శాస్త్రిగారి పిల్లలు ఆనందు, సుజాత, వినతలను వెంటబెట్టుకుని బీచికి వెళ్ళాను. శాస్త్రిగారు ఆనాడు వాల్తేరుకు ఆంధ్రవిశ్వవిద్యాలయం పరీక్షకుల సమావేశం కోసం వెళ్ళవలసి వుంది. రాత్రి ఎనిమిదయింది. పిల్లలను వెంటబెట్టుకొని సుభాష్‌చంద్రుని సభకు వెళ్ళానని తెలిసి అగ్గయిపోయారు. ప్రయాణం మానుకున్నారు. నాకోసం ఎదురు చూస్తున్నారు. ఇంట్లో అడుగు పెట్టగానే, 'ఏమిటయ్యా, నేను వాణ్ణి చూడవద్దన్నానా? గాంధీజీని ధిక్కరించిన మనిషి ముఖం ఏ మొగం పెట్టుకొని చూచావు? నీయిష్టం, ఏమైనా అఘోరించు. నన్ను అడగకుండా పిల్లలను ఏమని పిలుచుకు వెళ్ళావు? తా చెడ్డకోతి వనమెల్ల చెరిచిందట!'

ఈ ధోరణిలో అరగంటసేపు సాగాయి చమత్కారాలు. నేను గేటువద్ద తల వంచుకుని నిలబడి వున్నాను. నోరు మెదపలేకపోయాను. కాని అక్కడ వున్నవారు-ఇప్పుడేమీ మాట్లాడకు వెళ్లిపో-అని చేత్తో సైగ చేశారు. వెళ్లిపోయాను. రాత్రంతా కునుకైనా లేదు 'నిజమే. ఆయనను అడగకుండా పిల్లలను పిలుచుకొని వెళ్లడం తప్పే' అని చెవుల్లో గుండె గింగురుమన్నది.

మర్నాడు వుదయం గన్నవరపు సుబ్బరామయ్యగారింట్లో కబుర్లు చెబుతున్నాను. దాదాపు పదకొండు గంటలు. వాకిలికి వీపు చేసి మాట్లాడుతున్నాను. నా ఎదుట కూచున్న సుబ్బరామయ్యగారు అకస్మాత్తుగా లేచి వాకిలి వైపు పరుగెత్తారు. తిరిగి చూతును గదా, శాస్త్రిగారు! నేను విస్తుపోయాను. శాస్త్రిగారు పరుగెత్తుకుంటూ వచ్చి నన్ను కౌగిలించుకుని గద్గదకంఠంతో ఏదో అనబోయి, మాట పెగలక కన్నీళ్లు కురిపిస్తూ నిలబడే వుండిపోయారు. పదినిమిషాలు గడిచాయి. సుబ్బరామయ్యగారి కుటుంబమంతా ఏమీ తోచక వారిచుట్టూ మూగింది. శాస్త్రిగారు తెప్పరిల్లుకుని 'నాయనా, ఎంతో నొప్పించాను.' అన్నారు. నాకు తల కొట్టేసినంత పనయింది. 'నాది తప్పు...' అన్నాను. 'అబ్బే! నీ దేమి తప్పు లేదు. మద్రాసుకు మద్రాసే బీచిలో విరగబడగా లేనిది, నీవు వెళ్ళితే తప్పా? నేను అక్కడకు వచ్చినవారందరినీ శాసించగలిగానా?' అన్నారు. అంతటిది వారి ఔదార్యం.

తర్వాత తెలిసింది, వారు నా గదికి వెళ్లి, నన్ను అక్కడ కానక, సుబ్బరామయ్యగారింటికి వెదుక్కుంటూ వచ్చారని.

* * *

ఒకనాడు వారు ఆళవందార్ స్తోత్రం చదువుతున్నారు. ఆయన:

అవివేకఘనాంధదిఙ్ముఖే
బహుధా సంతతదుఃఖవర్షిణి,
భగవన్భవదుర్దినే పథః
స్ఖలితం మా మవలోకయాచ్యుత.
అమర్యాదః క్షుద్ర శ్చలమతి
రసూయాప్రసవభూః
కృతఘ్నో దుర్మానీ
వినయరహితో వంచనపరః
నృశంసః పాపిష్ఠః
కథ మహా మితో దుఃఖజలధేః
అపారా దుత్తీర్ణ
స్తవ పరిచరేయం చరణయోః.

'ఇదేమిటండీ వైష్ణవుల భక్తి మీ కెందుకు? మీ నిత్యత్వసిద్ధాంతానికి భంగకరం కాదూ?' అని ప్రశ్నించాను. 'ఒకప్పుడు ఆ సిద్ధాంతం దేశాన్ని ముందుకు తీసుకొనే పోయిందోయ్ హృదయాన్ని విప్పిచూపే ఈ స్తోత్రమంటే నాకు చాల ఇష్టం' అన్నారు శాస్త్రిగారు. 'ఎంతకూ వారు కూడా నిత్యత్వాన్ని గురించి ఆలోచించక పోలేదు, ఇతర వేదాంతులవలె కాక, దేహం భగవత్కైంకర్యం కోసమని, దాని అవసరం బాగా గుర్తించినవారు వైష్ణవులు. దేహం అపదార్థమంటూ ఎక్కడనో, ఏదో వుందని పాకులాడడం దేవతావస్త్రాలను మూర వేసిన మోసగాళ్ల చర్యవంటిది. నేహ నా నాస్తి కించన, ఇహైవామృత మశ్నుతే, అస్మిన్ లోకే ప్రతితిష్ఠాసీతి, అస్మిన్నేవ లోకే ప్రతితిష్ఠతి'—అనే వేదవాక్యాలు అమృతత్వమనేది ఈ లోకంలోనే పొందాలి గాని, ఎక్కడో తేలుమకుని పోతే లేదని నిరూపిస్తున్నాయి. ఈ దేహంలో ఇక్కడే నిత్యత్వం మా లక్ష్యం' అన్నారు. 'ఇంతవరకూ మరణం నిత్యంగా కనిపిస్తున్నదండీ!

మరి మీరు...' 'ఔనయ్యా, మాది వింత సంగతే. అదే జగగాలి. అప్పుడే కొత్త వ్యవస్థ ఏర్పడుతుంది' అన్నారు.

* * *

'పదిరోజులుగా ఎక్కడి వెళ్ళావు'? అని అడిగారు ఒకప్పుడు మా సహచరుని ఒక్కణ్ణి చూచి ఆయన. 'పరీక్షలండీ!' అన్నాడు మా సహచరుడు మరే మేమో అడిగారు; ఏవో సమాధానాలు చెప్పాడు మిత్రుడు. తల దిమ్ముగా వుంది. కాళ్ళు తేలిపోతున్నాయి ఆయనకు. 'ఇలాగే అవాకులూ చెవాకులూ వ్రాశావా పరీక్షలో?' అని అడిగారు. 'లేదండీ! బాగా వ్రాశాను', అన్నాడాయన. 'మరి, ఎందుకు మాటలు తడబడుతున్నాయి? తూలిపోతున్నావే?' అన్నారు. 'పదిరోజులుగా భోజనం లేదండీ!' అన్నాడు మిత్రుడు. 'మీ అమ్మకడుపు చల్లగా! ఎంత పనిచేశావయ్యా!' అని వెంటనే లేచి భోజనం పెట్టించి నిద్ర పొమ్మన్నారు. మర్నాడు ఉదయం 9-0 గంటలకు లేచాడు మిత్రుడు. దాదాపు పదహైదుగంటలు నిద్రపోయాడన్నమాట. సంగతంతా వారికి చెప్పాడు మర్నాడు మిత్రుడు. 'సరిగ్గా పరీక్ష వేళకు చేతిలో కానీ లేదు. పరీక్ష ఎనిమిదిరోజులూ నా మిత్రుడు ఉడిపి రామచంద్రరావుగారి హోటలులో ఉదయం రెండు ఇడ్డెనలు తిని నడిచి లయోలా కాలేజీకి వెళ్ళేవాణ్ని. రాత్రల్లా చదవడం. పరీక్ష నిన్న ముగిసింది. వచ్చాను.—' 'ఎందుకింత మొండితనం? నన్నడిగితే డబ్బు సర్దలేకపోయానా?' అని అడిగారు. మిత్రుడు ఏమీ జవాబు చెప్పలేకపోయాడు. 'మరొక రహస్యం చెప్పనా?' అన్నారు. 'సరే' అన్నాను. 'నీవు నా స్నేహితుడివి. సరే. నా మాటల్లో, నా చిత్తశుద్ధిలో నమ్మకముందిగదా?' అని అడిగారు. 'ఇదేమిటండి! నాకు భగవంతునిపై నమ్మకం లేకపోయినా, మీపైన, బుద్ధభగవానునిపైన సమానంగా భక్తి వుందండీ!' అన్నాడా మిత్రుడు. 'అయితే విను. ఈ వారం పదిరోజులూ నీకోసం ఎంత ఆందోళన పడ్డానని? ఎంత తిన్నా హరించుకుపోయేది. ఆకలి! ఆకలి! దయ్యపు తిండి. అంతా ఏమై పోతోందా అని ఆశ్చర్యపడ్డాను. నీ సంగతి చూచింతర్వాత అర్థమైంది. ఆ అన్నరసమంతా నీకు 'సప్లై' అయి నీకు వారంపాటు ధారకమైం' దని అన్నారు. వారు చెప్పినదాన్ని శాస్త్రీయంగా నిరూపించలేను గాని, ఆపన్నులపాలిటి అమృతభాండమైన వారి హృదయాన్ని తెలిసిన నేను వారిమాటలు నాడూ నమ్మాను, నేడూ నమ్ముతున్నాను.

* * *

తనకు సన్నిహితులందరూ నిప్పువలె వుండాలని శాస్త్రిగారి కోరిక. అలాగే జాగ్రత పడేవారు కూడా. కొన్ని సంవత్సరాలతర్వాత కనిపించాను. గుమ్మంలో అడుగు పెట్టడంతోటే 'పునరాయా స్మహోకషిః' అంటూ దూరంనుంచే 'ఆగు!' అన్నారు. ఆగి అక్కడినుంచే చేతులు జోడించా. దగ్గిరికి వచ్చి కిందినుంచి పైవరకూ తేరిపార జూచి 'ఒళ్ళు పాడు చేసుకున్నావా?' అని గద్దించారు. 'ఏ వుద్దేశంతో అడుగుతున్నారు?' అన్నాను. 'దినైకగ్రామంగా తెగ తిరిగావు గదా, ఏమేమి రంపులు తెచ్చిపెట్టుకున్నావో? తాగుడు, మరొకటి...'' ''తాగుడుమాత్రం — పరీక్షకోసం — రుచి చూచా' అన్నాను. 'అయితే మద్యం చాపి తవ ప్రియం?' అన్నారు ఛలోక్తిగా. 'అందరూ వేలంవెర్రిగా ఎగబడుతుంటే, ఎలా వుంటుందో చూద్దామని ఒక్కసారి...' అన్నాను. 'ఓహో! వెనకటికి నీలాటి జిజ్ఞాసువే. 'ఇచ్ఛా నాస్తి పరీక్షార్థం' అని ఏమో చేయబోయి...' అన్నారు. నేను పలకలేదు. 'అయితే నీమాట నమ్మమంటావా? రెండోదాని జోలికి పోలేదుగదా?' అన్నారు. 'నిజంగా లేదు' అన్నాను.

అంతటిది వారి శ్రద్ధ తనవారి శీలం విషయంలో.

* * *

'ఇలా రావమ్మా చూద్దాం గాని! పెద్దకోడలివి ఎలా వున్నావో!' అని పిలిచారు శాస్త్రిగారు నాభార్యను మొదట చూడగానే. తల్లితండ్రులు కోల్పోయిన ఆమెకు మరల వారిని చూచినట్టయింది. 'సిగ్గుపడకు తల్లీ. మీ ఆయన నాకు పెద్దకొడుకువంటివాడు సుమా!' అన్నారు. ఆమె దగ్గరికి వెళ్ళి నమస్కరించింది.

'ఏమోయ్! కోడలిని బాగా చూసుకో! నీ మొండితనం, మొరటుతనం చూపక' అన్నారు నన్ను చూచి. మా ఆవిడ మరింత సిగ్గుపడి వెళ్ళిపోబోయింది. 'ఉండవమ్మా! ఉండు! ఒక్క సంగతి అడుగుదామని వుంది. మీ ఆయన ధూర్తుడు. ఎప్పుడైనా కొట్టాడా? నన్నా

(తరువాయి 65 వ పుటలో)

**అముద్రితరచనలు :**

# అగుమంచికథ

(ప్రాచీనజానపదకావ్యము)

(శ్రీ వేటూరి ఆనందమూర్తిపరిష్కృతము)

(గతసంచిక తరువాయి)

--- * ---

తిరుమణినామాలు తిలకించి చూచి
గట్టిగా సేనల కదనాన జంపి
అడ్డావులకట్ట నముల చవికలో
నడ్డమై పెరుమాళ్లు లణగిరి లేవె.
పయనాలు కేపట పరగ యాదవుల
కాయొడ కలిగనో యక్కన్న! లేవె.
పంతాన మంగల్లిపాటి బయుళ్ళ
వంతు మీరినవీరభద్రు లందరునూ
కొత్తురు వరద లై నేడు ఖడ్గంబు
లత్తుకు మెరయంగ నణగిరి లేవె.
చ(చె)న్నుపాటి బయుళ్ళ సంపంగిదండ
చ(చె)న్నుని మెడనుండి క్షణములో తెగను
ధరపైన రాలేను తప్పక యిపుడు
అరయ నిద్దుర యేల నక్కన్న! లేవె.
జొత్తుర స్తంబున చోద్యంబు గాని
మత్తేభములు నూరు మడిసినవిధము
దిగులు లేకున్నావు తెలిపితి లేవె
అక్కన్న నిజవార్త లడుగుదు లేవె
మేటిశృంగారపూదోట ;నరికితె
ఘూటముగ మొగలికన్నె పువ్వులు
భూమిపై పడె రెండు పాలతిరో లేవె
వాడినపువ్వుల వాసనల్ కాశి
కడు వేగమే పోయె కాంతరో లేవె
మాచర్ల చెన్నుని మంటపముకడ
పాలినకంబము పడె భువిమీద
చాలించు నిద్రేల సఖియరో లేవె
సాక్షికై పొన్నూర సమ్మతి నున్న
దీక్షాగురుడు బాణదేవునిచేత
చక్రంబు తునియ లై సరిసగముగను
వక్రంబు లై నేల వ్రాలెను లేవె
కాలకంఠుని మేటికరములలోన
శూలంబు తునిగెను సుదతిరో లేవె
మగువరో! ఊడలమఱ్ఱి సగమున
పగవారు నరికిన పడిపోయె లేవె
తెగువతో సంగ్రామదేవుని ముందు
మొగమంటపములు విరిగి పడె లేవె
మదిరాక్షి! బెజవాడ మల్లప్ప చుట్టు
రుద్రాక్షతావళాల్ రూంతె లేవె
ఆదిదేవునిచేత నలరుశంఖంబు
పాదుకు ధరమీద పడి కూలె లేవె
మెండుగా నొరిగిరి మేదినిమీద
నిండెను విధి మీకు చెలతరో లేవె.
వారిధి యుప్పొంగి వన మెల్ల నిండి
యేరు లై పారెను యొరగడ్డపాట
సారెకు నిద్రేల సఖియరో లేవె
పొరిది నిప్పొడు మీద సూర్యుని చుట్టు
వలద గుడి గట్టి వాలెను లేవె
మూర్ఛిల్లి నిద్రలో మునిగితి వేమి?
కార్చిచ్చు దొనకొండ కాల్చెను లేవె
వెన్నెల పెరుమాళ్లు వెలయంగ భువిని
సన్నుతి కెక్కినజగదేకమౌళి
కొంచక లింగాలకొండపై నుండి
యుంచితముగ గూలె నతివరో లేవె
కాశివిశ్వేశుడు కడకతో నేడు
వాసిగా దొనకొండ వచ్చెను లేవె
తేరులు రథములు తెగువతో విరిగి
బారులు బారు లై పడియుండె లేవె
లంకాధిపతు లైనరాజులమీద
శంక లేకను పోరు చేసిరి వారు
అయోధ్యపతు లెల్ల నబ్ధిలో మునిగి
గాయొడ నేవస్తి నతివరో లేవె
గోపాలు డెత్తినకొండను దివికి
గోపాలుడే భువి గొబ్బున విడిచె
కాపేయు లందరు కల్లుగా చెల్లి
రాపద బుట్టెను అమ్మరో లేవె
ఏనుగ సింహాము నెదిరించి పోర
కన లేక వస్తి నక్కన్న లే లేవె
వాలవాలని వస్తి వనితరో! లేవె
రెక్కలతేజీలు రిత్త వోయినవి
అక్కన్న నిజవార్త లడుగుదు లేవె

పరమేశ్వరుడు తాను పంట పండింప
కోరు బట్టిరి యేట గొబ్బున లేవె
పనసపండ్లను యేట పలచిరి లేవె
వినగానివార్తలు విందువు లేవె
ఊచముట్టుగ నూరు లూరులే పోయె
పూచిన బూరుగ భూమి పెల్లగిలె.
వరిగెను పాలేట వార్తలు వినవె
విరివైనవృక్షాలు విరిగెను లేవె
గరుడడు పాముల కొరాడె లేవె
తరువుకొం గొచ్చిరి దనకొండ పైకి
కైలాసపైసాలు కలిగెను లేవె
శరవర్ష మట్లు దశమినాటినుండి
జోరున కురిసేను చోద్యమ్ము లేవె.
పెలగోల ఉరుదాళ్లు శివునకు నిచ్చి
పాలవెల్లి గోత్రము పాలేట నొరిగె
పైడుత్రజంద్యాలు పాలేట తేలి
మాయ మై పోయెను మగువరో! లేవె
దివినుండి దేవతల్ దీని భావించి
వివిధరథము లంపి రీవేళ లేవె
పాడ్యమి యుదయాన పైసాలు మనకు"
అని యిట్లు గొరువమ్మ అగుమంచి కపుడు
కానికలను జెప్పి గ్రక్కున గదలె
గొబ్బున తా నున్నకోవిల కపుడు

## అగుమంచి మేల్కొనుట

నిబ్బరపుకల గని నెలత యక్కన్న
కడు వేగ తా లేచె కడు దైన్యమునను
దడదడ మని తాను తల్లడ మంది
తత్తరంబున లేచి తమకంబుతోను
భీతిచే దాదుల బిలిచి యి ట్లనియె
కలకంఠులార గ్రక్కున మేలుకోరె
ఎలమిని దివ్వెలు వెలిగింప రారె
అక్కన్నమాటల కందఱు లేచి
గ్రక్కున దివ్వెలు కంభాల వెనుక
తప్పక వెలిగించి దాదు లందరును
చెప్పు మే మాయెనో చెలియ! మా కనిరి
దాదులారా! కంటి తమకంపు కలను
నిదుర లేపరటమ్మ నెలత కొమరమ్మ
అమరంగ దాదులు సతివేగ బోయి
కొమరమ్మకును దెల్పి గొబ్బున రాగ
తలచిక్కు బావి నటు తలపోసె నపుడు
యొలమితో కడవార్త లెరుగంగ జెప్పి
యప్పుడు పోయెను అక్కరో గంగ
తప్పక తనదయ దప్పె కాబోలు
కొర గానికల గని గొబ్బున పోయి
సిరిదేవి కాకల చెప్పంగ దలచి
"అమ్మన్నగరికి నంపవే నన్ను
యేమైన యిటువంటి నెరిగి చెప్పెదిని
యావులన్న వీరగంగ నడుగంగ వలయు
నేవార్త చెప్పనో వేగంబె యిపుడు
అంప నవధరింపు మత్తరో నీవు"
అంపించు కగుమంచి యతివేగిరమున
ధీమంతు చెల్లెలు దివిటి పట్టుకను
భామలు రాగాను బాజారు బట్టి
ఘనవేగముగ తాను కబురు చేయించి
'అయితన్న వచ్చెనే అమ్మ సిరిదేవి'
అయితన్న పేరున కబ్బుర పడుచు
దివ్వెలు వెలిగించి తేజంబుతోను
ఆవేళ కొలువున నమ్మ తా నుండె
అయితన్న కొ దాయె నగుమంచి వచ్చె
కూతురి రాకకు గొబ్బున తల్లి
భీతిల్లి కడపులో బెంగ తా జెందె
రాజుల చెల్లెలు రమణి యగుమంచి
తేజంబు మీఱగా నెరువున నడచి
నగరంబు వెల్వడి నయముగా నపుడు,
తగు నర్ధరాతిరి తల్లికై వచ్చె
కొండంత ధైర్యంబు కూలి యాతల్లి
మెం డైనశోకమ్ము మీరి యిట్లనియె
"నాతిరో! అక్కన్న! నాముద్దుపట్టి
నీతి కా దీవేళ నీకు రాదగునె
రాజు లేకనె నగరంబును వెడలి
రాజెల్లు నటవమ్మ రమణిరో! నీకు
మీయత్త కొమరమ్మ మేనవారనుచు
వీను మందుట నాకు విష మాయె నమ్మ
ఏప్రొద్దు నాడిక లెవరెవరితోడ!
తాసత్రయాపు మాట తలపోయనమ్మ
కలవారి యిండ్లను కడు పేదవారు
తెలియక వియ్యము నిల చేయరాదు
పుట్టింట నుం దని యూరివారలలో
నట్టిట్టు లాడునే యత్త కొమరక్క
అలవి గానివేళ నర్ధరాత్రాయె
ఫలితంబు తెలిసియు పడతి రా దగునె
ఏమివార్త అయిన నింత లే దనక
ఆమెతో చెప్పి నీ వంపించుకొన్న
ఆటుమీద నేమి మాటాడిన చెల్లు
మేనవారము మందెమేలమ్ము చేయు
మనవంటివారికి మరి నీతి కాదు"

అమ్మాకుమాటల కగుమంచి పల్కె
"నిర్మలం బై వస్తి నేరమ్ము లేల
పుచ్చుకొనిన యిండ్ల భోంచెయ్య లేదె
యిచ్చినవా రిండ్ల నిటువంటివేళ
కన్నవా రింటను కడు పచ్చడైన
అన్నము భోంచేతు రమ్మగో జనులు
మాయమ్మ యింటను మహాలెస్స గాను
వయికుంఠపయినాలు వచ్చి యుండగను
చెవులార విని నేను చెప్ప వచ్చితిని
నే వచ్చినపనికి నేరమ్ము లేదు
అత్తచే నంపించు కమ్మ నీ నగరు
కత్తర కల గాంచి తరలి వచ్చితిని"
కల యన్నయప్పుడే కొంత సిరిదేవి
సెలపాడువున నున్న నివ్వెర దీరి
"నోటితో నేమాట నుడువంగ భయము
తాటాకు మంట లౌ తల్లిగో మనకు
వానకు పిడుగులు వడ్డది నిజము
మానిని! తమకంపుమాటలే పిడుగు
లబ్బురపుకూతు రనుకొందు నిన్ను
గొబ్బున మృతి కాక కూతుర! నీవు
యిరువంశములవారి విషవాక్కులెల్ల
కూరుచు నుంటేవు కూతుర! నీవు
కల గన్నవార్త గ్రక్కున దెల్ప వమ్మ"
"అలాగె చెప్పేను అమ్మగో! నీకు
వివేక మెరిగిన వెలది కోడల్లు
ఆవులన్న గంగ నమ్మగో! పిలువు"
మక్కన్నమాటల కమ్మ సిరిదేవి
మక్కువ పిలిపించె మర్లవారి గంగ
'క్రమమున నగుమంచి కల గన్నవిధము
నమరంగ జెప్పవే ఆవులన్న గంగ!'
ఆమాటలకు గంగ యాడె నో మాట
యేమిమాటలు చెప్పె దెలనాగ! యిపుడు
గారవించి యిపుడు కల విప్ప నేర
వీరగంగమ మాట వినుము నిట్టనియె
నుందు రెండ రదేమి యో వీరగంగ!
ఛందస్సు దెలిసినసధ్యాని వీవు
దేవుడు ఆవులన్న దేవివి నీవు
దివ్యవిషయములు తెలియును నీకు
ముందర గుఱుతుగా మోదముతోడ
కండువ జెప్పితి గంగరో నీవు
గాజు విందులు మ్రోగ కారణ మడుగ
నిజముగ నామాట నిజమాయె నాడు
దక్షిణమున కలు తార్కాణ మాయె.
పచ్చల కంటులు బాగొప్ప మలసి
వనమాల గురికొండ్లు వచ్చి రీనాడు
వెనుక ముందర యిట్టు లెఱిగి యుండంగ
నడిగితి గాక మా కందర కనుకా
కడువేగ నున్నట్లు గంగగో! చెప్పు
సంతోష మగు నని సఖియతో గంగ
యంతట గూర్చుండె నక్కన్న చెంత
అక్కన్న కలరూపు నందరు వినగ
అక్కర కొమరక్క యాదవసతుల
నీతిగా పిలిపించె నెలత సిరిదేవి
బ్రీతిగా వచ్చిరి బంధు లందరును
కొమరక్క సిరిదేవి కొలువు దీర్పంగ
సోముని గోత్రాల సుదతు లందరును
కూతుళ్లు కోడండ్లు కొలువు దీర్పంగ
నతివేగ నాగంగ యగుమంచి బల్కె
యేమి స్వప్నము గంటి వేమి యగుమంచి
ఆమాట కగుమంచి యప్పు డిట్లనియె

## కల జెప్పుట-కల విప్పుట

క్రమముగ నక్కన కల జెప్పసాగె.
"అమరంగ మన యింటి ఆదెమ్మ గంగ
క్షేమమ్ము చెప్పేను చెప్పెద వినవె.
శ్రీ తాళ దిబ్బెము చిందెనే తల్లి
నెత్తురు గురిసెనే నే గన్నకలలు
కలరూపు యిటువలె కల్పి యుండంగ
పలుకవే యోగంగ చెలులు వినంగ
శ్రీ తాళ దిబ్బెము చిందినందులకు
భూతలమున కైనపుణ్యంబు చెల్లె
వామాక్షి! నెత్తురు వడి గురియుటకు
తమ బలభీములు తడిసేరు దాన
నీ రెండు కలలును నీలాగు నాయె
నిక నొకకల గంటి నింతిగో! గంగ
భీకరముగ కొండ పెల్లగిల్లుచును
ఉదయగిరికి ప్రక్క నొరుగ నే గంటి
అడుగొని తేజీలు నా కొండచుట్టు
మడియంగ కల గంటి మగువగో! గంగ
తడయక జెప్పుము తగు విధం బెట్లొ
అయిదు కొండలు విరిగినందుకు వినుడు
పయి వచ్చురిపులను బారుగ నరికి
చల్లవా రక్కడ సమయుకుంటేర
జల్లుల తేజీలు సమసినందులకు
వారిని గొలిచిన వారి వారంత
పోరాడి బల్లెపుపోట్లను దాకి
నాగలకొండను సమయుదురంతేర!

యిక నొక కల గంటి నిందీవరాక్షి !
ఆవులమందలు నటువలె బోయె
నీవల నలకొండ యొరగలి మండి
యేనుగ పీనుగై యింతలో సమసె
కానుగలు నొరుగ కల గంటి నమ్మ
యీ కన్నకలపాటు యెవరికి బడెనో
మాకు చెప్ప గదమ్మ మగువరో! గంగ
నల్లకొం డనుచోట నాతిరో వినవె
చల్ల గోసంగులు సమయంగ నగును
"మరియొక కల గంటి మగువరో! గంగ
చెరుకూరు చిలుకలమ్రి చేగువను
అడ్డావుకట్టను అమల చనికలో
విడిబడి పెనుమూళ్లు విరుగంగ గంటి
వీరగంగరో! కల వివరించవమ్మ.
నారసింహులం డిటు నలగుల యైతె
చెరలించి పగతుర చీకాకు పరచి
కరుణతో బాల్లావు కనకరథమున
బొందివైకుంఠమ్ము పోవంగ గంటి
గంగరో! యిక నొక కల వినవమ్మ
శృంగారపూదోట చక్కగా నరుక
కన్న పొంగలిపూలు కైవ్రాలె నమ్మ
వన్నెల పూవుల వాసన కాశి
విశ్వేశ్వరుడు బెట్టువిభూతిలోను
విశ్వరూపుల బోయి వెలయంగ గంటి
పూవు రాలుట యేమొ పోవుట యేమొ
ఆవులన్నకు గంగ! అటు విన్నవించు
అన్నల చెల్లెల! అక్కన్న వినవొ!
కన్నె పొంగలిపూలు కదనతేజమ్ము
శృంగారపూదోట సిరి దొనకొండ
రంగుగా దక్షిణరాజుల జంపి
ముమ్మయ్య పోచయ్య మునుపుగా చెల్లి
రమ్మలారా! భక్తిరన్న మే డెలిసె
నువిద! కాశీఫల మిచ్చిన మనకు
వివరమై తేజము విరుగబడుటకు
చేటున దొనకొండ చెముకల గంటి
విటు విన వో గంగ యింకొక్క కలయు
మాచెర్ల చెన్నని మంటపంబందు
వేసినకంభము విరుగంగ గంటి
నిక నొక కల గంటి నెలనాగ! వినవె
కాకాల్ని రాయుని కంఠమాలికలు
చేకొని రక్తాన చిక్కంగ గంటి
నీకల చెప్పవె యింతిరో నీవు
రాయుని తోమాల రమ్యమౌ వినుము

పాయక కరియాలపట్టభద్రుండు
తరిమి పగతురను తలలు ఖండించి
గుఱుతుగ నాటంగ గూలె నో యమ్మ.
మది యావులన్నయ్య మడియంగ గంటి.
మరియొక్క కల గంటి మగువరో గంగ!
పొన్నూరి భావన్న భుజము చక్రమ్ము
తునకలు తునకలై తునియంగ గంటి
చలమున వృక్షాలు సమయంగ గంటి
కల యొకరికి బడు గంగరో! నేడు
ధారుణి వృక్షాలు తగను చక్రంబు
నరకితో పరిగినచందంబు వినుడు
కొటూరు పన్నీల కల్లుగా జంపి
బట్టావుల రాజు బల్లేల నాటి
తక్కినమందలు తరుముచుండంగ
అక్కరో! పాలేటి మాతము కొబాలు
యిక నొక కలగంటి నింతిరో వినవె
కాలకంఠుని గుడి కంచుకంభమ్ము
నిలువున విరుగంగ నే గంటి నమ్మ
సరిపోను జెప్పవే సఖియరో! గంగ!
యోరుగంటి శివుని యొంటి స్తంభమ్ము
విరుగుట నిప్పుడు వీరు డైతన్న
పోరిపోరి శత్రుల పోరాడి చంపి
యెదురొమ్ము గాయాలు వీపున వెడలి
చెదరక సైతన్న చెల్లె నో యమ్మ
అయితన్న మహిమీద నటు చెల్లగాను
కయిలాసపయనాలు కంటి వోయమ్మ
వీరగంగమ జెప్ప విధ మెల్ల దెలిసి
ఆరాజు చెల్లెలు నప్పు డిట్లనియె
నిక నొక్క కల గంటి నింతిరో! వినవె
నిక్కముగ నా మాట నీవు చెప్పగదె
బెజవాడ మల్లప్ప వేయు రుద్రాక్ష
పెస రాలినందుకు వేడిరక్తాన
'కో' యని రిపులను కూలంగ నరికి
పెయ్యల యెర్రయ్య పృథివిపై నేడు
శరములు నాటంగ సమసెనో యక్క!
యీరీతి నున్నది యీ కలవిధము
మర్లవారి గంగ మా యొరనన్న
చెల్లింది పాలేట చెప్పిన క్షైతె
మందలు పోకుంటె మగువరో! గంగ!
నందుని వంశమూ నడువీథిలోన
యిక నొక్క కల గంటి నిందీవరాక్షి!
నిక్కముగా నామాట నీవు చెప్పగదె
చిత్తజునిరమణి శ(శ)ంఖమ్ము పగిలె

ముత్యపుచిప్పలై మునిగి రక్తాన
నొప్పుగా కలరూపు చెప్పవే గంగ!
చెప్పెద నీకల చెవి పెట్టి వినుము.
చిత్రజగురుచేతి శె(శ)ంఖంబు పగిలి
ముత్తెపుచిప్పలై మునిగినందులకు
చట్టువా రెర్రయ్య సమయంగ కలదు
పట్ట పేన్గుల నెల్ల బాగుగా నరికి
చట్టువా రెర్రయ్య సమయంగ గంటి
గట్టిగా గంగమ్మ కల జెప్పగాను
మాధవు చెల్లెలు మఱియు నిట్లనియె.
మదిరాక్షిరో! గంగ! మగదులవారు
కలవార లని మేము కడు పొంగినాము
చలపట్టి యెరుకమ్మ సంతోష మిప్పు
డుడుగ జేసె గదమ్మ యో వీరగంగ
మేడలు పండ్రెండు మెరసి పాలేట
వడివడి ముక్కలై విరిగి పాలేట
నేరులచందాన నేగంగ గంటి
వీరగంగమకల వివర మెట్లుండె
విరి వైన మేడలు విరిగి నందులకు
కరులతో బోరాడి కండలు విరిసి
బసువన్న యెద్దులు పాలేటివెంట
పస చెడి పోవున్న పడతిరో నేడు
విధ మెల్ల గణ్ణించి వివరింపగాను
మాధవు చెల్లెలు మఱియు నిట్లనియె
నేమి సేయుదు మమ్మ యెద్దు చెల్లంగ
సోమకు లమ్ముట సురియల పాలు
యిక నొక కల గంటి నింతిరో! వినవె
నిజముగా నామాట నీవు చెప్పగదె
కళ్యాణ బసువన్న ఘనకిరీటమ్ము
బలు వైనబంగారుపని కిరీటమ్ము
నడిమికి రెండుగా నరికిన ట్లయ్యె
వడి దప్పి రక్తాన వరిగిన ట్లయ్యె
కల యెవరికి బడు కాంతరో గంగ
నెలకొని యీకల నిలుకడగాను
చెప్పెద నక్కన్న చేకొని వినుము.
వప్పైన కంతసోముని వజ్రకిరీటము
విరిగి రక్తములోన వీడినందులకు
సరసుడు సుగుణుడు సత్యవాక్యుండు
పశుపట్టభద్రుండు భవ్యశీలుండు
కుసుమశరీరుండు గోపోషకుండు
శ్రీమంతుడును వజ్రసింహాసనుండు
కామితార్థము లిచ్చుకరుణామయుండు
పక్షి, కెక్కినవాని పాదసేవకుడు
దక్షిణరాజుల తలలు ఖండించి
వక్షాన పగవారి వజ్రాలు నాటి
వజ్రాల తనుకాన వరిగ నో యమ్మ!
నిజవార్త రేపట నిలుచు నో యమ్మ!
మచ్చికతో గంగ మాటలు వినియు
మచ్చిక లానుచు మఱియు నిట్లనియె.
ఆవులన్నకు చెల్లె హరహరా యనుచు
రవితేజవరు డైనరాజశేఖరుడు
గోపాలుడౌ రాజు గోరక్షకుండు
మాపాల కలిగిన మాసోదరుండు
ఆవార్త నిజమేని యప్పుడె రావె
దేవలోకమునుండి దివ్యరథములు
లింగాలకొండపై శిలతో నుండి
పొంగుచు సందర పూన్కి దోడ్కొనుచు
సిరి మించు దొనకొండ చిమ్మలపాలై
పురహూత లోకమ్ము పొందకుండుదురె
చందనగంధులు సమయకుండురె
కందువ నిక నొక్క కల జెప్పె వినవె
నాదిండ్ల నిలయుని నవరత్నమాల
పాదుకు ధరమీద పడగ గల గంటి
వీరగంగమ! కల వివరించవమ్మ!
మరిపీకు చెల్లెలా! యోయమ్మ! వినుము.
వింటి కర్జును డగు విప్పర్ల సింహము
కంటకరిపులను కల్లుగా జంపె
బల్లిదుని కెదురొమ్ము బల్లెలు నాటి
యాల పద్మనాయకు నవనిపై వరిగె
నిట్లయి యున్నది యీ కలరూపు
పోట్లతో రాఘవుడు భువిపైన నొరుగ
పదముల దొనకొండ స్వర్గలోకమునకు
బుధవారమున కేము పోవలె కాన
వినవమ్మ గంగమ్మ వే ఱొక్క కలయు
వనజనాభుని మేన వనకు సొం పెల్ల
కనుగొన నసిబోను కల గంటి నమ్మ
మునుకొని యీకల ముచ్చట వినవో
భావించి యీకల భద్రసేనుండు
రవితేజు పలికొండ రఘుపతి కగును
అల చెరుకూరిలో నంటిన పోట్లు
బాలరాజులు వారు పాలేట చెల్లి
కాలము చేరు వై ప్రాలకుంతేర
అల తేజు జూపెడి యా సూర్యునకును
చుట్టు వరద గుడి చుట్టంగ గంటి
నెట్టు లౌనో కల వివరింప వమ్మ!
ఉదయమున నావుల మందల చుట్టి

కదలక పాడిచేటికల గంటి నమ్మ
యిక నొక్క కల గంటి నెలనాగ! నేను
నిక్కముగా నామాట నీవు చెప్పగదె
శ్రీరాము డెక్కెటిసింహాసనమ్ము
వారిధి రక్తాన వరుగంగ గంటి
తెగువలో కాటయ్య దేవేంద్రతమకము
పగవారు నరికిన పడక యుండీన
పాడయి దొనకొండ పాడు కానున్న
గంగరో! యిక నొక్క కల గంటి నమ్మ!
నల్లచెరువు తూము తెల్లను విరిగి
నెలబంటి దొనకొండ ముంచంగ గంటి
రక్షకు డావులన్న రమణిగో గంగ!
యెటువలె నున్నదో యెరిగింపవమ్మ
పగవారిచేతను పశుపతి మడియ
పుణ్యంపునీరాడ పోగద్దు మనకు
నెలతరో పుణ్యంపునీ రాడినపుడె
మలయుచు దొనకొండ మంట లయ్యాని
విను వీరగంగరో! వివరంబు గాను
కనక మేడలు కాలి కంభాలు విరిగి
కటకటా! పాపన్న కాలకుండీన
మంటలో చెలెలు మడియకుండీన
చెల్లెలుమాటకు శిరమును వంచి
జలజల కన్నీరు జారంగ నేడ్చె.
కనక మేడలు కాలి కాలెనా చెల్లె
లన్నియు నీలాగు నాయెనా తల్లి
యిందర మొకటిగా నింద్రలోకముకు
అంద మై పోవలె నతివేడ్కతోను
కడసారి కల విను గంగరో నీవు
బసువన్న యిట తుర్తువార్తలు గొంచు
శంకరుం డిచటికి జయవార్త గొంచు
అంకెలు వేయుచు రాగాను గంటి.
కాగలవార్తలు కలలుగా వచ్చె
ఆవార్త పరిణామ మటు చెల్లి రంచు
దేవదేవుం డిదే తెలుపంగ వచ్చె.
తెల్లవారగ వచ్చె తెలియంగ లేవె
కాలము చేర్వయ్యె గ్రక్కున లేవె
కల నెంచి యగుపించి ఘన వీరగంగ
కల జెప్ప కల విప్ప కడు తెల్లవారె
నుదయాద్రిశిఖరాన నుదయించె నినుఁడు.

అసంపూర్ణము

## చెలికాని సీతారామయ్య

సీ. తనసత్యవచనంబు ధరణీసురుల కెల్ల
శ్రీవిష్ణుపరముగా స్థిరము సేయఁ
దనకృపారసము బాంధవలోకమున కెల్ల
విబుధాపగోర్మిగా వేడ్క సేయఁ
దనదాన మఖిలవిద్వజ్జనంబుల కెల్ల
ధారాధరంబుగాఁ దనివిఁ జేయఁ
దనదర్శనం బెల్ల ధర దీనజనులకు
మందారశాఖ యై మహిమ నొంద
గీ. ..............................

పుడమిఁ జెలికానివంశాబ్ధిపూర్ణచంద్ర!
భవ్యగుణసాంద్ర! సీరామపండితేంద్ర!

—:o:—

(24 వ పుట తరువాయి)

భాషావాఙ్మయములను, లలితకళలను పోషించిన కళోపాసకులు. ఈ తమిళ రాజులలో పేర్కొనదగినవాడు కరికాలచోళుడు. ఇతడు కావేరి నది ఇరుప్రక్కల గట్లుపోయించి తనరాజ్యమును కివెల్లువనుండి సంరక్షించి ప్రజారంజక పరిపాలకు డనిపించుకొనెను. ఉత్తరాపథమునందలి యార్య భూపతుల నితడు జయించినట్లు తమిళులు నుడువుదురు. ఈ తమిళ రాజు లెప్పుడును తమలో తాము కలహించుకొనుచుండిరి. మిత్రత యనునది వారిలో మృగ్యమై యుండెను.

తమిళ రాజుల పరిపాలనా కాలమునందు కావేరీపట్టణము, మధురానగరము మొదలైన కొన్ని పట్టణములు సిరిసంపదలతో తులదూగుచుండినట్లు తెలియవచ్చుచున్నది. కావేరీపట్టణము ప్రసిద్ధ నౌకాశ్రయము. దూరదేశముల నుండి కూడ నచ్చటికి నౌకలు వచ్చుచుండెనట! ఆ నగరమున విభిన్న భాషలు మాటలాడు వారెందరో యుండిరి. చాతుర్వర్ణ్యముల వారును, భోగస్త్రీలును వేశ్యావీథులలో నివసించుచుండిరి. మధురానగర మందలి వీథులు దీర్ఘములు; విశాలములును. అందు సుందరోద్యానములును, తోటలును పెక్కు లుండెను. యవనభటు లానగర రక్షణమునకై నియోగింపబడి యుండిరట.

ఆనాటి తమిళ సంఘమునందు ధనికులు, వణిక్ప్రవరులు నైన వైశ్యశిఖామణులకు విశేష గౌరవ మున్నట్లు స్పష్టముగ తెలియుచున్నది. వారి భవనములు రాజమందిరములను గూడ తలదన్నుచుండెను. తమిళ పంచకావ్యము లందు వీరి ప్రశంస మిక్కుటముగ కానవచ్చుచున్నది. వారిలో బాల్యవివాహములే తఱచు జరుగుచుండె నని చెప్పనగును. కోవలుని వివాహము వేదోక్తముగ జరగెను. అగ్నిసాక్షికముగా కణ్ణకిని వివాహమాడె ననియు, పిమ్మట వారు అరుంధతీదర్శనము గావించిరనియు తెలియుచున్నది. బ్రాహ్మణులకుగూడ సంఘమునందు గౌరవప్రపత్తు లున్నట్లు తెలియుచున్నది. కొందఱు బ్రాహ్మణు లానాడే వేదాధ్యయనమును విడనాడి నృత్త గీతాదులకు గడంగిరి. నాడు వేశ్యాగమనము సర్వవర్ణములవారికిని పరిపాటిగ నుండెను. వేశ్యలు నృత్తగీతాది కళలందు విదుషీమణులై వార్తకెక్కియుండిరి. సంసారస్త్రీలు నృత్త గీతాదులను నేర్చియున్నట్లు తెలియవచ్చుట లేదు.

ఆ కాలములో స్త్రీలుకూడ సన్న్యాసాశ్రమమును స్వీకరించుచుండిరి. పాతివ్రత్యమే స్త్రీలకు ముఖ్యధర్మముగ నుండెను. నోములు నోచుట, తీర్థములలో క్రుంకులిడుట మొదలైనవి ప్రచారములో నుండెను. కాని భర్తృసేవానిరతియే స్త్రీలకు సద్గతి ప్రసాదించు నను విశ్వాసము బహుళప్రచారములో నుండెను. అప్పటికే ఆర్యదేశి యనుభేదములు తమిళనాడులో వ్యాపించి యుండెను. సంగీత సరస్వతి యగు మాధవి కరికాలచోళుని సభామండపమున తొలుత దేశి నాట్యము గావించి పిమ్మట ఆర్యనృత్యము గావించె నని సిలప్పదిగారము నుడువుచున్నది. ఆ కావ్యమునందు అరంగేట్రుగాదై కను మనోజ్ఞముగ నభివర్ణితమై యున్నది. అరంగేట్రు గాదై అనగా రంగాధిరోహణ మహోత్సవము. ఈ యుత్సవమునందు సంగీత నాట్యాచార్యులు, మార్దంగికుడు, వైణికుడు, కవి మున్నగువారు పాల్గొనుచుండిరి. పర్వతప్రాంతములందు కురవ యను దేశినాట్యవిశేషము ప్రచారములో నుండెను.

కర్షకులుకూడ సంఘములో గౌరవాదరాభిమానములు పొందుచుండిరి. శిల్పులు, చిత్రకారులు మున్నగు కళాకారులకుగూడ గౌరవాదరము లుండెను. నిర్ధనులు మట్టిగోడల యిండ్లలో నివసించుచుండిరి. ఇండ్ల కప్పులకు వారు బోదకసవు, తాటియాకులు, కొబ్బరియాకులు మున్నగువాని నుపయోగించుచుండిరి. గోడల కెఱ్ఱమన్ను పూయుచుండిరి. మధ్యతరగతులవారి యిండ్లు ఇటికతో కట్టబడి యుండెను. గవాక్షములు జింకకన్నుల యాకృతులలో పెట్టబడుచుండెను.

ఆ నాళ్ళలో తమిళదేశమునందు జైన బౌద్ధమతము లుచ్ఛదశలో నుండె నని వేఱుగ వ్రాయ నవసరములేదు. అయినను శైవ వైష్ణవములుకూడ ప్రచారములో నుండెను. శక్త్యారాధన, జంతుబలులు మొదలగునవికూడ వ్యాప్తిలో నుండె నని తెలియుచున్నది. ఇన్నిమతము లున్నను తమిళులలో మతకలహము లున్నట్లు కానరావు. కావేరీపట్టణమునందు శివకేశవాలయములు, కుమారస్వామికోవెల, ఇంద్రాలయము,

కృష్ణబలరాముల మందిరములు, జైన బౌద్ధ విహారము లుండెను. కుటుంబములోనివా రెల్లరు నానేకమతమును స్వీకరింపవలయు నను నియతి లేదని చెప్పవచ్చును. ఇంద్రోత్సవ మానాడు మహావైభవముగా జరుగుచుండెను. ఆ యుత్సవ సమయమున ఇంద్రాదిదేవత లెల్లరు నా పట్టణమునకు వచ్చుచుండి రని యైతిహ్యము. శకునములందును, జ్యోతిషశాస్త్రమునందును, పునర్జన్మకర్మ సిద్ధాంతము లందును టిప్రజకు విశ్వాస ముండెను.

మణిమేఖల కథాకాలమునాటికి మృతశరీరులకు దహనసంస్కారమొనర్చు నాచారము తమిళనాడులో వ్యాపించియుండె నని చెప్పనగును. కొందఱు మృతకళేబరములను ఖననము చేయుచుండిరి. ఇంకను కొందఱు వానిని గ్రద్దలకు నక్కలకు నాహారముగా బహిరంగప్రదేశములం దుంచెడివారు. మఱికొందఱు పెద్ద పెద్ద మట్టికుండలలో (తాழி) శవములనుంచి వానిని భూమిలో పూడ్చుచుండిరి. ఇటుల జైన బౌద్ధులయుగమునందు వెలుగులోనికి వచ్చిన కావ్యములు సంఘజీవన దర్పణములుగా ప్రతిభాసించుచున్న వని పేర్కొనదగును.[1]

ఇక సిలప్పదికారమునందలి కణ్ణకినిగుఱించి రెండుమాటలు నుడువవలసియున్నది. సతీదేవి యని ప్రతీతికెక్కిన యీమెకు కోవెలలు పలుతావుల తమిళనాడులో వెలసినవి. ఈ యాలయములకు సతీదేవ్యాలయము లనిపేరు. సింహళములోగూడ గజబాహు వనురాజు సతీదేవ్యాలయ మొకటి నిర్మించెను. కాని యీ కోవెలలు నేడు ద్రౌపదీదేవ్యాలయము లను పేరున వ్యవహరింపబడుచున్నవి. తెలుగుదేశములో గూడ సతీదేవ్యాలయ మొకటి వెలసెననియు, దానిని కనకమహాలక్ష్మి గుడి యని పేర్కొనుచున్నా రనియు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి యభిప్రాయము. ఈ గుడి విశాఖపట్టణములో గలదట! విజయవాడలోని కనకదుర్గ గుడికూడ కణ్ణకికోవెల కావచ్చు ననియు కణ్ణకి కనకలక్ష్మి యయినప్పుడు కనకదుర్గ కూడ కాదగు ననియు శ్రీ తిరుమల రామచంద్రగారు తలచుచున్నారు. ఈ విషయమున పర్యాప్తమైన పరిశీలనము జరగవలసియున్నది.

ఉపసంహారముగా, జైన బౌద్ధుల యుగమునందు వెల్వడిన కావ్యములలో సంస్కృత శబ్దములు, ఆర్యగాథలు మున్నగునవి కొల్లలుగ ప్రవేశించినవని చెప్పదగును. అనగా జైన బౌద్ధుల కాలమున తమిళనాడులో గూడ సంస్కృతవాఙ్మయము బహుళ ప్రచారము గడించెనన్నమాట! అయినను జైనబౌద్ధులు సంతరించిన కావ్యములకు తమిళ పంచకావ్యయశస్సు కలుగుట గమనార్హము!

మద్దూరి దీక్షితులు

క. నడురేయి నన్ను మడిగినఁ
బుడిసిటిలో నెయ్యిఁ బోసి పొర్లెత్తంగాఁ
గడుపారఁ బెట్టి తేర్చును
విడువక యెల్లప్పు డిట్టివితరణి యేఁడీ!

1. చూడుడు : 'తమిళపంచకావ్యకథల'

Edited and Published by T. Ramachandra, 2/583 Pycrofts Road, Madras 5.
Printed by G. Bhavanarayana at the Weldun Press, 146, T. H. Road, Madras-21.

(56 వ పుట తరువాయి)

అప్పుడప్పుడు కొట్టవస్తాడు లే' అన్నారు. 'లేవండీ! కొట్టరండీ' అన్నది ఆవిడ. 'కొట్టాడంటే కొద్దిముక్క వ్రాసి పడేయి. నాట్ పెయిడ్ అయినా సరే. నేను వెంటనే బండెక్కి వస్తా. గులాబి పింకులా. నా కెంపు కాశ్రవు. నా ఎదుట నీవే అపని చేద్దువు గాని' అన్నారు.

* * *

ఒక రోజు ఏదో గోష్ఠి సాగుతున్నది. వేములవాడ భీమకవి ప్రస్తావన వచ్చింది. 'కోమటి కొక్కటిచ్చిపది గొన్నను దోసము లేదు.' అన్న పద్యం చదివారు మాలో ఒకరు. 'కోమటి కొక్క టీక పది గొన్నను దోసము లేదు' అని దీనికి అపవాదశాస్త్రం మరొక టుందండీ. అని మరొక మిత్రు డన్నాడు. 'అయితే మన శెట్టి గారి సంగ తేమి టండీ?' అన్నాడు ఒక రంటె రోనంగి — శెట్టి గారంటే శ్రీ కంభంపాటి సత్యనారాయణ శ్రేష్ఠి గా రన్న మాట — 'మన శెట్టి గారిది వెన్నపూస వ్యాపారం కదూ? ఆయన మనసు కూడ వెన్న వంటిదే. మరి ఆయన విషయంలో వేములవాడ భీమకవి పద్యం ఉల్టాగా చదవవలసి వుంటుంది. అంటే శెట్టి గారికే పదిచ్చి ఒక్కటి కొనవలసి వుంటుంది' అన్నారు. శాస్త్రిగారు. 'అయితే—' అని మరొక మిత్రుడు ఏదో అనబోయాడు. శాస్త్రి గారు అడ్డువచ్చి 'ఇంతకూ కుల మేమి టోయ్! ఆ బూజు పట్టిన వ్యాపారస్థుల కులంలో నేగా గాంధీజీ వంటి మహాపురుషుడు అవతరించాడు! అలాటి వారు వేయేళ్ల కొకసారి ఏకులాల్లో అవతరించినా, అటు వేయితరాలూ, ఇటు వేయి తరాలూ, తరించా యన్న మాటే...' అంటుండగా ఆయన కళ్లు చెమ్మగిల్లాయి.

* * *

'ఈ పూట ఇక్కడే భోజనం చేయవోయ్' అన్నారు శాస్త్రిగారు ఒక రోజు. వడ్డన జరిగింది. 'రావోయ్, మస్తాన్, కూర్చో భోజనానికి' అని ఒక వ్యక్తిని పిలిచారు. కసరత్ చేసి కండలు తీరిన మేనితీరు గల విద్వాన్ షేక్ మస్తాన్ గారు నాపక్కనే తిష్ఠ వేశారు. 'ఏమిటి? నీ వైష్ణవానికి భంగం కలిగిందా!' అని ప్రశ్నించారు. లేదండీ. మాకు బీబీ నాంచారు వుండనే వుందిగా' అన్నాను. సపంక్తి వా రందరూ గొల్లు మని నవ్వారు. 'అయితే నా కన్నా రెండాకులు ఎక్కువే చదివా వన్న మాట!' అన్నారు. ఆయన భోజనం సాగుతున్నది. 'మస్తానుగారి సంగతి సరే, ఇక్కడ ప్రైవేటుగా విద్వాన్ పరీక్షకు చదువుతున్నారు. తక్కిన ముస్లిం విద్యార్థులకు తిరుపతి ఓరియంటల్ కాలేజీలో ప్రవేశం దొరకితే బాగుండు' అన్నారు మాలో ఒకరు. శాస్త్రిగారు వెంటనే 'ఔనౌను. నేడు పర్షియావారు, ఆఫ్ఘన్ పఠానులు సంస్కృతం చదవగా లేనిది, మనదేశపు ముస్లిములకా వచ్చిందా నిర్బంధం? ఇంతకూ కాశీ విశ్వవిద్యాలయం సంస్కృతశాఖాధ్యక్షుడు ముస్లిం. తప్పకుండా ముస్లిములకు ఈ కాలేజీలో ప్రవేశం దొరకవలసిందే' అన్నారు. వారికి ఈ సంకల్పం ఏ సుముహూర్తంలో పుట్టిందో? ప్రయత్నాలు జరిగాయి. సంకల్పసిద్ధి మాత్రం ఆయన నిర్యాణం తర్వాత కలిగింది. ఆయన పేరు సంస్మరిస్తూ నేడు పలువురు ముస్లిం సోదరులు తిరుపతి ఓరియంటల్ కాలేజీలో విద్వాన్ తరగతి చదువుతున్నారు. ఈ సంప్రదాయం అవిచ్ఛిన్నంగా కొనసాగుతుంది.

మృత్యువిజయంతో పాటు మావంటి వారిలోని అమానుష ప్రవృత్తిని జయించడం కూడ శాస్త్రిగారి కొక సమస్య. వారి ఆయుర్దాయంలో ఎక్కువభాగ మా అమానుష ప్రవృత్తే మింగివేసిం దేమో! తుదకు మిగిలిన కాస్తను పొంచి వున్న మృత్యువు చప్పరించింది.

'తుదకు నిన్ను జయించె
మృత్యువు మహాత్మ!'

—రామచంద్ర.

సంవత్సరం చందా : ఆరు రూపాయలు



ప్రాప్తిస్థానము

కార్యదర్శి,
భాషా సేవక సమితి,
2/583, పై క్రాఫ్ట్స్ రోడ్,
తిరువల్లికేణి, మద్రాసు-5.



# పరిశోధన

(సారస్వత ద్వైమాస పత్రిక)

## పాల్కురికి సోమనాథ సంచిక

*Approved for the use of all Libraries*

### EXTRACTS FROM THE PROCEEDINGS OF THE DIRECTOR OF PUBLIC INSTRUCTION, ANDHRA, MADRAS.

*Dis. No. 2505/55* *Dated : 24-8-55.*

---

The following journal is commended for use in the libraries of schools, Colleges and Public Libraries.

Name : A Bi-monthly journal entitled 'Parisodhana' devoted to Research of Indology.

Price : Rs. 1/- per copy. (Annual subscription Rs. 6/-) The journal can be had from Sri T. Ramachandra, Editor, Parisodhana, 2/583, Pycrofts Road, Triplicane, Madras-5.

* * *

**K. RAGHAVA REDDY,**
*For Director of Public Instruction.*

మన్మథ - వర్షర్తు, శరత్తు

**9,10**

ఆగష్టు-సెప్టెంబర్,
అక్టోబర్-నవంబరు 1955

ఒక రూపాయ



# అనుక్రమణిక

—



**సూచన :**

పరిశోధన హేమంత సంచిక ప్రముఖుల వ్యాసాలతో శ్రీ గురజాడ అప్పారాయ సంస్మరణ సంచికగా వెలువడుతుంది.

**-మేనేజర్**




సంపుటి 2. సంచిక 3,

సంపాదకుడు : తిరుమల రామచంద్ర

సంయుక్తసంపాదకుడు : తిమ్మావజ్ఝల కోదండరామయ్య

# మనవి మాటలు

తెలుగు తల్లికన్న తొలికవీ, జేజేలు !

ఆ నాడు వాల్మీకికి కలిగిన శోకం వైదికమైన అనుష్టుప్ ఛందో రూపంలో ఆదికావ్యమై అవతరించినట్లు, నీ హృదయంలో పెల్లుబికిన భక్తి తెలుగు జాతి జీవితరాగమైన సుందర దేశిఛ్ఛందస్సులో తొలితెలుగు కావ్యంగా-బసవ పురాణంగా-అవతరించినది. ఆ దేశి ఛందస్సును వైదిక ద్విపదతో సాటిగా ద్విపద అనినావు.

నీ కవితా వస్తువు రాజుల, రారాజుల చరితలు కాదు; చతుష్షష్టి శీల సంపన్నుడవు కదా-శీల సౌభాగ్యం, భక్తిసంపత్తి నిండారిన మడివాలు మాచయ్యల, బొంతల శంకరదాసుల జీవిత ఘట్టాలే. ఛందమునందే కాక వస్తుపరిగ్రహణంలోను నీ మౌలికతతో తర్వాతివారికి ఒరవడి పెట్టినావు.

నీవు చెప్పినదెల్ల అపూర్వమే. బసవని వివిధ రీతుల పొగడినావు: ఆ పొగడికలు శతకసాహిత్యానికి బ్రతుకుగా, ఉదాహరణ వాఙ్మయానికి ఉదాహరణగా గద్యలకు కొలబద్దగా, వచనాలకు ప్రవచనంగా, జీవిత చరిత్రలకు జీవితంగా పరిణమించినవి. నీకు సారస్వత ప్రపంచంలో సాటి రాగలవాడొక్క ఆచార్య హేమచంద్రుడే.

నీ జన్మతో పవిత్రమైన తెలంగాణా తెలుగు నాడుకు తలమానికమౌతున్న నేడు మరొకమారు నీకు జేజేలు !

పదాల పుట్టుపూర్వోత్తరాలు :

# పాల్కురికి సోమనాథుని భాష

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు

ఆంధ్రభాషా వాఙ్మయ పరిణామచరిత్రలో పాల్కురికి సోమనాథుడు, అతని రచనలు ఒకముఖ్య ఘట్టముగా నేర్పడును. వాని ప్రాముఖ్యము వాని విలక్షణత్వమునుబట్టియే కలిగినదనవచ్చును. ఏమిటా విలక్షణత్వమన-అప్పటి దేశ కాలపరిసితులలో మనకు తెలిసిన దానిని బట్టి చూచిన,అతనివిషయమంతయు విలక్షణమే అనిపించుచున్నది. అతడొక బ్రాహ్మణకుటుంబమున పుట్టినాడు. వేదముల పరిజ్ఞానముబాగా కలిగినవాడు. దేశమున నన్నయాదుల కాలమునుండి బాగా వెల్లుపారుతున్నది వైదికమతము. అట్టి పరిసితులలో కన్నడదేశమునుండి పొంగిపొరలి యీదేశమున పారజొచ్చిన అవైదిక వీరశైవ మతము నవలంబించి-బ్రాహ్మణులను, వేదములను,వైదికమతాచారములను తనరచనలలో తెగ తిట్టుటకు సిద్ధపడినాడు. నన్నయాదుల కాలమునుండి సంస్కృతభాషాభిమానము, కావ్యాదులను దెనిగించుట, సంస్కృతవృత్తాదుల సంగ్రహణము, ఆరూఢగద్యాది సంస్కృత భూయిష్ఠరచన, పండితలోకములో సామాన్యముగా నాదరింపబడిన దగుచుండగా, నీతడు వచ్చి—ప్రాచీనపురాణములను వదలి-ఆధునికుడగు బసవనిపురాణమును రచించినాడు-సంస్కృతవృత్తాదులను వదలి-ద్విపదలలో రచనచేసినాడు. సంస్కృత భూయిష్ఠరచన—సర్వసామాన్యము గాదని తెగడుచు— తేటతెనుంగుమాటలతో తన రచన సాగించినాడు. ఈ ద్విపదరచనలే కాదు. దీనితోపాటు ఈతని రచనలన్నియు గూడ అంతకు పూర్వము నన్నయాదు లవలంబించి ప్రవేశపెట్టిన సంస్కృత, సంస్కార భూయిష్ఠంబగు మార్గ ఫక్కికి భిన్నములై దేశీయఫక్కి ననుసరించిన వైనట్లు స్పష్టముగా దెలియుచున్నది. ఈతని కించుక పూర్వుడే యాన దగిన నన్నిచోడుడు తనకాలముననె—దేశి మార్గంబులను-దేశీయములను గాజేసి, వరకవీశ్వరుడైనవాడు- తెలుగుకవిత్వము జెప్పవలసినదని హెచ్చరింప వలసినవాడై నాడనిన—అతని కాలముననె తెలుగు కవిత్వముపై సంస్కృత సంస్కార ప్రాభవము హెచ్చుగుచున్నదని, దేశీయు లగు తెలుగు కవులలో నొకయభిప్రాయ మేర్పడియున్నదనియు, తెలుగుపై గలుగుచున్న అట్టి సంస్కృత ప్రాభవముపైగల నిరసన భావమును (తాను వాస్తవముగా సంస్కృత లక్షణమునె హెచ్చుగా నుపయోగించిన వాడైనను) సూచించుటకే అతడు "దేశిఫక్కి" నంతగా ప్రశంసించినాడనియు నూహింపవలసియున్నది. ఈ విషయమె సోమనాథుడు

"ఉరుతర గద్యపద్యోక్తులకంటె
సరసమైపరగిన జానుతెనుంగు
కూర్చెద ద్విపదల కోర్కె దైవార
ఆరూఢగద్య పద్యాది ప్రబంధ
పూరితి సంస్కృతభూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబు గామి—"
జానుతెనుగు విశేషము ప్రసన్నతకు"

అని'వాచా'—స్పష్టముచేసి-తన భాషా రచనారీతులయందు-ఆ దేశిఫక్కినె యవలంబించి చూపినాడు. అనగా ఆకాలమున నన్నయ భారతరచన తరువాత-తెలుగుకవిత్వములో—మార్గ-దేశి రచనా విధానముల కొకవిధమైన పోటీ ఉండెడి దన్నమాట. నన్నయ తెలుగు కవితలో ప్రవేశపెట్టిన విధానముపై—దేశమున కొన్ని ప్రాంతములం దొకవిధమగు తిరుగుబాటు—(నిరసభావము) ఏర్పడినదని తలంపవచ్చును. దానికి కాలము కర్మము సమకూడుటచే-పాల్కురికి సోమనయం దా తిరుగుబాటు భావము కేంద్రీకరించి—మతవిషయమునను, సాహితీరీతుల విషయమునను, సాహిత్యవస్తువు విషయమునను గూడ, మార్గఫక్కి కీతనిని ప్రతిభటునిగా జేసి నిలువబెట్టినది.

భాషా విషయములో అతని సంస్కృత

భూయిష్ఠరచనకు ప్రతిగా నీతడు జానుతెనుగు చేపట్టినాడుగదా. మతమున-ఆతని త్రిపురుషాదిక పూజావిధానము, జపహోమతత్పరత్వము మొదలగువానితో గూడిన వైదికమతమునకు బదులుగా-అవైదిక వీరశైవమును చేపట్టినాడు గదా. శిష్టపండిత లోకమును-సత్సభాంతర సరసీవనంబులను-ఆసభల కధిపతులై—"హిమకరుదొట్టి పూరు భరతేశుల" వంశకర్తలనుగా జెప్పుకొని-అమల సువర్ణశృంగయుతకపిలగోశతంబు దానమిచ్చిన ఫలంబు భారత శ్రవణంబున గల్గుననితలంచి భారత శ్రవణాభిరతులైన-రాజన్యులను మెప్పించుటకుగాక-శైవమతమును సర్వసామాన్యముగ జేసి, సామాన్యజనులలో వ్యాప్తిగాంచునట్లు చేయుటకుగాను తేట తెలుగుమాటలలో నన్నయవాడ నొల్లని ద్విపదలోనే బసవ పండితారాధ్యు లనుమతకర్తల జీవితములను పురాణములుగ రచించినాడు గదా. ఇంతేగాక ఇంక ననేకములగు దేశి రచనాభేదములగు—ఉదాహరణములు, రగడలు, సీసములు, శతకము, గద్యలు, అష్టకములు, మొదలైన వానినే రచించినాడు. కాని మార్గఫక్కి రచనల పొంతకు బోలేదు. శైవమత పరముగా నత డవలంబించిన యీదేశీ ఫక్కినే, ఈతని తరువాత వైష్ణవమతపరముగా తిరుపతిలోని తాళ్ళపాక కవులుకూడ నవలంబించి-మంజరీ ద్విపదలు, శతకములు, సీసములు, ఉదాహరణములు, రగడలు, గద్యలు మొదలగువాని రచించి సోమనాథుని పద్ధతినే యనుసరించిన వారైనారు. ఇట్టి రచనారీతనికి బూర్వ్యము దేశమున ప్రచారములో నున్నట్లే మనము గ్రహించుటకు దగిన యవకాశమేమియు గనపడదు. ఈదేశీయ రచనారీతులను గూర్చి, వాటి అస్తిత్వమును గూర్చి మొదట తెలిపినవాడు సోమనాథుడే అనవలె. కేతన వీని సెత్తనేలేదు. పెద్దన లక్షణకర్తగా గ్రంథబాహుళ్య భీరుత్వమును ప్రకటించుచు మొదట అత్యల్పముగనే సూచించినాడు. ఏమైనను ఈలాక్షణికులు ప్రబంధ లక్షణమునుగూర్చి సంస్కృత ఛ్ఛందఃఫక్కిని అలంకారరీతులను గూర్చి చెప్పినంత ఉత్సాహముతో నీ దేశీయరచనల లక్షణమునుగూర్చి చెప్పబూను కొనలేదు. అట్టి సందర్భములో తొలుత తెలుగు సాహిత్యములో దేశీయ రచనలను గూర్చి-రచనలనుగూర్చియేకాదు- తెలుగు నాటగల అప్పటి దేశీయ (సంప్రదాయములు మొదలగు ననేకవిషయములను గూర్చి) భాషా, సాహిత్య, నాట్య, సంగీత, చారిత్రక విషయములు, స్థానికాచార వ్యవహారములు, జీవితలక్షణములు సంప్రదాయము లనేకము లీతని రచనలు మూలముగా మనకు సువ్యక్తమగుచున్నవి. శ్రీశైలవర్ణనము, పరుసల వర్ణనము మొదలవానిలో వివిధ దేశీయజనుల యాచారవ్యవహారములు వ్యక్తమగుచున్నవిగదా. శివరాత్రి జాగరము సందర్భమున ఆకాలపుపాటలు-పద్యములు గీతములు, స్తవములు, మొదలగువాని స్థితియేగాక, అప్పటి నాట్యభంగిమలు, నాటక ప్రదర్శన పద్ధతులు-భరతనాట్య ప్రయోగములు, సంగీత శాస్త్ర ఫక్కికలోని 108 రాగములు తాళములు, మూర్ఛనలు-మద్దెళ్లు, వీణెలు మొదలగు వాని పేళ్ళతోగూడ నాకాలపు స్థితిగతులన్నియు మనయెదుట పెట్టినాడు. ఆతని గ్రంథము లాకాలపు దేశీయ విషయవిజ్ఞానమునకు మహోఖనియనియే చెప్పవలసియున్నది. ఆ కాలమందలి యావిజ్ఞానము మఱి యే యితర గ్రంథము వలనను మనకు లభింపదు.

అట్లే ఆతడు తన రచనలయందు ప్రయోగించిన తెలుగు భాషావిషయమునుగూర్చి మనము తలంపదగియున్నది. నిఘంటువులకే యెక్కని పదము లనేకములున్నవని విమర్శకు లనేకు లిదివరలో చూపియేయున్నారు. పదములేగాక, పదబంధములు, సామెతలు, విశేషప్రయోగములు అనేకములున్నవి. ఆతని విశేష ప్రయోగముల నసామాన్య ప్రయోగములని చెప్పుచు కొందరు సమర్థించినవారు, ఈ విశేష ప్రయోగములకే అలాక్షణికత్వ మాపాదించి యాతని నలాక్షణికకవి యన్నవారు కొందరుగలరు. కావుననె మొన్న మొన్ననే చిరకాలాజ్ఞాత వాసమునుండి బయలువడిన నన్నిచోడునితోపాటు, ఈతడును తెనుగు సాహిత్యమునందు చాల కాలము వెనుకబడియుండి శైవకవి బృందమునకు మాత్రమే యాదర్శ భూతుడగుచు అట్టట్ల మెలగుచు, ఇటీవలనే కొంత బయలువడి మరల ఆంధ్రసాహిత్య ప్రపంచమున ప్రకాశింపజొచ్చినాడు. వీరి యలాక్షణికత్వ లక్షణమునుగూర్చియే మనమించుక పరిశీలింప వలసియున్నది. సోమనాథుని రచనలెట్లు తెనుగుసాహిత్యమున ఇతర మార్గముల మనమెరుంగలేని అశేష విజ్ఞానవిష

యనులకు ఖనియని చెప్పుచున్నామో అట్లే నన్నిచోడుని గ్రంథముకూడ మఱొక విధముగా మనము గ్రహింపలేని ఆతనికాలపుటనేక విషయములను గూర్చిన జ్ఞానము మనకు కలిగించినది. తెలుగు సాహిత్యములు మార్గదేశిభేదము-దానివలన గలుగు విశేషముల ప్రాముఖ్యము అట్టివానిలో నొకటి యని చెప్పవచ్చునుగదా. భాషా విషయమున - సన్నిహితభాషలతో తెలుగునకుగల సంబంధ బాంధవ్యముల నాతడు మనకు గోచరింపజేసినవాడనవచ్చు గదా. భాషా పరిణామ దృష్టితో జూచిన వీరిద్దరు నలాక్షణికులుగా బరిగణింప బడుట ఎంత యపహాస్యమో అనిపించకపోదు. వీరి భాషకు లక్షణ మేర్పరచు వారెవరు? ఎవరి లక్షణమును బట్టి వీరి భాష అలాక్షణికమైనది? ఇంతకు తెలుగుభాష కప్పటికి లక్షణమే లేదే? కేతన యైనను వీరిభాషకు లక్షణము చెప్పసాహసించినాడా? ఆంధ్ర శబ్దచింతామణి సితి అతుకులమారి బేరముగనే కనబడుచున్నది గదా! అదియైనను అప్పకవికి దొరకువరకు ఈ లోకములో నెవ్వరెరుగరు గదా-అప్పకవి చెప్పిన మాటే, అది. అంతే కాక మరొక మాట కూడ నాతడే చెప్పినాడు.

“ఆదిని శబ్దశాసను
డాకవి చెప్పిన భారతంబులో
నేది వచింపగాబడియె
నెందునునందునెగాని సూత్ర సం
పాదన లేమిచే తెనుగు
పల్కు మఱొక్కటిగూర్చ చెప్పగా
రాదని దాక్షవాటి కవి
రాక్షసుడీ నియమంబు చేసిన్”

దాక్షవాటి కవి రాక్షసుడు చేసిన నియమమును గూర్చి యతడు చెప్పిన దానిని బట్టి చూచిన క్రీ. శ. 16 శతాబ్దము వరకు కవిత్రయము వారి మార్గ ఫక్కి ననుసరించిన వారు-వారి రచనను చూచుకొని వ్రాసిన వారే గాని, ఆ కవిత్రయమువారి భాషకైనను లక్షణ మేర్పడినట్లే కనబడదుగదా! దాక్షవాటి కవిరాక్షసుని నియమమును బట్టియే తిక్కనాదులుకూడ రచించినప్పుడు ఈ తిక్కనకు పూర్వులు వారో సమకాలికులో యనదగిన యితర కవులు - మతాదులలోను, అభిప్రాయములలోను నన్నయ పద్ధతికి భిన్నులైనప్పుడు-వారికి తోచిన రీతిని వారి కాలములలోని శిష్టవ్యవహార సంప్రదాయానుసారముగా వారు రచించినచో- గుడ్డువచ్చి పిల్లను వెక్కిరించిన దన్నట్లు-తరువాత లాక్షణికులు వచ్చి, వీరి నలాక్షణికు లనుటలో అర్థమేమున్నది? 19 వ శతాబ్దిలో వెలువడిన చిన్నయసూరి లక్షణ మనుకోలతబద్దను బట్టియా మనము 6, 7 శతాబ్దములకు పూర్వమున గల మహాకవుల రచనలలోని భాషయొక్క విలువ నెన్న బూనుట? కవి రాక్షసుని కాలము నిశ్చయముగా మనకు తెలియక పోయినను, అప్పకవిని బట్టి కూడా ఆతని నియమము నన్నిచోడ సోమనాథులకు వర్తింపనే వర్తింపదు. నన్నయ మతానుసారియై ఆతని భారతమును ఆతని సంహితా దృష్టితోడనే రచించినాడు గనుక తిక్కన ఆతని కృతు లరసికొనియే తాను రచించి యుండవచ్చును. కాని ఆతనికి ముందు వారు - అన్యమతావలంబకులు - ఆతని రచనా ఫక్కితో నేభవింపని వారట్లు చేయవలసిన పని యేమి? కావున సోమనాథాదు లలాక్షణికులన్నవారే లక్షణ జ్ఞాన శూను లగుచు-అలాక్షణికు లగుచున్నారు.

ఇంతకూ ప్రతి కాలములోను అప్పటి వ్యవహార భాషకు, ఆ కాలములోని కావ్య భాషకు ఏదో కొంత భేద ముండకపోదు. ఈ రెండును రెండు భిన్న ప్రవాహములుగా ప్రతి కాలములోను ప్రవహించి వచ్చుచునే ఉన్నవి. నన్నయకు పూర్వకాల మందలిస్థితి చూచిన అప్పటి అద్దంకి, బెజవాడ శాసనములలోని పద్యముల భాషకు, సామాన్యముగా ఇతర శాసనములలో వ్రాయబడిన భాషకు చాల వ్యత్యాసము కనబడుచునే యున్నది. కాని ఆశాసన పద్యములలో ప్రుస్సి, అఱ్ఱపుటవంటి కొన్ని వికృత రూపములు, పదబంధములు మొదలైనవి కనబడినను దానిని కావ్యభాషయే యంటిమి. నన్నయ ఆ కాలములో అల్ప కావ్య రచనకు మాత్రమే అలవడియున్న ఆ భాషను చేపట్టి సంస్కృత భాషా ప్రభావమును దానిపై బాగుగా ప్రసరింప జేయగలిగిన మహత్త్వము గలవాడగుటచే-తెనుగు భాషను కొంత సంస్కరించి, దాని శక్తి నపారముగ విస్తృతిచేసి, మహాభారతమువంటి మహాస్వాదు ఫలమును మన కందించినాడు. ఈ చేసిన మార్పునకు సంస్కారములకు ఆయా ప్రాంతము

లందలి శిష్యుల వ్యవహారము, కవుల నిరంకుశత్వము తప్ప వేరు నియమావళి ఏమియు గానరాదు. అంతకు పూర్వము ఱస్సి'-ఏఱు, ఎణుంబొది-అని ఉన్న రూపాలను (అప్ప కవి శిష్ట వ్యవహారములోనివే)-నన్నయ తన కాల వ్యవహారమును బట్టి డస్సి, ఏడు, ఎనిమిది-అని ప్రయోగించినాడు.

నన్నయ కాలమున గూడ-శాసన భాషలో ననేక పదములలో 'ఱ'-కారము వ్యవహారములో నుండెననుటకు రణస్థిపూండి శాసనమే నిదర్శనము. అట్లే దీర్ఘము మీద నిండు సున్న ఆతని తరువాత కొన్ని శతాబ్దముల వరకు-ఇప్పటికిని కొన్ని ప్రాంతములలో కొన్ని శబ్దములలో-వాడుకలోనుండినది. కావుననే ఆతని తరువాతి వారు దీర్ఘము మీద నిండు సున్నగల శబ్దములను ప్రాసలో ప్రయోగించినారు. దీర్ఘము మీద నిండు సున్న లేదని ఇటీవలి లాక్షణికులు సూత్రించి నంతమాత్రమున ఆ సూత్రమును గూర్చి యెరుగని పూర్వ కవులను గాని, ఇప్పటికిని వాడుచున్న జన బాహుళ్యమును గాని వద్దని మనము అరికట్ట గలమా? అట్లే నన్నయ 'కరుకంఠు'డు ప్రయోగింపగా, తరువాతి వారు తమ కాలములోని పుడమీశుడు దీపకంభములు, చౌదశాబ్జములు మొదలగు వానిని ప్రయోగించినారు. ఒక దానిని లాక్షణిక మని సమర్థింప జూచుట, తక్కిన వాని నలాక్షణికములనుట యెట్లు పొసగును? మన కిప్పుడు అంత పరిపాటిలో లేక వికృతములుగా గనబడు రూపములను "అభిలషణము, అనుజ్ఞానము, సాదనము, ప్రస్తవము, అవకర్ణించుట (దుర్యోధను)-దూషించుట (విఘాతించు అను అర్థములో), ధారుణి, ఉపలంభించుట, మహాత్మత"-మొదలగు వానిని నన్నయ ప్రయోగించినాడు. ఆతని జాతీయము-కారకము-ఇప్పుడు మన కర్థమగుటయే కష్టమగుచున్నది. కాని అతనిని లాక్షణికునిగనే గ్రహించి, అట్లే తమ కాలములో శిష్టుల వ్యవహారములోనే యుండుటచే గాబోలు నన్నిచోడాదులు ప్రయోగించిన "సాన్నిధ్యత, మహాదేవి, కాళిదాసి, అభిమానకర్తె, బ్రహ్మాత్య, అలంకారించు, ఉత్సాహించు, అహంకారించు, రండ, పాండ, కస్వ, తర్గు, కుర్వ్య"-అను రూపములను, అట్లే భక్తులిండ్లు, కలిగుండువంటి సంధులు మొదలగు వానిని అలాక్షణికము లనుటలో న్యాయమేమున్నది?

ఇంతకును-మనము గమనింపవలసిన విషయమిది: నన్నయ తెలుగు భాషకు కొంత సంస్కారము గల్పించి మహాభాగతమువంటి యుద్గ్రంథము వ్రాసి నట్టె-ఆతని తరువాతి వారు నన్నయ చేసిన సంస్కారములను గ్రహించుచునే, తమ తమ కాలములందు-తమ దేశభాగములందుగల వ్యవహారమును బట్టి శిష్ట వ్యవహారానుకూలము గనే తమకు తోచిన వ్యవహార ప్రసిద్ధములైన రూపములను గ్రహించి తమకు ప్రామాణికమని తోచిన భాషలో గ్రంథములు రచించినారు. కాని నన్నయాదుల వైదికమతమునకు దేశములో స్థిరత్వమేర్పడిన పిదప కవిత్రయము వారి, వారి యనుయాయుల గ్రంథములకు ప్రామాణికత్వము స్థిరపడుటచే, వారి భాషా సంప్రదాయములకే ప్రాబల్యము కలిగినది. వానిని బట్టి రచింప బడినదేయని చెప్పబడిన 'ఆంధ్ర శబ్ద చింతామణి'-అది నన్నయ రచితమేయని దానిపై నాధారపడి రచింపబడిన తరువాతి లక్షణముల బట్టి, తొలికవుల రచనలను పరిశీలించుట చేత-వీని దృష్టిలో వా గలాక్షణికులగుట తటస్థించినది. ఇంతకును లక్షణము విషయమున తేడాలనేమో ఎంచుచున్నాము గాని, నన్నయ తిక్కనల భాష, వారి జాతీయము, వారి కారకము-ఇప్పుడు మనకు సులభముగా అర్థమగుచున్నవా? వారు ప్రయోగించిన పదములకు గాని, పదబంధములు, జాతీయము వగైరాలకు గాని సరియైన పట్టికలైన మనకు గలవా? పాఠభేదముల విషయమైన తగాదాలు అప్పకవి నాటినుండియూ ఉండనే ఉన్నవి. కావున తొలికవుల కావ్య భాషను ఆయా కాలములందలి శాసనాదులందలి భాషతో బోల్చి సరిచూచి దానికి ప్రత్యేకలక్షణముల నేర్పరచుకొనవలసినదే గాని, ఒక దానిని బట్టి మరియొకర భాష ములాక్షణిక మనుకొనుట యుక్తము కాదు. అందు సోమనాథుని భాష ఆతని సాహిత్యము వలెనే అనేకాపూర్వ విషయములకు ఖని.

—:♦:—

మనిషి-మనస్సు

# సోమన నిర్వచించిన మతం

## శ్రీమతి ఎం. ఆదిలక్ష్మిగారు

—— ——: * :——

పంద్రెండవ శతాబ్దిలో వీరశైవమతము కర్ణాటాంధ్రదేశాల్లో విరివిగా వ్యాపించినది. కాలచుర్యవంశీయుఁడు కల్యాణకటకాధిపతి యగు బిజ్జలుని దండనాయకుఁడగు బసవనయే ఈమత ప్రవక్తయని కొందఱు తలంతురు. కాని దక్షిణదేశమందనాదిగానున్న శైవమే బసవనచే పునరుద్ధరింపఁబడి వీరశైవ మతస్వరూపమును దాల్చినదనుట సమంజసము. ద్రావిడదేశమున ప్రసిద్ధులైన శివభక్తులగు నఱువది మూవురు నాయనారుల జీవితములను బరిశీలించినచో, వారిదియు వీరభక్తిగనే మనకు గానుపించును. శివభక్తులను శివుని ప్రతిస్వరూపముగా గ్రహించి వారేదికోరిన దానిని సిద్ధింపఁజేయుట వారి చరిత్రలందు గోచరించును. కావున వీరశైవము బసవనచే నేర్పఱుపఁబడిన క్రొత్తమతము గాక పునరుద్ధరణలో కొన్ని కూర్పులతో, చేర్పులతో నూత్నరూపముదాల్చిన ప్రాచీనశైవమే యగును. అంతేగాక దక్షిణదేశమున లకులీశ పాశుపతమని, కాలాముఖ, మహావ్రతాదులని శైవమతభేదములుండిన వనుట చారిత్రకముగా నందఱెఱిఁగినదే. వీనికిని వీరశైవమునకు చాలపోలికలున్నవి. వీరశైవమను పేరిటి మతమున్నట్లు తెలియుటలేదు. పునరుద్ధరింప బడినపుడే యీ నామము ప్రసిద్ధమైయుండ నోపును. కావున బసవనచే సృష్టింపబడినదిగాక, నూతనోత్తేజముతో నుద్ధరింపబడిన శైవ మతమే వీరశైవము.

బసవన ప్రచారముచేసిన శైవమతములో భక్తియే ప్రధానము. జాతిమత, లింగ వివక్షతలు లేవు. వేదోక్తకర్మలనిరసనము, శివోత్కర్ష, భక్తిచే భగవంతుని పలికించుట ఈ మతలక్షణములుగా కనిపించును. గురులింగ, జంగమ, ప్రసాదాదులు, విభూతి రుద్రాక్షాది రుద్ర చిహ్నాలు నీ మతముతో నవినాభావ సంబంధముగలవి. బసవపురాణమున సంగమేశ్వరుఁడు బసవనకు ప్రత్యక్షమై బోధించిన ధర్మములు మనకీమత సంప్రదాయములను తెలియఁజేయును.

"వచ్చిన పోయిన వారిచే నీదు
సచ్చరిత్రము విని సంతసిల్లుదుము
గతకాల వర్తనకంటె సద్భక్తి
మితిదప్పి నడవకుమీ బసవన్న
శూలి భక్తాలిదుశ్శీలముల్ గన్న
మేలకాఁ గైకొనుమీ బసవన్న
పట్టిన వ్రతములు ప్రాణంబుమీఁద
మెట్టిన విడువకుమీ బసవన్న
వేఱుభక్తులజాతి వెదకకుండుటయె
మీఱిన పథము సుమీ బసవన్న
చిత్తజాంతకు భక్తి చెడనాడుఖలుల
మృత్యువుగతిఁ ద్రుంపుమీ బసవన్న
వేదశాస్త్రార్థ సంపాదిత భక్తి
మేదిని వెలయింపుమీ బసవన్న
తిట్టిన భక్తులు కొట్టినఁ గాల
మెట్టిన శరణనుమీ బసవన్న
యేఁదప్పు వట్టుదు నిలఁ బరస్త్రీల
మీఁదఁ గన్నార్పకుమీ బసవన్న
సాధ్యమా భక్తి ప్రసాదేతరంబ
మేధ్యంబకాఁ జూడుమీ బసవన్న
నిక్కంపు భక్తికి నిర్వంచకంబు
మిక్కిలి గుణము సుమీ బసవన్న
ఎప్రొద్దు జంగమం బేనకాఁ జూడు
మీ ప్రసాదము గొనుమీ బసవన్న
నాలుకకింపుగా శూలిభక్తులను
మేలకా నుతియింపుమీ బసవన్న
యేమైన వలసిన యెడగైనఁ దలఁపు
మీ మన్కి మఱవకుమీ బసవన్న
మోసపుచ్చు శివుండు బాస లేమఱకు
మీ సత్య మెడపకుమీ బసవన్న"

—బసవపురాణము. ప్రథమాశ్వాసము.

బసవన భక్తిమతము పామరజనరంజకమైనది. కల్లిదేవయ్య అను భక్తుఁడు కుక్కలచే వేదములను చదివించినాఁడు. కావున సకలజాతుల వారు లింగధారణ పొంది శివమతాను యాయులైరి. వృత్తి యేదైనను నది సక్రమముగా సదాశయముతో నిర్వహింప బడవలయును. కాయక వ్రతము మనకు భక్తుల చరిత్రలలో

గాన వచ్చుచుండును. కష్టపడి సముపార్జించిన ధనమును శివభక్తులకై వినియోగించుటను మనకు బసవ పురాణ పండితారాధ్య చరిత్రల యందుగల భక్తుల కథలలో గానవగును.

దీనిని బట్టి యీ మతము స్వార్జితమగు ధనమునకే ప్రాధాన్య మిచ్చుచున్నదని తేటపడును.

సోమనాథుని యనుభవసారమున మనకు శివభక్తి స్వరూపము వ్యక్తమగును. గురువనగా శివదీక్షనిచ్చుగురువు. అతడు శివస్వరూపుడు. శిష్యుడు దీక్షాకాలమున గురుహస్తము తన మస్తకమును సోకిననందు న రెండవ జన్మమును పొందిన వాడగును. అప్పుడినుండి ఆతఁడా గురుహస్తసంజాతుఁడు ఇఁక శివభక్తు డెవరైనను సరియే; వాని కులగోత్రములలో పనిలేదు. అతనిని శివస్వరూపునిగా భావించి యర్చించవలెను. శ్రీపతి పండితుఁడు బ్రాహ్మణేతరుఁడగు నొకభక్తుని పూజించినందున బ్రాహ్మణు లాతని వెలివేసిరి. కాని యాతఁడు తన భక్తిమహిమచే అగ్నిహోత్రుని తన అంగవస్త్రమున బంధించి బ్రాహ్మణులకు బుద్ధి వచ్చునట్లుచేసెను. మల్లికార్జున పండితుఁడును భక్తియే ప్రధానముగాని కులమత గౌరవము కాదని నిరూపించినాఁడు.

ఇంతకు చెప్పవచ్చిన దేమనగా బసవన జంగమ సంప్రదాయమునకు పండితారాధ్యుని ఆరాధ్య సంప్రదాయమునకు-రెంటికిని కులమత వివక్షత లేదు. వీరశైవమత వాహినిరెండు స్రవంతులుగా ప్రవహించినది. ఒకటి బసవన జంగమ సంప్రదాయము. వేద కర్మలని రసనము, సర్వజన సమానత్వమును ప్రతిపాదించి సంఘమున నైక్యము శివభక్తి మూలమున నాపాదించ దలచినది—ఆ మతమునే పండితజన సమ్మతము గావించుటకై మల్లికార్జునపండితారాధ్యు లది వేదసమ్మతమని, శ్రుతి స్మృతి పురాణాగమాది హైందవ ధర్మ గ్రంథములు శివోత్కర్షనే చాటుచున్నవని, విభూతి రుద్రాక్ష, లింగ ధారణాదులు వేదములలోనే విహితములని నిరూపించినాఁడు. అంతేకాని జంగమారాధ్య సంప్రదాయములు వైరిసిద్ధాంతములను జాటుచున్న వనుకొన రాదు. సాధారణముగా పామర జన సామాన్యమునకు భక్తి మహిమలను కనులయెదుట సప్రమాణముగా జూపిన చాలును. వారిలో విశ్వాసము ప్రబలును. బసవన వీరభక్తి మహిమలు-వంగకాయలను లింగములను చేయుట, జొన్నలను ముత్తెములను చేయుట, విషము తిని జీర్ణించుకొనుట మున్నగు మానవాతీతకార్యము లాతనిపై జనులకు విశ్వాసమును భక్తిని గలిగించినవి. కాని పండితు లంత సులభముగా నమ్మువారు గారు. వారికి శాస్త్ర సమ్మతి ముఖ్యము. కావున బసవనకు సాహిత్యమంతగా నవసరము కాక పోయినది. భక్తి గేయములను, వచనములను పాడి భక్తుల నాకర్షించుట మాత్రమే అతనికి కావలసి వచ్చినది. కాని పండితుని పరిస్థితి వేఱు. మాట మాటకు ప్రశ్నించు వేద తార్కిక పండితుల నతఁడు జయించ వలసివచ్చినది. కావుననే సోమనాథుఁడు సర్వానుమతవాద ఖండనమును పండితారాధ్యుఁడే చేసినట్లు పండితారాధ్య చరిత్రమున వర్ణించినాఁడు. బసవన పైగా దండనాయకుఁడు. అతనికి రాజకీయ మగునధికారమును నుండినది. పండితుఁడు సామాన్య పండితుఁడు మాత్రమే. కావుననే వీరశైవము మల్లికార్జుల పండితారాధ్యుల చేతిలో నొక క్రొత్త తొడుగు ధరించినది. జననమరణాదిసంస్కారము లియసంప్రదాయమువారికినొకటే. కాని వేద సమ్మతిని పొందినదగుటచే నారాధ్య సంప్రదాయమువారు గృహ్యసూత్రముల ప్రకారము ఉపనయనాది సంస్కారములను గూడ పాటింతురు. లింగధారణ దీక్షయు గైకొందురు. జంగము లుపనయనాది వేద కర్మల గర్హింతురు. జాతాశౌచ రజశ్శౌచ మరణ శౌచములను పాటింపరు.

మన పాల్కురికి సోమనాథుఁడీ రెండు సంప్రదాయములను తన గ్రంథముల మూలమున వ్యాప్తికి దెచ్చినాఁడు. అనుభవసార రచనానంతర మీతఁడు బసవని గూర్చి సమగ్రముగా దెలిసికొని యుండ నోపును. 'బసవ శతక, గద్య, పద్య, ప్రబంధాభిరాముండు పాల్కురికి సోముఁ డనఁగ'యని తన్ను గూర్చి చతుర్వేదసారమున జెప్పియున్నాఁడు. చతుర్వేద సారమునను, అనుభవసారమునకూడ నాతఁడు వీరశైవ సిద్ధాంతములను వేదసమ్మత మొనర్చినాఁడు.

పాల్కురికి సోమన శివ పారమ్యమును ప్రకటించుచు సృష్టి స్థితి లయముల కన్నింటికి శివుఁడే మూల కారణమని, అజాచ్యుతాదు లాయా కార్యములకై నియమితులైరని స్పష్ట పఱచును. విష్ణువు శివునకు విరోధిగాఁడు. పరమభక్తుఁడు. పూజ కొక పువ్వు తక్కువ కాఁగా తన కంటిని యర్పించి చక్రమును బడసినాఁడు. శివుని "దక్షిణ వామ భాగాంగము లందు దొరఁగెడు ఘర్మ బిందువులను" హరి బ్రహ్మలు జన్మించిరని చెప్పియున్నాఁడు.

సోమన లింగధారణ దీక్షావిధిని గూర్చి చెప్పకున్నను దీక్షితుఁడగు భక్తుఁడు చేయవలసిన లింగార్చనా విధిని వివరించియున్నాడు. పండితారాధ్య చరిత్రమందు మల్లికార్జున పండితుని పూజాదికమును వర్ణించుచు నా ప్రకరణమునకు దీక్షాప్రకరణమని పేరిడినాఁడు. అర చేత లింగముంచుకొని రాజవ దుపచారములతో శివపూజ చేయవలయును. అట్టి లింగార్చనా సమయమున శివభక్తు లరుదెంచిన జంగమ శివస్వరూపులగు వారిని యర్చించుట విధి. అంత వరకు పూజ లందుచుండిన లింగ మంతరిక్షమున నుండును. ఈ విషయము మల్లికార్జున పండితారాధ్యులయొద్దకు శివ పూజా సమయమున పోరండ్ల గూగసానమ్మ, బెలిదేవ వేమనారాధ్యులు వచ్చినపుడు స్పష్ట పరుపబడినది.

వీరశైవమున శివభక్తుల మహిమ శివునికన్న ఘనతరమైనదిగా నిరూపింప బడినది. వీర భక్తిచే బలవంతముగా భగవంతునిసాన్నిధ్యము పొందగలరు. తా మనుకొన్న కార్యములు చేయగలరు. శివుఁడు కాలకూట విషయమును కంఠమున నిలుపగా బసవడు తాను విషమారగించి, ఇతరుల నారగింపజేసి జీర్ణింపచేసినాఁడు. చంద్రోదయమును సోమన యెంత మనోహరముగా నీ విషయముతో జోడించి వర్ణించినాఁడో చూడుడు.

"మల సంహారుడు జటా మకుటంబుమీఁద
నిలిపియు నాకందు నెఱి బుచ్చలేడు
భక్తుల పాద సంస్పర్శనంబునను
వ్యక్తిగా నిర్మలత్వంబు బొందుదును
అని యాత్మ దలపోసి యరుదెంచు మాడ్కి
వనజారి ప్రాఙ్ముఖంబున నుదయించె."

బసవ. తృతీయాశ్వాసము

పార్వతి ప్రమథులకు విందుబెట్టు సందర్భమున శివుఁడు పార్వతితో తన భక్తులగు ప్రమథుల మహిమ నిట్లు తెలియజేయును.

"లింగాంశు లయ్యాదిలింగ సంభవులు
లింగమూర్తులు మహాలింగైక నుతును
* * *
లింగాభిమానులు లింగశాసనులు
లింగ సత్ప్రాణులు లింగ తత్పరులు
సర్వ శుభోదయుల్ సర్వాధిపతులు
సర్వ సంపూర్ణులు సర్వకారణులు
వేయేమి? ప్రమథుల కాయంబు మాకుఁ
గాయంబుగా కొండు గాయంబు గలదె?
ఇందొక్క ప్రమథునియిచ్చ నజాండ
సందోహములు నెడు జనియించు నిలుచు
నది గాక హరి విరించ్యాది దేవతల
గుడియింతు రను టెల్ల నిది యెంత పెద్ద
తప్ప కిందొక్కడు తెప్ప వెట్టుదును
నప్పుడె సర్వసంహార మాననిన
గావున వర్ణింపగా నగోచరము
భావించి చూడ మా ప్రమథుల మహిమ."

—బసవ. ద్వితీయాశ్వాసము.

వీరశైవమత ప్రధానాంగములు గురు, లింగ, జంగమములు. గురువులలో దీక్షనొసంగు గురువు తండ్రితో సమానుఁడు. అతని హస్తజన్యత్వము శిష్యుని దీక్షితుని గావించును. విద్యను గఱపిన వాఁడు శిక్షా గురువు లేక, విద్యా గురువు. తుది యాదర్శమునకు జేర్చు వాఁడు మోక్షగురువు. ఈ మువ్వురు ఒక్కడే యైయుండవచ్చును, లేక వేర్వేరు వ్యక్తులు కావచ్చును. ఉదాహరణకు సోమనాథుఁడు 'గురులింగ వరకరోదర జనితుఁడు'—కరస్థలి విశ్వనాథుఁడు కవితా గురువు, కట్టకూరి పోతిదేవర పదాంబుజములనుండి షట్పదమువలె సోమన విద్యా గ్రహణ మొనర్చినాఁడు.

వీరశైవమున లింగము ప్రధానస్థానము నాక్రమించును. లింగము విగ్రహమాత్రమో శివుని చిహ్నమమాత్రమో కాక శివస్వరూపమే యని యా మతానుయాయులు భావింతురు. కావుననే దీక్ష పొందిన తర్వాత సర్వకాల సర్వావస్థలయందు లింగమును విడువరాదు. లింగమునుండి విడివడుట యాధ్యాత్మిక మృతితో సమానము. లింగ స్వరూపమునకే యర్చనారాధనలు జరుపవలయును గాని వేఱు

(తరువాయి 91 వ పుటలో)

ఇతిహాసం :

# సోమనాథు డెప్పటివాడు ?

## శ్రీ బండారు తమ్మయ్యగారు

[వీరశైవ వాఙ్మయోద్ధరణకు జీవితం అంకిత మొనర్చిన పరిశోధక ప్రకాండులు శ్రీబండారు తమ్మయ్యగారు. అయినప్పుడు పాల్కురికి సోమనవిషయంలోను వీరే ప్రామాణికులనడం చర్విత చర్వణం. పాల్కురికి సోమన కాలాదికం గురించి ఇటీవల చెలరేగిన దుమారానికి పెను జల్లుగా శ్రీతమ్మయ్యగారు కురిపించిన ఈవ్యాసం ప్రకటించే భాగధేయ మబ్బినందుకు "పరిశోధన" గర్విస్తున్నది.

—సంపాదకులు]

పిడుపర్తి సోమనాథుని పద్య బసవపురాణావతారిక ననుసరించి పాలకురికి సోమనాథుండు కాకతీయ ద్వితీయ ప్రతాపరుద్రుని కాలము వాడు కాదగునని తొల్లింటి యభిప్రాయమును, ఆంధ్ర కవిచరిత్రకారులు శ్రీ వీరేశలింగము పంతులుగారు, కర్ణాట కవి చరిత్ర ప్రథమ భాగమును 1907 వ సంవత్సరములో శ్రీ నరసింహాచార్యులుగారు ప్రకటించిన తరువాత నందులో వారు గావించిన సోమనాథుని కాలనిర్ణయ మనుసరించి మార్చుకొని యాతండు రెండవ ప్రతాపరుద్రుని కాలము వాడు గాక మొదటి ప్రతాపరుద్రునికాలము వాడు కాదగునని 1919 వ సంవత్సరమున వెలువడిన ఆంధ్ర కవుల చరిత్ర ప్రథమభాగ పునర్ముద్రణములో నిరూపించుటయు, అప్పటినుండి పలువురీనిర్ణయమునే యనుసరించుటయు భాషా సేవకులు పలువురెఱింగియే యుందురు. ఇట్లుండగా శ్రీసోమశేఖర శర్మగారు 1946 వ సంవత్సరము ఫిబ్రవరి భారతిలో కాకతీయుల సామంతుడు అంబయదేవుడు క్రీ. శ. 1190 వ సం॥న త్రిపురాంతక వాస్తవ్యుడు రెంద్రేవుల మల్లినాథయ్య యను శైవున కగ్రహార మొసంగుచు నెలకొల్పిన నీలగంగవరము శిలా శాసనము నాధారముగా గొని, సోమనాథుడు రెండవ ప్రతాపరుద్రుని కాలము వాడే కాదగునని తొల్లింటి నిర్ణయము నుద్ధరింప నుద్యమింపగా, ఈ శాసనమందలి విషయముల విమర్శించుచు శర్మగారి యభిప్రాయమును బలపఱచుటకీశాసన మసమగ్రముగా నున్న దెంతగు నిరూపించుచు, సమర్థములగు శాసనాంతరములకయి కృషి యొనర్చుడని శర్మగారిని హెచ్చరించుచు 1946 ఆగస్టు భారతిలో ప్రతి విమర్శవ్యాసము ప్రకటించి యున్నాను. అటు తరువాత నీ విషయమునే శర్మగారి యభిప్రాయమునకు సహాయకముగను, నాయభిప్రాయ ప్రతిపాదకముగను శ్రీ శిష్టా రామకృష్ణ శాస్త్రిగారు (వీర శైవాంధ్ర వాఙ్మయ గ్రంథకర్తలు) 1953 వ జనవరి భారతిలో నొక వ్యాసమును ప్రకటింపగా దాని పయి గూడ మఱొక ప్రతి విమర్శవ్యాసమును 1954 వ మేనెల భారతిలో ప్రకటించుచు నందుగూడ బూర్వోక్త మయిన హెచ్చరిక నేమరల నేతద్విషయ పరిశోధకమిత్రవర్గము పట్ల గావించి యున్నాను. భారతీ పత్రికా పాఠకులు పలువురకీ వ్యాసము లెల్ల బరిచితము లయియే యుండును.

[1] "పాలకురికి సోమనాథుం డెప్పటివాండు?" అను పేరుతో నొక గ్రంథమును నూతనముగ డాక్టరు నేలటూరు వేంకటరమణయ్యగారు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి పర్యవేక్షణానుమోదములతో రచించి ప్రకటించియున్నారు.

శ్రీ వేంకటరమణయ్యగారి ప్రకృత గ్రంథము పాలకురికిసోమనాథుండు రెండవప్రతాపరుద్రుని రాజ్యావసానకాలములో క్రీ. శ. 1280-1340 మధ్యనుండి యుండునని తొల్లింటినిర్ణయము నుద్ధరించి తన్మూలమున సోమశేఖరశర్మగారి నిర్ణయమును సమర్థించుటకు గావింపబడిన విఫలప్రయత్నమయియున్నది. గ్రంథరచయితలు, పర్యవేక్షకులు నిరువురు పేరుగాంచిన చరిత్రజ్ఞు లవుటచే చరిత్రజిజ్ఞాసువు లీ గ్రంథము నతిశ్రద్ధతో నవలోకింపదగునని చెప్పనవసరములేదు. శ్రీ వేంకటరమణయ్యగారు తమ గ్రంథమున బలుతావుల 1946 ఆగస్టు భారతియందలి నా వ్యాస విషయములను "పాలకురికి సోమనాథకవి" అను నా ప్రత్యేక గ్రంథస్థ విషయములను నితరుల

1. క్రౌను సైజు పుటలు 112. వెల ఒక్క రూపాయ. మదరాసు వావిళ్ల ప్రెస్సున ముద్రితము. వావిళ్ల వారి వద్దనే యిది దొరకును.

వ్రాతలతోపాటు పరామర్శించి యున్నారు. కాని 1954 వ మే భారతిలోని నావ్యాస విషయముల నెందుచేతనో తడవి యుండలేదు. గ్రంథముద్రణ మిటీవల జరగినను బహుశః తత్ప్రచనము 1954 వ మే పూర్వమే జరగి యుండుట యిందుకు కారణము కానోపును. వీరు గ్రంథమును నాలుగు ప్రకరణములుగా విభజించి మొదటి మూడింటిలోను బసవేశ్వర, పండితారాధ్య సోమనాథుల కాలముల గూర్చి యితరాంధ్రవాఙ్మయ పరిశోధకులయు దమ యొక్కయు నభిప్రాయముల నుదాహరించి, నాల్గవప్రకరణములో నితరుల యాభిప్రాయములను (1) కర్ణాటకసాక్ష్యము (2) రుద్రదేవ ప్రతాపరుద్రులు (3) సోమనాథుని సమకాలికులు (i) పండితారాధ్య పుత్రశిష్యాదులు (ii) సోమనాథుని గురువులు (iii) శిష్యులు (iv) ఇతరులు అను నంతర్భాగములుగ విమర్శించి, చివరను బసవేశ్వరుని చారిత్రక వ్యక్తిత్వమును నిరూపించుట కయి యింతదనుక విద్వాంసులు ప్రబల ప్రమాణముగా గ్రహించుచున్న అర్జునవాడ శిలాశాసనము గూర్చి యొక యనుబంధమును జేర్చి యం దుదాహృతుడైన సంగనబసవేశుడు మాదిరాజు పుత్రుడు, బిజ్జలుని మంత్రియు వీరశైవ మతోద్ధారకుడునగు కల్యాణ బసవేశ్వరుడు కానేరడని తమ యభిప్రాయమును వెల్లడించిరి. సోమనాథుడు రెండవ ప్రతాపరుద్రుని కాలము కన్న ముందున్నవాడని వ్రాసిన— శ్రీ నరసింహాచార్యులు, వీరేశలింగము పంతులు, కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు, ప్రభాకర శాస్త్రి, నేను, నిడుదవోలు వేంకటరావు— అందఱి వ్రాతలను గూడ వీరేవో యొక తీరున దమ ప్రకృతకృతిలో బరామర్శించియున్నారు. అంతియే గాని తమ వాదమును నిర్బాధకముగ సమర్థించుటకు, రెండవ ప్రతాపరుద్రుడు గాని యాతని మంత్రులు (ఇందులూరి యన్నయాదులు) గాని సోమనాథున కగ్రహారాదిక సత్కారము లొనరించినట్లు నిరూపించు శాసనముల నొక్కటేనియు నేను నా హెచ్చరికలలో బ్రార్థించినట్లు వెలువరించు పుణ్యమునకు బ్రయత్నించ లేదు. దీనినిబట్టి యట్టి సమగ్ర శాసనాధారములు శశవిషాణములయి వీరికి గూడ దొరకలే దనియే తలంపవలసి యున్నది.

పాలకురికి సోమనాథుని కాలనిర్ణయ విషయమున బూర్వోక్తములయిన యభిప్రాయభేదములు వాఙ్మయ పరిశోధకులలో బ్రబలుటకు ముఖ్యకారణ మాతడు తనగ్రంథములలో నాత్మ విషయకముగ వ్రాసిన యంత స్వాతంత్ర్యమునకు, ఆతని యనంతరము 300 ఏండ్లలోనుండిన శిష్య ప్రశిష్యుడు పిడుపర్తి సోమనాథుడు పద్య బసవపురాణావతారికలో సోమనాథుని విషయమున జెప్పిన సంగతులకు సమన్వయము కుదురకుండుటయే యనియు, సోమనాథుడు తన కృతులలో స్వయముగా జెప్పిన విషయములను సహజ సరళ సక్రమ మార్గముల నర్థము చేసికొన్నచో ఇతరములగు బయటి ప్రమాణములు వేనితోనెట్టి నిమిత్తము లేకయే యాతడు ప్రథమప్రతాపరుద్ర, గణపతి దేవుల కాలములో (క్రీ. శ. 1160—1240) లోనుండి యుండునని తలంచుటయే సమంజసముగ దోపగల దనియు నేను బలుసారులు విన్నవించి యున్నాను. ఏ కవిని గూర్చియైన నాతడు సొంతముగా దన కృతులలో జెప్పిన విషయములకున్న ప్రామాణ్యా మన్యుల వ్రాతల కుండ నేరదనుట సర్వవిదితము. శ్రీ వేంకటరమణయ్యగా రిది కాదనజాలరు. వారి గ్రంథము మొదటి ప్రకరణము రెండవ పేరాలోని మొదటి వాక్యముగా "ఈ సందర్భమున మొదట పరిశీలింపదగినది సోమనాథుని గ్రంథములయొక్క సాక్ష్యము అని వారును వ్రాసియున్నారు. కాని యిట్టి ప్రధానసాక్ష్యమును సహజ, సరళ, సక్రమ మార్గములకు భిన్నముగ సంప్రదాయ విరుద్ధముగ సమన్వయించి నిజసిద్ధాంత సమగ్రనానుకూల్యమునకయి వీ రెట్టితికమకలకు లోనయిరో పాఠకులకు మునుముందు నిరూపించెదను.

(i) శ్రీశైలక్షేత్రమున జరిగిన భక్తసమావేశములో దనకు బసవపురాణ కథాసూత్రముల దెలిపిన పెద్దలలో త్రిపురాంతకవాస్తవ్యుడగు కరసలి సోమనాథయ్యగారిని పెద్దగా సంభావించుచు సోమనాథు డాతనికి "పండితారాధ్యకృపా సముద్గతుడు" అను విశేషణమును గూర్చినాడు. దీనిని బట్టి యా కరసలి సోమనాథు డా కాలమున నుండిన మల్లికార్జున పండితారాధ్యునివలన దీక్షనొందిన శిష్యుడని సంప్రదాయజ్ఞులు సులభముగ గ్రహింపనేర్తురు. గురులింగము (దీక్షాగురుడు) దీక్ష

కాలమున నిజహస్తమును శిష్యుని మస్తకముపయినుంచి చిత్కళాన్యాసము (శక్తిపాతము) గావించినంతనే శిష్యుని భౌతికశరీరము లింగశరీరముగ మారి యాతనికి వేరొక జన్మము కలిగినట్లగు ననియు, నందుచే గురుహస్తాంబుజమే శిష్యులకు జన్మభూమి యనియు వ్యవహరించుట వీరశైవమత సంప్రదాయము. అందుచేతనే సోమనాథుడు తన కృతులలోఁ బలు పురుభక్తులను గురులింగ కరోదరసంజనితులుగా వర్ణించినాడు. కృపాసముద్గతు డన్నను కృపాహస్త గర్భసంభవుడన్నను నొక్కటే యర్థము. అనుభవసార కృతిపతియగు గోడగి త్రిపురారి తండ్రి నారయను వర్ణించుటలో "ఆ మున్నెశ్వర గురు దివ్యామృత హస్తావతంసు డతికారుణ్యోద్దామతనూజు" డనియు, పండితారాధ్యచరిత్ర శ్రోతయగు సూరనామాత్యుని వర్ణించుటలో "వీరపోచేశ్వర విశ్రుతాచార్య కారుణ్య హస్తాబ్జ గర్భసంభవు" డనియు, తనవిషయమున "గురులింగ తనూజుండ" "మద్గురులింగఘనకరుణాహస్తగర్భసంభవుడ" "గురులింగ వర కరోదర జనితుండ" ననియు సోమనాథుడు గావించిన ప్రయోగాంతరముల బరీక్షించిన నీసంప్రదాయము సువ్యక్తమగును. పండితారాధ్య చరిత్ర కథానాయకుడగు మల్లికార్జున పండితారాధ్యుని వర్ణించుటలో సోమనాథుడా గ్రంథావతారిక యందును, ఇతర స్థలములందును, నాతనిని మాటి మాటికి "పండితారాధ్య" అను నామైకదేశముతోడనే ప్రశంసించినాడు. "ఆయూషముగ మల్లికార్జున పండితారాధ్యుల చరిత్రమరి వర్ణింతుఁ, బండితారాధ్యుల బ్రస్తుతించినను, నిండారు శివభక్తి నియతివర్ధిల్లు, బండితారాధ్యుల బ్రస్తుతించినను, దండతండములు పాతకములు వొలియు" ఇత్యాది "పండితారాధ్యుల పంచేంద్రియములు దాడధరారిపాదంబులు గావె, పండితారాధ్యుల పంచేంద్రియములు చండీశవరదు భాజనములు గావె" ఇత్యాది. మఱియు గ్రంథమునుగూడనట్టి నామైకదేశముతో పండితారాధ్య చరిత్రమనియే పేర్కొనినాడు. "బసవలింగము కృతిపతియైకృతియు, రసికత బండితారాధ్య చరిత్ర, మటె" తదితర స్థలముల గూడ బలుతావుల నీ నామైకదేశమునే యాతడు మల్లికార్జున పండితుని పట్ల నుపయోగించినాడు.

కావున సోమనాథుని దృష్టిలో పండితారాధ్యుడన మల్లికార్జున పండితుడే యనియు, కరస్థలి సోమనాథుడు పండితారాధ్యకృపాసముద్గతుడని వర్ణించుటలో నాతడు మల్లికార్జునపండితునుండి దీక్షనొందిన కారుణ్య తనూజుడని చెప్పుటయే యాతని యుద్దేశ మనియు సహృదయులకు జెప్ప నవసరము లేదు. చిన్ననాటినుండియు మల్లికార్జునపండితుడు తఱచు శ్రీశైల యాత్రల గావించు చుండెడివాడు. కావున నా యాత్రా సందర్భములలో త్రిపురాంతక వాస్తవ్యుడగు కరస్థలిసోమనాథు డాతని కృపకు బాత్రుడయి యాతని వలననే దీక్ష నొంది యుండుటలో నసంగతి యేమియు నుండ నేరదు. పండిత ప్రకాండులు శ్రీ ప్రభాకరశాస్త్రి గారు కూడ నీయర్థమునే గ్రహించిరి. ఎట్టివారయినను సంప్రదాయ విరుద్ధముగ నిందుల కన్యార్థములు కల్పించి యెంత దబాయించినను సంప్రదాయజ్ఞులు వానిని గ్రహింప జాలరనియే నా విశ్వాసము. మల్లికార్జున పండితుని శిష్యుడయిన కరస్థలి సోమనాథుని కాతనివృద్ధదశలోనైనను పాలకురికి సోమనాథుడు సమకాలికుడై యుండెనని యంగీకరించుట తమవాదమునకు బాధకమగునని శ్రీ వేంకటరమణయ్యగారీసందర్భములో నేను "పాలకురికి సోమనాథకవి" అను గ్రంథమున వ్రాసిన "ఆ కరస్థలి సోమనాథుడు పండితారాధ్య కృపాసముద్గతుడు అని యందులోఁగలదు. దీనివలన నాతని దీక్షాగురువు పండితారాధ్యుడని వ్యక్తమగును. వీరశైవ పంచాచార్యులలో జతుర్థాచార్యుని కలియుగ వ్యవహారనామము పండితారాధ్యుడని మని మిదివఱకే గుర్తించి యుంటిమి. అందుచే గరస్థలి సోమనాథుడా పీఠమునకు జెందిన శిష్యుడని కూడ దలంపనగును గాని యంతకన్న నాకాలమున నున్న మల్లికార్జున పండితారాధ్యునివలన స్వయముగా లింగధారణదీక్ష వడసిన దయాహస్త గర్భసంభవుడనుటయే సమంజసము." అను వాక్యములలోనే నుదాహరించి పరిహరించిన గీతగీసిన భాగము నూతగాఁగొని "పండితారాధ్య కృపాసముద్గతు డనగా బండితారాధ్య పీఠమునకు జెందిన శిష్యుడని యర్థము చెప్పుకొనుటయే సరి" అని వ్రాసి, యంతటితో నూరకొనక

క్రీ. శ. 15 వ శతాబ్దమువాడయిన విభూతిగవురయ పండితారాధ్యుని గృహదాసుడయినట్లే కరస్థలి సోమనాథయ్య పండితారాధ్య కృపాసముద్ధతుడయి యుండవచ్చును" అని తమ యభిప్రాయమును సమర్థింపబూనిరి. "కృపాసముద్ధత" 'కృపాహస్త గర్భసంభవ" ఇత్యాది సాంకేతిక ప్రయోగములలో నుద్దిష్టమయిన సంప్రదాయ మెంత చెప్పినను గ్రహింపక వీరట్లు వ్రాయుట సరికాదని మనవిచేయుచున్నాను. సమకాలికభక్తులకు బురాతన భక్తులకు దాము భృత్యులమని భృత్యభావముతో జెప్పికొనుట శైవ వైష్ణవమతీయుల యాచారములలో నొకటి. వీరశైవ మతవిహితములయిన పంచాచారములలో భృత్యాచార మొకటి. సోమనాథు డాశ్వవిషయమున బండితారాధ్య చరిత్రావతారికలో "బసవని పుత్రుండ బసవగోత్రుండ, బసవేశు శ్రీ పాదపద్మశేఖరుండ, బసవన్నబొగడు బాల్పడు కవీంద్రుండ, బసవన్నబొగడు బాల్పడు పాఠకుండ, బసవన్న దూత నే బసవన్నబంట, బసవన్న లెంక నే బసవన్న లెంగి, బసవన్నయిలుపుట్టు బానిస కొడుక" ఇత్యాదిగా వ్రాసికొని తనకు బసవేశ్వరునెడ గల భక్తిపారవశ్యమును భృత్యాచారరూపకముగ బ్రకటించినాడు. వృషాధిప శతకములో బసవేశ్వరునిగూడ బురాతన శివభక్తుల బిడ్డనిగ, సేవకునిగ, లెంకగ వేర్వేరు రీతుల వర్ణించినాడు. పై పంక్తులందలి లెంక, ఇలుపుట్టు బానిస యనుశబ్దముల వంటిదే విభూతిగవురయ్యగారు ప్రయోగించిన గృహదాస విశేషణము. బసవేశ్వరుని పట్ల "బసవని పుత్రుండ, బసవగోత్రుండ" ఇత్యాదిగా నట్టి సంబంధ విశేషణముల నుపయోగించికొన్నను సోమనాథుడు తా నాతని కృపాసముద్ధతుడ ననికాని, వరహస్తగర్భసంభవుడనని కాని చెప్పికొనకుండుట గుర్తింపదగును. అందుకు గారణమాతడు బసవనికిసమకాలికుడయియాతని వలన దీక్షనొందినవాడు కాకుండుటయే యని విజ్ఞులకు జెప్పనక్కఱలేదు. జెలిదేవ వేమనారాధ్య, మల్లికార్జున పండితారాధ్యులవలెనే కరస్థలి సోమనాథుడు, కరస్థలి విశ్వనాథుడు (సోమనాథుని కవితావిద్యాగురువు) కేవల వీరశైవులు గాక శ్రౌతమార్గ శైవములకు జెందిన శైవబ్రాహ్మణ వంశజు లని గోచరించును. సాధారణముగా శైవబ్రాహ్మణ వంశజు లప్పుడుగాని యిప్పుడుగాని వీరశైవ పంచాచార్యుల గోత్రముల స్వీకరించి తా మాపీఠములకు సంబంధించిన శిష్యులుగా జెప్పికొను నాచారము గానరాదు. శ్రీవేంకట రమణయ్యగారిగ్రంథమునకు బర్యవేక్షకులు శైవబ్రాహ్మణ వంశ్యులు నగు శ్రీ సోమశేఖర శర్మగారి కీవిషయ మెఱుంగనిది కాదు. వారు వీరశైవ పంచాచార్య పీఠములు వేనికి శిష్యులమని చెప్పుకొనుచున్నట్లు తెలియరాదు. వారివలన నయిన శ్రీ వేంకట రమణయ్యగారు వాస్తవ సంప్రదాయమును గ్రహింతురుగాక! ఇంతకు కేవల వీరశైవులలో పండితారాధ్య పీఠమునకు సంబంధించిన శిష్యులుగూడ దత్పీఠ శిష్యత్వమును బ్రకటించుటలో పండితారాధ్య కృపాసముద్ధతులమని చెప్పికొనుట యెందును గనరాదు. "పండితారాధ్య" అనునది తొల్లింటి పీఠాధ్యక్షుని కలియుగ వ్యవహారము. ఆయా కాలములలో నాపీఠము నధిష్ఠించిన స్వాములకు వేర్వేఱు నామము లుండును. శ్రీశైల పండితారాధ్య పీఠమునకు సంబంధించిన చరిత్రము పుల్లకవియను నత డాంధ్రభాషలో రచించినాడు. దాని నీ నడుమనే తత్పీఠాధ్యక్షులు శ్రీ నిడుమామిడి మహాస్వాములవారు బెంగుళూరులో బ్రకటించినారు. అందు బ్రకటితమయిన పీఠపట్టవల్లరని దిలకించిన శ్రీ వేంకట రమణయ్యగారు నిరూపించిన సోమనాథుని కాలమున (క్రీ. శ. 1280—1340) పండితారాధ్యపీఠము నధిష్ఠించిన మహాస్వాముల నామములు కరిబసవ దేశికేంద్రస్వామి, మరికరిబసవదేశికేంద్రస్వామి, ఇమ్మడికరిబసవరాజస్వామి అని తెలియనగును. కరస్థలి సోమనాథుని దీక్షాగురువులు వీరిలో నెవరైననైనచో పాలకురికి సోమనాథుడు వారినామముల బేర్కొని తత్కృపా సముద్ధతు డనియే యాతని వర్ణించియుండును. సోమనాథు డాతని యెడ నుపయోగించిన "పండిరాధ్య కృపాసముద్ధతుడు" అను విశేషణముయొక్క సహజ సంప్రదాయార్థము తమవాదమునకు బాధకమని దానిని బరిహరించుటకయి శ్రీ వేంకటరమణయ్యగారు గావించిన యూహాకల్పనము సత్యదూరమని సంప్రదాయజ్ఞులు తలంపక పోరు.

(ii) పండితారాధ్యచరిత్రము సోమనాథుడు పండబారిన నిండువయస్సులో రచించిన కడపటి గ్రంథమని పలువురువిజ్ఞులు తలంచుచున్నారు. దానియవతారికలో నాతడు బసవపురాణావతారికలో జేర్కొనని మఱియొక విద్యాగురుని నుదాహరించినాడు. ఆతడు బెలిదేవ వేమనారాధ్యునిమనుమడు. "పేరెన్నబడిన శ్రీ బెలిదేవ వేమనారాధ్యులనుపరమారాధ్యదేవు, మనుమని శిష్యుండ, మద్గురులింగ ఘనకరుణాహస్తగర్భసంభవుడ". బెలిదేవ వేమనారాధ్యుడు మల్లికార్జున పండితారాధ్యునకు సమకాలికుడనియు పండితారాధ్యునివలెనె బసవేశ్వరునెడ భక్తిగౌరవములు గలవాడనియు నాతడు, సారసానమ్మ మున్నగు భక్తులు మల్లికార్జున పండితుడు చందవోలులో వెలనాటిచోడుని సభకు రాకమున్నె యాతని సందర్శించి బసవేశ్వరుని మహిమల నాతనికి నివేదించి సత్కారము లందినట్లు పండితారాధ్య చరిత్ర దీక్షా ప్రకరణమువలన దెలియనగును. మఱియు నాతని చరితము పురాతన ప్రకరణమున బ్రత్యేకముగ వర్ణితమయినది. మనుమడనగా పౌత్రుడు లేక దౌహిత్రుడు అను సహజార్థము సర్వాంధ్రదేశమందును వ్యవహృతమగుచున్నది. బెలిదేవ వేమన పెద్దయ్యగారి నికూడ సోమనాథుడే వేమనారాధ్యుని నుదాహరించుటచే నీతడు పండితారాధ్యునకు సవయస్కుడగు వయోవృద్ధుడని గోచరించును. పండితారాధ్యుని శిష్యుడగు కరస్థలి సోమనాథునివలన నాతని పెద్దతనములో బసవపురాణ కథాసూత్రముల నెఱింగిన సోమనాథునకు, ఆపండితారాధ్యుని సమకాలీనుడు సవయస్కుడునగు వేమనారాధ్యుని మనుమడు విద్యాగురుడైనప్పు డాతడు వేమనారాధ్యునకు పౌత్రుడో దౌహిత్రుడో కావదగిన మనుమడే గాని యాతని యనంతరము పక్కతరముల తరువాత వెలసిన మనుమని వరుసగల వంశసుడు కానేరడని పూర్వోక్త విషయములను సహజసరళమార్గముల సమన్వయించు సహృదయులకు దోపకపోదు. కాని యిట్టి సహజార్థము తమవాదమునకు బాధకమను కావున నది పనికిరాదని యాతడు వేమనారాధ్యుని యనంతరము చాల కాలములోనుండి కేవలము వావివరుసల బట్టి మనుమనిగా జెంపదగిన తద్వంశస్థుడు మాత్రమే యని తలంపవలెనని శ్రీ వేంకటరమణయ్యగారు శాసించుచున్నారు. అందు కుపపత్తిగా బహుశాసనజ్ఞులయిన వీరు ఆంధ్ర చోళవంశజుడు త్రిభువనమల్లచోడుడు వెలయించిన యొక శాసనములో దాను సూర్యవంశ క్షత్రియుడనని తెలుపుటకు స్ఫోరకముగా శ్రీరాఘవస్వామి మనుమడనని చెప్పికొనిన "శరధి గట్టించి రాక్షసుని జయించి చనిన శ్రీరాఘవస్వామి మనుమండు" అను పద్యమును శాసన పద్యమంజరినుండి యుదాహరించి యీక్రింది వాక్యముల లిఖించిరి:—

"ఏ వరుసక్రమము ననుసరించి "శరధి గట్టించి రాక్షసుని జయించి చనిన శ్రీరాఘవస్వామికి" ఆంధ్రచోళ వంశజుడైన త్రిభువనమల్లుడు మనుమడాయెనో, యావరుసనే పాల్కురికి సోమనాథునియొక్క గురువు బెలిదేవవేమనారాధ్యునకు మనుమడాయెను. ప్రభాకర శాస్త్రులవారు చెప్పినట్లు ప్రశిష్యుడైనప్పటికిని శిష్యుని శిష్యుడని యర్థము చెప్పికొనవలసిన యావశ్యకత లేదు. శిష్యసంతతికి జెందినవాడని యర్థము చెప్పికొనవచ్చును. కాబట్టి బెల్దేవివేమనారాధ్యుని కాలమును నిర్ణయించుటకు సహకారి కాజాలదు."

కేవల మొక్క వరుస మాటయే తడవనేల? త్రేతాయుగమునాటి శ్రీరామచంద్రునకు నాతని మనుమడనని చెప్పికొనిన కలియుగము నందలి త్రిభువన మల్లచోళునకు నడుమ నెంతకాల వ్యవధియున్నదో యంత వ్యవధియే వేమనారాధ్యునకు సోమనాథుని గురుడయిన యాతని మనుమనికి నుండెనని చెప్పిన నింతకన్న సరసతరముగ నుండునేమో గదా! వాస్తవమెట్లున్నను క్షత్రియవంశ్యులగు రాజులు పలువురు గౌరవార్థమయి తాము సూర్యవంశమునకో, చంద్రవంశమునకో చెందినట్లు వర్ణించుకొనుట పరిపాటి. పూర్వోదాహృతుడయిన త్రిభువన మల్లచోడుడే గాక కుమారసంభవకర్త నన్నెచోడుడు కూడ రవికుల శేఖరుండనని, కరికాలచోడ వంశజుడనని తన కావ్యమున వ్రాసికొన్నాడు. ఇట్టి వ్రాతలు కేవల మా[illegible] తమ వంశగౌరవము నుద్ఘాటించు తలంపుతో జెప్పనవేయని విజ్ఞులు గ్రహింతురు. సూర్యవంశజుడయిన శ్రీరామచంద్రుడు తనకు కూటస్థుడని చెప్పు నుద్దేశముతోడనే త్రిభువన మల్లచోళుడు పయిరీతిని

వ్రాయించెనని యెట్టివారికైన స్ఫురింకమానదు. ప్రస్తుతవాద సందర్భమున శాసనముల వెదకి వెదకి, శ్రీ వేంకటరమణయ్యగారిట్టి యపూర్వ ప్రయోగమును సాటికిదెచ్చి పోటీకి నిలువ బెట్టుట యందలి యుచితజ్ఞతను సహృదయులే పరామర్శింతురుగాత!

గురులింగ మనునది వీరశైవ వాఙ్మయమున దీక్షాగురునకు వ్యవహరించు సాంకేతిక సాంప్ర దాయక విశేషణమేగాని, యొక్క వ్యక్తి నామముగాదని నేను పలుసారులు తెలిపి యున్నాను. అందుచేతనే "గురులింగ తనూ జుండ" నని యనుభవసారపద్యమునను, "శరణ గణాశ్రయసకలస్వరూప, గురులింగ వరకరో దరజనితుండ" నని బసవ పురాణావతారిక యందును, సోమనాథుడు జెప్పిన వాక్యముల లోని గురులింగ శబ్దమాతని జనకుని నామము గాక కేవలము దీక్షాగురు సూచకమేయని హెచ్చరించి యుంటిని. ప్రభాకరశాస్త్రిగారు బసవపురాణ పీఠికలో నీసందర్భమున "పయి వాక్యముల వలన బెలిదేవ వేమనారాధ్యుల మనుమడయిన గురులింగార్యుడీతని దీక్షాగురు డని తెలియనగును. సంస్కృత పండితారాధ్య చరిత్రమునఁగూడ నిట్లేకలదు. "బెల్దేవివేమనా రాధ్యస్య ప్రశిష్యస్య కృపానిధేః। గురులింగా ర్యస్య దయాహస్తగర్భసముద్భవః" మనుమ డనగా నాచార్యవంశమున మనుమడని సం స్కృత గ్రంథకర్త గ్రహించెను. కావుననే "ప్రశిష్యస్య" అనెను" -అని వ్రాసిన సంగ తులు సరికావు. "మనుమని శిష్యుండ" అను పదముల వెనువెంటనే యున్న "మద్గురులింగ ఘనకరుణాహస్తగర్భ సంభవుడ" అను సోమ నాథునివాక్యమే వేమనారాధ్యుని మనుమ డాతని దీక్షాగురుడు కాడనియు నాతని పేరు గురులింగము కాదనియు వ్యక్తమొనర్చును. వేమనారాధ్యుని మనుమనియొద్ద సోమనాథు డేదో యొకకాలమున వేద వేదాంగముల నభ్య సించియుండును. కట్టికూరి పోతిదేవర సోమ నాథుని దీక్షాగురుడు కానోపును. ఇందు గూర్చినచర్చలు "పాలకురికి సోమనాథకవి" అను నా గ్రంథము 7 వ ప్రకరణమున జూడ దగును.

(iii) పండితారాధ్య చరిత్రమందలి పర్వత ప్రకరణము చివర సోమనాథుడా కృతిరచనము ముగియునాటికి సజీవులయి యున్న పండితా రాధ్యుని యాత్మసంతానము (పుత్ర, పౌత్రులు) శిష్య (శైవ) సంతానమును (ఇవటూరి సోమ నాథయ్య, తత్పుత్రులు) వేర్వేరుగాని వారు పరంపరాభివృద్ధిగా వర్ధిల్లుదురుగాక యని యాశీర్వదించెడి భావనతో వారిపట్ల వరుసగ నీక్రింది వాక్యములు లిఖించినాడు.

"అనఘ గురుచతుష్కాత్మ సంతాన
తనయపరంపరోత్తర పరంపరలు
పరిచిత గురుపరంపరఁ దేజరిల్లు."
"అనఘ గురుత్రితయాన్వయ తనయ
తనయ పరంపరోత్తర పరంపరలు
ప్రభుతర గురుపరంపరఁ దేజరిల్లు."

ఇట రెండుతావుల గూడ "తేజరిల్లు" అను తదర్థార్థక క్రియారూపమే సోమనాథుడు వాడినాడు. వరంగలులో వెలువడిన పండితా రాధ్య చరిత్ర ప్రథమ ముద్రణమునను, తరు వాత విజయనగరములో శ్రీనిడుదవోలు సుంద రము పంతులుగారు, పసుపుల నాగయోగిగారు వెలువరించిన ద్వితీయ ముద్రణమునను నీతదర్థ రూపమే యుభయత్ర ముద్రింపబడినది. ఆంధ్ర గ్రంథమాలికలో వెలువడిన పునర్ముద్రణములో పరిష్కర్తలు శ్రీ చిలుకూరు నారాయణరావు గారు రెండవతావునందలి "తేజరిల్లు" అను రూపమును "తేజరిల్లె" అను భూతకాలిక రూపముతో గ్రంథమున ముద్రించి పుట యడు గున "తేజరిల్లు" అను రూపమును జూపి యున్నారు. మొదటితావున "తేజరిల్లు" అను పూర్వరూపమునే గ్రంథమున గూడ ముద్రించి పుట యడుగున "తేజరిల్ల" అని పాఠాంతర మును జూపినారు. నారాయణరావు గారు గావించిన మార్పులయొక్క యనౌచిత్యమును గూర్చి నా గ్రంథమందలి పదియవ ప్రకరణము చివర జర్చించియే యున్నాను. ఇచ్చట ప్రక్రమ మును బట్టి పర్యాలోచింప "తేజరిల్లు" అను తదర్థార్థరూపమును ఆశీరర్థకముగనే సోమ నాథుడు వాడియుండినట్లు తోపగలదు. పండి తారాధ్యుని శిష్యుడు కరసలి సోమనాథయ్య కతని వృద్ధదశలో సమకాలికుడయి, పండితా రాధ్యుని సమకాలీనుడు నవయస్కుడునగు వేమనారాధ్యుని మనుమని శిష్యుడయిన మన కవి సోమనాథుని కాతని పెద్దతనములో పండి తారాధ్యుని మనుమలు, పండితారాధ్యుని

పుత్రుడు కేదారయ్య శిష్యుడు ఇవటూరి సోమనాథుడు, నాతని పుత్రులు పండితారాధ్య చరిత్ర రచనాకాలమునాటికి సజీవులయి సోమనాథునికి సమకాలీనులయి యాతని యాశీర్వాదమును బడయుటలో నసంగతి యేమియు లేదు. ఆశీరర్థకముగ తదర్థార్థ క్రియారూపములు వాడిన ప్రయోగములు పూర్వాధుని కాంధ్రవాఙ్మయములో ద్రవ్విత్తండములుగ నున్నవి. మచ్చున కొకటిరెండు.

"ఇందఱును నిత్తు రెల్లప్పుడీప్సితముల
నర్థిభూపాలు వీరభద్రాధిపునకు"

"శాశ్వతైశ్వర్యముల గృతిస్వామి కొసగు"
(శ్రీనాథుని కాశీఖండము)

సంగతి సందర్భము లిట్లుండ వేంకట రమణయ్యగారు నారాయణరావుగారి మార్పుపాఠమును నేన్పుగాగొని, సంప్రదాయముల ద్రోసి రాజని, పండితారాధ్య చరిత్ర రచనమునాటికి, పండితారాధ్యునకు సోమనాథునకు నడుమ నధమపక్ష మయిదు తరములయిన గడచియుండవలెనని తమ వాదసాధకముగా వంశవృక్షరూపకముగ నీక్రింది పథకమును దమ గ్రంథమున బ్రదర్శించిరి.

మల్లికార్జున పండితుడు
|
(పుత్రుడు) కేదారయ్య - (తచ్ఛిష్యుడు) ఇవటూరి సోమనాథయ్య

కేదారయ్య: మనుమపండితుడు, భీమన పండితుడు, మహాదేవయ్య, చెన్నవిభుడు

ఇవటూరి సోమనాథయ్య:
- నూరీశ్వరుడు — తనయ — తనయ
- విశ్వనాథప్పయ్య — తనయ — తనయ
- సింగణమంచి — తనయ — తనయ

ఇవటూరి సోమనాథుని పుత్రుల నాశీర్వదించుటలో సోమనాథు డుపయోగించిన వాక్యమునం దామ్రేడితరూపమున నున్న తనయశబ్దమునుబట్టి యాపుత్రులు మువ్వురికి నొక్కొక్కరికి మనుమలుకూడ గలిగి గతించిన యనంతరమే సోమనాథుడు పుట్టియుండవలెనని శ్రీ వేంకటరమణయ్యగారు సాధింపబూనినారు. "నభవిష్యతి హన్త సాధనమ్ కిమువాన్ యత్ప్రహరిష్యతో విధేః" అనిగదా కవికులగురుని సూక్తి. అధికారబలము గలవారికి సాధింపరాని దేముండును? ఇచ్చట తనయ, తనయ శబ్దముల వెనువెంట నేయున్న "పరంపరోత్తర పరంపరలు" అను పదములకు గతి యేమి? అంతమందిని చేర్కొన్న సోమనాథునకు నూరీశ్వరాదుల తనయులను, మనుమలను చేర్కొనుట బరువయ్యెనా? ఈ ప్రయోగములన్నియు మనకవులు కథానాయకులు మున్నగువారి నాశీర్వదించుచు నుపయోగించెడి "అభ్యుదయ పరంపరాభివృద్ధిగ, పుత్రపౌత్రాభివృద్ధిగ" మున్నగు నాశీరర్థకగణములో జేరదగినవే యని నా యభిప్రాయము. పండితవర్యులు ప్రభాకర శాస్త్రిగారు వీనినట్లే గ్రహించినారు. ప్రక్రమ సందర్భములబట్టి యట్టితీరుననే పయివాక్యములను సామాన్యభాషాజ్ఞానము గలవారుకూడ సమన్వయించుతురని నా విశ్వాసము. అట్లుగాక పయివాక్యములందలి పుత్రపౌత్ర పరంపరోత్తర పరంపరలు గ్రంథరచనమునాటికి గతించిన భూతకాలిక పరంపరలే యని యర్థముచేయునెడల, సోమనాథుని కాలమును బ్రతిపక్షులు వాదించినట్లు కేవలము 80, 90 సంవత్సరములు మాత్రమే దిగువకులాగుట చాలదని, దానిని బెక్కుశతాబ్దులు క్రింది కీడ్వవలసియుండునని నేను మొదటినుండియు జెప్పుచున్నాను. గ్రంథారంభమున గథాశ్రోతయగు నూరనామాత్యుని "అతిశయ భక్తి - బుద్ధియు భవదీయ పుత్రపౌత్రాభి - వృద్ధియు సంపత్సమృద్ధిగా జిరభి - వృద్ధియు... బొందెడమనుచు - దీవించి నిన్ను సంభావించి శ్రోత - గావింతు..." అని దీవించినట్లే, సోమనాథుడు గ్రంథాంతమున దద్రచనము ముగియునప్పటికి జీవించి పండితారాధ్యుని గురుపట్టము నిర్వహించుచున్న యాతని పుత్రపౌత్రులను, శిష్యసంతతిని చేర్కొని వారి

వంశములు, గురుపట్టాధికారములు తామర తంపరై తేజరిల్లు (వర్ధిల్లు) గాతమని యాశీర్వదించినాడు. ఇదియే సత్యసమ్మతమయిన ఫక్కి యని సహృదయులకు దోపకపోదు. ఈ సందర్భములో శ్రీ వేంకటరమణయ్యగారు సోమనాథు డివటూరి సోమనాథయ్య పుత్రులను "సూరీశ్వరుండు లోకారాధ్యపదవిహారుండు విశ్వనాథప్పయ్యగారు, గారుణ్యనిధులు సింగణమంచిగారు" అని పేర్కొనుటలో విశ్వనాథప్పయ్య విషయమున ఛందస్సున కనుకూలించునట్లు "లోకారాధ్య పదవిహారుండు" అని యుపయోగించిన విశేషణమును బురస్కరించికొని "మల్లికార్జున పండితుడు నాతని పుత్రుడు కేదారయ్య యనంతర మేకారణముననో వారి గురుపట్టాధికారము వారి వంశము నుండి తొలగి, వారి శిష్యుడు ఇవటూరి సోమనాథయ్య వంశమునకు జేరెననియు, లోకారాధ్య పట్టమున కాతని పుత్రుడు విశ్వనాథప్పయ్య యభిషిక్తుడయ్యెననియు, కావున కేదారయ్య మరణము నటుపిమ్మట కడచిన విశ్వనాథప్పయ్య పట్టాభిషేకమును పండితారాధ్య చరిత్ర రచనకు ముందు సంభవించిన చరిత్రాంశములని తెల్లమగుచున్నవి" అను విపరీతాభిప్రాయములను వెలార్చినారు. ఇవి కేవల మత్యూహలని చెప్పనక్కఱలేదు. ఎవరి గురు పటములు వారి కున్నవి. ఎవరి శిష్యకోటి వారి కున్నది. అవి యొకరిని త్యజించి మఱొకరిని వరింపలేదు. కేదారయ్య పుత్రులు నల్వురను పేర్కొనునెడ గురుచతుష్క మనియు, ఇవటూరి సోమనాథయ్య పుత్రులు ముగ్గురను పేర్కొనునెడ గురుత్రితయ మనియు సోమనాథు డుపయోగించిన విశేషణముల వలననే యీ యుభయవంశములు గూడ నప్పుడు గురుపట్టముల నెఱపుచుండినట్లు స్పష్టము కాగలదు. సహజ, సరళ, సక్రమ మార్గముల నతిక్రమించి వక్ర పథముల ద్రొక్కి విపరీతార్థముల వెలువరించుటకు వీరు వెనుదీయని ఫక్కి కిదిగూడ నొక దృష్టాంతము కాగలదు. పండితారాధ్య చరిత్ర రచనము ముగియునప్పటికి కేదారయ్య గతించెనని రూఢిగా చెప్పుటకు గూడ సోమనాథుని వాక్యములలో నెట్టి యవకాశమును లేదు. శ్రీ సోమశేఖర శర్మగారు, నిడుదవోలు వేంకటరావు గారు నిరూపించునట్లు క్రీ. శ. 1216 నాటి పిల్లలమఱ్ఱి యెఱుకసానమ్మ శాసనమందుదాహృతుడయిన ఇవటూరి సోమనాథుడు, కేదారయ్య శిష్యుడు ఇవటూరి సోమనాథుడే కావచ్చును క్రీ. శ. 1230-35 ప్రాంతముల రచింపబడినదని యస్మదాదులు తలంచు పండితారాధ్య చరిత్రము చివర సోమనాథు డాతని నాశీర్వదించుట యందుకు సంగతమే కాగలదు.

ఇట్లు శ్రీ వేంకటరమణయ్యగారు సత్యముల దాఱుమాఱు చేసి సోమనాథుని కాలనిర్ణయమున కుపకరించు నాతని కృతులందలి యంతస్సాక్ష్యమును నిజవాదానుకూలముగ సమన్వయింపజేయు ప్రయత్నములందలి సామంజస్యమును సహృదయులే నిర్ణయింతురు గాక!

ఇక వీరి గ్రంథమందలి యితర విషయక వాదముల సంగ్రహముగ బరామర్శింతము.

## I. కర్ణాటక సాక్ష్యము

కర్ణాటక కవిచరిత్రము ననుసరించి శ్రీ వీరేశలింగము పంతులు మున్నగువారు సోమనాథుని కాలనిర్ణయ విషయమున దమ తొల్లింటి నిర్ణయమును మార్చుకొన్న విషయమును బురస్కరించికొని శ్రీ వేంకటరమణయ్యగారు తమ గ్రంథోపసంహారములో నీ క్రింది వాక్యముల లిఖించిరి.

"వారు విశ్వాసపాత్రమైన పిడుపర్తి సోమనాథుని సాక్ష్యమును విసర్జించి కర్ణాటక వ్యామోహమున దగుల్కొని నరసింహాచార్యులు గారి యపసిద్ధాంతముల చుట్టు నొక సాలీని గూటిని నిర్మించుకొనిరి... కర్ణాట కైలాటమున జిక్కి యాంధ్రవాఙ్మయ విమర్శకు లందు జెప్పియుండు చరిత్రాంశములను జక్కగ గ్రహింపజాలరైరి. కావున వారి పరిశోధనలు వమ్మగుట వింతగాదు."

కైలాటమున నేయర్థమున వీరు వాడినారో తెలియదు. శబ్దరత్నాకరమున దానికి మాయోపాయమను నర్థ మీయబడియున్నది. ప్రామాణిక చరిత్రకారుడని కర్ణాటకలోకమెల్ల గౌరవించు శ్రీ నరసింహాచార్యులుగారి వ్రాతలెల్ల కల్లబొల్లి మాయలని శ్రీ వేంకటరమణయ్యగారు సంభావించుచున్నారా? దానికేమి? ఇట్లు వ్రాసిన మహనీయులు, కర్ణాటకవిచరిత్ర

కారులగు శ్రీ నరసింహాచార్యులుగారి నిర్ణయముల గాదనుటకు దామునూడ నట్టి కైలాట ముననే చిక్కి, నరసింహాచార్యులుగారికి బ్రతిపక్షులుగా డాక్టరు ఏ. వేంకటసుబ్బయ్యగారు ఆచార్యులుగారి కైలాటముపయి గోలాట మొనర్చుచు గర్ణాటములోనే వ్రాసిన "కలవు కన్నడ కవిగళ జీవనకాల విచార" అను వ్యాసములనే శరణములుగా గొని, వాని యాధారము మీదనే తమ ప్రకృతవిమర్శనము చాలవఱకు సాగించుట శోచనీయము గాదా! అత్త గావించిన పనులకు ఆగడిలేదు కాబోలు! బయటివారి వ్రాతలతో నిమిత్తములేకయే సోమనాథుడు తేటతెనుగున వ్రాసిన యాతని కృతులందలి యంతస్సాక్ష్యమునుబట్టియే యాతని కాలనిర్ణయమును సహజ, సరళ, సక్రమమార్గముల సులువుగ జేయదగు విధానమునకే నేను మొదట నుండియు బ్రాధాన్య మొసంగుచున్న విషయము పాఠకులకు విదితమే. అట్టి బాహాట సాక్ష్యముతో నిచ్చవచ్చినట్లు చెరలాట మొనర్చి నిజవాద సమర్థనమునకయి విపరీతవిధముల సోమనాథుని వాక్యములను సమన్వయముచేసి వీరు గావించిన కైలాటమెంత యిమ్ముగా నున్నదో పాఠకులు తిలకించియే యున్నారుగదా! తమ మార్గ మిమ్ముగా నున్నదని నమ్మి యితరుల యభిప్రాయములు వమ్మయినవని వీరు నిరసించుటలో వింతలేదు. శ్రీ నరసింహాచార్యులుగారు తామనుకొన్నది కాదనుచు గర్ణాటకవి చరిత్రముపయి డాక్టరు వేంకటసుబ్బయ్యగారు గావించిన విమర్శనములు చాలవఱకు నసూయాద్వేష ప్రేరితములని యభిప్రాయమును బ్రకటించి, వానిపయి బునర్విమర్శనముల గావించి తమ తొల్లింటి నిర్ణయములనే సమర్థించికొనియున్న సంగతి కర్ణాటక విద్వాంసులకెల్ల విశదమే. ఇప్పటికి నవసర సందర్భములలో వారు ఆచార్యులుగారి నిర్ణయములనే ప్రమాణములుగా నుదాహరింతురు గాని వేంకటసుబ్బయ్యగారి నిర్ణయముల దడవి కయికొనుటలేదు.

"ఆంధ్రపాఠకుల కపరిచితము లవుటచే నీ సందర్భమున కన్నడ వాఙ్మయ పరిశోధకుల యభిప్రాయములను సుదీర్ఘము లయినను అనువదింపవలసి వచ్చినది" అని పూర్వోక్తవిమర్శ ప్రతివిమర్శనముల సారాంశములను శ్రీ వేంకటరమణయ్యగారు కొంత విపులముగనే తమ గ్రంథమున నుదాహరించినారు. వానిని బాఠకులే సావధానముగ జదివి యవి సోమనాథుని కృతులందలి యంతస్సాక్ష్యమునుబట్టి సహజముగ నేర్పడు నాతని కాలనిర్ణయమున కెంతవఱకు బాధకసాధకములగునో తామే నిర్ణయించుకొనెదరుగాక! వారి యుపయోగమునకై కొన్ని ముఖ్యాంశముల మాత్ర మిట బరామర్శించెదను.

## (i) ఉద్భటకావ్యకర్త సోమరాజు కాలము

ఈతడు శాలివాహన శకాబ్దము 1144 (క్రీ. శ. 1222) లో తాను రచించితినన్న ఉద్భటకావ్యములో నొక్క పద్యములోనే హరీశ్వరుని, కెరెయపద్మరసును, పాలకురికి సోమనాథుని నుతించియుండుటచే నీ మువ్వురు గూడ క్రీ. శ. 1222 కు పూర్వము 1195 ప్రాంతమున నుండియుందురని శ్రీ నరసింహాచార్యులు గారి నిర్ణయము. ఈ గ్రంథరచనాకాలమును గూర్చి కవిచెప్పిన పద్యములో ముద్రితప్రతి యందును, దానికి మాతృకయగు కాగితపు బ్రతి యందును "సాసిరదనూర్నంద నాల్వత్తు నాల్కనె" అను పాఠమేగాని నరసింహాచార్యులుగా రుదాహరించిన "సాసిరదనూఱఱింసింద నాల్వత్తు నాల్కనె" అను పాఠము లేదనియు, ముద్రితప్రతి దాని మాతృక ప్రతిలోని పాఠములో "నూర్నంద" అను పదమునకు ముందొక గుర్వక్షరము పొగపాటున లోపించినదనియు, లేకున్న పద్యములో గణభంగము కలుగుననియు, ఆ లుప్తాక్షరము "నా" అయియుండు ననియు దానినిబట్టి గ్రంథరచనాకాలము "సాసిరద నానూర్నంద నాల్వత్తు నాల్కనె" అనగా శా. శకము 1444 (1522 A-D) సంవత్సర మగుననియు, "నానూర్నంద" అను పాఠము వ్యాకరణ దుష్టమగుటచే శ్రీ నరసింహాచార్యులుగారు దానిని "నూఱఱింసింద" అని మార్చియుందురనియు శ్రీ వేంకటసుబ్బయ్యగారి యారోపణము. కవి చరిత్రమును రచించునప్పుడు తమకు దొరకిన తాళపత్రప్రతిలో "నూఱఱింసింద" అను పాఠమే యున్నదనియు, కనవచ్చిన పాఠములో తామెట్టి మార్పు చేయలేదనియు, అట్లు మార్పవలసిన యవసరము తమకు లేదనియు శ్రీ నరసింహా

చార్యులుగారి సమాధానము. "నానూర్సంద" అన్నపాఠమే వారికి దొరకిన ప్రతిలో గాన వచ్చినచో నది వ్యాకరణ దుష్టమయినంతమాత్రమున దానిని నరసింహాచార్యులుగారివంటి ప్రామాణిక చరిత్రకారుడు "నూతింసింద" అని మార్చియుండునని (అందునను నట్టిమార్పువలన కవికాలవిషయమున 300 సంవత్సరముల భేదమేర్పడునప్పుడు) సహృదయు లెవ్వరైన జెప్ప సాహసింతురా! తాము చూచిన ప్రతిలో "నూతింసింద" అన్నపాఠమే యున్నట్లు జ్ఞాపకమని తాను నొక్కి చెప్పినప్పుడు వారి మాటను విశ్వసింపజనదా! ఆ పాఠముగల ప్రతిని ఆచార్యులుగారు వెలువరింపరయిరని యొక యాక్షేపమును వేంకటరమణయ్యగారు వెలార్చిరి. కవిచరిత్రకారులు తమ రచనా సందర్భమున వేర్వేఱుతావుల బరీక్షించిన ముద్రితాముద్రిత గ్రంథ ప్రతులనెల్ల సేకరించి తమ స్వాధీనములో నుంచుకొనెదరా? ఆంధ్రకవుల చరిత్రము వ్రాసిన శ్రీ వీరేశలింగము పంతులుగారయిన నట్లొనర్చిరా? పండితారాధ్య చరిత్రోపోద్ఘాతమునందును, తదుపరి ప్రబుద్ధ కర్ణాటక పత్రికలో ప్రకటించిన "వీరశైవ వాఙ్మయావతార" అను వ్యాసమందును కీ॥ శే॥ శ్రీ చిలుకూరి నారాయణరావుగారుకూడ నీ పద్యపాఠమునుగూర్చి యిట్టి యాక్షేపమే యొనర్చి, "నూతింసింద" అనుపాఠమే వ్రాతప్రతియందును గానరాదని యార్భాటము సేయగా, కీ॥ శే॥ శ్రీ చిదిరెమఠము వీరభద్రశర్మగారు (విభూతి పత్రికాధిపతులు) వారి వ్యాసమునకు బ్రత్యుత్తరముగా ప్రబుద్ధ కర్ణాటక పత్రికలో 1940 సంవత్సరములో బ్రకటించిన ప్రతి విమర్శవ్యాసములో, తా మంతకు మున్ను కాశీలో విద్యాభ్యాస మొనర్చుకాలములో ధార్వారు జిల్లాయందలి రాణిబెన్నూరు మఠము స్వాములువారు కాశీయాత్రకు వచ్చినప్పుడు వారి యొద్ద సోమరాజు రచించిన ఉద్భట కావ్యముయొక్క తాళపత్ర ప్రతి చూచితిమనియు, దానిలో బూర్వోక్త పద్యమున 'సాసిరదనూతింసంద' అన్నపాఠమే యున్నదనియు, ఆపద్యమున్న తాళపత్రమునకు దాము ప్రతిబింబముకూడ దీసికొని భద్రపఱచితిమనియు బ్రకటించి యున్నారు. శ్రీ శర్మగారిని గలిసి కొన్నప్పుడు శ్రీ నారాయణరావు* గారు దానిని జూచి యాత్మ సంతృప్తి నంది యుండవచ్చును. కావున 'నూతింసంద' అను పాఠమున్న ప్రతులెందును లేనేలేవని వాదించుట సాహసము గాక మానదు. అవసరమైనచో శ్రీ వేంకటరమణయ్యగారు రాణిబెన్నూరు మఠమునకేగి తమ సంశయమును గూడ దీర్చికొందురు గాక! విరివిగా వృషభ (బసవ) స్తవముల రచించిన సోముడు పాల్కురికి సోమనాథుడు గాక కర్ణాటాంధ్రవాఙ్మయముల నింత దనుక మఱొక్కరు డెవ్వడు కానరానందున సోమరాజు "సముదంచద్వృషభ స్తవామరమహీజారామనం సోమనం" అని నుతించిన యాతడు పాలకురికి సోమనాథుడే గాక మఱొక్కడు కానేరడని శ్రీ నరసింహాచార్యులు, వీరేశలింగముపంతులు గారే గాక ప్రభాకరశాస్త్రి గారు మున్నగు పండితులు గూడ నంగీకరించి యున్నారు. ఈ సందర్భమున శ్రీ వేంకటరమణయ్యగారు తమ గ్రంథము 32 పుట యథో జ్ఞాపికలో వ్రాసిన వాక్యములలో "కాని పాలకురికి సోమనాథుడు రచించినది వృషాధిప శతకము గాని వృషభ స్తవము గాదు" అని లిఖించుట వింతగానున్నది. వృషాధిప శతక, బసవపురాణముల గాక సోమనాథుడు మఱేమియు బసవ స్తవముల రచింపనే లేదా! "బసవన్న మహిమ శుంభద్భక్తి యుక్తి బసరించితివి గద్యపద్యాది కృతుల, నర్ణవావృతధాత్రియం దొప్ప బసవ వర్ణనల్ చేసితి"వని భక్తులు తన్నుగ్గడించి నట్టు లాతడు పండితారాధ్యచరిత్రావతారికలో వ్రాసికొన్నాడు. బసవపురాణ పీఠికలో శ్రీ ప్రభాకరశాస్త్రిగారును, నా గ్రంథములో "సోమనాథుని లఘుకృతులు" అను 16వ ప్రకరణమున నేనును పంచప్రకార గద్య, నమస్కార గద్య, అక్షరాంక గద్య పద్యాదికములు మున్నగు నిట్టి బసవ స్తవములను గూర్చి వ్రాసినది శ్రీ వేంకటరమణ్యగారు చిత్తగించలేదా? బసవేశ్వరుడు కర్ణాటభాషలో నాల్గులక్షల యఱువదినాల్గువేల గీతముల రచించినట్లు సోమనాథుడు చెప్పినాడు. బసవేశ్వర వచనములను పేర వ్యవహృతము లగుచున్న యీ గీతములలో నిప్పటికి పరిశోధకుల కే తొమ్మిది వందలో దొరకుట దుస్తరమైనది. అట్టి గతియే సోమనాథుని బసవ స్తవములకు పట్టినది.

అసంఖ్యాకముగ నాతడు రచించిన యీ లఘు కృతులలో మనకు దొరకుచున్నవి చాల దక్కువయే. సోమరాజు గ్రంథ రచనాకాలము క్రీ. శ. 1222 నాటికి సోముని బసవపురాణము కన్నడబాసలోనికి బరివర్తితము కానే లేదు. సంస్కృత పదభూయిష్ఠముగ సోమనాథుడు లెక్కకు మిక్కిలిగ రచించిన యీ లఘుస్తవములు శ్రీ శైలయాత్రాదిక సందర్భములలో కన్నడులకు నాంధ్రులకు గూడ గ్రంథస్థములయి యాతని కాలముననే కర్ణాటదేశమున గూడ నెప్పటి కప్పుడే వ్యాప్తమయియుండు ననియు, అట్టి వాని నుద్దేశించియే "వృషభస్తవము లనుకల్పవృక్షముల కారామ మయిన సోముని" అని సోమరాజు నుతించి యుండు ననియు నేను బలుసారులు చెప్పి యుంటిని. సోమరాజు గ్రంథమునందలి పద్యములు కర్ణాట భాషలో సాళ్వకవి క్రీ. శ. 1550 ప్రాంతమున రచించిన యలంకార గ్రంథములో లక్ష్యములుగా నుదాహృతము లయినవి. క్రీ. శ. 1522 లో సోమరాజు గ్రంథము రచింపబడినచో నానాటి దేశపరిస్థితులలో నిట్టిది యంత స్వల్పవ్యవధిలో జరుగుట యసంభవమని చెప్పనక్కఱలేదు. ఇంకను నిందు గూర్చిన విశేష చర్చలకు నా గ్రంథమందలి పదియవ ప్రకరణమును, పూర్వవ్యాసములను జూడదగును.

సోమరా జెచ్చట రాజ్యమేలెనో, యాతడేవంశపురాజో స్పష్టముగ దెలియదు. తన పూర్వులను బేర్కొనుటలో నాతడు తనముత్తాత తిరుమలరాజని, తాత రాయణరాజని, తండ్రి ఇందుశేఖరరాజని చెప్పి, రాయసము లింగరసనునతడు తనకు గ్రంథ రచనాకాలమున లేఖకుడుగా నుండెనని యుదాహరించినాడు. విజయనగర రాజులలో శ్రీకృష్ణదేవరాయల కాలమునుండియే తిరుమలక్షేత్రము ప్రసిద్ధిలోనికి వచ్చినదనియు, అప్పటినుండియే తిరుమలనామాంకితులు మనుజులలో బయలుదేఱిరనియు, వ్రాత యనునర్థములో వ్రాయసము అనుపదముకూడ క్రీ॥ శ॥ 15 వ శతాబ్ది ప్రాంతమునుండి వ్యవహృతమయినదనియు, ఆపదమే కన్నడమున రాయసమని మాఱినదని శ్రీ వేంకటరమణయ్యగారు చెప్పుచున్నారు. ఇవి కేవల మూహాగానములనియే చెప్పదగును. శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధక సంస్థవారు ప్రకటించు గ్రంథముల బరీక్షించిన తిరుమలక్షేత్రము చాల ప్రాచీనకాలమునుండియే ప్రసిద్ధినొందినట్లు తెలియనగును. సోమరాజు పేర్కొనిన పూర్వులు క్రీ. శ. 15-16 శతాబ్దులలో వర్ధిల్లినవారని శ్రీ వేంకటసుబ్బయ్యగా రుదాహరించిన కొన్ని కన్నడశాసనములబట్టి వేంకటరమణయ్యగారు కొంత చర్చ గావించిరి. ఈ శాసనములయినను నీవిషయమును నిర్బాధకముగ నిర్ణయించునవిగా లేవు. ఇందుశేఖరరాజు పుత్రుడు బసవరాజనియు, నాతడు తండ్రియనంతరము రాజ్యపాలన మొనర్చెననియు, నాతడు క్రీ. శ. 1573 సంవత్సరమున వెలయించిన యొక శాసనమువలన దెలియుచున్నది. సోమరాజుపే రెందును లేదు. అతడు బసవరాజు సోదరుడై యుండుననియు, రాజ్యమునకు రాకమున్నే తండ్రికాలముననే మరణించి యుండుననియు వేంకటరమణయ్యగారూహించుచున్నారు. అట్టివాడు 'జననాథోత్తమ సోమరాజను——" అని తన కావ్యమున జెప్పికొనుట సంభవమేనా? పయిగా సోమరాజు వీరశైవుడు. ఆతని పూర్వులని వేంకటసుబ్బయ్యగా రుదాహరించిన శాసనస్థ పురుషులు ఆత్రేయగోత్రజులమును, ఆపస్తంబసూత్రులము అని చెప్పికొనినవారు. కావున వారు సోమరాజువంశమువారు కాజాలరని కూడ శ్రీ నరసింహాచార్యులుగారు వ్రాసినారు. సకలకళాప్రవీణుడు బహులిపిజ్ఞుడునగు లింగమంత్రి (విరూపాక్షసుతుడు) సుగ్గిహళ్ళి రాయభూపాలుని ప్రధానమంత్రిగా నుండెనని యాతడు రచించిన "కబ్బిగరకైపిడి" యను గ్రంథములో నున్నదనియు, అందుదాహృతుడయిన రాయభూపాలుడే సోమరాజు తాత రాయణరాజై యుండుననియు ఈలింగమంత్రియే సోమరాజు గ్రంథమునకు వ్రాయసకాడై యుండెననియు శ్రీ వేంకటసుబ్బయ్యగారి ననుసరించి వేంకటరమణయ్యగారు చెప్పుచున్నారు. తాతగారి ముఖ్యమంత్రి యాతని మనుమని కాలమున నాతడు చెప్పిన గ్రంథమును దాటాకులమీద వ్రాయుటకు గంటము చేతబట్టి లేఖకుడుగా గుదిరెనా? ఇది మహామహోపాధ్యాయ పట్టభద్రుడు, శిష్యుని చిట్టి బాపపయి గూర్చుండి యక్కరములు దిద్దుచు గుణించుట వంటిది కాదా! శ్రీ నరసింహాచార్యులుగా రిది యసంగతమని పరిహరించి యీలింగమంత్రు లేక నామాంకితులయ్యు వేర్వేఱు కాలముల నున్న

భిన్నవ్యక్తులై యుండురని సెలవిచ్చిరి. పయిగా పైని చెప్పిన రాయణరాజు అచ్యుత దేవరాయల కాలమున క్రీ. శ. 1540 ప్రాంతమందుండిన వాడు. శ్రీ వేంకటసుబ్బయ్యగారి వాదము ప్రకారము సోమరాజు ఉద్ఘటకావ్యము రచించినది క్రీ. శ. 1522 లో ననియే యంగీకరించి నను, అప్పటికే జననాథోత్తముడయి కావ్య కర్తయైన యాతడు పూర్వోదాహృతుడయిన రాయభూపాలుని మనుమడగుట యెట్లు పొసగును?

ఇట్టి సంశయములలో బడి మనము తొట్రుపడు యుంటకు? [illegible] కాలము వివాద [illegible] కావ్యమందలి పద్యములు [illegible] సోమరాజుని కాల [illegible] [illegible] సండిగా రాధ్యుల సమకాలీనుడయిన పెద్దదేవ వేమనా రాధ్యుని మనుమని శిష్యుడయినని యాతడు చెప్పుకొన్న వాక్యమే యాతని కాలనిర్ణయమున కు ప్రతిబంధకముగు ప్రమాణము కాగలదని నా గ్రంథము పదియవ ప్రకరణము చివర చెప్పియే యుంటిని.

## (ii) హరిహర, పద్మరస, రాఘవాంకుల కాలము

ఈ మువ్వురు కన్నడ కవులలో మొదటి యిద్దఱు పూర్వోదాహృతుడయిన సోమరాజు కావ్యములో స్తుతింపబడినవారు. మూడవ యాతడు హరిహరుని మేనల్లుడు, పుత్రప్రాయుడగు శిష్యుడునయి యున్నాడు. హరిహరుడు హొయిసలరాజగు నరసింహ బల్లాలుని కరణికుడుగాను, పద్మరసు యాతని దండనాథుడుగాను నుండినట్లు ఆధారము లున్నవి. ఇందుచే శ్రీనరసింహాచార్యులు గారు వీరి నించుమించుగ సమకాలికులుగ గణించి వారికాలము సుమారు క్రీ. శ. 1165 అని నిర్ణయించిరి. పద్మరసు మనుమడు విశ్వారాధ్యుడు తన శివపంచస్తవ వ్యాఖ్యానములో పాలకురికి సోమనాథుని నామోల్లేఖన మొనర్చినందున నాతడు క్రీ। శ॥ 1230 ప్రాంతమందు సోమనాథునకు సమకాలీనుడుగానుండి యుండునని నేను వ్రాసినదానిని బరిహరించుటకయి శ్రీ వేంకటరమణయ్యగారు విశ్వారాధ్యుని కాల మాతని తాత పద్మరసు కాలముపయి నాధారపడినది కావున నేను పైని జెప్పిన కాలనిర్ణయము సరికాదని వాదించుటకయి పైని జేర్కొన్న మూవురుకన్నడ కవుల కాలవిచారమున గూడ డాక్టరు వేంకటసుబ్బయ్యగారి వ్రాతల నాశ్రయించిరి.

క్రీ. శ. 1245 ప్రాంతమున సూక్తిసుధార్ణవమను సంకలన గ్రంథమును గూర్చిన మల్లికార్జునుడనుకవి హరిహరుని గిరిజా కల్యాణమను ప్రబంధమునుండి పెక్కు పద్యముల నుదాహరించినాడు. అందుచే హరిహరుని కాలము క్రీ. శ. 1245 కి ముందే గాని క్రిందికి రాజాలదని పలువురు కర్ణాటక విద్వాంసులు సిద్ధాంత మొనర్చినారు. హరీశ్వరుడు (హరిహరుడు) గిరిజా కల్యాణమే గాక యనంతకములును పలువురు శివ భక్తుల చరిత్రముల వర్ణించు "శివగణదరగళె" అను గ్రంథమును గూర్చినాడు. బసవేశ్వరుని చరిత్రమునుగూడ "బసవరాజదేవర రగళె" యను పేరితో రచించినాడు. ఇందుచేతనే యాతని "ప్రమథాసిక కథార్ణవేంగు హరదేవారాధ్యనం ధైర్యనం" అని పూర్వోదాహృతుడయిన సోమరాజు తన గ్రంథమున నుతించినాడు. బసవనిచరితము నాంధ్రభాషలో రచించిన వారిలో పాలకురికి సోమనాథు డెట్లు ప్రథముడో యట్లే కన్నడమున రచించిన వారిలో హరిహరుడు మొదటివాడు. సోమనాథునకన్న హరీశ్వరుడే యించుక ముందున్న వాడని విజ్ఞులు తలంచుచున్నారు. వారించుమించుగ సమకాలీనులయియుండురని నాయభిప్రాయము. వేర్వేఱు దూరప్రాంతముల—పంపాక్షేత్రమున హరీశ్వరుడు, పాలకురికిలో సోమనాథుడు—సమీపకాలముననే యుండి గ్రంథరచన గావించిన వారగుటచే నొకరి రచనము మఱొకరెఱుంగక తమకృతులలో నొకరి నొకరు స్మరింపరయిరి. రెండవ ప్రతాపరుద్రుని కాలమున క్రీ. శ. 1300 ప్రాంతముననే సోమనాథుడు బసవపురాణమును రచించియున్నచో నం దాతడు హరీశ్వరుని దప్పక స్మరించియే యుండునని యు నేను బలుసారులు చెప్పియే యున్నాను.

సూక్తి సుధార్ణవకర్త మల్లికార్జునునకు చిదానందుడను నామాంతరము గూడ నుండెనట. క్రీ. శ. 1268 నాటి కొన్ని కన్నడ శాసనములలో వానిని రచించిన యతడు చిదానందు డని

యుండుటచే నీయిరువురున భిన్నులని భ్రమించి శ్రీవేంకటసుబ్బయ్యగారు సూక్తిసుధార్ణవ రచనాకాలమును మఱి 18 సంవత్సరములు క్రిందికి దించి, దీనినిబట్టి హరీశ్వరుడు క్రీ. శ. 1263 కి ముందుండెనని యేర్పడునేగాని పద్మరస రాఘవాంకులుగూడ నంతకు ముందువారే యనుటూహ పొసగ నేరదని లిఖించిరి. మఱియు నరసింహ బల్లాళుడనగా నరసింహుని పుత్రుడు బల్లాళుడని యర్థమగును గాన హరీశ్వర పద్మరసుల యాశ్రయుడు నరసింహాచార్యులుగారు చెప్పినట్లు హొయసలరాజులలోని మొదటి నరసింహుడు (క్రీ. 1136-1171) గాక యాతని పుత్రుడు వీరబల్లాళుడో (క్రీ 1177-1220) ముమ్మడి నరసింహుని పుత్రుడు ముమ్మడి బల్లాళుడో (క్రీ. శ. 1291-1342) యగును ముఖ్యముగా నిడపటివాడే యగునని యూహించి, రాఘవాంకుడు హరీశ్వరచరితమను గ్రంథమును రచించి యోరుగంటి ప్రతాపరుద్రుని యాస్థానమున సమర్పించినట్లు రాఘవాంక చరిత్రమునను, శైవవేశ్వర కావ్యకథాసూత్రరత్నాకరమను గ్రంథమునను జెప్పబడియుండుట గూడ నందుకు సాధకమని తలంచిరి. కాని యొకమూల హరీశ్వరుడు క్రీ. శ. 1263 కు పూర్వపువాడని తామే యంగీకరించుచు నాతడు క్రీ.శ. 1291 తరువాత రాజ్యమేలిన మూడవ నరసింహ బల్లాళుని కాలము వాడని వారించుటలో గారలు స్వవచన వ్యాఘాతమును వారు గుర్తింపకుండుట, ఇట్టి వ్రాతలను వేంకటసుబ్బయ్యగా రూతకోలలుగా గయికొనుట శోచనీయము.

శ్రీ నరసింహాచార్యులుగారు కన్నడకవిచరిత్రము మూడవభాగము నవతారికలో వేంకటసుబ్బయ్యగారి యాక్షేపముల సూక్ష్మముగ ఖండించి, సూక్తిసుధార్ణవ కర్తయు, వేంకటసుబ్బయ్యగా రుదాహరించిన శాసన కర్తయు భిన్నవ్యక్తులని నిరూపించి సూక్తిసుధార్ణవము క్రీ. శ. 1245 కు కొంతకాలము ముందే రచింపబడియుండవలెనని నిర్ణయించుటయే గాక పయి ముగ్గురు కవుల కాలవిషయమున గూడ దను తొల్లిటి నిర్ణయములనే సమర్థించికొన్నారు. పద్మరసు తన యవసాన దశలో గాశీక్షేత్రమున కేగి విశ్వనాథునియం దైక్యమయ్యెననియు, అట్లు యాత్రకేగు నపుడు దారిలో పంపాక్షేత్రమున హరీశ్వరుని దర్శించి యప్పటికి కొలదిదినముల క్రిందట శివైక్యమొందిన మేనల్లుని (రాఘవాంకుని) కయి విచారమొందుచున్న యాతని నూఱడించి అటు తరువాత నెనిమిది దినములలో హరీశ్వరుని గూడ శివుడు తనయం దైక్యమొనర్చుకొనుననియు, నాతడు రచించు మహాకావ్యము నీలోపలనే ముగింపుమని హెచ్చరించెననియు నొక యైతిహ్యమున్నది. ఇందెంత సత్యమున్నదో వీరిలో నెవ రెప్పుడెప్పుడు ముందు వెనుకల నిర్యాణ మొందిరో యిదమిత్థముగ నిర్ణయించు నాధారములు లేవు. రాఘవాంక చరిత్రము వ్రాసిన సిద్దనంజేశకవియు, శైవవేశ్వర కావ్యకథాసూత్ర రత్నాకరకర్తయు రాఘవాంకుని యనంతరము 500 సంవత్సరముల తరువాతనున్నవారు. వారు వినికలిని బట్టి వ్రాసిన వ్రాతలలో గొన్ని వ్యత్యయము లుండవచ్చును. రాఘవాంకుడు కాకతీయ రాజసభలో వినిపించినట్లు హరిశ్చంద్రచరితమునందు లక్షింపనే లేదు. కావున రాఘవుడు కాకతీయరాజుచే సన్మానము నందె సంగతి వాస్తవమే యయినచో నది రుద్రదేవుని కాలముననే యైయుండునని శ్రీ నరసింహాచార్యులు గారు లిఖించినారు. పాలకురికి సోమనాథోదంతమున నున్నయభిప్రాయభేదమే రాఘవాంక విషయమున గూడ గోచరించినది. నరసింహ బల్లాళు డనునది నరసింహ కృష్ణరాయల వంటిది కాదు. రెండవ దానిలో నుభయ పదములు వ్యక్తి నామములే కావున నరసరాయల కొడుకు కృష్ణదేవరాయలను నర్థ మేర్పడును. ఇట్టి ప్రయోగ సంప్రదాయము కర్ణాటవాఙ్మయమున లేదని శ్రీ నరసింహాచార్యులు గారు వ్రాసినారు. హొయసల రాజులందఱు బల్లాళవంశ్యులు. వారందఱి పేరుల చివర బల్లాళశబ్దము చేరియుండును. భక్తి పరీక్షణ సమయమున శివునకు భార్య నప్పగించిన యీ వంశపు రాజు నిజనామముతో గాక కేవలము భల్లాళ (ణ) రాజనియే వ్యవహరింపబడుట సర్వవిశ్రుతము. కావున పద్మణాంకకవి హరీశ్వర పద్మరసుల కాశ్రయుడని చెప్పిన నరసింహ బల్లాళుడు మొదటి నరసింహుడు కాడని చెప్పుటకు వీలు లేదు. బసవపురాణమును బట్టి కెరెయ పద్మరసు తాత సకలేశ్వర మాదరసు బసవేశ్వరుని కాలమున నుండినట్లు తెలియును గావున నాతని

మనునుడు క్రీ. శ. 1165 ప్రాంతము వాడగుట యసంభవమని ప్రతిపక్షుల మఱియొక యాక్షేపము. ఈ మాదరసు కాలవాదమును గాలదన్నిన లోకాతీత పురుషుడు. అతడు భూమిపయి నేడువందల సంవత్సరము లున్న వాడన్న ప్రసిద్ధిని మల్లికార్జున పండితారాధ్య పాలకురికి సోమనాథు లిరువురు గూడ గ్రంథస్థ మొనరించినారు.

క. భూతలమున నిదియెంతయు
నూతన మనిపొగడ నేడునూఱేండ్లు ఘనుం
డైతనరు భక్తి ద్రిపురా,
రాతీ! సకలేశు మాదిరాజయ్య శివా!
(శివతత్త్వసారము. ప. 442)

కాలారి కరుణ మార్కండేయుడాది
గాలమృత్యువు గెల్వడే లోక మెఱుగ
మఱియును సకలేశు మాదిరాజయ్య
మొఱసుడే కాలంబు మీఱి వెండియును.
(పండితారాధ్య చరిత్రము. వాద ప్రకరణము)

ఉ. ఏఁడులు నూఱటంచు శ్రుతు
లెన్నగ శ్రీగిరిమీద నాలునూ
ఱేఁడులు సంచరించి సక
లేశ్వరదేవర మాదిరాజు తా
నేఁడుల నూఱులుండి భువి
నిష్ఠురకాలమహోగ్రదంష్ట్రిక్రో
వ్వాఁడు లణంచె నయ్య బస
వా! బసవా! బసవా! వృషాధిపా!
(వృషాధిప శతకము)

మఱియు నీతని చరితమును సోమనాథుడు పండితారాధ్యచరిత్ర పురాతన ప్రకరణములో ప్రత్యేకముగ గూడ వర్ణించినాడు. బసవపురాణ తృతీయాశ్వాసమున వర్ణితమయిన యీతని కథనుబట్టి కూడ నాతడు సంసారము త్యజించి శ్రీశైలమున దప మొనరింప నేగునప్పటికే జీవితమున 650 సంవత్సరములు గడచినవాడనియు, ఆతని కచ్చట కొల్లనిరూపమున జ్ఞానోద్బోధ మొనర్చినవాడంతకుమున్ను చాల గాలము క్రిందటనే విరక్తుడయి శ్రీశైలమునకు దపశ్చరణమునకై వెడలియున్న యీతని తండ్రి మల్లరసే యనియు, తండ్రియాజ్ఞానుసారమే యీతడు బసవేశ్వరునకు సహాయుడుగా నుండుటకై కల్యాణమున కేగెననియుఁ దెలియగలదు. ఇందువలన నీ మాదర సాక బసవనికే గాక, తన తాత తండ్రులకు, మనుమలకు గూడ సమకాలీనుడుగా నుండ గల్గిన సిద్ధ పురుషుడుగా గణింప దగినవాడని స్పష్టము కాగలదు. ఇట్టి వాని విషయమున నాతని ముందువెనుకల నున్న సంతతివారి కాలముల నిర్ణయించుటలో నేటి చరిత్రకారులు పాటించు గణనము (తరమునకు 25,30 సంవత్సరముల వంటి లెక్కలు) సాగిరావని మనవి చేయుచున్నాను. కావున నీతని జీవన కాలవిచారము కెరయపద్మరసు క్రీ. శ. 1165 సంవత్సరమునకు జాల దరువాత నుండెనని వాదించుట కేమియు నుపకరింపజాలదు.

పద్మరసు క్రీ. శ. 1168 ప్రాంతమున లింగైక్యమొందినబసవేశ్వరునకు, పండితారాధ్య వేమనారాధ్యులకు వయస్సులో గొంత పెద్దవాడుగానుండిన సమకాలీనుడని నే దలంచుచున్నాను. వావిళ్ల వారి బసవ పురాణ పీఠిక చూడుడు. ఆతడు కన్నడమున రచించిన వీరశైవదీక్షాబోధయవతారికలో బసవేశ్వరుని నామోచ్చారణమైన లేకుండుట గూడ నిందుకు గొంత సాధకము.

## బసవేశ్వర పండితారాధ్యుల కాలములు

బసవేశ్వరుని యేలికయగు బిజ్జలుడు క్రీ. శ. 1167 సంవత్సరమున రాజ్యభారమును దాను వదలుకొని జ్యేష్ఠపుత్రుడు రాయమురారి సోవిదేవునకు నప్పగించినట్లు లోక కన్నడ శాసనమున గానవగును. అయినను నాతడు చాటున నాతని పరిపాలనము పరీక్షించుచు నటుతరువాత జాలగాలము ప్రశాంతముగ జీవించెననుటకాధారములు లేవు. ఆతనికి వీరశైవులకు గల్యాణపురమున జరగిన క్రాంతిలో నాతడు 1167 సంవత్సరమున గాని, యా మఱుచటి వత్సరమున గాని జగదేవాదులచే సంహరింపబడియుండునని కర్ణాట విద్వాంసు లందఱు తలంచుచున్నారు. క్రీ. శ. 1167 తరువాత బిజ్జలుని కుమారుల శాసనములే గాని యీతని పేరట నేమియు గానరావు. బిజ్జలుని వధ జరగిన వెంటనే బసవేశ్వరుడు నాతని యనుయాయులు కల్యాణమును విడిచి పోవగా వారిని సంహరించుటకయి బిజ్జలుని కుమారుడు రాయమురారి సైన్యముతో వెన్నాడగా బసవేశ్వరుడు నూతిలోబడి యాత్మహత్య

గావించి కొనెనని జైనగ్రంథములు వాకొనుచున్నవి. బసవేశ్వరుడు కూడలిసంగమేశ్వర గర్భ మందైక్యమొందెనని వీరశైవ గ్రంథములు చెప్పుచున్నవి. ఏదియైనను ఫలితార్థ మొక్కటియే గదా!

బిజ్జలుడు బసవేశ్వరుడు నేక కాలముననే క్రీ. శ. 1168 సంవత్సరమున మరణించియుందురని, యటుతరువాత కల్యాణమునగాని, మఱొకచోట గాని వారి భౌతిక శరీరములు నిలిచి యుండలేదని కర్ణాటదేశమున వీరశైవ విద్వాంసులు, తదితరులు గూడ నేకగ్రీవముగ నంగీకరించుచున్నారు. ఈ విషయమున డాక్టరు వేంకటసుబ్బయ్యగారు గూడ భిన్నాభిప్రాయమును బ్రకటింప లేదు. బసవేశ్వరుని సందర్శించుటకయి పండితారాధ్యుడు కల్యాణపుర ప్రయాణ మొనర్చి మార్గమున వనిపురములో నుండగా, నప్పటి కెనిమిది దినముల క్రిందటనే కల్యాణ పురమున ఘటిల్లిన క్రాంతి ఫలితముగా బసవేశ్వరుడు శివైక్యమైన వార్త భక్తులవలన విని పండితారాధ్యుడు బిట్టు ప్రలాపించి, కల్యాణపుర ప్రయాణమును గట్టి పెట్టి శ్రీశైలమున కేగి శివరాత్రి వ్రతమాచరించి మల్లికార్జునలింగగర్భమునం దైక్యమయ్యెనని పండితారాధ్య చరిత్రమువలన వ్యక్తమగుచున్నందున బసవేశ్వర పండితారాధ్యుల నిర్యాణముల మధ్య నొక్క శివరాత్రియే గాని పెక్కు శివరాత్రులు గడచియుండుట కవకాశములేదు గావున, పండితారాధ్యుని నిర్యాణకాలము క్రీ॥ శ॥ 1170 ప్రాంతమయి యుండునని నేను వ్రాసియున్నాను. పలువురు విద్వాంసు లట్లే తలంచిరి. బసవేశ్వర, పండితారాధ్యుల నిర్యాణ కాలములు క్రీ॥ శ॥ 1168-1174 సంవత్సరములని మైలుతాళ్ళవలె నిలిచి విశ్వసింపబడుచున్నవి. వీనిని స్థిరాధారములుగ గ్రహించియే, సోమనాథుడు బసవేశ్వర, పండితారాధ్యులను స్వయముగ నెఱింగిన సమకాలీనుడు గాకపోయినను మిక్కిలి యర్వాచీనుడు మాత్రము కానేరడనియు, నాతడు క్రీ॥ శ॥ 1160 ప్రాంతమున జనించి వారి నిర్యాణ కాలములకు రమారమి యెనిమిది పది సంవత్సరముల వయస్సుగల బాలుడయి 1240 ప్రాంతము వఱకు జీవించి క్రీ. శ. 1192 ప్రాంతమున బసవపురాణమును, 1230-35 ప్రాంతమున పండితారాధ్య చరిత్రమును రచించి యుండునని యస్మదాదులము నిర్ణయించితిమి. కాని శ్రీవేంకటరమణయ్యగారు తమ ప్రకృత గ్రంథమున పూర్వోక్తము లయిన బసవేశ్వర పండితారాధ్య నిర్యాణకాల రూపకములగు మైలుటాళ్లను గూడ గదల్చివేసి, బసవేశ్వర పండితారాధ్యు లిరువురు క్రీ. శ. 1184 ప్రాంతము వఱకు జీవించి యాపిమ్మట నే లింగైక్య మయియుందురనెడి యభిప్రాయమును బ్రకటించిరి. ఇందు కయి వారు సోమనాథుని గ్రంథములే ప్రమాణములని చెప్పుచు నందలి వాక్యముల వింతవింత తెఱంగుల దమ వాదానుకూలముగ సమన్వయించి యున్నారు.

సోమనాథుని కవిత మిక్కిలి వర్ణనావేశముతో గూడిన దనుట పాఠకలోకమున కెల్ల సువ్యక్త మయినవిషయము. సమానములయిన కథాసన్నివేశములు గలిగినపుడు తద్వర్ణనములలో సామ్యనిరూపణమునకయి తన యెఱుకలో నున్న పూర్వవిషయముల నెల్ల గుదిగ్రుచ్చి యేకరువుపెట్టుట యాతనికి బాలపరిపాటి. ఇట్టి పట్టులలో నాతనికి దత్సంబంధికమగు చారిత్రక పౌర్వాపర్యము పయి దృష్టిశూన్యము. చారిత్రక దృష్టిగల పాఠకుల కా యా తావులందలి వైపరీత్యము స్పష్టముగ గోచరించుచుండును. కావున జారిత్రక విషయనిరూపణములో సోమనాథుని వాక్యములను యథాతథముగ గ్రహించి వానికి బ్రామాణ్యమొసంగుట మహాప్రమాదమని చెప్పనక్కఱలేదు. ఇట్టి పౌర్వాపర్య దృష్టిని బాటింపని లోపము సాధారణముగ సంస్కృతాంధ్ర వాఙ్మయములలో బలువురు సుప్రసిద్ధకవులకే పట్టియున్నది. మచ్చునకు క్రింది దృష్టాంతముల జిత్తగించునది.

నలోపాఖ్యానమును బాండవు లరణ్యవాస మొనర్చునపుడు వారిని జూడవచ్చిన మునులు ధర్మజుని దుఃఖోపశమనార్థ మాతనికి జెప్పినట్లు భారతమువలన దెలియగలదు. నలునకు బాండవులకు గొన్నివేల సంవత్సరముల యంతరమున్నది. అట్టులయ్యు విద్వదౌషధమని పేర్వడసిన నైషధమును రచించిన శ్రీహర్ష మహాకవి దానిలో భారతములోని గొడవలను గొన్నిటిని గథాపాత్రముల నోటనే పలికించినాడు. ఇందలి యనౌచిత్యమును గుర్తింపక శ్రీనాథుడు తనయాంధ్రీకరణమున వాని నను

వరించినాడు.

(i) ఇంద్రాదులు దమయంతీ స్వయంవరము నుండి మరలివచ్చునపుడు దారిలో గలిపురుషుడు కలిసి వారితో గావించిన సంభాషణములో "పాకశాసనుండు, పావకుండు, పరేతపతి, పాశహస్తుండు, పంచముండ నైనయేను నియ్యె వురము గాండవులు పాంచాలింబోలె బంచి కొని యనుభవింతెదము గాని యప్పంకజాక్షి నిం బట్టికొని పోతునే?" యని యున్నది.

(ii) నలుడు గావించిన దశావతారస్తుతిలో

చ. వలపలి కన్ను నీకు రవి,
వారిజలోచన! చందురుండు దా
పలి నయనంబు, కృష్ణుడును
జారుడు దత్త్రియానందనుండు ద
క్కు లజాడు; నీ కొకండొకని
తో గలహింప సహించి తెల్లకో
వలపలి లోచనాబ్జమును
వామదృగబ్జము వేలె యచ్యుతా!
(ఆదిప -133)

ఇట్టి వనేకములు. ఈ శ్రీనాథమహాకవియే హరవిలాసములో చిరుతొండని భార్యతో పరమే శ్వరుల సంభాషణములో సర్వజ్ఞుడగు శివుని చేతనే యిట్లు పలికించినాడు.

గీ. కలియుగంబున గిరిజేశ కటకనగర
నాథు భక్తుండు బసవన నాథుడొకడు
కించిదగ్రంబులో వణిగ్వంశవరుడు
నాథభక్తుండు చిరుతొండనంబియొకడు.

చిరుతొండడు కల్యాణ బసవేశ్వరునకు గొన్ని శతాబ్దులు ముందుండిన వాడనుట సర్వ విదితము. ఇట్టివి సోమనాథుని కృతులలో దండోపతండములుగ నున్నవి. మచ్చున కొకటి యుదాహరింతును. కుమారిపాలభూర్జరుడు, సౌరాష్ట్రపురాజు, బసవేశ్వరునికన్న చాల బూర్వుడు. అతని చరితము పండితారాధ్య చరిత్ర ములో పురాతనప్రకరణమున వర్ణితమయినది. అతడు భార్యతో నెత్తిమాడుచు నెందుకో నవ్వగా నామె యందుకు గారణమడుగగా నపు డాకాశమార్గమున బోంగలో గైలాసమున కేగు చున్న యోహిళు డనుభక్తునిజూచి యాతని కథను నివేదించుటలో గథా సన్నివేశముల సామ్యముల నుదాహరించుటలో బసవేశ్వరుని కాలమున నాతని సమకాలికులగు కలకేత బ్రహ్మయ్య, కిన్నెర బ్రహ్మయ్య, మోళిగ మారయ్య, ముసిడి చౌడయ్య మున్నగు వారి వృత్తాంతములగూడ జేర్కొన్నాడు.

"అటులేక కిన్నరయ్యకు గటకమున
దెఱచె దల్పులు దాను త్రిపురాంతకుండు
పదపడి కలకేత బ్రహ్మయ్య గారు
పదడు చెప్పుడు బసిడియైతనరె
మక్కువ మోళిగ మారయ్యమోపు
కొక్కులన్ని గడాని సక్కులు గావె
ముసిడిచౌడయ్యకు ముసిడిఫలంబు
లసమాన నమృతఫలావళుల్ గావె."

కావున నిట్టి పట్టులలో సోమనాథునివాక్య ముల ననుసరించి మనము చారిత్రక విషయ పౌర్వాపర్యము జేయరాదు. ఆ విషయము లన్నియు నతనికాలమునకు ముందు జరిగి యాతని యెఱుకలో నున్నవి కావున గథా సామ్యములు వచ్చినప్పుడు ముందువెనుక లారయక వర్ణనావేశములో వాని నాతడు గుది గ్రుచ్చుచుండును.

వెలనాటిచోడుడు నిండుసభలో దననేత్ర ముల దీయించినపుడు పండితారాధ్యుడు నతని సంతతి వెంటనే నిర్మూల మయ్యెదరు గాకయని శపించినాడు. వెలనాటి చోడుని శాసనములు క్రీ. శ. 1180 వఱకును, అతని సంతతివారివి క్రీ. శ. 1190 ప్రాంతమువఱకును గానవచ్చు టచే వారందఱు నశించువఱకును పండితా రాధ్యుడు జీవించి యుండవలెననెడి తలంపుతో కీ. శే. శ్రీ కొమర్రాజులక్ష్మణరావు పంతులుగా రాతని నిర్యాణకాలమును గడిగించి యది క్రీ. శ. 1190 ప్రాంతమను నభిప్రాయమును శివతత్త్వసార పీఠికలో బ్రకటించిరి. అట్లయ్యు బసవేశ్వరుని నిర్యాణకాల మనితలంపబడు క్రీ.శ. 1168 విషయమున మాత్రము వారు మార్పే మియు సూచింపలేదు. ఇంచుమించుగ నొక వత్సరము వ్యవధిలో బసవేశ్వర పండితారా ధ్యులు తామొందినది (లింగైక్యము) స్వచ్ఛంద మరణమనియు వారిశాపములవలన బిజ్జలుని తన యులు, వెలనాటిచోడుడు, తత్సంతతి తరువాత సమీపకాలములో మరణించియుందురనియు, ఆనాశనములు పూర్తియై వానిని గనులార గాంచువఱకు వారు జీవించియుందురని మనము తలంప నక్కఱలేదని నేను వ్రాసియుంటిని. పండితుడు వెలనాటిచోడుని శపించు సందర్భ మున శివుని ధ్యానించి,

"మలహర! మీశాపమాత్రముననక
మలసంభవునిపట్టు మాసినయట్టు
లాదిదూర్వాసు శాపాద్భుతశక్తి
యాదవవంశక్షయంబైనయట్టు"

ఇత్యాదిగా బూర్వ కథాసామ్యములు పెక్కు లేకరువుపెట్టి యా తరువాత;

"వేయేల మనదండనాయక బసవ
ధీయుత శాపప్రతిజ్ఞా ప్రశక్తి
నెల్లవారును జూడ నీక్షేలగడవ
బల్లహు పీఠంబు పాడైనయట్టు
లీ యసంఖ్యాత మాహేశ్వరోత్థిత 'స
మాయాత క్రోధోత్కటానలపటల
విరచిత జ్వాలల వెలనాటిచోడ
ధరణీతలేశ్వరాధమపతంగంబు
భస్మమయ్యెడును దద్బంధులు సుతులు
విస్మయంబుగనిప్డ భస్మమైపోదు
రని శాపమిచ్చుచు........"

పలికెనని సోమనాథుడు వ్రాసినాడు. ముందు వెనుక లారయక యిప్పట్టున సోమనాథుడు వ్రాసినదానిని బట్టి శ్రీ వేంకటరమణయ్యగారు పండితారాధ్యుడు వెలనాటిచోడుని సభకు చందవోలున కరుదెంచుటకు ముందే కల్యాణమున బసవేశ్వరాదుల శాపమున బిజ్జలుని రాజ్యమంతరించెననియు, బసవేశ్వరుడు మాత్రము కల్యాణముననో తత్ప్రాంతముననో చరించుచు జీవించియుండునని దలంచి, వెలనాటిచోడుని కడపటి శాసనము క్రీ.శ. 1180 నాటిది కావున నాసంవత్సరమో యాముందుసంవత్సరమో పండితుడాతనిసభకు వచ్చియుండునని యిట్టి వెన్నియో వింత వింత సంగతులు తమ గ్రంథము 2వ ప్రకరణమున వెలార్చియున్నారు. అవి యన్నియు నిట నుదాహరించి విమర్శించిన గ్రంథవిస్తర మగును. పాఠకులే వానిని సావధానముగ సమగ్రముగ బరీక్షింప గోరెదను. ఇట్టులే సోమనాథుడు పండితారాధ్యుని శిష్యులు రేమయ్య, దేవయ్య లనువారు బౌద్ధాచార్యుడు తమ గురునకొనర్చిన యపచారమునకు గనలి, సముద్రము దరినున్న లంకలో నాతడేతెంచెడి గుడిలో మఱువున దాగి యాతనిని వధించి మరలి వచ్చు సందర్భమును వర్ణించుటలో "జగతి బిజ్జలు జంపిచను మల్లెబొమ్మ జగదేవ వీరుల చరణాంబుజములు......మఱియును ద్రోహుల మడియించినట్టి సెఱి వీరగణవ[illegible]......నిజప్రద్వాబ్దములు...నాపయోధికి దచ్చివాచారమిడిన తేపగా రేమయ దేవయలరుగ" అనియు, నటుతరువాత పండితారాధ్యుడు కల్యాణపురప్రయాణములో పానుగంటికి వచ్చినప్పుడు ఉదయావనీశుని సభలో నాతని సేవకుడు ధవళేశునామయ్య (పండితారాధ్యుని శిష్యుడు) రాజుపై గినిసి యాత డొనర్చిన యపచారమునకయి యాత్మహత్య గావించుకొనుసందర్భములో

"అల్లయ్య మధువయ్య యనుభక్తవరుల
బ్రల్లదుడై రాజు వఱపుడు నతని
యాయతైశ్వర్యంబు నతుల ప్రతాప
మాయుష్యమును భవిష్యము రాజ్యరమయు
నవనిలో జాళుక్య లనుపేరు హారుని
కవిలియ దుడిపించి కల్యాణకటక
మీడిత భక్తి మహిష్ఠత పేర్మి
బాడుగా శపియించె బసవనమంత్రి
మసలక జగదేవమల్ల బ్రహ్మయలు
పొసపరి బిజ్జలు బొరిగొని రట్ల"

అని పలుకుచు బ్రాణములు వాసెనని సోమనాథుడు వ్రాసినాడు. వీనిని బట్టి బిజ్జలుని మరణము, కల్యాణపురము పాడగుట, చందవోలు పానుగల్లులలో పయియుదంతములు జరుగక మున్నే కడచిన వార్తలుగా మనము గణింపవలసిన దేనా! అసలు పండితారాధ్యుడు బయలు దేఱినది కల్యాణములో బసవేశ్వరుని నాతని యనుచరగణములను సందర్శించుటకే. అతని గమ్యస్థానము కల్యాణ పురమే. అట్టి సందర్భములలో దాను చందవోలు రాకమున్నే కల్యాణపట్టణము పాడుగా శపించి, బిజ్జలుని గెడపి బసవేశ్వరాదు లటనుండి వెడలిపోయిన వార్త తెలిసియే యున్నచో పండితారాధ్యు డీప్రయాణ మేప్రయోజనముతో సాగించెను ? మఱియు నవి యన్నియు మున్నే జరిగినచో పండితుడు పానుగల్లునుండి కూడ మరల గల్యాణమునకే ప్రయాణమయి వనిపురము చేరి యచ్చట నొక శిష్యుని యింట గొన్ని వాసరము లుండి, పిమ్మట,

"కల్యాణమున కభిగమనంబు సేయ
గల్యాణమున భక్తి గజిబిజి వుట్టి
బల్లహు బిజ్జలు భంజించి రంత
బల్లిదుల్ జగదేవ మల్లె బొమ్మయలు
ఏగి కప్పడి సంగమేశ్వరంబునకు

దా గోరి బసవన దండ నాయకుడు
నిచ్చమైనా సంగమేశుగర్భంబు
జొచ్చె దేహముతోన చోద్యమొప్పార
నిదియు దా నేఁటికి నెనిమిదిదినము
లదినిక్క మనుచు నొక్కయ్య సెప్పెడును
బండితేంద్రుండుల్కిపడి——" అని సోమ

నాథుడే నిక్కము నిక్కమని జంగమంబుచే నొక్కినొక్కి చెప్పించిన వాక్యములకు గతి యేమి? ఇందేది నిజము? ఈ వృత్తాంతముల నదికటకే లెస్సగా నెఱిగియున్నచో బండితుడు వానిని విన్నంతనే యుల్కిపడి ప్రలాపింప నేల? మఱియు బండితారాధ్యుని శాపమహిమ వలన గొలదిదినములలోనే వెలనాటిచోడునకు దారుణమయిన వ్రణముపుట్టి దాని బాధవలన నాతడు పండితుడు చందవోలు వీడియమరావతి కేగి యచ్చట నుండులోపలనే మరణించెనని, యావార్తనొక ఫణిహారి యమరావతి కరుదెంచి పండితునకు దెలియజెప్పెనని పండితారాధ్య చరిత్రముననున్నది. ఆ సందర్భములో నున్న "అంతలోనన ఫణిహారి యాద్రోహి నంతకు ప్రోలికి ననిపియేతెంచి, నలి భక్తతతికి విన్నప మాచరింప" అను వాక్యముల బురస్కరించి కొని శ్రీ వేంకటరమణయ్యగారు "శాపమహిమ వలన వ్రణబాధితుడయి చోడడు మృతినొందె నని పండితారాధ్య చరిత్రమందున్నను, నిజముగ శిష్యులమూలమున పండితు డాతని జంపించెనని సంశయించుట కవకాశము లేకపోలేదు——ఈ పణిహారియెవ్వడు? చోడుని ఫణిహారియ కావలయును. వ్రణబాధితుడై చోడడు మృతి నొందుట వాస్తవమైనచో ఫణిహారి యా ద్రోహి నంతకపురి కనుచుట పొసగియుండదు. చంపుట వాస్తవమైనచో వ్రణబాధచే జచ్చుట వాస్తవమైయుండదు. చోడనినంతకపురి కనిపి వచ్చితినని ఫణిహారి పండితారాధ్యులకును, భక్తతతికిని విన్నవించుకొనుట చూడగా నతడు పండితారాధ్యుల శిష్యవర్గము లోనివాడనియు శివయ దేవయులు గుర్వాజ్ఞమీదనో లేకయో బౌద్ధగురుని హింసించి చంపినట్లు అతడును వెలనాటిచోడని హత్యచేసి చంపెనని తోచుచున్నది. వ్రణబాధవలన నైననేమి, హంతకుని కత్తి కెరయైననేమి, వెలనాటి చోడడు క్రీస్తుశకము 1180 వ సంవత్సరమున మృతినందినది నిశ్చయము. ఏలనగా నతనిశాసనము లటువెనుక గానరావు" ఇత్యాదిగా వ్రాసియున్నారు (పుటలు 15, 16). వీరియూహ నిజమేయైనచో పండితారాధ్యుని సోమనాథు డెట్లు చిత్రించెనని లోకము సంభావింపవలెను? పండితుడు శాపాయుధుడగు (గీర్వాణుడు) మహిమశాలియా? హంతకగణములో జేరు నాతతాయియా? ఆయుధములతో స్వహస్తములనో, పరహస్తములనో, హత్యలు గావించి శత్రుక్షయ మొనర్పగలుగు వానికి శాపాయుధ ప్రయోగములో లేనిపోని ప్రతిజ్ఞలు గావించు టెందుకు? చోడుని ఫణిహారియే పండితుని ప్రేరణమున జోడుని యంతిపురముసొచ్చి యాతని దనకరవాలమున కెరచేసి యమరావతికి బాఱివచ్చినచో చోడుని పుత్రులు, నియోగవర్గము చచ్చుపెద్దమ్మలయి చేతులు ముడుచుకొనుచు నూరకుండిరా? వెంటనే వెన్నాడి యమరావతి కేతెంచి యా ఫణిహారిని, బండితారాధ్యుని గూడ మడియించి యుండరా? పయి పంక్తులందలి "అంతకు ప్రోలికి ననిపి యేతెంచి" అనునది "అంతకు ప్రోలికి నరిగె నటంచు" అనుటకు మాఱువ్రాతప్రతులలో దొరలినయపపాఠమయి యుండునేమో యని నా యనుమానము. వ్రణ బాధకు సహింపలేక పండితుని క్షమాపణము వేడుచు చోడ డాత డమరావతిలో నుండగా సందేశ మంపెనని, పండితుడు నిరాకరించెనని సోమనాథుడు తన గ్రంథమున వ్రాసిన విషయముల జూడ రమణయ్యగా రూహించిన హత్యాకాండలో నిసుమంతయు సత్యములేదని తేటపడగలదు.

ఇంతకు చోడుడు మరణింపగనే "అంత రాజ్యార్థమైయునిఁ బోరియతని, సంతాన మెల్ల నిస్సంతాన మయ్యె, బాడయ్యె దద్భూమి పండిత విధుని, యీడిత శాపమహిమఁ జేసి" అని సోమనాథుడు వ్రాసినాడు. ఇట్లే బిజ్జలుని విషయములో బసవ పురాణములో "అంతరాజ్యార్థమై యని చేసి యతని సంతాన మెల్ల నిస్సంతాన మయ్యె, భ్రమసి యమాత్యాది భటవర్గ మెల్లఁ దమలోన జచ్చిరి సమరంబుచేసి, పసచెడి కటకంబు పాడయ్యె నంత, వినియె నంతయునట సనియె గూడలికి, గనియె సద్గురువు సంగయదేవు నచట" అని వ్రాసినాడు. ఇప్పట్టున మొదటి రెండు పాఠములు రెండు గ్రంథములందును సమానములే. బిజ్జలుని యనం

తర మాతని సుతుడు రాయమురారిగాని, చోడుని తరువాత నతని పుత్రులుగాని రాజ్యకాంక్షతో నన్యోన్యము పోరు సలిపి సుందోపసుందుల చందమున నేకకాలముననే మడసిరనునది చరిత్రకు సరిపడు విషయమేనా! చరిత్రజ్ఞులగు వేంకటరమణయ్యగారిందుకు సమ్మతింతురా! బిజ్జలుని కొడుకు లొకరి తరువాత నొకరు 1168 నుండి 1180 ప్రాంతమువఱకు తండ్రి రాజ్యమును కల్యాణ పట్టణమునందుండియే పరిపాలించిరని శాసనాధారములతో వారే సెలవిచ్చుచున్నారు గదా! అట్లే చోడుని యనంతర మాతనిపుత్రులు కొంతకాలము రాజ్యము చేసిరని కూడ వారంగీకరించుచున్నారుగదా! కావున నిట్టి చారిత్రక విషయములలో పౌర్వాపర్యవివేచనము, సత్యాసత్యవిచారము లేక వర్ణనావేశముతో సోమనాథుడు వ్రాసిన వానికెల్ల బ్రత్యక్షప్రామాణ్య మొసంగుట గాని యర్ధజరతీన్యాయదోషమునకు గుఱిగా గొంతపట్టు గ్రహించి మఱికొంత పరిహరించుట గాని సక్రమమయిన మార్గము గాదనియు వాని సమన్వయముపట్ల నేను పైని సూచించినమార్గమే సమంచితమనియు సహృదయులు సమ్మతింపక పోరని నా విశ్వాసము.

పండితారాధ్యు డమరావతిలో నుండగా నాతడు బసవనికడ కంతకుమును పంపిన దూత యేతెంచి బసవ డొసంగిన విభూతిని దెచ్చి యిచ్చెననియు, దానిని ధరించినంతనే పండితారాధ్యునకు గర్ణాటకకవిత్వము వశ్యమై యాతడు బసవగీతముల రచించె ననికూడ బండితారాధ్య చరిత్రములో నున్నవి. ఇందుచే నప్పటికి బిజ్జలుడు మరణించినను బసవడుమాత్రము కల్యాణముననో తత్పరిసరములనో జీవించుచుండెనని శ్రీ వేంకటరమణయ్యగారు తలంచుచున్నారు. ఇందుకు గారణము బిజ్జలుని వంశనాశనము, కల్యాణపురనాశము విన్నయనంతరమే యాతడు సంగమేశ్వరమున కేగెననెడి సోముని వాక్యము లందలి విశ్వాసమే. కర్ణాటకలోక మిప్పటికిని నమ్ముచున్నట్లు క్రీ. శ. 1168 ప్రాంతమున బిజ్జల బసవేశ్వరు లిరువురుగూడ భౌతికశరీరముల బాసి యీ ప్రపంచమునుండి నిర్గమించుట సత్యము. దానిని గాదనుటకు బూర్వోక్తము లయిన సోముని వాక్యములు ప్రమాణములు గాజాలవు. క్రీ. శ. 1168 తరువాత బసవేశ్వరుడు కల్యాణపురముననో, మఱెక్కడనో దాగియుండినను, నాతడు బిజ్జలుని పుత్రులకు గనరాక వారి ఖడ్గముల కెరగాకుండుట యసంభవము. ఆతని రహస్యనివాసములు దూరముననున్న పండితారాధ్యునకు మాత్రము తెలిసి యాతడు బసవని కడకు దూతలను గూఢచారులను బంపియుండుట యంతకన్న నసంభవము. రాయమురారి వెన్నాడినప్పుడు జైనులు వ్రాసినట్లు బసవ డే బావియందో, కృష్ణామలాపహానదీ సంగమతీర్థమునందో యాత్మహత్య గావించికొనుటయో, కూడలిసంగమేశ్వర గర్భమందైక్యమగుటయో జరిగియుండును. చాటుమాటుగ నడగిమడగి క్రీ. శ. 1184 ప్రాంతమువఱకు బిజ్జలుని కొమరులు నిశ్శేషముగ నశించువఱకు నాత డుండవలసిన యావశ్యకత యేమియు లేదు. అట్లాత డుండెననుట కెట్టి యాధారములు లేవు. అట్లే పండితారాధ్యుని విషయమున గూడ దలంపదగును. ఎట్టి మహిమశాలులయ్యును పండితారాధ్య, బసవేశ్వరుల శాపమహిమలచే వెలనాటి చోడుడు నాతని సంతతి, బిజ్జలుని సంతతియు నుద్వృత్తుగ నొక్కుమ్మ డేకకాలమున నశించియుండరు. అట్లు జరుగలేదని చరిత్రము ఋజువు సేయుచునే యున్నది. పానుగంటియుదయావనీశుని పండితారాధ్యుడు శపించు పట్టునగూడ సోమనాథు డిట్లే వ్రాసినాడు:

"విదిత శాపోద్ధత విలయోగ్రవహ్ని
నుదయావనీశు డాహుతియయ్యె బుత్ర
పౌత్రు లన్యోన్యకళత్రాభిగతిని
శత్రులై చీకటిచప్పరంబులను
దడయ కాసురియచేతన పరిజనము
లడయంగ నిర్మూలమైనట్లుగూడ
సంతానమెల్ల నిస్సంతాన మయ్యె"

ఇది వాస్తవముగ నట్లు జరిగెనా? కావున నిట్టి పట్టుల సోముని వ్రాతలకెల్ల జారిత్రక ప్రామాణ్యమును సహృదయు లొసంగజాలరు. సోమనాథుని పయివర్ణనములందలి తత్త్వమును గ్రహింపక పెడదారులబట్టి బసవేశ్వర పండితారాధ్యులు క్రీ. శ. 1168. 1170 ప్రాంతముల లింగైక్యమొందిరని విద్వల్లోకమున సుస్థిరముగ నేర్పడిన నిర్ణయమును మార్పగడంగుట సాహసమనియే నా విశ్వాసము. బసవేశ్వరుడు శంకరాచార్యుని వలె స్వల్పకాలమే మని, యా స్వల్ప వ్యవధిలోనే

ఘనకార్యములొనర్చెనని, క్రీ. శ. 1132 వత్స
రమున జనించి 1168 వఱకు, 36 సంవత్సర
మాత్రమే జీవించెనని పలువురు విద్వాంసులు
తలంచుచున్నారు. పండితారాధ్యుడు చాల
వత్సరములు జీవించిన వృద్ధుడని బసవేశుని కన్న
వయస్సులో పెద్దవాడని శ్రీ లక్ష్మణరాయ
ప్రభృతులు పలువురు తలంచిరి. శ్రీ వేంకటరమ
ణయ్యగారు బసవని యాయుర్దాయమును బొడి
గించి,పండితుని యాయుర్దాయము, నేబదియైదు
వత్సరములుగా (1130-1185) కుదించియున్నా
రు. వీరి నిర్ణయములను, సహృదయులు నేను పైని
వ్రాసిన విషయములనెల్ల సావధానముగ సమా
లోచించి, సముచిత రీతిని సంభావింతురు గాక!

## రుద్రదేవ-ప్రతాపరుద్రులు

పిడుపర్తి సోమనాథుడు పద్యబసవపురా
ణావతారికలో జెప్పిన వృత్తాంతమును గాకతి
రుద్రదేవున కంటగట్టుటకయి ప్రభాకర
శాస్త్రులుగారు, నేను కంకణములు కట్టుకొన్నా
మని శ్రీ వేంకటరమణయ్యగారు వ్రాసినారు.
అట్టి కంకణముల నేమియు మేము కట్టనులేదు,
రమణయ్యగారికి వెఱచి విప్పనులేదు. పాలకురికి
సోమనాథుని కృతులందలి యంతస్సాక్ష్యమును
బట్టి యేర్పడుకాలము రుద్రదేవుని పరిపాలన
కాలమునకు చేరుననియే మేము జెప్పునది.
"మఱియు నీ సందర్భమున ఇందులూరి అన్నయ్య
మంత్రిని వీరు సంస్మరింపక పోవుట చిత్రము
గదా! సంస్మరించిన దమసిద్ధాంతము పుల్ల
పోటు వడ్డ బుద్బుదమువలె భిన్నమయి పోవు
నను భయమేమో!" అను విచిత్రవాక్యముల
గూడ వీరు లిఖించిరి. శాస్త్రిగారి మాట యె
ట్లున్నను అన్నమంత్రిగొడవల నేనెత్తకపోలేదు.
ఉపలబ్ధములయిన యాతని శాసనము లన్నియు
నాతనికాలము నిరూపించుట కుపకరించునవే
గాని,సోమనాథు డాతనికాలమునందుండి సత్కా
రముల నందెనని సూచించు నట్టి దొక్కటియు
గానరాదని నేను పలుసారులు వాక్రుచ్చితిని.
మఱియు 1954 మెయినెల భారతి వ్యాసములో
నీయన్నమంత్రివంశ్యుడు, పిడుపర్తి సోమ
నాథునకు 200 సంవత్సరములు ముందున్న వాడు
నగుకొలని గణపతిదేవుడు తన శివయోగసార
ములో పూర్వకవిస్తుతిలో "అసమ శివభక్తి
రసమానసుడగు పాల్కురికి సోమనాథుని"
అని స్తుతించియు, అన్నమంత్రినిగూర్చి యనేక
పూర్వచరిత్రాంశముల వెలువరించియు, సోమ
నాథునకు అన్నయ్యకుగల గురుశిష్య సంబంధ
ముల దిఙ్మాత్రముగ నైన సూచించి యుండ
లేదనికూడ వ్రాసియున్నాను. అన్నమంత్రి
సోమనాథునికి గాని, యాతని శిష్యులకు గాని
యగ్రహారము లొసంగుచు వ్రాయించిన శాసన
ములు లభింపమికిగారణము ప్రాగభావము
గాక ప్రధ్వంసాభావమే యైనచో రిత్తవాదము
లతో ననవసర గ్రంథమును బెంచుటకంటె నట్టి
శాసనములను వెలికెదీసి సోమనాథుని కాలవిష
యక వివాదమును జల్లార్చుటయే పరిశోధక
వర్గమునకు ముఖ్యకర్తవ్యమనికూడ హెచ్చ
రించి యున్నాను. శ్రీ వేంకటరమణయ్యగా
రైనను నేడిట్టి గ్రంథమును వ్రాసి వెలువరించుట
కన్న నట్టి శాసనముల నే వెలువరించియున్న
లోకమునకు మహోపకారమును గావించియుం
దురు గదా! సోమనాథునికాలము మొదటి
ప్రతాపరుద్రుని కాలమునకు జేరు ననుసందర్భ
ములో శ్రీ ప్రభాకరశాస్త్రిగారు బసవపురాణ
పీఠికలో వ్రాసిన "సోమనాథుని కాలనిర్ణయము
న కింకను గొన్ని సాధనములుగలవు. అవి
డొంకతిరుగుడుగా నీకాలమునకే చేరునవిగా
నుండుటచే విడనాడినాడను" అను వాక్యముల
నుద్దేశించి శ్రీ వేంకటరమణయ్యగారు "ఇంకను
దమ కట్లసంచియందు గొన్ని సాధనములు
గల వనియు, నవి డొంకతిరుగుడుగానుండి
యీ కాలమునకే చేరునవిగా నుండుటచే విడ
నాడితి మనియు శాస్త్రులవారు తెలియబఱచి
నారు. ఆ సాధనవిశేషము లెట్టివో!" అని
లిఖించి శాస్త్రిగారి పరిశోధనసామగ్రిని కట్ల
సంచి యని కేలి గావించిరి.

"పండితునిగూర్చి కవిగూర్చి భక్తుగూర్చి
ప్రభునిగూరిచి సన్న్యాసి వరునిగూర్చి
గురునిగూరిచి మృతుడైన నరునిగూర్చి
స్వల్పపరిహాసరచనయు వలనుపడదు"

అని కీర్తిశేషులు శ్రీ పానుగంటి
లక్ష్మీనరసింహారావుపంతులుగారి నీతిరత్నము.
నే డిట్టి పరిహాసరచనలతో స్వర్గీయులైన
శాస్త్రిగారిని బ్రశ్నించుటవలన బ్రయోజన
మేమి? వారు బసవపురాణ పీఠికను రచించిన
తరువాత నిరువది వత్సరములు పైగా జీవించి

యుండిరి గదా! ఇందుగూర్చి శ్రీ వేంకటరమణయ్యగారికి జిజ్ఞాసయే యుండినచో శాస్త్రిగారి జీవితకాలములోనే సముఖముననగాని, పత్రికాముఖముననగాని వారి నడిగి యా సాధన విశేషముల నెఱుంగక మిన్నకుండ నేల? ఇంతేగాక వీరు "పిడుపర్తి సోమనాథుడు చెప్పిన పాల్కురికి సోమనాథుని వృత్తాంతము సత్యాత్మకమును,విశ్వాసపాత్రమును గాదని వీరు త్రోసిపుచ్చినను దానిపై వ్యామోహమును విడజాలరైరి. సోమనాథ ప్రతాపరుద్రుల సమకాలీనతను త్యజింపలేక వీరు పడిన తిప్పలు చూడ నెట్టివారి హృదయముననైన జాలి పుట్టక పోదు" అని శాస్త్రిగారినిగూర్చి, నన్నుగుఱించి యేమేమియో వ్రాసిరి. ఇతరులమాట యెందుకు? మా తిప్పలు తమకుమాత్రము జాలిని గలిగింపక కేలికే యాస్పదము లయినవి గదా! ఎందుకీ యనవసర హేళనలు? పిడుపర్తి సోమనాథుని గ్రంథావతారికపయి మాకు వ్యామోహమును లేదు, వైరాగ్యమును లేదు. అత డుగ్గడించిన వృత్తాంతము పుక్కిటిపురాణ మగుఏకామ్రనాథుని ప్రతాపచరిత్రములోని సంగతులకు గొన్ని మార్పుచేర్పులతో గూడిన యనువాదమని నేను పలుసారులు చెప్పియేయున్నాను. పాలకురికి సోమనాథుని జీవితము భక్తసద్గోష్ఠులందును, చతుష్షష్టిశీలనిర్వహణమునందును మునిగితేలినది. అతనికి లౌకిక రాజకీయములతో ప్రసక్తిలేదు. కాకతీయరాజు లెవరితోగాని, వారి యుద్యోగులతోగాని తనకు సంబంధమున్నట్లు, వారివలన సమ్మానముల నందినట్లు నాతడు తన కృతులలో నించుకేని సూచింపలేదు. ఏకామ్రనాథ పిడుపర్తి సోమనాథు లుదాహరించిన గాథలలో నేదయిన సత్యమున్నచో సోమనాథుని కృతులందలి యంతస్సాక్ష్యమునుబట్టి యేర్పడు నాతనికాలము రుద్రదేవ గణపతిదేవుల కాలముననేగాని రెండవ ప్రతాపరుద్రుని కాలమునకు సరిపడదని చెప్పుట తప్ప మేము పిడుపర్తి సోమనాగుని గ్రంథమునుబట్టి ప్రాకులాడిన దేమియు లేదు. దానిపై వ్యామోహ మేదయిననున్న దాని సాధారముగాగొని సేవించువారికే గాని మాకు గాదు.

ఈ సందర్భములలో రుద్రదేవునకుగూడ ప్రతాపరుద్రు డనువ్యవహారము లేకపోలేదని బద్దెన నీతిశాస్త్ర ముక్తావళినుండి నే నుదాహరించిన "పరువడి నాంధ్రభాషగల బద్దెన నీతియు, సంస్కృతంబులో బరగ ప్రతాపరుద్ర నరపాలునిచే రచియింపబడ్డ యా సగరవరు నీతిసారము..." అను పద్యమునుగూర్చి శ్రీ వేంకటరమణయ్యగారు వెలార్చిన ప్రధానాక్షేపము బద్దెన గ్రంథమును మొదట ముద్రించిన శ్రీ మానవల్లి రామకృష్ణకవిగా రీ పద్యమును మూలగ్రంథమున జేర్పక యాత్మకూరు సంస్థానమున దొరకిన ప్రతిలోనున్న యధిక పద్యములని చివరజూపినవానిలో జేర్చుట. ఇందుచే నీ పద్యము బద్దెన చెప్పినదికాదని వీరి వాదము. ఆంధ్ర సాహిత్య పరిషత్తునందున్న వ్రాతప్రతిలో నిది మూలగ్రంథమందే యున్నది. పద్యమును జెప్పినది బద్దెన కానిండు, మఱియొక్కడు కానిండు. నీతిసారమును రచించినది మొదటి ప్రతాపరుద్రుడే యని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారుకూడ "సకలనీతిసమ్మతము" యొక్క యవతారికలో విస్పష్టముగ వ్రాసినారు. విద్యాభూషణ బిరుదాంకితుడగు నాతడే నీతిసార కర్తయని పలువురు విజ్ఞుల యభిప్రాయము. రెండవ ప్రతాపరుద్రుడు దాని కర్తయని చెప్పువారెవరును లేరు. కావున పద్యకర్త యెవరైనను బయిపద్యము రుద్రదేవునకు ప్రతాపరుద్ర వ్యవహారము లేకపోలేదనుటకు సాధకము గాక మానదని నా యభిప్రాయము. రెండవ ప్రతాపరుద్రునకు ముందుండిన పావులూరి మల్లన గణితమునందలి "ఘనుడు ప్రతాపరుద్రుని పట్టణంబున - పట్టుమలగవీడు పగగవిడిసె" అను పద్యముగూడ నిందును సాధకము. ఇంతకు రుద్రదేవుడు ప్రతాపవిహీనుడు కాడుగదా! హనుమకొండ శాసనమం దతని యవక్రపరాక్రమ ప్రతాపములు వర్ణితములయ్యే యున్నవి. రుద్రశబ్దమునందే ప్రతాపము గర్భితమయి యున్నది. మఱియు నీతనికి ముక్కంటి యను వ్యవహారముగూడ నుండినట్లు దండకవిలెల నుండి తెలియుచున్నది. ఈతనియందలి భక్తిగౌరవముల ననుసరించి యీతని పేరినిబట్టియే గణపతిదేవ చక్రవర్తి తన దుహితకు రుద్రమదేవి యనియు నామె దౌహిత్రునకు ప్రతాపరుద్రుడనియు బేరులుంచెనని నా యభిప్రాయము.

సోమనారాధ్యగురునకు బిడుపర్తి గ్రామమును నితరులకు మఱికొన్ని గ్రామములను ప్రతాపరుద్రభూపాలుడు దాన మొనర్చెనని

నిరూపించుటకు గొండవీటి దండకవిలె నుండి నే నుదాహరించిన శ్లోకముల విమర్శనములో గూడ బైనిజెప్పిన పిడుపర్తి గ్రామము తెనాలి తాలూకాలోనిదని తెలియుచున్నదని నేను వ్రాసినదానిని బురస్కరించికొని శ్రీ వేంకటరమణయ్యగారు కొంత యవహేళనము సెలవుచు గణపతిదేవుని కాలముననేగాని కాకతీయుల పరిపాలనము కృష్ణానదికి దక్షిణమున స్థిరపడలేదనియు గావున బయి శ్లోకములలో నుదాహృతుడయిన సోమనారాధ్యగురుడు పాలకురికి సోమనాథుడే యైనచో నందలి ప్రతాపరుద్రుడు రెండవ ప్రతాపరుద్రుడే కాదగునని సెలవిచ్చిరి. నా వ్రాతలు నామిత్రులు శ్రీ మద్దులపల్లి గురుబ్రహ్మశర్మగారు ప్రకటించిన "కొండవీటి సామ్రాజ్యము" అను గ్రంథము ననుసరించినవి. శ్రీ వేంకటరమణయ్యగారు 1954 మెయి నెల భారతి వ్యాసములో నేనిందు గూర్చి వ్రాసిన విషయములను బరీక్షింతురు గాక! కాకతీయ చరిత్రము మనకు సత్యసమగ్రముగ లభింపలేదు. రుద్రదేవునితండ్రినాటినుండియు పశ్చిమచాళుక్యులు, గాకతీయులు వెలనాటిచోడుల రాజ్యభాగముల పయిగూడ దాడులు గావించి కొన్నిటిని వశపఱచుకొనుచు నుండినట్లు కానవచ్చుచున్నది. అనుమకొండ, ఓరుగల్లు, ధరణికోట గూడ వారి కానాడు రాజధానులుగ నున్నట్లు, రుద్రదేవుడు ధరణికోట నుండి పరిపాలించుచుండినట్లు దండకవిలెలబట్టి తెలియుచున్నది. మఱియు పిడుపర్తి, దోకిపర్తి మున్నగు పేరులుగల గ్రామములు తెలంగాణములోనే యున్నవనియు, సోమనాథాదులకు దత్తములైన గ్రామము లచ్చటివే యనియు శ్రీ శేషాద్రి రమణకవులు వ్రాసియున్నారు. రుద్రదేవునకు మాత్రమే ముక్కంటి యను వ్యవహార మున్నప్పుడు, అతడే దాతయని వినుకొండ దండకవిలె నుండి తెలియుచున్నప్పుడు, నే నుదాహరించిన ప్రతాపరుద్రుడు శ్రీ వేంకటరమణయ్యగారు సెలవిచ్చినట్లు రెండవ ప్రతాపరుద్రుడేయని చెప్ప నవకాశములేదు.

## అంబయదేవుని నీలగంగవర శిలా శాసనము (క్రీ. శ. 1290)

పయి శాసనమందలి ప్రతిగ్రహీత రెంద్రేవుల మల్లినాథయ్య, శాసనమంతయు బూర్తియైన పిదప నసంగతముగ నందు క్రింద జేర్పబడిన సంస్కృతశ్లోకములో నుదాహృతయైన దోచయదేవి యనువారి నామముల బట్టి యావ్యక్తులే సోమనాథుని బసవ పురాణావతారికలో నాతని సమకాలీనులుగా నుదాహృతులైన రెంటాల మల్లినాథుడును, దోచమాంబయు గాదగునని తలంచి శ్రీ సోమశేఖరశర్మగారు సోమనాథుడు రెండవ ప్రతాపరుద్రుని కాలమువాడే కావలయుననెడి నిర్ణయమును పునరుద్ధరింప బ్రయత్నించి రను విషయమును మునుముందే యుదాహరించియున్నాను. ఆ వాదమును సమర్థించుటకీ శాసన మసమర్థముగానున్న తెఱంగు నెఱుంగజేయుచు నిందు గూర్చి 1946 ఆగస్టు, 1954 మెయి నెల భారతివ్యాసములలో విపులముగ జర్చించియున్నాను. దానప్రతిగ్రహీత రెంద్రేవుల మల్లినాథయ్య, తుది శ్లోకమందలి దోచయ, శాసనకాలమగు క్రీ. శ. 1290 నాటివారే యని శ్రీ సోమశేఖర శర్మగారు ప్రతిపాదించిరి. కాని శ్రీ వేంకటరమణయ్యగా రిందుకొక మెట్టు క్రిందికి దిగి, నేను తలంచినట్టు లిది యందదుకుల శాసనమే యని యంగీకరించి, చివరి శ్లోకము క్రీ. శ. 1290 లో గాక యనంతరము కొంత కాలమున కెప్పడో మల్లినాథయ్యవంశ్యులచే దోచయ్య ప్రశస్తిని వెల్లడించుటకయి వ్రాయింపబడియుండు ననునభిప్రాయమును బ్రకటించిరి. మఱియు "రెంద్రేవుల" రూపమే "రెంటాల"గామాఱిన దనెడిశర్మగారి పరిణామ వాదమందలి యసంగతిని గుర్తించి కాబోలు దానిని బోవిడిచి, రెంద్రేవులకు రెంటాల వ్యావహారిక రూపమని, సోమనాథుడు వ్యావహారిక భాషాప్రియుడు కావున బసవపురాణమున వ్యావహారిక రూపమునే యవలంబించి రెంద్రేవుల మల్లినాథయ్యనే రెంటాల మల్లినాథుడని పేర్కొన్నాడని మఱొక్క క్రొత్త ఫక్కిని ద్రొక్కినారు. శాసనములు భూపాలురు సామాన్యముగా జను లందఱకు తెలియుట

కయి చేసినవనియు, అందుచేతనే యాద్యంతము కేవల సంస్కృత శ్లోకబద్ధము లయిన శాసనములలో గూడ గ్రామనామములు, వాని హద్దులు దేశభాషలలో వ్యావహారికరూపములలో లిఖింపబడినవనియు సహృదయులు తలంచుచున్నారు. ఇందుకు భిన్నముగ రెంద్రేవుల యను శాసనస్థభాషారూపమునకే రెంటాల వ్యావహారికరూప మను వేంకటరమణయ్యగారి నూత్న వాదమును సహృదయు లెవరు నంగీకరింపరనియే నేను విశ్వసింతును. ఆ నాడు నీ నాడుగూడ గ్రామనామ రూపము రెంటాలగానే యున్నప్పుడు, రెంటాల యను గృహనామముగల శైవ బ్రాహ్మణ కుటుంబములు నే డున్నప్పుడు నిట్టి వాదమున కాస్కారము లేదు. దోచయ దేవి, దాతయగు అంబయదేవుని భార్య కానేరదనుటకు నేను జూపిన యుపపత్తులకు రమణయ్యగా రంగీకరించినారు. కాని యామె యొకవేళ రెంద్రేవుల వారి కుటుంబమునకు జెందిన స్త్రీయని తలంచెడిచో శ్లోకమందలి భూతకాలిక క్రియా ప్రయోగముల బట్టి యామె యంతకుముం దెప్పుడో గతించిన వ్యక్తిగా గోచరించును గావున నామె మల్లినాథయ్యకు బితామహియై యుండవచ్చునని నేను వ్రాసిన దానిని బురస్కరించి కొని "పితామహియ కానేల? ప్రపితామహియో, తల్లియో, భార్యయో యేలకారాదు? ప్రపితామహియనికాని తల్లియని కాని భార్యయని కాని చెప్పిన దామె చేసిన పాలకురికి సోమనాథుని కాలనిర్ణయమునకు బ్రతిరోధము కలుగును. దోచమ రెంద్రేవుల మల్లినాథునికి బ్రపితామహియైన సోమనాథునికి బూర్వికురాలగును. తల్లిగాని భార్యగాని యైన నామె కాలము క్రీ. శ. 13 వ శతాబ్దపు టుత్తరార్ధమగును. రెండును తమ్మయ్యగారి కాలనిర్ణయమునకు వ్యతిరేకించును. కావున దమ సిద్ధాంతమున కనుకూలమగునట్లు పితామహియను వావిని గల్పించినారు" అని వ్రాసి శ్రీరమణయ్య గారు "దోచమ రెంద్రేవుల మల్లినాథుని భార్యయనియె నా దృఢవిశ్వాసము" అని ప్రకటించిరి. సోమనాథుడు బసవపురాణావతారికలో రెంటాల మల్లినాథునిగూర్చి

"తను మనో ధన నివేదన సమగ్రతను
బనుగొని జంగమార్చనలు సేయుచును
శీలంబుదనరసీమాలంఘునవ్ర
తాలంకృతిని చేర్చి యాచారలీల
యసలారగా గుమారాద్రికిదూర్పు
దెసను సోపానముల్ దీర్చి పాల్పార
మహిత సద్భక్తిసమంచిత వృత్తి
మహిజను రెంటాల మల్లినాథుడును"

అని వ్రాసి, యావెనువెంటనే

"నిరతిశయప్రీతి నిత్యంబునైదు
కరవీర పుష్పముల్ హరున కర్పింప
నొక్కనా డొక డందు దక్కువయైన
గ్రక్కున దననేత్ర కమల మర్పించి
భవునిచే నసదృశాంబక మప్డ పడసి
ధ్రువకీర్తిం బేర్కొన్నదోచమాంబయును"

అని దోచమాంబవిషయమును బేర్కొనినాడు. ఆమె మల్లినాథుని స్వాధ్వీమణియే యైనచో సోమనాథుడా విషయము నచ్చటనే తప్పక వ్యక్తమొనర్చియే యుండునని నాయభిప్రాయము. ఇట్టి పట్టుల నుదాసీనత బూనుట యాతని తత్త్వములో లేదు. ప్రబలాధారములు లేనప్పుడపరిచితయైన యొక సతీమణిని మఱియొక యపరిచితుని భార్యగా బరిగణించుట యార్యధర్మవిరుద్ధ మగుసపచార మగునేమోయని నాయభిప్రాయము. సోమనాథుడు తన కవితా విద్యాగురుడు కరస్థలి విశ్వనాథుడనియు, పండితారాధ్య కృపాసముద్గతుడగు కరస్థలి సోమనాథుడు బసవపురాణ కథా సూత్రముల దెలిపినపెద్దలలో బ్రముఖుడనియు జెప్పియున్నాడు. ఈ కరస్థలి సోమనాథ విశ్వనాథులొకే గృహనామముగల శైవ బ్రాహ్మణులుగ గానవచ్చుటచే వీ రిరువురు సోదరులు (అగ్రజావరజులు) కావచ్చునని నేను బ్రసక్తానుప్రసక్తముగ నా గ్రంథములో నుదాహరించితిని. దీనికి తప్పువట్టి నిరాధారపు వ్రాతగా గణించి "నిరాధారములగు వారి యూహాతరంగ పరంపరలపై మనము తేలియాడవలసిన యావశ్యకత లేదు." అని వేంకటరమణయ్యగా రాక్షేప మొకటి నిక్షేపించిరి. ఇట్టి మహనీయు లే ప్రబలాధారముపయి దోచయ్యకు మల్లినాథునితో భార్యాసంబంధమును గల్పించిరో! ఏతాదృశములగు వీరి యూహా

పంక్తులలో మాత్రము గూరుకొని పాఠకులు బలిసదనమున కేగి విహరింప వలయును గాబోలు! శ్లోకమందలి భూతకాలిక క్రియను బట్టియు, స్వర్గమధిరోహించుటకో యన త్రిపురాంతకదేవు నెదుట మెట్లు గట్టించె ననెడి యుత్ప్రేక్షను బట్టియు, దోచయ శాసనకాలము నాటికి లేక యంతకు మున్నెన్నడో గతించిన పూర్వవ్యక్తిగా గోచరించుట చేతనే నేను "పితామహి" యన్నది. రమణయ్యగా రుగ్గడించిన కారణములు వేనిని నే నించుకేని మనమున దలంప లేదు. కేవల మలవోకగా నే యట్లు వ్రాసితిని. వాస్తవముగ నామె రెంద్రేవులవారి కుటుంబమునకు జెందిన వ్యక్తియైనచో నామె దానప్రతిగ్రహీత మల్లినాథయ్యకు బ్రపితామహియన్నను బ్రత్యవాయము లేదు. నా నిర్ణయమునకు బాధకము లేదు. నా నిర్ణయము ప్రకారము బసవపురాణ రచనాకాలము క్రీ. శ. 1192 గదా! రమణయ్యగారి వంటిచరిత్రకారులు సామాన్యముగ బాటించు తరమునకు 25 సంవత్సరములు లెక్క ప్రకారము శాసన కాలము క్రీ. శ. 1290 నుండి ముందుకు గణించినచో మల్లినాథయ్య ప్రపితామహుడు ప్రపితామహి క్రీ. శ. 1190 నాటి వారే యయ్యెదరు గదా!

రెంద్రేవుల మల్లినాథయ్య విషయమున శాసనములో సోమనాథుడు రెంటాల మల్లినాథునిగూర్చి చెప్పిన విశేషణ మొకటియు జెప్పబడనందున నిరువురు నేకవ్యక్తి గానేరరనియు, దోచయ్యగూర్చిన శ్లోకమును దరువాత జెక్కినవారు సోమనాథుని బసవపురాణ తాళపత్ర ప్రతిలోని విషయముల సరిగా గమనింపక రెంటాల మల్లినాథపరముగ వర్ణితమయిన విషయమును గొన్ని వ్యత్యయములతో దోచయ కతకరించి యుందురని గదా నే జెప్పియున్నాను. ఇట్టి పొరపాటులు తరువాతివారి లేఖనములలో దొరలు నవకాశములకు దార్కాణముగనే, సోమేశ్వర పురాణమును 1500 ప్రాంతమున రచించిన తోంటద సిద్ధలింగకవి బసవపురాణములో రెంటాల మల్లినాథుని గూర్చిన వాక్యముల వెనువెంటనే యున్న దోచమాంబ వర్ణనమందుగల కరవీర పుష్ప పంచకార్చనవ్రతము, నేత్రసమర్పణ పునరాదానములను దన గ్రంథమున రెంటాల మల్లినాథున కతకరించిన సంగతిగూడ దృష్టాంతముగ నొసగియుంటిని. వీని నన్నిటిని జెడచెవిని బెట్టి యందుకేమియు బదులుపలుకక, కేవల హేళనలతో వీరు తమ కలమును జరచర పరువులెత్తించుట మంచిదికాదని మనవి చేయుచున్నాను. రెంటాల మల్లినాథుడు సోపానములు కట్టించినది కుమారాద్రికి (త్రిపురాంతకమునకు) తూర్పుదెసనని సోమనాథుడు వ్రాసినది. దోచయ కట్టించినవిగా శ్లోకమం దుదాహృతమయినవి కుమారాద్రిపయినున్న త్రిపురాంతకేశ్వరుని యాలయమున గర్భాలయము ముందఱ దేవున కెట్టయెదుట గట్టించిన మెట్లు. పయిరెండు నొక్కటేయని సహృదయులు చెప్ప నేర్తురా? శ్లోకమందలి పదములకు సరియైన యర్థమును గ్రహింపక, రమణయ్యగారు పయిగా "తమ్మయ్యగారేలకో పూర్వద్వారే యను మాటలను జల్లగ జాఱవిడిచినారు" అని యాక్షేపించినారు. శ్రీశైలక్షేత్రము చతుర్ద్వార విశిష్టము. (శ్రీశైల సంకల్పము చిత్తగించునది.) పండితారాధ్యచరిత్ర చివర బండితుని నలువురు మనుమలను బేర్కొనుటలో "వాలారు శ్రీనగద్వార చతుష్కలీల" అని సోమనాథుడు చెప్పిన యుపమానముగూడ నిందుకు దార్కాణము. ఆ నాలుగింటిలో కుమారాచలము (త్రిపురాంతకము) పూర్వద్వారము. రావిపాటి త్రిపురాంతకుని త్రిపురాంతకోదాహరణమందలి

"ఆఱడియాస నీరస ధ
రాధిపలోకము లిండ్లవాకిళుల్
దూఱుటమాని శ్రీనగము
తూరుపువాకిలి సొచ్చి పాపముల్
నీఱుగజేసి గంధవతి
నీటనుమున్గి మనంబులోని చి
చ్చాఱగజేయుటొప్పు త్రిపు
రాంతక దేవునకై నమస్కృతుల్."

అను పద్యము దీనిని విస్పష్టమొనర్చును. ఈ విషయ మెఱింగి యిప్పుడైన నీ క్రిందివిధమున వీరు శ్లోకార్థమును సరిగా గ్రహింతురుగాక! పూర్వద్వారే కుమారక్షితిభృదుపరితః=(శ్రీశైలమునకు) తూర్పుద్వారమైన కుమారాద్రిపైని, తత్పూరారేః=అందలి త్రిపురాంతకేశ్వరుని యొక్క, పురస్తాత్=ముందఱభాగమున, రమ్యం సోపానమార్గమ్=

చక్కని మెట్లవరుసను, నిధాయ=కట్టించి".

ఇంకను శ్రీ రమణయ్యగారు దోచయ్య కట్టించిన పైమెట్లును, బసవపురాణమున రెంటాల మల్లినాథుడు కుమారాద్రికి దూర్పుదెసకు గట్టించినట్లుగా జెప్పిన సోపానపంక్తులు నొక్కటేగాని వేర్వేఱు కావని చెప్పుచు గొన్ని విపరీతవాక్యముల నిట్లు లిఖించిరి: "శ్రీశైలమునకువలె కుమారాద్రికి సోపానములు గట్టించినవారు పెక్కురు గానరారు. వాఙ్మయమున రెంటాల మల్లినాథుడును శాసనములలో దోచయయు దప్ప నీ పుణ్యకార్యమును నిర్వహించినవారు మఱెవ్వరునులేరు. రెంటాల మల్లినాథుడును దోచమయు సమకాలికులు. వారిద్దరును సోపాననిర్మాణమును గావించినదియు గుమారగిరి పూర్వపార్శ్వముననే. సమకాలికులగు వీరిర్వురును ప్రత్యేకముగ వెవ్వేఱు సోపానపంక్తులను నిర్మించిరనుట విశ్వాసార్హముకాదు. మఱియు నట్టి ప్రత్యేక సోపానావళి నిర్మాణావశ్యకతయు గానరాదు. కావున రెంటాల మల్లినాథుడును, దోచమయు గట్టించిన సోపానపంక్తి యొక్కటియే యనితలంచుట యుక్తము. అయిన నీ సోపాననిర్మాణమును బసవపురాణమున రెంటాల మల్లినాథునకును మొల్లకల్లూరు గ్రామశాసనమున దోచయకును నారోపించుటకు గారణమేమి? వారు భార్యాభర్తలగుటయే దానికి గారణము. దోచమ రెంటాల మల్లినాథుని భార్య. ఆమె ప్రోత్సాహము మీదనే యతడు సోపాన నిర్మాణమును గావించినది. ధనమును వెచ్చపెట్టి నిర్మాణకార్యము కొనసాగించినాతడు మల్లినాథుడగుటవలన సోమనాథుడతడే సోపాననిర్మాత యని చెప్పినాడు. శాసన గ్రంథకర్త యన్ననో యా యుద్యమమును దలపెట్టి భర్తను ప్రోత్సాహము చేసి యతనిచే నా కార్యమును బూర్తి చేయించిన దోచమయె తన్నిర్మాణమునకు గారణభూతురాలని తలంచి యామెకె దాని కర్తృత్వము నంటగట్టినాడు. బసవపురాణ మొల్లకల్లూరు దాన శాసనసాక్ష్యముల వ్యత్యాసమునకిదియె కారణము. భర్తచేసిననేమి, భార్య యతనిచే జేయించిననేమి? ఆ పుణ్యకార్యమున వారిరువురును భాగస్వాములు గాకపోవుదురా? శాసనగ్రంథమందలి దోచమ వృత్తాంతమును జర్చించునప్పు డామె రెంద్రేవుల మల్లినాథుని పత్ని కావచ్చునని యూహించితిని. ఇచట నామె రెంటాల మల్లినాథుని సతియని వాక్రుచ్చితిని. వీరిద్దరికిని నామె యెట్లు భార్య కాగలదు?- అని యెవ్వరైన నడుగవచ్చును. ఇందు వైపరీత్య మేమియులేదు. రెంద్రేవుల రెంటాలయొక్క పూర్వనామమనియు రెంద్రేవుల మల్లినాథుడు రెంటాల మల్లినాథుడే యనియు సోమశేఖరశర్మగారు గుర్తించియున్నారు. తమ్మయ్యగారి కిది నచ్చలేదు..."

ఇందలి యౌచిత్యమును బాఠకులే పరామర్శింతురుగాక! రెంద్రేవుల రెంటాలల యేకీకరణ చర్చ పాఠకులకు ప్రాత పురాణమే. క్రమపరిణామమున "రెంద్రేవుల" అనునది రెంద్రేల, రెండేల, రెండాల, రెంటాల అని మాఱియుండునని శర్మగారి పరిణామవాదా నౌచిత్యమును గూర్చియు, అందుకు రకము మార్చి నేడు రమణయ్యగారు రెంద్రేవులకు రెంటాల వ్యావహారిక రూపమని వెలార్చిన క్రొత్తవిషయమునందలి యౌచిత్యమును గూర్చియు మున్నే ముచ్చటించియున్నాను. దోచయను గూర్చిన శ్లోక మసలు శాసనమును అంబయదేవుడు వేయించినపుడు రచించినది, చెక్కించినది కాదని శ్రీ రమణయ్యగారంగీకరించి, దానిని దరువాత రెంద్రేవుల వారి వంశ్యు లామె మహిమను బ్రకటించు నుద్దేశముతో శాసన శిలపయి వ్రాయించి యుందురని సెలవిచ్చినారు. ఇది క్రీ. శ. 1290 (శాసన కాలము) తరువాత నెంతకాలమునకు జరగియుండునో మాత్రము వారు చెప్పలేదు. అసలు శాసనమునాడే దోచయప్రశస్తి యుగ్గడింపబడకుండుటకు వీరు రెండు కారణములు సూచించినారు (1) అప్పటి కింకను దోచమ మహిమాదికములు ప్రకటితమైయుండక పోవచ్చును. (2) శాసనమును వేయించిన అంబయదేవుని యుద్యోగులకు రెంద్రేవులవారి ఘనతను బొగడుట యుద్దేశము గాకుండుట; మల్లినాథయ్య యైనను జెప్పి చేయించుట కా శాసన రచనతోగాని ప్రతిష్ఠతోగాని సంబంధములేకుండుట. ఇందలి సామంజస్యమును గూడ సహృదయులు నిర్ణయింతురుగాక! ప్రతిగ్రహీతయగు మల్లినాథయ్య విషయమునగూడ నాతడు శైవుడనుట తప్ప నెట్టి వివరములు నీ శాసనమం దుగ్గడింపబడకుండుట యొకవిశేషము,

ఇట్టి సందర్భములో నాతని వంశ్యులే తమ వంశ ప్రశస్తిని ప్రకటించుతలంపుతో దరువాత గొంతకాలమునకు దోచయ్యను గూర్చిన శ్లోకమును జెక్కించినచో మల్లినాథయ్య ప్రశస్తిని గూర్చి కూడ మఱికొన్ని శ్లోకముల నేల చెక్కింప రయిరో! ఆతనికి దోచయ్యకు గల సంబంధమునైన స్పష్టీకరింపక పోవుటకు గారణమేమో! భార్యభర్త కర్ధాంగిగావున నామెను ప్రశంసించినచో నతనిని ప్రశంసించినట్లే (ఆమె చేసిన పను లాతడు చేసినట్లే) యని రమణయ్యగారు సమాధానము చెప్పుదురు కాబోలు! అస్మదాదులకు బట్టుదలల నారోపించి యట్టివేమియు దమకు లేనట్లు, వీ రీయుతుకులబొంత శాసనమునే యిప్పటికి నూతగాగొని యెన్నెన్ని పోకడలు పోవుచున్నారో పాఠకులు గ్రహింతురుగాక! ఇంతకు దోచయ్యను గూర్చిన శ్లోకము నామె సంతతివా రెప్పుడు చెక్కించిరో, యప్పటి కామెయు మల్లినాథయ్యయు సజీవులైయుండిరో లేదో, వీరేమియు జెప్పలేదు. ఎప్పుడెవరు దానిని జెక్కించినను నందలి "రేజే" యను భూతకాలక్రియనుబట్టియు, "ద్యోః ప్రతిజ్ఞాం విధాయ" అను వార్తను బట్టియు నామె యప్పటికి ముందే స్వర్గస్థురాలయియుండెనని సహృదయులకు దోపకపోదు. శ్రీ వేంకటరమణయ్యగారు విశ్వప్రయత్నమొనర్చి నిర్ణయించిన సోమనాథుని కాలము క్రీ. శ. 1280—1340 గదా! ఇందు మొదటివత్సరము వారి దృష్టిలో సోముని జన్మకాలమనియు, రెండవది మరణకాలమని నేను గ్రహించుచున్నాను. ఆపక్షములో నీలగంగవరశాసనకాలము (1290) నాటి కాతడుపదియేండ్లబాలుడగును. బసవపురాణమును రచించునప్పటి కాతడు ముప్పదియేండ్ల వయస్సుగలవాడయియుండునని తలంచినచో దద్రచనాకాలము క్రీ. శ. 1310 అగును. అప్పటికి రెంద్రేవుల మల్లినాథయ్యమాట యెట్లున్నను, దోచయ్య ముందే గతించియుండవలెనని వేంకటరమణయ్యగారి వ్రాతలవలననే యేర్పడును. అట్టిస్థితిలో శ్రీశైలక్షేత్రమున నొడ్డోలగమున బసవపురాణ రచనమునకు దనకుద్బోధము గలిగించిన పెద్దలలో సోమనాథుడామెను పేర్కొనుట యెట్లు పొసగునో చదువరులే నిర్ణయింప గలరు.

## అర్జునవాడ శిలాశాసనము

ఇది బసవేశ్వరుని వంశ్యుడగు హోలబసవదేవునకు యాదవ కన్నడ భూపాలుని సామంతులు క్రీ. శ. 1260లో దానమొసంగుచు వెలయించినది. దీనిని బసవేశ్వరుని చారిత్రక వ్యక్తిత్వనిరూపణమునకు ప్రబలాధారముగా కర్ణాట విద్వాంసులు గ్రహించినారు. ఈశాసన విషయములనుగూర్చి శ్రీ వేంకటరమణయ్యగారు తమ గ్రంథముచివర నొక యనుబంధమునుచేర్చి దానప్రతిగ్రహీత హోలబసవదేవుని పూర్వుడుగా శాసనమం దుదాహృతు డయినబసవడు వీరశైవ మతోద్ధారకుడు, బిజ్జలుని యమాత్యుడు నగుకల్యాణ బసవేశ్వరుడు కానేరడని తమ యభిప్రాయమును వెలార్చిన విషయము నింతకు మున్నే యుదాహరించి యున్నాను. ఈశాసనమును మొదట సంపాదించి ప్రకటించినది బిజాపుర వాస్తవ్యులు శివానుభవ పత్రికా సంపాదకులునగు రావుబహద్దుర శ్రీ ఫకీరప్పహాలకట్టి (బి. ఎ.ఎల్. బి.) గారు. వారు స్వయముగా సుప్రసిద్ధ పరిశోధకులు. అయిన నీశాసనపరిశోధమున వారు డాక్టరు నందిమఠ్ (ఎం. ఎ. పిహెచ్ డి) మున్నగు పరిశోధకుల సాయమును గూడ గొనియే దానిని తమపత్రికలో 1928 మార్చినెలలో (సం 3 సం 9) మునుముందు ప్రకటించియున్నారు. అటుతరువాతనే దీనిని శ్రీ ఎన్. లక్ష్మీనారాయణరావు (ఎం. ఎ.) గారు ఎపిగ్రాఫియాఇండికా 21వ సంపుటి (PP9-16) లో తమ వివరణములతో ఆంగ్లమున బ్రకటించినారు. ఆపిమ్మట నేనుగూడ దీనిని విభూతి పత్రికలో 1940 సంవత్సరములో (సం 2 సం 4) ప్రకటించిన 'బసవేశ్వరుని గూర్చినశాసనసామగ్రి' అను వ్యాసమున కనుబంధముగ కన్నడ మూలముతోను, ఆంధ్రవివరణముతోను బ్రకటించియున్నాను. హోలబసవదేవుని పూర్వుడయిన బసవనిగూర్చి శాసనావతారికలో ముందుగా నీ క్రింది విషయములున్నవి.

"శ్రీమత్తరదవాడి మధ్యగ్రామ బాగవాడి పురవరాధీశ్వర మాదిరాజనతనూజం బసవరాజన మహిమె యెంతెందడె.

మంగళకీర్తి పురాతన
జంగమ లింగైకభక్తి నిర్భరలీలా
సంగం సంగన బసవం
సంగతియంమాళ్కె భక్తియొళనవరతం"

బసవేశ్వరుడు బాగెవాడి (హింగుళేశ్వర భాగ్యవాటి) గ్రామమహాజనుడగు మాదిరాజునకు, నాతనిసతి మాదమాంబకు నుదయించి కూడలి సంగమేశ్వరు నఖండభక్తితో సేవించిన భక్తుడవుటచే సంగన బసవనయనియు,[1] కల్యాణపురమున బిజ్జలుని మంత్రిగా నుండుటచే కల్యాణ బసవడనియు పరంపరగా గీర్తింపబడుట సర్వవిదితము. బాగెవాడి మాదిరాజ పుత్రుడయిన సంగనబసవడు, జంగమ సేవా పరతంత్రుడు, కల్యాణ బసవేశ్వరుడు గాక మఱొక్కడు గానరాడు. బిజ్జలుడు క్రీ. శ. 1162 ప్రాంతమున దనయేలికయగు మూడవ తైలపుని వెడలనడచి కల్యాణపురమున బశ్చిమ చాళుక్య సింహాసనము నధిష్ఠింపకి మున్ను తైలపుని సామంతుడుగా తీర్దవాడి సీమకు బరిపాలకుడుగా మంగళవేఢె రాజధానిగా నుండినట్లు లాతని శాసనముల వలననే తెలియుచున్నది. పాలకురికి సోమనాథునకు సమకాలీనుడో యించుమట పూర్వుడో యని తలంపబడు హరీశ్వరుడు తన బసవరాజదేవ రగళెలో బసవడు మొదట బిజ్జలుని యొద్ద మంగళవాడయందే మంత్రిగా గుదిరినట్లు చెప్పియున్నాడు. దీనినిబట్టి నేనుగూడ బసవడు తీర్థవాడి సీమలో బిజ్జలుని మంత్రిగా నున్నప్పుడే వీరశైవమతోద్ధరణమునకు బూనుకొని యాతరువాతనే క్రీ. శ. 1162 ప్రాంతమున బిజ్జలునితో గల్యాణమున కరుదెంచి యుండునని వావిళ్ల వారి బసవపురాణ పీఠికలో వ్రాసియున్నాను. బిజ్జలుని శాసనములలో బసవని నామోల్లేఖనము గానరాదు. అందుచేతనే చాల కాలము పలువురు పరిశోధకులు బసవని చారిత్రక వ్యక్తిత్వమును శంకించుచు వచ్చిరి. కాని బిజ్జలుని యనంతర మొక శతాబ్దిలో వెలసిన శాసనములు పెక్కింటిలో పేర్కొనబడిన పూర్వభక్తుల నామములలో నాతని పేరు గానవచ్చుటచే నట్టి యుపోహలు తొలగిపోయి, అర్జునవాడ శాసనము వలన నతని యస్తిత్వము మఱింత ధ్రువమైనది. బిజ్జలుని శాసనములలో బసవేశ్వరుని ప్రశంస లేకుండుటకు గలకారణములను గొంతవఱకు "బసవేశ్వరుడు - బిజ్జలుడు" అను పేరితో విభూతి (సం 1, సం 3) పత్రికలో నేను ప్రకటించిన వ్యాసములలో నివేదించియే యున్నాను. శ్రీ వేంకటరమణయ్యగారు గూడ బిజ్జలుని శాసనములలో బసవని యెడ పొడ గానరానంతమాత్రమున నాతని చారిత్రక వ్యక్తిత్వమునకును పూర్ణానుస్వారము చుట్టక బసవపురాణాదిక గ్రంథ ప్రమాణముల బట్టి యాతని యస్తిత్వము నంగీకరించి యున్నారు. అట్లయ్యు అర్జునవాడ శిలాశాసనోదాహృతుడయిన సంగన బసవన బిజ్జలుని మంత్రి కానేరడని వీరు నిరాకరించుట యాశ్చర్యము. ఇందుకు వీరు చెప్పెడి ముఖ్య కారణములు, (1) ఈ శాసనమున గూడ నాతడు బిజ్జలుని మంత్రియని స్పష్టముగ బేర్కొనబడకుండుట. (2) హాల బసవదేవుని వంశానుక్రమణికలో బసవనయాగ్రజుడయిన దేవరాజ మునియొక్క మునిమనుమడుగా నాత డుదాహృతుడగుట. (3) సోమనాథుని బసవపురాణమును బట్టి మాదిరి మాదిరాజుభార్య సంతానము లేక నందివ్రతమాచరింపగా నుదయించిన పుత్రుడు బసవడని చెప్పబడుటచే నాతనికి దేవరాజ నామాంకితు డగ్రజుండుండెనని తలంచుట కవకాశము లేకుండుట. సోమనాథుని బసవపురాణము చారిత్రకవిషయ నిరూపణములో మనకు సమగ్ర ప్రమాణము కానేరనివిధమును ముందే చెప్పియున్నాను. హరీశ్వరుని రగళెలో వృషభముఖు డనుప్రమథుడు శాపవశమున భూలోకమున మాదిగి మాదిరాజు తనయుడుగా నుదయించెనని మాత్రమున్నదే గాని యాతని భార్య సంతతి లేక నందినోము నోమగా బసవడు వారి కేకైక పుత్రుడయి యుదయించెనని యుదాహరింపబడలేదు. సోముని బసవపురాణమున గూడ బసవడు మాదిరాజున కేకైక సంతానమని చెప్పబడలేదు. బసవనికి నాగాంబికయనెడి యగ్రసోదరి (చెన్న బసవని తల్లి) యున్నట్లు సోముని గ్రంథమును బట్టికూడ గానవగును.

హాలబసవ దేవుని వంశానుక్రమణికలో

"సంగన బసవన అగ్ర...
...కం దేవరాజ మునిపన తనయుం
జంగమ పగుసం...గ
సంగం ప్రియసుత నెనిప్ప కలిదేవరసం"

అను పద్యములో చుక్కలు పెట్టిన తావులందు శాసనశిల కొంత శిథిలమయినది. అందుచే శ్రీ లక్ష్మీనారాయణరావుగారు లుప్తములైన భాగ

1. హైదరాబాద్ రాష్ట్రములోని నేటి బీదర్ జిల్లాలోని కల్యాణపురము.

ములు "అగ్రజలింగైకం" "శావర సంగం" అని చదువనగునని యూహించి శాసనకాలము క్రీ॥ శ॥ 1260 నుండి తరమునకు 25 సంవత్సరములు చొప్పున వెనుకకు లెక్కవేసి బసవేశ్వరుని కాలము క్రీ॥ శ॥ 1160-1185 కాదగునని చెప్పి యాతడు బిజ్జలుని మంత్రిగా నుండె ననెడి నిర్ణయమున కిది సాధకమే యగువిధము నిరూపించిరి. శ్రీ వేంకటరమణయ్యగారు మొదలునకే మోసము గలిగించుట యాశ్చర్యము. బసవేశ్వరునకు బాలసంగయ యను పుత్రుడుండి యాతడు పసితనమున నసువుల గోల్పోవగా బసవడు దుఃఖించెనని సూచించెడి గేయమును భైరవేశ్వర కావ్య కథా సూత్ర రత్నాకర మనుకన్నడ గ్రంథమునుండి ప్రభాకర శాస్త్రిగారు బసవపురాణ పీఠికలో నుదాహరించినారు. హరీశ్వరుని రగళెనుబట్టి బసవనికి సిదరసను పుత్రుడు గంగాంబికవలన గలిగినట్లు తెలియుచున్నది. కావున బసవేశ్వరునకు గొంత సంతతి యుండెనని, యాతనివంశ మాతనితో నంతరింపలేదని యిందువలన నూహింప నవకాశమున్నది. ఇందుచేతనే శాసనమును మొదట శివానుభవ పత్రికలో ప్రకటించిన హలకట్టిగారు వంశానుక్రమణికలో బసవని తరువాత నాతని పుత్రపౌత్రులనేగాని సోదరుని చేర్కొనుట ప్రసక్రమభంగ మగుననుతలంపుతో గాబోలు అగ్రజశబ్దమునకు జ్యేష్ఠపుత్రుడు (హిరియమగను) అను నర్థమును గణించి యా పుత్రుని పుత్రుడే దేవరాజని లుప్తభాగములో జెప్పబడియుండునని తలంచి, యా దేవరాజును లక్ష్మీనారాయణరావుగారు చెప్పినట్లు బసవని యన్నగాగాక మనుమనిగా గణించిరి. బసవేశ్వరుని చరిత్రవిషయమున హరీశ్వరుని రగళెయే మొదటి కృతి యగుటచే యథార్థ కథనములో సోముని బసవపురాణముకన్న దానికే యెక్కువ ప్రామాణ్య మీయదగునని కర్ణాట విద్వాంసులు తలంచుచున్నారు. ("బసవ చరిత్రము - హరీశ్వర సోమనాథుల కథన విభేదము" అను వ్యాసమును ముందు ప్రకటింతును.) శ్రీ వేంకటరమణయ్యగారు హల బసవదేవుని పూర్వుడుగా నీ శాసనమం దుదాహృతుడయిన మాదిరాజపుత్రుడు, సంగన బసవడు, బిజ్జలుని మంత్రికాడని చెప్పుసంగతి సహృదయు లంగీకరింపజాలరనియే నా నమ్మకము. వీరి నిర్ణయము కన్నడులలో నలజడి గావింపక మానదు. దోచయదేవి విషయములో "శివునకు నేత్రమర్పించి దానిని మరల బడసిన దోచమనామాంకితురాలగు భక్తురాలి నింకొక్కతను తమ్మయ్యగారు చూపగలరా" యని యామెను గూర్చి నేను వ్రాసిన సంగతులను సరిగా గ్రహింపకయే ప్రశ్నించిన వేంకటరమణయ్యగారికి "బాగెవాడి మాదిరాజపుత్రుడు, మంగళకీర్తి విరాజితుడు, జంగమసేవాపరతంత్రుడు, సంగన బసవేశ్వరుడు, బిజ్జలుని మంత్రిగా నుండి వీరశైవ మతోద్ధరణ మొనర్చిన కల్యాణ బసవేశ్వరుడుగాక మఱియొక్కడు కానవచ్చునా" అను సందియము గలుగకుండుట యాశ్చర్యము. కల్యాణపురమున నిప్పటికి శిథిలములయియున్న సన్నివేశములు, బసవడు నెలకొల్పిన శివానుభవ మంటపాదికములు, బసవని కల్యాణపుర సంబంధమునకు నాతని బిజ్జల మంత్రిత్వమునకు బ్రబలాదర్శము లయియున్నవి. బసవని నాటినుండియే యీ పశ్చిమచాళుక్య రాజధానికి బసవకల్యాణ మనువ్యవహారమేర్పడినవి. నేడది సామాన్య గ్రామముగానున్నను, దానియందలి భక్తిగౌరవముల చేతనే యీ సంవత్సరము జనవరి 29, 30 తేదులలో అఖిల భారత వీరశైవ మహాసభల నచ్చట నేర్పాటు చేయుట, శ్రీ మైసూరు మహారాజుగారు సభా ప్రారంభము గావించి శివానుభవ మంటపోద్ధరణమునకు శంకుస్థాపన మొనర్చుటయు జరగినవి.

శ్రీ వేంకటరమణయ్యగారు సంప్రదాయబద్ధములు, సాంకేతికములునగు తావుల సోమనాథుని వాక్యములను సరిగా గ్రహింపక వానికి నన్యార్థములు కల్పించి యాతని కృతులందలి యంతస్సాక్ష్యమునుబట్టి సహజముగ నేర్పడు నాతని కాలనిర్ణయమును విపరీతమొనర్చియు, చారిత్రక విషయనిరూపణ పౌర్వాపర్యములపట్ల ప్రమాణములు కాజాలని సోముని వర్ణనలకు ప్రత్యక్షర ప్రామాణ్యమొసంగియు దమ గ్రంథమున పెల్లుకల్లోలముల గావించియున్నారు. సావధానముగ వారి గ్రంథము చదువు సహృదయలోకమునకు సత్యమును గ్రహించి నిర్ణయించుటకీ నావిమర్శనమించుకేని యుపకరింపగలుగునెడల నా శ్రమ వ్యర్థము కాదని విశ్వసింతును.

సాహిత్య మీమాంస :

# సోమనాథుని రచనల పరిచయం

ఎమ్. ఎ. ఎల్.

పాల్కురికి సోమనాథుని ప్రతిభ సర్వతోముఖమైనది. సంస్కృతాంధ్రములందు కర్ణాట భాషయందు నసమాన పాండిత్యమును గడించి, యాయా భాషలందు కృతుల వెలయించిన సాహితీమూర్తి సోమనాథుడు. ఇంతేకాక తమిళ, మహారాష్ట్ర భాషలందు కృతులు రచింపకున్నను, పద్యముల నల్లగనంత పండితుడు. "నోరికొలందిని నిను ప్రస్తుతింతు నని" తమిళమున, మహారాష్ట్రమున, మణిప్రవాళమున నితడు బసవని స్తుతించుచు వృషాధిప శతకమున రచించిన పద్యములు, పండితారాధ్య చరిత్రయందలి పరుస సంభాషణ లీవిషయమునకు మహత్తర తార్కాణములై యున్నవి. వీరశైవ మతప్రచారమే యాతని ప్రధాన ధ్యేయమైనను, దానిని సాహిత్యముమూలమున సాధించినవాడు సోమనాథుడు. బసవని వచనములు నేటికిని ప్రచారములో నున్నవి. కాని అతడు సోమనాథునివలె సాహిత్యవేత్త గాడు. పండితుడుగాడు. మత ప్రచారకుడు మాత్రమే. సోమనాథుని యాశయ మేదైనను, యా కాలమునఁ ప్రచలితమైయున్న మార్గపద్ధతికి, సంస్కృత కావ్య సంప్రదాయములకు స్వస్తి చెప్పి, ప్రజల దైనందిన వ్యవహారమున వినఁబడు ఛందస్సంప్రదాయములను తీసికొని వాని కొక యుత్తమస్థానము నాపాదించి, విభిన్న దేశి కావ్యపద్ధతులకు శ్రీకారము చుట్టినవాడు సోమనాథుడు. ముఖ్యముగా తెలుగు సాహిత్యమున ద్విపద, శతక, ఉదాహరణ, గేయాది కృతుల కితఁడే ప్రవర్తకుడు.

## 1. అనుభవసారము

అనుభవసారము సోమనాథుని కృతులలో ప్రథమకృతిగా పరిగణింపఁబడుచున్నది. రెండువందల నలుబదిరెండు పద్యములుగల యీ లఘుకావ్యము గోడగి త్రిపురారి యను శివభక్తుని కంకితమైనది. ఇందు 'మనసిజహరు శుద్ధభక్తిమార్గము వేదోక్తనిరూఢిఁ బురాణ రహస్య నియుక్తి'ని వివరింపఁబడియున్నది. గురుమహత్త్వము, గురుస్థలము, శివపూజావసర సావధానము, లింగస్థలము, ఇష్టలింగార్పణ విధి, షట్స్థల వివరము అను విషయములు గలదై ఈ కృతి వీరశైవతత్త్వమును నిరూపించుచున్నది. ఇచ్చట బసవనను గూర్చిన ప్రసక్తియే లేదు. పండిత మల్లికార్జునుడు మూడు సీసపద్యములలో ప్రశంసింపబడియున్నాడు. సోమనాథుని కవితాగురువగు కరస్థలము విశ్వనాథుడు స్తుతింపబడియున్నాడు. ఈ గ్రంథరచనా కాలమునకు సోమనాథునకు బసవనను గూర్చి పూర్తిగా తెలిసియుండదనుట యసమంజసము గాదు. సోమనాథుని తదితరములగు కృతులన్నిటియందు 'బసవ' అను నామోచ్చారణముననే యొడలుమఱచునంతటి భక్తి పారవశ్యము గానుపించును.

ప్రాచీనాంధ్ర వాఙ్మయమున అనుభవసారమునకు మతదృష్టిని గాక సాహిత్యదృష్టిలో నొక ప్రత్యేకస్థాన మీయవలసియున్నది. ద్విపద రచనముననే సోమన సిద్ధహస్తుడని చాలమంది సాహితీవేత్తల యభిప్రాయము. ఈ కావ్య మాతని వృత్తరచనా కుశలతను చెప్పక చెప్పుచున్నది. తర్వాతి ప్రసిద్ధాంధ్రకవులగు తిక్కన, శ్రీనాథాదులకు గూడ నేతద్విషయమున నితడు పథప్రదర్శకుడైన ట్లీ రచన చాటుచున్నది. ఇందు త్రిభంగి, క్రౌంచపదము, వనమయూరము, మాలిని, మానిని, తరువోజ వృత్తములున్నవి. ఇందు గల త్రిభంగి వృత్తమే లాక్షణికులకు లక్ష్యమై యున్నది. సర్వతఃప్రాససీసము, చతుర్విధ కందము ప్రయుక్తములు. పద్యములు ప్రాచీన లక్షణ లక్షితములై జాతీయములతో నలరారుచున్నవి. తెనుగుదనపు నిమిడిక కిందలి పద్యములు మచ్చుదునకలు.

కం. ఉరువిడికిఁ దెలివి, భక్తికిఁ
బరిచర్య, కృతార్థమతికి భయమును, వ్రతత
త్పరతకుఁ జలమును, దగు స
చ్చరితకు నిస్పృహయు నొప్పు సద్భక్తినిధీ
ఒడలిది నాయదియన్నఁ
జెడు నొడలది లేక భక్తి సేయఁగ రాద

య్యొడలు గొనియుండియును దా
నొడలిగుణంబులను బొగయకుండఁగ గలదే.

సోమనాథుని కవిత యీ కావ్యమున పరమత నింద లేక, కేవల భక్తి పారావారమున నోలలాడించునదై యున్నది. పూర్ణార్ధబిందుప్రాసలు, విలక్షణ సమాసము లిందు లేవు.

గ్రంథము మొట్టమొదట శ్రీ గంగ పట్టణము సుబ్రహ్మణ్యదేవరగారిచే 1916 లో నిప్పటికి నలుబదియేండ్ల క్రిందటనే ముద్రితమైనది. ఈ ముద్రణములో లోపించిన పద్యములను, పద్యపాదములను చేర్చి మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందలి వ్రాతప్రతులను[1] బట్టి సంస్కరించి పూజ్యులు వావిళ్ళవారీనడుమనే ప్రకటించియున్నారు.

## 2 బసవపురాణము

బసవపురాణము సోమనాథుని కృతులలో రెండవది. ఆంధ్ర వాఙ్మయమందలి తొలి ద్విపదకావ్యము.[2] కన్నడదేశమున పండ్రెండవ శతాబ్దమున నవతరించి కాలచుర్య వంశీయుఁడగు బిజ్జలునికి దండనాయకుఁడై కళ్యాణ కటకమున నెన్నో వీరభక్తిమహిమలను జూపిన వీరశైవ మతోద్ధారకుఁడగు బసవని చరితమేయీ కావ్యకథా వస్తువు. పరంపరాయాతముగా సంస్కృతకవులేమి, ఆంధ్రకవులేమి పురాణ ప్రసిద్ధులగు వ్యక్తులఁ దమ కావ్యనాయకులుగా గ్రహించుచుండిరి. సోమనాథుఁడా పరిపాటికి వ్యతిరేకముగా తనకు ముందు ప్రసిద్ధుఁడైన వీరశైవ మతప్రవర్తకుని నాయకునిగా గైకొని తొలి ద్విపదకావ్యమును రచించినాఁడు. ఇంతేకాక ఆంధ్ర వాఙ్మయమునందలి తొలి కావ్యము వ్యాసభారతమున కనువాదము. సోమనాథుఁడు కావ్యవస్తువునందేమి, ఛందస్సునందేమి, యొక నూతనమార్గమును ద్రొక్కి తన స్వతంత్రతను చాటుకొన్నాఁడు. సంస్కృతపద బహుళమగు పండితభాషను వదలి సర్వసామాన్యమగు జాను దెనుగును గైకొని రచన సాగించినాఁడు. వేదార్థములను వాడుకభాష వ్యక్తము చేయగలదని నిరూపించినాఁడు.

“ఉరుతర గద్య పద్యోక్తుల కంటె
సరసమై పరగిన జాను దెనుంగు
చర్చింపఁగా సర్వ సామాన్యమగుట
గూర్చెద ద్విపదలు గోర్కెదైవాఱఁ
దెలుగుమాట లనంగ వలదు వేదముల
కొలదియా జూడుడీ యిల నెట్టు లనిన”

బసవని కథను ప్రధానముగా గైకొని పురాతనులగు, శివభక్తుల యొక్కయు, బసవని సమకాలీనులగు స్థానిక శివభక్తుల యొక్కయు చరిత్రలను మూలసూత్రము తుంటువడకుండునట్లుగా రచనగావించినాఁడు. బసవపురాణమునందేడాశ్వాసములున్నవి. ప్రథమాశ్వాసమున కైలాసవర్ణనతో కథ ప్రారంభమగును. నారదుఁడు కైలాసమున కరిగి భూలోకమున శివమతము సన్నగిల్లుచుండుటను గూర్చి తెలుపగా శివుఁడు నందికేశ్వరుని భూలోకమున శివరూపునిగాజన్మించి శైవమతోద్ధరణమొనర్పుమని యాదేశించును. తనకును తన భక్తులకు భేదము లేదని శివుఁడు పార్వతితో నందికేశుని వృత్తాంతమును తెలుపును. ఆ సందర్భమున శిలాదుని తపస్సు, నందికేశ్వరావతారము తెలుపబడినవి. కర్ణాటదేశమున గల ‘హింగుళేశ్వర భాగవాటి, యను నగ్రహారమున మాదిరాజు మాదాంబ యను దంపతులకు పుత్రులు లేకుండుట, మాదాంబ నందికేశ్వరుని నోము నోచుట, బసవన జన్మము, ఉపనయన మనవసరమని యతఁడు తండ్రితో వాదించుట, మేనమామయగు బలదేవ దండనాయకుఁడు తన కుమార్తె గంగాంబనిచ్చి బసవేశ్వరుని వివాహము గావించుట, కప్పడి సంగమ క్షేత్రమునకు బసవన యరుగగా సంగయదేవుఁడాతనికి ప్రత్యక్షమై కొన్ని ధర్మముల నుపదేశించుట యను విషయములతో బ్రథమాశ్వాసము ముగియును. ద్వితీయాశ్వాసమున బలదేవ

1. D 2044—49
2. బసవ పురాణము. బ్రౌను దొరవారి ప్రతులు D 964—965, 968, 969, 970. D 970 లో దీని కాంగ్ల వివరణము కలదు.
ముద్రిత ప్రతులు—1. కందుకూరి ప్రసాదరావు గారు ఏలూరు. 1897.
2. ఆంధ్ర గ్రంథమాల చేటూరి ప్రభాకరశాస్త్రి 1926.
3. ,, ,, నిడదవోలు వేంకటరావు 1952.

దండనాయకుని మరణము కారణముగా బసవేశ్వరునికి బిజ్జలుడు దండనాయక పదవి నొసగును. బసవన శివాచార నిరతి, అతని మేనల్లుడగు చెన్నబసవని మహిమ, అల్లమప్రభుని రాక అతడు బసవనికి వరము లొసగుట, బసవని మహిమచే వంగకాయలు లింగములైన కథ కలవు. సమ్మకమే ప్రధానమని నిరూపించుట కీ సందర్భమున బల్లేశుమల్ల కథ కాట కోటయ్యకథ చెప్పబడినవి. బసవడు జొన్నలనుముత్యములనుచేయుట, సంగమేశ్వరుడు బసవని కన్నడుగుట, శివుడు తన హృదయమున బసవని జూపుట, అనునవి ద్వితీయాశ్వాసమున గలవు. తృతీయాశ్వాసము బసవన తనభార్య చీర విప్పించి జంగముల కర్పించుకథ కలదు. ఆయా సందర్భముల కనుగుణములగు పురాతన శైవభక్తుల చరిత్రలును నుదాహరణలుగా వక్కాణింపబడియున్నవి. తృతీయాశ్వాసమున ముగ్ధభక్తుల కథలు వర్ణితములైనవి. ముగ్ధసంగయ్య, రుద్రపశుపతి, బెజ్జమహాదేవి, గొడగూచి, దీపదకళియారు, నాట్యనమిత్తండి, కన్నప్పనయనారు, కళియంబనాయనారుల ముగ్ధభక్తులు. శివుని యెడ వారికి గలభక్తి వర్ణనాతీతము. శివుడు విషము తినెను గదా యని, దుఃఖించి ఆతని విషము కక్కుమని వేడిన రుద్రపశుపతి ముగ్ధభక్తుడుగాడా! శివునిచే పాలుత్రావించి అతనిలో లయమైన గొడగూచి బాల భక్తికి పరాకాష్ఠగా మనకు గోచరించును. తృతీయాశ్వాసాంతమున సకలేశు మాదిరాజయ్య కథ కలదు. చతుర్థాశ్వాసమున మడివాలు మాచయ్యయను రజకభక్తుని చరిత్రముగలదు. ఆసందర్భమున బసవన బిజ్జలునకు ఇరువదాండారి, బావూరిబ్రహ్మయ్య లనుశివభక్తుల యుదంతమును తెలియచేయును. మాచయ్య బసవుని గీతములో నహంభావ మెక్కుడుగా నున్నదని కోపించును. బసవన్న మాచయ్య కడకరిగి క్షమింపవేడును. అప్పుడు గర్వోక్తిభక్తి తగదని శంకరదాసికథ, జగదేకమల్లునికథ, నిమ్మవ్వకథ, సిరియాలునికథ, నరసింగనాయనారు కథ, కొట్టరువుచోడునికథ, హలాయుధుని కథ, మిండనైనారుకథ, ఒడయనంబికథ చెప్పబడినవి. ఒడయనంబికి వాల్మీకేశుడు శివభక్తుల మహిమను చెప్పుచు బాణుడు, పిట్టవ్వ, కలికామదేవుడు, ఏణుమూర్తినైనారు, కడమల నంబి, గుగ్గులుక్కలియారు, తిరునీలకంఠుడు మొదలుగా గలవారి యుదంతములను చెప్పును. ఇట్లు మూలకథా వృక్షమునకు శాఖోపశాఖలుగా నీశివభక్త చరిత్రలు వెలయుచున్నవి. పంచమాశ్వాసమున కిన్నరబ్రహ్మయ్య బసవని కడకేగుట, బ్రహ్మయ్య శివుని పలుకరించుట, కలకేతబ్రహ్మయ్య, మోళిగమారయ్య, కన్నడబ్రహ్మయ్య, ముసిడిచౌడయ్య, సురియచౌడయ్య, తెలుగుజొమ్మయ్య మొదలగు వీరభక్తుల చరితలు కలవు. షష్ఠాశ్వాసమున ఏకాంతరామయ్య కథ, తిరునావుక్కరసు పిళ్ళనైనారు, నమినందిమున్నగు కొందఱు నయనారుల కథలును కలవు. సప్తమాశ్వాసమునను మఱికొందఱు భక్తులకథలు వర్ణితములైనవి. కల్యాణపురమునగల భక్తులు వర్ణింపబడిరి. బసవన విష మారగించ జీర్ణించుకొన్న యుదంతము, జగదేవదండ నాయకునికథ, అల్లయ్య మధుపయ్యలు బిజ్జలుని యంత మొందించుట, బసవన లింగైక్యము జెందుటయను విషయములో ముగియుచున్నది.

బసవపురాణము వీరశైవ వాఙ్మయమునకు శిరోభూషణము. తొలిద్వికావ్యపదమగుటచేనిది తెలుగు సారస్వతమున నొక ప్రత్యేక విశిష్టస్థానము నాక్రమించుచున్నది. అరువది మువ్వురు నయనారుల చరితములను తెలుగు సారస్వతమున ప్రవేశపెట్టినది తొలుత సోమనాథుడే. తమిళమున సెక్కిలారుఅనుకవి పెరియపురాణమున నీ భక్తులచరిత్రలను క్రమముగా చెప్పియున్నాడు. సోమనాథుడు పెరియపురాణమును చూచెనని చెప్పలేము. పైగా కన్నడదేశమున గల సంప్రదాయసిద్ధములైన యైతిహ్యములే బసవని పురాణమున మనకు గోచరించును. తన కథావస్తువున కనుగుణముగా శివభక్తుల చరితలను గ్రహించినాడేగాని సోమనాథుడొక కాలక్రమమును పాటించలేదు.

బసవపురాణమున ప్రతియాశ్వాసాంతమున కవితాగురువు కరస్థలి విశ్వనాథుని ప్రశంస కలదు. సోమన చతుర్వేద పారగత్వముగాని, సర్వజ్ఞత్వముగాని యిందుగోచరింపవు. కాని బసవన చరిత్రను మొదట గ్రంథస్థముచేసినవాడగుటచే నీతని కీర్తికీ కావ్యము ప్రథమ సోపానమైనది. ఇతరభాషలలోని కనూదితమగు

భాగ్యము మొట్టమొదట యీ కావ్యమునకే దక్కినది. క్రీ. శ. 1369 లోనే భీమకవి దీనికి కన్నడించినాఁడు. తర్వాత సంస్కృతీకరణము జరిగినది. [1]ఇది తమిళములోనికి కూడ పరివర్తిత మైనది. భాషోద్ధారకులు బ్రౌనుదొరగారు బసవ పురాణముపై సఖండ పరిశ్రమచేసి సంగ్రహ రూపముగా ఆంగ్లభాషయందు వచనముగా నీకావ్య విషయమును రచించియున్నారు. పిడుపర్తి సోమనాథుఁడు దీనిని పద్యకావ్యముగా ననువదించి యున్నాడు.

## 3. వృషాధిప శతకము

ఇది 'బసవా, బసవా వృషాధిపా!' యను మకుటముతో నూటయెనిదిమి చంపకోత్పలములతో రచితమైనది. మల్లికార్జున పండితుని శివతత్త్వసారమున శతకమునకుండు సంఖ్యానియమములేదు. శతకంబు శివతత్త్వ సారమాదిగా' యని సోమనాథుఁడు పేర్కొని యున్నను నందు నాలుగువందల పద్యములున్నవి. పైగా మకుటముగూడ నేకైకముగాదు. వృషాధిపశతకమున బసవన జీవితమునకు సంబంధించిన ఘటన లీపద్యములందు వర్ణితములైనవి. సోమనాథునకు గల బహుముఖ పాండిత్యమును తెలియజేయుటకు సంస్కృతమున, అరవమున, కన్నడమున మహారాష్ట్రిమున, మణిప్రవాళమున, జానుతెనుగున పద్యములుగలవు. కొన్నిపద్యములలో శబ్దాలంకారములు బహుళముగాగలవు. ఆంధ్ర వాఙ్మయమున తర్వాతికాలమున విపులముగా విస్తృతిజెందిన శతక సాహితీశాఖ కీశతకము మార్గదర్శకమని చెప్పనగును. సోమనాథుని భక్తిరసావేశమీ శతకమున సువ్యక్తమైయున్నది. గ్రంథాంతమున చివరను మకుటరహితముగా

'అకుటిల లీల జంగమున
మగ్రదయాకలిత ప్రసాది పా
లకురికి సోమనాథుఁ డతి
లౌల్యమునన్ బసవన్నదండనా
యకునకు నొప్ప నీశతక
మర్పణచేసె ధరన్ బఠించు వా
రికి వినువారికిన్ గలుగు శ్రీయువు
నాయువు భుక్తియు ముక్తియున్.'

అను పద్యము ఫలశ్రుతి ప్రదర్శకముగా, కర్తృత్వ సూచకముగా నున్నది. బసవపురాణమిందు పేర్కొనఁబడినది.

## 4. మల్లమదేవి పురాణము

బసవపురాణానంతరము సోమనాథుఁడు మల్లమదేవీపురాణ మను ద్విపదకావ్యమును రచించెనని విమర్శకులందురు. ఈ పురాణము లభ్యముకాలేదు. శ్రీశైలప్రాంతమున నివసించుచుండిన మహాభక్తురా లీమె. దీనినిగూర్చి శ్రీబండారు తమ్మయ్యగారు [2]'సోమనాథకవి చరిత్రమున' వ్రాసియున్నారు.

## 5. చతుర్వేదసారము

'బసవ లింగ'యను మకుటముతో సీసపద్యములలో రచితమైనది. ముద్రిత గ్రంథమునందు మూడువందల పద్యములు మాత్రమే గలవు. కాని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున గల వ్రాత ప్రతులను బట్టి చూడ సుమారొక వంద పద్యము లెక్కువగా గానుపించుచున్నవి. చతుర్వేదముల సారమును శైవమత పరముగా సమన్వయించి నాల్గు వందలు పద్యములను సోమన ఈ కృతి యందు రచించి యున్నాఁడు. బసవశబ్దవిచారము, బసవ నామోచ్చారణ మహిమ, శివాధిక్యము, విభూతి రుద్రాక్ష లింగధారణ మాహాత్మ్యము, అశుచినిరసనము, చరలింగస్తుతి, శీల లక్షణము, శివానుభవ సూత్రవివరము మున్నగు విషయము లనేకములు శ్రుతి స్మృత్యాది ప్రమాణములతో నిరూపితములైనవి. నన్నయ భారత పద్యములందలి పోకడల నిక్కడగాన నగును. ఉదాహరణకు; 'ధర్మశాస్త్రజ్ఞులు ధర్మశాస్త్రంబని అధ్యాత్మవిదులు వేదాంత మనియు' అను పద్యముతో

'వైదికు లిది శుద్ధవైదికంబని యెన్న
శాస్త్రజ్ఞు లిది ధర్మశాస్త్ర మనఁగ
దార్కికు లిది మహాతర్కంబనంగఁ బౌ
రాణికు లిదియె పురాణ మనఁగ
నాగమ విదులు దివ్యాగమం బిది యనఁ
దంత్రజ్ఞు లిది వీరతంత్ర మనఁగ
భక్తవారం బిది భక్తి మార్గంబన

1. పరిశోధన వ్యాసము : సంచిక-7.
2. సోమనాథకవి చరిత్ర—పుట 162.

ముక్త్యర్థులిది మహాముక్తిద మనఁ
గవులు భువిని నిదియె కావ్యంబనంగ స
జ్జనుల కెల్ల మిగుల సంతసముగ
నిర్వికల్పరతి జతుర్వేదసారమన్
పద్యముల్ రచింతు బసవ లింగ.

సోమనాథుని వేదవేదాంగ పారగత్వము, పురాణేతిహాసములం దాతనికి గలయసమాన పాండిత్యము నీ కృతిని వెల్లడి యగుచున్నవి. "వరవీరభక్తి సవైదికంబుగను, విరచించితిని చతుర్వేద సారమున" అని పండితారాధ్య చరిత్రావతారికలో జెప్పి యుండుటచే, దీనిని పండితారాధ్య చరిత్రకుముందే సోమనాథుఁడు రచించెనని తెలియుచున్నది. చతుర్వేద సారమున గల సీసపద్యములు చాలవరకు ఆటవెలదులతో కూడి యున్నవి. చతుర్వేదసారపు ప్రస్తుత ముద్రిత ప్రతి సమగ్రము కాదు. వ్రాత ప్రతులలో వందకుదగ్గరగా నిందు లేనిపద్యములు కనుపించుచున్నవి. పాఠభేదములు యనేకములు గోచరించుచున్నవి. వీటి నన్నిటిని పరిశోధించి సమగ్రముగా చతుర్వేదసారమును ప్రకటించు భార మాంధ్రమహాజనులపై నున్నది.

## 6. చెన్నమల్లు సీసములు

ఇది ముప్పదిరెండు సీస పద్యములు గల కృతి. దీనిని సోమనాథుఁడు నిర్యాణ కాలమునఁ జెప్పెనని కొందఱందురు.[1] కాని యీ విషయమునకు ప్రబల నిదర్శనము లేవియు గానరావు. ఇందు వీర శైవమత విహితములగు భక్త, మాహేశ్వర, ప్రసాది, ప్రాణలింగి, శరణ, ఐక్యములను షట్స్థలములు వివరింప బడినవి. ఈ పద్యములకు 'చెన్నమల్లు' అను మకుట మున్నది. తుదిని కర్తృత్వమును, ఫలశ్రుతుని జెప్పు రెండు కంద పద్యములున్నవి.

క. చెన మల్లేశ్వరు పేరిట
సునిశితముగఁ బాలకురికి సోమేశుఁడు దా
ఘన భక్తి వెలయఁ జెప్పెను
చెనమలు సీసంబు లనఁగ జెలఁగ ధరిత్రిన్.

క. ఈ సీసము లే వేళను
భాసురముగఁ బఠనసేయు భక్తుల కిలలో
వాసిగ భుక్తియు ముక్తియు
నా సర్వేశ్వరుఁ డొసంగు ననవరతంబున్.

## 7. పండితారాధ్య చరిత్ర

పండితారాధ్య చరిత్ర పాల్కురికి సోమనాథుని కడపటి కృతిగా విమర్శకులు భావించుచున్నారు. ఇది సోమనాథుని ద్విపదకృతులలో ద్వితీయము; ఆంధ్ర వాఙ్మయమందలి ద్విపద కృతులలో నద్వితీయము. ఇది ఆంధ్రదేశమున వీరశైవ మతవ్యాప్తికై కంకణము గట్టుకొనిన మల్లికార్జున పండితారాధ్యుల జీవితచరిత్ర. బసవపురాణమున బసవని జననము బాల్యము వర్ణించిన ట్లిందు పండితుని జన్మము బాల్యము వర్ణితములు కాలేదు. దీక్షా, పురాతన, వాద, మహిమ, పర్వతములను పంచ ప్రకరణములలో పండితుని గాథవర్ణితము. దీక్షా ప్రకరణమున పండితారాధ్యుల లింగధారణ దీక్షయు, లింగార్చనయు, నూరసానమ్మ మొదలగు భక్తుల కథలును, బసవన వృత్తాంతమును గలవు. ఇందు రెండువేల ద్విపద లున్నవి. పురాతన ప్రకరణమున వెల్లగొండ మహాదేవయ్యకు పండితుఁడు తన మహిమచే పాదములు మొలిపింపజేసిన కథను పురస్కరించుకొని, యదే విధముగా శివభక్తి మహిమలను చేసిచూపిన పురాతన భక్తుల కథలు వర్ణితములైనవి. ఇందు రెండువేల యేడునూట యిరువది ద్విపదలు కలవు. వాదప్రకరణమున వేదవాద, కర్మవాద, కాలవాద, వేదాంత, సాంఖ్య, చార్వాక, పాంచరాత్రిక, జైన బౌద్ధవాదములు ఖండింపబడినవి. షట్త్రింశత్తత్త్వనిర్ణయంబును, శివోత్కర్షయు శ్రుతిస్మృతి పురాణేతిహాస ప్రామాణ్యములతో ప్రతిపాదింపబడినవి. ఇందు రెండు వేల యిరువది ద్విపదలు కలవు. మహిమ ప్రకరణమున, వెలనాటిచోడని శాప వృత్తాంతమును, పండితుఁడు సహస్రగణమాలికను చెప్పి శివేతరులను చూచిన, శివనిందను వినిన దోషము పోగొట్టుకొనుటకును, శివమహిమ ప్రకటించుటకును, తన నేత్రద్వయమిచ్చి వానినేగాక నూర్ధ్వనేత్రములను బొందుటయు, పండితుఁడు బసవన చూచుటకు బయలుదేరుటయు, మార్గమధ్యమున బసవన లింగైక్యము జెందె నను వార్త చెవిని సోకుటయు, పండితుఁ డాతని గూర్చి ప్రలాపించుటయు, శ్రీ పర్వతప్రయాణము సంకల్పించుటయు నను విషయములు కలవు. ఇందు రెండువేల నూటయిరువది ద్విపద

1. భక్తిరసశతక సంపుటము, వావిళ్ల వారి ప్రచురణ.

లున్నవి. పర్వతప్రకరణమున శిష్యుఁడైన దోనయ్యకు పండితుఁడు శ్రీశైల మాహాత్మ్యమును చెప్పి, ఆనట శివరాత్రివ్రతమును చెల్లించి గమ్మనుటయు, దోనమయ్యయు నదే ప్రకారము చేయుటయు ఆ సందర్భమున శ్రీ పర్వత క్షేత్ర, తీర్థ స్థలమాహాత్మ్యములు, శివరాత్రి యుత్సవము, పర్వతమున కరుగు పరిషత్కోటి వర్ణనయు, నానా దేశీయసంఖ్యా కథనములును, దేశభాషాస్తుతులు, సంగీతశాస్త్ర ప్రసంగమును మఱియు ననేకములగు మానవజీవిత సంబంధములగు విషయములు ప్రసక్తములై యున్నవి. ఈ ప్రకరణము మూడువేల యేబది ద్విపదలుగలిగి విషయ విస్తరమునసే కాక కవితా ప్రకర్ష యందును తదితరములకన్న మిన్నయై యున్నది. ద్విపద వాఙ్మయమున కెల్ల మకుటాయమానమగు నీ గ్రంథ మొక్కటియే సోమనాథుని కవితాప్రతిభను నిలువబెట్ట దగినది. శ్రీనాథమహాకవి దీనినే పద్యరూపమున సంతరించినట్లు చెప్పుదురు. నాగులవాటి శేషనారాధ్యుని శ్రీ పర్వతపురాణమున నిందలి పర్వత ప్రకరణమందలి ద్విపదలకు పద్యానువాదములు గలవు. సంగ్రహ విజ్ఞాన సర్వస్వమని చెప్ప దగిన ఈ గ్రంథమునకు విపులవ్యాఖ్య యొంతేని యవసరమగుచున్నది. ఆంధ్ర గ్రంథమాలవారి ప్రతి కొంతవరకు చదువరులకు సహాయకారి యగుచున్నను, నదియును నేఁడలభ్య మగుచున్నందున నూత్నముద్రణ మొకటి యత్యావశ్యక మగుచున్నది.[1]

## సోమనాథుని గేయకృతులు

భక్తిమార్గమునకు గేయములు ప్రధాన ప్రచార సాధనములు. సోమనాథుఁడు దీనిని గుర్తించియే గేయరూపములగు కృతులను వెలయించినాఁడు. అవి 'రగడ' రూపమున నున్నవి. ఈ కృతులు కొన్ని సంస్కృతభాషలో రచితములైనను యవి యతిప్రాసాది తెనుగు లక్షణ లక్షితములై యున్నవి. వీనికి గద్యలని పేరు. ఇవి లయ తాళ బద్ధములై మాత్రా ఛందస్సులో నున్నవి. అన్నియు బసవస్తుతి పూర్వకములే.

1. అక్షరాంక గద్య :— అకారము మొదలు క్షకారమువఱకు వర్ణసమామ్నాయమునఁ గల యేబది యక్షరములతోను వరుసగ నీ గద్యపాద ప్రథమాక్షరములు గూర్పఁబడుటచేత దీనికీ నామ మొసగబడినది. సోమనాథుఁడు దీనిని అక్షరాంక మాలిక, అక్షరాంక గద్యములనను రెండు భాగములుగ విభజించి మొత్తమునకు అక్షరాంకగద్య యను నామము కల్పించినట్లు తెలియును. ఇవి శ్రీముఖ భావ సంవత్సరాది సంచికలలో శ్రీ బండారు తమ్మయ్యగారు ప్రకటించియున్నారు.

2. నమస్కార గద్య :-నమోవాకములతో నంతమందుచు ప్రతిపాదము సంస్కృత చతుర్థీ విభక్తి ప్రత్యయములతో గూర్పబడి, కేవల సంస్కృతకృతివలె గానబడు గద్యకృతి. ద్విపదలయందు రగడలయందు వలె నిందు ప్రాసయు ననుప్రాసయు పాటింపఁబడినవి. ఇదియు శ్రీ తమ్మయ్యగారిచే ఆంగీరస యుగాది సంచికలో ప్రకటితము.

3. పంచప్రకార గద్య :—ఇది యైదు విధములగు నడకలతో రచితమైనది. ఇం దైదు రగడ భేదములు గలవు. రెండవ రగడయందు ముక్తపద గ్రస్తాలంకారము కలదు. మూడు నాలుగు ఐదు రగడలయందు జయాజయ శబ్దము లాది యందుండి యేపాదమున కాపాదము విడివడి, అంత్యానుప్రాస గలిగియుండును. ఇది ప్రజోత్పత్తి యుగాదిసంచికలో శ్రీ తమ్మయ్యగారిచే ప్రకటితమైనది.

4. శరణుబసవగద్య :— దీని కాద్యంతమున కన్నడపద్యము లున్నవికాని యిందు తురగవల్గన రగడ కలదు. 'శరణు బసవ' యను మకుటమును, యతి నియమమును గలవు. యువ సంవత్సరాది సంచికయందు ప్రచురితమైనది.

---

1. పండితారాధ్య చరిత్ర ముద్రణములు :
(1) శైవ ధర్మవర్ధనీ గ్రంథమాల. ఒరంగల్లు 1912.
(2) విజయ రామచంద్ర ముద్రాక్షరశాల, విశాఖపట్టణము. పరిష్కర్తలు : పసపుల నాగయయోగి, నిడదవోలు సుందరం పంతులు 1914.
(3) ఆంధ్ర గ్రంథమాల, మదరాసు 1939. పరిష్కర్త : డాక్టరు చిలుకూరి నారాయణరావు.

5. అష్టోత్తర శతనామ గద్య :—ఇది నమో వాకములతో నంతమగుచు నూటయెనిమిది పాదములుగల రచన. ఒక్కొకచో యతులును మఱొకచో ప్రాసలును పాటింపబడియున్నవి.

6. పంచరత్నములు :-ఇవి యైదు పద్యములు. మాలినీవృత్తములు. బసవనస్తుతి పూర్వకమైనవి.

7. బసవాష్టకము :—ఇవియును యెనిమిది మాలినీ వృత్తములు. దీనిలో యతిమాత్రమే పాటింపబడినది. ఇది పరిశోధన ప్రథమ సంచికలో ప్రకటితమైనది.

8. గంగోత్పత్తి రగడ :—ఈ రగడలో పాల్కురికి సోమనాథుడు తన సంగీతశాస్త్ర నైపుణ్యమును చూపి రచించెనని పిడుపర్తి సోమనాథుడు చెప్పియున్నాడు. ఇది లభ్యముకాలేదు.

9-10. సద్గురు రగడ, చెన్నబసవ రగడ :- ఈ రెండును కన్నడభాషలో రచితములైనవి. భాష కన్నడమైనను, ఛందోరీతి తెనుగు. యతి ప్రాస నియమ మిందు పాటింపబడలేదు. ఇవి కన్నడమునగూడ నముద్రితము. కర్ణాటకవి చరిత్రమున సోమనాథునిచరిత్రలో నివి యుదాహృతములైనవి.(ప్రథమభాగము పుటలు 295).

11. సోమనాథ స్తవము[1] :—ఇది పాల్కురికి సోమనాథుని లఘుకృతులలో మొదటిది. ద్విపద ఛందస్సులో నున్నది. పలువురు శివభక్తుల చరిత్రము లిందు పుస్తకములైయున్నవి. పాల్కురిలో నుండు సోమేశ్వర స్వామి కిది కృతి. ఇందులోని కొన్నిపంక్తులు పండితారాధ్య చరిత్రలో నుదాహృతములైనవియే.

12. బసవోదాహరణము:-ఉదాహరణవాఙ్మయశాఖాప్రవర్తకుడు సోమనాథుడే. తెనుగునను సంస్కృతమునను గల ఉదాహరణ లక్షణములకు తొలిలక్ష్యము లీతనికృతులే. ఈ రెండిటియందు తెనుగురచనను గీరిశేషులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.[2] సంస్కృతోదాహరణమును శ్రీయుతులు బండారు తమయ్యా నిడదవోలు వేంకటరావుగార్లు.[3] ప్రకటించిరి.

## సంస్కృత కృతులు

సోమనాథుడు తెనుగునందేగాక సంస్కృతమునకూడ రెండుద్గ్రంథములను వెలయించినాడు.

1. రుద్రభాష్యము:— పిడుపర్తి సోమనాథుడు పేర్కొని సోమనాథుని గ్రంథములలో రుద్ర భాష్యమున్నది. కాని ఈనాడిది లభ్యమగుటలేదు. దీనిని సోమనాథుడు చతుర్వేదసార రచనానంతరము రచించియుండును. పేరినిబట్టి యిది యజుర్వేద మందలి శతరుద్రీయ మనురుద్రాధ్యాయమునకు భాష్యమైయుండునని తోచుచున్నది.

2. సోమనాథభాష్యము:-[4] సంస్కృతమున శైవమతోత్కర్షను నిరూపించు నిర్వదియైదు ప్రకరణముల మహాగ్రంథము. శ్రుతిస్మృతిపురాణాగమాదులనుండి పెక్కు శ్లోకములిం దుదాహృతము. మఱియు హరదత్తాచార్యుల చతుర్వేద తాత్పర్య సంగ్రహమునుండి చాలశ్లోకములు గ్రహింపబడినవి. దీనికి 'వీరమాహేశ్వర సారోద్ధార'మని నామాంతరము కలదు.[5] మనోహరుడను శైవాగమవేత్త దీని కాంధ్రభాషలో వివరణ వ్రాసియున్నాడు. పదియవ ప్రకరణము వరకే టీకలభ్యమగుచున్నది. దీని టీకారచన ప్రాచీన టీకల శైలివలె సరళమైన వాడుక భాషలో గలదు. ఇందు (1) వృషభేంద్ర మాహాత్మ్యము (2) విభూతిమాహాత్మ్యము (3) రుద్రాక్షమహాత్మ్యము. (4) శివలింగధారణ మాహాత్మ్యము. (5) లింగార్చనవిధి (6) లింగార్చన మాహాత్మ్యము. (7) పాదోదక మహాత్మ్యము (8) ప్రసాదస్థలమాహాత్మ్యము (9)వీరశైవ మాహాత్మ్యము (10) వీరమాహేశ్వర మాహాత్మ్యము (11) ఇతరదేవతా పరిత్యాగ మాహాత్మ్యము. (12) నమస్కారాధపతిత్వము (14) దక్షాధ్వర నిరసనము (14) సూర్యావలోకన నిషేధము (15) నారాయణోపాస

(తరువాయి మూడవ అట్టలో)

1. ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము. D 2272 తాళప్రతి.
2. భారతి ఫిబ్రవరి 1928.
3. ఉదాహరణ వాఙ్మయ చరిత్రము.
4. సోమనాథ భాష్యము శ్రీ గంగపట్టణ సుబ్రహ్మణ్యదేవరచే బందరు భైరవ ముద్రాక్షరశాలయందు 1914 లో ముద్రితమైనది.
5. ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము D. 2649.

# తిక్కనాదులపై పాల్కురికి ప్రభావం

## శ్రీ వేటూరి ఆనందమూర్తిగారు

ప్రాచీన భారతీయసాహిత్యము మతము నంటిపట్టుకొనియే ప్రబలినది. మన భారతీయ సాహిత్యము మాత్రమే కాదు; ప్రపంచ సారస్వతమంతయు నట్లు వర్ధిల్లినదే. అన్నిటికిని మతమే వెన్నుపూస వంటిది. పాశ్చాత్యుల విశ్వాసము కూడ నిదియే. కాగా మన దేశమున జరిగిన సంస్కృత సారస్వత వికాసము వలెనే మన మన దేశిభాషా సారస్వతముల వికాసము కూడ జరిగినది.

ఆంధ్ర విషయమున దేశిభాషయైన తెలుగు జన్మవికాసము కూడ మతము ననుసరించియే సాగినది. ఆ దృష్టితో పరిశీలించినపుడవి రెండును పరస్పర మవినాభావసంబంధము గలిగినవని తెలియనగును. చాళుక్యరాజులు పుట్టించి పోషించిన దేశిభాషలో తొలి కావ్యము భారతము. ఆ నాడా మహాభారత రచన కవసరమిచ్చిన కారణములలో మతమొక యంశమని విమర్శకుల యభిప్రాయము. అది యథార్థమే. జైనబౌద్ధముల వికాసము నరికట్టి దేశమున తిరిగి వైదిక మతము నుద్ధరించుటకు నాడు యత్నము జరిగినది. నన్నయగారి మహాభారత రచన దానికి కొంత దోహదము చేసినది; దేశిభాష కభ్యుదయము చేకూర్చినది. ఇది పదునొకండవ శతాబ్ది సంగతి.

కాని పండ్రెండవ శతాబ్ది ప్రారంభమునకే కర్ణాటకదేశమున బసవన మతము విజృంభముకా జొచ్చెను. దక్షిణ దేశమున రామానుజ మత ముత్సాహమును రేకెత్తించెను. తెలుగు దేశ మా దేశములకు నడిమి దగుటచే ద్రవిడ కర్ణాటకముల ప్రభావ మచ్చుట తప్పని సరియైనది. ముందు ముఖ్యముగ మత ప్రభావము తరువాత దాని ననుసరించి దాని నాలంబముగ గొన్నవాని ప్రభావము. కాని వైష్ణవముకన్న బసవనమతమే ముందుగా తెల్గువారి నాకర్షించినది. దానికి కారణము తెల్గు దేశమున నంతకు పూర్వమే ప్రముఖులైన శైవమతానుయాయులు వెలసి యుండినారు. పండితత్రయమున నొక్కడగు పండితుడును, కవిరాజ శిఖామణియైన నన్నిచోడుడును అంతకు పూర్వమే సాహిత్యయూలమున తన్మత వ్యాప్తికి గొంత సేవ చేసినారు. పునాది వేసినారు. పండ్రెండవ శతాబ్ది నాటికి శైవము నంతకన్న విశృంఖలమైన, సర్వజనీనమైన మరియొక శాఖ వెలసినది. బసవన జన్మముతో వీరశైవము దేశమున బహుళ ప్రచారమునకు వచ్చినది. నా డాంధ్రమును బరిపాలించిన చక్రవర్తులును శైవ మతాభిమానము గలవారే! వాతావరణమెల్ల నిట్లు శైవమతమున కనుకూలము కాగా సాహిత్యము కూడ నా వాసనతోడనే వెలసినది. పాల్కురికి సోమనాథు డుదయించినాడు. ఆయన సంస్కార వశమున వీరశైవ మతవ్యాప్తికై కంకణము గట్టికొని పుట్టినా డనిపించును. అఖండ పాండిత్యముతో, చక్కని కవితా వేశముతో, ప్రజలపై పలుకుబడి సాగించుకొనెడి భాషా పరికరముతో బహుముఖముల మత వ్యాప్తికయి ముమ్మరమైన సాహిత్య సృష్టిజేసి నాటి తెల్గుదేశము నుఱ్ఱూత లూగించిన మహాకవి యాతడు. ప్రజలకొఱకయి, ప్రజామతమును, ప్రజా సాహిత్యమున బంచిపెట్టి నిరాఘాటముగ పలుకుబడి సాగించుకొనిన ప్రజాకవి యాతడు. ఒక్కడొక్క సంఘముగా పనిజేసి ఆంధ్ర సారస్వత ప్రపంచమున నతిచిత్రమైన మార్గముల నారంభించిన వా డాతడు. సాహిత్యమున వైవిధ్యము గల్పించి ఆయా శాఖలను సుస్థిరపఱచినాడు. ద్విపదలు, వచనములు, శతకములు, ఉదాహరణములు, వ్యాఖ్యానములు మొదలగు సాహిత్యశాఖల నెన్నిటినో వెలయించి వానికెల్ల మార్గదర్శకుడయ్యెను. అందలి భాష, విషయము, భావన, రచన, అన్నిటి యందును అపూర్వమైన ప్రత్యేకతను జాటినాడు. ఆతడు సృష్టించిన శాఖలు, అం దాత డనుసరించిన రచనా వైఖరి నాడు పండితాదరమును బడయకుండినను ప్రజాభిమానమును మాత్రము బాగుగనే చూఱగొనినది. నాటికి నాడు కొందరు మతావేశములతో పాల్కురికి వాని రచనను త్రోసి పుచ్చినను తరువాత తరువాత పండిత కవులే దాని నాస్వదించి ప్రామాణిక రచనగా ప్రచారమునకు దెచ్చినారు. కొంద ఱప్రయత్నముగా నాతనిపలుకుబడికి లోనైనారు. కొంద,

ఱాతని రచన ననుసరించినారు. కొంద ఱను కరించినారు. కొంద ఱట్లే దాని ననువదించి నారు. మఱికొంద ఱాతనిని మించి పోవుట కెంచినారు. ఇట్లుగా సోమనాథుని తర్వాత నాతని రచనను పుణికి పుచ్చుకొన్న మహాకవు లెందరో వెలసినారు. ఇది యెల్ల మన దేసి భాషా వికాసమును జాటును. అంతియే కాదు; ఆ వికాసమున కెల్ల మూలభూతుడగు సోమ నాథుని ప్రతిభామాహాత్మ్యము నుగ్గడించును.

సోమనాథుడు క్రీస్తుశకం 1160లో జన్మించి 1240 ప్రాంతమువరకు జీవించియుండె నను వాదమును విశ్వసించి స్థాలీ పులాకన్యాయ ముగ నాతని రచనా వైఖరి యితరులలో నెట్లుగా ప్రతిభాసించినదో మాత్రమే ప్రక టించుటకు ప్రయత్నింతును. పాల్కురికి సోమనాథుని బసవ పురాణ పండితారాధ్య చరిత్రముల రచనతో తెల్గుదేశమున వీరశైవము బాగుగ ప్రబలి పోయినది. సమకాలమున తదితర మతములు కూడ దేశమున ప్రవేశము కల్పించు కొనుటకు యత్నించుటతో నా యా మతానుయాయుల నడుమ కొంత ఘర్షణ యేర్పడినది. పశ్చిమ సముద్రతీరమున హరి హర తత్త్వమప్పుడే వ్రేళ్లు తన్నినది. కన్నడ దేశమున తుంగ, భద్రనదుల సంగమ స్థానమున హరిహర దేవాలయము వెలసినది. ఆ యలజడి నుండి మతసామరస్యము నుత్సాహముతో సాధించుటకై కొంద రద్వైతమును ప్రతి పాదించి హరిహరుల కభేదమును చాటింప జూచినారు. ఆ యుత్సాహమును సోమ నాథు డిట్లు చమత్కారముగ పండితారాధ్య చరిత్రమున తెగడినాడు, వాద ప్రకరణమున :-

"హరిహరుఁడన నొక్కఁ డనియెదేన్ వినుము
కాముని హరియింపఁగా గామహరుఁడో?
కాముండు హరుడు నిక్కం బొక్కరుండో?

* * *

అఱిముఱి సర్వంబు నటు హరించుటను
హరిహరుండను నామ మయ్యెగా కిట్లు
హరియును హరుఁడు నైక్యముగారు, వినుము-

* * *

కావున హరిహరాంగము లేకమగునె?
యేవెంటఁ బొందుగాదిల; నట్లుఁగాక
విష్ణుండు శివుఁడునా వేఱే? 'శివాయ
విష్ణురూపాయ' నా, వెండియు నంద
విను 'శివరూపాయ విష్ణవే' యనఁగ
మును మ్రోయుఁ దత్సూక్తి వినవె? యంటే
దలపఁ బ్రక్షిప్త సూక్తము గాక శ్రుతులు
పలుకునె శివునిరూపము విష్ణుఁడనుచు?"

అని త్రోసిపుచ్చినాడు. కాని తిక్కనగారు దీనికి సమాధానముగా "భద్రాయుతమూర్తియై హరిహరంబగు రూపముదాల్చి విష్ణురూపాయ నను శివాయ యని గొల్చెడి భక్తజనంబు" అని నొక్కి వక్కాణించుచు, ప్రక్షిప్తసూక్త మని త్రోసి పుచ్చిన సోమనాథుని చమత్కార జనిత వాదమును సరకుబొనక హరిహరాద్వైత వాదమును మహాభారతమున ప్రతిష్ఠాపించినాడు, తద్విశ్వాసమునకు సాహిత్యత గల్పించినాడు. కొందర కది గుణముగా దోచి కాబోలును నాచన సోమనాథాదులు తరువాతకూడ నా విశ్వాసము తోడనే సాహిత్యసృష్టి చేసినారు. ఇది యట్లుండ పాల్కురికి సోమనాథుడును తిక్కనయు సాహిత్యవిషయమున సన్నిహిత వర్తులని చెప్పనగును. విశేషమైన ప్రసన్నతకు జాను తెనుగు మేలని చెప్పుకొన్న సోమనాథుని రచనావైఖరి తిక్కన రచనలో కాననగును. 'ప్రాణగొడ్డము' వంటి వైరసమానరూపము లిరు వురి యందును సరిసమానమే.

'శైలముల్ ఘూర్ణిల్ల జయివెట్టువారు
నెట్టణ శ్రమ (వ) మేద నిద్రించువారు'

అనుపట్టున 'శ్రమమునకు 'శ్రవ' మనుటయే సోమనాథుని యభిమతమని బసవపురాణము నందు 'వ్రస్సియెంతయును శ్రవంపడి యట్లు' అనుటను బట్టియె తెలియనగును. ఈతీరు ప్రయోగము తిక్కనరచనలో బహుళముగ కాననగును. 'శ్రవమునకై యేను సకలాంగక ములు'; 'శ్రవంబధికంబు సేయుటన్'; 'పరి శ్రవం బాచరించి' అని యాతడనను. ఇక సోమ నాథుని జాతీయములు, సామెతలు, పలుకు బడుల తీరుతీయములు తిక్కన రచనలందు సమానముగ దోచును. 'బెండ్లు తేలెడిగాక పేరేటనైన గుండ్లు తేలునె' అని సోమనాథు డనినట్లే 'గుండ్లుదేలి బెండ్లు మునింగి నట్లయ్యె' నని తిక్కన యనినాడు.

ఇట్లప్రయత్నముగా సోమన పలుకుబడి తిక్కనపై బడినది. ఈ తీరుగనే నాచన సోముని రచనయు పాల్కురికి వాని రచనకు ప్రతిముద్ర యనిపించును. ఈ సోమనాథు డా

సోమనాథుని పలుకుబడిని బాగుగా గుర్తించి చిత్రించుకొనినాడు.

'అవమునగల్గునే రాగిముంతకు?'; 'తుదినాలుక ముల్లు'; 'ముంజేతికంకణమున కద్దమేల?' ఇట్టి లోకోక్తుల నెన్నిటినో నాచనసోమన తన గ్రంథమున నిక్షిప్తపరచుకొనినాడు. పౌండ్రక వాసుదేవుడు సాత్యకిని జూచి 'పమ్మరావమున రాగిముంత లేరంగగలవే' అని సోమనాథుని పలుకుబడితో శ్రీకృష్ణుని పరిహసించును. దుర్వాసుడు కృష్ణునితో తన భంగపాటును చెప్పుకొనుచు 'అరయ ముంజేతి కంకణమున కద్దమేటికి?' కనినాడు. అతని కప్పుడు 'మునుల లోపల నాటకముల్లు విరిగె' నట! తెల్గుదేశపు బల్కుబడులతో, జాతీయములతో, సామెతలతో వెల్లివిరియు పాల్కురికివాని రచన మిట్లే తరువాతివారి రచనలపై నెంతయో ప్రభావము జూపినది.

పండితారాధ్యచరిత్రమున కుమారపాల ఘూర్జరుని కథలో జూదపుపరిభాష చాలగా నున్నది. దానినట్లే నాచనసోమన ఉత్తరహరివంశమున రుక్మిణీకృష్ణులు జూదమాడు సందర్భమున చూడనగును.

ఇత్తింవం చిత్తిగ దుగ
సత్తా దచ్చాక పంచి చావం చీర్రా
దత్తెగ నిద్దుగ బ్రదలు
చిత్తంబునఁ దలఁచినట్లు చేతికిఁదెచ్చున్.'
(ఉ. హ.)

సోగటాలాటలో నుపయుక్తమగు పరిభాష నిట్లు గ్రంథస్థముగావించుటలో పాల్కురికివాడే తరువాత వారికి మార్గదర్శకు డయ్యెను.

ఇట్టి యిరువురి రచనలలోను పాల్కురికివాని పలుకుబడి యప్రయత్నముగ గ్రహింపబడినట్లు తెలియనగును. వీరశైవ మతవ్యాప్తికై తని రచనాపద్ధతి యెట్లు దోహదముచేసినదీ గమనించిన మరికొందరు తరువాత తరువాత తమతమ మతవిశ్వాసముల కనుగుణముగ ప్రయత్న పూర్వకముగానే నా తీరురచననే సాగించినారు. రంగనాథుడు, గౌరన, చిన్నన ప్రభృతులు ద్విపదచ్ఛందమునే యూతగాఁగొని, రచనలు సాగించినారు.

'పటు గద్యపద్య ప్రబంధ సామ్యముగఁ
గావ్యకళాప్రౌఢిఁ గల్పింతు ద్విపద
కావ్యంబు శ్రావ్యంబుగాన——
తిన్నని సూక్తుల ద్విపదరచింతు—'

అని ప్రారంభించిన సోమనాథుని విశ్వాసమునే తరువాత వారెల్ల గ్రహించిరని వారివారి ద్విపద రచనలు బట్టియే తెలియనగును.

రంగనాథ రామాయణము పండితారాధ్య చరిత్రమువలెనే బృహద్గ్రంథము. ఆవేశము, ఔత్సుక్యము రెంటియందును సమానమే. అట్టి పట్టులలో భావప్రకటన మఖండముగా లేక ఖండఖండ పదములతో ద్విపదలు నింపి యుండుటకు పోలిక లెన్నియేని చూపవచ్చును. కాని యింతకన్న నెక్కుడుగా గౌరన హరిశ్చంద్రోపాఖ్యానమున సామ్యము నెన్నవచ్చును. అష్టమహిషీ కళ్యాణము వైష్ణవ మత గ్రంథము. గ్రహించినది ద్విపదయేయైనను గౌరన తర్వాత దానికొక ప్రామాణికతను గల్పించినవా డేతద్గ్రంథకర్త చిన్నన్న. ద్విపదకు లక్షణము తాను నమ్మినట్లు విస్పష్టముగ జేర్కొని, తదనుసారముగ రచనసాగించి పండితాదరమునకు పాత్రుడయ్యెను. ఛందోనియమముల విషయమున పై మూడుగ్రంథములును పాల్కురికివాని ద్విపదలకన్న నొకింత విశిష్టముగను, భిన్నముగను దోచును. పాల్కురికి సోమనాథుడు బసవపురాణ పండితారాధ్య చరిత్రములందు ద్విపదకు ద్విపదకు తెగజెప్పకుండ పలుతావుల కలిపివేసినాడు. సాటైన రత్నంబు చుట్టును బనిడిగట్టినట్లు కట్టుకొని పోవు నుత్సాహముతో నట్లలిక వేసినాడు. రంగనాథుని రామాయణములో నైతము కొన్ని పట్టులందు—అవి ప్రక్షిప్తములు కావచ్చును-ద్విపద లతికిన యుదాహరణములున్నవి. కాని ప్రామాణికులైన పైజెప్పిన మువ్వురిలో నెవ్వరికిని ఆ విధాన మభిమతముకాదని మాత్రము వారిగ్రంథములను జూచినంత మాత్రముననే చెప్పవచ్చును. పోగా రచనలో ప్రాసయతి విషయమున

'యతులలోపలఁ బ్రాసయతి దక్క సకల
యతులఁజెల్లును ప్రయోగానుసారమున'

అనియే చిన్నన్న యభిప్రాయము. అట్లే పై మువ్వురి రచనయు సాగినది. కాని సోమనాథుని రచనకు భిన్న మీతని లక్షణము. పాల్కురికివాని ద్విపదరచనలో ప్రాసయతి ప్రయోగమున్నది. "రంగనాథరామాయణాదు లీలక్షణము ననువర్తించుచున్నవి. కాని సోమనాథుని రచనమిట్లు లేదు. ద్విపదమున నితరకవులెవ్వ

రును బాటింపని ప్రాసయతి నీతఁడు చేర్చెను.'' అని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిరి.

ద్విపదయను పేరునుబట్టియే ద్విపదయు ద్విపదయు తెగుచుండవలెనని స్ఫురించును. పోగా ప్రాసయతికూడునా యన్నచో సోమనాథునికాలమున నట్టుకూడ నుండెడిదని దాని గ్రంథమే సాక్ష్యము. కాని చిన్నన్న రంగనాథాదుల వలెనే ద్విపదకు ప్రాసయతి యేల యని మార్చకాబోలును! లక్షణము లెట్లున్నను ప్రజాసాహిత్యముగా ప్రచారమునకు వచ్చిన ద్విపద (వికారములనదగిన) గ్రంథములలో మాత్రము సోమనాథుని రచనాపద్ధతియే కానవచ్చుచున్నది. తిక్కనాదులు వృత్తమునకు వృత్తమునకు పదబంధము, అన్వయబంధము గల్పింప దేసిరచనయైన ద్విపదలో కూడదా? ఇక ప్రాసయతి యితర దేసిఛందముల యందు వలెనే ద్విపదయందును సాగినది. ఈ కారణముననే యనుకొందును తరువాత దేసికవులా తీరుననే రచనచేసినారు.

ఇట్లు రంగనాథుడు, గౌరన, చిన్నన ప్రభృతులు సోమనాథుని ద్విపద ననుసరింపగా శ్రీనాథుడు కొంత విషయమును, ఛందస్సును ననుసరించినాడు. ఈతని సీసపద్యములందుగల సొగసైన తూగు, సమత శ్రీనాథ పోతనల సీసపద్యముల చక్కని నడకకు దారిచూపినట్లు తోచుచున్నది. 'మందార మకరంద' యను సుప్రసిద్ధమైన పోతన సీసములో గనుపించు భావము, పోలిక సోమనాథునివే. శైవమతాభినివేశముతో శ్రీనాథుడు రచించిన హరవిలాసమునకు మూల మనదగినది బసవపురాణమే. అందు సోమనాథుడు రచించిన చిరుతొండనంబి చరిత్రము నెంతో యింపుగా బెంది సరసమైన చమత్కారములనించి పెంపొందించినాడు. హరవిలాస పీఠికలో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రశంసించినట్లు ''కుడుతు నాబంతి నిలుతేడు గొడుకుఁ గుడువ'' అనుటలోనే శ్రీనాథుని రచనాగౌరవము వ్యక్తముకాగలదు. ఇట్లు గ్రంథవిషయము ననుసరించుటయేకాదు. సోమనాథుడు 'అభిమానకత్తె' యనగా నీతడు 'కోపగాడు', 'కోపగత్తె' యనినాడు. శ్రీనాథుని యీప్రయోగము లేతదనుసారులే గదా!

వీరందరిట్లు సోమనాథు ననుసరింపగా ధూర్జటి ప్రభృతులు కొందరు ఆతని ననుకరించినారు. ధూర్జటి రచించిన కాళహస్తి మాహాత్మ్యము నందలి తిన్ననికథకు మూల మనదగినది బసవపురాణరచనయే. ఉడుమూరి కన్నప్పగాంచిన శివలింగమును ''కాఱుటడవిలో నుండ నేల తనతో రమ్ము''ని పిలిచిన తెఱగును, లింగముకంట నీరుకారగా వగజెంది యుపచరించిన విధమును ధూర్జటి చక్కగా సోమనాథునిరచన ననుకరించి వ్రాసినాడు.

''కఱకంఠ! మాపల్లెఁ గలదెల్ల సుఖము
అడవుల మనుబిళ్ళ కడుమంచిపాలు
నొడిపిలి పాసెంబు నుడుప నేతులును
నిప్పపూవునుదేనె లెల్ల ఫలాదు
లొప్పెడు వెదురుఁబ్రా లోగిరంబలును''

గలవు రమ్మనినాడు కన్నప్ప. ఈపట్టును

''ఓ లింగమ! విను నివ్వరి [వెదురుం
బ్రాలును నొడిపిల్లు గునుకుఁ బ్రాలును
బ్రాలును సవరపు మెకముల
పాలును గల వచట నీకుఁ బాయసమునకున్.
పుట్టతేనియ పెరతేనె పుట్టజున్ను
తొఱ్ఱతేనియ గలవందుఁ దోఁచితోఁచి
కాలి దులదులనై పిండిపోలె రాలు
నట్టి నింజెట్లు గలవు నీకారగింప.''

అని మూలమున ఫలాదులన్నియు ననగా నీతడొక్క సీసపద్యమునే వానికై వినియోగించెను. ఈరచన చాలవఱకు పండితారాధ్య చరిత్రను దలపించును. ఇట్లు 'కోరిన వెల్లనుంగలవు. తెప్పల్గాగ నీకచ్చెదన్' రమ్మనినాడు. ఇట్లే లింగము కంట నీరుకారినపుడు కన్నప్పవగచి-

''కటకటా యిది యేమి కర్జంబువుట్టె
నిటలాక్ష! నీకంటనీరు గారెడిని!

* * *

ఊరకో నాయన్న; ఊరకో తండ్రి!
యూరకో నాస్వామి! యూరగ కింతేల
యుమ్మలికము తగ దుడుగవే యనుచు
.........కంటలోని
కసవు పొమ్మన్నట్లు గన్ను శోధించు
గరతలాంగుళములఁ గనుదెప్ప లెత్తి
నెరసున్నదని పాఱనిష్ఠించి యూఁదుఁ
బరగ నాలుక గ్రుడ్డుపైఁ ద్రిప్పి త్రిప్పి
యొరయుచు నొరయుచు నొయ్యనఁ జూచుఁ
జీరాలిఁగొనిఁ కంటఁ జేర్చి హత్తించి—''

చాల ప్రయత్నము సేయును. ధూర్జటి యీపట్టునుగూడ రసోచితముగనే ప్రపంచించినాడు

'శోక పాటంబావిగొన నూఁది యొత్తుచు' నేత్ర వ్యాధికి తగుచికిత్సనుకూడ జెప్పినాడు. ఇట్లుగా సోమనాథుని కన్నప్పకథ మాత్రమేకాదు. గొడగూచికథా విధానముకూడ కొంత ధూర్జటి తీర్చిన తిన్ననికథలో కానసగును. తిన్నడు కాల్చితెచ్చిన కఱకుట్లు శివు డారగింపకుండగా

"చాలవో! యివి పాలుగావనియొ
పాలపైఁ జిత్త మేఁ బఱపితిననియొ
కోఁగబెడంగనో కుంచెడులేవో!"

అని గొడగూని ప్రార్థించినట్లే తిన్నడుకూడ

'కాలవో క్రొవ్వవో మాఁడం
గాలెనో చవిగావో కమ్మగావో నీకుఁ
జాలవో యలవడవో తిన
వేలా కఱకుట్లు పార్వతీశ్వర చెపుమా'

అని బుజ్జగించి యడిగినాడు. ఇట్లీతని రచన పాల్కురికి రచన కనుకరణ మనుట విస్పష్టమే. బసవపురాణ పండితారాధ్య చరిత్రములు—అందు ముఖ్యముగ రెండవది—నాటి యాంధ్ర దేశమునుగూర్చిన వివరములకు విజ్ఞానసర్వస్వము వంటిది. వానియం దాతడు ప్రదర్శించిన లోకజ్ఞత తరువాతివారి నెందరనో ముగ్ధుల గావించినది. ఒక్క ధూర్జటికేకాదు, హంసవింశతి, శుకసప్తతికారుల కందఱకును విషయప్రదర్శనమున పాల్కురికియే మార్గదర్శకు డననగును.

ఇట్టి యమూల్యములైన రచనలను ప్రాసయతులు పెట్టి రచించినా డన్న నెపముతో నాటి పండితులు నిరాదరించి నిందించిరట. ఈ కారణముననే ఆ రచనలకు పండితుల దృష్టిలో ప్రామాణికత గల్పించు నుద్దేశ్యముతో శ్రీనాథుడు కొంతవఱకు బసవపురాణ కథలకు కావ్యతాగౌరవమును కల్పించినాడు. ఈ దృష్టితోడనే సోమనాథుని కారుతరముల తరువాతివాడైన పిడుపర్తి బసవన బసవపురాణమును పద్యకృతిగా నొనర్చెను. మతాభిమానము, గురుభక్తి యున్నను, పండితుల తలలూగ్గజేసి వారి యాదరమునుగూడ పడయుటయే పై రచనకు ప్రధాన కారణమగునని యూహింప వచ్చును. ఈ పద్యబసవపురాణము ద్విపదకు స్వచ్ఛమైన యనువాదము. ద్విపదలకు ద్విపదలను సొగసుగా వృత్తములుగా, సీసములుగా మలచుకొనినాడు. మూలమునందలి జాతీయమునుగాని, పలుకుబడినిగాని, సామెతనుగాని, భావమునుగాని, విషయమునుగాని, దేనినిగాని జారవిడువకుండ చక్కగ తీర్చిదిద్దినాడు బసవన. ఈ కృతి ద్విపద బసవపురాణ పఠనావసరమున సందేహములకు నివృత్తిస్థానము. ఇది దానికి వ్యాఖ్యానమువంటిది. అర్ఘ్యపణ్యమున కర్థ మెరుగుటకుగాని, శబ్దస్వరూపము తెలియుటకుగాని మనకది చక్కని యాధారమగుచున్నది. ఇట్లెన్నో విషయములకు!

బసవపురాణమున చివర 'బోయల కథ' యున్నది. అందు బోయల యభియోగముపై బసవన కాలకూటమును వండి భక్తుల కందరికును వడ్డించును. భక్తులందరును దానిని పాయసమువలె త్రాగి సుఖముందురు. ఈ పట్టున ద్విపదలో సోమనాథుడు తెలుగువారి నుడికారమును, జాతీయమును ప్రదర్శించినాడు గదా! ఆహా! అపూర్వ మపూర్వము! ఎన్నెన్నితీరులుగ వడ్డించుటను పలికించినాడు!! ఈ ద్విపదలలోని జాతీయము వృత్తముల కొదుగునా యను సందేహముతో పద్యకృతిని దెఱచితిని. నా సంశయము నిశ్చయమైనది. ఇన్ని ద్విపదలను పద్యములుగా తీర్చుకొన్న బసవనకూడ దిద్దీలుకాక ఆ పట్టునట్లే రగడగా మార్చుకొని దాని మాధుర్యమును సంరక్షించుకొనినాడు. చెప్ప సొగసులేదు—చదివి చూడవలసినదే! ఈ తీరుగ బసవపురాణము నాత డనువదించినాడు.

సోమనాథుని రచనాప్రభావము పైవారి మీదనేకాక ప్రబంధకవులలో పేరెన్నికగన్న కవులపైగూడ కొన్నిపట్టుల గొట్టవచ్చినట్లు కనిపించును. 'పూసలలో దారంబునట్లు' అని సోమనాథు డన్నట్లుగా అనబోయి 'కలకాల మొక్కగతి పూసలలో దారంబుమాడ్కి' అను పద్యమున పారిజాతాపహరణకర్త అన్వయమున చిన్నబోయినాడు. కాని తెనాలి రామకృష్ణుడు — ఒకప్పుడు రామలింగ మగుటచే కాబోలును—తిన్నగనే 'తలలోపల నాలుక, పూసలలో దారంబు, పాలజల్లిన నీరు' అని నాడు. పోగా కిట్టి; బిమ్మిట (త్రాట); గట్టు బోయలు; నోరితాళంబు మొదలగు ప్రయోగములలో నీతడు కొంత సోమనాథుని తలపించుచునే యుండును.

ఇట్లింద రిన్ని తెఱగులుగా బోగా పదునాల్గు పదునైదు శతాబ్దులలో తిరుపతిలో పేర్వెలసిన మహాకవులు, తాళ్ళపాకవారు

సోమనాథు ననుసరించి, వానిని మించిపో నెంచినారు. వీరిలో కెల్ల ముమ్మూర్తుల సోమనాథుని దలపించువాడు పెదతిరుమలయ్య. ఆంధ్ర సాహిత్య మందిరమునందలి శీర్ష భారము నంతను తమ భుజస్కంధములపై మాత్రమే మోయు స్తంభద్వయము వీరు! వీరిపై నెన్ని నిలువుల భారము నిలచియున్నదో గదా!

తిరుపతికొండకు విచ్చేసి, స్వామి యనుగ్రహమున వేలకొలది సంకీర్తనముల రచించి, వానికి లక్షణముల నిబంధించి సంకీర్తనాచార్యుడై, పదకవితా పితామహుడై పరమపద మందినాడు తాళ్ళపాక అన్నమయ్యగారు. వేంకటేశ్వరుని దివ్యసంకల్ప మట్టిది. తరతరములదాక వారి కుటుంబము శ్రీపాదములనే సేవించి యపారమైన సాహిత్యకృషి చేసినారు. అన్నమయ్యగారి కుమారుడే పెదతిరుమలయ్య. ఈతడన్నివిధముల నా తలిదండ్రులకు తగిన పుత్రుడు. భక్తి ప్రపత్తులయందును, పాండిత్యాభినివేశమునందును, కవితావ్యాపారమునందును సోమనాథున కీతడు జోడైనవాడు; ఒకయెడ మించినవాడేమోకూడ! ఏమైనను భక్తిపారవశ్యమున మైమరచిపోయి మరపించెడి కవితాసృష్టిచేయగల సామర్థ్య మీతని కలవరచినవాడు సోమనాథుడే యనవలయును. ఆతడు శైవుడు. ఈతడు వైష్ణవుడు. అంతే భేదము. సోమనాథుడెన్నిరచనలను గావించెనో-ఎన్నిటిని పేర్కొనెనో - అన్నిటిని పెదతిరుమలయ్య ఆవిష్కరించినాడు.

స్తుతి ప్రధానమైన యుదాహరణ కావ్యమును బసవోదాహరణమును రచించి సోమనాథుడు ధన్యుడుకాగా, పెదతిరుమలయ్య వేంకటేశ్వరోదాహరణమును రచించి యాశాఖకు సాహిత్యత గల్పించినాడు. ఇరువురి రచనలయందును భక్త్యావేశము ప్రధానము. కాదేని ఒకటిరెండు ప్రత్యయముల ప్రయోగములో భేదముండెనేమో. ఈ శాఖయందే కాదు, ద్విపద రచనయందును సోమనాథుడే తాళ్ళపాకవారికి యొరవడి పెట్టినవాడు. పెదతిరుమలయ్య ద్విపదలో హరివంశమును వ్రాసెనట. ఇతడింక తద్వికారము లనదగిన రగడలు, మంజరులు, దండకములుకూడ వెలయించినాడు. తరువాత ముఖ్యముగ పేర్కొనవలసినది గద్యవాఙ్మయశాఖ. సోమనాథుడెన్నియో గద్యలను రచించినాడు. వాని నూతగాగొనియే కృష్ణమాచార్యులు ప్రసిద్ధమైన వచనరచన గావించినాడు. వీనినెల్ల మననముచేసియే పెదతిరుమలయ్య వేంకటేశ్వర వచనముల వెలయించినాడు. పోగా సోమనాథుని చతుర్వేదసారమువలెనే సీసములతో ప్రత్యేకముగా నీతిసీస శతకమును తిరుమలయ్య రచించినాడు. ఇక నిరువురును వృత్తములతో శతకములను రచించినారు. ఇట్లుగా సోమనాథుడు సృష్టించిన శైవసాహిత్యమునకును, తాళ్ళపాకవారి వైష్ణవసాహిత్యమునకును మతమును దప్పించి సర్వవిషయములందును సామ్యమున్నది.

పండితారాధ్య చరిత్రమున పర్వత ప్రకరణమున సోమనాథుడు పదభేదముల నెన్నిటినో పేర్కొనినాడు. 'లలినుబ్బి చాంగు భళా యనువా'రును, 'వేడుకతో జిందు వాడంగి నుబ్బి కోడంగి యాటలఁ గని సెడివారు'ను నాడుండిరట.

'మదినుబ్బి సంసార మాయాస్తవంబు
పదములు తుమ్మెదపదముల్ ప్రభాత
పదములు పర్వతపదము లానంద
పదములు శంకరపదముల్ నివాళి
పదములు వాలేశు పదములు గొబ్బి
పదములు వెన్నెలపదములు—'

మొదలగునవి యెన్నియో నాటికిపూర్వమే దేశమున వ్యవహారమున నుండెడివని పండితారాధ్య చరిత్రమునుబట్టి తెలియనగును. శైవమత ప్రచారములోనికి వచ్చినతర్వాతనే చాలవఱకీ పదసాహిత్యమున కభ్యుదయము కల్గినది. తర్వాత వైష్ణవముకూడా నీ పదసాహిత్య మెల్ల దాని నాలంబముగా గొని వర్ధిల్లినది. అసలు పండితారాధ్య చరిత్రమునందే పదములందలి ప్రధాన లక్షణము పాటింపబడినదని శ్రీ నిడుదవోలి వేంకటరావుగారు నాకు తెలిపిరి. పురాతన ప్రకరణమునందలి కథలను సంధానించుట యందే నడుమనడుమ ద్విపద లొండురెండు చేటి పల్లవివలె తుద ముట్టసాగుచుండుట యీ పదకవితా సంప్రదాయమేనని, అది మన కందు కానవగునని వారు తెల్పిరి. ఏమైనను మన ప్రాచీన దేసిరచనలలో, పాటలలో, పదములలో కాలనిర్ణయము చేసి స్పష్టముగ [illegible]వని చెప్పజూచుట కాధారములు ల[illegible]నందున సోమనాథుడు

పేర్కొన్న చిందులకుగాని, మరి వేనికిగాని లక్ష్యము లప్పటివి గుర్తింపజాలకున్నాము. తాళ్లపాకవారి రచనలు వెలువడిన పిదపనే వాని కన్నిటికిని లక్ష్యములు బయలుపడినవి. చాళుక్య రాజుల సంగీత గ్రంథములలో కొన్నిరకముల గేయరచనలకు లక్షణములున్నవి. అందు చిందులు కూడ పేర్కొనబడినవి. తాళ్ళపాకవారి యీ చిందును చూడుడు.

"చిత్తగించు మా మాటలు శ్రీ నరసింహ
చిత్తజ జనక వో శ్రీ నరసింహ"
* * *
చిందిన చెమటలు శ్రీ నరసింహ-నిన్నుం
జెందినది కడుజాణ శ్రీ నరసింహ.
చెందమ్మి గెనుగోళ్ళ శ్రీ నరసింహ-నీపై
చిందులెల్ల బాదేను శ్రీ నరసింహ—"

ఇది 'చాగుబళా' పదము—

"చక్కని తల్లికి చాగుబళా - తన
చక్కెర మోవికి చాగుబళా!"
* * *
జందెపు ముత్యపు సరుల హారముల
చందనగంధికి చాగుబళా!
విందయి వేంకట విభు బెనచిన తన
సంది దండలకు చాగుబళా!"

ఇట్టి వెన్నియో రకముల పదము లున్నవి. మతము నాధారము జేసికొనియే తొలుత పద సాహిత్య మభ్యుదయము పొందిన దనుట కొక యుదాహరణము నిత్తును. తాళ్లపాక వారి రచనలలో 'అల్లోనేరేళ్లు' అను గేయ రచన లున్నవి. ఈ శబ్దస్వరూపమును గూర్చి విమర్శకులు పరిశీలించిరి. ఇటీవల శ్రీ వేంకటరావుగారది హాలాహల శబ్దభవమనియు, దానిని నేరేడు పండును మ్రింగినట్లుగా శివుడు మ్రింగినాడనియు లక్ష్యము జూపి, తత్కథా సూచకముగనే పై పదరచన వెలువడి యుండు ననియు తెల్పిరి. తెలంగాణమున 'అల్ల' శబ్దమునకు 'దొడ్డ' అన్న అర్థమున్నది. అల్ల శబ్దమే మైనను పై పద రచనా సంప్రదాయము మాత్రము శివుని గూర్చియే కల్గియుండును. కాని తాళ్ళపాక వారి రచన వెలువడు వఱకు నాతీరు పదమునకు లక్ష్యము మాత్రము లభ్యము కాలేదు. ఇటీవల నేను తాళ్ళపాక వారి సంకీర్తనలను పఠించు చుండగా నాకందు వింత పద మొకటి కానుపించినది. అందు వేంకటేశ్వర స్వామి నల్లో నేరేడు పండుతో పోల్చినాడు కవి. పదమెల్లనదియె! స్వామిని 'నీలమణి'తో పోల్చుట వైష్ణవ సంప్రదాయము. శ్రీవచన భూషణమున శ్రీలోకాచార్యు లట్లే యనిరి. పెద్ద నేరేడు పండు చక్కని నీలమణివలె నుండును. అట్టి యాకృతిగల స్వామిని కీర్తించు పదములే 'అల్లో నేరేళ్లు' పదములు! శైవముతోడనే పై పదరచన ప్రారంభించి యుండినను వైష్ణవము మూలముననే ప్రచారమునకు వచ్చి యుండును. క్రమమున 'అల్లో నేరేళ్లు' పదమునకు మాయ, మోసము అను నర్థము రూఢి లోనికి వచ్చినది. అనగా 'చందమామ గుటక' లన్న మాట!

ఆవలవెన్నెలలో అల్లునేరేళ్లింతె
నిపిరి నిన్నటియునికి నేటికి గలదా'

అని తాళ్ళపాక వారనుటయే పై యర్థమునకు బలము.

"నెయ్యము లల్లో నేరేళ్లో
బయ్యన నారెడి నువ్వెళ్లో..."

అను ప్రారంభముగల వారిపదము ప్రసిద్ధమైనది.

ఇట్లు పాల్కురికి పేర్కొన్న పదరచనల కన్నిటికిని తాళ్ళపాక వారిలో లక్ష్యము లెన్న వచ్చును. తుదకు సంసార మాయాస్తవము కూడ వీరి రచనలలో గాననగును. ఇందే కాదు జాతీయమునందును, సామెతలయందును లోకోక్తు లందును పై శైవవైష్ణవ కవుల రచనల కెంతేని సామ్యము గలదు. సోమనాథుడు కన్నప్ప కథలో

'కలగన్న చోటికి గంపఁగొంపోవ
ఫలసిద్ధియగు టెల్లభాగ్యంబు గాదె!'

అనినాడు. దాని నట్లే అనమయ్య

"కలగన్న చోటికి గంప యెత్తిన యట్లు
నలరి నీరాటిన దెట్ల నమ్మా!"

అనియొకపదము నారంభించినాడు. అంతేకాదు. ముంజేతి కంకణమున కద్ద మేలరా, తంగేటి జున్ను, నెఱకు పండిన పంట, బెండ్లు మునిచి గుండ్లు తేలించేది, ముల్లుదీసి కొఱ్ఱడచుట, శిరసుండ మోకాల సీసవెట్టిన యట్లు, ఓడ విడచి వదరుచేపట్టుకొని- ఇత్యాది లోకోక్తు లెన్నో వీరు సోమనాథుని వలెనే సందర్భానుసారముగ ప్రయోగించియౌచిత్యమును పోషించుకొనిరి. ఇట్లు సోమనాథుని రచనకు వీరిలో పరి

# వీరశైవవాఙ్మయము-విద్వాంసుల సేవ

## శ్రీ చల్లా రాధాకృష్ణశర్మగారు

---: * :-

తెలుగున బసవేశ్వరుని సమకాలికుడైన మల్లికార్జున పండితారాధ్యుని శివతత్త్వ సారముతో ననలువేసిన వీరశైవాంధ్ర వాఙ్మయము తరువాతి కాలమున పాలకురికి సోమనాథుడు మొదలగు శివకవుల కృతులతో మూడు పువ్వులాఱు కాయలుగా వర్ధిల్లినది. మార్గ సంప్రదాయములను పరిత్యజించి దేశిసంప్రదాయములకు ప్రాణప్రతిష్ఠ చేసి శివకవులు చిరయశస్సు సమార్జించిరి. సంస్కృత భూయిష్ఠమైన తెలుగును గాక జాను తెలుగున గ్రంథ నిర్మాణముచేయ వారు సన్నద్ధులయిరి. శివ భక్తుల గాథలనే యితివృత్తములుగ చేసికొని వానికి కావ్యస్వరూపము నొసగిరి. దేశీయ చ్ఛందమగు ద్విపదను మిక్కిలిగా నాదరించిరి.

ఇట్టుల శివకవులు దేశీయములైన సంప్రదాయములకు నెలవులుగా తమ కావ్యములను తీర్చి దిద్దిరి. కావున వీరశైవాంధ్ర వాఙ్మయము దేశిసాహిత్యదర్పణమని నుడువుట సమంజసము!

ఏమయిన నేమి శైవవాఙ్మయమునకు మొన మొన్నటివఱకు పండితుల యాదరాభిమానములు లభింపక పోవుట మిక్కిలి శోచ్యము. లక్షణ విరుద్ధములగు ప్రయోగము లనేకములు శివ కవుల కావ్యములందు గలవని నుడివి ప్రాచీనాలంకారికులు వానిని ప్రామాణిక గ్రంథములుగ పరిగణింప లేదు. వైష్ణవమతావలంబకులయిన వసుధేశ్వరుల యాదరము నాశించిన కొందఱు కవులు వైష్ణవమును స్వీకరించి శివ కవుల పేరులనైనను స్మరించుటకు వెనుకంజ వేసిరి. ఈ హేతువులచే శైవ వాఙ్మయమునకు బహుళ ప్రచారము లభ్యము గాక పోవుటయే కాక తగినంత యాదరము గూడ లభింప లేదు. కాని అద్యతన కాలమున-అనగా క్రీస్తు శకము పందొమ్మిదవ శతాబ్దపు చరమ దశ నుండి—వీరశైవ వాఙ్మయమునకు పండితాదరము ప్రలభ్యమయినది. తత్ఫలితముగ భవి కవుల గ్రంథములవలె శివకవుల కావ్యములు కూడ ప్రకటితములై వెలుగులోనికి వచ్చినవి. అందులకు విశేషముగ సహాయపడిన వారిలో సి. పి. బ్రౌను, కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు, వేటూరి ప్రభాకరశాస్త్రి, కాశీనాథుని నాగేశ్వరరావు, చిలుకూరి నారాయణ రావు ప్రభృతులు పేర్కొనదగినవారు.

### బ్రౌన్ దొరవారు :

తెలుగు మెఱుగులను తెలుగు వారికే కాక యావత్ప్రపంచమునకు తెలియజేసిన చార్లెస్ ఫిలిన్ బ్రౌను దొరవారు శైవ వాఙ్మయ పునరుద్ధారకులలో నగ్రేసరులు. వారి పుణ్యమా యని శివకవుల రచనలు కాంతి రేఖలను చూడ గలిగినవి. క్రీ. శ. 1840 సంవత్సరపు మద్రాస్ జర్నల్ ఆఫ్ లిటరేచర్ అండ్ సైన్స్ అను పత్రికలో బ్రౌను దొర వారాంగ్లమునందు జంగమ వాఙ్మయమను నొక ప్రశస్త వ్యాసము వ్రాసిరి (The Essay on

---

పూర్ణవికాసము కల్గినది. ఆ కారణముననే తరువాతి సాహిత్య ప్రపంచమున ప్రభావము తొలుత జూపినది సోమనాథుడే యైనను, తాళ్ళపాక వారి ప్రభావముగానే మనము సంభావింతుము. దినకరుని కిరణకాంతి పగలెల్ల వెలిగించి తొలగిపోగా తదంశమే యుదయమై, వాని కాంతినే గొని యమృతాంశువు తరువాతి కాలమున వెన్నెలతో జగత్తున హాయి నింపుచుండును. ఆ వెన్నెల ననుభవించు రసికులు చంద్రునే గుర్తింతురు గాని వానిని వెల్లించెడి సూర్యుని తలపరుగదా! అందుచే సోమనాథుని రచనా ప్రభావమాంధ్ర సారస్వత ప్రపంచమున నప్పటి వఱకు నిరాఘాటముగ సాగినదనియే చెప్పనొప్పును.

ఇట్లు రెండు మూడు వందలేండ్లకు మీదుగనే తమ పలుకుబడి సాగించుకొనిన శైవ కవుల కాంధ్ర వాఙ్మయ ప్రపంచమున నొక ప్రత్యేక స్థానమున్నదనుట నిర్వివాదాంశము. అట్లే తాళ్ళపాక వారికిని అని నా విశ్వాసము. మనకు కావ్య వాఙ్మయము కల్గిన తర్వాతజరిగిన యేడెనిమిది వందల సంవత్సరముల సాహిత్య సృష్టిలో చెప్పుకోదగిన రచనా రీతులను వెలయించిన వారిరువురే: అందొకరు మన శివ కవులు-తరువాత తాళ్ళపాక వారే!!

———

**Jangams).** ఆ వ్యాసములో వారు శైవ వాఙ్మయ వైశిష్ట్యమును లోకమునకు తొలి సారిగా తెలియజేసిరి. వారి పెట్టిన యీ సాహిత్య భిక్షయే తరువాతి వారిని శివకవుల రచనలను గుఱించిన పరిశోధన సాగించుటకు ప్రేరేపించినది. బసవపురాణ కావ్యమునందలి విషయమును వారు సంగ్రహముగ నాంగ్లములో నూటయేబది పుటలయందు వివరించిరి. అటులనే పండితారాధ్య చరిత్రను గుఱించి కూడ నాంగ్లములో ప్రశస్త రచన చేసిరి. ఆ యమూల్య రచనలు చెన్నపురి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము నందు భద్రము చేయబడినవి. ఎన్నటికైనను నవి ముద్రితము లైనచో బ్రౌను దొర వారి సాహిత్యసేవ యప్పుడు సుస్పష్టము కాగలదు. బసవ పురాణమునందలి కొన్ని కొన్ని మాటలను తమ నిఘంటువులో చేర్చి యీ శబ్దములు ప్రామాణికములని వారు నిర్ధరించిరి.

## శ్రీ కొమర్రాజు వేంకట లక్ష్మణరావు గారు :

మల్లికార్జున పండితారాధ్యుని శివతత్త్వసారమును ప్రకటించి శ్రీ కొ. వేం. లక్ష్మణరావు గారు శైవవాఙ్మయ ప్రచారమునకు తోడ్పడినారు. మనకు లభించిన శతకములలో శివతత్త్వసారమే ప్రథమము. దీనిని తొలుత ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో ప్రకటించి పిమ్మట శ్రీ లక్ష్మణరావుగారు ముప్పది రెండు పుటలయుపోద్ఘాతమును పొందుపఱచి పుస్తకరూపమున ప్రకటించినారు. ఈ యుపోద్ఘాతములో పండితారాధ్యుని కాల నిర్ణయము సాధికారముగ చేయబడినది. లక్ష్మణరావు గారి యభిప్రాయమున శివతత్త్వసారము నన్నయ భట్టునకు సుమారొక నూఱు సంవత్సరములకు పిమ్మట రచియింప బడెను. ఇది శైవ వాఙ్మయమునందు బహు ప్రాచీన గ్రంథమైనను పాలకురికి సోముని కృతులు వ్యాప్తిలోనికివచ్చిన పిదప మల్లికార్జునుని గ్రంథములు ప్రచారమును గోల్పోయెనని తలపబడుచున్నది. లక్ష్మణరావు గారు పండిత మతమును గుఱించి వ్రాయుచు నొక క్రొత్త వాదమును స్థాపించి యున్నారు.

నేడు గుత్తిలో నున్న జంగమ మఠము మల్లికార్జున పండితారాధ్యుని మఠమని వ్యవహారము. అది జంగమ మఠము గాదనియు, గృహస్థ మఠమే యనియు వారి వాద సారాంశము. ఏలయన, మల్లికార్జునుడు బ్రాహ్మణత్వమును పరిత్యజించిన వాడు కాడు. మీదు మిక్కిలి అతడు వేదముల ప్రామాణ్యమును గూడ సంగీకరించిన వాడు. సన్న్యాసమును స్వీకరింప లేదు. లింగైక్యము చెందు నంతవఱకు నతడు గృహస్థుడుగానే యుండెను. కావున గుత్తి లోని పీఠము జంగమ పీఠము గాదనియు. గృహస్థ పీఠమే యనియు వారు నిర్ణయించిరి. శివపారమ్య ప్రబోధాత్మక మగు నీ శివతత్త్వసారమును ప్రకటించి శైవ వాఙ్మయ ప్రచారమునకు తోడ్పడిన శ్రీ లక్ష్మణరావు గారు సంభావ్యు లనుట నిర్వివాదము.

## శ్రీ నిడుదవోలు సుందరంపంతులు గారు :

పాలకురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రను ప్రప్రథమముగ ప్రచురించి యశస్సు గడించిన శ్రీ నిడుదవోలు సుందరం పంతులు గారు కూడ నీ సందర్భమున పేర్కొనదగిన వారు. సుందరం పంతులు గారును, పసుపుల నాగయోగి గారును కలసి పండితారాధ్య చరిత్రను పరిష్కరించి ముద్రించిరి. ఈ ముద్రణము విశాఖ పట్టణమునందు క్రీ. శ. 1914 సం॥న జరిగినది. మూడు ప్రతులను సంప్రతించి తాము ముద్రించినట్లు పీఠికలో పరిష్కర్తలు పేర్కొనిరి. పండితారాధ్య చరిత్ర వివరణము తెలుపు నొక వచన గ్రంథముగూడ నీ ముద్రణ ప్రతిలో నున్నది. ఈ గ్రంథము నందలి ప్రత్యేకతయిది. ఏలయన తరువాతి కాలమున వెల్వడిన పండితారాధ్య చరిత్ర ముద్రణములందేలనో యీ వచన భాగము పరిహరింప బడినది. పండితారాధ్య చరిత్ర పఠనమునకీ వివరణ గ్రంథ మత్యావశ్యకమని వేఱుగ నుడువ నక్కఱలేదు.

తాళపత్రగ్రంథములను సేకరించి ప్రథమాంధ్ర పుస్తక భాండాగార స్థాపకులుగా గణుతి కెక్కిన శ్రీ సుందరం పంతులు గారు శైవాగమ శిఖామణి, సిరియాళు చరిత్రము, వీరమాహేశ్వర సారోద్ధారము మున్నగు శైవ కృతులను సేకరించిరి. ఆ గ్రంథము లన్నియు నేడు ప్రాచ్యలిఖిత పుస్తక భాండా

గారములో గలవు. శైవాభిమాను లీ పుస్తకములను ముద్రించినచో నిహపరములు రెంటికిని దగ్గఱవార గుదురు.

## శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు :

పండిత ప్రభాకరులు శ్రీ ప్రభాకరశాస్త్రుల వారు తెలుగు వాఙ్మయమునందు కాలిడని చోటులేదని నుడివినను అతిశయోక్తియుండదు. ఇతర శాఖలందు వలెనె శైవవాఙ్మయశాఖలో గూడ వేటూరివారు పరిశ్రమించిరి. తత్ఫలితముగ వారు శివకవులను గూర్చియు, వారి రచనలను గుఱించియు నూతనాంశములు తెలిపి వాఙ్మయమునకు మహోపకారము గావించినారు.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు "భారతి" ప్రథమ సంపుటము ప్రథమసంచికయందు "శివకవులు" అను నొక ప్రశస్తవ్యాసము వ్రాసిరి. అదిసాహిత్యోపాసకులకు శివకవులయెడల కొంతవఱకు కనువిప్పు కలిగించెను. పిమ్మట వేటూరివారి పీఠికతో ఆంధ్రగ్రంథమాలవారు బసవపురాణము ప్రకటించి శైవవాఙ్మయ ప్రచారమునకు తోడ్పడిరి. ఆపీఠికలో సోమనాథుని కవితా ప్రతిభ, ఆంధ్రసాహిత్యమందు శైవగ్రంథముల వైశిష్ట్యము, శివకవుల భాషావిశేషములు మున్నగు వానిని వేటూరివారు చర్చించినారు. అందులో వారు సోమనాథుని గ్రంథముల నన్నిటిని పేర్కొని యాకవి బహుగ్రంథకర్త యని లోకమునకు తెలివిడి చేసిరి. కాని వారు శైవమతమునుగుఱించి నుడివిన కొన్ని విషయములు తరువాతికాలమున విమర్శకు తావొసగినవి. ఏమైనను సాహిత్యదృష్టితో చూచినప్పుడు మాత్రము వారిపీఠిక యమూల్యమయినదని నుడువనగును. అటుపిమ్మట శాస్త్రిగారు బసవోదాహరణమును ప్రకటించి యుదాహరణ వాఙ్మయమునకే కాక శైవసాహిత్యమునకుగూడ నూతనాలంకారమును కైసేయ గలిగిరి. అంతేకాక శివకవులు ప్రయోగించిన శబ్దముల సాధుత్వాసాధుత్వములను లెస్సగ వారు చర్చించినారు. సోమనాథుని 'నయసరగడ'ను ప్రచురించియు, ఉద్భటారాధ్యచరిత్రమునకు ప్రశస్తమగు పీఠిక వెలయించియు శాస్త్రిగారు మహోపకారము చేసినారు.

## డా॥ చిలుకూరి నారాయణరావు గారు :

శ్రీ చిలుకూరి నారాయణరావుగారు కూడ శైవవాఙ్మయమునకు మహోపకార మొనర్చిన వారిలో నొకరు. వారు పండితారాధ్య చరిత్రమునకు సంతరించిన 348 పుటలుగల బృహత్పీఠిక యమూల్యమైనది. ఆంగ్లవిమర్శన విధానమును హృద్గతముచేసికొనిన వారగుటచే నారాయణరావుగారా యొరవడిన తమపీఠికను వెలయించిరి. అందు పాలకురికిసోమనాథుని నివాసస్థలము, కాలము, కులగోత్రములు, భాషావైదుష్యము, వీరశైవవాఙ్మయము, శ్రీశైలాది శివస్థలములు—మున్నగువానిని గుఱించి కూలంకషముగ చర్చించియున్నారు. వారి మతమున సోముడు హాలకురికె గ్రామవాస్తవ్యుడు. ఇది ప్రస్తుత మైసూరురాష్ట్రమునందలి తుముకూరు తాలూకాలోనిది. క్రీ. శ. 1247 నుండి 80 వఱకు సోముడు జీవించియున్నట్లు వారు విశ్వసించిరి. ఈరెండు సిద్ధాంతములు వాదోపవాదములకును, ఖండనమండనలకును పాల్పడినవి. కాని నేడీవాదములు పరాస్తమైపోయినవి, కర్ణాటకపండితులుకూడ వీనినంగీకరించుటలేదు.

శ్రీ చిలుకూరివారి యీసిద్ధాంతముల సామంజస్యము నిటచర్చించుట యప్రస్తుతము. సాహితీదృష్టితో పరికించినచో వారు కావించిన పరిశ్రమ ప్రశంసార్హమని విదితమగును. సోముని భాష, ఛందస్సులనుగూర్చి వీరొనర్చిన పరిశ్రమయు, వీరియభిప్రాయములును సంస్మరణీయములు. గ్రంథాంతమున నున్న సంజ్ఞావాచకముల పట్టికయు, ఆచ్ఛికపదముల పట్టికయు భాషాతత్త్వ శాస్త్రజ్ఞులకు మిక్కిలిగా నుపయోగపడగలవు. పండితారాధ్య చరిత్రమునం దుదాహృతములైన శివస్థలముల పట్టికకూడ నొకటి వారొసగిరి. ఆపట్టికను చూడగా శైవుల పుణ్యస్థలము లిన్నికలవా యను నాశ్చర్యము కలుగకపోదు. బహువిషయ సంభరితమయిన యీ పీఠికముఖముగ శ్రీ నారాయణరావుగారు శైవవాఙ్మయమునకు సేవచేసిరి.

## శ్రీ బండారు తమ్మయ్య గారు:

"విమర్శకాగ్రేసర, ఐతిహాసికసమ్రాట్టు" బిరుదాంకితులగు శ్రీ బండారుతమ్మయ్యగారు శైవసాహిత్య పాఠకలోకమునకు సుపరిచితులు. శైవాచారముల కనుగుణముగ జీవనము సాగించుచున్న పరమమాహేశ్వరులు. శివకవుల రచనలకు సంబంధించినయనేకవ్యాసములుపలుపత్రికలలో

వారు 1922 నుండి నేటివఱకు ప్రకటించుచున్నారు. శ్రీ తమ్మయ్యగారి బసవపురాణ పీఠిక, 'పాలకురికి సోమనాథకవి' మున్నగునవి వారిరచనలలో చాలముఖ్యములు.

బసవపురాణపీఠికలో శ్రీ తమ్మయ్యగారు సోమనాథుని జన్మస్థలము నేటి నిజామురాష్ట్రములోని జనగామతాలూకాలోని పాలకురికి గ్రామమేయని సహేతుకముగా నిరూపించినారు. ఆతడు 1160 నుండి 1240 వఱకు జీవించియుండ నోపుననియు నిర్ధరించిరి. పిమ్మట సోమనాథుని కవితావిశేషముల నుగ్గడించుచు సోముని ప్రభావము తరువాతివారగు తిక్కన శ్రీనాథాదులయందు గోచరించుచున్నదని నుడివిరి. శివకవుల ప్రభావము తరువాతివానిపై కలదనుట నిర్వివాదము.

శైవమత సంప్రదాయములను చక్కగా నెఱిగిన శ్రీ తమ్మయ్యగారు శైవమతచరిత్రమును ఆమతములోని యవాంతరభేదములను వానిధర్మములను సంగ్రహముగ వివరించి శైవేతరులకు శైవమత మననేమో తెలియజేసిరి. ఈవిషయాదికమును తెలిసికొనకున్నచో శైవవాఙ్మయస్వరూపము సుగ్రాహ్యము కాజాలదు. వీరశైవులు కూడ వేదప్రామాణ్యము నంగీకరించినవారనియు, కావున వీరశైవముగూడ వైదికమే కాని యవైదికము కాదనియు శ్రీ తమ్మయ్యగారు సాధికారముగ నిర్ణయించిరి. అందువలన మతదృష్టితో చూచినను, కావ్యకళాదృక్పథముతో గమనించినను వారి బసవపురాణపీఠిక యమూల్యమని విదితమగును. ఇటులనే సోమనాథుని జీవితచరిత్రను వర్ణించుచున్న 'పాలకురికి సోమనాథకవి' గ్రంథముకూడ విలువగలదని నుడువదగును. ఒకమాటలో—శైవమత వాఙ్మయముల స్వరూపమును గ్రహింపగోరు సాహిత్యోపాసకులకు శ్రీ తమ్మయ్యగారి రచనలు చాలముఖ్యములని పేర్కొనవచ్చును.

## శ్రీ నిడుదవోలు వెంకటరావు గారు

శైవవాఙ్మయమునకు సంబంధించిన పలు నూతనాంశములు బహిర్గత మొనర్చి యావాఙ్మయ ప్రచారమునకు తోడ్పడినవారిలో శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు కూడ సంభావ్యులు. రమారమి ముప్పదియేండ్లుగా నీవాఙ్మయమునందు వీరు పరిశ్రమించుచున్నారని వీరివ్యాసములు స్పష్టముచేయుచున్నవి. బసవపురాణ (రెండవముద్రణము) పీఠిక, వీరశైవవాఙ్మయము, పండితత్రయము మొదలగునవి వీరిరచనలలో ప్రశస్తములని నుడువదగును.

శ్రీ వేంకటరావుగారు తమ బసవపురాణ పీఠికలో నుదాహరించిన కొన్ని నూతనవిషయములు గమనార్హములు. హాల్గస్ ఫిలిప్ బ్రౌను దొరగారి శైవవాఙ్మయసేవను ప్రస్తుతించి వారు సోముని కవితావిశేషముల నుగ్గడించిరి. తొలుత సోముడు నన్నయ్య ననుకరించి పిమ్మట దేశిసంప్రదాయముల ననుసరించెను. భారతావతారికలోని 'ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని...'' అను సీసపద్యమునకు ప్రతిబింబముగ సోముడు చతుర్వేదసారమునందు "వైదికు లిది శుద్ధవైదికంబని యన—" అని రచనచేసియున్నాడు. ఈ పరిశీలన మెంతయు సోపపత్తికముగ నున్నదని పేర్కొనవచ్చును. అటులనే శివతత్త్వసారముయొక్క ప్రభావము బసవపురాణమునందు గోచరమగుచున్నదని వారి యభిప్రాయము. వాఙ్మయపరిణామ దృష్టితో వెలయింపబడిన యీ పీఠికలో సోముని యితరకృతులగు అక్షరాంకగద్య, నమస్కారగద్య, పంచప్రకారగద్య మున్నగువానిలోని ప్రారంభపరిసమాప్తి శ్లోకములను పొందుపఱచిరి.

ఇక భారతిరజతోత్సవ సంపుటమునందలి శ్రీ వేంకటరావుగారి వీరశైవవాఙ్మయమను వ్యాసము చాల అమూల్యమయినది. గద్యకృతులను జెందిన 'అంతాదిరచన'ను ఈవ్యాసమునందు ప్రకటించి తద్రచనాస్వరూపమును వారు తెలియజేసిరి. చాలకాలము వఱకు ముద్రణభాగ్యము నొందని సంస్కృత బసవోదాహరణము, అక్షరాంకగద్య, బసవాష్టకము మున్నగుకృతులను పత్రికాముఖముగా లోకమునకు శ్రీ నిడుదవోలువారు తెలియజేసి వీరశైవ వాఙ్మయమునకు మహోపకార మొనర్చిరి. వీరి 'ఆంధ్రవీరశైవవాఙ్మయ' మనుగ్రంథము ముద్రితమైనచో నీవాఙ్మయమునకు సంబంధించిన పలువిషయములు తెలియగలవు. ఇతఃపూర్వము వీరు ప్రకటించిన "వీరశైవాష్టావరణ ప్రమాణాష్టకాభరణము" (శ్రీ ఇవటూరి నందికేశ్వరశాస్త్రి గారిది) కూడ శైవమతదృష్ట్యా చూచినచో పేర్కొనదగినదే.

## డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు :

సుప్రసిద్ధచారిత్రక విద్వాంసులు శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు కూడ శైవవాఙ్మయమునకు యథోచితముగా సేవచేయుచున్న వారిలో నొకరని నుడువవచ్చును. సోముని కాలనిర్ణయ సమస్యవిషయమై వీరు డాక్టరు నారాయణ రావుగారి వాదమును సమర్థించుచు "పాలకురికి సోమనాథుఁ డెప్పటివాఁడు?" అను గ్రంథమును ఇటీవలనే రచించిరి.

## శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రిగారు :

ఆంధ్ర వీరశైవ వాఙ్మయ చరిత్రము నొక గ్రంథరూపమున లిఖియించి శ్రీ శిష్టా రామకృష్ణ శాస్త్రిగారు కూడ శైవ వాఙ్మయమునకు సేవ చేసిరి. ఈ పుస్తకమున కాంధ్ర విశ్వ విద్యాలయము వారి పారితోషికము లభించుట హర్షింపదగిన విషయము.

## శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు

సుప్రసిద్ధ చరిత్రకారులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు సోమనాథుని కాలనిర్ణయ సమస్య విషయమున ఒక శాసనాధారముతో నొక వ్యాసము ప్రకటించిరి.

## శ్రీమతి ఎమ్. ఆదిలక్ష్మిగారు

చాలకాలము దాక నాంధ్ర వీరశైవ వాఙ్మయమును గురించి విశ్వ విద్యాలయములందు పరిశోధనలు జరగలేదు. కాని నేడు శ్రీ మతి ఆదిలక్ష్మిగారు మదరాసు విశ్వవిద్యాలయమునం దీ వాఙ్మయమును గూర్చి పరిశోధింపఁ బూనుకొనుట హర్షింపదగిన యంశము. 'పరిశోధన'లో వీరు ప్రకటించిన 'తమిళ బసవపురాణ' మను వ్యాసము విలువగల రచనయని చెప్పఁదగును.

ఇంకను శ్రీ వేదము వేంకటకృష్ణ శర్మగారు మున్నగు పెద్దలు పలువురు పత్రికల వీరశైవ వాఙ్మయమునకు సంబంధించిన వ్యాసములను వెలయించుచున్నారు. ఇట్టి వాఙ్మయ శాఖలో నేడు పర్యాప్తమైన పరిశీలనము జరగుచున్నది.

శివకవుల గ్రంథములను పరిష్కరింపించి వ్యయప్రయాసల కోర్చి ప్రకటించుచున్న ప్రకాశకులను ప్రస్తుతింప దలఁచినచో నీ వ్యాసము సమగ్రముగ నుండును. కావున నా యెఱుక కందినంతమట్టుకు ప్రకాశకుల నిట పేర్కొనుచున్నాను. శ్రీ కందుకూరి భూషణరావు జమీందారు గారు బసవ పురాణమును ప్రకటించిరి. మదరాసు వాస్తవ్యులగు శ్రీ ఏడు నూతుల (Seven Wells) ముత్తయ్యగారు చెన్నబసవ పురాణము, వృషాధిప శతకములను ప్రచురించిరి. శ్రీఆరాధ్యుల వీరేలింగముగారు సానందోపాఖ్యానమును, పసుపుల నాగయోగి గారు పండితారాధ్య చరిత్రను ప్రకటించిరి. నవ్యాంధ్ర నిర్మాతయు, ఆంధ్ర గ్రంథ మాలా స్థాపకులు నగు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు గారు పండిత ప్రకాండుల విపులమయిన పీఠికలతో బసవపురాణ, పండితారాధ్యచరిత్రలను ముద్రించినారు. భాషోద్ధారక బిరుద విరాజితులగు శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రివర్యులు బసవపురాణమును ప్రచురించినారు. ఈ నడుమనే వారు అనుభవ సారమును గూడ ముద్రించినారు.

ఇటుల వీరశైవ వాఙ్మయము నెడల ఆంధ్ర ప్రజానీకము భక్తిశ్రద్ధల ప్రదర్శించుచున్నదని పేర్కొనుట యత్యుక్తి కాదు; కానేరదు కూడ.

ఉ. శ్రీ భసిత త్రిపుండ్రక పరీత విశంకటఫాలు, జూటజూ
టీ భరధారు, నిర్మల పటీ పటలావృత దేహు, నక్షమా
లాభరణాభిరాము, బసవాంఘ్రి సరోరుహ పావిత్రపక్షు, చి
న్మోహిత నేత్రు పాల్కురికి సోమయ దేశికు బ్రస్తుతించెదన్.

—పద్యబసవ పురాణం

అముద్రిత రచనలు :

# వృషభాష్టకం, అక్షరమాలాగద్య

పాల్కురికి సోమనాథకవి

పాల్కురికి సోమనాథుడు ఒక్క వృషాధిప శతకమునే కాదు, ఆంధ్ర కర్నాటక సంస్కృత భాషలలో పెక్కు బసవ స్తోత్రాలను రచించినాడు. కనుకనే 'సముదంచద్బసవ స్తవామర మహీజారామనం సోమనం' అని ఒక కన్నడ కవి ప్రశంసించినాడు. శ్రీ బండారు తమ్మయ్యగారు ఈలాటి పెక్కు స్తవ కృతులను ప్రకటించినారు. సంస్కృత లఘు కృతులు అముద్రితాలు. వృషభాష్టకం, అక్షర మాలాగద్య వాటిలోనివి.

మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో వృషభాష్టకంవి (D 9565, D 9566 D 9567 సంఖ్యలు గల) తాళపత్ర ప్రతులు మూడున్నవి. వాటిలో D 9566 వ సంఖ్య గల ప్రతి ఉన్నంతలో లేఖక ప్రమాదాలు తక్కువగా ఉన్నందున దాని పాఠాలనే ప్రధానంగా గ్రహించినాము. అక్షర మాలా గద్య తాళపత్రప్రతులు (D 9559, D 9560, D 9561, D 9562) నాలుగున్నవి. D 9561 వ సంఖ్యగల ప్రతినే ప్రధానంగా గ్రహించినాము. ఈగద్య ఐదు మాత్రల ద్విరద గతి రగడలో రచికను. ప్రకటనలో పొరపాట్లున్న సంప్రదాయజ్ఞులు మన్నించగలరని విశ్వసిస్తున్నాము.

—సంపాదకులు.

## వృషభాష్టకం

పక్షీంద్ర వాహన తపోబల సాధనీయ, సర్వేశ్వరోల్లసిత వాహన [1]లాల్యమాన,
కాపాలి రూప సముపేత పునీత దృష్టే, శ్రీ వజ్రశృంగ వృషభాధిపతే నమస్తే. 1
[2] సంధ్యా నిజాండ వశితాఖిల (?) పుణ్య తీర్థ, సర్వేశ దర్శన పరిశ్రిత శృంగమధ్య,
పాదక్రమ ప్రకటితాత్మ సుధర్మ భాగ, శ్రీ వజ్రశృంగ వృషభాధి పతే నమస్తే. 2
స్వప్రీతి కృద్వృష విసర్జన భూరిపుణ్యే, ఏకాదశే హని యమాలయ గామి జంతోః,
ప్రేతత్వ మోచన విధిజ్ఞ దయాంబు రాశే, శ్రీ వజ్ర శృంగ వృషభాధిపతే నమస్తే. 3
కైలాస శైల కనకాచల మందరాద్రి యాత్రాసు, శంకర మనోహర చిత్రయాన,
దోర్దండవేత్ర విహితేశ మనోగతార్థ, శ్రీ వజ్రశృంగ వృషభాధిపతే నమస్తే. 4
నందాది గోనికర లబ్ధ సమస్త ధేను సంతాన పోషిత సురాసుర మర్త్యలోక,
స్వాకార కైటభ రిపూద్ధృత [3]వీరదేహ, శ్రీ వజ్రశృంగ వృషభాధిపతే నమస్తే. 5
శుద్ధ స్వభావ శివభావజ శుద్ధ రూప, సచ్ఛంఖహార ఘనసార సమాన వర్ణ,
సద్భక్త యోగపద దేశిక చక్రవర్తిన్, శ్రీ వజ్రశృంగ వృషభాధిపతే నమస్తే. 6
యోగీంద్ర హృత్కమల వేదశిరో[4] విభాతే, శ్రీమచ్ఛివైక[5] పదఘృష్ట విశాల[6] దేహ,
పర్యాయ భర్గవశధర్మ జితేంద్రియౌఘ, శ్రీ వజ్ర శృంగవృషభాధిపతే నమస్తే. 7
ప్రాప్తావతార ఖల దుస్సహ దోష[7] శాంత్యై, లోకైక పాలన లసద్బసవాభిధాన,
దృష్టశ్రుతప్రకటితేశ్వర భక్తిసార, శ్రీ వజ్రశృంగ వృషభాధిపతే నమస్తే. 8
పాల్కుర్కి సోమ రచితం వృషభాష్టకం యః, స్తోత్రం శృణోతి [8]పఠతే [9]హార నిశ్చితార్థ,
సో శాశు యాతి వృషభాధిపతి ప్రసాదా ల్లబ్ధేశ శుద్ధపద భక్తి ఫలా దభీష్టం. 9

(తరువాయి మూడవ అట్టలో)

1. రాజమాన 2. సంధ్యాసమయంలో వృషభుని అండంలో సకల తీర్థాలు వసిస్తాయనే సంప్రదాయ గాథను చెప్పడం కవి వివక్ష. కాని వశిత అనే రూపం సాధువు కాదు; ఉషిత కావలసి వస్తుంది. 'సంధ్యా నిజాండ ఉషితాఖిల పుణ్య తీర్థ' అంటే ఏకదేశాన్వయంలో అపార్థం ఏర్పడుతుంది. 3. వీరదేహ (?) 4. విభావి 5. వైక్య 6. దేశ. 7. శాంతేః, శాంతే 8. పఠ ధాతువు ఉభయపది కాదు, పరస్మైపదిమాత్రమే. కాని సోమన స్వతంత్రించి ప్రయోగించి నాడనే భావించ వలసి ఉంది. 9 హారి

# సోమన సృష్టించిన ఛందస్సు

శ్రీ నిడదవోలు వేంకటరావుగారు

[నేడు 'ద్విపద' అని వ్యవహృత మవుతున్న అనూచాన ఛందస్సుకు 'ద్విపద' అని పేరుపెట్టి ప్రాచుర్యం పొందించిన వాడు పాల్కురికి సోమనాథుడు. ఆంధ్రావళి నాలుకపై నాట్యమాడుతున్న ఈఛందస్సు వేదంలోని "ద్విపద" వలె పవిత్రమైనది, ప్రాచీనమైనది సుమా అన్నట్లు 'ద్విపద' అని విలక్షణమైన పేరుపెట్టినాడు సోమన. కొందరు ఊహిస్తున్నట్లు ఈ ద్విపదకు ప్రాకృతంలోని ద్విపదితోను, హిందీలోని దోహాతోను పొత్తు లేదు. ఇదొక స్వతంత్రమైన తెనుగు దేశి ఛ్ఛంధస్సు. ఈ విషయాన్ని సప్రమాణంగా నిరూపిస్తున్న శ్రీ నిడదవోలు వేంకటరావుగారి ఈ వ్యాసాన్ని 'పరిశోధన' పాఠకులు హర్షిస్తారని విశ్వసిస్తున్నాము.

—సంపాదకులు.]

పాల్కురికి సోమనాథకవి తెనుగు వాఙ్మయమున మొట్టమొదట ద్విపద-ఛందస్సులో కావ్యరచన సాగించి కేవల గేయరూపముగా నున్న ఆఛ్ఛందస్సునకు సాహిత్యగౌరవమును కల్పించి, ఆంధ్ర ద్విపద కావ్యావతరణమునకు భగీరథుఁడైనాఁడనుట విమర్శకు లందఱు నైక్యకంఠముగా నంగీకరించినదే. సోమనాథుని బసవపురాణ పండితారాధ్య చరిత్రలవెనుక, నదే ఛందస్సులో తిక్కన యుగమున రంగనాథరామాయణ మనుప్రసిద్ధకృతి రచితమగుటగూడ సర్వజనవిదితమగు విషయమే. దీని వలన రంగనాథరామాయణమున కన్న ముందే సోమన కావ్యములు ప్రసిద్ధములై యుండుట స్పష్టము కదా. రంగనాథరామాయణము శాసన ప్రమాణములనుబట్టి క్రీ. శ. 1240 ప్రాంతమున రచితమైనదని శ్రీపింగళివారు నిర్ణయించినారు. కావున సోమనాథుడు 1240 పూర్వమే ప్రసిద్ధుఁడై గ్రంథరచన గావించెననుట నిర్వివాదమగుచున్నది. సోమనాథుఁడు ఇటీవలి విమర్శకులన్నట్లు 1240-1320 ప్రాంతమువాఁడే యైనచో రంగనాథరామాయణము తొలి ద్విపద కావ్య మగును. అట్లైన తర్వాత రచితములైన తనకావ్యములలో సోమనాథుఁడు ద్విపద ఛందస్సును సమర్థించుకొనుట యసభ్యమగును. కావున అప్పుడు సోమనాథునికాలము ప్రప్రథమముగా పరిశోధకులు నిర్ణయించిన 1160-1240 ప్రాంతమగుచున్నది. నేఁడు సోమనకాలము క్రీ. శ. 1280-1340 ప్రాంతమని 'సోమనాథుఁ డెప్పటివాఁడు' అను గ్రంథమున తెలుపబడినది. ఇది చారిత్రకదృష్టినే కాక సాహితీ పరిణామదృష్టిని, వాఙ్మయపరిణామ దృష్టిని గూడ సప్రమాణికము, నసంబద్ధము నగుచున్నది. ఈ గ్రంథకర్త మతము ననుసరించి ద్విపద కావ్యములలో రంగనాథరామాయణమే మొదటిదియై సోమనాథుని కృతులు తరువాత రచితములైనట్లు తేలుచున్నది. సోమనాథునికాలము నిర్ణయించుటకు సాహిత్య సంప్రదాయములను, భాషా వాఙ్మయపరిణామమునుకూడ దృష్టిలో నుంచుకొన వలసియున్నది. ఈ విషయమును విస్మరించుట వలననే సోమనాథుని కాలమును గూర్చి క్రొత్త ఊహాలు బయలుదేరినవి. సోమనాథుని కృతులలో ద్విపదఛ్ఛందస్సున కావ్యము రచించుట సమర్థింపబడినది. తత్పూర్వమే రంగనాథరామాయణము రచితమైనచో నిట్టి సమర్థనకు హేతువు లేదు. పైగా భాషను రచననుబట్టి గూడ సోమనాథునికృతులు ప్రాచీనము లని నిరూపింపవచ్చును. ఈ యంశములను బట్టి రంగనాథరామాయణ రచనాకాలము నిదమిత్థమని నిర్ణయించక సోమనాథుని కాలమును గూర్చి ప్రస్తావించుట సరియైన పద్ధతికాదు,

ఆంధ్రవాఙ్మయమున ద్విపదకావ్యోత్పత్తికి కారణభూతుఁడైన పాల్కురికి సోమనారాధ్యుఁడు-అతి ప్రాచీనమును, వైదిక ఋక్ఛందో విశేషమునగు ద్విపదిని, వైదికానంతరకాలికమును లౌకిక మాత్రాఛ్ఛందో విశేషమగు ద్విపదను, సమ్మేళనముగావించి లక్షణ సమన్వయముచేసి, 'ద్విపద' పదమునే సాహిత్యప్రపంచమున చిరస్థాయిఁ గావించినాఁడు. ద్విపదను మార్గ్వరాని యతిస్థానమున ప్రయోగించి యాపదమునందలి యర్థసారస్యమునుగూడ నందు నిరూపించి యున్నాఁడు.1

"......ఆదిప్రాసనియతి
తప్పకుండఁగ ద్విపదలు రచియింతు.
ద్విపదాంబురుహములు ధ్రుతిబసవేశు
ద్విపదాంబురుహము లతిప్రీతిఁ బూన్తు."

ద్విపద అనఁగా రెండుపదములు. ద్విపద- అనఁగా రెండు పద్యపాదములు. ద్విపద= పుం. ద్వే పదేయస్య అనియు, పద-న పద. అచ్- చిహ్నే, స్థానే, ఉద్యమే, త్రాణే, వస్తుని, శబ్దభేదే (సుప్తిఙంతరూపే), ప్రదేశే, శ్లోకపాదేచ అని సంస్కృత కోశములు తెలుపుచున్నవి. పదశబ్దమునకుఁ గల పద్యపాదార్థమును గ్రహించి సోమనాథుఁడు ద్విపదాంబురుహములు అని శ్లేషించియున్నాడు. ఇంతకంటెను మనోహరముగా, పదమునకుగల స్థానము ప్రదేశము అనునర్థములను పురస్కరించుకొని, "ఐహికాముష్మిక ద్విపదహేతు వగుట ద్విపద నాఁగఁబరగు" అను నిర్వచనమును సోమనాథుడు స్వయముగా సృష్టించినాడు-ఈయర్థమున భావము గంభీరోదాత్తమై యున్నది.

ఆంధ్రలక్షణ గ్రంథములలో కావ్యాలంకార చూడామణియందు 'ద్విపద'కు బదులుగా 'ద్విపది' యని ప్రయుక్తమైనది. సంస్కృత నిఘంటువుల ననుసరించిచూడఁగా, దీని కర్థభేదము కన్పట్టుచున్నది. వైదిక వాఙ్మయమున ఋక్కున కర్థమైనపుడు 'ద్విపద' యనియు మాత్రాఛ్ఛందో విశేషమున కర్థమైనపుడు 'ద్విపది' యనియు నందు వివరింపబడి యున్నది.

ద్విపదా=స్త్రీ-ద్వౌపాదావస్యాః-పాదస్యాన్త్యలోపః-టాప్-భత్వాత్పదాదేశః ఋగ్విశేషే ఛందోభేదే ఙీప్-ద్విపదీ-(శబ్దస్తోమమహానిధి.)

ద్విపదా=స్త్రీ - ఋగ్విశేషే - ద్వౌపాదావస్యాః-సంఖ్యాసు పూర్వస్యేతి పాదస్యాన్త్యలోపః-టాబృచీతి టాప్-పాదఃపత్.

ద్విపదీ=స్త్రీ - మాత్రావృత్తాంతరే - ఆదౌ షట్కల సంగత మేత త్తదనుపంచ చతుష్కలమ్, గుర్వంతమ్ ద్విపదీ భవతీహ వింశత్యష్టకలం దలమ్."—(శబ్దార్థచింతామణి.)

ఇంకను సంగీతశాస్త్రగ్రంథములలో "ద్విపదగము" "ద్విపది" యనుపేళ్లు కన్పట్టుచున్నవి.

సంస్కృతే యే ద్విపదగాః
ప్రాకృతేదోహకాశ్చ తే
అభీష్ట మాత్ర తాళః స్యా
దాభోగోఽన్యపదైః కృతః
స్వరై ర్న్యాసో విధాతవ్యః
తాళమాన ద్వయేనవా —[జగదేకః]

ద్విపదగస్య పారసాదిభేదా స్సప్త వర్తంతే. సంగీత చూడామణౌ స్పష్టంద్రష్టవ్యమ్.

త్రయో గణా గురుశ్చాంతే
ప్రథమేథ తృతీయకే
ద్వితీయే చ తురీయే చ
ద్వౌ గణౌ ద్వౌగురూ తథా
జగణో నాత్ర కర్తవ్యో
భాగాంతే యమకం భవేత్
ఇతి ద్విపదగం నామా
తస్యోదాహృతిరుచ్యతే
గాతవ్యః స్వరసంయుక్త స్తాలేన పరివర్జితః
ప్రబంధోద్విపదాభిఖ్యో గీతవిద్యావిశారదైః
[సోమేశ్వరః 290-291 పుట.]

ద్విపదీ-ప్రబంధః—
శుద్ధద్విపదకా పూర్వా
పూర్ణద్విపదికే తతః
మానవీచంద్రికాచాథ
స్మృతి స్తార స్తతః పరమ్
గేయ మష్టప్రకారోఽయం
అస్య లక్ష్మాథకథ్యతే [జగదేకః]

అత్ర భేదాః-శుద్ధ ద్విపదీ, పూర్ణ ద్విపదీ, మానవీ చంద్రికా, స్మృతిః, తారం, సంచారిణి, మనోహారిణీతి గమ్యంతే.

కరణాఖ్యేన తాలేన
గాతవ్యో గమకాంతరే
ఆభోగో న్యపదైఃకార్యో
న్యాసస్తాలాద్విమానతః
ద్విపదీ చ భవేదేవం —[హరిపాలః]
షట్కలో గణ ఆద్యస్య
తతః పంచచతుష్కలాః
అంతే గురు ర్ద్వితీయే జః

1. పండితారాధ్యచరిత్ర అవతారిక.

షష్ఠే చ ద్విపదీ తు సా
పాదద్వయాంతే కర్తవ్యః
స్వరన్యాసోయథోచితః
ఏనకేనాపి తాలేన
గాతవ్యా ద్విపదీ బుధైః [సోమేశ్వరః]

పై యుదాహృతుల ననుసరించి, ద్విపద చ్ఛందస్సు చాల ప్రాచీనమైనదనియు, నది గేయ విశిష్ట మగుటచే సంగీత శాస్త్రమున కూడ లక్షణములు చెప్పఁబడినవనియు సంస్కృతమున నది ద్విపది, ద్విపదగ, ద్విపదా, ద్విపద యను పేళ్ళతో వ్యవహరింప బడెననియు, నేది సంస్కృతమున ద్విపదగ యని చెప్పబడు చున్నదో, అదియే ప్రాకృతమున 'దోహా' అని యందురనియు స్పష్టమగు చున్నది.

సంస్కృతమున ద్విపద చ్ఛందస్సు వాడుకలో లేదు. కావ్యముల యందును ప్రయుక్తము కాలేదు. ఛందశ్శాస్త్రమున సంస్కృతము నుండి పెక్కు వృత్తముల గ్రహించిన కన్నడ భాషలో లేదు. పేళ్లు సంస్కృతమైనను, గణనియమములలో సంస్కృతము ననుసరించినను, కొన్ని ఛందస్సులు తెలుగున ప్రత్యేక విశిష్ట స్వరూపమును దాల్చి యవి దేశీయ చ్ఛందస్సులుగానే పరిగణితము లగు చున్నవి. ఇంతయేల, తెనుగు భాషలోఁగల యతి ప్రాసలు సంస్కృత భాషలో లేవు. వృత్తము సంస్కృతమే యైనను, యతిప్రాస లక్షణము కలిగి యుండుటచే దానిని తెనుఁగు పద్యముగానే మనము పరిగణింతుము. అక్షర గణ ప్రధానములగు వృత్తములే పై లక్షణములచే, 'తెలుగు' అనిపించు కొనుచుండగా మాత్రాగణ ప్రధానములగు సీసము, తరువోజ ద్విపద మొదలగు జాతి వృత్తములు దేశీయములని దేశిచ్ఛందస్సులని పూర్వులు వ్యవహరించుట సమంజసమే కాక శాస్త్రీయము సై యున్నది.

పై కారణముచేతనే పేర సంస్కృతమైనను యతిప్రాసలను నాంధ్ర భాషాలక్షణము నది గలిగియుండుటచే దేశీయ చ్ఛందస్సుగానే పరిగణితమైనది. తెలుగు ప్రత్యయముల మూలమున, యతిప్రాసలమూలమున, సంస్కృత పదము లేవిధముగా తెలుగు భాషగా వ్యవహృతము లైనవో, ఆ విధముగే, కేవలము సంస్కృతీయములగు ఛందస్సులు కూడ తెలుగు భాషా లక్షణ లక్షితములై, కేవల దేశీయములగు ఛందస్సులతో సమ్మేళము జెంది తెలుఁగు చ్ఛందస్సుగా వ్యవహృతములైనవి.

ఇక నాంధ్ర చ్ఛందస్సునకు ద్విపద ప్రాతిపదిక-రెండు పాదములుగల ద్విపద నొక దానితో నొకటి కలిపిన నది తరువోజ పాదమగును. తరువోజయందు నాల్గు పాదము లుండును. ఆ తరువోజయే తరువాత 'సీస' రూపమును దాల్చినది. నాల్గు పాదములుగల ఛందస్సునుండి, నాల్గు పాదములుగల చంపకోత్పల మాలికాది వృత్తరచన లేర్పడినవి. ఈ విధముగా ద్విపద నిశ్చితముగా దేశి ఛందస్సు కాగా, డాక్టరు నేలటూరి వేంకట రమణయ్యగారు ద్విపద దేశి ఛందస్సు కాదనియు, నిది ప్రాకృతమునుండి యెరవు తెచ్చుకొనినది యనియు నిట్లు వ్రాసి యున్నారు:

"ప్రాచీనయక్షగానములందు ప్రధానముగ గానశచ్చు ఛందస్సు ద్విపద. ప్రారంభదయం దిది సంపూర్ణముగ ద్విపదరచనయైయుండిన నుండవచ్చును. మనవారనుకొనునట్లు ద్విపద దేశి ఛందస్సు కాదు. అది ప్రాకృతమునుండి యెరవు తెచ్చుకొన్నది. ద్విపదయన రెండు పాదముల ఋక్కనియు గలదు. మఱియు మహాకవి కాళిదాసుడు విక్రమోర్వశీయందు చతుర్థాంక ప్రారంభమున

[తతః ప్రవిశతి సహజన్యా చిత్రలేఖా చ]
చిత్రలేఖా :—(ప్రవేశానంతరమ్ ద్విపదికయా దిశోవలోక్య.)

దీనిగూర్చి వ్యాఖ్యాత ఇట్లు వివరణము వ్రాయుచున్నాడు. ద్విపదికయాదిశోవలోక్యేతి! ద్విపదికాఖ్య గీతవిశేషణ దిగవలోకనం విధాయాగ్రిమాం గాథాం పఠతీత్యర్థః. దిశోవలోక్య ద్విపదికాఖ్య గీత్యా వదతీత్యర్థోవా.

ఇందువలన కాళిదాసుఁడు ద్విపదిక యను గీతము నీసందర్భమునఁ జేర్కొనెననుట తెల్లము. ఈద్విపదికలక్షణమును వ్యాఖ్యాతయిట్లు వివరించి యున్నాఁడు:

తల్లక్షణం చాహ భగవాన్ భరతమునిః:
శుద్ధా ఖండాచ మాత్రాచ సంపూర్ణేతి
చతుర్విధా.
ద్విపదీ కరణాఖ్యేన తాలేన పరిగీయతే

పాదే చ పఞ్చభాగో న్తైన జౌ షష్ఠద్వితీయకౌ
చతుర్భిరీదృశైః పాదైః శుద్ధాద్విపదికోచ్యతే
అర్ధాంతే న్యే స్వరానాహుః
ఖణ్డాస్యాచ్ఛుద్ధయార్యయా
షష్ఠే నైకేనగురుణా మాత్రా ద్విపదికామతా
జ్ఞేయా శుద్ధేవ సంపూర్ణా గురుణాన్తే
ధకేన తు.

పైనిచెప్పిన ద్విపదికయే మన ద్విపదయైనది"

(యక్షగానము-తంజావూరు 1951-52 ఖర సంవత్సరాదిసంచిక 17-32 పుటలు.)

సంస్కృత ద్రావిడాంధ్ర కర్ణాట ఛందస్సులలో ప్రత్యేకవిశిష్టతగలది యాంధ్రఛందస్సు; పదపద్యకవితలకు, సంగీత సాహిత్యములకు, స్వరవర్ణములకు సంపూర్ణసామరస్యము సమకూర్చునది తెలుగుఛందస్సు. ఈవిశిష్టత నైసర్గికమగు ద్రవిడభాషా ఛందస్సంప్రదాయములను, సంస్కృతచ్ఛంద సంప్రదాయములను సమ్మిళితములై, కాలక్రమమున పొందిన పరిణామము వలన గలిగినదిగాని ప్రాకృతభాషా ఛందస్సుల వలన నెంతమాత్రమును కాదు. అందును ద్విపద దేశీయ మగునప్పుడు, ప్రాకృతమునుండి ఎరవు తెచ్చుకొనుటయేమో దురూహముగ నున్నది. ఎరవుతెచ్చుకొన్న యాఛందస్సునకు 'ద్విపద' యను సంస్కృత నామమెట్లు సిరమైనదో వారు చెప్పలేదు. 'దోహా' యను ప్రాకృత భాషా నామముతో నేయాంధ్ర లక్షణ కారుడును దీనిని పేర్కొనలేదు. ఆఛందస్సునకు, దీనికని సంబంధములేదు. ఇంతేకాకవారు 'ద్విపదిక' ద్విపదయైనదని వేలొక సిద్ధాంతము చేసినారు. ఇది యాపాతరమణీయము. వారుదాహరించిన ద్విపదిక నాలుగుపాదములు గలది. నాలుగుపాదములుగల ద్విపదికనుండి రెండు పాదముల 'ద్విపద' పుట్టినదని వారియాశయము!

అట్లయిన నింతకంటె ఛందస్సంప్రదాయ విరుద్ధమగు నంశము వేఱొకటిలేదు. తెలుఁగున రెండుపాదములుగల ఛందస్సులనుండి నాలుగు పాదములుగల ఛందస్సులేర్పడినవికాని నాలుగు పాదములుగల ఛందస్సునుండి రెండుపాదములుగల ఛందస్సు లేర్పడలేదు. తెలుఁగు ఛందః ప్రస్తారము, ఛందః పరిణామ వ్యవస్థ తెలిసినవా రెవ్వరును నిట్టి సిద్ధాంతములను చేయరు,

ఇక పాల్కురికి సోమనాథుఁడు తన గ్రంథములలో ద్విపదనుగూర్చి చెప్పినవి, వానికి లక్షణసమన్వయము, అతఁడు ద్విపదకు కావ్యగౌరవము నిచ్చియు నెట్లు దానిని విశిష్ట గేయకృతిగా దిద్దితీర్చినది దిఙ్మాత్రముగాఁ జూపుచున్నాను.

బసవపురాణమున సోమనాథుఁడు ద్విపదను గూర్చి యిట్లు చెప్పియున్నాఁడు:

"ఉరుతర గద్య పద్యోక్తులకంటె
సరసమైపరగిన జాను తెనుంగు
చర్చింపఁగా సర్వ సామాన్యమగుటఁ
గూర్చెద ద్విపదలు కోర్కిదైవాఱఁ
దెలుఁగుమాట లనంగవలదు: వేదముల
కొలఁదియకాఁ జూడుఁ డిలనెట్టులనిన
బాటి తూమునకును బాటియానేనిఁ
బాటింప సోలయుఁ బాటియకాదె
అల్పాక్షరముల ననల్పార్థరచన
కల్పించుటయకాదె కవివివేకంబు."

ద్విపద వైదికచ్ఛందస్సు. వైదికవాఙ్మయములో ద్విపదాగాయత్రీ-ద్విపదాజగతీ-ద్విపదా శతబృహతీ- ద్విపదాత్రిష్టుప్ - ద్విపదావిరాట్ అను ఛందస్సులు కానవచ్చుచున్నవి. ఇందు ద్విపదాశబ్దము దీర్ఘాంతము. ఈద్విపద కేవలము వైదిక చ్ఛందస్సు కావుననే తత్స్వరూపమగు తెలుఁగు ద్విపదను సోమనాథుఁడు 'వేదముల కొలఁదియకాఁ జూడు'డని హెచ్చరించినాడు. మఱియు వేదములు ఋషులు గానము చేసినవి. అట్లనే తెలుఁగు ద్విపదలు- గానయోగ్యములు. తెలుఁగుకవులు ఋషులే, కావున వారుగానము చేసినవి తెలుగు వేదములు.

ద్విపదలక్షణమును సోమనాథుఁడే పండితారాధ్య చరిత్ర కృత్యవతరణికలో నిట్లు తెలిపి యున్నాఁడు:

"జాతులు మాత్రాను సంధాన గణ వి
నీతులుగాన "యనియతిగణై"ర [ర్వా'య
నియును "బ్రాసోవా" యనియు 'యతి
నియుఁజెప్పు ఛందో వినిహితోక్తిగాన
ప్రాసమైనను యతిపై వడియైన
దేసిగానిలిపి యాదిప్రాస నియతి
తప్పకుండఁగద్విపదలు రచియింతు."

జాతులు మాత్రాగణములచే నేర్పడుచున్నవి. ఆ గణము లనియతములు: యతులైనను, ప్రాస

లైనను వాని యందుండవలెను. ఇది సామాన్య జాతి చ్ఛందస్సు లక్షణము.

ద్విపద జాతులలో చేరినది. ఇందు మాత్రాగణములైన ఇంద్రగణములు, సూర్యగణములు ప్రయుక్తములగును. మూడింద్రగణములు, ఒక సూర్యగణముచేర్చిన ఒకపాదమగును. ప్రతి పాదమునకు రెండవగణముమీద యతియుండును. ఒక్కొక్కపాదమున కొక్కయతియే యుండును. అట్టి పాదము, వేఱొకటి దాని క్రింద వ్రాసిన నవి రెండుపాదములగును. ఆరెండింటిని యనుసంధించునది ప్రాస. అట్లు ఏక ప్రాసముచే ననుసంధింపబడిన రెండుపాదములు గల ఛందో విశేషమునకు ద్విపదయని పేరు.

మన ఛందో గ్రంథములలో ప్రాచీనమగు కవిజనాశ్రయమున నీద్విపదలక్షణము సోమన చెప్పినదాని ననుసరించియే యున్నది.

"ఇంద్రగణములు మూఁడినగణం బొకటి
చంద్రాస్య ద్విపదకుఁ జనుఁ జెప్పరేచ."

—జాత్యధికారము

పెద్దిరాజు కావ్యాలంకార చూడామణిలో ద్విపదల లక్షణమిట్లు చెప్పఁబడినది.

"శక్రత్రయంబును సవితృండుఁ బాద
విక్రీడితులు మృదు ద్విపదికి నెపుడు
వళియుఁ బ్రాసంబును వలయుఁ దీనికిని"

ఇట ద్విపదకు "ద్విపది" యను పదము ప్రయోగించి యున్నాడు. మఱియు దీని కను వెంటనే, 'మంజరి' యను ద్విపద ఛ్ఛందో విశేషమునకు లక్షణము చెప్పి యున్నాఁడు.

"వలదు ప్రాసంబంద్రు వరుస మంజరికి"

ప్రాసము లేకుండ రెండు పాదంబులయందు యతియే పాటించిన నది మంజరి యగును.

మన ఛందో గ్రంథముల ద్విపద లక్షణము లిట్లున్నను, సోమనాథుఁడు పై లక్షణములో

"ప్రాసమైనను యతిపై వడియైన
దేసిగా నిలిపి యాది ప్రాసనియతిఁ
దప్పకుండఁగ ద్విపదలు రచియింతు"

అని చెప్పి, ద్విపదలయందు ప్రాసయతి పాటింప వచ్చునని నిర్ణయము చేసియున్నాడు.

యతి అనగా కేవలము విశ్రమస్థానము మాత్రమే. సంస్కృతమున యతి కలదు. కాని యది కేవలము విచ్ఛేదక సంజ్ఞయగు విశ్రమ స్థానమే. అనగా పద్య పాదమంతయును నేకముఖముగా చదువునపుడు కొంత శ్రమాపాదకముగా నుండును గాన, శబ్దోచ్చారణను నిలుపు స్థలము యతి యని యర్థము. కాని తెలుగు భాషలో నట్లుకాదు. తెలుఁగు పద్యము చదువునపుడా విశ్రమస్థానమున, మొదటనే యక్షరముతో నేస్వరముతో ప్రారంభింతురో, ఆ సర్వముగాని, అక్షరముగాని, సజాతీయ స్వర, వర్గాక్షరములు నియతముగా వచ్చితీరును. దీనికి వడి యనిపేరు. సోమనాథు డీ సందర్భమున, తాను కేవలము సంస్కృత భాషా సంప్రదాయానుసారముగ యతి మాత్రమే పాటించుట లేదనియు, నాంధ్ర భాషానుసారముగ తుల్యాక్షర, తుల్యస్వర విశేషములను పాటించెద ననియు, దానికి తోడు ప్రాసయతిని కూడ పాటించెద ననియు తెలిపి యున్నాఁడు.

## ప్రాసయతి - గేయలక్షణము

ద్విపదలో ప్రాసయతిని సోమనాథుఁడు కొంత ప్రత్యేకత పాటించుటకే యుపయోగించినా డనవచ్చును. మొదటిది - పంక్తి ఛ్ఛందస్సు వఱకు పద్యములో ప్రాసలేగాని యతులుండవు. ఆ ఛందస్సులలోని పాదములకు అక్షరములు మాత్రమే యుండును. క్రమముగా ఛందస్సుల యందు పాదములు పొడవు లగుచున్న కొలదిని చదువునపుడు, మధ్యవిశ్రాంతి కావలసివచ్చును అట్టి ఛందస్సులు వాడుకలోనికి వచ్చునపుడు యతు లేర్పడినవి. ద్విపద పాదము చిన్నది యయ్యును, సోమనాథుడు ఛందః పరిణామమునందలి యొక ఘట్టమును చారిత్రకముగ స్మరింప జేయుటకు తన కాలమున లేక పోయినను వడిని నెలకొల్పినాఁడు. ఇందువలన నాంధ్ర చ్ఛందశ్శాస్త్రమున నాతనికిఁగల నిగూఢ పాండిత్యము వ్యక్తమగు చున్నది.

రెండవది- ద్విపద కవితకు సంబంధించిన గేయరచనయేకావున, ప్రాసయతి పాటించిన తాళలయానుగుణ్యముగ నుండి శ్రవణ పేయముగ నుండును.

"నిక్కమెట్లన విను మొక్క విన్నపము
ముక్కంటి నీవు నేదక్కిన బంట"

—పుట 138

పై ద్విపదలలో ప్రాస యతి యుండగానే

తాళము పడుటకు వీలుగనుండును. నిక్క మె ట్లనిన విను నే విన్నవింతు" అని యతియుండిన తాళగతి కనుకూలముగ నుండదు. ప్రాసయతి యెట్లు తాళగతి కనుకూలముగ నుండునో సంగీత సాహిత్య కళాసార్వభౌముడగు భట్టుమూర్తి వసుచరిత్రమున సీస పద్యములలో చూపియే యున్నాఁడు.

1. ఒక చాయ ననపాయ పిక గేయ
2. లలనాజనాపాంగ వలనావస దనంగ

పై వాని యందలి ప్రాసయతులు తాళాను గతి కొఱకే ప్రయుక్తములైనవి.

మూడవది—ఏక కాలమున బహుసంఖ్యాకులైన ప్రజలచే కావింపబడు క్రియలను, కార్య వ్యగ్రత యందలి యభినివేశము, ఉత్సాహము మొదలగు భావములను మనస్సులను హత్తుకొని పోవునంత గాఢముగాను, కన్నులకు గట్టునంత విశదముగాను, రసానుగుణ్యముగాను చేయుటకు ప్రాస యతిని సోమనాథుఁడు బహుసమర్థతతో నుపయోగించినాఁడు. శ్రీశైల యాత్రలో నక్షత్ర పర్వతారోహణము మిక్కిలి కష్టతర మగునది. అచ్చట యాత్రికులయొక్క యవసను ప్రాసయతి మూలమున నెంతగా చిత్రించి రసభావన కలిగించినాడో చూడుఁడు:

కట్టలు గట్టి నక్షత్ర పర్వతము
బిట్టు గలఁగ నొక్క పెట్టునఁ గూడి
పర్వతాగ్రం బెల్ల పథమునా నెరవి
పర్వతయ్యా ! మమ్ముఁ బాలింపు మనుచు
మొక్కుచు, నీడలఁ జిక్కుచుఁ, బండ్లు
మెక్కుచు, లీలల నుక్కుచు, దిన్నె
లెక్కుచు, ఊలకు స్రుక్కుచు, సెలలఁ
జిక్కుచుఁ, దెరువుల మక్కుచుఁ, జలువఁ
ద్రొక్కుచుఁ, దాపంబుఁ దక్కుచు, స్వాత్మఁ
జొక్కుచు, జనిచని నిక్కుచు, గిరులు
చూచుచు, సుకృతముల్ నోచుచు, భవముఁ
బాచుచు, జము తలఁ దాచుచు, లీల
నేచుచు, మార్గముల్ గాచుచుఁ, బరుసఁ
ద్రోచుచుఁ, బడి బడి లేచుచు, వ్రతులఁ
బ్రోచుచుఁ, జేతుల వీచుచు, భట్ల
రాచుచుఁ, గూకలు వైచుచుఁ, దరులఁ
దూఁగుచు, నుయ్యల లూగుచు, శ్రమము
లీఁగుచుఁ, బూఁదేనెఁ దోగుచు, ఁజలికిఁ
జేఁగుచు, నెండలఁ గ్రాఁగుచుఁ, బ్రియల
నాఁగుచు, మదిఁ జెలఁ రేఁగుచుఁ, బ్రీతి
వీఁగుచు, మఱుఁగులఁ డాగుచు, గముల
మూఁగుచు, మెల్లన నేఁగుచు, బొదలు
దూఱుచుఁ, గ్రంతలఁ బాఱుచుఁ, దరులఁ
జాఱుచు, జన లేక చీఱుచు హితుల
దూరుచు నట గూడఁ జేరుచు వారిఁ
గూరుచు......

ఇట్లు 44 పంక్తులు - ప్రాసయతులతో నున్నను నవి విసువు కలిగింపవు సరి కదా: గేయ రచనా సౌందర్యమునకుఁ దోడ్పడు చున్నవి. మఱియు నిట్టి రచన జీవముతో తొణికిస లాడుచుండును. పై పాదములలో కొన్ని పంక్తులలో క్రియలు మాఱుచుండుట చేత, క్రియ మారినప్పుడెల్ల కొంత మంది, మొదటి వారు పాడిన భాగమునుమాని, తిరిగి తాము, కథానూత్రము తెగి పోకుండ పాడుటకు తగిన వీ లేర్పడినది. భాష యంతయు స్వాధీనమైన మహాకవి తప్ప యిట్టి రచనలను తక్కినవారు చేయఁ జాలరు.

సోమనాథుని ప్రాస యతి సంప్రదాయ మును దాని యర్థమును తరువాతి వారు గ్రహింపఁ జాలకపోయిరి. అనంతుఁడు మంజరీ ద్విపదలలో ప్రాసయతి వాడ కూడ దను నియమము చేసి యున్నాఁడు.

"శ్రీమందిరాకార జితదైత్య ధీర

* * * *

కీర్తించుచోఁ బుణ్యావ రనుండనుచు"

అనంతు ననుసరించి తాళ్ళపాక చిన్నన్న ద్విపదలలో ప్రాసయతిని నిరసించియున్నాఁడు. ద్విపద గేయ కృతియైనను దానికి కావ్యత్వ గౌరవ మాపాదించిన వాఁడు సోమనాథుడు. కాబట్టి శైలియందు ఓజోగుణమును చూపుట కొక్కచో సంస్కృత సమాస బంధురము గావించి యున్నాడు.

1. ఏకపాద సమాసములు :—

"శ్రీశైవ సమయదేశిక చక్రవర్తి
పాశ విమోచన పటు కళామూర్తి"

ద్విపాద సమాసములు :—

"సరస శశ్వద్భక్తి సామ్రాజ్య రాజ్య
వరపట్ట భద్ర భాస్వర ఫాలతలుఁడు
దరహాస చంద్రికా దామాభి రామ
వరకళా సంపూర్ణ వదన చంద్రుండు

బసవ పాదాంభోజపరివర్ధమాన
విస్ఫుమరాంచిత హృదయ సరోవరుండు"

చతుష్పాద సమాసములు :—

"సారసద్గురు దృగంచల వినిర్యద్ద
యారస పూరి తాయత జల జనిత
వర వీరభక్తి సద్వాసనా యుక్త
సరస స్వకీయ లోచన పద్మయుగుఁడు"

షట్పాద సమాసములు :—

"......తత్కర్మ భాగైక పూర్వ
పక్షేతర జ్ఞాన భాగసిద్ధాంత
పక్ష వేదాంతోప పాదిత పరమ
శైవాత్మ కాచార్య సంసిద్ధ శుద్ధ
కేవల భక్తి సద్భావనోపేత
వీర మాహేశ్వ రాచార మార్గాను
సారియై......"

సప్తపాద సమాసములు :—

"కుందేందు చంద్రికా గోక్షీర ఫేన
సుందరామల పరిస్ఫురిత సద్వర్ణ
భస్మ సమాలిప్త భావజదేహ
భస్మసాత్కరణ విభావ సులోచ
న బ్రహ్మ గీర్వాణ నాకేశవంది
త బ్రహ్మ యోగి సదా పూజనీయ
సకల నిష్కల వికసల్లీల......"

పై సమాస రచన వాద ప్రకరణమున, శివుని పంచ ముఖములను వర్ణించు సమయమున శివోత్కర్షను దెలుపుచు నుదాత్తమైయున్నది. ఈ పంచముఖ వర్ణన మహాన్యాసము లోనిది.

2. ద్విపద కవిత గేయ సాంప్రదాయికము కాబట్టియే సోమనాథుడు చెప్పిన పదములనే, క్రియలనే, వాక్యములనే పునరుక్తముగ వాడుట కాన నగును. పెక్కు పట్టుల నీ పునరుక్తములు కేవలము శబ్దాడంబరములు గాక, భావమును గాని ప్రతిపాద్య విషయమును గాని మనస్సుల యందు గాఢముగా నాటు కొనఁ జేయ సమర్థములైనవి. వేయేల అనుప్రాసలు కూడ పునరుక్తములే కదా! అయినను వానిని కవు లుపయోగించి నప్పుడు, మనము చదువుచున్నప్పు డపూర్వానందాను భూతులను పొందుచున్నాము. పోతన పద్యములు మనకు చెవులకు, చిత్తమునకు నానందము కలిగించుట కనుప్రాస విన్యాసమే కారణము.

సోమనాథునికి కథా సందర్భములు సన్నివేశములు చాలగా గలవు గాన, నా యా ఘట్టముల వర్ణనలకు ద్విపద చక్కగా సోమనాథుఁ డనువుపఱచినాఁడు. వాద ప్రకరణములో వేదములకు దైవత్వము లేదని నిరూపించు ఘట్టమున :—

"...........వేదముల
దైవత్వ మెప్పుడు తప్ప దంటేని
తప్పేమి ? వేదంబు దైవ మేనియునుఁ
జెప్పుమా ? యొక దైత్యుచే మ్రింగఁబడునె ?
తప్పేమి ? వేదంబు దైవ మేనియును
జెప్పుమా ! తమ బ్రహ్మ శిరము గోల్పడునె ?
తప్పేమి ? వేదంబు దైవ మేనియును
జెప్పుమా దక్షుని చేటు గన్గొనునె ?
తప్పేమి ? వేదంబు దైవ మేనియును
చెప్పుమా కవితలై చెప్పంగఁ బడునె ?
తప్పేమి ? వేదంబు దైవ మేనియును
జెప్పుమా యొక పక్షిచేఁ బడి చనునె ?
తప్పేమి ? వేదంబు దైవ మేనియునుఁ
జెప్పుమా యొక మునిచేఁ ద్రెంపఁ బడునె?
తప్పేమి ? వేదంబు దైవ మేనియును
జెప్పుమా కుక్కలై శివుకెన్కఁ జనునె ?"

ఇట్లే కాలవాదమున :—

"కాల వశమ పుణ్య కర్మ సంభవముఁ
గాల వశమ జగత్కర్త కాలంబు"

అని యిరువది నాలుగు పంక్తులు గలవు.

మనోభావ విన్యాసము :—

గురుభక్తాండారి కథలో నొక వేశ్య యా భక్తు నుపాలంభించు విధము చూడుడు :—

"కఱపిన వాఁడవో కన్నెర్క మెడయు
నెఱపిన వాఁడవో నిండు జవ్వనము
ముట్టిన వాఁడవో మున్నొక్క మాఱు
పట్టిన వాఁడవో పడయ నంగళ్ల
నాపిన వాఁడవో యటఁ గొన్ని దినము
లేపిన వాఁడవో యే నీకు వలవఁ
గలసిన వాఁడవో కంచానఁ దొల్లి
వలసిన వాఁడవో వాడ పొత్తునను
నచ్చిన వాఁడవో నా వారి లోన
మచ్చిన వాఁడవో మనసు కీ లెఱిఁగి
బెరసిన వాఁడవో పెండ్లిండ్ల నిండ
నరసిన వాఁడవో యప్పు నాకిచ్చి
కాచిన వాఁడవో కని తప్పు పైచి
ప్రోచిన వాఁడవో బుజ్జి గర్వాలను

ఏలిన వాఁడవో యిటు జీతమిచ్చి
చాలిన వాఁడవో చంపి రక్షింప
బాపిన వాఁడవో భవబంధనముల
చూపిన వాఁడవో శూలిసద్భక్తి''

కరుణ రసోల్బణమునకు నీపదావృత్తు లెట్లుపయోగించునో మహిమ ప్రకరణమున బసవ లింగైక్య సందర్భమున పండిత ప్రలాపమునఁ జూడ నగును. సంగన బసవన్న యను పల్లవితో 65 ద్విపదలు గలవు.

సోమన తాళలయానుగుణ్యముగ ద్విపద నడచుటకు శబ్దాలంకారములను విశేషముగ వాడియున్నాడు.

వృత్త్యనుప్రాసము :—

''వరభక్తి చిరముక్తి కరగ భక్తి రతులు
నర చర్మధర కర్మహార ధర్మపరులు
కృత కృత్య హిత భృత్య ధృత సత్యరతులు
వ్రతధామ భృత సీమ జిత కామ మతులు
చిరకోపపరతాప ఖర పాపహరులు
హరతంత్ర గురుతంత్ర పరతంత్రచరులు

అంటనే యనుప్రాస :—

''ధన్యులు సుకృత వదాన్యులు విగత
దైన్యులు లోకైక మాన్యులు పరమ
పాత్ర ప్రసాదైక గాత్రులు, కర్మ
జైత్రులు, భవలతాదాత్రులు, త్రిమల
దూరులు, శుభతరాకారులు, గతవి
కారులు, విజిత సంసారుల్, దయావి
నిద్రులు, కలియుగరుద్రులు వీర
భద్రులు, కరుణా సముద్రులు, బుధమ
నోజ్ఞులు, దూరీకృతాజ్ఞులు, శ్రుతివి
ధిజ్ఞులు, వినుత దైవజ్ఞులవార్య
వీర్యులు, శివ పదాచార్యులు, ప్రణమి
తార్యులు, త్రిభువన వర్యు లనంగ''

ఒక్కొక్కచో పాటకు పల్లవివలె, కథా సందర్భములలో మొదట చెప్పిన ద్విపద చరణములే కథాంతమున చేర్చుచు మూల కథా సూత్రమునకు సమన్వయించుట :

పురాతన ప్రకరణములో నెల్లగొండ మహాదేవయ్య శివోపకరణములు తాకిన కారణముచే పాదములను ఖండించుకొనగా, నాతనికి తిరిగి యాపాదములను బండితారాధ్యు డీశుకరుణచే నిప్పించెను. కళియంబ, పిళ్ళనైనారుల కథ :

''నప్పాట నీ పండితారాధ్య దేవుఁ
డిప్పించెఁ బాదంబు లీశుచే నేఁడు
తెల్లంబుగా మహాదేవయ్యగారి
కెల్ల వారునుఁ జూడ నిలనట్టుఁ గాక''

ద్వి. భా. పుట. 295

దసరయ్య కథ :—

''నప్పాట దసరయ్య నాయయ్య కిచ్చెఁ
జెప్పఁ జిత్రముఁ గాఁగఁ జేతులు రెండు
నచ్చుగా నీ పండితారాధ్య దేవుఁ
డిచ్చెఁ బాదములు దా నిప్పు డొప్పార
తెల్లంబుగా మహాదేవయ్య గారి
కెల్ల వారునుఁ జూడ నిలనట్లు గాక.''

పుట 314

గురుభక్తయ్య కథ :—

''పడసె నీ క్రియ గురుభక్తయ్య నాఁడు
ఖండేందుధరభక్తమండలి పొగడఁ
బండితేంద్రుఁడు నేఁడు వడసె పాదములు
తెల్లంబుగా మహాదేవయ్య గారి
కెల్ల వారునుఁ జూడ నిలనట్లు గాక.''

పుట. 331

గురుభక్తాండారి కథ :—

''దండియయ్యు గురుభక్తాండారి కొసఁగ
రెండు గన్నులు నాఁడు ప్రీతితో నేఁడు
పాదముల్ కృప చేసె పండితారాధ్యుఁ
డాదట భక్తి మహత్త్వంబు వెలయఁ
దెల్లంబుగా మహాదేవయ్య గారి
కెల్ల వారినుఁ జూడ నిలనట్లు గాక''

పుట. 429

బెలిదేవ వేమనారాధ్యుల కథ :—

''వినుతింప బెలిదేవవేమయ్య గారు
నచ్చిన స్వపునకు నరగునఁ బ్రాణ
మిచ్చె నచ్చెరువుగా నీడితమహిమ
నప్పాట నీ పండితారాధ్య దేవుఁ
డొప్పారఁ గరుణనేఁ డొసగెఁ బాదములు
తెల్లంబుగా మహాదేవయ్య గారి
కెల్లవారినుఁ జూడ నిలనట్లు గాక.''

పుట. 449

సకలేశు మాదిరాజయ్య కథ :—

''మాదిరాజయ్య సమ్మద లీలఁ జిక్క
మాదయ్య ప్రాణంబు మఱి నెత్తినాఁడు
అరుదరు దనఁగ దయామతి నేఁడు
గరుణించె పండిత ఘనుఁడు పాదములు
తెల్లంబుగా మహాదేవయ్య గారి
కెల్ల వారునుఁ జూడ నిలనట్లుఁ గాక''

పుట. 467

కదిరె రేమయ్య కథ :—

"కదిరె రేమయ్య ప్రకాశిత భక్తి
విదితంబుగా నాఁడు వెలయంగ నేఁడు
సదమల దృఢ భక్తి సంపద మెఱసి
పదములఁ గృపసేసె పండితేశ్వరుఁడు
తెల్లంబుగా మహాదేవయ్య గారి
కెల్లవారునుఁ జూడ నిలసట్లు గాక"

పుట 474

చేటల వేమయ్య కథ :—

"చేట వేమయ్య సన్నిధిని
బాలుండు షోడశి ప్రాణంబు వడసె
నాఁడు పండిత మల్లినాథదేవుండు
నేఁ డిచ్చెఁ గృపఁబాద నీరజాతములు
తెల్లంబుగా మహాదేయ్యగారి
కెల్ల వారునుఁ జూడ నెలమిఁ దుల్కాడ"

పుట 498

క్రౌంచపదవృత్తము :—ఈ వృత్తమును తొలుత వాడినవాఁడు నన్ని చోడదేవుఁడు.

చంచల నాస్వాదించుచు లేమాం
డ్లకరువు ప్రియులకు నలఁదుచు రో
మాంచము లోలిం గంచుకితంబై
పొడమగ నడరుచు బులినములం గ్రీ
డించుచు సంభాషించుచుఁ బ్రీతిం
బొలుచుచుఁ జెలఁగుచుఁ బొలయు సముద్య
త్క్రౌంచగతుల్ వీక్షించుచు భాస్వ
జ్జ్వలనుఁడు శరవణ సరసికివచ్చెన్ (10-30)

ఇందు మొదటిదళమున చంచల...దించుచు మాంచ...కంచు అని ప్రాసయును, రెండవదళమున డ్లకరువు...నలదుచు...పొడ...బులిన అని యతులును గలవు.

క్రౌంచపదమును వాడిన రెండవవాఁడు సోమనాథుఁడు. అనుభవసారములోని (197 పు.)

భక్తివినీతుల్ యుక్తిసమేతుల్
భవభయవిగళిత పశుగుణపూతుల్
వ్యక్తసుబుద్ధుల్ శక్తిసమృద్ధుల్
వ్యపగతమలచయ వరసుఖసిద్ధుల్
సూక్తిరసజ్ఞుల్ భక్తివిధిజ్ఞుల్
సురుచిరశుభకర సుకృతి మనోజ్ఞుల్
భుక్తివిరక్తుల్ ముక్తినియుక్తుల్
పురహరభక్తుల్ బుధవినుతనుతుల్

ఇందు ప్రథమదళములో ప్రాస, ద్వితీయదళముతో యతులుండుటయేగాక, ప్రథమదళములోని ప్రథమాక్షరము ద్వితీయదళములోని రెండవ యతిస్థానములతోను మైత్రిబొరయుచున్నది. భక్తి....యుక్తి......భవ......పశు ఇట్లుండుటచే ప్రాసతోగూడ ఆది యతి సంప్రదాయమును సోమనాథుఁడు పాటించి యున్నాఁడు.

కవిజనాశ్రయమున నీలక్షణమిట్లున్నది :

భంచశరాభా సంచితపుణ్యాః !
భమసభనన నయపరిమితమైనక్
—యతిశ్ఛందో ధకారము.

తిక్కన సోమనాథునిరచననే అనుకరించెను గాని నన్నిచోడని యనుసరింపలేదు.

ఎఱ్ఱన—హరివంశమున-(ఉత్తరభాగము—9 ఆశ్వాసము) క్రౌంచపదములో నాలుగుచోట్ల యతిస్థానమునే వాడియున్నాడు.

సారవివేకసుస్థామ్యవిలోకా
సకలరిపుభయదసమయ సమీకా

ఈవృత్తరచనయందు ప్రథమమున నన్నిచోడఁడు కన్నడలక్షణము ననుసరించి వ్రాసియున్నాఁడు. కాని సోమనాథుఁడు తెలుగు సంప్రదాయము ననుసరించి దానికొక ప్రత్యేకత నాపాదించినాడు.[1]

త్రింభంగి—ఈ వృత్తమును సోమనాథుఁడు తొలుత అనుభవ సారమునఁ బ్రయోగించి యున్నాఁడు.

గురుమతసహితులు, దురితవిరహితులు—
సురుచిర సజ్జనవర్తుల్ ధ్రువకీర్తుల్-
శాంతసమూర్తుల్
పరిహృతవికృతులు, నిగమధి సుకృతులు—
మరణపునర్భవదూరుల్ సువిచారుల్-
భక్తివిచారుల్
పరవశహృదయులు, నిరుపమసదయులు
పరసమయప్రవిఘాలుర్, గుణశాలుర్—
దానసుశీలుర్
పరహితచరితులు వరగుణ భరితులు—
పరమపరాత్మ్యనుషక్తుల్, శివభక్తుల్—
శాంతినియుక్తుల్.

శ్రీ వావిళ్ళవారు ముద్రించిన కవిజనాశ్రయమును పరిష్కరించు సందర్భమున నేనును, శ్రీతిమ్మావఝ్ఝుల కోదండరామయ్యగారును, కవిజనాశ్ర

1. ఈ క్రౌంచపదవృత్తమునుఁ గూర్చి మిత్రులు లాక్షణికులు విద్వాన్ శ్రీ రావూరి దొరసామి శర్మగారు ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో వ్రాసి యున్నారు.

యమునందలి త్రిభంగి వృత్తలక్షణమును నీ సోమనాథుని త్రిభంగి వృత్తలక్ష్యముతోడనే పరిష్కరింప గలిగితిమి—చూ. (కవిజనాశ్రయము పుట. 34).

సోమన వెనుక తిక్కన దీనిని వాడియున్నాడు. మొదట నీవృత్త ముపయోగించిన యశస్సు సోమనాథునిదే.

## [1]ఉదాహరణరచన-ఛందస్సు

తెనుగున దేశివాఙ్మయశాఖలో ద్విపద కెట్లో యట్లే ఉదాహరణశాఖకుగూడ ప్రథమప్రవర్తకుఁడు సోమనాథుఁడే. తెనుగుననే కాక సంస్కృతమునను సోమన బసవస్తుతి పూర్వకముగ నుదాహరణము రచించియున్నాడు. రెండింటికి బసవోదాహరణమనియే పేరు. సంస్కృత బసవోదాహరణము, క్రీ. శ. 1295 ప్రాంతము వాడగు విద్యానాథమహాకవి రచించిన ప్రతాపరుద్రయశోభూషణముసందలి యుదాహరణ లక్షణమునకు లక్ష్యముగానున్నది. లక్ష్యమున్నగాని లక్షణమేర్పడుట సంభవింపదు. కాబట్టి ప్రతాపరుద్రీయ లక్షణమునకు ముందుగానే, సంస్కృత బసవోదాహరణలక్ష్యము వ్యాప్తిలో నున్నట్లు స్పష్టమగుచున్నది. తద్రచయిత సోమనాథుడును విద్యానాథునికన్నముందు వెలసియుండవలెనని కైముతికన్యాయమున నిర్ణీతమగుచున్నది. సోమనాథుని కాలనిర్ణయ సందర్భమున, వాఙ్మయపరిణామ దృష్టితోకూడ పరిశీలించుట విమర్శకుల ముఖ్య కర్తవ్యమని చూపుటకు దీని నుదాహరించితిని.

ఉదాహరణములలో అష్టవిధ విభక్తులనుదాహరించుచు సంస్కృతచ్ఛందస్సునకు సంబంధించిన పద్యమొకటియు, దేశీయచ్ఛందస్సునకు సంబంధించినకలికోత్కలికలు రెండునునుండును. చివర సార్వవిభక్తికమగు పద్యముండును. కలికోత్కలికలు రగడభేదములు. సంస్కృతోదాహరణమున ప్రారంభమున ప్రథమావిభక్తిలో మాలినీవృత్తమును, తక్కిన విభక్తులయందును,సార్వవిభక్తిక పద్యమునందును సంస్కృత వృత్తమగు శార్దూలమునే వాడి యున్నాఁడు. కళికోత్కలికములలో నీక్రిందిరగడ భేదములు గలవు.[2]

| | | |
|---|---|---|
| ప్రథమావిభక్తి—కళిక | | హరిగతిరగడ |
| | ఉత్కళిక | ,, |
| ద్వితీయా ,, | కళిక | ద్విరదగతిరగడ |
| | ఉత్కళిక | ,, |
| తృతీయా ,, | కళిక | తురగవల్గనరగడ |
| | ఉత్కళిక | ,, |
| చతుర్థీ ,, | కళిక | జయభద్రరగడ |
| | ఉత్కళిక | ,, |
| పంచమీ ,, | కళిక | ,, |
| | ఉత్కళిక | ,, |
| షష్ఠీ ,, | కళిక | ,, |
| | ఉత్కళిక | ,, |
| సప్తమీ ,, | కళిక | ద్విరదగతిరగడ |
| | ఉత్కళిక | ,, |
| సంబోధన ,, | కళిక | ,, |
| | ఉత్కళిక | ,, |

అనగా, హరిగతి, ద్విరదగతి, తురగవల్గన రగడలను నాలుగువిధము లగురగడల నుపయోగించినాడు. వీని సంగీతసంప్రదాయమిది:

ప్రథమావిభక్తి:—హరగతి-నాలుగు మాత్రలు-చతురస్రగతి-ఏకతాళము.

ఆపిచపు, రాతన, నూతన, శివగణ, పాదో, దకపరి, లసదభి, షేకః.

ద్వితీయా,సప్తమీ సంబోధనలు: ద్విరదగతి-అయిదుమాత్రలు-ఖండగతి-జంపెతాళము.

అపిచకర, తలయుగళ, విహితపుర, హరయజన.

తృతీయావిభక్తి:—తురగవల్గనము-మూఁడు మాత్రలు-త్రిస్రగతి-రూపకతాళము.

అపిచ, నిగమ, సార, భూత, వీర, శైవ, దీక్షి, తేన.

చతుర్థీ పంచమీషష్ఠీవిభక్తులు :-జయభద్ర-ఐదుమాత్రలు-ఖండగతి-జంపెతాళము.

అపిచగా, తమకణా, ద కు ం భ జ,

తెలుఁగు బసవోదాహరణమున నీక్రింది రగడలు వాడఁబడినవి.

---

1. ఈ ఉదాహరణముల గూర్చిన సంపూర్ణ వివరణము తెలుసుకొన గోరువారు నేను రచించిన ఉదాహరణ వాఙ్మయ చరిత్రను చూడనగును.

2. ఉదాహరణ వాఙ్మయ చరిత్రలో సంస్కృత బసవోదాహరణమున ఒండు రెండు చోట్ల రగడల పేర్లు తారుమారైనవి. వానిని ద్వితీయ ముద్రణలో సవరించు కొందును.

ప్రథమావిభక్తి:—కళికోత్కళికలు-మధురగ తిరగడ-చతురస్రగతి - ఏకతాళము-నాలుగు మాత్రము.

వెండియు, త్రిభువన, వినుతిస, మేతుండు,

ద్వితీయావిభక్తి:—ద్విరదగతిరగడ - ఖండ గతి-జంపెతాళము 5 మాత్రలు.

వెండియును, భక్తాభి, వృద్ధిబెం, చినవాని

తృతీయావిభక్తి:—ద్విరదగతిరగడ - ఖండ గతి-జంపెతాళము, 5 మాత్రలు

వెండియును, వేదోక్త, విలసచ్ఛ, రిత్రుచే

చతుర్థీవిభక్తి:— ద్విరదగతిరగడ—ఖండ గతి-జంపెతాళము, 5 మాత్రలు

వెండియును, నిర్మలప, విత్రగో, త్రుసకసై

పంచమీవిభక్తి:—ద్విరదగతిరగడ - ఖండ గతి-జంపెతాళము, 5 మాత్రలు

వెండియును, జగదేక, వీరస, త్తమువలన

షష్ఠీవిభక్తి:—తురగవల్గనరగడ- తిస్రగతి, రూపకతాళము, మూడుమాత్రలు.

వెండి, యునోం, కార, సార, విదిత,ముదిత, మేళ, ననకు

సప్తమీవిభక్తి:—తురగవల్గనరగడ - తిస్ర గతి, రూపకతాళము, మూడుమాత్రలు

చండ, మదన, శౌర్య, నందు

సంబోధన:—తురగవల్గనరగడ-తిస్రగతి - రూపకతాళము-మూడుమాత్రలు

వెండి, యునుస, మస్త, లోక, విదిత, విమల, భక్తి, బీజ.

గద్యకృతులయందును సోమనాథుడు రగడ భేదములచే రచియించినాడు.

1. పంచప్రకారగద్య.ఇం దయిదువిధములైన గద్యములుగలవు.

మొదటిగద్య:— ఉత్కళికా ప్రాయము-చూర్ణికవంటిది.

జయ జయ బసవ శ్రీమన్మహావృషభేంద్రావ తార! సమంచిత వీరమాహేశ్వాచారసార ! ప్రమథగణాలంకార! జగత్త్రయాధార దేవ బసవా!

రెండవవిధము గద్య:—అపిన శ్రీమహి మోన్నత విభవా భవపాశోత్కర పాశలవిత్రా విత్రాసిత.........

ఇది నాలుగేసి మాత్రలకు విఱుగును. చతు రస్రగతి- మధురగతిరగడ— ఏకతాళము — ముక్త పదగ్రస్తము.

మూడవవిధము గద్య:—

జయజయ, నిరవధి, నిర్మల, గాత్రా

జయజయ, దురితల, తాచయ, దాత్రా

ఇదియును పైనిచెప్పిన మధురగతిరగడ. నాలుగు మాత్రలు- ఏకతాళము—ఇం దంత్యాను ప్రాస పాటింపబడినది.

నాల్గవవిధము గద్య:—

జయదురిత, హరిహరణ, జయసుకృత,పరిచరణ, జయవికృతి, రవి కిరణ—

ఇది ఐదేసిమాత్రలకు విరుగునది. ద్విరదగతి రగడ-ఖండగతి-జంపెతాళము.

అయిదవవిధము గద్య:—

జయశివ, రంజన, జయభవ, భంజన

నాల్గేసిమాత్రలు-మధురగతిరగడ-ఏకతాళము.

నమస్కార గద్య :—

అపిచ శ్రీ ప్రమథేంద్రాయ నమో

వ్యపగత హృద్గతతంద్రాయ నమో

ఇదియును మధురగతిరగడ - చతురస్రగతి-ఏక తాళము.

అక్షరాంక్య గద్య :—

అపిచశివ శృంగార

ఆదిపద విస్తార—

ఇహపర సుఖాధార-

ఇది ద్విరదగతిరగడ-ఖండగతి-జంపెతాళము

అష్టోత్తరశతనామ గద్య—

శ్రీమద్గురు బసవేశ నమస్తే

సామయభవ నిర్నామ నమస్తే

ఇదియును మధురగతిరగడ. నాలుగుమాత్రలకు విఱుగును. ఏకతాళము

శరణుబసవగద:—

శ్రీవృషాధిపనాయక ప్రసిద్ధ భావశరణు బసవ. ఇది తురగవల్గనరగడ-తిస్రగతి- రూపక తాళము.

పైవానిని బరిశీలించిన, సోమనాథుడు హరి గతి, జయభద్ర, ద్విరదగతి, మధురగతి, తుర గవల్గనరగడలను వాడియున్నట్లు తెలియగలదు.

**సీసపద్యములు:**— తెనుగు వాఙ్మయమున నన్నయకు వెనుక సీసపద్యమునకు నొకవిధమైన ప్రత్యేక విశిష్టత కలిగించినవాడు సోమనా థుడు. సోమనవెనుక ప్రసిద్ధులైన తిక్కన, శ్రీనాథుడు, పోతన మొదలగు ఆంధ్రకవులు సోమనాథుని సీసములనే యనుకరించిరి. ముఖ్య ముగా శ్రీనాథుని సీసములకుగల సమత,తూగు,

ప్రసన్నతలకు మూలము సోమనాథుని సీసపద్య రచనలే. సోమనాథుఁడు చతుర్వేదసారమున సుమారు నాలుగువందల సీసపద్యములను రచించియున్నాఁడు. వీనిలో కొన్ని మంచి పోకడలు గలిగియున్నవి. చాలవరకు ఆటవెలదులే ఈ సీసములకు పొందుపఱుపబడియున్నవి. శ్రీనాథుఁ డెట్లు యీ యెత్తుగడలనే యనుసరించినాఁడో చూడుడు.

హరి వీరశైవుఁడన్నందుకు మఱియు గ
ర్భాధానఖండమే ప్రథమ సాక్షి
హరి వీరశైవుఁడన్నందుకు దననేత్ర
కమల మొసంగినక్రమము సాక్షి
హరి వీరశైవుఁడన్నందుకు శంకరు
చేతఁబొందిన శివగీతసాక్షి
హరి వీరశైవుఁ డన్నందుకు శ్రీసాం
బు డనెడి పుత్రునిబడసినదె సాక్షి
ఇన్ని సాక్షులుగాకను పన్నుగాను
ధ్యేయుఁడని శంభు బూజించు తెలివిసాక్షి
గానసద్ధర్మములును నిక్కంబటంచు
బలుకనెల్లరు కూళిలో బసవలింగ.

చతుర్వేద. 86 పద్యము.

సీ. కలహంస సంపద కలకల క్రేంకార
కలకలంబైన యీ కొలను సాక్షి
ప్రసవ సౌరభ నటద్భంభరంబైన యీ
వలని లతామండపంబు సాక్షి
ప్రచ్ఛాయ శీతలోపరి భాగమైన యీ
శశికాంతమణి శిలాస్థలము సాక్షి
తరులతాగుల్మ సంతత పిధానా తప
వ్యాపారమైన యీ వనము సాక్షి
గీ. మకర కేతను పాద పద్మములు సాక్షి
రతి మహాదేవి జఘన భారమ్ము సాక్షి
సత్య మెన్నడు నినుఁ బాయ సమ్మతించి
కౌగలింపంగ నీఁగదే కమల వదన.

శివరాత్రి మాహాత్మ్యము (3-81)

సీ. పరవాది మదగజ ప్రబల పంచాస్యుండు
పరవాది భూధర స్ఫారయశని
పరవాది మేఘనిర్భర పవమానంబు
పరవాది భూరుహ ప్రథిత పరశు
పరవాది తస్కర పటుతర శూలంబు
పరవాది జలనిధి బాడబాగ్ని
పరవాది లతలకు భ్యాసల్లవిత్రంబు
పరవాది శోక భీకరముఖాహి

గీ. దండ నాయక బసవ దుద్దండశౌర్యుఁ
డాది పరవాది నిర్వ్యర్వరణార్హ బుద్ధి
మతము లాతింటిఁ జర్చించు మహితకీర్తి
లెసఁగ రచియింతు వసుమతి బసవలింగ!

చతుర్వేద. 16 పద్యము.

సీ. పరవాది మత్తేభ పంచాననాఖ్యుండు
పరవాది మండూక పన్నగుండు
పరవాది నవ మేఘపవమాన ధీరుండు
పరవాది సాగర బాడబుండు
పరవాది కుక్కుల భాసుర దంభోళి
పరవాది కేంధన పావకుండు
పరవాది చయ తమః పటలోగ్ర భానుండు
పరవాది భోగి సుపర్ణుఁ డనఁగ
గీ. చటుల జైన కోలాహల సమర బిరుద
ఘనుఁడు సంగ్రామ పారుఁడు వినుత యశుఁడు
శుభుఁడు ముమ్మడి దేవయ్య సుతుఁడనంగ
వెలసె శాంతయ్య విక్రమ వీరవరుఁడు.

శివరాత్రి మాహాత్మ్యము-(1-36)

పాల్కురికి సోమనాథుని ద్విపదచ్ఛందస్సునుగూర్చి యితరచ్ఛందస్సులనుగూర్చి తెలుప వలసిన విషయము లెన్నో యున్నవి. దిఙ్మాత్రముగా నిందు సూచింపఁగలిగితిని.

చతుర్వేదసారముముద్రితప్రతి నీనడుమవ్రాత ప్రతులతోఁ బరిశీలింపఁగా, ముద్రితప్రతిలోనున్న 300 పద్యములకుపైగా నెనుబదినాల్గు పద్యములు (ముద్రితప్రతిలో లేనివి) అందు లభించినవి. శ్రీ ప్రభాకరశాస్త్రి పాదులు వ్రాసినట్టుగా నందు 400 పద్యము లుండనోపును.

పండితారాధ్యచరిత్ర ముద్రితప్రతి నేడు లభించుటలేదు. పూర్వముద్రణప్రతులను వ్రాత ప్రతులను బరిశీలింపగా ప్రస్తుతముద్రణ ప్రతి యందును లోపములు కాన్పించుచున్నవి. ద్విపదవాఙ్మయమునకే కాక దేశిరచనలకెల్లను మకుటాయమానమైన యీకృతియు, నితర కృతులును నత్యావశ్యకముగ పునర్ముద్రణము కాదగినవి.

సోమనాథునికృతులు, సర్వాంకషముగఁ బరిశీలించినగాని, యాంధ్రభాషా వాఙ్మయములందును, ఆంధ్రసంస్కృతి పరిణామమునందును నాతనికి గల స్థానము సువ్యక్తముకాదు. అట్టి పరిశీలనకు విద్వల్లోకము,విద్యార్థిలోకము కడంగును గాక యని నా విన్నపము.

# పాల్కురికి వాని ప్రావళ్లు

శ్రీ రావూరి దొరస్వామిశర్మగారు

——:o:——

శివకవి సార్వభౌముఁడైన పాల్కురికి సోమనారాధ్యుని కృతులలో ఛందో వ్యాకరణ ప్రయోగ వైలక్షణ్య మతిమాత్రముగాఁ గానవచ్చెడు. సోమన యొకఁడే కాఁడు, శివకవులందఱీవిషయమున నిరంకుశులు. శివకవులకు భవికవులకుఁ గల ముఖ్యభేద మిదియే. కాల క్రమమున శివకవుల యీ విలక్షణ ప్రయోగముల సాధారణ కవులు కొంద ఱనుసరింపఁ జొచ్చిరి. కాని లక్షణ గ్రంథకారులు మాత్ర మీ శైవ కవితా లక్షణములకుఁ బ్రామాణ్య మంగీకరించినట్లు లేదు. ఈ విషయ మటుంచి ప్రకృతము సోమన కృతులలోని ప్రావళ్ల (ప్రాసలు + వడులు) విశేషములఁ గొన్నింటిని నా యెఱుక కందిన వానిని దిక్ప్రదర్శనముగాఁ జూపెదను.

## ప్రాస విశేషములు.

1. ఖండాఖండప్రాస:—

బూది దా రాఁజదు పొగయదు తాను
నూఁదండు ముట్టించె నొక్క దీపంబు
(బసవ- పుట) 32[1]

షోడశ పండుపు నూడఁ బోదండు
పొఁడిగా నీ పాలు పురహార కొనుము
(బసవ-162)

ప్రాఁతిగా నాది వరాహ దంష్ట్రింబు
ఖ్యాత మీశ్వరుచేతఁ గాదె యున్నదియు
(బసవ-480)

వేఁడిన మిండ జంగమము...
ఓడక నాతి వల్వ లొాగి... (వృష-69)

2. పూర్ణార్ధబిందు ప్రాస :—

పాండురాంగంబైన పడఁతి గర్భమునఁ
బోఁడిగా వెలుఁగుచుఁ బుత్త్రిఁ డీ క్రియను
(బసవ-33)

దీర్ఘముల మీఁద యరసున్నలు నెఱసున్నలు గాఁ గాలవని తెలుఁగు లాక్షణికుల మతము. 'పోఁడి-పోండి' అను రూపముగా సోమనచేఁ బ్రయుక్తమై యుండును. నన్నెచోడకవియు నిట్టిరూపములఁ బ్రయోగించి యున్నాఁడు. (పోండిగ-మూండు-బ్రహ్మాండము-భాండము)

3. సంయుతా సంయుత ప్రాస :—

అనంతుఁడు వీనినే త్రిప్రాస యని పేర్కొనె. అతని మతమున 'త్ర' కారసంయుక్తమునకు మాత్రమే రేఫగహితముగాఁ బ్రాస చెల్లుబడి యగును.

అప్పకవి రేఫశ్లిష్టములగు హల్లుల కన్నింటికి లక్షణములఁ జూపెను. ఇందు రేఫేతర సంయుక్తములందు నీ ప్రాస ఘటితమై యున్నది.

(అ) తత్త్రిపురాంతక స్థాన వాస్తవ్యుఁ డైత్రిపురాంతకుం డభినుతిచేర్చు. (బసవ. 3)

మధ్యాహ్న మగుటయు మారయ్య లింగ
తద్ధ్యాన సుఖ నిరంతర వర్తి యగుచు
(బసవ-357)

ముప్పొద్దుఁ బ్రాణ లింగ ప్రసాదంబు
సుప్రసన్నత జంగమ ప్రసాదంబు

పై ప్రాసలలో ద్విత్వ హల్లులందొక హల్లునకు లోపము గాన వచ్చెడు.

(ఇ) మర్త్య లోకమునకు మఱివేఱె యొకఁడు
కర్త యున్నాఁడె లోకత్రయ వరద
(బసవ-27)

ని, గంతరింబును శ్వమాంసాస్థి మూత్రంచ
భుంక్తే యన శ్వమాంసములు గొంట
(పండిత-దీక్షా-95)

ఆక్షణంబునఁ బంచ భక్ష్యముల్ కుడిపి
(బసవ-29)

పై వానియందు మూఁడు భిన్న హల్లులలో నొక హల్లునకు లోపము.

(ఉ) బుజ్జగించును వెడ్డు బుడ్డును బెట్టు
నిర్జీవి క్రియఁ బడు నివ్వెఱఁ గందు
(బసవ-163)

కర్జంబు నావుడు బిజ్జలుఁ డంత
లజ్జయు సిగ్గును బుజ్జగింపంగ (బసవ-250)
కర్జంబు...బిజ్జల (బసవ-338)

పై ప్రాసలలో నొక్క హల్లునకే మైత్రి. ఇందుఁ గొందఱు 'నిర్జీవి, కర్జము' అను పాఠములఁ బఠించెదరు. ఇవి వారి మతమున వైకృతములు గావలయు. ప్రాసమైత్రి సరిపడుట కట్టి రూపములు గల్పితము లని యెన్నవగు.

---

1. వావిళ్ళ ప్రతి ననుసరించిన దీ పుట సంఖ్య.

(ఋ) ఉత్కృష్టమని ధరనుండె నిమ్మవ్వ
సత్క్రియలందెల్లఁ జనునె గర్వోక్తి
(బసవ-284)

స్రష్టృ) క్త మగునట్టి జాతులు గావె
యష్టాదశంబులు నవియేల చెప్ప
(బసవ-495)

తండ్రి యనియెనె మఱి జండీశుఁడపుడు
(పండిత-1-286)

ఈ ప్రాసభేదము (రేఫ సంయుతా సంయుతము) మాత్రము ఛందోగ్రంథముల జెప్పఁబడినది.

(ౠ) శ్రీ గురు లింగ మూ ర్తి...పాలితా
భాగ్యత...(వృషా-1)

ఇందు సంయుక్తయకారము పరిత్యక్తము.

3. స్వవర్గజ ప్రాస:—

(అ)లాక్షణికులు దధలకు, ధథలకు మాత్రమే ప్రాసచెప్పిరి.

మేధావి రుద్రుండు మిండ సంగయ్య
మైథున రామయ్య మగతిల కవ్వ
(పండిత-మహిమ-90)

క్రోధంబుఁ బగయు...
గాథలుఁ దమలో మిథ్యా
బోధలు...(అనుభవ-96)

(ఆ) టఠ-ప్రాస
హఠయోగ రాజయోగాది విభ్రాంతిఁ
బటువగు పశుయోగ బంధంబులేమి
(పండిత-పర్వత-327)

(ఇ) డఢ-ప్రాస
వేడుక నా యజుర్వేద సూత్రోక్తి
రూఢిమై......
(పండిత-దీక్ష-46)

రూఢిగా జంగమ రూపంబుఁ దాల్చి
వేడుక నినుఁ గూడి విహరించు వాఁడ
(బసవ-27)

(నన్నయ భారతమునను 'ఏడ క్షోహిణు లెన్న...రూఢిఁ' (ఆది-1-70) అను ప్రయోగము గలదు; కాని 'రూఢి' యను వైకృత రూపము గ్రాహ్యమని కొందఱ మతము. అట్లు గ్రహించినఁ బై సోమన ప్రయోగములు సుఘటితములగు. సోమన రూఢి శబ్దమును వర్గయుక్కగాఁ బ్రయోగించిన స్థలమును గలదు. చూ-గూఢ వేదాంత సంకుల శిరోరత్న, రూఢి వెండియును. పండిత. దీక్షా-52)

(ఈ) బ-భ-ప్రాస
కంబ కట్లను మేలు కట్లను బొలుచు
గంభీర పుష్పశాగారంబునందు
(బసవ-134)

(కంభకట్లని ముద్రిత ప్రతులు)

5. శ-స, ష-స-ప్రాస:—

భసితంబుఁ జల్లి పోడశునెత్తి వైచి
(పండిత-పురాతన-497)

శశిలేని నిశి దివస్పతి లేని పగలుఁ
బసులకాఁపరి లేని పశునివహంబు
(పండిత-మహిమ-218)

దూషకుల్ ద్రుంగ సాధులు గడుఁ బొంగ
బాసయుఁ దుదముట్ట భవుఁడు సేపట్ట
(పండిత-పురాతన-403)

(ఇందలి బాసకుఁగల యర్థము భాషయను రూపము గ్రహించిన సిద్ధింపదు)

దూషక వినుము 'మా దుష్టతిర్ వృషభ
మా సహాూతి' యనుచు మహిమ్రోయుచుండ
(పండిత-వాద-681)

అప్పకవీయాదులం దీ ప్రాస యుభయప్రాస క్రిందఁ జెప్పఁబడినది. ఆదేశషకారమునకు మాత్రమే యీ ప్రాసమైత్రి లాక్షణికులు చెప్పిరి.

6. ర-ఱ ప్రాస:—

చీరసించుచు విప్రు-లాఱడి వైచి
(బసవ-192)

(ఇందుఁ బ్రాసయతి)

పాఱునె సుఖగోష్ఠి యెడం
గోరునె పరధన నిషక్తి గుణరత్న నిధీ
(అనుభవ-119)

7. ఈయస్-ఇయ్యస్

మహీయ స్సిత్యాది రూపముల మహియ్యస్సిత్యాదిగాఁ బలుచోట్లఁ బ్రాసలో సోమన ప్రయోగించియున్నాడు.

అయ్యా యనుడు నేమి యయ్యా యనెడు త
దియ్య వాక్యంబు నజ్జయ్య యడంచి
(బసవ-302)

అయ్యు 'నణోరణీ యాన్మహతోమ
హియ్యా' ననంగ మహేశుండు శివుఁడు
(పండిత-వాద-567)

## యతి విశేషములు,

1. అభేదయతులు-(పఫ బ భ వ లు)

ప్రాచీన కవు లీయతిని ఘటింప లేదని శేచిన్నతము.

వరద సోమయ యర్ఘ్య + పణ్యంబు లందు
(బసవ-421)

పరమ తత్త్వోన్నతి + వర్ణింపఁబూని
(పండిత-దీక్ష-63)

స్ఫీత ప్రతాపుండు + విగత కోపుండు
(పండిత-దీక్ష-231)

వరద నెఘళ్లె యంచునినుఁ + బ్రస్తుతి సేయుదు
(వృషా-63)

2. ముకారయతి:—విభక్తి ముకారమునకు పుపుబుభులు చెల్లునని ప్రాచీనమతము. దీనికి ము విభక్తియతి యనియుఁ, బోలికయతి యనియుఁ బేళ్లు గలవు. కేవల ముకారమునకుఁ గూర్చిన యతిని ముకారయతి యని చక్కటియతి యని వ్యవహరింపఁ జొచ్చిరి. ఇట్టి యతి విధానము ప్రాచీన కృతులందుఁ గాన రాదందురు.

పొందుగాఁ బసిఁడికొ + మ్ములు గొరిజియలు
(బసవ-29)

భువనబు త్తాండి + ముచ్చురలోన (బస-109)

3. జ్ఞావడి—(విశేషవళి).

జ్ఞాకు ఖగఘలతో మైత్రి. ఇందులకుఁ దిక్కన ప్రయోగమొక్కటే యప్పకవి యుదహరించె.

కర్మమధర్మము + జ్ఞాన మార్గమము (పండిత-పురాతన-284)

4. ర-అ యతి:—

రొంపియుఁజూపి యె + ఉంగరె
(బసవ-109)

.........మాహేశ్వ
రులపంపనుచు లేఖ + అొమ్మునఁ బెట్టి
(పండిత-మహిమ-12)

5. నిత్యసమాసయతి:—

ధాతృవిధాతృహ + తాళన (బసవ-111)

బ్రాఁతిగా నాదివ + రాహదంష్ట్రింబు
ఇచట హకై మైత్రి. (బసవ-480)-

హరమైన తనదు వరాహదంష్ట్రింబు
(పండిత-వాద-583)-

ఇందుస్వర మైత్రి.

శైవాదులందఱ్లు + సాంగమై
(పండిత-దీక్ష-45)

యతిఁ బాణినశ్చక + ణాదశ్చ
(పండిత-దీక్ష-84)

కూడు, నే గవాక్ష సర్పిశ్శ + రీరస్థ మనఁగ
(పండిత-దీక్ష-110)

మహీయ్యావసనంగఁద + దీయహూ కంబు
(పండిత-దీక్ష-75)

వ్యాప్నలినే స్మరామిభవ + దీయ పదద్విత
యం (వృషా-55)

6. ప్రభుయతి:—

అన్నాదులూఁదఁబడకయుండు సంధులలో నుభయయతి గూర్పఁగునని యనంతామాత్యాదుల యాశయము. 'రామన, సీతమ, మారయ' ఇత్యాదులగు ద్విత్వరహితరూపములం దుభయయతి చెల్లుననుట. అప్పకవి మాత్రము ద్విత్వసహితమైనను ద్విత్వరహితమైనను నుభయయతి యంగీకరించెను. సోమనపద్యములలో ద్విత్వసహితముల కుభయయతి గలచోట్లు చూపెదను.

అనుచున్న మాదిరా + జయ్యగారలను
(బసవ-228)-(అచ్చునకు)

మఱియు నేకాంతరా + మయ్య
(బసవ-399)-(హల్లు)

వరకీర్తి భోగిదే + వయ్య (బసవ-525)

దాఁటఁగ నోడుఁగే + తయ్య (బసవ-566)

మఱియును శివనాగ + మయ్య
(పండిత-దీక్ష-150)

దేవి, గారుఁ జోడవ్వ సిం + గయ్య
(పండిత-మహిమ-85)

7. కాకువడి:—

నిప్పునఁ జెడలంటు + నే నీకు నీవ
(బసవ-158)

ఇట్టివిధ క్రియుఁ గల్గు + నే (బసవ-264)

మాటలేటికని ర + మ్మా (బసవ-265)

8. అఖండయతి:—

సోమన యీ యతిని బెక్కుచోట్ల నుపయోగించెఁ గాన నీతనికిది సమ్మతమని తెలియనగును

......వర్ణింప
నంతనిక్కడ శివా + నందుండు
(బసవ-389)

కాలుని శ్వేతుని + కై చంపెఁగాదె
(బసవ-482)

త్ర్యక్షర బిందునా + దప్రయుక్తా
(బసవ-502) (త్రి + అక్ష)

త్ర్యక్షపరా జ్ముఖ + క్రతు (బసవ-571)

చిక్కఁజేసినను గుం + చెడుగానిలేవు
(బసవ-352) (కుంచ + ఎఁడు)

ధర న యజ్ఞాదేవ + తార్చన మనఁగ
(పం-దీక్ష-35-) (దేవతా-అర్చన)

కలితశబ్దంబు వా+గమృతమై తనర
(పం-పురా-486) (వాక్+అమృత)
తొడంగి కన్నొకటి ని+ట్ల పడయునదియు
(పం-మహిమ-104) (ఇట్లు+అ)
......మహిమ
నాశిలాదునకైన+ననుఁగీర్తి సేయ
(పం-పర్వత-253)(మహిమఁ+ఆశిలాదు)
......లింగము
సంగమునకు జంగమార్చ+నంబది
(అనుభవ-222)

9. ప్రాదియతి :—
దుర్జనప, శోత్రుసితక్షార+రుద్రాక్షవిహిత
(పం-మహిమ-177)

10. ఉపసర్గసంధియతి :—
పాలింపమీదు కృ+పావలోకనము
(పం-పురాతన-466)

ప్రాదియతులెల్ల లాక్షణికులు చెప్పిరి. ప్రాదులమీఁద స్వరము లదుకుచోట నుభయ యతి చెల్లును. ప్రాదులు పరములుగాఁగల స్వరసంధి యుపసర్గ సంధియతి యనఁబడు. దీనిని నిత్యసమాసయతుల క్రింద నప్పకవి చూపి నాఁడు. (చూ. అప్పకవీయము-3 ఆ-183,184)

11. 'ఉ—వు' యతి.
కల్లిదే, వునకు ననుంగువాఁడవని+యుత్సుక
తఁ (వృష-98)

పోతనభాగవతము, ధర్మఖండము మున్నగు గ్రంథములలో నిట్టి వింతయతి ఘటన గాన వచ్చెను.

12. ఋ-రు-వడి :—
ఋకారమునకు 'రి' వర్ణము చెల్లునని సర్వ లాక్షణికులు ప్రవచించియున్నారు. క్రమ్మ, క్రుక్క మున్నగు తెనుఁగుపదములలో నున్నది రేఫయే కాని వట్రువసుడి (ఋకారము) గాదని యనంతాదు లుగ్గడించి స్పష్టార్థము రేఫయుత యతిని సైతము చెప్పిరి. కాని క్వాచిత్కముగా ప్రాచీన గ్రంథములందును ఋ-రువడి (కృత్త-క్రూర) గాననయ్యెను. ఇది లాక్షణిక సమ్మత మన వీలులేదు; ప్రమాదపతిత మనవలెను. మఱి కొందఱు కవులు వట్రుసుడి కత్వములో మైత్రియుఁగూర్చి యున్నారు. సోమన ప్రయోగము లిందులకుఁ జూపఁబడును.

రు రు వర్ణదేహంబు+ఋగ్వేదమునకు
(పం-వాద-523)
"ఋగ్వేదో రురువర్ణశ్చముండిత శ్మశ్రు కేశవాక" —చరణవ్యూహపంక్తి.
మృదుఁడా యపస్మార+మును బడఁ
ద్రొక్క (పం-వాద-683)
రుచులను భోగించు+ధృతి నొకండు
(అనుభవ-221)

13. మఱికొన్ని విశేషములు :—
ప్రస్సియెంతయును శ్రీ+మంపడి యిట్లు
(బస-348)-(వ-మ)
సం-హర పరవాద వాదభయ+వర్జిత
(వృష-108)-(హ-వ)
తివిరి జుష్టంచ త+చ్ఛేషాన్నమనిన
(పం-దీక్ష-97)
(తత్+శేష. ఇది వికల్పయతి వంటిది)
రసహీనమైనని+స్సారంపుఁగవిత
(పం-మహిమ-218)
(యతిభంగమనవలయుఁ గాని, 'నిర్+సార' అనుసంధి విభాగమున రేఫమున్నదిగాన గూఢ స్వరయతివంటి గూఢ హల్యతిగా నాద రింపవచ్చు)
రుద్ర ధారాంబువులఁ గృత+స్నానులై
పరుస (పం-పర్వత-298)

[1] స్నానమునకు బూర్వరూపము స్త్నాన మని గణపవరపు వేంకటకవి ప్రాతిశాఖ్యల నుండి ప్రమాణ ముదాహరించినాడు. కీ. శే. శ్రీ ప్రభాకరశాస్త్రి గారు దీనిని తద్భవవ్యాజ యతిగా సమర్థించిరి. స్నానశబ్దమునకు తకార మైత్రిగల ప్రయోగములు శ్రీనాథాదులవి సర్వ లక్షణ సారసంగ్రహమునఁ గూచిమంచి తిమ్మ కవి చూపియున్నాఁడు.

(చూ. 2 ఆ-సంయుక్తవడి—పు. 118

14. సందిగ్ధ యతిమైత్రి: —
ఈక్రింది పట్టుల యతిమైత్రి చెల్లుబడియగు టెట్లో దురూహము. దురూహమనుట కర్థము లాక్షణికులు చెప్పనివని సరళమార్గమునఁ గుదుర్పరానివని యెఱుంగునది.

అంతనాపిళ్ళసై+నారు (బసవ-417)
(తరువాయి 93 వ పుటలో)

1. స్నానశబ్దవిచారమునకు 1928 భారతి పత్రికల చూడుఁడు.

# ఉపమా ప్రకరణము

## శ్రీ కుంటిమద్ది శేషశర్మగారు

---: * :---

ఈ చతుర్విధ కావ్యమునకు శరీరమునకు హారాదులవలె ఉపస్కారకమైనది యలంకార ప్రపంచము. అందు ఉపమాదు లర్థాలంకారములు. వానిలో,

"ఆటవెలది వోలె నాయాయి వేషాల
నుద్వహించి యొక్క యుపమ కావ్య
వేది పైన బహుల విభ్రమంబులఁ జూపి
సంతసింపఁ జేయు సగస మతుల."

"చంద్రుని వంటి ముఖము" అన్నప్పుడు సాదృశ్య ముపమ. అదే రచనా విలాసము చేత ననేకాలంకార రూపమును పొందుచున్నది. ఎట్లన, "చంద్రునివలె ముఖము, ముఖమువలె చంద్రుడు" అనిన నుపమేయోపమ. "ముఖమువలె చంద్రుడు" అనిన ప్రతీపము. "చంద్రునిఁ జూచి ముఖమును స్మరించుచున్నాను" అనిన స్మరణము. "ముఖమే చంద్రుడు" అనిన రూపకము. "చంద్రుడా ముఖమా" అనిన సందేహము. "చంద్రుడని నీ మోమును చకోరములు వెంటాడుచున్నవి" అనిన భ్రాంతిమత్తు. "ఇది మోము గాదు, చంద్ర బింబము" అనిన అపహ్నుతి. "చంద్రుడు గాబోలు" ననిన యుత్ప్రేక్ష. 'చంద్రుడితడు' అనిన అతిశయోక్తి. "ముఖముచే చంద్ర కమలములు జయింపఁబడినవి" అనిన తుల్యయోగిత. "రేలఁ జంద్రుడు, నీ మోమునూ వికసించును" అనిన దీపకము. "నీ మోముననే ననురక్తుడను; తుమ్మెద తామరయం దనురక్తము" అనిన ప్రతివస్తూపమా. "మింటఁ జంద్రుడు భువిని నీ మోము" అనిన దృష్టాంతము. ముఖము చంద్ర కాంతిని దాల్చెడిని" అనిన నిదర్శన. "మచ్చ లేని మోము చంద్రుని మీరును" అనిన వ్యతిరేకము. "నీ మోముతో బాటు రేల చంద్రుడు రంజిల్లును" అనిన సహోక్తి.

ఇత్యాది నానా లంకార రూప పరిణతి గలది ఉపమ. కాన తొలుత దానిని వివరింతును.

"అందమగు సామ్య ముపమ. వాక్యార్థమునకు కాంతిఁ బెనిచిన యలంకారమగును."

"వాక్యార్థమునకు కాంతి పెంపొందించుట" అలంకార సామాన్య లక్షణము. అందము=రసికుల కానందము గలిగించునది. అట్టి, సామ్యము=పోలిక ఉపమ. అది వాక్యార్థ శోభాకరమైన ఉపమాలంకారము. ఉపమయే ప్రధానముగ వాచ్యమైనను వ్యంగ్యమైననూ అది యలంకారము గాదు. అలంకరణ యోగ్యత గల దైననూ అంగడిలోని నగవలె నది స్వయంప్రధానముకాని శోభాకరత్వమను ధర్మము దానికి లేదు.

"కుటిల కుంతల మలరారు గుబ్బపైన
లంబమానము గండ స్థలమ్ము నుండి
చంద్ర బింబము సందుండి జారి మేరు
తటము పైఁబడు భుజగ విధమ్ముగాను",

ఇం దుపమానోపమేయ సాదృశముల కన్న అలంకార్యము వేరు లేదు. కాన నీయుపమ అలంకారము గాదు.

అటులనే :—

"పొగరు పడెద వేల మృగలాంఛనా! నీవు
సాటిలేని కాంతి మేటి నంచు ?
ఎవడు కాదకి వచ్చె నీ చతురంభోధి
మండితమును భూమి మండలమును."

దయితను ఎడబాసి పరదేశములకు కార్యవశమున పోయి, రేయి వెన్నెల సోకినంత తపించు విరహి యొకడు చంద్రునిఁ గూర్చి యాడిన పలుకు లివి.

ఇందు, "ఏనాడునూ ఇలు వీడని, అందువల్లనే నీకునూ కనుపడని , నా ప్రియురాలి మోము నీ సమానము ఒండు గలదు." అని ఉపమ ప్రధానముగ వ్యక్తమగుచున్నది. కాన నిదియు నలంకారము గాదు.

ఉదాహరణము :—

"నను గనుగొన నాసను గురు
జనభయమునఁ దొట్రుపడెడు చకిత మృగీలో

చన కనులను దరవిదల
ద్వనరుహ రుచిరముల మరువవళమే నాకున్''
దూరదేశమున నున్న కాంతుడు ప్రియను మరువలేక తదీయానుభావముల నెచ్చెలితో చెప్పుకొను చున్నాడు.

అత్తవారింటినుండి క్రొత్త యల్లుడు వెడలిపోవు చున్నాడు. మరల నెప్పటికో పునస్సమాగమము. అతని ముఖవిలాసము కడమాటు తనివార కనుగొన వలయునని నవవధువునకు ఉత్సాహ మువ్పొంగు చున్నది. కాని ఋజు దృష్టితో పరికించిన, "సాంగ నంపుచున్న పెద్ద లేమనుకొందురో" అను జంకుచేత నామె కనురెప్పలు విచ్చుకొనక ముకుళించు చున్నవి. ఉత్సాహ శంకలచేత నా కాంత తొట్రుపడుచున్నది. అట్టి పరిస్థితి యందు తెరచీ తెరవని కన్నులు విచ్చీ విచ్చని కమలాల వలె మనోహరములు. "చకిత మృగీ లోచన" యనుటచే, చూపులు మరతు మన్ననూ మరపు రాని శోభా నిధానములని తెలియుచున్నది.

ఇందు 'వనరుహ' మను ఉపమానవాచకమునకు 'రమ్య'మను సాధారణ ధర్మ వాచకముతో, "ఉపమానాని సామాన్య వచనైః" అనుట వల్ల నేర్పడిన సమాసముతో తెలియనగు ఉపమ, స్మృతితో బాటు ప్రధాన వాక్యార్థమైన విప్రలంబ శృంగారమునకు శోభాజనకమై అలంకారమగు చున్నది.

ఇచ్చట స్మృతి ప్రధాన వ్యంగ్య మనరాదు. "మరువ వళమే నాకున్" అని నిషేధ రూపమున వాచ్యముగ వెల్లడింపఁ బడినది. అటులనే పూర్వార్థమున త్రాసౌత్సుక్య సంధియూ. అది నాయికాగతమై అనువాద్యము; స్మృతికి అంగము. కనుక భావసంధి, స్మృతితోపాటు విప్రలంభ శృంగారమున శోభింపఁజేయు చున్నది. కాన నదియ ప్రధానము.

ఇది గమనింతము :—

" ఉత్ప్రేక్షవలె నసిద్ధోపమ గాక, న
న్వయము కైవడి నభిన్నంబు గాక,
హీనోపమయుఁ బోలె నిల నహృద్యము గాక
ఉపమాన మనఘమై యుండెనేని;
శ్లేషంబు వలె పద శ్లిష్ట మాత్రము గాక
సార్థమై, అల రూపకాదుల క్రియ
వ్యంగ్యంబు గాక సామ్యము వాచ్యమగునేని ;
భౌపమ్యము ప్రతీప మట్లు తలఁప
క్రమ విపర్యాస సహితంబు గాక యున్న
అలరు నుపమేయ కోపమ యట్లు సామ్య
ధర్మ మినుమారు వరుసలఁ దడవకున్న
'ఉపమ'యగు దీని భేదంబు లేర్పరింతు."

ఇది,

"తాన సిద్ధించి కవి సమ్మతమును భిన్న
మయిన వర్ణ్యంబుతోడ నన్యంబునకును
వాచ్యముగ ధర్మ సామ్యంబు పరగెనేని
ఒక్కటడవ యయ్యాది యుపమ యగును."

అను నర్థముగల విద్యానాథుని లక్షణమునకు కావ్యాలంకార సంగ్రహకారుని యనువాదము. ఇం దుపమాలక్షణ నిర్వచనము ముపక్రమింపఁ బడినది.

లక్షణ కోటిలో, "ఉత్ప్రేక్షవలె నసిద్ధోపమ గాక" అనుట స్వాశ్రయ దోషము. ఉపమాస్వరూపము తెలిసిన మీదటనే అసిద్ధోపమ యను పదమున కర్థమగును. ఇంతకు "అసిద్ధోపమ" అను నర్థమేమి? ఇది "ఉపమాన మనఘమై యుండెనేని" అనుచోగల ఉపమానమునకు విశేషణము. కనుక, "అప్రసిద్ధ మైన ఉపమ గలది" అని యర్థ మగుచున్నది. ఉపమ అనిన "పోలిక, ఉపమానము" అని ఈ ప్రకరణానుగుణార్థములు. "అసిద్ధమైన ఉపమానము గలది" అనుట ఉపమానమునకు అసంగతము. కనుక అప్రసిద్ధమైన పోలిక గలది, అని యర్థమగును. కాని పోలికకు సిద్ధము అసిద్ధము అను భేదము లుండవు. ఉపమాన రూపపదార్థమునకు, "స్వతస్సిద్ధము,కవి కల్పితము" అను భేదము లుండును. ఎట్లన:—

వక్రములు బాలచంద్రుని పగిది చాల
రక్తములును పలాశ కోరకము లపుడు
రమ్య సురభి సమాగతారణ్య రాజి
నూతన నఖక్షతంబుల భాతి దోచె.

ఇచ్చట నఖక్షతంబులు ప్రసిద్ధములైననూ సురభి సమాగతారణ్యరాజి సంబంధి నఖక్షతములు కవి ప్రౌఢోక్తి కల్పితములుగాని స్వతస్సిద్ధములు గావు. అందువలన అసిద్ధమను పదము పోలికకు గాక ఉపమానమునకు విశేషణమేయుట యుక్తము.

"ఉత్ప్రేక్ష వలె నసిద్ధోపమ గాక ఉపమమాన మనఘమై" అను వాక్యమున "ఉత్ప్రేక్ష వలె" అనుటచే "ఉత్ప్రేక్ష" ఉపమానము. "ఉపమానము" ఉపమేయము. ఉపమానము

నకు విపరీతోపమానముగ ఉత్ప్రేక్షను వాకొనుటయు అసమంజసము. ఉత్ప్రేక్ష యలంకారము. అలంకారావయవములు ఉపమానోపమేయములు. "ఉత్ప్రేక్ష యందలి ఉపమానము వలె" అని ఉపమయందలి ఉపమానమునకు ఉత్ప్రేక్షయందలి ఉపమానమును విపరీతోపమానముగ చెప్పవలసి యుండెను.

"అట్లు గాదు. 'ఉత్ప్రేక్షన్+వలె' అని పదవిభాగము. 'జడంబుల ద్వితీయా సప్తము లకు ద్వితీయయునగు, అను సూత్రము మేరకు వచ్చిన సప్తమ్యర్థ ద్వితీయకు స్థిరము పగమైనందున లోపము" అంటేని, "అనన్వయము కైవడి నభిన్నంబు గాక" ఇత్యాది సాహచర్యము వల్ల, దీనినే ప్రథమగ గైకొన వలసి యున్నది. ఐనను "సప్తమ్యర్థముననే ప్రథమ" అంటేని, "రూపకాదుల క్రియ, ఉపమేయోపమ యట్లు" ఇత్యాది సాహచర్య మందుకు ప్రతిబంధకము.

ఇంతకూ ఉత్ప్రేక్షయందు ఉపమ యుండిన గదా, అది సిద్ధమా అసిద్ధమా అని తర్కించుటకు అదియే లేదు.

అదెట్లు? "నూతన నఖక్షతంబుల భాతి దోచె" అను ఉత్ప్రేక్షయందు, "భాతి" ఉపమావాచకము గాదా?

"మాదిరి కైవడి మాడ్కి పగిది పోల్కి
తెఱగున విధమునఁ దీరునఁ గ్రియ
గతి భాతి చందంబు గా రీతి రహి భంగి
లేవ కరణి జాడ లీవి డంబు."

ఉపమావాచకములలో ఆంధ్రకావ్యాదర్శమున "భాతి" పరిగణించబడినది. అందువల్ల ఉపమ లేకేమి? అంటేని; కావచ్చు. కాని భాతి ఉపమా ప్రతిపాదకమైనచో అలంకారము ఉత్ప్రేక్షయనుట మరియు నసంగతము. కాన నిది యుపమావాచకము గాదు.

ఉపమ యగునది లోకసిద్ధోపమాన
మైన, "వలె" సామ్య బోధక మగును గాన;
ఎందు కవికల్పిత మది యుత్ప్రేక్షయగును
అచట, "వలెను"ను సంభావనార్థకమ్ము.
(అని చక్రవర్తి వచనము.)

"దూరమున వచ్చుచున్నవాడు దేవదత్తుని వలె నున్నాడు." ఇత్యాది లోకవ్యవహారమునందు వలెకు సంభావనయే అర్థము. విజయవిలాసమున :—

తుమ్మెదవలె నున్న[illegible]యిటు ...... ...... ......
రమ్మని నెఱికొప్పునిమిరి భ్రమసితి తరుణీ!
కమ్మవిరి నల్ల కలువని
క్రమ్మర మరుపెట్టు గుట్టు గనరాకుండన్.

అని కావ్యమునందునూ వలెకు సంభావనాపరత్వము.

త్రిలింగలక్షణ శేషమున:—

సూ॥ పోలె ప్రభృతులు తఱచుగఁ బ్రథమావిభక్త్యంత నామంబులకంటెను, తాదర్థ్యార్థక క్రియలకంటెను పరంబులయి యుత్ప్రేక్షాద్యోతకంబులగు—అని సూత్రితము.

కనుక, "ఉత్ప్రేక్షవలె నసిద్ధోపమగాక" అనులక్షణ నిర్వచన మసంగతము. అందువల్లనే శ్రీ చలమచర్ల రంగాచార్యులు మూలమందు వలెనే "స్వతస్సిద్ధమై ఉపమేయముకన్న వేరై సహృదయ సమ్మతమైన ఒకానొక యప్రకృతముతో ప్రకృతమునకు గుణక్రియా రూపములగు ధర్మములలో నేదే నొకదానితో పోలిక ఒకేతూరి మాత్రమే వాచ్యమగునెడల ఉపమాలంకారము." అని లక్షణ మనువదించిరి.

నిజమునకు స్వతసిద్ధమను విశేషణముతో ఉపమానమును విశేషించిననూ ఉత్ప్రేక్షావ్యావృత్తి దుర్ఘటము. ఏలన, దవ్యస్వరూపోత్ప్రేక్షకు శ్రీచలమచర్ల రంగాచార్యుల మూలానువాదరూపమగు నుదాహరణము,

నిచ్చలిట గానరాదుగా నిండుదనము
పొమ్మటంచని వినువీథి, పుడమి దిగిన
చలివెలుంగనఁ దమిఁదేల్చి, వెలయు నడుగో
కలికిగోనముల యెకిమీడు తెలుగుతేడు,

ఇచ్చట నుపమానమగు చంద్రుడు స్వతస్సిద్ధుడు.

అటులనే:—

సటలె కా నొకకొంత చాలదు పౌరుషం
బాయుధప్రౌఢి యావంతలేదు
జననమెంచినఁ బ్రదోషంబు పాలౌట మా
టికి పుట్టినట్టి చోటికిని చేటు
నెఱఁజిన్నవాని కెన్నిక గాని తనబల్మి
ద్వేషిఁగన్నను నోరుదెఱచి కొనుట
పాటింప నోరి బొబ్బాటమే వడిగాని
ఘోరాజిలో బుస కొట్టుచుంట
కొదువ దనకంచుఁ గ్రమ్మర నుదితుడైన
యల్లనరసింహుడునుబోలె నసుమసుమర

స్వమరఘోర ప్రతాపుఁడై చెలగు ధీర!
సరసగుణహార ! యోబయ నరసధీర !

అను కావ్యాలంకార సంగ్రహోదాహరణ మందలిఉపమానమగు నరసింహుఁడు స్వతస్సిద్ధుఁడు.

"అట్లేల, 'సురభిసమాగతారణ్యరాజి నూతన నఖక్షతంబుల భాతి' యన్నప్పటి వలె 'భూమికి దిగినచంద్రుఁడు క్రమ్మర నుదితుఁడైన నరసింహుఁడు' అను విశేషణ విశిష్టోపమానములు కవికల్పితములే." అంటే,

చంద్రబింబమునుండి విషమ్మువోలె
నాశ్రయాశుని వలె మలయజమునుండి
వెలది వదనమునుండి యా వెగటుమాట.
అన నసంభావితోపమ యగును జూవె.

ఇది అసంభావితోపమ. ఇందు విషానలములు స్వతస్సిద్ధములైనను చంద్ర మలయజ జనితములుగా కవికల్పితములు. కాన లక్షణ మవ్యాప్తమగును.

అదీగాక,

"సురసరి దంభోఝుర మం
బరమున నిరువంకలందుఁ బారినఁ దానన్
బురుడింప వచ్చు ముత్తెపు
సరముల నలరారు నీలశార్ఙ్గి యురమ్మున్."

"హరి ప్రస్థమునకు పయనమగుచున్న శ్రీకృష్ణుడు ముక్తామాలా లంకృతుఁడైన తరి, అతని వక్షము, ఆకసమునకు ఒక్కవైపునఁగాక యిరువైపులఁ దెల్లని గంగా ప్రవాహము పారుచుండెనేని, అట్టి నీలాకాశముతో పోల్పఁజాలియుండెను." అనుచో, ఇరువైపుల గంగాప్రవాహముగలగగనము కవికల్పితమేగాని స్వతస్సిద్ధముగాదు. "పురుడించు" అనుపదము పోలికను దెల్పునుటలో విప్రతిపత్తిలేదు. కనుక నిది యుపమ. ఇం దుపమానము అసిద్ధమును.

ఇక, 'అనన్వయము కెవడి నభిన్నంబుగాక.' అనునది విచారింతము. "అనన్వయ వ్యావృత్తికై ఉపమానమునకు భిన్నమను విశేషణము. అనన్వయమున ఉపమానోపమేయములు రెండునూ ఒకే పదార్థము. ఉపమయందు ఉపమానము ఉపమేయమునకన్న భిన్నము. కనుక భిన్న విశేషణముచే అనన్వయ వ్యావృత్తి." అనుట సరిగాదు.

ఏలన,

"పలుగతినములకు నెలవగు
వలిమల కొనగరింప దిశము హై భవహ్నానిన్
పలుగుణముల మరుగగు దో[ములన్."
షలవము; మచ్చయును బోలె శశికిరణ

"చంద్రకిరణములయందు మచ్చవలె ననేక గుణములయందు నొక సూక్ష్మదోషము మరుగుపడి పోవును." అను నృపపాదకోపమయందు సామాన్యరూపములగు దోషగుణములు ఉపమేయములు, వానిలో విశేషరూపములగు కిరణ కలంకములు ఉపమానములు. కనుక తదంతర్గతములేగాని భిన్నములుగావు. అందుచే ననన్వయ వ్యావృత్తికై భిన్నవిశేషణమువల్ల లక్షణ మవ్యాప్తము.

"అట్లుగాదు. నవీనమతానుసారము ఇది ఉపమాలంకారముగాదు. సామాన్య విశేషములకు పోలిక పొసగదు. అచ్చట 'వలె'కు అవయవమని యర్థము. అందువల్ల ఇది ఉపమగాదు. అలంకారాంతరము. ఇందులక్షణము ప్రసరింపకుండుట నవ్యాప్తిదోషములేదు." అంటేని, ప్రాచీన మతము ప్రకారము దుష్టమేగదా?

లేక "భిన్న" మనుటకు "ఉపమేయమున కన్న భిన్నము" అనిగాక, "ఉపమేయ ధర్మమున కన్న భిన్నమగు ధర్మముతోగూడినది." అని యర్థము. ఉపమేయ ధర్మములగు గుణత్వ దోషత్వములకంటే భిన్నములు ఉపమాన ధర్మములగు కిరణత్వములు కాన వానితోగూడిన ఉపమానము ఉపమేయభిన్నమయినది. అవ్యాప్తిలేదు. "అతని కతండెసాటి చతురబ్ధి పరీత మహీతలంబునన్" అను అనన్వయమున అతనితనము, ఉపమానధర్మము ఉపమేయధర్మమును కాని భిన్నముగాదు. అందున తద్వ్యావృత్తి. అంటే,

అతివిమలము నుడివలె మతి
మతివలె గతియు గతివలె సమజ్ఞయును సదా
వితరణ జలపూర్ణ తరం
గిత హస్త వనీప తతికి క్షితిపతి మణికిన్.

ఇది రసనోపమ. ఇందు "నుడివలె మతి, మతివలె గతి" అనుచో మతి ఉపమేయము ఉపమానమును. మతిత్వమే ఉపమాన ధర్మము, ఉపమేయ ధర్మమూ. కనుక ఉపమేయ ధర్మ భిన్న ధర్మవిశిష్టత్వము ఉపమానమున కిట పదరదు. క్రొత్త వివరణవల్లనూ దోషము తొలగలేదు.

మరి "రసనోపమ అనేకోపమాశ్రేణి గాన దోషములేదు" అనిన, ఈ దళముచేత నే:—

శరణాగత భరణంబున
నరసింహుని సాటివచ్చు నరసాహసు డీ
నరసింహు: డితని కెన యా
నరసింహుడె కాక యితర నరులకు వశమే.

అను నుపమేయోపమావ్యావృతి గలుగుచున్నది. వర్ణనీయుడగు నరసింహభూపతి యొక వాక్యమున ఉపమేయము, మరొకవాక్యమున నుపమానము. నరసింహ (భూపతి) త్వము ఉపమానోపమేయ ధర్మము. అటులే (దేవ) నరసింహత్వము. కాన ఉపమానమునకు ఉపమేయ ధర్మభిన్న ధర్మవిశిష్టత్వము రాదు. అటులనే

అర్థమును బోలి ధర్మంబు నమరుఁ జెల్లు
ధర్మము కరణి నర్థము; తనరువాని
మాడ్కి కామము; నెసగు కామంబు భాతి
శ్రేష్ఠ ధర్మార్థములు రుద్రుఁజేరి సతము.

అను ఆంధ్రప్రతాప రుద్రీయోదాహరణమునను భిన్నవిశేషణముచేతనే ఉపమేయోపమావ్యావృత్తి సిద్ధించుచుండ, నందుకై ప్రత్యేకముగ "నినుమారు వరుసలఁ దడవకున్న" అను విశేషణము వ్యర్థము.

ఇంకనూ;

వారి వాహ సమాన వారణంబుల తోడ
పత్తివ్రజో ద్ధూత పాంసు సంఘముతోడ
భువిని దివివలె; దివిని భువికైవడిని జేయు
చరుల గుండియ లదుర నరుదెంచె నారేడు.

అను పరస్పరోపమయందు "దివిని భువికైవడి" అన్న ద్వితీయవాక్యమున నుపమానమగు "భువి", పూర్వవాక్యమగు, "భువిని దివివలె" అందు ఉపమేయమగు భువియొక్క ధర్మమునకన్న భిన్నమగు ధర్మముతో కూడినది గాదు, రెండింటను భూత్వమొక్కటే ధర్మము. కనుక లక్షణ మవ్యాప్తము.

మరి, "ఇది ఉపమేయోపమయే గాని, ఉపమ గాదు. ఇందు లక్షణావ్యాప్తి దోషము గాదు." అంటే, కాదనరాదు. ఉపమేయోపమాజీవమగు తృతీయ సదృశ వ్యావృత్తి ఈ పర్యాయోపమయందుఁ గానరాదు. ఒకే ధర్మముచేత పర్యాయముగ నుపమానోపమేయత్వము వర్ణించిననే యది సిద్ధించును. ఒక్క ధర్మముతో నొక వస్తువునకు వేరొండు వస్తువుతో సామ్యము వర్ణించిన, ఆ వస్తువుతో వేరొండు వస్తువునకు ఆ ధర్మముతో సామ్యము అగ సిద్ధము. వినప్పుడు మరల వాకొనుట వ్యర్థము. వ్యర్థమగుచు నాధర్మమున వానికి సమానము తృతీయము లేదని తెలుచున్నది. రెండవమారు ధర్మాంతరముతో సామ్యము వర్ణించిన ఆ ఫలము సిద్ధింపదు.

ఇచ్చట మొదటివాక్యమున భువిదివులకు బింబ ప్రతిబింబ రూపమగు వారివాహ వారణంబులు సాధారణ ధర్మము. రెండవ వాక్యమున దివిభువులకు పాంసుసంఘము అనుగామి సాధారణ ధర్మము. కాన తృతీయ సదృశ వ్యావృత్తిలేదు. అందుచే నుపమేయోపమ గాదు. పరస్పరోపమయే. లక్షణ మవ్యాప్తమే.

లేక, "భిన్నమనుటకు, 'తన కుపమేయమగుదాని ధర్మమునకన్న భిన్నమగు ధర్మముతో గూడినది.' అని యర్థము. 'దివిని భువికైవడి' అనుచో భువి తన కుపమేయ మగు దివియొక్క ధర్మమగు ద్యోత్వమునకన్న భిన్న ధర్మమగు భూత్వముతో గూడినది. కాన లక్షణము సుసంగతము. అనన్వయ వ్యావృత్తియూ సంపన్నము" అంటే,

"భిన్న" మనుట కిట్లు అర్థము చెప్పిననూ, ఇష్టాపూర్తి దుర్ఘటము.

"ఇచ్చి నినుఁబోలుదువు గాని యివ్వకుండ
నన్నుఁబోలకు భాగ్య సంపన్న!" యనుచు,
తిరిగి యిల్లిల్లు, జోగి బోధించు చుంట
గాని, బికిరమ్ము నెత్తుట గాదు సుమ్ము.

అను పద్యమున, "నీవు నినుబోలుదువు." అనిన ఒకేవ్యక్తి ఉపమానము ఉపమేయమునూ. నీతనము ఒక్కటే తద్ధర్మము. కాన ఉపమేయ ధర్మభిన్న ధర్మవిశిష్టత్వ మనుభిన్నత్వమూ ఉపమానమునకు కుదరదు. కాన లక్షణదోషము తదవస్థము.

ఇందువల్లనే "ఎచ్చట రెండు వస్తువులకు సాదృశ్యసంపద విలసిల్లునో అచట నుపమాలంకార ముండును." అను, ఆంధ్ర కువలయానంద లక్షణము పరాస్తము.

ఇక, "శ్లేషంబువలె పదశ్లిష్ట మాత్రము గాక, సార్థకమై" అను విశేషణములు సామ్యమునకు ప్రయుక్తములు. వాని గమనింతము.

సామ్యము=పోలిక; అది, "వలె, పోలె" మొదలగు సామ్యవాచక పదములచేతను, "ఈడు, జోడు" మొదలగు ధర్మివాచక పదములచే నీ పదంతరితముగను వాచ్యమగుచున్నది. దీనిన్నే క్రమముగ "శ్రౌతి, ఆర్థి" అని

నుడివిరి. ఇట్టి సామ్యమును "పదశ్లిష్టము గాక సారము," అను పదములచే విశేషించుట యసంగతము.

శ్లేషగలది సాధారణ ధర్మము గాని సామ్యముగాదు. "చంద్రబింబము వలె ప్రోలు సకలకలము." అనుచో చంద్రబింబము సమస్తమైన కలలు గలది. ప్రోలు కలకల సహితము. రెండింటికిని అనుగతైక ధర్మములేదు. సకల కలత్వమను శబ్దమే సాధారణ ధర్మము. అది శ్లిష్టము. 'వలె' సామ్యవాచకము. అందు శ్లేష లేదు. కనుక "పదశ్లిష్ట మాత్రముగాక సారము" అను సామ్య విశేషణములు నిరర్థకములు.

అందుకే రంగాచార్యులు "గుణక్రియా ధర్మములతో నేదే నొకదానితో పోలిక." అని అనువదించిరి. వాస్తవమునకు శ్లేషవల్ల నేర్పడిన రెండర్థములకూ అభేద మాపాదించుటచేత ఏక సాధారణ ధర్మ మిందునూ ఒనగూడుచున్నది. "అనుగత సాధారణ ధర్మమున్ననే ఉపమ" అను నియమములేదు.

తరుణారుణ రాగము ని
ర్ఝరధారల నారపునాలయు శైలేంద్రముతో
సరిపోలు రంజనాంచితు
డురమున ప్రాలంబహారు డుర్వీభుజుడున్.

ఇందు, రంజనము=రక్తచందనము; తరుణారుణ రాగము=బాలసూర్యాతపము; ప్రాలంబ హారము=బుజువుగ వ్రేలాడు ముక్తాహారము; నిర్ఝరధార=సెలయేటిధార; పై ఉపమానోపమేయ విశేషణములు బింబప్రతిబింబ భావాపన్నములై సాధారణ ధర్మములుగ గైకొనఁబడినవి. కనుక, "అనుగత సాధారణ ధర్మమే ఉపమా ప్రయోజకము." అను నియమములేదు.

అదీగాక, "శబ్దసామ్య మున్నప్పుడు ఉపమ కారాద"ను శాస్త్ర బహిష్కారము ఏమున్నది?

సంతోషకరు డౌట చంద్రుడైన విధాన,
తాపకరుడౌటచే తపనుడైన విధాన,
అన్వర్థనాముడై యలరారె భూజనుల
రంజించుటను జేసి రాజగుచు నారేడు.

ఇచ్చట "అన్వర్థనామము" అను శబ్దమే సాధారణ ధర్మమగుచున్నది. కాన శబ్దసామ్యమున్ననూ ఉపమకు క్షతిలేదు. అందువల్ల శ్లేషవ్యావృత్తికై పై విశేషణ విన్యాసము వృథాయాసము.

మరి, "ఇచ్చటగూడ శ్లేష గాకపోయిన, శ్లేషకు వేరులక్ష్యము లేదు. నిరవకాశమైన శ్లేష 'చంద్రబింబము వలె ప్రోలు సకల కలము' అనుచో నుపమాబాధకమై, తాన సిద్ధమగుచున్నది. కనుక ఇట నుపమా ప్రతిపాదకమైన శ్లేషాలంకారమే" అంటేని, శ్లేషకు ప్రత్యేక లక్ష్యము లేకేమి?

"భువన ప్రసిద్ధమౌ పుష్కలావర్తక
పుణ్యవంశంబునఁ బుట్టు వంది,
విష్టప త్రయమేలు విబుధాధి నాథుని
యాప్తవర్గమున నాయకతఁ గాంచి,
యవ్యాజకరుణ లోకాళి కెల్లను జీవ
నమ్మిచ్చు నెఱదాతనాఁ దనర్చి,
సంతత సన్మార్గ చారుశ్రీ కులము పె
ద్దలలోన నింత పెత్తనముఁ గాంచి,
యొసఁగు ఘనుడ వటంచు నిన్నెఱిగి యిట్లు
ప్రీతిమెయి నాశ్రయించితి; విధివశమున
దూరబంధుండనైన నాతీరు కొంత
వినుతు; నాయెడ కరుణింపవే మహాత్మ!"

అను దీపాల పిచ్చయ్యశాస్త్రిగారి మేఘదూత పద్యమున "జీవన, సన్మార్గ, ఘన" పదములకు శ్లేష. అది వేరు అలంకారములకు నుపపాదకముగాదు. అటులనే,

"ఇంతుల నేచు పాతక మ
దింతట నంతటఁ బోదు పాంథ లో
కాంతక! నిన్ను ఘోరతమమై
ఘనమై యజహాత్కళంకమై
వంతలు పెట్టి యారు పది వ్ర
క్కలు సేయక; పూర్వపక్షపుఁ
గంతుల కేమి; చూచెదవుగా
తుది నీ బహులార్తిఖేదముల్."

అను వసుచరిత్రమునందు, విరహిణి యగు గిరిక తన్ను పీడించు చంద్రుని బాధ సైరింపలేక, యేమి సేయను దోచక శాపనార్థముల నాతనిపై గుమ్మరించుచున్నది. "విరహిజనులకు, అందునను చేతగాని యబలలకు కావించిన కలుషము ఘోరతమమై=అత్యంత భయంకరమై, రాహువై; ఘనమై=దట్టమై, మేఘమై; అజహాత్కళంకమై = వీడరాని, లోకాపవాదమై, మచ్చయై; బాధించును. పదునారు ముక్కలు సేయక వదలదు. పూర్వపక్షపు=ఈ తొలుతటి

శుక్లపక్షమందలి; గంతులకేమి=మిడిసిపాటు కేమి, అభివృద్ధికేమిలే? బహుల=అధికమైన, కృష్ణపక్షమందలి; ఆర్తిఖేదముల్=కష్టపాటు, ఏ తత్పాప ఫలితము అనుభవించెదవులే.” అని తిట్టిపోయుచున్నది.

ఇందు పైపదములు అనేకార్థ ప్రతిపాదకములు కాన శ్లేష కేకచ్ఛత్రాధిపత్యము. “పాతకమనే రాహువు, రాహువువంటి పాతకము.” అని ఉపమేయోపమాన భావములేదు. కాన ఉపమా రూపకాదుల కిందు నవకాశములేదు.

“ఆ పట్టణమే లెడు పృథి
వీపాలుడు భృకుటి మాత్ర విముఖిత సమదా
టోపారి పంక్తిరఘు డు
ద్దీపించు నుదాగరీతి ధృతరాష్ట్రి డనఁగ.”

అను రాఘవపాండవీయ పద్యమున రెండర్థములూ ప్రకృతములు. ఇత్యాదులు శ్లేషకు వివిక్తోదాహృతులు. నిజమునకు వివిక్త విషయమవసర మనుట వాగాయిత్యము. స్వప్రవృత్తినిమిత్తమును పురస్కరించుకొని ఆయా యలంకృతులు నిస్సహాయముగనో, సంశ్లిష్ట సంకరములుగనో కావ్యశోభాకరము లగుచుండును. అన్ని యలంకృతులందునూ అంతో యింతో అతిశయోక్తి సంబంధ ముండకపోదు. ఎందునేది చమత్కారజనకమో తత్ప్రాధాన్యక నిర్దేశము. అందుకు సహృదయ హృదయమే ప్రమాణము.

“నీ మొగంబున కోడిన నీరజాత
మధిక మగులజ్జ నీరములందు మునిగె:
చందురుడు నోడి వెలవెల గ్రందుకొనఁగ
మెయిలుచాటున నల్లదె మునిగె, కలికి!”

“ఇందు చంద్రుడు మేఘములలో మునిగెననియు, పద్మములు నీటియందు మునిగె’ ననియు వర్ణింపఁబడినది. ‘మునుగుట అను శబ్దమును, మునుగుట’ యను అర్థమును ఆవృత్తమగుటచే ఇది యుభయావృత్తి దీపకము.” అని కువలయానంద సారమున శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు.

నీర నీరదములయందు కమలచంద్రులు మునుగుటకు లజ్జ కవికల్పిత హేతువేగాని స్వతసిద్ధముగాదు. ఆ హేతువును హేతువుగ చెప్పినందున గమ్యహేతూత్ప్రేక్ష. అయిననూ ప్రవృత్తినిమిత్తభేదమును బట్టి ఆవృత్తి దీపకమున కుదాహరించిరి.

దీనినే, “మొయిలు చాటున నల్లదె మునిగినట్లు.” అని కడపటకొంత మార్చిన, పూర్వపు మునుగుధాతువునకు కేవలము ప్రత్యయము మార్పేగాని పూర్వపు టన్వయమునకు, అర్థమునకు ఏలాటి భంగములేదు. ఐననూ అది ఉపమాలంకృతిగ కీర్తింపఁబడును.

“వర్ణ్యావర్ణ్యములకు పోల్కిగదా ఉపమాలంకారము. ఇందు రెండునూ అవర్ణ్యములే. ఉపమ యెట్లగును?” అనుటకు సమాధానము పైన వివరింతుము.

“సకలకల” మన్నప్పుడు శ్లేష ఉపమా ప్రతిపాదకమునూ గాదు. పైగా ఉపమయే శ్లేష ప్రతిపాదకము. పురవర్ణనమున పురము సకలకల మన్నప్పుడు, “చంద్రబింబమువలె” అని పోలిక కూర్చకున్న శ్లేషకు నిదానమగు రెండవ యర్థమునకు నవకాశమే కలిగెడిదిగాదు.

కనుక, “శ్లేషంబువలె పదశ్లిష్ట మాత్రము గాక.” అనుటయు నిరర్థకము.

ఇక, “రూపకాదులక్రియ వ్యంగ్యంబుగాక సామ్యము వాచ్య మగునేని,” అనునది తడవుదము.

“పొగరు పడెదవేల మృగలాంఛనా మూఢ!
సాటిలేని కాంతి మేటినంచు?
ఎవడు వెదకి వచ్చె నీ చతురంబోధి
మండితమును భూమిమండలమును.”

అనుచో వ్యంగ్యమగు నుపమ “మూఢ” పదముచేత చంద్ర విషయకముగా ధ్వనించు వక్తృగతమగు ననూయకు నుపస్కారమై అలంకారమగుచున్నది. ఇందు పోల్కి వాచ్యముగాదు. కాన లక్షణ మవ్యాప్తము.

ఇక “ప్రతీపమట్లు తలఁప క్రమవిపర్యాస సహితంబు గాకయున్న” అనునది గమనింతము. ప్రతీపమునందు సామ్యము క్రమవిపర్యాస సహితము. ఉపమయం దట్లుకూడదు- అని వక్తృవివక్ష. ప్రతీప వ్యావృత్తికై పైవిశేషణము ఔపమ్యమునకు వాడుట అరుచిరము.

ఇతని ప్రతీప లక్షణము:—

“ఉపమేయముచాలును ధగ
నుపమానంబేల? యనగ నొనరు ప్రతీపంబు.”

“ఉపమానముయొక్క పని ఉపమేయమే చేయుచుండ ఉపమానమేల? అని వర్ణింపఁబడినచో ప్రతీపము.” అని శ్రీసన్నిధానము సూర్యనారాయణ శాస్త్రుల వివరణ,

"అతనికీర్తి ప్రతాపంబు లవనిఁగలుగ
నేల నివి యని మదిలోన నెపుడు దలఁచు,
నపుడ పరివేష నెపమున నబ్జసూర్య
మండలముల విధాతృండు కుండలించు."

శృంగార నైషధమున, "నలునికీర్తి ప్రతాపములు రాణించుచుండ చంద్రసూర్యులతో నిమిత్తములేదు." అని వర్ణితము. ఇది పైలక్షణము నకు లక్ష్యమగుచున్నది. ఇందు సామ్యము వాచ్యముగ లేదు. అందువల్లనే అతని లక్షణము మేరకు నిం దుపమ లేదు. "వంగ్యముగ సామ్య మున్న" దంటే సామ్యము క్రమ విపర్యాస రహితమనుటలో నర్థ మేమి?

అతని స్వోదాహరణము చూతము.

"సత్పథక్రమ కళా చాతురి నొందదో
కమలాకరామోదకరము గాదో
వివిధ చక్రానంద విభవం బొనర్పదో
సతతంబు నుదయ సంగతము గాదో
ఇలమహాగ్రహరాజ జృంభణ బలమదో
యమిత దోషాస్మేషహరము గాదో
మహితగాంగేయ ధామస్ఫూర్తిఁ జెలఁగదో
యచ్యుతోగ్రాకారహారి గాదో
నీ ప్రతాపంబు దనవోలె నఖిలతమము
నడపఁగాలేదొ తా నేల నరుగుదెంచెఁ
గుంటిసారథితో నల్ల కుముదవైరి
నరనుతాటోప! యోబయనరస భూప!"

పైయుదాహరణమున కుముదవైరివలె రాజు ప్రతాపము నాయా కార్యములఁ జేయుచున్నది. కాన అతడేల? అని యనుటతో అతని గక్షణానుసారము ప్రతీపము అగుచున్నది. కాని నైషధ పద్యమునకును దీనికిని కొంత భేదమున్నది. "నీ ప్రతాపంబు తనవలె నిఖిలతమము నడపగాలేదా?" అని సామ్యవాచకము, ఉపమానోపమేయములు, "తమమునడచుట," అను సాధారణ ధర్మము అను ఉపమాసామగ్రి సంపూర్ణముగనున్నది. సీసపాదములందును "నీప్రతాపంబు తనవలె సత్పథక్రమకళాచాతురి నొందదో," అని యన్వయించుటచేత ఉపమాసామగ్రి సమగ్రము. ఐననూ ఎత్తుగీత రెండవ పాదము సర్థమునుండియే ప్రతీపము పొడగట్టుచున్నది. అంతకు పూర్వపు పద్యభాగమున ఉపమయే ప్రతీపమున కుపపాదకముగ నిండుకొని యున్నది. అందు సామ్యము వాచ్యమైననూ ఎట్టి వ్యతిక్రమమునూ లేదు.

"క్రమ విపర్యాససహితంబుగాక యున్న" అనుటకు మూలము, "సామ్య మన్యేన వర్ణ్యస్య" అని.

"అప్రకృతముతో ప్రకృత వస్తువునకు పోలిక" అను విశేషణమువల్ల ప్రతీపాలంకారము వ్యావర్తింపఁబడుచున్నది.

ఎంతవెత్తి దీలోక మదేమి సేయు?
ఎవనికని సెప్పఁ? జెలియరో! యిట్టులటవె?
ఇస్సి! కనకాచలం బుపమింపఁ బడెడి
వీరరుద్రునితో నిట్టి వింతలున్నె?

"ఇట నప్రకృత మగు మేరువు ప్రకృతమగు ప్రతాపరుద్రునితో పోల్చఁబడినది. ప్రతీపాలంకారము, ఉపమాలంకారము గాదు." అని రంగాచార్యులు.

"ఇట్లు ప్రకృతాప్రకృతములకు ప్రసిద్ధమగు ఉపమేయోపమాత్వ వ్యత్యయమే ప్రతీపము." అని కావ్యాలంకార సంగ్రహకారుని భావన. కాని తదనుగుణముగ లక్షణ నిర్వచనము లేదు.

ఉండనీ, "అన్యముతో=అప్రకృతముతో సామ్యము" అనునదెంత మాత్రము సమంజసము?

"తన భవ్యధామంబు తనభవ్యధామంబు
కరణి మిత్రోన్మేష కరముగాగ
తన ధర్మగుణములు తనధర్మగుణముల
ట్లతులిత శ్రుతిమార్గ గతుల నెసగ
తన మహాహవ దీక్ష తనమహాహవ దీక్ష
పగిది నానావనీపకులఁ బెంపఁ
తన యంబకంబులు తన యంబకములట్ల
పరభీరు విముఖిత పరిధవిల్లఁ
బరఁగుఁ గఠినాద్రి జడలుఠజ్జరఠ కమఠ
కూట కిటి గూఢచరణ దిక్కోటికరటి
కుటిలతాసహ భూసౌఖ్యఘటన భూరి
భుజబల విహారి యార్వీటి బుక్కశౌరి"

అను వసుచరిత్ర పద్యమునందు బుక్కశౌరి గుణగణము వర్ణితము. అతని భద్రమైన గృహము అతని ప్రశస్తతేజము వలె, మిత్రోన్మేషకరము=బంధుజనానందకరము, సూర్య వికాస సంధాయకము ఇత్యాది. ఇందు రెండు విధములగు భవ్యధామములు ప్రకృతములే గాని ఒక్కటియు నన్యము గాదు. కనుక అన్యము అప్రకృతము అనుటవల్ల లక్షణ మవ్యాప్తము.

(సశేషము)

# మిశ్రలక్షణ గ్రంథములు

శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు

ఆంధ్రవాఙ్మయమున నలంకార శాస్త్రము నకు ప్రత్యేకతకలుగుటకుఁ బూర్వము, తరువాతఁగూడ మిశ్రలక్షణగ్రంథములు—అనగా ఛందో, వ్యాకరణాలంకార విషయ ప్రతిపాదకములు-వెలువడిన ట్లిదివఱలోఁ జెప్పఁబడినది. ఆ గ్రంథములనుగూర్చి యిచట సంగ్రహముగ వివరింపఁబడును.

లక్షణములను సంకీర్ణముగ వివరించుపద్ధతి తొలుతనుండియు నున్నది. చింతామణియందు సందర్భానుసారముగ చందో విషయము లత్యల్పముగ వివరింపఁబడుటచే అది మిశ్రలక్షణ గ్రంథము కాఁజాలదు. ఆరీతినే తద్వ్యాఖ్యానములగు బాలసరస్వతీయము, అహోబల పండితీయము కూడ మిశ్రలక్షణములలోఁ జేరవు. కావ్యాలంకార చూడామణిలో ప్రధానమైనది అలంకార శాస్త్రవిషయము కావున, అదియు మిశ్రగ్రంథము కాఁజాలదు.

## కవిజనాశ్రయము

మిశ్రలక్షణ గ్రంథములలో మొదటిది రేచన కవికృతమగు కవిజనాశ్రయము. దీనికి 'భీమనఛందస్సు' అనువాడుక కలదు.[1] కాని దీనిని రచించినది భీమకవి కాఁడనియు రేచన యనియు కవిచరిత్రకారులలో చాలమంది యంగీకరించియున్నారు.

కవిజనాశ్రయము ప్రాచీన చ్ఛందో గ్రంథములలో మొదటిది. కుమారసంభవ కర్తయగు నన్నిచోడ మహాకవి దీనిం జూచినట్లు తెలియుచున్నది. ఈ కవిజనాశ్రయము కన్నడమున నాగవర్మ రచించిన ఛందోంబుధి ననుసరించినట్లు తెలియుచున్నది. నాగవర్మ క్రీ. శ. 990 ప్రాంతమువాఁడు.

కవిజనాశ్రయములోని 'అమరఁగ వేల్పులచే' అను పద్యమును మడికి-సింగన తన 'సకలనీతి సమ్మతము'లో నుదాహరించియున్నాఁడు. సింగన 1400 ప్రాంతపువాఁడు. దీనింబట్టి చూచినను రేచన 13వ శతాబ్ది వెనుకకు రాఁడు.

కవిజనాశ్రయము ఛందోవిషయ ప్రతిపాదకమగు గ్రంథము. అలంకార శాస్త్రమునకుఁ జేరిన 'కావ్యప్రయోజనములు, కావ్యభేదములు, కావ్యదోషములు నిందు వివరింపఁబడినవి. పయి విషయములు కావ్యాదర్శము నుండి గ్రహింపఁబడినట్లు తోఁచుచున్నది. రేచన పయివాని మూలముం గూర్చి ప్రస్తావింపలేదు; కాని దశదోషములను వివరించునెడ తాను 'మునిమతము' ననుసరించినట్లు చెప్పియున్నాడు.[2] ముని యనఁగా భరతమునియే యనుట ప్రసిద్ధము. కాని దోషముల పేరులను, లక్షణములను బట్టి చూచినచో నాట్య శాస్త్రదోషములకు కవిజనాశ్రయదోషములకుఁ జాల భేదము కన్పించుచున్నది. మఱియు నిందలి దోష, లక్షణములు దండికావ్యాదర్శమునకు సరిపడుచున్నవి.[3] మఱియుఁ గావ్యాదర్శమునందువలె నిందును

1. కవిజనాశ్రయము భీమనకృతమనియే అభిప్రాయపడి, ఆంధ్ర సాహిత్యపరిషత్తువారా రీతినే రెండు సార్లు ముద్రించియున్నారు.

2. క. అని యిట్లు దశవిధములగు, ముని మతమునఁ గావ్యదోషములు; వాని నెఱుం
గనివాఁ డెప్పాట నెఱుంగు నుదాత్తకృతి ప్రసంగ గుణ దోషములన్.
[దోషాధికారము. ప. 3]

3. గూఢార్థ మర్థాన్తర మర్థహీనం భిన్నార్థ మేకార్థ మభిద్రుతార్థమ్,
న్యాయాదపేతం విషమం విసంధి శబ్దచ్యుతంవై దశ కావ్య దోషాః. [నాట్య. 16]
క. రూపిత పునరుక్తి వ్యర్థా పార్థ విసంధి సంశయ చ్ఛందోభం
గాపక్రమ యతిభంగ విరూపోక్త్యపశబ్దములు విరోధము కృతులన్. [2]
అపార్థం వ్యర్థమేకార్థం ససంశయ మపక్రమమ్
శబ్దహీనం యతిభ్రష్టం భిన్నవృత్తం విసంధికమ్
దేశ కాల కలాలోకన్యాయాగమ విరోధి చ. [కావ్యాదర 3 అ.]

'వ్యర్థము' మొదలగు దోషములు కొన్ని కొండొకయెడ గుణములు కావచ్చునని చెప్పఁబడినది. ఈవిషయము నాట్యశాస్త్రమునఁ గానరాదు. రేచన భరత నాట్యశాస్త్రము చూడక పోవుటనో, తన్నామ ప్రతిపాదనమునఁ దన గ్రంథమునకు గౌరవము కలుగునని తలంచుట చేతనో, కావ్యాదర్శనామమును తెల్పుట కిష్టపడనందుననో 'ముని'ని పేర్కొనెనని చెప్పవలెను.

కవిజనాశ్రయమును ఆంధ్రసాహిత్య పరిషత్తువారు రెండుపర్యాయము లచ్చొత్తించినారు. అది పరిషదధ్యక్షులగు శ్రీ జయంతి రామయ్యపంతులుగారి విపులపీఠికతో వెలువడినది. ఇందుఁ దొమ్మిదధికారములు కలవు. మొదటిదగు సంజ్ఞాధికారమున గురులఘు వివేకము, గణనిర్ణయము, వడిప్రాసముల నిర్ణయము కలవు. రెండవదగు వియతిచ్ఛందో అధికారమునఁ గ్రమమున 26 ఛందములు, యతిలేని వృత్తములు, ఆ వృత్తముల లక్షణములు సూక్ష్మముగ వివరింపఁబడినవి. మూఁడవదగు యతిచ్ఛందోధికారమున యతి నిలుపఁదగిన వృత్తములు వివరింపబడినవి. నాల్గవదగు ఉద్ధరమాలావృత్తాధికారమున లయగ్రాహి, లయవిభాతి, త్రిభంగి, లయహారి, దండకలక్షణములు కలవు. ఐదవదగు అర్ధసమవృత్తాధికారమున నారీప్లుత, రతిప్రియాది వృత్తములు వివరింపఁబడినవి. ఆరవయధికారమున విషమవృత్తముల వివరణకలదు. ఏడవదగు జాత్యధికారమున కందము, ఆర్య, గీతిభేదములు, సీసము, ఉత్సాహ, తరువోజ, గీదియలు, అక్కఅలు, ద్విపద, త్రిపద, చౌపద, షట్పదములు వివరింపఁబడినవి. ఎనిమిదవ యధికారమున ఛందశ్శాస్త్రీయ షట్ప్రత్యయములు, తొమ్మిదవ యధికారమున దోషములు తెలుపఁబడినవి.

ఇందలి దోషాధికారము ఛందశ్శాస్త్రమునకు సంబంధించినది కానందునను, దీనిని ప్రక్షిప్తమనుటకుఁ దగిన యితరకారణములు కానరానందునను, గ్రంథభాగముననే గ్రహింపఁబడినదని ఆంధ్రసాహిత్య పరిషత్తువారు అధస్సూచికయందు వ్రాసియున్నారు. [కవిజ-పుట. 79.] దీనింబట్టి పయివిషయము ఛందస్సంబంధ కానందునఁ బ్రక్షిప్తమనుట యుక్తమని పరిశోధకుల యాశయమైనట్లు తేలుచున్నది. కాని యాంధ్రమున ఛందోవ్యాకరణాలంకారముల సాంకర్యము తొలుతనుండియు నున్నదియే యగుటచే నిది ప్రక్షిప్తమనుకొన వీలుకాదు. ఇది ప్రక్షిప్తమన్నచోఁ దక్కిన గ్రంథములలోఁ గల విషయాంతరములును ప్రక్షిప్తములే కావలసివచ్చును.

ఈ దోషాధికారమునకు మూలము సంస్కృతమగుటచే నందున్న దోషములే యిందును వివరింపఁబడినవి; కాని యాంధ్రవాఙ్మయమున కుపయుక్తమగు రీతిని దగిన దోషములు వివరింపఁబడలేదు. సంస్కృతమునందువలె నిందును ఛందో, యతిభంగములే దోషములని చెప్పఁబడినవి; ప్రాసభంగము విడువఁబడినది.

దోషములపేర్లు అధికారపు 2 వ పద్యమునఁ గలవు. పరిషత్తువారి పత్రికలో లక్షణోదాహరణములు మాత్రము క్రమముతప్పినవి. వరుసగ పునరుక్త, వ్యర్థా, పక్రమ, యతిభంగ, విరూపోక్త్యపశబ్దా, పార్థ, విసంధి, సంశయ, చ్ఛందోభంగ, విరోధముల లక్షణోదాహరణము లీయధికారమున నున్నవి; కాని 2 పద్యమునఁ జెప్పఁబడిన క్రమము ననుసరించిలేవు. అన్ని ప్రతులలోను పయిరీతినే యున్నదఁట! కాని, నూతనముగ (1950 లో) వెలువడిన వావిళ్ళవారి ముద్రణమున మాత్రము సక్రమముగనే యున్నది.

## ఛందోదర్పణము

దీని కనంతుని ఛందస్సను నామాంతరము కలదు. 'రసాభరణము'ను వ్రాసిన అనంతామాత్యుఁడు దీనికిఁ గర్త. ఇతనిం గూర్చి 'అనంతామాత్యుఁడు' అను శీర్షిక క్రిందలి గ్రంథమున విపులముగ విమర్శింపఁ బడినది.

ఛందోదర్పణమును 'చెన్నపురి' లోని వావిళ్ల వారు 1921 వ సం. న ముద్రించి ప్రకటించిరి. దీనికి ఛందస్సునఁ గృషిచేసిన డాక్టర్ గిడుగు వేంకట సీతాపతి పంతులుగారు విపులమగు పీఠికను వ్రాసియున్నారు. దీని ద్వితీయ ముద్రణము 1947 లో శ్రీ నిడుదవోలు వేంకటరావు గారి పీఠికతోఁ గూడ వెలువడినది.

ఇది నాలుగాశ్వాసముల గ్రంథము. ప్రథమాశ్వాసమున దైవస్తుతికిఁ దర్వాత సంజ్ఞా, యతి, ప్రాస ప్రకరణములు ; ద్వితీయాశ్వాసమున గద్య లక్షణము, వృత్తములు ; తృతీయా

శ్వాసమునజాతులు, షట్ప్రత్యయములు వివరింపబడినవి. చతుర్థాశ్వాసమునం దలంకార శాస్త్ర సంబద్ధమగు దోషవిచారము, దానికవ్వల వ్యాకరణ సంబద్ధములగు సంధి, సమాస వివరణము కలవు.

ఛందోదర్పణమునకు మూలము కవిజనాశ్రయమని తోఁచుచున్నది. అందుఁ జర్చింపఁబడిన పదిదోషములే యిందును కలవు. అందులేని ప్రాసభంగ దోషమిందును లేదు. కవిజనాశ్రయమున విషయ వివరణము సుస్పష్టముగ లేదు; ఇందుఁ జాల సరళముగ నున్నది.

## అప్పకవీయము

కాకునూరి అప్పకవి దీనికిఁ గర్త. అప్పకవియే తన చరిత్రమును గూర్చి పయిగ్రంథమున విపులముగఁ జెప్పి యున్నాఁడు. కాకునూరి వంశపు పూర్వ పురుషుఁడు తమ్మన్న. అతని కుమారుఁడు సోమయ్య. అతనికి గంగమాంబ యందు రంగప్ప కలిగెను. రంగప్ప కుమారులలో మూఁడవ వాఁడగు పెద సోమయ్యకు కృష్ణమ్మ యందు ముగ్గురు పుత్రులు కలిగిరి. అందు జ్యేష్ఠుఁడగు వెంగన్నకు వేనమ్మ యందు అప్పకవి జన్మించెను. వీరిది భారద్వాజ గోత్రము.

అప్పకవి వంశపు పూర్వుఁడు సోమయ్య వేదశాస్త్ర పురాణాది వాదములను, 'కాకునూరింటిఁ జేసిన కారణమునఁ 'గాకునూరింటి వారని ఘనతఁ గాంచె'నని యీ గ్రంథమునఁ బీఠిక యందలి 72 వ పద్యమునుబట్టి తెలియుచున్నది. కాని దాని తరువాతిపద్యమునందేపయి బిరుదము సంపాదించిన సోమయ్య (అప్పకవి తాతకుఁ దాత) చరికొండ సీమలో 'కాకునూ'రను సర్వాగ్రహారమును సంపాదించెనని చెప్పబడినది. సోమయ్య తండ్రి కాకునూరి తమ్మన్న యనియు నీ గ్రంథమున నుండుటచేఁ గాకునూరనునది గ్రామమును బట్టి వచ్చిన యింటిపేరే గాని - పౌరుషనామము కాదని స్పష్టపడుచున్నది. పూర్వముండిన పేరునకే తరువాతి వారు తమ వంశ గౌరవ ప్రకటన కొఱకు వ్యుత్పత్త్యర్థమును విచిత్రముగఁ గల్పించి యుండవచ్చును.

సోమయ్య 'అభినవచూతవర్ధాగ్రము'లో నుండిన ట్లప్పకవీయమునఁ గలదు. ఆ గ్రామము 'క్రొత్త మామిడి పల్లె' అయియుండవచ్చును. అప్పకవి కామెపల్లిలో నుండఁగా నతనికి స్వప్నము కలిగినట్లు, దానిని మాతృబంధువులు వినినట్లు గ్రంథమున గలదు. శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగా రూహించిన ట్లప్పకవి మేనమామల యింటిలోనే పెరిగి విద్యావంతుఁ డయ్యెనని లోకవార్త వచ్చుచుండుటచే, మేనమామలఁ బట్టియే కవి సకుటుంబముగఁ గామెపల్లిలో నుండెనని యూహింపవచ్చును. అప్పకవి కాలము నాఁటికి కామెపల్లి కొండవీటికిఁ బడమటను, శ్రీ శైలమున కీశాన్యదిశను గల తంగెటి సీమలో నుండినదని పీఠికలోని 73 వ పద్యమును బట్టి తెలియుచున్నది. కామెపల్లి యిప్పుడు గుంటూరు జిల్లాలోని పల్నాడు తాలూకాలో నున్నదని శ్రీ లక్ష్మణరావు పంతులు గారి యభిప్రాయము. అప్పకవి పేర్కొనిన కామెపల్లి యిప్పుడు లేదని శ్రీ అక్కిరాజు ఉమాకాన్తము గారి యాశయము.

అప్పకవిది పండిత వంశము. అతని తాతకుఁ దాతయగు సోమయ్య కాశిలో బ్రహ్మేంద్రుల వద్ద శాస్త్రముల నభ్యసించెను. తాతయగు పెదసోమయ్య క్రతువు లొనర్చెను. తండ్రి వెంగన తనపాండిత్య విశేషముచే 'మారటబ్రహ్మ' యని పేరు పొందెను. అప్పకవి చాల మంది గురువుల వల్లఁ జాల విద్యలను సంపాదించెను. ఇతనికి మూర్తి సర్వన్న సస్వరముగ వేదము చెప్పెను; కాండూరి గిరిదేశికులు శబ్దశాస్త్రము నుపదేశించిరి; సూరభట్టు సిద్ధాంతముఁ దెల్పెను; మంచికంటి ఓబకవి లక్షణము చెప్పెను; కోలచలమల్ల లింగనార్యుఁడు స్మార్త ధర్మములఁ దెల్పెను; ఆగమములను రాజయోగి గఱపెను. అప్పకవీయమును రచించు నప్పటికే కవి శ్రీ శైలమున 'భోగివిభూషణు'ని పట్టపుఁ గవీంద్రుడై యుండె నఁట! ఈ భోగివిభూషణుఁడు మల్లికార్జున స్వామియే కాని మానవమాత్రుఁడు కాఁడు. దీనిం బట్టి యప్పకవి కొంతకాలము శ్రీ శైలమున నివసించినట్లు తెలియుచున్నది.

అప్పకవికి, శాలివాహన శకము 1578, మన్మథ నామ సంవత్సర శ్రావణ బహుళాష్టమి నాఁడు, [అనఁగా క్రీ. శ. 1650 సం. ఆగష్టు మూఁడవ తేదీని] కామెపల్లిలో నుండఁగా

గల వచ్చినట్లును, చింతామణికి విపులమగు వ్యాఖ్యానము వ్రాయవలెనని కలలోఁ గన్పించిన శ్రీ మహావిష్ణువు కవికాజ్ఞ యొసఁగినట్లును అప్పకవీయమునఁ గలదు. అప్పకవీయమునకు ముందే కవి యనేకసంస్కృతాంధ్ర గ్రంథములను రచించినట్లు చెప్పికొనెను. కావున నితఁడు పదునేఁడవ శతాబ్దపు ప్రారంభమున జన్మించి యుండవచ్చును. శ్రీ వీరేశలింగము పంతులు గారు తమ కవుల చరిత్రలో 'అప్పకవీయము క్రీ. శ. 1656 మొదలుకొని 1660 వ సం. ప్రారంభమునకు ఇంత వఱకు రచింపఁబడిన'దని వ్రాసినారు. అందుకుఁ దగిన ప్రమాణములు మృగ్యములు.

అప్పకవి సంస్కృతమున 'అపస్తంబ షట్కర్మ నిబంధనమును, కాలబాలార్ణవమునకు శ్లోకరూపమగు సంగ్రహమును రచించెను. ఆంధ్రమున అనంతవ్రత కథ, శ్రీ శైల మల్లికార్జునుని మీఁద శ్లేష నిందాస్తుతిగర్భిత సీస పద్యశతకము, కవికల్పక మనులక్షణ గ్రంథము, స్త్రీలకు ధర్మద్విపద, అంబికాపాద మనుయక్షగానము కవి రచియించిన గ్రంథాంతరములు. పయి గ్రంథముల యందొక్కటియు నిప్పుడు కానరాదు. అప్పకవి యక్షగానమును రచించుటఁ బట్టియు, నితరులు చర్చింపని యక్షగానముల నితఁడు చతురాశ్వాసమునందు చర్చించుటఁ బట్టియు, కవికి యక్షగానముల యెడ నభిమాన మున్నట్లు ఆకాలమున యక్షగానములయెడ జనసామాన్యమున కాదరమున్నట్లును ఊహింపవచ్చును.

అప్పకవీయము అసమగ్రము; అయిదాశ్వాసముల లక్షణ గ్రంథము. కవి దీని నెనిమి దాశ్వాసముల గ్రంథముగా రచింపఁ దలచి యున్నాఁడు.[1] కాని సమగ్రముగ వ్రాసినట్లు తోఁచదు. అప్పకవి చతురాశ్వాసమున గర్భ కవిత్వమును గూర్చి వ్రాయుచు,[2] 'ఇది భాషాపరిచ్ఛేదమునఁ దెలియ వ్రాసినది; ఇది వర్ణపరిచ్ఛేదములోఁ । దెలియఁ జేయఁబడియె; ఇది ప్రాస పరిచ్ఛేదములోఁ దెలుపఁబడియె; ఇది యీ పరిచ్ఛేదమునఁ దెలిపెదము; ఇది సంధి పరిచ్ఛేదములోఁ దెలిపెదము' అని ఆయా ఆశ్వాసాంత పద్యములం గూర్చి తెలియఁ జేయుచు, తత్సమ, దేశ్య, క్రియా పరిచ్ఛేదముల తుదను జెప్పవలసిన పద్యములం గూర్చి చెప్పక పోవుటచేఁ జతురాశ్వాసము వ్రాయుసరికిఁ గవికిఁ బంచమాశ్వాసము వ్రాయు నాలోచనమే కాని తక్కిన మూఁడాశ్వాసములను వ్రాయు నాలోచన మున్నట్లు కన్పింపదు. ఈ విషయము కవి ప్రతిజ్ఞకుఁ గొంత విరుద్ధముగాఁ గన్పించుచున్నది. గ్రంథము పూర్తి కాకపూర్వమే కవి కవసానదశ ప్రాప్తించి యుండవచ్చునని చాల మంది తలంపు.

"నన్నయభట్టుచే రచింపఁబడిన, యెనుబది రెండార్యల పరిమితిగల చింతామణి ననూయచే భీమకవి గోదావరిలోఁ గలిపెనని, అంతకుఁ బూర్వమే దానిని రాజనరేంద్రుని కొమరుఁడగు సారంగధరుఁడు వల్లించి, సిద్ధుఁడై కొన్నివందల యేండ్లు జీవించి క్రీ. శ. 1608 (కీలక సం॥) న బాలసరస్వతికిఁ డీక వ్రాయ నొసఁగెనని, తత్సాహాయ్యమున నాంధ్రమున దానికి విపులమగు వివృతి వ్రాయవలెనని యప్పకవికిఁ గలలో దేవుఁడు చెప్పిన ట్లిందుఁ గలదు. అప్పకవి పయిదాని కచ్చెరువందుచుండగా మతంగపర్వత ప్రాంతమునుండి విప్రుఁ డొకఁడు వచ్చి బాలసరస్వతీయముతోఁ గూడిన చింతామణి నాతని కిచ్చెనఁట!" పయికథను నమ్ముటకు వీలులేకపోయినను, కవి యీ గ్రంథరచనకుఁ బూర్వము ఆంధ్రశబ్ద చింతామణిని జూచియుండలేదని నిశ్చయించవచ్చును.

అప్పకవి చింతామణి నాధారముగఁ జేసికొని మూలమగు 50 కారికలపయిని 1705 పద్యముల వివరణము వ్రాసెను. మూఁడవ

1. "...ఆంధ్ర వ్యాకరణంబు నందలి సంజ్ఞా-సంధి-తత్సమ-దేశ్య-క్రియా పరిచ్ఛేదంబులయిదునుం దెనుఁగుఁ బలుకుల నేను విస్తరించి భాషా పరిచ్ఛేదంబును, వళిప్రాస పరిచ్ఛేదంబును, పద్య పరిచ్ఛేదంబును, సంధి పరిచ్ఛేదంబును, తత్సమ పరిచ్ఛేదంబును, దేశ్య పరిచ్ఛేదంబును, క్రియా పరిచ్ఛేదంబు ననునామంబుల నభిరామంబులగు నాశ్వాసంబులెనిమిదిగా ........"

[పుట. 96.]

2. అప్పకవీయము; చతు—పుటలు-293, 294.

యాశ్వాసమున 'ఆద్యో వళి ర్ద్వితీయో వర్ణః ప్రాసః' అను నొక్క కారిక నాధారముగఁ జేసికొని యతిప్రాస విషయమును విపులముగఁ జెప్పుచు 398 పద్యముల నిచ్చియున్నాఁడు. అప్పకవీయము వ్యాకరణ గ్రంథమగుఁ జింతామణికి వివృతియయ్యు ఛందోవిషయములనే విపులముగ వివరించుచు ఛందోగ్రంథముగనే పేరుపడియున్నది. అలంకార విషయ మిందు గ్రంథాదినే సూక్ష్మముగను, సమగ్రముగను వివరింపఁబడినది. అలంకారాంగమగు బంధకవిత్వము చతుర్థాశ్వాసమునఁ గొంత వివరింపఁబడినది. కాన సర్వలక్షణ ప్రతిపాదకమగు నీ గ్రంథము చింతామణి కాంధ్రీకృతి యనుట కంటె స్వతంత్రగ్రంథ మనుటయే యుక్తము. తన గ్రంథమునకు గౌరవము కల్గుటకయి కవి దీనిని చింతామణ్యాంధ్రీకరణముగఁ బ్రకటింప సమకట్టియుండును.

'ఐశ్వశ్రేయః కావ్య' మ్మను మొదటికారికా ద్వయమును వివరించు సందర్భమున అప్పకవి యలంకార విషయమును వివరించెను. అందుఁ గావ్యలక్షణము, వృత్తులు, రసము మొదలగు వాని విషయమునఁ బ్రతాపరుద్రీయము యొక్కయు, రీత్యలంకారముపట్ల కావ్యాదర్శముయొక్కయు పోలికలు కన్పించుచున్నవి; కాని యతఁడు పేరుకొనిన యలంకార గ్రంథములలోఁ గావ్యాదర్శము కానరాదు. కావున నప్పకవి పయివిషయములను సంస్కృత గ్రంథములనుండి కాక యాంధ్రమునఁ గల 'సరస భూపాలీయ, కావ్యాలంకార చూడామణుల' నుండియే గ్రహించెనని నిశ్చయింపవలెను.

అప్పకవీయము నిదివఱకనేకులు ముద్రించిరి. అందు శ్రీ వావిళ్ళవారి ప్రతియే మేలయినది. దానికి శ్రీ గిడుగు వేంకటరామమూర్తి పంతులు గారి విలువగల విమర్శనము వన్నె గూర్చుచున్నది. 1951 లో వెలువడిన నూతన ముద్రణ మింకను మేలైనది!

ఇందుఁ బ్రథమాశ్వాసమునఁ గృత్యాద్యనంతరము కావ్య స్వరూప, భేదములు, ముక్తకాదులు, శబ్దార్థలక్షణాలంకార సంగ్రహము, శబ్దార్థ దోషములు, వాక్యలక్షణము, రసవివేకము, రసస్వరూపము, నాయకనిర్ణయము, భాషోత్పత్తి, భాషాభేదములు, ప్రకృతి, వికృతి భేదములు, ఆంధ్రభాషాభేద చతుష్టయము, కవిసమయములు మొదలగునవి చెప్పఁబడినవి. ద్వితీయాశ్వాసమున చింతామణిలోని వర్ణ పరిచ్ఛేద మూలసూత్రముల నాధారముచేసికొని సంగ్రహముగ వర్ణవివేచన మొనర్పఁబడినది. తృతీయాశ్వాసమున యతులు, ప్రాసములు సవిశేషముగ వివరింపఁబడినవి. చతుర్థాశ్వాసమున ఛందఃప్రభావము, ఛందస్సులు, గురులఘునిర్ణయము, గణలక్షణము, షట్ప్రత్యయములు, వృత్త - జాతి లక్షణములు, బంధలక్షణములు వివరింపఁబడినవి. ఇందలి బంధవివేకముమాత్ర మలంకారశాస్త్రమునకు సంబంధించినది. పంచమాశ్వాసమున వ్యాకరణము వివరింపఁబడినది.

ప్రమాణలక్షణ గ్రంథములలో నప్పకవీయము ప్రధానమయినది. ఛందో విషయమునందే దీని ప్రామాణ్య మెక్కువ. ఇందలి యలంకార విషయములు చూడామణి, కావ్యాలంకార సంగ్రహములనుండి తీసికొనఁబడుటచే వానియందుఁ గల కొలఁది దోసము లిందును కన్పించుచున్నవి. అందు లేనివికూడఁ గొన్ని యిందుఁ గలవు.

1. కావ్యలక్షణముంగూర్చి సంస్కృతాలంకారికుల కభిప్రాయభేదములు కలవు. దోషరహితములు, గుణసహితములు, అలంకారయుక్తములు నగు శబ్దార్థములే కావ్యమని మమ్మట, హేమచంద్ర, వాగ్భట, విద్యాధర, విద్యానాథాదుల మతము. చక్కని యర్థమును ప్రతిపాదించు శబ్దమే కావ్యమని దండి, విశ్వనాథ, జగన్నాథ పండితరాజాదుల మతము. పయి రెండు మతములందును శబ్దార్థములు రెండును ఆవశ్యకములే యనుట స్పష్టము. అప్పకవి మూలమగు 'తదదోషౌ పరికృతౌ చ వాగర్థౌ' అనుచింతామణిసూత్రమునువివరించుచు 'కృతికి నెప్పు శబ్దార్థముల్ రెండు వలయు' నని వ్రాసినాఁడు. [పుట 15.] ఇది 'శబ్దార్థములు రెండును గలిసి కావ్యమగు' నను మూలము నాశయమును వివరింపఁజాలదు. మఱియుఁ బయివానింబట్టి యప్పకవి మత మేమో నిర్ణయింప నవకాశమును లేదు. 'కృతి యనంగ శబ్దార్థముల్ రెండు నగును.' అని యుండు టుచితము.

2. కావ్యభేదములను వివరించు సందర్భమున విన్నకోట పెద్దయకవి కావ్యాదర్శము ననుసరించుచుఁ గావ్యము, గద్య-పద్య-మిశ్రభేదము

లచే ముప్విధములని చెప్పియున్నాఁడు. మూర్తి కవి ధ్వని - గుణీభూతవ్యంగ్య - చిత్రములని కావ్యము మూఁడురీతులని ప్రతాపరుద్రీయము ననుసరించినాఁడు. అప్పకవి 'కావ్యము ప్రబంధమని, చాటుప్రబంధమని రెండు తెలుఁగు'లని యుభయమత విలక్షణముగఁ జెప్పినాడు. ప్రబంధము పద్యకావ్యమనియే తెలుఁగునఁ గల వ్యవహారము. గద్యకావ్య మెందుఁ జేర్పఁ బడినదో తెలియకున్నది. [పుట 14.]

3. 'సా వా గ్యా రసవృత్తిః' అను చింతామణి సూత్రమునుబట్టియు, అప్పకవి యొనర్చిన దాని వివరణముఁబట్టియు[1] రసమే కావ్యమున కాత్మయను తన్మతము విశదమగుచున్నది. కాని వేఱొకచోటఁ జూడామణి ననుసరించి 'అఖిల కావ్యములకు నాత్మలు రీతులు' అని చెప్పఁ బడినది. [పుట 15.] ఇచటఁ జూడామణికారుఁ డొనర్చిన పొరపాటే యప్పకవియు నొనరించెను.

4. చూడామణిలో నున్నట్లే యిందును 'ప్రాణముల్ వానికిఁ బ్రాణదశకము' [పుట 15.] అని దశగుణములనే యంగీకరించెను. కొన్నిగుణములు కొన్నిదోషములను బోఁగొట్టుట కేర్పడినవని చెప్పు సందర్భమునఁ జూడామణి యం దున్నరీతినే మీఁది దశగుణములనే కాక ఉదాత్త, ఊర్జస్వి-ప్రేయము-యుక్తి-సూక్తి అను క్రొత్తగుణములు చెప్పఁబడినవి. [పుట 17, 18 లు.]

5. చూడామణి ననుసరించి యలంకారములలోఁ జాతినే (స్వభావోక్తినే) ప్రధానాలంకారముగా అప్పకవి చెప్పియున్నాఁడు.[2] కాని యతనికాలమునాఁటికి, ఉపమకుఁగల గౌరవము జాతికి లేకపోయినది. ప్రాచీనాలంకారికులు స్వభావోక్తికిఁ బ్రాముఖ్యము నొసంగిరి; నవీను లుపమనే ఎక్కువ గౌరవించిరి. చూడామణి కాలముననుఉపమకే ప్రాముఖ్య మున్నను దండి ననుసరించియే యతఁ డలంకారములను వ్రాయుటచేతఁ బ్రధానముగ స్వభావోక్తినే యంగీకరింపవలసి వచ్చినది. అప్పకవి యొక యెడ జాతికిఁ బ్రాముఖ్యము నొసఁగుచు మఱియొకచోట ఉపమకుఁ బ్రాధాన్యమును వావిడిచి చెప్పియున్నాఁడు.[3] ఇది పరస్పర విరుద్ధముగఁ దోఁచుచున్నది.

6. అప్పకవి యర్థములను గూర్చి చెప్పుచు 'కడు ముఖ్య, గౌణ, లక్ష్య, ధ్వని, వ్యంగముల్ గణుతింప నర్థలక్షణము లయ్యె' నని వ్రాసెను. [పుట. 16.] ముఖ్యాదు లర్థభేదములుకాని అర్థలక్షణములుకావు. ఆలంకారికు లంగీకరించిన యర్థములు మూఁడు; 1. ముఖ్యములేక వాచ్యము, 2. లక్ష్యము, 3. వ్యంగ్యము, చూడామణియందు 'గౌణము' కూడ అంగీకరింపఁబడినది; న్యాయముగ నది లక్ష్యాభిన్నము. అప్పకవి చూడామణి ననుకరించుటచే నాలర్థములనే చెప్పుట యుచితము, కాని యతఁడు క్రొత్తగ 'ధ్వని'నికూడఁ జేర్చినాఁడు. ధ్వని వ్యంగ్యప్రధానమగు కావ్యము; వ్యవహారమున నెచ్చటేని యది వ్యంగ్యపర్యాయముగ వాడుట కలదు. ఆ వాడుకనే కవి గ్రహించినచో ధ్వని, వ్యంగ్యములలో నేదియో యొకటి యున్నఁ జాలును.

ప్రాచీనాంధ్రాలంకారికు లెవ్వరును వ్రేలెత్తి చూపని ప్రాసభంగమును దోషముగఁ జూపుట యిందలి విశేషము.[4]

ఆంధ్రాలంకార గ్రంథము లందు గాని, ఆంధ్రవాఙ్మయ ప్రాచీన భాగములందుఁగాని కానరాని దృశ్యకావ్య విషయము కొంత అప్పకవీయమునఁ గానవచ్చుచున్నది. అప్పకవి యష్ట

1. క. రసమునకు నాశ్రయంబై, యసదృశ మగునెద్ది యది గదా శబ్దము రా
క్షసదమన! రసికు లనఁగా, వసుమతిఁదద్విధ మెఱుంగు వారలు సుమ్మీ!
గీ. తగ రసాశ్రయ వాక్య సంతతులఁ గూర్చి,కావ్యము లొనర్చు వారెపో కవులనంగ
నట్లు కావున నేభాషనైనఁ గవిత పలుకువారికి సాధింప వలయు రసము.

2. సీ. చర్చింపఁ గృతులకు జాతిగుణంబులు ద్రవ్య క్రియలు జీవితంబు లగుట
నవి యేతెఱంగున నమరు నట్లనచెప్ప వరలు జాతియు స్వభావంబు ననఁగ
నది మొదల్కొని......[అప్పక. పుట. 16]

3. గీ. ఉపమ కల్గిన శయ్యలనొప్పి యున్న నంధ్రభిధవుని కావ్యంబు గ్రాహ్యంబు గాదు;
పాయసంబైన సంస్కార పక్వమైన, కాకజుష్టంబు హవ్యంబు కాని యట్లు. [పు. 14]

4. సమసన భంగంబు ఛందో యతిప్రాస భంగంబులు...[పుట. 17]

విధ భాషలంగూర్చి యొకఁకపఱచు సందర్భమున నాటకములలో ఏయే పాత్రము లేయే భాషను వాడవలెనో నిశ్చయించుచు రెండు పద్యములను చెప్పెను. [1] ఆ నిర్ణయము ననుసరించి నాటకములం దుత్తమపాత్రలను సంస్కృతమును, తక్కినవారికి పాత్రభేదముల ననుసరించి ప్రాకృతభేదములను, తెలుఁగువారి కాంధ్రమును వాడవలెనని తెలుచున్నది. సంస్కృతనాటకములం దుత్తమపాత్రములకు సంస్కృతమును, తక్కినవారికి వివిధములగు ప్రాకృతములును వాడఁబడుచుండెడివి. కాని అప్పకవి చెప్పినట్లు జాతుల నీచతనుబట్టి ప్రాకృతములు నియమింపఁబడిన ట్లగపడదు. ప్రాకృతభేదములు దేశభేదములనుబట్టి యేరుపడినవే గాని జాతులఁబట్టి కలిగినట్లు కన్పింపదు. అప్పకవి వారివారికి నిర్దిష్టములగు భాషలను చెప్పుచు 'తెలుఁగువారి కాంధ్రమును చెప్పవలె' నని-తా నాంధ్రుఁడగుటను, లక్షణమాంధ్రమున కగుటను, తెలుఁగునుకూడఁ జొప్పించెను. కాని పయినియమము లాంధ్రమున కేమాత్రము నుపయోగింపవు. సంస్కృతనాటకములలో ఆంధ్రుల కాంధ్రము వాడుటయు ననుచితము ; ఇఁక తెలుఁగునాటకములలో సంస్కృత, ప్రాకృతములకుఁ బ్రవేశమనునది మృగ్యము! సంస్కృతనాటకములో సంస్కృత, ప్రాకృతములు వాడఁబడిన ట్లాంధ్రనాటకములలో ఆంధ్రము నే వాడవలెనను నియమము ననావశ్యకము.

పయియంశమునుబట్టి అప్పకవి కాలమునఁ గాని, అంతకుఁ బూర్వముకాని, తెలుగున దృశ్యకావ్యములు లేవని తేలుచున్నది. ఉండినచోఁ గవి తదనుగుణముగనే నియమము లొనర్చియుండును. నాటక పూర్వరూపములగు వీధినాటకములు, యక్షగానములు మాత్రము ప్రచారమున నుండినవి. అప్పకవికూడఁ గొన్ని యక్షగానములను వ్రాసిన ట్లిదివఱకే తెలుపఁబడినది.

## అనుబంధము

ఆంధ్రమునఁ గల యలంకార శాస్త్రగ్రంథములు స్వల్పసంఖ్యాకములే యయినను, తెలుఁగు దేశమున అలంకారశాస్త్రము మంచి వ్యాప్తిలోనే యుండెను. తెలుఁగునాటఁ గల ప్రాచీన విద్వాంసు లందఱును సంస్కృత విద్వాంసు లగుటచే, వారిలోఁ జాలమంది అలంకారశాస్త్ర గ్రంథములను సంస్కృతమున రచించియున్నారు. ఇయ్యెడ ముద్రితములు, అముద్రితములు నగు నా సంస్కృత గ్రంథములంగూర్చి తెలుపఁబడును.

### 1. అప్పరాయ యశశ్చంద్రోదయము.

ముద్రితము. కర్త: శ్రీ ఆణిమిళ్ళ-వేంకటశాస్త్రి. 18వ శతాబ్ది. చంద్రుని కళలవలె నిందు 16 అధ్యాయములు కలవు. వానికి 'కళ' లని పేరు. అలంకారశాస్త్రీయ విషయము లన్నియు నిందు సంగృహీతములు.

### 2. అభినవ శృంగార రసమంజరి

అముద్రితము. కర్త: తిరుమల బుక్కపట్టణం వేంకటాచార్యులు. నరసింహాచార్యుల పుత్రుడు. 18-వ శతాబ్ది.

### 3. అలంకార కౌస్తుభము

అముద్రితము. అసమగ్రము. కర్త: శ్రీ తిరుమల బుక్క పట్టణం-వేంకటాచార్యులు. 18-వ శతాబి.

---

1. గీ. దేవ భూసుర ముని ధరిత్రీశ తంద్ర,
సచివ కంచుకి విట విదూషక విరక్త
వాది యోషి న్నృపామాత్య వనితలకును,
జెప్పఁ దగు సంస్కృతము సుధాసింధు శయన.

సీ. క్షపణక జైనాది కర్మహీనులకును భామాజనులకును బ్రాకృతంబు,
క్షితి వైశ్యశూద్ర ప్రభృతి మధ్యమాధమ జాతులకెల్లను శౌరసేని
ధీవర లుబ్ధకాది వినీచజాతుల మానవులకు నెల్ల మగధ భాష
మొగిఁ బిశాచాసుర ముఖ్యులకెల్లఁ బైశాచికా నామ భాషాద్వయంబు
పతిత చండాల యవనాది పరమ నీచ జాతి నరుల కపభ్రంశ మీ తెలుంగు
సీమ వారికి నాంధ్రంబుఁ జెప్పవలయుఁ గావ్య నాటకముల గోపికా

### 4. అలంకార మంజరి

అముద్రితము. కర్త: శ్రీకాకర్లపూడి రామచంద్రరాజు.

### 5. అలంకార మకరందము

అముద్రితము. కర్త: శ్రీ కొల్లూరు—రాజశేఖరకవి. 19-వ శతాబ్ది.

### అలంకార మణిహారము

ముద్రితము. కర్త: శ్రీ కృష్ణబ్రహ్మ తంత్ర పరకాల దేశికులు.

### 6. అలంకార మీమాంస

అముద్రితము. కర్త: శ్రీ శాంతలూరి కృష్ణసూరి.

### 7. అలంకార ముక్తావళి

కర్త: శ్రీ చావలి-రామశాస్త్రి. 19-వ శతాబ్ది

### 8. అలంకార ముక్తావళి

ముద్రితము. కర్త: శ్రీ లక్ష్మీధరదీక్షితులు. ఇది సూత్ర, వృత్త్యాత్మకము.

### 9. అలంకార రాఘవము

అముద్రితము. కర్త: శ్రీ చెరుకూరి కొండుభట్టు. చెరుకూరి యజ్ఞేశ్వరుఁడని కొందఱి యభిప్రాయము. 16-వ శతాబ్ది.

### 10. అలంకార శిరోభూషణము

అముద్రితము. కర్త: శ్రీ కందళయార్యుఁడు. శ్రీ రామానుజాచార్యుల పుత్రుఁడు. ఇందు 10 ఉల్లాసములు కలవు. అలంకార శాస్త్రవిషయము లిందు సమగ్రముగా వివరింపఁబడినవి.

### 11. అలంకార సంగ్రహము

అముద్రితము. కర్త: శ్రీ అమృతానందయోగి 13-వ శతాబ్ది.

### 12. అలంకార సర్వస్వము

అముద్రితము. కర్త: శ్రీ దేవరకొండ-ఓబలార్యకృష్ణుఁడు.

### 13. అలంకార సుధానిధి

అముద్రితము కర్త. శ్రీమాధవాచార్యుఁడు. 14-వ శతాబ్ది.

### 14. అలంకార సుధాసింధువు

కర్త. శ్రీ ఆణిమిళ్ళ-వేంకటశాస్త్రి. 18-వ శతాబ్ది.

### 15. అలంకార సూత్రములు

అముద్రితము. కర్త: శ్రీ కృష్ణశర్మ. అలంకారశాస్త్ర విషయము లిందు సంగ్రహింపఁబడినవి.

### 16. అలంకార సూర్యోదయము

అముద్రితము. కర్త: శ్రీ చెరుకూరి కొండుభట్టు. 16-వ శతాబ్ది.

### 17. అలంకారేందు శేఖరము

అముద్రితము. లక్షణమాలికా వ్యాఖ్య. కర్త: శ్రీ బుక్కపట్టణం శ్రీశైల నరసింహాచార్యులు.

### 18. ఆమోదము

రసమంజరీ వ్యాఖ్య. కర్త: శ్రీ రంగశాయి కవి.

### 19. ఋజువృత్తి

అముద్రితము. కర్త: శ్రీ బెల్లముకొండ నరసింహకవి. కావ్యప్రకాశికలోని మూలకారికల కిది వ్యాఖ్య.

### 20. కవిసమయ కల్లోలిని

అముద్రితము. కర్త: శ్రీ అనంతరాయలు.

### 21. కామధేనువు

ముద్రితము. కర్త: శ్రీగోపేంద్రతిప్ప భూపతి. వామనుని కావ్యాలంకార సూత్రవృత్తి కిది వ్యాఖ్య. 14-వ శతాబ్ది.

### 22. కావ్యకంటకోద్ధారము

అముద్రితము. కర్త: శ్రీనరసింహకవి. 14-వ శతాబ్ది

### 23. కావ్యకళానిధి

కర్త: శ్రీ కృష్ణసుధి. 19-వ శతాబ్ది.

### 24. కావ్యప్రకాశ వ్యాఖ్య

అముద్రితము. కర్త: శ్రీ చెరుకూరి కొండుభట్టు. 16-వ శతాబ్ది.

### 25. కావ్యప్రకాశికా టీక

అముద్రితము. కర్త: శ్రీ తాళ్ళపాక తిరువేంగడసూరి.

### 26. కావ్యప్రకాశికా వ్యాఖ్య

ముద్రితము. కర్త: శ్రీ మల్లాది లక్ష్మణసూరి. 19-వ శతాబ్ది.

### 27. కావ్యాలంకార చూళిక

ముద్రితము. కర్త: శ్రీ ముడుంబై నరసింహాచార్యస్వామి. అర్థాలంకార వివరణ మిందుఁ గలదు. 19-వ శతాబ్ది.

28. కువలయామోదము

కర్త: శ్రీ చావలి రామశాస్త్రి. 19-వ శతాబ్ది.

29. చమత్కార చంద్రిక

అముద్రితము. కర్త: శ్రీ విశ్వేశ్వర పండితుఁడు. 14-వ శతాబ్ది.

30. చమత్కార చంద్రిక

అముద్రితము. కర్త: శ్రీ చిలకమర్తి తిరుమలాచార్యులు. కువలయానందమున కిది వ్యాఖ్య.

31. చిత్రమీమాంసాఖండనము

ముద్రితము. కర్త: శ్రీ జగన్నాథ పండితరాయలు. అప్పయదీక్షితకృతమగు చిత్రమీమాంస యను అర్థాలంకార ప్రతిపాదకమగు గ్రంథమునకు ఖండనము. 17-వ శతాబ్ది.

32. తరళ

ముద్రితము. కర్త: శ్రీ మల్లినాథసూరి. విద్యాధర పండితుఁడు రచించిన 'ఏకావళి' కిది వ్యాఖ్య. ఇం దలంకారశాస్త్రీయ విషయము లన్నియు చర్చింపఁబడినవి. 15-వ శతాబ్ది.

33. దశరూపకవర్మ

అముద్రితము. కర్త: శ్రీ కురవి రామ పండితుఁడు.

34. నంజరాజ యశోభూషణము

అముద్రితము. కర్త: అభినవ కాళిదాస బిరుదాంచితుఁడు శ్రీ ఆలూరి నరసింహకవి. సమగ్ర విషయ ప్రతిపాదకము. 18-వ శతాబ్ది.

35. నాట్యశేఖరము

అముద్రితము. కర్త: శ్రీ వీరభల్లట దేశికులు. 13-14 వ శతాబ్ది ప్రాంతము.

36. నాట్యసర్వస్వ దీపిక

కర్త: శ్రీ రామానందయోగి. (కొటికిలపూఁడి నారాయణకవి)

37. నౌక

అముద్రితము. కర్త: చర్ల వేంకటశాస్త్రి. ఇది సాహిత్యరత్నాకర వ్యాఖ్య.

38. పద్ధతి

అముద్రితము. కర్త: శ్రీ కురువీరరాయఁడు. కార్వేటినగర నివాసి. ఇది దశరూపక వ్యాఖ్య.

39. ప్రతాపరుద్ర యశోభూషణము

ముద్రితము. కర్త: శ్రీ విద్యానాథ పండితుఁడు. అలంకారశాస్త్రీయవిషయము లన్నియు నిందుఁ గలవు. 15-వ శతాబ్ది.

40. బాలచిత్తానురంజని

అముద్రితము. కావ్యప్రకాశికా టీక. కర్త: శ్రీ నరహరి సరస్వతీ తీర్థులు.

41. బుధరంజని

చంద్రాలోక వ్యాఖ్య. కర్త: రామభూపాల సభాభూషణ బిరుదాంకితుఁడగు తిరువేంగళసూరి.

42. మకరంద ఝరి

కువలయానంద టిప్పణి. కర్త: శ్రీ కురవి రామపండితుఁడు.

43. మందరము

ముద్రితము. కర్త: శ్రీ మల్లాది లక్ష్మణసూరి. ఇది సాహిత్యరత్నాకర వ్యాఖ్య. 19-వ శతాబ్ది.

44. మందార మకరందము

అముద్రితము. కర్త: శ్రీ కృష్ణశర్మ. ఇందు ఛందోలంకార విషయములు వివరింపఁబడినవి.

45. మాధుర్యమంజరి

అముద్రితము. కర్త: శ్రీకృష్ణశర్మ. మందార మకరందమునకు టిప్పణి.

46. మేకాధీశ శబ్దార్థ కల్పతరువు

అముద్రితము. కర్త: శ్రీ చర్ల భాష్యకార శాస్త్రి. 20-వ శతాబ్ది.

47. రఘునాథ భూపాలీయము

అముద్రితము. కర్త: శ్రీ కృష్ణయజ్వ. ఇది ప్రతాపరుద్ర యశోభూషణము ననుసరించినది.

48. రత్నశాణము

కొంత ముద్రితము. ప్రతాపరుద్రీయ వ్యాఖ్య. కర్త: శ్రీ చిలకమర్తి తిరుమలాచార్యులు.

49. రత్నాపణము

ముద్రితము. ప్రతాపరుద్రీయ వ్యాఖ్య. కర్త: శ్రీ కుమారస్వామి సోమయాజి; మల్లినాథ సూరి పుత్రుఁడు. 15-వ శతాబ్ది.

50. రసగంగాధరము

ముద్రితము. అసమగ్రము. కర్త: శ్రీ జగన్నాథ పండితరాయలు. 17-వ శతాబ్ది.

51. రసతరంగిణీ వ్యాఖ్య

అముద్రితము. కర్త: శ్రీ చర్ల వేంకట శాస్త్రి. 19-వ శతాబ్ది.

52. రసప్రకాశము

కావ్యప్రకాశ వ్యాఖ్య. కర్త: శ్రీ కృష్ణ శర్మ. 17-వ శతాబ్ది.

53. రసప్రపంచము

కర్త: శ్రీ ఆణిమిళ్ళ వేంకటశాస్త్రి. 18-వ శతాబ్ది.

54. రసమంజరి

కర్త: శ్రీ తిరుమల బుక్కపట్టణం శ్రీనివాసాచార్యులు. 19-వ శతాబ్ది.

55. రసమంజరి

అముద్రితము. కర్త: శ్రీ లక్ష్మీధర దీక్షితులు.

56. రససుధానిధి

కర్త: శ్రీ మార భట్టారకుడు.

57. రసార్ణవసుధాకరము

ముద్రితము. కర్త: శ్రీ సింగభూపాలుడు. నాట్యాలంకారశాస్త్రము. 14-వ శతాబ్ది.

58. రామచంద్రయశోభూషణము

అముద్రితము. కర్త: శ్రీకచ్ఛపేశ్వర దీక్షితులు.

59. లక్షణదీపిక

అముద్రితము. కర్త: శ్రీ గౌరనార్యుడు. 15-వ శతాబ్ది.

60. లక్షణమాలిక

అలంకారేందుశేఖరవ్యాఖ్య. కర్త: శ్రీ నరసింహాచార్యులు.

61. వసంతరాజీయము

కర్త: శ్రీకుమారగిరిప్రభువు. 14-వ శతాబ్ది.

62. వేంకటాద్రిగుణ రత్నావళి

కర్త: శ్రీచర్ల-వేంకటశాస్త్రి. 19-వ శతాబ్ది.

63. శరదాగమము

చంద్రాలోక వ్యాఖ్య. కర్త: శ్రీప్రద్యోతన భట్టు, వంచెల్ల వీరభద్రరాజుగారి ఆస్థానకవి.

64. శృంగారమంజరి

ముద్రితము. నాయికాలక్షణ నిరూపణ గ్రంథము. కర్త: శ్రీబడే అక్బర్ షా. 17-వ శతాబ్ది.

65. శృంగారమంజరి

అముద్రితము. కర్త: శ్రీ పర్వతవర్ధనకవి.

66. శృంగారసారము

అముద్రితము. కర్త: శ్రీ గొడవర్తి వేంకటనారాయణ దీక్షితులు.

67. సాహితీసారము

అముద్రితము. కర్త: శ్రీ సీతారామకవి. అలంకార విషయములు సంగ్రహముగా నిందు వివరింపబడినవి.

68. సాహిత్యకల్పద్రుమము

కర్త: శ్రీ ఆణిమిళ్ళ నారాయణశాస్త్రి. 18-వ శతాబ్ది.

69. సాహిత్యకల్పద్రుమము

కర్త: శ్రీకొల్లూరు రాజశేఖరకవి. 19-వ శతాబ్ది.

70. సాహిత్యకల్పద్రుమము

అముద్రితము. కర్త: శ్రీ సోమశేఖరకవి.

71. సాహిత్యకల్పలతిక

కర్త: శ్రీ శాంతలూరి కృష్ణసూరి

72. సాహిత్యకౌముది

కర్త. శ్రీ ఆర్యసూరి.

73. సాహిత్యచింతామణి

అముద్రితము. కర్త: శ్రీ పెదకోమటి వేమారెడ్డి. 15-వ శతాబ్ది.

74. సాహిత్యరత్నాకరము

అముద్రితము. కర్త: శ్రీ చెరుకూరి కొండు భట్టు.

75. సాహిత్యరత్నాకరము

ముద్రితము. కర్త: శ్రీవారణాసి-ధర్మసూరి. ఇందు 10 తరంగములలో అలంకార విషయము లన్నియు వివరింపబడినవి. 15-వ శతాబ్ది.

76. సాహిత్యరత్నాకరవ్యాఖ్య

కర్త: శ్రీచర్ల వేంకటశాస్త్రి, 19-వ శతాబ్ది.

77. సాహిత్యసుధాసింధువు

అముద్రితము. కర్త: శ్రీ విశ్వనాథకవి.

(8 వ పుట తరువాయి)

స్వరూపమునకు గాదు. గురువునకు లింగమున కొసంగు స్నానము నీయవలయును.

'జంగమ' అనఁగా చలనముగలవస్తు వనిగదా యర్థము. వీరశైవమున మతప్రచార మొనర్చుచు నూరూరు దిరుగు శివభక్తునకు జంగమ మని పేరు. కాని నేఁడిది యొక శాఖా సాంకేతిక మైనది. నన్నెచోడుని కుమారసంభవమున బ్రాహ్మణుఁడైన మల్లికార్జునునకు జంగమశబ్ద ముపయుక్తమై యుండుట చదువరు లందఱెఱిగినదే. తొలుత జంగమ శబ్దము శివభక్తుఁడును, మతగురువున వగువానికి సంకేతమై యుండిన దనుట నీ విషయము కూడ బలపఱచు చున్న దిగదా. సోమనాథుని గ్రంథములలో జంగమ పదమునకు శివభక్తులని యర్థము. వారు మతప్రచారకులు కావలయునన్న నియమము లేదు.

జంగములకును గురు, లింగముల కొసగు స్నానమునే యివ్వవలయును. ఈ మతమున గురు లింగ జంగములకు నభేదము-'ఏకమూర్తి స్త్రయో భాగాః గురుర్లింగంతు జంగమః' అను సిద్ధాంతము సోమనాథుని కృతులలో నిర్ణీతమైనది.

బసవేశ్వరుని శివాచారనిరతి సోమనాథుఁడిట్లు వర్ణించి యున్నాఁడు.

"హరభక్తనికరదయామృత వృష్టి
పరిగొని కురియఁ దొప్పఁగఁ దోఁగితోఁగి
యొడయల దివ్య పాదోదకవారి
నడునీటఁ గడ వేడ్కఁబడి తేలితేలి
శరణ నిర్మల నిత్య సత్య ప్రసాద
వరసేవనక్రీడఁ బడి గ్రాలిగ్రాలి
.....................
నియమవ్రతాధిక నిష్ఠితాత్మకుల
బ్రియవస్తు సమితి నర్పించి యర్పించి"

శైవమతమున ప్రసాదపాదోదకములు ప్రధానములైనవి. ప్రసాదమునగా శివునకు గాని, శివభక్తులకు గాని యర్పించిన యాహారవిశేషము. శిష్యుఁడు గురువున కాహారపదార్థముల నర్పించును. అతడు కొంత తీసికొని శేషమును శిష్యునకొసగును. అదియే ప్రసాదము. వీరశైవమున ప్రసాద మహిమ మిక్కిలిగా వర్ణితమైనది. ప్రసాదమన భుక్తశేషము గాదు. గురువునకు గాని భక్తులకు గాని యర్పించినది. వారి కర్పించుటతో నా వస్తువునకు పవిత్రత యేర్పడును. ప్రసాదమును గొనువాఁడు ప్రసాది.

పాదోదకమనగా గురుపాదములు కడిగిన నీరు. జంగములు, గురువులు పవిత్ర జీవితములు గడపువారని, వారిచే స్పృశింపబడిన వస్తువులు పవిత్రము లగుననునమ్మకము వీరశైవులలో ప్రబలముగా నుండును. ప్రసాద పాదోదకములదప్ప భక్తులితతరము తీసికొనరని మన కా యా భక్తుల చరితలవలన తెలియును. ఇందులకు వారికి తమ గురువులయెడ, శివభక్తులయెడ గల గాఢ విశ్వాసమే కారణము. మొన్న శివరాత్రి నాఁడు శ్రీశైలమునకు మేము వెళ్ళినసందర్భములో పాతాళగంగవద్ద లింగధారులు కొందఱు గురువులపాదముల నర్చించి వానికి మజ్జనాదులనుజరపి ఆ తీర్థమును సేవించుట మాకన్నులార గాంచితిమి. ఈ పాదోదకము భక్తుల మనమును దేహమును పరిశుద్ధమొనర్చునని వారి విశ్వాసము. పండితారాధ్య చరిత్రయందు, చతుర్వేదసారమందు ఈ ప్రసాదపాదోదక మహిమలు వర్ణితములై యున్నవి. ఇఁక విభూతి రుద్రాక్షధారణము, పంచాక్షరీ (నమశ్శివాయ) మంత్రోచ్చారణముతో గలిపి అష్టావరణము లను నామముతో వ్యవహృతములగుచున్నవి. సోమనాథుఁడు అష్టావరణములను పేరును జెప్పలేదు కాని, ఈ యెనిమిదింటి మహిమను వర్ణించియే యున్నాఁడు. దీక్షాప్రకరణమున పండితారాధ్యులు వీనిమాహాత్మ్యమును వేదాగమసూక్తుల ప్రమాణముచే నిరూపించినట్లు సోమనాథుఁడు రచించియున్నాఁడు.

వీరశైవము వేదకర్మలను నిరసించినదని స్త్రీ పురుషుల సమానత్వమును, సర్వ మానవ సౌభ్రాత్రమును వ్యక్తపరచిన దంటిమికదా. పండితారాధ్యచరిత్ర పురాతన ప్రకరణములలో గురుభక్తాండారికథలో నజ్ఞానాంధకారమున బడియున్న గురుభక్తాండిరికి వేశ్యచే శ్వేతుని కథ, మలహణునికథ చెప్పించి 'హితలగు కాంతల బుద్ధు లేవెంట హితముకాకేల యొండుగున'ని నిరూపించినాఁడు. స్త్రీలకు పురుషులతో సమానముగా దీక్షాధికారము నిచ్చి గౌరవించిన మతమిది.

భక్తులు తమభక్తిని గూర్చి గర్వింపరాదని బసవపురాణ చతురాశ్వాసమున మడివాలు మాచయ్య బసవనితో—

"వినుమహంకరించినను భక్తియగునె?
ఎందును గర్వోక్తి భక్తి భావనకెక్కునే

బసవకుమార"యని శంకరదాసికథ, సిరియాలుని కథ, హాలాయుధునికథ చెప్పును.

వీరశైవమున కష్టార్జితమునకు విలువయెక్కువ. ప్రతిభక్తుడును నేదో కాయకవ్రతమును గైకొనును. మడివాలు మాచయ్య భక్తుల బట్టలుదుకుటను వృత్తిగా గైకొనినాడు. శంకరదాసి యను భక్తుడు బొంతలుకుట్టి జీవించువాడు.

"బొంతకు గంతకు బ్రోవిడిపోవు
నంతకు విక్రయం బార్చి తెప్పించి
యక్కజంబందగ నాయకలబ్ధి నిత్య
మెక్కువ దఱుగవు నేను మానికలు
జంగము కోట్లకు సముచితార్చనలు"

భంగిగా "జరుపుచుండగా" శివుడు ప్రత్యక్షమై వరము వేడుమనగా,

"కర్తలకర్త మత్కర్తవై నీవు
వర్తింప నింకొండు వరమేలవేడ
కడుగాక యేమియు నడుగమి సిగ్గు
పడియెద నడిగెద బగలింటి యట్ల
రాత్రియు సూది దారంబు గ్రువ్వంగ
నేత్రములకుదృష్టి నెక్కొల్పు..."

మనికోరినాడు. దీనిని బట్టి వృత్తిగౌరవము వ్యక్తమగుచున్నది గదా.

సోమనాథుని కృతులలో త్రివిధలింగాష్టకమనులఘుకృతిలో ఇష్టలింగము, భావలింగము ప్రాణలింగములను గూర్చి స్తుతికలదు. అనుభవసారమున షట్స్థల వివరణకలదు. వీరశైవమున షట్స్థలములనగా ఆఱుసోపానములు. భక్తుడు భగవంతునిలో నైక్యము పొందుమార్గమునగల సోపానములు ఆఱు: (1) భక్తస్థలమున భగవంతునిగూర్చి తెలిసికొనవలయునను జిజ్ఞాస యేర్పడి సృష్టికాంతరహేతు వగునాతని దరి జేరవలయునను నభిలాషయు కలుగును. (2) మహేశ్వరస్థలమున వ్రతనియమాదుల యాచరణమున నాత్మ పరిశుద్ధతనందును. పూర్వస్థలమునందుకన్న భక్తిభావన పునీతమై కనుపట్టును. వ్రతనియమాది కర్మల ననుష్ఠించుచు, నిష్కామముగా భగవంతుని గొల్వవలయును. (3) ప్రసాదస్థలమున ప్రతివస్తువును శివప్రసాదముగ గోచరించును. ఈ మూడు స్థలములును క్రియాత్మకములని వ్యవహృతములు. ఇంతవరకు పూజాది కర్మలకు ప్రాధాన్యము. ప్రసాదస్థలమున భగవత్స్వరూపము గోచరించిన ట్లొక యనుభూతి కలుగును. అతనిచేసృష్టింపబడిన వన్నియు నాతని స్వరూపములే యనుభావన యేర్పడును. కాని యాస్వరూప మిదమిత్థమని స్పష్టముగా తేటపడదు. (4) ప్రాణలింగస్థలమున ఆత్మయే లింగముగా గోచరించును. ఈస్థలమున ఆత్మయే అంతర్జ్యోతిగా భాసించుట వ్యక్తమగును. కాని (5) శరణస్థలమునగాని ద్వైతభావ మంతరించినట్లు తోచదు. భక్తి ఇచ్చట సంపూర్ణముగా వేరురూపము దాల్చును. శరణత్వము గోచరించును. భగవంతుని మ్రోల భక్తుడు తన అస్థిత్వము గోల్పోయి భగవంతునిపై యాధారపడును. (6) ఆఱవదగు ఐక్యస్థలమున శివునితో భక్తుడు సంపూర్ణముగా నేకీభావము పొందును. శివునికి భక్తునికి భేదము నశించును. శివాద్వైత సిద్ధి ప్రాప్తించును.

ఇట్టి యైక్యస్థితి నొందియు లోకమున చరించు భక్తు డనుసరింపవలసినవి అరువది నాలుగు శీలములున్నవి. వీనినే చతుష్షష్టి శీలములందురు. సోమనాథుడు మతమును వ్యాపింపజేయుటయే కాక ఆ మతాచారములను ప్రత్యక్షరము తాను పాటించి లోకమున కుదాహరణప్రాయుడైనాడు. శైవులు కానివారిని వీరశైవులు భవు లందురు. సోమనాథుని వ్రతశీలము లెట్టివో అతని కావ్యమునుండి యుద్ధృతమైన యీపంక్తులను బట్టి గ్రహించవచ్చును.

"భవికృతారంభ సంభవధాన్య నిచయ
భవినిరీక్షణ రసపాక వితాన
భవిహస్తగత ఫలపత్ర శాఖాది
భవిగృహక్షేత్రాంఘ్రి పదవర్జితుండ
భవిజన దర్శన స్పర్శనాలాప
వివిధ దానాదాన విషయదూరగుడ
శుద్ధ భక్తిస్థల స్తుతి మతాచార
సిద్ధ వీరవ్రత శీలాన్వితుండ".

—పండితారాధ్య చరిత్ర-అవతారిక.

సోమనాథుని మతతత్త్వము గంభీరమైనదైనను, కథలమూలమున దానిని కావ్యకళతో రంగరించి పాఠక లోకమున కందజేసినందున అతని కృతులు కేవల మతగ్రంథములు గాక ఆంధ్ర వాఙ్మయమున కలంకార ప్రాయములై యున్నవి.

(72 వ పుట తరువాయి)

...యాతి తత

జ్ఞాత్తన స్మృతినివ+హార్ధంబ మతియు
(పం-దీక్ష-40)

అసమవదాన్య స+నాతనధన్య
(పం-పురా-495)

అత్తతి భట్లు గై+వారంబు సేయ
(పం-వాద-512)

ఆద్య సమర్పితాఖిల పు+రాతన భక్త
(వృష-21)

...ఖేలసం
గరకలకంఠ కంఠమణి+
నాయకభీమభుజంగ (వృష-107)

ఇంకను పై గ్రంథములఁబరికించినవిశేషములు లేలక మానవు. సోమన యితరకృతు లన్నింటిని బరిశీలించిన నాతని ఛందోవైలక్షణ్యమును గ్రంథరూపమున సంకలనము సేయనగునని యీ రచన నింతటితో ముగించుచున్నాఁడను.

(శ్రీ నిడదవోలు వేంకటరావుగారు తెలిపిన మరికొన్ని విశేషయతిప్రాసలను ఈవ్యాసమున కనుబంధముగ ప్రకటిస్తున్నాము. —సం॥

ఋ—రు యతి.

ఈ యతిని తిక్కన శల్యపర్వమున(2-160) మంకణముని మాహాత్మ్యభివర్ణనలో వాడియున్నాడు.

సీ. ...సప్తభేదములొంది యదిసప్త
ఋషులైరి వారు మరుద్గణంబు

ఈ యతని మడికిసింగన మొదలగు మహాకవులు వాడియున్నారు. వానిని నా "భాషాపరిశోధన-ప్రయోగవిశేషములు" అను గ్రంథమున జూడనగును.

[1]ఉ—వు యతి.

1. దే—వునకు ననుంగు వాడనని యుత్సుకత—వృషాధిపశతకము—98 పద్యము.

2. కావునఁ దగనర్జునుండు పవనోద్భవుఁడున్
-ఆంధ్రభాగవత దశమస్కందము.
ఉ. భా. పుట. 714

3. కావున చండాలుఁడు కాదు సందియము లే
న్నూహింప
ధర్మఖండము-ఈదురుపల్లి భవానీశకవి పుట.227

4. ని-ల్వుండని కూర్చుండఁజేయ
రుత్సవయుతులై
పద్యబసవపురాణము, పిడుపర్తి సోమన 1-152

5. ఒక్కనిడించి పోవుటయు భీతిల్లి
నవనాథచరిత్ర- పుట.92
ఉండంగఁదగిన తావులను విశ్వాస్య
177 పుట.

6. ఓజమైజరయు చావును తెవుల్లేని
ద్విపదభారతము-తిమ్మకవి. పుట. 277

డంభ—దంభ యతి

వృషాధిపశతకమున సోమనాథుఁడు 'డంభమయూస్యదర్శన విడంబను' అను పద్యమున ధంభకు శబ్దమునకు బదులు డంభ శబ్దము నుపయోగించినాడు. దీనిని తరువాతివా రనుకరించినారు.

విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో—(2-132) డంభాచారము లుజ్జగించి రిపుగాఢక్రీడ నిర్జించి — అని యు, డంభలాంచన కోలధ్రాలునకును, అని (6-12) యతినిరూపణమునందును నీ యతిని వాడియున్నాఁడు.

తాళ్ళపాక అన్నయ్యగారు శృంగార సంకీర్తనలలో (83) సంస్కృత సంకీర్తనలో నీ శబ్ద ముపయోగించినారు.

కిం భాషయసి మాం కితవమానసతయా?
డాంభికతయా విట విడంబయసి కిం?

అప్పకవి దంభ డిండీర డోలికా దాడిమీ శబ్దములకు దకార డకారములు రెండును వచ్చునని చెప్పుటయే గాక 'దంభమిచ్చుటను గూడదు కృష్ణ నీవేగి' అని (2-147) లక్ష్యమును వ్రాసియున్నాఁడు.

డిండీరశబ్దమునకు : 'డిండీరాయితకీర్తి.....ధరిత్రీమండలాఖండలా' అని జైమినిభారతములో ప్రయోగముగలదు.

ప్రాసలు: జ్ఞ-గ ప్రాస.

ద్వి. అజ్ఞానమనియెడి యంధకారమున
మగ్నుఁడనై నిన్ను మఱచిపోయితిని
-సోమనాథ స్తవము.

---

1. పాల్కురికి సోమనాథకవి చరిత్రమున శ్రీ తమ్మయ్యగారు సోమనాథుఁడిట్టి యతి యుపయోగించి యుండడని, దానిని ప్రోత్సుకతన అని సంస్కరించి పఠింపవలెనను నభిప్రాయము వెలిబుచ్చినారు. కాని సోమనాథుని తరువాతి కవులప్రయోగములు, సోమనాథునియతి సరియైనదేయని నిరూపించుచున్నవి.

# తెలుగుజాతి తొలి విజ్ఞానసర్వస్వం

శ్రీ తిమ్మావఝ్ఝల కోదండరామయ్య.

—:♦:—

నన్నయనాటినుండి నేటిదాకా వెలసిన తెలుగు కవులలో పాలకురికి సోమనాథకవికి గలప్రత్యేకత విశిష్టమైనది. ఆయన రచించిన బసవ పురాణం, పండితారాధ్య చరిత్ర మొదలయిన గ్రంథాలను చదివినప్పుడు సోమనాథుడు ఒక్క కవిగా మాత్రమేకాక బహుముఖ ప్రజ్ఞాశాలీ, లోకజ్ఞుడూ అయిన ఒక మహనీయవ్యక్తిగా మనకు గోచరిస్తాడు. వేదాలు, వేదాంగాలు చదివిన విప్రవరేణ్యుడయినా మడివాలు మాచయ్య మొదలయిన నిమ్నజాతి శివభక్తుల భక్తిమహిమకు ముగ్ధుడైపోయి వారి భక్తిమయ చరిత్రలకు కావ్యత్వగౌరవం చేకూర్చిన మహోదారుడాయన! దేశంలో తనకాలంలో ప్రచారంలో వుండిన మతముల—వాదముల స్వరూపాలను తెలిపి వాటిని సోపపత్తికంగా ఖండించి శివమతం ప్రతిష్ఠాపించిన పరమమాహేశ్వరుడాయన! ద్విపదను శ్రుతిసమ్మితం చేసి జానుతెనుగున కవితామందాకినిని జాలువార్చిన భగీరథకల్పుడాయన! భాష, వస్తువు, ఛందము—ఈమూడింటిలోనూ తనకు ముందుండిన సంప్రదాయాలను కాదని వాటిలో విప్లవం సాధించిన విప్లవవీరుడాయన! పరమశివుని పంచవింశతిలీలలు మొదలుకొని పర్వతమెక్కే పరుసజనుల వేషభాషలదాకా ఆయన తన గ్రంథాలలో చెప్పనివిషయం లేదు; తడవని అంశం లేదు. తనభావధారకు అడ్డువచ్చిన ప్రతివిషయాన్నీ ఆయన సంపూర్ణంగా వర్ణించినాడు; సాకల్యంగా చర్చించినాడు. ఆయనవైదుష్యం అపారం! ఆయన లోకజ్ఞత అప్రతిమానం! తనకాలంనాటి ఆటలు—పాటలు, విద్యలు-వినోదాలు, పత్తిరులు-పండ్లు, కొండలు, నదులు, మకుటములు, వస్త్రములు, వీణలు, రాగములు, తాళములు ఒకటేమిటి ఆయన యెన్నోవిషయములను తెలిపినాడు. సోమనాథునినాటి సాంఘిక జీవనస్వరూపం తెలుసుకోడానికి ఆయన గ్రంథసంచయం-ముఖ్యంగా ఆయన పండితారాధ్య చరిత్ర ఒక విజ్ఞానసర్వస్వం లాంటిది. అది చదువుతున్నప్పుడు ముఖ్యంగా పర్వతప్రకరణంలో ఆకాలపు సంఘంలో మనమూ ఒక్కరైనట్లుగా వింతభావన ఒకటి మనహృదయంలో కలగడమే కాక మనయెదుటా, మనచుట్టూ ఆనాటి సంఘం తాండవిస్తున్నట్లు మనకు గోచరిస్తుంది. ఇదే సోమనాథునిలో ఉన్న ప్రత్యేకత. తెలుగు కవులలో ఈయనవలె ప్రజలకు యింతసన్నిహితంగా వుండినకవీ, తెలుగు ప్రజాజీవనమును యింత చక్కగా తనకావ్యంలో ప్రదర్శించిన కవీ యీయన ఒక్కడు మాత్రమే. క్రీడాభిరామంలోకూడా నాటిసాంఘిక జీవనం ప్రతిబింబితమైంది. కాని పండితారాధ్య చరిత్రలోవలె బహుముఖంగా ప్రతిబింబితంకాలేదు. ఆయన చెప్పిన విషయాలు ఎన్నో నేడు మనకు తెలియవు. కొన్నిటి స్వరూపాలే మనకు నేడు అర్థంకావు. ఆయన పేర్కొన్న యెన్ని విషయాలో నేడు మనజీవన వ్యవహారంనుండి తప్పిపోయినవి. కాని అక్కఱతో—అభినివేశంతో ఆయన పేర్కొన్న ఆయనకాలంనాటి విషయాలను అధమపక్షం ఒకచోట చేర్చుకొని యింత విజ్ఞాన భాండారాన్ని ఆయన మనకు అందజేసి పోయినాడని ఒక్కసారి కృతజ్ఞతతో స్మరించడం మనకు కర్తవ్యం.

పండితారాధ్య చరిత్రలో విజ్ఞాన సర్వస్వంలోలాగా కొన్ని వర్గాలకింద చెప్పబడిన విషయాలు నిక్కడ ఒకచోట చేర్చడానిక

---

ద్వి. అగ్నిసంస్కారాదు లర్థిఁ జేయింపు
ప్రాజ్ఞుల విప్రులఁ బనిచి వేవేగ
-మడికిసింగన-ద్విపద 281-18'' పం

క. అగ్నిధ్రుఁడను మునీంద్రుఁడు
ప్రాజ్ఞుఁడు......
-హరిభట్టు ఏకాదశస్కంధము.

ద్వి. అగ్నిప్రవేశమయ్యెడఁ జేతుమనుచుఁ
బ్రజ్ఞ వాటించిరి బ్రమసి యాసెట్లు
తిరువేంగళకవి చొక్కనాథచరిత్ర—164పుట

శా. శార్ఙ్గంబే మురువంచు......
జార్గోప్య.........నూ
గార్గోముల్ ... మేలూరుబిం
ద్లూర్గాయుల్
బహులాశ్వచరిత్ర: దామెరవెంగళభూపాలుఁడు

ప్రయత్నం జరిగింది. సోమనాథుని నాటి సాంఘిక జీవనచరిత్రను గ్రంథసహాయంతో నిర్మింపదలచుకొన్న భావి పరిశోధక విద్వాంసులకు ఈపరిశ్రమము సహాయకారి కాగలదన డంలో సందేహంలేదు.

## లింగములు:—

ఇంద్రనీలమయ లింగము, శైలమయలింగము, మణిమయలింగము, హేమమయలింగము, రౌప్యమయలింగము,ఆరకూటమయలింగము, కాంస్యకమయలింగము, పార్థివలింగము, అన్నమయ లింగము, ముక్తాఫలమయలింగము, ప్రవాళమయ లింగము, కృష్ణాయసమయలింగము, త్రపుసీసమయలింగము, త్రైలోహకమయలింగము, సర్వలోహమయలింగము, సైకతలింగము, పిష్టమయ లింగము, గంధలింగము, దూర్వామయలింగము, దధిమయలింగము, ఆజ్యలింగము, కుశాగ్రమయ లింగము, మరకతస్ఫాటికలింగము, నవనీతలింగము, పుష్పలింగము.

## పేళ్లు:—

యొగ్గన్న, భిన్న, బలభద్ర, మైలారమత్తెన, సోమయాజులపెద్ది, వామనభట్టు, దామోదరప్పన, వామనకూచి, కేశవపుటశాస్త్రి, కేమనపెన్ని, వాళము మైలారు, భట్టుపాధ్యాయు, అప్పట్లపెద్ది, అంశమసూరపోతి, పప్పుకేశవుడు, సంబవులమాధవుడు, మానంబుమారన్న, మంచయదడ్డ, దోసయభట్లు, ధూర్తవిట్టలుడు, సిమ్మెనమల్లి, కూచెనగారి తమ్మి, కొమ్మనప్పన, బొల్లికోడెయల్లాడి, ఉష్ణమువారి పెన్నొజ్జులు, కప్పకృష్ణమ్మ, యరగడ్డ కేమనకూచి, వరిగడ్డువారి కుప్పనయాజివంగ, వరకయజ్ఞమ, ఉండి భాస్కరయొజ్జ, గందిగిశితన, కామయగెన, ముకుందన, దక్షిణగోపాలమంచి, మేడిచెట్టయితన, మిండవల్లభుడు, దూడగద్ధప్పన, దుష్టరాఘవుడు, ఎత్తుగాలైతన, ఈశ్వరభట్టు.

## ఆభరణములు:—

కంచుమట్టెలు, ఉంగరములు, వల్దయూరులు, నల్లగాజులు, తగరపుకడియములు, పచ్చగాజు పూసలు, సంకుపూసలు, నల్లపూసల బన్నసరము.

## శివమహోత్సవములలో ముచ్చటలు :

పాదాబ్జములమీద పడియుండువారు, పాదరేణువులందు పడిపొర్లువారు, చుట్టుచేరి ప్రణుతించువారు, నాఅమ్మ నాఅక్క నాతల్లి అని ముద్దాడువారు, మొలలయందు, తలలయందు గ్రోవులు చుట్టుకొని నటించువారు, చూరిలోని సెంబళికోల దూసికొని కేళికలు చేయువారు, కత్తియు, ఆరెయు పట్టి యొగిరియొగిరి ఆడువారు, పాదరక్షలు తలలపై నిడుకొని ఆడువారు, సంబవులు తాటించి ఆధూళిని ధరించువారు, చెప్పు లెగురవేసి పట్టుచు నాడువారు, చుట్టును చప్పటలుపెట్టి గునిసిగునిసి యాడువారు, పదపద్యముల గూర్చి పాడువారు, దండనాయకుని గీతములు పాడుచు సోలెడువారు, పురాతన మహితగీతులు పాడువారు, పంచమహావాద్య పటలములతో నాడువారు, కోయని యార్చుచు కునిసి యాడుచు చాంగుభళాయనువారు, విభూతి వసంత మాడువారు.

## శివగ్రంథములు:—

హరలీల, మహిమ్న స్తవము, మలహణము, అనామయము,హాలాయుధము,పంచగద్యములు, శివతత్త్వసారము, రుద్రమహిమ, సంసారమాయా స్తవము, శంకరగీత, ఆనందగీతములు.

## అష్టనీరాంజనములు:—

దర్శనీరాంజనము, అవసరనీరాంజనము, మజ్జననీరాంజనము, మాంగల్యనీరాంజనము, శృంగారనీరాంజనము, మహానీరాంజనము, ఆనందనీరాంజనము, అసంఖ్యాతనీరాంజనము.

## శివభక్తులు:

సకలేశుమాదిరాజయ్య, మడివాలుమాచిదేవయ్య,కన్నడబ్రహ్మదేవయ్య, తెనుగుజొమ్మయ్య సొడ్డలదేవు బాచిరాజయ్య,మాళిగమారయ్య,కలకేతబ్రహ్మయ్య, డోహరికక్కయ్య, సురియచౌండయ్య, ముసుండిచౌండయ్య, ఏకాంతరామయ్య, ఉత్తమాంగదకేశి, కన్నడబ్రహ్మదేవయ్య, కొండగుడికేశిరాజు, శివనాగుమయ్య, గుడుబెకాళవ్వ, శివరాత్రిభద్రదేవుడు, ఘటికావసరముల కాలకంఠుడు, పసిడియారతుల వీరభద్రుడు, పట్టునూలివత్తుల త్రిపురారి, కప్పురపునివాళి సంగమయ్య,కస్తురిమ్రేంక యుద్భటయ్య, రంగవల్లి మాయణ్ణ, ఇచ్చపంట సోద్దేవుడు, కంగళవిరుపాక్షదేవుడు, హూసనాలిగెయ శివయోగదేవుడు, ప్రేవుల ప్రబ్బతయ్య, గోవింద భట్టారకుడు,

## వాదములు:

కర్మవాదము, కాలవాదము, వేదాంతము, సాంఖ్యవాదము, యోగవాదము, చార్వాక వాదము, పాంచరాత్రవాదము, బౌద్ధవాదము, జైనవాదము.

## శివుని పంచవింశతి లీలలు:

చంద్రధారణము, దాక్షాయణీవివాహము, వృషభవాహనము చేకొనుట, గజాసురసంహారము, పార్వతీవివాహము, హరిశవమును, అజుకపాలమునుదాల్చుట, కామసంహారము, కాల సంహారము, త్రిపురాసుర సంహారము, జలంధర సంహారము, బ్రహ్మశిరముగొనుట, వీరభద్ర శౌర్యము, శరభమై హరిని హరించుట, అర్ధనారీశ్వరత్వము, కిరాతార్జునీయము, కంకాళవేషము దాల్చుట, చండీశునకు ప్రసాదమిచ్చుట, హాలాహల భక్షణము, విష్ణువునకు చక్రము, నేత్రము నిచ్చుట, వినాయకుని విఘ్నేశ్వరునిగాఁజేయుట, ఉమాస్కందులకుఁ దనతత్త్వమును తెలుపుట, ఏకపాదావతారము, అజహరులకొలువు గైకొనుట, దక్షిణామూర్తివేషము, ఉరులింగస్వరూపము గైకొనుట.

## అసాధ్య కార్యములు :

నేలకు నింగికి నూత్రపట్టుట, మోకాళ్లను బట్టతలలును ముడివెట్టుట, తననీడ గడవ జూచుట, ఎండమావుల కడగాళ్లుగట్టుట, పాటెడునీరు రెండుగా వ్రేయుట, పులిజున్ను కో అని అమ్ముట, రాతిలో నార యొలుచుట, చిత్రాతిపై క్రుంకుట, ఏనుంగు పురుడోముట, ఇసుక త్రాడుపేనుట, దిశలు తాళములు వాయించుట, గోకటియందు చిగురులుకోయుట, కలి వెన్నను పుచ్చుట, కొండలు దొంతి పేర్చుట, మంచుకుంచాన గొలుచుట, రేవగలు నేయుట, వడగండ్ల గుండ్లు గట్టుట, వెన్నెల ప్రోవుగాజేయుట, చచ్చిపుట్టుట.

శివరాత్రి తిరునాళ్ల వేడుకలు పుటలు 434-442.

## పలుకుబళ్లు:

ముక్కుపైకత్తి, వీపుకోల, ఎక్కుకొట్టు, తలగుండు, హృదయశల్యము, పొట్టలోపలి అమ్ము, రొమ్ముగూటము, కంటికసవు, తుది నాలుకముల్లు, గుండెబెదరు, మెడజుట్టుపాము, పారిసమరుమిత్తి, నెత్తిగాలము, మనసుతల్లడము, నోరితాళము,

## పారాయణగ్రంథములు:

దక్షాధ్వరము, వ్యాసాష్టకము, గణాడంబరము, శారభము, పంచగద్యములు, రుద్ర మహిమ, శివతత్త్వసారము, సంసారమాయాస్తవము.

## పదరచనములు:

తుమ్మెదపదములు, ప్రభాతపదములు, పర్వత పదములు, ఆనందపదములు, శంకరపదములు, నివాళిపదములు, వాలేశుపదములు, గొబ్బిపదములు, వెన్నెలపదములు, సంజవర్ణన, గణవర్ణన పదములు.

గణమాలిక : రుద్రగణములు :

## యోగాచార్యులు:

తిరునీలకంఠుడు, తిరునీలనక్క, తిరుమూల దేవుడు, తిరునాళ్లపోవ, మానకంజారుడు, మంగయక్కరసి, ఆనాయనారు, మొన్నయ ధరుడు, విట్టి, నంగరోహిణి, పిళ్లనయనారు, సంగ చండుడు, పూసలనయనారు, వరమనాచి, దీప దకళియారు, కరిగణనాథుడు, వలికామదేవుడు, అమరనీతి, ఇరువదాండారి, మురుఘు, నమినంది, ఏణాధినాథుడు, సాంఖ్యతొండభూపతి, చిరుత్తొణ, తిరుకురిపితొండడు, నంబిచిర్తొండడు, సిరాలదేవడు, చేదిరాజయ్య, కారుగాళవ్వ, ఏకాసి, సోమాసి, మారడు, వీరపేర్మాణ్ణిదేవడు, వీరచోడడు, జడయారి రిత్తాండి, యెల్పఘు, చెలఁది, వాగీశననారు, కోల్పులి, అళియదంగుళి నయనారు, చిఱుపులియార్కు, లుచ్చిరినయ నారు, మిఱుమిండయాఱు, నమిత్తాండియారు, కళియంబయరివాలు, కడుమలనంబి, కళియంబ, గుగ్గుళుకళినయనారు, కన్నప్పతాపసి, కర యూరుచోడడు, చెన్నయ్య, చోడడు, చేరమరాయడు, ఇలిగుడిమారయ్య, ఇడుమార దేవడు, ఆడిభర్త, ఒణుమాడి.

## షోడశగణములు:

హొన్నయ్య, పాండ్యనాయుడు, గుడ్డవ్వ, కిన్నెరబ్రహ్మయ్య, కేతయ్య, బీరయ్య, హండయ్య, బిజ్జయ్య, ఘేనాగయ్య, నాగయ్య, కాళవఫణిహారి, సోమన్న, చిక్కలిగె నాగయ సేననాథ, దేవరబాచయ్య, పూవులబాచిదేవడు, భాచలదేవి.

**దశగణములు:**

వీరఘంటయ్య, మయిలారిదేవయ్యగారు, బొప్పలదేవి, కామలదేవిగారు, చోడవ్వ, సింగయ్య, బీచయ్యగారు, మాదేవన్నగారన్న, బెరసి, దసగణసింగయ్య.

**సహస్రనామగణములు:**

సింగిదేవడు, బమ్మిసెట్టి, సాతెక్క, సంగ, మైళిగ, నిజసంగయ్య, దేవగసుగారు, కన్నబరసి, ఫణిహారిబసవయ్య, పూసలబాచిదేవడు, దేవయ్య, ఓహిళదేవడు, చొప్పిదేవి, కామలదేవి, దేరసులు, శ్రీపతిపండితులు, సింధుబల్లహుడు, ధూపదమాచయ్య, ధూర్జటికేశి, మడివాలు మాచయ్య, మాదిరాజయ్య, బడకరబ్రహ్మయ్య, బాచి రాజయ్య, కిన్నర బ్రహ్మయ్య, కేశి రాజయ్య, కన్నడ బ్రహ్మయ్య, కాచిరాజయ్య, మోళిగమారయ్య, ముసుడి చౌడయ్య, శూలద బ్రహ్మయ్య, సురియచౌడయ్య, కలకేతబ్రహ్మయ్య, కక్కయ్య గారు, తెలుగేసు మసణయ్య, తెలుగు జొమ్మయ్య, ఉత్తమాంగద కేశి, హొన్నయ్య, గండగత్తెర, వాచయ్య, కాలాగ్ని రుద్రుడు, ఉదరద రామయ్య, వొన్నబ్రహ్మయ్య, కదిరె రేమయ్య మహాకాళయ్య, బిబ్బిబాచయ్య, సవరద నాచయ్య, వీర నాచయ్య, అడపద రేచయ్య, నల్లయ్య, మధుపయ్య, బల్లేశు మల్లయ్య, గోడలమల్లయ్య, నిజలింగచిక్కయ్య, నిర్లజ్జశాంతి, నిజభావుడు, నిత్యనేమద మైలి, దసరయ్య, దేడరదాసి, గజ్జేసుమసణయ్యగారు, అమాత్య మల్లయ్య, జెట్టిమారయ్య, గౌళ భట్టారకుడు, బిట్టవ్వ, గోవింద భట్టారకుడు, శంకరదాసయ్య, శ్వపచయ్య, సుంకె బంకయ్య, మొఱటదవంకి దేవయ్య, యముగిగేవుడు, చిక్కలముగి దేవడు, అమరగుండము మల్లికార్జునయ్య, దారయ్య, భోగయ్య, దాసకేసయ్య, మాగగౌళడు, మలయరాజయ్య, పంచాగ్ని సూర్యుడు, ఉద్భటుడు, సన్న్యాసి కుంచయ్య, మల్ల బ్రహ్మయ్య, వెల్లగొండ మహాదేవడు ఇత్యాది సహస్రనామ గణములు.

**నేత్రరోగములు:**

తప్పవోయినకన్ను, తడికన్ను, పొరయఁగప్పినకన్ను, గుడ్కుఁగన్ను, ఒడ్డుఁగన్ను, గ్రుడ్డికన్ను, బరిగన్ను, గోడ్రిప్పగన్ను, బ్రొడ్డుకన్ను, పువ్వువోయినకన్ను, పాలగట్టినకన్ను, బ్రంగుడుకన్ను, గ్రాలుకన్ను, నీరుగారెడుకన్ను, బ్రొందకన్ను, బ్రుస్సుకన్ను, మ్రందకన్ను, మ్రాదలకన్ను, పోటుఁగన్ను, బ్రొంగవోయిన కన్ను, దూటుగట్టినకన్ను, దూలగొన్నకన్ను, మయిలకన్ను, మసుమసుకనికన్ను, అయిరకన్ను, అదరెడికన్ను, గోటుపోయినకన్ను, తొలుఁగుడుఁగన్ను, దీఁటకన్ను, తిమిరంబు, రక్తదోషము, దుర్మాంసదోషము, వాయుదోషము, పటలము, దుర్దర్శి, కృష్ణకాస, అతిరక్తకాస, శ్వేతకాస.

**ద్యూతపరిభాష:**

దాయము, ఈరైదు, దుగ, ఇత్రిగ, దచ్చాక, పంచియు, చౌకదుగము, భద్రము, సత్తా, తీవంచ, సౌవంచి.

జూదమున నోడినవారికి 'తన తలమట్టుఁగాలువట్టి మోవఁగ నెత్తి కట్టుట శిక్ష'

**ఉత్పాతములు:**

పట్టణము పాడువాఱుట, తలలేనినీడకనుగొనుట, కలలోన కాలునిగనుట, రేయింబవళ్లు కుక్కలు మొఱుగుట, కావిరివెల్లి విరియుట, గుఱ్ఱముల తోకలయందు నిప్పులురాలుట, నేల కాలుట, నింగిపడినట్టుగా మేఘము లాసన్నమగుట, పగలుచుక్కలు కానవచ్చుట, ధూమముకవియుట, వంటకములు పుచ్చుట, భూమి కంపించుట, రాత్రియందు కాకులు గుడ్లగూబలు నక్కలు అరచుట, సుడిగాలి వీచుట, పశువులు మోరలెత్తుకొని పరుగెత్తుట, ఇంద్రచాపములు సూర్యచంద్ర పరివేషములను పొడుచుట, రాజునకు మంత్రివిరోధము, ప్రధాన విరోధము, ఆప్తభటవిరోధము, పుత్త్రవిరోధము నిరపరాధముగా కలుగుట, ఊరియందు మారి మసగుట—

వేశ్యావిడంబనములు—1-343-349.

**పిల్లల ఆటలు:**

రాగుంజు పోగుంజులాట, కుందెన గుడిగుడి గుంజంబులాట, అప్పలవిందులయాట, చప్పట్లు, సరిగుంజులాట, సేరబొంతలయాట, సిట్లపొట్లాట, గోరంటలాట, దాగుడుమూతలాట, దిగుదిగుడిక్కొనునాట.

**సంగీతవిషయాలు-వీణలు :**

బ్రహ్మవీణ, కైలాసవీణ, సారంగవీణ, కూర్మవీణ, ఆకాశవీణ, రావణవీణ, గౌరివీణ, గాంధర్వ

వీణ, బాణవీణ, కాశ్యపవీణ, స్వయంభువీణ, భుజంగవీణ, భోజవీణ, కిన్నరవీణ, త్రిసరివీణ, సరస్వతివీణ, మొల్లవీణ, మనోరథవీణ, సరథగణనాథవీణ, కౌమారవీణ, అణివాణి, రావణహస్తము, తిపిరి, సకనె, వళి, విచిత్రక, నట, సాగరిక, గుంభిక, విపంచిక, సగవీణ, వగవాది వీణ, మల్లరి, కోలాప్టి, స్వరమండలము, ఘోషావతి, ఔదుంబర, తంత్రిసాగరము, అంబుజవీణ.

**తంత్రులు:**

గీతానుగము, ఉభయానుగము, సుఖవీణానుగము, ద్రుతానుగము.

**జన్యజనకవిరచనలు:**

కరణికలు, దండి, చిత్రము, మృదువు, లలి, మాధుర్యము, ఉల్లసము, సయుతాణము, మొగచాళము, సుకళి, హయతాణము, దళహారము, సాగణము, గొట్టువణిక, తిరువు, వర్త, తాళపట్టె, కర్తరి.

**బంధములు:**

సమహస్తము, సైగణము, పదము, అంతరము, పారణ, దోర్తు, గలితము, జతి, ద్రుక్క్రగము, గచ్ఛము, మలపము, ముఖవాద్యము, జల్లణము, బొల్లావణి, మలపు, విబగ్వాణము, ఉల్లంఘి, అనుఘాతయుత్తాళ, విషమవాణి, అర్ధార్ధవాణి, అర్ధవాణి, దళకుంభవాణి, దండహస్త, జోవాణి, సమగ్రత, బిండహస్త, చంద్రాణి, గజపతి, పంచహస్త, శిరోవధ, అంతరావృత, విహస్త, పయశ్ఛేది, ఆస్థానగర్భ, జతి, పాజ, జలపాణి, సమపాణి, భేదగతి, పరిశ్రమము, గర్భనిర్ణయము.

**సప్తతాళములు:**

చంచుపుట, గచ్ఛపుట, షడ్గీత, ఉత్పుట, మోచిత, సమతాళ, సత్రచ్ఛేద.

**సప్తవింశతి శుద్ధతాళములు:**

ఎగ, బొంబడ, ఎడ, వాడ, గారు, హడక, బంధకరణ, బాడకరణ, క్రౌంచపదము, సరకరణ, ఆస్థానమండపము, ఫలము, చక్రవాళము, కలహంస, ఆర్య, లలిత, సరళ, విరళ, ఉమామందిర, మత్తమాతంగ, రథ్య, మళ్ల, ముదవ, బంధమళ్లము, వరరూపకము, ఏకతాళము, మఠతాళము,

**అష్టోత్తర శతతాళ భేదములు:**

ఖండితతర, అవఖండ, కంకాళ, ఖండిత, చండకి, ఖండవర్ణ, అవిఘూర్ణిత, కుటిల, ఘూర్ణిత, గోష్ఠి, అర్ణ, కచ్ఛాణ, అణ, ఆదిమాతృక, తరక్షుణపుత్రి, ఉద్వీక్షణ, ఉచ్ఛవటి, అక్షలీక, చటిక, యష్టిక, పూర్వకంకాళ, మణిమిశ్రకంకాళ, ఖండకంకాళ, కావ్యకంకాళ, పంచాళ, భిన్నక, కోకిలప్రియ, నిరవద్య, రన్న, కుంజర, ఫణిరాజ, చతుశ్రధార, కృత్తి, ఘనిద్యాగర, రక్తధార, ఉత్తమమేరు, తాంబూలియాణ, మలపు, ఉత్ఫుల్లక, మాతంగ, అర్ధకళిక, సరస్వతి, కంఠాభరణ, మిశ్రతాళ, సంమిశ్రవాద్య, మిశ్రకళానుస్ఫూర్త, మిశ్రవర్ణము, సింహవిక్రీడిత, సింహనాద, సింహనందక, లక్ష్మీస్తన, ముక్తతాళి, పంచబ్రహ్మ, దశవృద్ధ, పంచతాళి, చాయాణ, పరితాళి, ప్రసక్త, ఖుర, విసగఖుర, ఉత్తర, పంచవాణ, హరిణ, మాయాఖణ, ఆదికంఖాణ, ఖంజర, చతురశ్రఖంజర, కృష్ణఖంజర, అసమానఖంజర, తాళ, లక్షవతి, ధ్రువ, లయ, తనుభద్ర, లక్షణియాణ, విలంబిత, ఆది, మల్ల, వళి, ధ్రువమల్ల, జంపెమల్ల, మును తెగమానంబు మల్ల.

**అష్టాదశ వాసనాదములు:**

జాతివాస, విజాతివాస, కుమారవాస, పక్షవాస, భువనవాస, శ్వేతవాస, భాస్కరవాస, వగరుద్రవాస, హరివాస, నిధివాస, అష్టదిగ్వాస, ఋషివాస, కార్తికవాస, అఘోరవాస, బ్రహ్మవాస, త్రిపురవాస, శివభక్తివాస, భువనాధపతి వాస.

**గతి భేదములు:**

ఆలాపము, పేంలనము, వ్యాప్తి, బెడంగు, చాలన, సుళికె, జరము, ఇంపు, అణువు, తిరువు, జయ, అనుజయ, కొంకు, వుణవూణ, వళి, భజవణ, పాంవు, సెవణ, వహణి, సవ్యాంగుళవహణి, అధరవహణి.

**అక్షరములు:**

స, రి, గ, మ, ప, ధ, ని

**సప్తాలాపములు::**

ఆరోహి, అవరోహి, చక్రవాళ, సంపద, ప్రవ్యక్త, సువ్యక్త, లాలిత.

(సశేషము)

# సోమననాటి సంగీత సంప్రదాయం

శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు.

సోమన పండితారాధ్య చరిత్ర పర్వత ప్రకరణంలోని యక్షగానాది ప్రదర్శనాలను, దేశీయ ఛందోరీతులను ఆగూ పండిత వర్యులు తమ తమ పరిశోధన సందర్భాలలో ఎన్నో పర్యాయాలు స్మరిస్తూవచ్చారు. అదే ప్రకరణంలోని ఆటపాటలను భరతశాస్త్ర విషయాలను, సంగీత లక్షణ విశేషాలను సవిమర్శంగా గాని, చారిత్రిక దృష్టితో గాని ఎవరూ పరిశీలించినట్లు కనబడదు. పూర్తిగా సాహిత్యాత్మకమైన పండితారాధ్య చరిత్రలోని రసవత్కావ్య కథనచాతురికి తోడుగా పాల్కురికి సోమనాథునికి శ్రుతిస్మృతి పురాణేతిహాసాలలో, వ్యాకరణ, ఛందోలంకార, షట్తర్క, వైశేషిక, హఠయోగ, వైద్య, రసవాద, జ్యోతిష, భరత, సంగీతాది సకలశాస్త్ర కళలలో పారంగతత్వం కూడా ఉందని ప్రస్ఫుట మౌతుంది. తెలుగునాటి తొట్ట తొలినాటి యుగపు మహాకవులలో ఒకడైన సోమన కాలమునాటికి మన దేశంలో ప్రాచుర్యంలో ఉన్న సంగీత సంప్రదాయం ఎటువంటిది, చరిత్రకారులు నిర్ణయించిన భారతీయ సంగీత పరిణామదశలలో అప్పటిది ఏదశ, అనే విషయాలు తప్పక తెలిసికో తగినవి.

మన సాహిత్య చరిత్రకారులకు సోమన కాలనిర్ణయమును గురించి ఏకాభిప్రాయం లేదు; కాని, అందరూ దాదాపు ఆయన క్రీ. శ. 1160 నుంచి 1300 దరిదాపుల వరకు మొత్తం ఎనభైయేండ్లకు తక్కువ కాకుండా జీవించి ఉంటాడని తేల్చారు.[1] ఇది కాకతీయ గణపతి దేవుని పరమోచ్ఛకాలంనుండి రెండవ ప్రతాపరుద్రుని పరిపాలనతో కాకతీయ సామ్రాజ్యం పతనమయ్యే వరకు అని చెప్పవచ్చును. సంగీత నాట్యశాస్త్రకర్తలని పించు కొన్న దేవతామూర్తులైన నటరాజ నందికేశ్వరాదులకును, మహామునీశ్వరు లయిన భరత మతంగాదులకును తర్వాత, ఈ కాలంలోనే (1100. 1300) ఉత్తరాదిని, దక్షిణాదిని కూడ, సంగీతంలో మార్గ, దేశిపద్ధతుల నిర్దేశంమాత్రమే కాకుండా, దేశీయగాన పద్ధతులకు కూడా లక్షణ నిర్ణయమూ, పండితాదరణమూ లభించాయి. దేవగిరి[2] రాజధానిగా పాలించిన యాదవ వంశపు రాజు సింహణ భూపాలుని కొలువులోని విద్వాంసుడు శార్ఙ్గదేవుడు రచించిన సంగీత రత్నాకరము ఉత్తర దక్షిణ సంప్రదాయము లింకా వేరుపడని ఆనాటినుంచి నేటి దాకా భారతీయ సంగీత విద్వాంసుల కందరికీ శిరోధార్యము. మతంగుని బృహద్దేశిక తర్వాత దేశీయగానమునకు లక్షణ రీత్యా గౌరవము లభించినది సంగీత రత్నాకరం ద్వారా నే. నిశ్శంక బిరుదాంకుడైన ఈశార్ఙ్గదేవుడు దాదాపు 13 వ శతాబ్దపు తొలిసగంలోని వాడని చరిత్రకారులు నిర్ణయించారు. (1200-1240) ఆంధ్ర దేశీయులైన కల్లినాథుడూ, సర్వజ్ఞ సింగభూపాలుడు దరిమిలా సంగీత రత్నాకరానికి వ్యాఖ్యాతలు కావడం బట్టి చూస్తే, పుట్టుక మహారాష్ట్రములో అయినా, ఈ గ్రంథంలోని సంప్రదాయము దేశంలోని అన్ని రాజ్యాలలోని గాన పద్ధతులనూ పుడికి పుచ్చుకొని తయారైనదే అని చెప్పాలి. ఆంధ్రీ, గౌడీ, లాటీ మొదలైన జాతిగానముల నిర్వచనం మూలాన్నీ ఆంధ్రైలా, కర్ణాటైలా, ద్రావిడైలా మొదలయిన ఏలా ప్రబంధలక్షణ నిర్దేశం మూలాన్నీ ఈ అభిప్రాయం ఇంకా బల పడుతుంది. పాల్కురికి సోమనా, శార్ఙ్గదేవుడూ ఇంచుమించు సమవయస్కులో కాదో

1. సాహిత్య మత సంప్రదాయం, చరిత్ర ఆకళించు కొన్నవారు సోమన 12 వ శతాబ్ది ఉత్తరార్థంలో జన్మించి 13 వ శతాబ్ది ఉత్తరార్థంలో అస్తమించినట్టు నిర్ణయించారు.—సం.

2. దేవగిరి, హైదరాబాద్ రాష్ట్రంలోని నేటి దౌలతాబాద్; తెలంగాణాకు దగ్గరిదే. -సం.

చెప్పలేము గాని, తప్పక సమకాలికులయి ఉండాలి. [1]సోమన పండితారాధ్య చరిత్రలోని సంగీతశాస్త్రవిషయయాలను శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరములోని అంశములతో సరిపోల్చి పరిశీలించగా తేలిన నిర్ణయముల ద్వారా సోముని కాలపు తెలుగునాటి సంగీత సంప్రదాయమును దిక్ప్రదర్శనముగా చూపడమే యీ వ్యాసపు ఉద్దేశము.

శార్ఙ్గదేవుని గ్రంథంలోని సంగీతపారిభాషిక పదాలు అన్నీ ఈనాటికీ కర్నాటక సంగీత లక్షణంలో అదే అర్థాలతో వినబడుతుంటాయి. పాల్కురికి సోమన గ్రంథంలో వాడిన పారిభాషికాలు దాదాపు సగం ఈనాటి లక్షణ గ్రంథాలలో గాని, చివరికి సమకాలిక గ్రంథాలలో గాని దొరకడం లేదు. దీనికి కారణం ఒక విధంగా ఊహించవచ్చు ననిపిస్తుంది. సోమనాథుడు ఆనాడు దేశీయములై వాడుకలో ఉన్న తెలుగు కన్నడ పదాల నెన్నిటినో (మహారాష్ట్రము కూడ ఉంటే ఉండవచ్చు) సంగీత పారిభాషికాలుగా వాడాడు. గమకాలు, తాయాలు మొదలయిన వాటి జాబితాలలో కొన్ని చోట్ల శార్ఙ్గదేవుని జాబితాలలోని పదాల సంఖ్యకు మించి ఉంటాయి సోమన జాబితాలోనివి. లోక వ్యవహారంలో ఉండిన రాగాంగ క్రియాంగ భాషాంగ రాగాల పేర్లు దాదాపు సోమన చెప్పినవన్నీ శార్ఙ్గదేవుడూ చెప్పాడు.

ఇక సోమన రచనలోని అంశాల నన్నిటినీ ఒక్కొక్కటిగా పరిశీలిద్దాము. రంగస్థలంపై ప్రవేశించిన నటగాయకులు ఆరంభ సూచక విలాసములు ప్రకటించి, శిరఃకంపమూ, అంగుళి స్ఫోటనమూ చేస్తూ, లాగు, (ప) వంజళము, ఢాళము, వళి, తిరుపు, బాగు, వహణి, సాళి, బయుగతి, సుగతి, బహుగతి, గతి, వీటిని పరిపాటిగా ప్రదర్శించి స్వరవంచనముల ద్వారా పటురసాలంకార భావములు స్ఫురించేటట్లుగా స్ఫుటవాద్యతాళ సంఘటనతో ఆట వేయి విధాలుగా ఆడతారు. ఈ పై జాబితాలోని మాటలలో ఢాళము, వళి, దశవిధగమకాల లోను, పంచదశగమకాలలోను అన్ని లక్షణ గ్రంథాలలోను కనిపిస్తాయి. వంజళము=గీత విశేషము అనిశబ్దరత్నాకరం. 'పంచాంసి పేరణి ఆడువారు' అనుచోట 'పంచాంసి' పంచాలి అని ఉండాలి. పంచాలి అన్నా పంజళమన్నా గీతవిశేషమే. (పాడిమెప్పించె నొకయింతి పంజళమున-కాశీ ఖండం.) తిరుపు అంటే తీర్పు - లేక తీర్మానము - గానము, నాట్యము తిరిగి తిరిగి సమగతికి రావడం, అని నా ఊహ. వహణి-రాగావయవమైన తాయా (స్థాయా) లలో ఒకటి. మిగిలిన వన్నీ గానపు మెళుకువలే అయిఉండాలి. స్వరవంచనములు అనే మాటకు స్వరవిలసనములు అనే అర్థం అయిఉండవచ్చు.

భవు బహువిధ చరిత్రములను, నాటకములాడుటను వర్ణించిన తర్వాత, వీణల రకాల జాబితా యిస్తాడు. అవి యివి: వీణోత్తమము, బ్రహ్మవీణ, కైలాసవీణ, సారంగ వీణ, కూర్మవీణ, ఆకాశవీణ, పినాకవీణ, రావణవీణ, గౌరివీణ, గాంధర్వవీణ, బాణవీణ, కాశ్యప వీణ, స్వయంభువీణ, భుజంగవీణ, భోజవీణ, కిన్నరవీణ, త్రినరివీణ, సరస్వతివీణ, మొల్లవీణ, మనోరథవీణ, గణనాథవీణ, కౌమారవీణ, అణివాణి, రావణహస్తము, తిపిరి, సకనె, వళి, విచిత్రక, నట, సాగరిక, కుంభిక, విపంచిక, సరవీణ, వరవాది వీణ, మల్లరి, కోలాష్టి, స్వరమండలము, ఘోషావతి, ఔదుంబరి, తంత్రి సాగరము, అంబుజవీణ.

వీటిలో పినాకిని, కిన్నరి,విపంచికమాత్రము శార్ఙ్గదేవుని జాబితాలో కనిపిస్తాయి. ఇవి కాక నకులవీణ, చిత్రవీణ, మత్తకోకిల, నిశ్శంక వీణ ఇవి మాత్రము సోమన జాబితాలో లేనివి రత్నాకరంలో ఉన్నాయి. నిశ్శంక వీణ శార్ఙ్గదేవుడు కనిపెట్టినదే. సారంగవీణ అనేది కూడ శార్ఙ్గదేవునికి సంబంధించిన దేనా? ఈనాటి సారంగికి ఇది మూలమేమో అని కొందరు విద్వాంసుల ఊహ. సోముని జాబితాలోని వీణలన్నీ వీణలేకాక ఇతర తంత్రీ వాద్యములు కూడ కలిసి, వీణ అనేది తంత్రీవాద్య సామాన్య వాచకమేమో! వాటిలో మొల్ల వీణ, అణివాణి, తిపిరి, సకనె, వళి ఈ అయిదూ కేవలము తెలుగు వీణలే అయిఉండాలి కదా. స్వరమండలము పాశ్చాత్యుల హార్పును పోలిన ప్రాచీన భారతీయ వాద్యము.

---

1. సోమనాథుని వార్ధకంలో శార్ఙ్గదేవుడు యువకుడై వుంటాడు.—సం.

వీణల పట్టికకు తర్వాత గాయకులు గీతానుగము, ముఖవీణానుగము, ద్రుతానుగము లను లక్షణోక్తములను ప్రదర్శిస్తారు. గీతానుగము అనేది నోటిపాట అయిన తరువాత వాద్యములలో అనుసరించి వచ్చే సంగీతము. మిగిలిన రెండూ రత్నాకరములో కనబడవు.

దండి, చిత్రము, మృదువు, లలి,మాధుర్యము ఉల్లసనము, సయతాణము, మెంగి చాళము, సుకళి, హయతాణము, దళహారము, సారణము, సొట్టవణిగ, తిరువు, వర్తి, తాళపట్టె, కర్తరి ఏర్పడగా, కిన్నరులువాయింపగా తవణాంగములు మెరుస్తాయి. ఇవన్నీ బహుశా కిన్నరి మొదలయిన వాద్యములపై ప్రయోగించే సంగీతి ప్రక్రియలుకావచ్చు. ఇవి రత్నాకరములో కనిపించలేదు.

ఆవెంటనే బంధములని మరొక పెద్ద పట్టిక ఉంది సమహస్తము, సైరణము, పదము, అంతరము, పారణ, తోర్తుగలితము, జతి, ద్రుక్కరము, కిచ్చము, మలపము, ముఖవాద్యము, చల్లణం, బొల్లావణి, మలపు, విబరణం, ఉల్లంఘి, అనుఘాత, ఉత్తాళ, విషమవాణి, అర్ధార్ధవాణి, అర్ధవాణి, దళుకుంభవాణి, దండహస్త, సోవాణి, సమగ్రత, పండహస్త, చంద్రాణి, అజవతి, పంచహస్త, శిరోవధి, అంతరావృత, విహస్త, పయిచ్ఛేధ, ఆస్తానగర్భ, జతి, పాజ, జలపాణి, సమపాణి, భేదగతి, పరిశ్రమము, గర్భనిర్ణయము—ఇవన్నీ బంధములు.

సోమనఇచ్చిన పై పట్టికలోని పేరులు,రత్నాకరములోని వాద్యాధ్యాయంలో పటహాది వాద్యాల జాతిసాధారణోద్దేశశిక్షకంలో వానిపై ప్రదర్శించే ప్రక్రియలుగా కనిపించాయి. అవి బొల్లావణి, చల్లావణి, ఉడువ, కుచుంబిణి, చారుశ్రవణిక, అలగ్న, పరిశ్రవణిక, సమప్రహార, కుడువచారణ, కరచారణ, దండహస్త, ఘనరవ. హౌడుక్కమనువాద్యము (ఉడుక్క లేక పెద్దడమరుకం) పై వాయించతగవి కొన్ని ఇతరవాద్య ప్రబంధములూ, పై పట్టికలోని పేర్లు కొన్నిటి అర్థాలూ, లక్షణాలూ సోమన పేర్కొన్నవీ రత్నాకరములోనివీ ఒకటే అని తెలుస్తోంది. ఆవెంటనే పుష్పాంజలిగా మర్దళాలపైని ఖండజాతి, రేగువణి, దుడుకు, ఘీంకారం ప్రయోగిస్తారు. రేగువణి రత్నాకరంలో రిగోణి అని చెప్పబడింది.

ఆ తర్వాత వాద్యచూడాదులు: వాద్యములపై చూడాదులు (శూళాదులు) అనబడే తాళయుక్త స్వరవిన్యాసం. అటుపైని భరతుడు, నంది తామే మద్దెలలపై ఏడు ప్రథమతాళాలను, ఇరవైయేడు శుద్ధతాళాలను 85 "ప్రథమ శుద్ధాది విభంగ వినుత భంగాభంగ వివిధతాళములను" వాయిస్తారు. ఈ 85ను 108 తాళముల లోని వని చెప్పాడు సోమన. చంచుపుట కచ్ఛపుటలు మాత్రము రత్నాకరంలో చచ్చత్పుట, చాచపుట అనిఉన్నాయి; మిగిలిన ప్రథమతాళములకుగాని, 27 శుద్ధతాళములకుగాని రత్నాకరములో పోలికలేదు. 85 తాళముల లోని చాలపేరులుమట్టుకు రత్నాకరములోని 108 దేశతాళముల పట్టికలోనిపేళ్ళతో సరిపోయాయి.

అష్టోత్తరశతతాళము లయాక సోమన జాతివాస, కుమారవాస, పక్షివాస, భువనవాస మొదలయిన అష్టాదశవాసనాదములను చెప్పాడు. ఇవి సంగీతరత్నాకరములో లేవు. బహుశా ఇవి శైవసంబంధమైన ఉత్సవనాదము లయి ఉండాలి.

## 22 గతులు:

ఆలాప, హేలన, వ్యాప్తి, బెడంగు,చాలన, సుళికె, జర, ఇంపు, సొంపు, అణువు, తిరువు, జయ, అనుజయ, కొంకు, వుణవుణ, వళి, భజవణ, పాంవు, సెవణ, వహణి, సవ్యాంగుళవహణి, అధరవహణి.

## 7 అలాపనములు:

ఆరోహి, అవరోహి, చక్రవాళ, సంపద, సువ్యక్త, లాలిత.

## 22 శ్రుతులు:

స—సకళ, గూఢ, నిష్కళ, సంపూర్ణ
రి—ఆవళి, మధుర, ఏకాక్షరి
గ—భృంగిజ, సకేంగిత
మ—పూర్వ, వాసరంజిక, అలంకారిణి
ప—రేణుక, ప్రస్తవాసి, లలిత, సర్వవాని
ద—భాషాంగి, నర్తకి, అపూర్ణ
ని—ప్రచ్ఛన్న, సర్వవ్యాపి

పైనిచెప్పిన ద్వావింశతిగతులలోని కొన్ని పేరులు సంగీతరత్నాకరములోని గాయకుల

పేరులతో సమంగా సరిపోలుతున్నాయి. వీటన్నిటినీకూడ, గమకములతోగాని, స్థాయములతోగాని సంబంధించిన ఆనాటి రాగప్రస్తారావయములుగా భావించవచ్చు. సప్తాలాపనములు అను ఏడువిధములయిన ఆలాపనభేదములు సోమన గ్రంథములోనే చూస్తాముగాని, ఇతరగ్రంథాలలో కనబడవు. అలాగే సప్తగ్రామ జనితములు ఉదితస్వరములు అంటాడు సోమన. భరతుడు నాట్యశాస్త్రములో షడ్జ మధ్యమ గ్రామములు రెండింటినే పేర్కొన్నాడు. శార్ఙ్గదేవుడు సంగీతరత్నాకరములో షడ్జమధ్యమ గ్రామములకుతోడు గాంధార గ్రామమును పేర్కొన్నాడుగాని లోకవ్యవహారములో దాని ప్రయోజనంలేదని వ్యాఖ్యాతలన్నారు. "గాంధారపూర్వోన మహీతలేస్తి స గాన యోగ్యః ఖలునారదాదేః". శిలప్పధికారములో కూడ మూడుగ్రామాలే చెప్పారు.

ఆతర్వాత 22 శ్రుతులకు సోమనాథుడు ఇచ్చినపేరులు సకళి, ఘూషి, నిష్కళి సంహృత మొదలైనవి (పైన వివరించినవి) కాగా, అన్ని సంగీతగ్రంథాలలోను ప్రసిద్ధిపొందినవి ఛందోవతి, రంజని, క్షోభిణి మొదలైనవి. ఛందోవత్యాదులను సోమన పేర్కొనలేదు.

ఆ తరువాత సోమనాథుడు ద్వావింశతి గమకాలను పేర్కొన్నాడు. సంగీత రత్నాకరంలోనివి పంచదశగమకాలు. అద్యతన సంగీతగ్రంథాలలో దశవిధగమకాలనే పాటిస్తున్నారు. సోమన చెప్పిన గమకాలు: దీర్ఘలాలిత, దీర్ఘక, అదీర్ఘ, దీర్ఘోల్లసిత, దీర్ఘకంపిత, ఉల్లసిత, సమోల్లసిత, ఉల్లాసిత, ఉచ్చరిత, స్ఫురిత, మూర్ధ్నిక్షిప్త, కోమల, అక్షిప్త, భ్రమిత, ఆహత, లలితోత్తమ, లలిత, ప్రస్తుత, గుంపిత, సూక్ష్మక్రాంత, కుంచిత, కరసితములు. వీటిని సంగీతరత్నాకరములో పేర్కొన్న పంచదశ గమకాలతో పోలిస్తే, పేరులతో తేడాలున్నా, అర్థంలో చాలమట్టుకు అవీ ఇవీ ఒకటేఅనీ, సోమనాథుడు పేర్కొన్న అదనపుగమకాలు రానురాను వ్యవహారంలోనుంచి జారిపోయి ఉండవచ్చుననీ తెలుస్తుంది. ఈ ఇరవై రెండూ కాక, సోమనాథుడు ప్రత్యేకగమకాలేడింటిని చెప్పాడు: కంపితము, స్ఫురితము, లీనము, త్రిభిన్నోత్తర, సప్తధా, ఆందోళితాహతము, సూక్తకలనము. ఇవి ఆనాడు బహుళప్రచారంలో ఉండి ఉండాలి. సంగీతరత్నాకరములోని పంచదశగమకాలు: తిరిపము, కంపితము, స్ఫురితము, లీనము, ఆందోళితము, వలి, త్రిభిన్నము. కురుళము, ఆహతము, ఉల్లలితము, ప్లావితము, గుంఫితములేక హుంఫితము, ముద్రితము, మిశ్రితము——ఈ గమకాలన్నీ ఈనాటికి కూడా ప్రసిద్ధాలేకాని, అద్యతన లక్షణకారులు దశవిధగమకాలని వీటిలో పదింటినే పాటిస్తున్నారు.

తరువాత సోమనాథుడు శ్రీరాగము, ఆందోళి, చిత్రాంగి, లలిత, సౌర, గౌళి, శంకరాభరణము మొదలయిన 108 రాగముల పేర్లిచ్చాడు. సాంగ, రాగాంగ, భాషాంగ, క్రియాంగ సంగతోపాంగ సంజనితములు, స్త్రీపున్నపుంసక భేదములు, షాడవౌడవభేదములు ఈ నూటయెనిమిదిరాగాలలోను కలుగుతాయని చెప్పాడు. ఇంచుమించు ఈ రాగాల పేర్లన్నీ సంగీతరత్నాకరంలో ఉన్నవే. కాంభోది కాంభోజి రెండూ ఒకేరాగపు పేరులో, పరిణామాంతరములేమో అనేభావంతో ఆధునికులు రెండూ ఒకటిగానే వాడుతుంటారు. చిలుకూరి నారాయణరావుగారు అచ్చువేయించిన పుస్తకంలో ధన్నాని, కాంభోది, దేశాక్షి అని కాంభోది, ఒకసారి, పాతికముప్ఫయి పంక్తుల తర్వాత గంధికామోది, శ్రీకంఠ, కాంభోజి, అని కాంభోజిని ఒకసారి వేర్వేరుగా చూపించారు. కాంభోది, కాంభోజి ఒకే రాగపు రెండుపర్యాయపదాలే అయితీరాలి - అందుచేత, గంధకామోది, శ్రీకంఠకాంభోజి (శ్రీకంఠపక్కకామా పొరపాటయిఉండాలి) కాంభోజితోవేరు ఛాయలు కలిసి వేరైన రాగాలు. సోమనకు రెండుశతాబ్దాల తరువాతివారైన తాళ్లపాకకవుల కీర్తనలలో కాంభోజి, తెలుగు కాంభోజిరాగాలలో వరుసగా 35, 2, కీర్తనలకు తక్కువకాకుండా ఉన్నాయి.

సోమనాథుడు పేర్కొన్న రాగాలలో ఈనాటికీ ప్రసిద్ధంగాఉన్న కొన్నిరాగాల పేర్లు- శ్రీరాగము, ఆందోళి, లలిత, గౌళి (ళ), శంకరాభరణము, ధన్నాసి, దేశాక్షి, బహుళి (బౌళి, లేక భవుళి) బంగాళ, నాట, (మాయా?) మాళవగౌళ, కర్ణాట (కన్నడ) గౌళ, భైరవి, వసంత, ఘంటారవము, మలహరి, భూపాళము.

హిందోళము, కాంభోజి, రామక్రియ, తరంగిణి, దేశి.

(సోమన ఇచ్చిన కొన్ని రాగాలు)—(ఈనాటి ఈ రాగాలు కావచ్చును.)

| | | |
|---|---|---|
| దేవగుప్త | — | దేవగుప్తి |
| కన్నడిక | — | కన్నడ |
| నాగదిని కురంజి | — | నాటకురంజి (?) |
| అసారవరాళి | — | అసావేరి |
| గివ్యావతి | — | ద్విజావంతి (?) |
| గుండక్రియ | — | గుండ(ట)క్రియ |

నాగవరాళి, కర్ణాటవరాళి మొదలైన వరాళీ భేదాలన్నీ రత్నాకరంలో వరాటికా అని కనిపిస్తాయి. సోమనచూపిన ఆంధ్రపంచమమూ రత్నాకరములోని ఆంధ్రపంచమమూ ఒకటే కావాలి. కర్ణాట కుంతల శబ్దాలు సమానార్థకాలుగా తోస్తాయి. సోమనచూపిన వరాళి భేదాలలోని కర్ణాటవరాళి, రత్నాకరములోని కొంతలవరాళి ఈ ఊహకు తోడుపడతాయి. నేటి కుంతలవరాళి కివి పూర్వనామా లేమో.

సోమనాథుడు పేర్కొన్న 108 రాగాలలోను సుమారు 20కి పైబడిన రాగాలు తాళ్ళపాకకవుల సంకీర్తనలలో కనిపిస్తాయి. అవియివి: కన్నడగౌళ, గుండక్రియ, కాంభోజి, దేశాక్షి, దేశి, దేసాళం, ధన్యాసి, నాట, భూపాళం, భైరవి, భౌళి, మలహరి, మాళవి, మాళవగౌళ, మాళవశ్రీ, రామక్రియ, లలిత, వసంత, శంకరాభరణ, శ్రీరాగం, సాళంగనాట, సౌరాష్ట్రగుజ్జరి.

అన్నమాచార్యులు మున్నగువారు చాల సంకీర్తనములుపాడిన సామంతం, ముఖారి, వరాళి, మంగళకౌశిక, నాదనామక్రియ, దేవగాంధారి, పాడి, మధ్యమావతి, కేదారగౌళ, అన్నిటికన్న ముఖ్యమయిన ఆహిరిరాగము ఇవి తెలుగుదేశంలో బహుప్రాచీనమైన రాగాలు, తెలుగువారి సొంతసొత్తా అనిపించుకొనేవి బహుశా సోమనాథుని తర్వాత రెండువందల ఏళ్ళలో ప్రచారంలోకి వచ్చి ఉండాలి.

రాగ ప్రశంసకు తర్వాత సోమన బంబళ, నారాట, మిశ్ర, కావుళ ధ్వనిచతుష్కమును పేర్కొన్నాడు. మానవగాత్రంనుంచి వచ్చే శబ్దమును సంగీతలక్షణకారులు చతుర్విధమన్నారు.

"చతుర్భేదో భవేచ్ఛబ్దః ఖాహులో నారటాభిధః,
బోంబకో మిశ్రకశ్చేతి తల్లక్షణ మథోచ్యతే.
కఫజః ఖాహులః స్నిగ్ధమధురః సౌకుమార్యయుక్,
అడిల్ల ఏవఏవ స్యాత్ ప్రౌఢశ్చ స్మంద్రమధ్యయోః.
త్రిస్థానఘనగంభీరలీనః పిత్తోద్భవో ధ్వనిః,
నారాటో, బోంబకస్తు స్యా దంతర్నిస్సారతాయుతః.
పరుషోచ్చతరః స్థూలో వాతజః శాస్త్రిఖోదితః"
ఏతత్సంమిశ్రణా దుక్తో మిశ్రకః సంనిపాతికః.
—సంగీతరత్నాకరం.

రత్నాకరంలోని ఖాహులము, బోంబకము సోమనచెప్పినకావుళము, బంబళము కావచ్చును.

ఆ తరువాత, జయ, ఉజ్జయ అనే సరివాచకములు, హాయి, సుహాయి, గాఢాయి, గూఢాయి, గాఢాయి, వాయి, దేణాయి, బహుళాయి, బడియాయి, నిబిడాయి, చోక్షాయి, దిక్షాయి-ఈ 12 అనువాచకములు. ఇవి ఆలాపనలో స్వరములతో కలిసి. వినిపించే అను స్వరాల భేదాలు కావచ్చు. ఈ మాటలన్నీ మహారాష్ట్రశబ్దాలుగా తోస్తాయి. రత్నాకరంలో లేవు; ఇతర లక్షణ గ్రంథాలలోను కనబడవు.

షట్స్వాదు, సప్తస్వాదు, అష్టావళి, నవస్వాదు, మాయాయి - ఈ అయిదు జయ పంచకము.

దేహావళి, మదావళి, కంఠావళి-జయత్రయం, విజయస్థానకం, వళిగ, ఆంతరం, ఉప్పరవట్ట, మందరణ, వాళి, సర్వగత, భంగాస్థానము, గమళాయి, నాభిగతి, ఉదరగతి, కంఠగతి- ఈ 12 న్నూ తిరువులు. తిరువులంటే ఆలాపనలో వచ్చే తిరుగుడులు లేక బిగకాలు కావచ్చునేమో. ఇవి కూడ ప్రసిద్ధ సంగీత లక్షణ గ్రంథాలలో వేటిలోనూ కనబడువు.

11 వహణి భేదాలు: పరిహారి, సక్కుట, సరివాగ, కంఠికాపాళి, ఉన్కుటము, ముదువ, దేహజాత, నాభిజాత, కక్షజాత, ఉదరజాత, కంఠజాత. "ఆరోహణే,అవరోహణేవా వర్ణేస్వరాణాం కంపనం వహనీత్యుచ్యతే" (రత్నాకరమునకు సింహ భూపాలుని వ్యాఖ్య.) ఆ వహని గీతవహని, ఆల పివహని అని రెండు

విధాలు. స్థిర, వేగాఢ్య అని రెండు రకాలు—అవి మళ్లీ 3 విధాలు: హృద్య, కంఠ్య, శిరస్య.

ఆ తర్వాత సోమనాథుడు పేర్కొన్నవి: ద్వాత్రింశత్ (32) విశుద్ధ గాయములు. ఈ గాయము అనే పదం స్థాయము అనుదానికి ప్రాకృతరూపం.

“రాగస్యావయవో స్థాయో, రాగో గమక ఉచ్యతే, తత్రోక్తం లక్ష్మ గానానాం స్థాయానాం తూర్ణ్యతేధునా” అని సంగీత రత్నాకరం. 32 విశుద్ధ గాయాలు: లలిత, గాఢ, గాఢలలిత, భోచ్ఛలలిత, నేకళి, లవులంగితము, గహంగుహాకము, గోచ్ఛగాఢ, వివరణ, మహీమదోత్కృష్టి, గమకమదోత్కృష్టి, కంపితము, విరళ, గాణాయిలము, నింపు, గోష్ఠా గోష్ఠి, సుంఫు, దీనకాకు, వెల్లాపెల్లి, కల్లి, స్వభావకాకు, కొంకు, (కంపితం ఇంకొకసారి), లాటాక, దరహారం, అనుతాయి, ఓడ, సరిది, పేతాపేత, సరిసంబు మాట్లాయితము. సంగీతసుధ మొదలయిన (17 వ శతాబ్దం) లక్షణ గ్రంథాలలో 15 గాయభేదములే ఉన్నాయి.

27 సాళగ తాళగతులు: సేవగ, దానము, సుత్తి, పూరణ, రంగు, సోపానక, శిగ, సంగతి, గమక, కంపితము, ఆరూఢం, ఆసైకం, సముచ, ఘూర్ణాయము, వగవడి, గిరి, ఆవాళి, వక్కణ, ప్రబంధం, క్షేత్రాంగం, అలంకారి, ఒడకారి, అవజ్ఞ, నిహతము, ఉభయకాశ్యాస, బాహు తిర. భజవణి. (సాళగ తాళగతులు) నాగావతి, నందావతి, భద్రావతి, వినయావతి, భోగావతి, ఇంద్రావతి—ఈ ఆరూ ఆళతులు. ఇవి ఏవో స్పష్టముగా తెలియు లేదు.

ఈ గాయాల పేర్లు, సాళగ తాళగతులు, ఆళతులు ఇవేవీ సమకాలికములలో గాని, అద్యతనములలో గాని ఏ లక్షణగ్రంథములలోను లేవు.

పాల్కురికి సోమనాథుని సంగీతశాస్త్ర వైదుష్యము అసాధారణము అయివుండాలి. భారతదేశములోని వివిధ రాజ్యాలలో నెలకొని, అలరు కొంటూ ఉండిన వివిధ సంగీత పద్ధతులలో సోమనాథునిది ప్రత్యేకించి చెప్పదగిన శాఖ అని తోస్తుంది. ఈ శాఖలోని కొన్ని అంశములకు శార్ఙ్గదేవుడు మొదలయిన సమకాలిక లక్షణకర్తల పద్ధతిలోని అంశములతో ఏ కొంత మాత్రమో సాధారణదృష్ట్యా సామ్యం ఉన్నప్పటికీ, విశేషాంశాలెన్నిటినో సోమన పద్ధతి తన కాలపు దేశీయగాన సంపద నుంచి పుడికి పుచ్చుకొన్నట్లు ఊహింప వచ్చు. దేశిసాహిత్య రచనా వ్యాసంగముతో పాటు దేశీయ గాన వాల్లభ్యమును, శ్రుతిస్మృతి పురాణేతిహాసాది బహు విద్యలతో పాటు మార్గ సంగీతాది చతుష్షష్టి కళలలోనూ కూడ అసాధారణ విజ్ఞానమును సాధించి, తన గ్రంథములలో విన్నల విడిగా వెదజల్లిన సోమనాథుడు మన జాతీయ కవులలో అగ్రగణ్యులలో అగ్రగణ్యుడు.

శా. తంజాధీశుఁడు పంపఁగా దళము లుత్సాహంబుతో వచ్చు నీ
గంజాతిండి మరాటిభోఁజుల పయిం గత్తెత్తఁగా నేలరా?
కెంజం జొత్తురు నీవు చేతికొరడా కీయా తథాకే సుమీ
కంజాక్షీసుమచాప! ముద్దు విజయక్ష్మాపా! నృపాలద్విపా!

Edited and Published by T. Ramachandra, 2/583, Pycrofts Road, Madras-5,
Printed by G. Bhavanarayana at the Weldun Press, 146, T. H. Road, Madras-21.

(56 వ పుట తరువాయి)

# అక్షరమాలా గద్య

జయ జయ బసవాఖ్య స్వానుభూత్యైక్య సౌఖ్య, ప్రమథగణ పవిత్ర ప్రస్ఫురద్భక్తి గోత్ర,
[1] ప్రణమిత బుధవార్య ప్రాయదైశ్వర్య ధుర్య, ప్రథిత వృషభరూప భ్రాజమాన ప్రతాప.
అపిచ శివశృంగార ఆదిపద విస్తార, ఇహపర సుఖాధార ఈషణత్రయ దూర,
[2] ఉద్ధిత గుణోపేత ఊర్ధ్వరేతో జాత, ఋషభ నామ ఖ్యాత ౠజ మాయా తీత,
ఌసలాఖ్య సంకేశ భ్రాజనక సంకాశ, ఏకాంగ వీరేశ ఐక్య సౌఖ్యావేశ,
ఓమితి పదాసక్త [3]ఔషధేతర సిద్ధ, [4]అంధ్యాన సుసమృద్ధ అఃకలిత గుణాబ్ధ,
కలిమలాపహశౌర్య [5]ఖల నిరసన ధైర్య, గర్వాలిత స్థైర్య ఘనసత్వదాచార్య.
ఙస్ఫురణ ధిక్కార చతుర కవితా పూర, ఛద్మేతరాచార జగదతిశయోదార,
ఝషగుణ నిరసన నిపుణ [6]ఞాతిదూరమతి చరణ (?), టక్కాది కాచరణ ఠవణ గహితావరణ,
[7] డమ్రుడాకృతి వ్యక్త ఢాలానుగత చిత్త, ణప్రతాపోద్యుక్త తత్త్వ సౌఖ్య వేత్త,[8]
థవిరహిత గుణశ్లేష్య దమిత తనుగుణ సౌఖ్య, ధర్మపాలన ముఖ్య నవసంది నాథాఖ్య,
పరమ పదసుఖసార ఫలిత జగదుపకార, బసవ లింగ కుమార భక్తి భాండాగార,
మచ్చిదంతః కరణ యమిజనార్చిత చరణ, రతిప్రమద నిరుహరణ లసిత ఘనితావరణ,
[9] వరదలీలాసక్త శమిత [10]విషయోద్యుక్త, షడ్వర్గ నిర్ముక్త సహజ జంగమభక్త,
హరగణ సితచ్ఛత్ర లలిత కీర్తి కళత్ర, క్షగవిముఖ నిజగాత్ర అక్షర స్తుతి పాత్ర.
శ్రీసంగ బసవ దండనాథ నమస్తే నమస్తే నమః.

అకారాది క్షకారాంత మకరోదక్షమాలికాం
[11]ప్రసాదే సోమనాథాఖ్యో బసవస్య [12]కృపాంబుధేః

---

1. ప్రణిహిత. 2. ఉద్ధత 3. ఔషధరస సిద్ధ 4. అంధ్యాన సుఖిసమృద్ధ, అంధ్యాన సుఖిసమృద్ధ. 5. ఖలనిరసనాచార్య 6. ఞామిదూర. 7. డమ్రుడాంకితి వ్యక్త, డమ్రుడాంకలి వ్యక్త. 8. బేసిపాదాలకు, సరిపాదాలకు అంత్య ప్రాసం. 1. వరద తపస్సక్త 2. విషయా వృత్తి, విషయావ్యక్త 1. ప్రసాదాత్, ప్రసాది 2. కృపానిధేః

(43 వ పేజీ తరువాయి)

కత్వము (16) ఊర్ధ్వశంఖ పుండ్ర నిరసనము (17) సర్వదేవతా జనకత్వము (18) ఏకాత్మ వాద నిరసనము (19) ద్విమూర్తివాద నిరసనము (20) అష్టమూర్తివాద నిర సనము (21) కర్మవాదనిరసనము (22) భర్గ శబ్ద నిర్వచనము (23) రుద్రశబ్ద నిర్వచనము (24) మహాదేవ శబ్దనిర్వచనము అను ప్రకరణ ములు కలవు. ఈ ప్రకరణముల నామములను బట్టియే యీ గ్రంథ స్వరూపము కొంతవ్యక్త మగుచున్నదిగదా! ఇందనేక శ్రుతి స్మృత్యాగ మాది సూక్తుల ప్రమాణములచే సోమనాథుం డా యా విషయముల సమర్థించి తన పాండిత్య ప్రకర్షను బ్రకటించును. పండితారాధ్య చరిత్ర యందు మహాత్మ్యనులైన ప్రమాణములు చాల మట్టు కీగ్రంథమునుండి యుద్ధృతములైనవియే. కాన దీనిరచనానంతరమే పండితారాధ్యచరిత్ర వ్రాసినట్లు తెల్లమగును. అన్యవాద కోలాహల శతకకర్త ఏకాంతమనాథుడు 'బసవరాజీయాది బహుశాస్త్రముల మీద నిర్మించిన సామర్థ్యమే

స్తుతించి' అని సోమనాథుని స్తుతించి యుండు టను బట్టి దీనికి బసవరాజీయమను మఱొక నామమున్నట్లు విదితమగుచున్నది.

3. వృషభాష్టకము వసంత తిలకా వృత్త ములతో రచితమైన సంస్కృత స్తోత్రము. ఇదియు సముద్రితము.

4. త్రివిధ లింగాష్టకము—వీర శైవము నకు ప్రధానాంగములైన ఇష్ట ప్రాణ భావ లింగములను గూర్చి అనుష్టుప్పులతో రచించిన కృతి. ఒక్కొక్క లింగమున కెనిమిది శ్లోకములు రచితములైనవి.

5. సంస్కృత బసవోదాహరణము—విద్యా నాథుండీ యుదాహరణ లక్ష్యమును బట్టియే తన ప్రతాపరుద్రయశోభూషణమున లక్షణ మును నిర్మించినాడు. ఇది హృద్యమైన రచన.

6. శీలసంపాదనము :—వీరశైవులనుసరింప వలసిన అఱువదినాలుగు శీలాచారము లిందు జెప్పబడియున్నవి. సంస్కృత శ్లోకములకు కన్నడ వివరణ మివ్వబడియున్నది.

సంవత్సరం చందా : ఆరు రూపాయలు

# పరిశోధనకు పెద్దల పారితోషికం

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు పరిశోధనను ఆశీర్వదించి అందజేసినది — రూ. 20-0-0

శ్రీమతి [illegible] రుక్మిణమ్మగారు తమ ద్వితీయదౌహిత్రి జనన శుభసమయంలో అందజేసిన పారితోషికం ([illegible]) — రూ. 58-0-0



*For Copies :—*

***The Manager,***

**'Parisodhana'**

**2/583, Pycrofts Road, Madras-5.**

# పరిశోధన

(సారస్వత ద్వైమాస పత్రిక)

★
★ ★

## శ్రీ గురుజాడ అప్పారావు స్మారకసంచిక



## మన్మథ- హేమంతం

**11**

ఒక్క రూపాయి

డిశంబరు, జనవరి 1956

# అనుక్రమణిక

—:o—



## కృతజ్ఞత !

ఈ సంచికలోని డాక్టర్ గిడుగు సీతాపతిగారి వ్యాసం రేడియో ప్రసంగం. శ్రీ శ్రీశ్రీ గారి వ్యాసం 'స్వతంత్ర' వారపత్రిక ప్రచురించిన రేడియో ప్రసంగం. శ్రీ అప్పారావుగారి చిత్రం బ్లాకు శ్రీ వావిళ్ల వారిది. వారికి కృతజ్ఞులం.

—సంపాదకులు.

సంపుటి 2. సంచిక 5.

సంపాదకుడు :

తిరుమల రామచంద్ర

సంయుక్త సంపాదకుడు :

తిమ్మావజ్ఝల కోదండరామయ్య



# మనవి మాటలు

—:o:—

గురుజాడవారివి 'గురు జాడలు' అన్నారు, రసహృదయులు రామాచార్యులవారు. నిజమే! ఆధునికాంధ్ర వాఙ్మయంలో అప్పారావుగారిది అన్నిటా ఆచార్యపీఠమే. దేశకాలపాత్ర పరిమితులకు అతీతమైన కళాపారమ్యం కనుంగట్టించే నాటకరచనకు ఆయనదే ఆదర్శం. మాండలికభాష రసాస్వాదనకు అక్కరగలదని నిరూపించడంలోనూ ఆయనదే అగ్రతాంబూలం. మేలుకొలుపుల భూపాల రాగరంజనలతో తనలో పొంగులువారిన మాటలగతిని 'ముత్యాలసరాలు' అనే ఛందోరూపంలో గ్రంథించడంలో ఆయనదే ఒరవడి. దేశభక్తిని నిర్వ్యాజంగా నిర్వచించడంలో ఆయనదే మేలుబంతి. 'ఎల్లలోకము ఒక్కయిల్లై'. 'జ్ఞాన మొక్కటె నిలిచి వెలుగును'. స్వర్గసుఖం అవని విలసిల్లుతుం అని ఆశించినవారిలో అగ్రగణ్యత ఆయనదే. చైతన్యంతో తొణికిసలాడే అపూర్వపాత్రలను సృష్టించినకీర్తి ఆయనదే. తెలుగువారికి నిజమైన హాస్యరసమును అందించిన పేరుకు అప్పారావుగారన్న అనంతకృష్ణ శర్మగారిపలుకు అక్షరాలా నిజం. చిన్నకథతో నేటికథకులకు తెన్ను తీర్చడంలో కూడా ఆయనదే ముందుచూపు. సాంకేతికశాస్త్రం మేలికలయికే నూతనసృష్టికి మూలమని మొట్టమొదటగా గ్రహించినదీ ఆయన మేధే.

భావంలో, భాషలో-రచనలో, రామణీయకంలో ఆయన అలనాటి పాల్కురికి వారిని తలపిస్తారు. ఇరువురూ దేశీ సాహిత్య ప్రవర్తకులే; ఇరువురూ వ్యవహారభాషను చేపట్టినవారే—ఒకరు జానుతెనుగనగా, మరొకరు సజీవమైనభాష అన్నారు. ఇరువురూ వర్ణభేదాలు లేని సమాజాన్ని లక్షించినవారే. కాని ఇరువురికీ కలభేద మంతా ఒక్క విషయంలో—ఒకరిది శివభక్తి; మరొకరిది మానవాభ్యుదయాసక్తి.

———

మనిషీ-మనసూ

# మహాకవి

## శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు



శ్రీ కందుకూరి వీరేశలింగం మహాపురుషుడు కాగా, శ్రీగిడుగు వేంకటరామమూర్తి మహాపండితుడు కాగా, శ్రీ గురుజాడ అప్పారావు మహాకవి. మహాపురుష లక్షణాలు కొన్ని అప్పారావుగారిలో లేకపోలేదు. వీరేశలింగం గారివలె ఆయన సంఘసేవకే తన జీవితాన్ని అంకితం చేసి వుండక పోవచ్చు. మూఢనమ్మకాలను, మూఢాచారాలను ప్రతిఘటించడానికి అహర్నిశం పనిచేసి వుండకపోవచ్చు. సత్యం కోసం, న్యాయంకోసం సమస్తప్రపంచాన్ని ధిక్కరించి, ఒంటరిగా నిలిచిన ఘట్టాలు అప్పారావుగారి జీవితంలో తక్కువనడం కూడా నిజం కావచ్చు. అయినా, మహాపురుషులకోవకు చెందినవాడు కాబట్టే ఆయన 'మతం వేరైతేను యేమోయ్? మనసు లొకటై మనుషులుంటే, జాతి మన్నది లేచి పెరిగి లోకమున రాణించునోయ్' అంటూ సర్వమానవసౌభ్రాత్ర సందేశమివ్వ గలిగాడు. "సొంతలాభం కొంత మానుకు, పొరుగువాడికి తోడుపడవోయ్! దేశమంటే మట్టికాదోయ్! దేశ మంటే మనుషులోయ్!" అంటూ దేశభక్తికి మహోదాత్తమైననిర్వచన మివ్వ గలిగాడు. "మంచిచెడ్డలు మనుజులందున యెంచి చూడగ రెండె కులములు: మంచి యన్నది మాలయైతే మాల నే అగుదున్" అంటూ మానవతకు మచ్చగానున్న కృత్రిమ కులభేదాలను నిరసించ గలిగాడు. "వెనుక చూసిన కార్యమేమోయ్! మంచి గతమున కొంచమేనోయ్! మందగించక ముందు అడుగేయ్! వెనుకపడితే వెనకనోయ్!" అంటూ నవభారతానికి కర్తవ్యబోధ చేయగలిగాడు. ఇంతే కాదు. మహాపురుషుల సరసను నిలువగలవాడు కాబట్టే ఆయనలో "క్రొమ్మెరుంగులు" చిమ్మగల "కొత్తపాతల మేలు కలయిక" కోసం తపన కనబడుతుంది.

పోతే, రామమూర్తి గారిని పోలిన ఉద్దండ పండితుడు కాకపోయినా, అప్పారావుగారి పాండితి అల్పమైంది కాదు. ఇంగ్లీషు ఆయనకు కొట్టినపిండి. విద్యార్థి దశలోనే ఆభాషలో ఆయన వ్రాసిన కొన్ని పద్యాలు సమకాలికుల దృష్టి నాకర్షించి, వారి మన్ననకు పాత్రమైనాయి. అభిజ్ఞాన శాకుంతలాన్ని, ఇతర సంస్కృతనాటకాలను, కావ్యాలనుమూలంలోనే విమర్శనదృష్టితో చదువుకొని, వాటికి విలువలు కట్టుకొనగల పాటిది ఆయన సంస్కృత భాషా పాండిత్యం. తెలుగునకు కొత్తవెలుగు గూర్చిన అప్పారావుగారి తెలుగుభాషా పాండిత్యాన్నిగురించి ప్రత్యేకించి చెప్ప నక్కర లేదు. తేటమాటలలోనుంచి ఆయన తేనెలు పిండగలిగాడు. ప్రజలభాషలచేత పరభృతాల పంచమస్వరాలను పలికించ గలిగాడు.

అయితే, మహాపురుష లక్షణాలు కొరవడక పోయినా, పాండిత్యలోపం లేకపోయినా, అప్పారావుగారిని సంస్మరించగానే ఆయన మనకు మహాకవి రూపంలోనే సాక్షాత్కరిస్తూ వుంటాడు. ఆయన వ్రాసిన కవిత పట్టుమని పదిపదులు పుటలైనా కాకపోవచ్చు. ఆయన ప్రచురించినకథలు అయిదుమాత్రమే కావచ్చు. మూడు నాటకాలను ప్రారంభించి, వాటిలో రెండింటిని అసంపూర్ణంగానే ఆయన విడిచిపెట్టి వుండవచ్చు. ఇంగ్లీషులోను, తెలుగులోను ఆయన వ్రాసిన వ్యాసా లన్నింటినీ చేర్చినా, అదొక చిరుపొత్తాన్ని మించకపోవచ్చు. అయినా, ఆయన మహాకవి. ఎన్ని పుటలను నింపగలిగాడని కాక, పుట్టకీట్లను కదలించ గలిగాడని ఏ కవి విషయంలోనైనా మనం ప్రశ్నించుకోవాలి. ఎన్ని కావ్యాలను పూర్తి చేయగలిగాడని కాక, ఎన్నిగుండెలను ఎంతగా కదిలించగలిగాడని వితర్కించుకోవాలి. ఈ దృష్టినుంచి చూస్తే, అప్పారావుగారు నిస్సందేహంగా మహాకవి. కొద్దిగానే వ్రాసినా, ఆ వ్రాసినదానిలో కూడా ఎగుడుదిగుడు లున్నా, అనేక సాహిత్య శాఖలలో విప్లవాత్మక మైన పరివర్తనాలను సాధించిన ఘనత ఆధునిక యుగంలో ముమ్మాటికీ శ్రీ గురుజాడ అప్పారావుగారిదే!

పెద్దకళ్లతో, పదిరికగల ముక్కుతో, వెడల్పు నుదురుతో, కోలముఖానికి నిండుదన మిచ్చే గుబురుమీసాలతో అప్పారావుగారు తమ ఫోటోలలో అసాధారణవ్యక్తిగా కనిపిస్తారు గాని, ఆబాల్యంగా ఆయన అర్భకుడు. ముప్పైమూడోయేట ఆయనతూకం 78 పౌనులు మాత్రం. ఎన్నడూ 85 పౌనులు మించి ఆయన తూకం పెరగలేదు. "విపరీతమైన బడలిక, ఆయాసం నాకు బాల్యంనుంచీ వున్నవే" అని ఆయన వ్రాసుకున్నాడు. "ఎప్పుడూ పక్కమీద అలా వాలి, విశ్రాంతి తీసుకోవా లనిపించేది" అని తానే చెప్పుకున్నాడు. జీర్ణకోశానికి, నరాలకు సంబంధించిన రుగ్మతలు చిన్నతనంలో వెంటబడి, ఆయనను పీల్చి పిప్పిచేశాయి. గట్టిగా వీచితే గాలికి ఎగిరిపోయేటంత బక్కపలచగా ఆయన వుండేవాడట. "గాలి వొంటికితగలకుండా గొడుగును అడ్డం పెట్టుకుంటూ వుంటాను" అని ఆయ నొక సందర్భంలో చెప్పినా, గాలికి జడిసి రాత్రిపూట కూడా గొడుగు వేసుకుంటూ నని తానై బయట పెట్టలేదు. శీతోష్ణస్థితుల కనుగుణంగా ఒకటి, రెండు శాలువలు, తలపాగా, కోటూ ధరించడం ఆయనకు పరిపాటిగా వుండేది. ఏ ఉదకమండలానికో వెడితే, జుబ్బామీద జుబ్బా, కోటుమీద కోటు తగిలిస్తూ వుండేవారుకూడా. వీరేశలింగం గారి ఆరోగ్యమైనా అంతంతమాత్రమే. కాని, ఆయనకంటె కూడా అప్పారావుగారే అన్ని విధాల అర్భకులని చెప్పాలి. అయినా, ఆయనలో ఆలోచనలెన్నో—అగ్నిపర్వతంలో లావావలె—కళకళ ఉడుకుతుండేవి. ఇందుకు కారణం ఆయన ప్రేమికుడు కావడమే. కొందరు అధునాతన కవులవలె ఆయన ప్రేమించింది ఇహలోకానికో, లేదా, ఊహాలోకానికో చెందిన ఏ ప్రేయసినో కాదు. నవప్రపంచాన్ని, దానిలో నెలకొనవలసిన నవవ్యవస్థను గురించి కలలు గన్నా, ఆయన ప్రేమించింది భవిష్యత్తునూ కాదు. తన కాలంలో, తనను పరివేష్టించి వున్న జీవితాన్ని, దాని నిత్యనూతన విలాసాలనే ఆయన మనసారా ప్రేమించాడు. కూర్చుంటే లేవలేని, లేస్తే కూర్చోలేనిస్థితిలో బ్రతుకును వెళ్లమార్చుకొనవలసిన వాడైనా బతుకు ఆయనకు భారంగా కనబడలేదు. నిస్సారమైందిగానూ తోచలేదు. అడుగడుగున దానిలో కొత్తఅందాలే ఆయనకు గోచరించాయి; ఎటు తిరిగినా, కొత్త వెలుగులే పొడగట్టాయి. రోజులు ఆయనకు అర్థరహితం కావు. పరస్పర ప్రతిధ్వనులు కావు; ప్రతిప్రభాతంతోనూ ఒక కొత్తగీతాన్నో, గేయాన్నో వినిపించే కిన్నెర కన్యలవి. ప్రజ ఆయనకు మెదడులేని గొర్రెల మందకాదు. ఒక్కొక్కవ్యక్తిలో ఒక్కొక్క విశ్వమే ఆయనకు సాక్షాత్కార మౌతుండేది. అందువల్లనే ఆయన "జీవితంలో ఎంతవైవిధ్యం వుంది! ఎంతటి తీవ్రగమనం వుంది! నేటి జీవితం పుష్కలమైన, అనంతమైన గాథలతో నిండి వుంది" అని ఒకలేఖలో వ్రాయగలిగారు; "అయినా, దానిని (బ్రతుకులోని వైవిధ్యాన్ని, దాని గమనతీవ్రతను) మన రచయితలు దర్శించరు." అని ఆయన వాపోవ గలిగాడు.

సరిగా శ్రీ గురుజాడ అప్పారావుగారిని అర్థంచేసుకోగల వారికి ఆయన సంఘసంస్కరణాభిలాషతోనో, వ్యావహారికభాషా వాదంతోనో ప్రేరేపితుడైన కవి కానే కాడు; జీవచ్ఛక్తులచే, వాటివైవిధ్యంచే, వాటి విద్యుద్గమనంచే, వాటి విలాసాలచే ప్రేరేపించబడిన మహాకవి ఆయన. సంఘసంస్కరణను ఆయన కోరక పోలేదు. అందుకు సారస్వతాన్ని ఒక సాధనంగా చేసుకోవాలని అభిలషించక పోను లేదు. కాని ప్రచారసాధనంగా చేయదలచుకున్న రచనలో సయితం తన ఇంద్రజాల మహేంద్రజాల విద్యలన్నింటితోను జగన్మోహనరూపంతో తరలివచ్చి జీవితమే కొలువుతీర్చేది. అందువల్లనే "కన్యాశుల్కం"లో సంఘ సంస్కరణ ప్రచారం ఎక్కడ జరిగిందన్న ప్రశ్న, అందువల్లనే "కొండుభట్టీయ" మేమి, "బిల్హణీయ" మేమి సంఘసంస్కరణోద్యమానికి ఎంతవరకు తోడ్పడగల వన్న సందేహం.

కలం పట్టగానే జీవితం తప్ప అన్య మేదీ కళ్ళకు కట్టేది కాదు గనకనే, శ్రీ అప్పారావుగారి "కన్యాశుల్కం" నాటకంలో పొందిక తక్కువ. నాటకశిల్పాన్నిగురించి ఆయనకు తెలియని విషయాలు తెలుసుకోదగినవే కావు. అయినా, "కన్యాశుల్కం"లోని ముఖ్యమైన లోపం నాటకశిల్పం తక్కువ కావడమే! దానిలో ఏడు అంకాలున్నాయి; లెక్కలేనన్ని రంగాలున్నాయి; 29 పాత్రలున్నాయి;

దాన్ని పూర్తిగా ఆడాలంటే ఒక రాత్రి చాలదేమో! నాటకాంతంలో మిస్టర్ గిరీశం నోట వచ్చేమాట—"డామిట్! కథ అడ్డంగా తిరిగింది"—మొత్తం నాటకానికే వర్తిస్తుందని చెప్పవచ్చు. నిజానికి తనకు ఎదురు తిరిగి, నాటకం తన చిత్తం వచ్చినరూపాన్ని తాను ధరించడాన్ని చూడగా కలిగిన అసంతృప్తే గిరీశం నోటిద్వారా అప్పారావుగారిచేత ఈ మాట అనిపించిందేమో! ఏమైనా, జీవితాని కుండే చిలవలు, పలవలే "కన్యాశుల్కం"లో వున్నాయి. దానిలోవలె దీనిలో కూడా పొందిక తక్కువ. అవి కూడా మానవజీవితంలో వుండే లోపాలే. కాని, ఎన్ని లోపాలున్నా, జీవితంవలే నిత్యనూతనమై అది మనలను ఆకర్షిస్తుంది; అలరిస్తుంది; అనిర్వచనీయమైన సమ్మోహనశక్తితో మనలను వశవర్తులను చేసుకొంటుంది. దానిలోని పాత్రలు (అవి గిరీశం, వెంకటేశం, అగ్నిహోత్రావధానులు, రామప్పపంతులు, లుబ్ధావధానులు, బుచ్చమ్మ, మధురవాణివంటి ప్రధానపాత్రలైనా, లేక పూజారి గవరయ్య, పోలిశెట్టి, హెడ్ కానిస్టేబువంటి అప్రధాన పాత్రలైనా) రంగస్థలంలోని పాత్రలుగా ఏ ఘట్టంలోను పొరపాటుగానైనా తోచవు; జీవితరంగంలోని వ్యక్తులుగా అవి మనలనుపలకరిస్తాయి; మనతో మాట్లాడతాయి; మనలను కవ్విస్తాయి; నవ్విస్తాయి. సాంఘిక ప్రయోజనాన్ని కోరి వీరేశలింగంపంతులుగారు "అపూర్వబ్రహ్మచర్య ప్రహసనము", "విచిత్ర వివాహ ప్రహసనము", "మహాబధిర ప్రహసనము" అంటూ ఎన్నింటినో వ్రాశారు. ఈ ప్రహసనాలన్నీ చేరి "కన్యాశుల్కా"నికి కనీసం నాలుగురెట్లు వున్నాయి. అయినా, వాటిలో వచ్చే పాత్ర లేవో మనకు జ్ఞాపకం వుంటున్నవా? "గమాకాంతము పంతులు", "ధనపాలుడు" ఏ ప్రహసనాలలోని పాత్రలో ఎందరు చెప్పగలరు? శిల్పం తక్కువైనా, ప్రయోగ సౌలభ్యం తక్కువైనా, "కన్యాశుల్కం"మే నేటికీ మన కున్న నాటకాలలో ఉత్తమోత్తమమైనదిగా చెల్లడం జీవితాని కున్న చేవ దాని కున్నందునే; జీవంతో తొణికిసలాడుతున్న పాత్రలు దానిలో వున్నందునే.

శ్రీ అప్పారావుగారు భాషాపండితులైనా, భాషా పరిణామ శాస్త్రాన్ని పరిశీలించినవారైనా, కేవలం భాషాభిమానమే (శ్రీ గిడుగు రామమూర్తిగారి విషయంలో జరిగినట్టు) ఆయనను వ్యావహారిక భాషావాదిగా చేయలేదు. జీవితంపై ప్రేమే ఆయనను కావ్యవస్తువు కోసం ప్రజల మధ్యకు పంపింది; అదే ఆయనను ప్రజాభాషాభిమానిగా మార్చింది. రచయితను ప్రజలకు దూరం చేసేది కాబట్టే, గ్రాంథిక భాషపై ఆయన కంత మంట. ఆ మంటతోనే "సంకెళ్ళను ప్రేమించేవారిని దాన్ని (గ్రాంథిక భాషను) ప్రేమించ నివ్వండి. కాని నాకు మాత్రం ఏ భాషలో మన సుఖదుఃఖాలను మనం జంకు లేకుండా వ్యక్తపరుస్తామో, ఏ భాషను నేను నాతల్లి వొడిలో నేర్చుకున్నానో, ఆ సజీవమైన భాషే కావాలి" అని ఆయన అనగలిగాడు. "నాది ప్రజోద్యమం. ఎవరిని సంతృప్తి పరచడానికీ దాన్ని వదలుకోలేను" అని ఉద్ఘాటించ గలిగాడు.

జీవితాన్ని గురించి చివరిమాట చెప్పడానికి వీలు కానట్టే, జీవితాన్ని ప్రేయసికంటె ప్రియంగా ప్రేమించి, దాన్ని కీర్తించిన అప్పారాయ మహాకవినిగురించి కూడా చివరిమాట చెప్పలేము. కాని, ఒక్కటి మాత్రం నిజం. కన్యాశుల్కం ఈనాడొక సాంఘిక దురాచారం కాదు. వ్యావహారిక భాషావాదం ప్రజోద్యమంగా మిగలని కాల మొకటి రావచ్చు. అయినా, జీవితంపై మనకు ప్రేమ నిలిచినంత వఱకు అప్పారావుగారి కృతులు చెక్కు చెదరకుండా నిలుస్తాయి.

'గుత్తునా' యని జాతిముత్యాల్
గుచ్చినాడే మేలిసరముల,
'ఇత్తునా' యని తెలుగుతల్లికి
ఇచ్చినాడే భక్తితో.

—శ్రీ కృష్ణశాస్త్రిగారు.

# ఆదర్శపురుషుడు

## డాక్టర్ గిడుగు వేంకటసీతాపతిగారు

1910 కి పూర్వం నేను పది పండ్రెండు సార్లు గురుజాడ వేంకట అప్పారావుగారిని చూడడం జరిగినా, 1897 లో వారు రచించిన కన్యాశుల్క నాటకం మొదటి ముద్రణం, 1909 లో వారు మరల పెంచి రచించిన ఆ నాటకం రెండవ ముద్రణం చదివాకే, వారితోడి సన్నిహిత పరిచయం. వారివద్ద చాలా చనవుగా ఉండడం 1910 తర్వాతనే జరిగినవి. 1910 తర్వాతనే వీరి ప్రతిభ, వీరి కళాభిజ్ఞత, వీరి కవితాశక్తి, వీరి యభిరుచులు, సర్వతోముఖమైన వీరి విజ్ఞానము, వీరితో ప్రసంగించడము వల్లను, వీరి రచనలు మరల మరల చదవడం వల్లను అంతె కంత ఎక్కువగా తెలుసుకో గలిగాను.

వీరి జీవితచరిత్రలో వీరు బి. ఏ. అయి 1887 లో విజయనగరం మహారాజావారి కాలేజీలో లెక్చరరుగా ప్రవేశించిన తర్వాత రెండే ప్రధానమైన ఘట్టాలు. మొదటిది 1887 నుండి 1896 వరకున్ను తొమ్మిది సంవత్సరాలు ఆచార్య పదవి, విద్యావ్యాసంగం గల ఘట్టము; రెండవది 1896 నుండి 1915 వరకున్ను విజయనగరం మహారాజా మహారాణీవారి అంతరంగిక కార్యనిర్వహణం, కార్య రచన గల ఘట్టము. స్వతఃసిద్ధముగా అప్పారావుగారు అర్భకులు. పలుచని శరీరం గలవారు. వీరి ముఖవర్చస్సు ఛాయాచిత్రములో చూచినప్పుడు వీరు మంచి ఆరోగ్యము దేహపుష్టి గలవారన్న అభిప్రాయం కలుగుతుంది కాని, వీరి దేహం కుచేలుని దేహంవంటిది. బాల్యమునుండిన్ని వీరికి స్వస్థత లేకుండా ఉండేది.

బలహీనులకు, ఆరోగ్యం సరిగా లేనివారికి సాధారణంగా ఉండని ఓరిమి వీరిలో చాలా ఎక్కువగా ఉండేది. వీరి యింట వీరి విద్యాగోష్ఠికి ప్రత్యేకించుకొన్న గది చిన్నది. అందులో ఒక పెద్ద మేజాముందు ఒక పెద్ద మెత్తా గల కుర్చీలో కూర్చుండి గ్రంథపఠనమో రచనమో చేసుకుంటూ ఉండేవారు. మేజా కిరుప్రక్కలను, అవలను నాలుగైదు కుర్చీలు, రెండు బెంచీలు ఉండేవి. వారి దర్శనానికి అనేక మంది వస్తూ ఉండేవారు; పోతూ ఉండేవారు. ఏదో అవసరమైన పను లుంటేనే తప్ప వారితో వట్టి కబుర్లు చెప్పుకోడానికి అప్పారావుగారు పూనుకొనేవారు కారు. వారు తమపని తాము చూచుకొంటూ ఉండేవారు. ఎవరినీ పొమ్మనేవారు కారు. ఆ వచ్చినవారు తమంత తామే సెలవు అని పోయేవారు. ఈ లోగా మనుమలు మనుమరాళ్ళు ఏవో చిలిపికయ్యాలు పెట్టుకొని ఏడుస్తూ 'చూడు తాతయ్యా! అక్క నాకు పాట చెప్పనంటున్నాది' అని వస్తే, నేను చెప్తాలే—'వెలగా మొగ్గతో చిలుకాపిట్టా ఏమని పలికిందీ...' అంటూ ఏవో రెండు మాటలు పాటవరుసను కూర్చి చెప్పి పంపివేస్తూ మరల తమ చదువో వ్రాతో చూచుకొనేవారు. అంతేకాని వారెప్పుడూ, గట్టిగా కేకలు వేసికాని, కోపపడికాని మాటలాడేవారు కారు. మహారాజుగారి కోటలోనికి వెళ్లినప్పుడు కూడా పుస్తకాలు, కాగితం, కలం తీసుకొని పోయేవారు. కోటలో గంటలకొద్దీ పడి ఉండవలసి వచ్చినా చేయవలసిన పని మాత్రం ఉండుండీ ఉడిగుండీ అప్పుడొక పది నిమిషాలు, ఇప్పుడొక అయిదు నిమిషాలు మాత్రమే పడుతూ ఉండడం నిత్యం జరిగేదే కనుక తక్కిన కాలమంతా తాము తమ చదువో వ్రాతపనో సాగించుకో వచ్చును. చేస్తూ ఉన్నపనికి ఎన్నిసార్లు అడ్డంకులు వచ్చినా విసువు లేక తమ పని తాము సాగించే నేర్పు వీరికి అలవడింది.

వీరెంత ఉదారులో, ఎంత విశాల హృదయులో, ఎట్టి అభ్యుదయ రచయితలో వీరి కాలపు పరిస్థితులను పరిశీలించినగాని పూర్తిగా తెలిసికొనలేము.

'దేశాభిమానం నాకు కద్దని
వట్టి గొప్పలు చెప్పుకోకోయ్
పూని యేదైనాను వొక మేల్
కూర్చి జనులకు చూపవోయ్'

ఈ పద్యంలోని భావం అప్పారావుగారు ఏదో కవితా దృష్టితో చెప్పడం మాత్రమే కాదు తన జీవితంలో దీనిని ఆదర్శప్రాయంగా పెటు

కొని కృతకృత్యు లయినారని కూడా చెప్పగలము. నాతో ఒకసారి వీరు దేశాభిమానం గురించి ప్రసంగిస్తూ 'చూశావా ఈదేశభక్తీ, ఈ స్వదేశాభిమానం మన హృదయాన్ని ఎంత సంకుచితమైనదానినిగా చేస్తుందో. నలుగురితో పాటు నేనున్న మన భారతదేశం - అందులో మన తెనుగుదేశం - అందులో మన బ్రాహ్మణ జాతి - అందులో మన ఆరువేల నియోగిశాఖ - అని ఎంచుకొంటూ దురభిమానం పొందుతూ ఉంటాను. ఈవిధంగా మన అభిమానాన్ని అంతకంతకు సంకుచితం అయేటట్టు చేస్తుంది ఈ దేశాభిమానం. ఎంతో విశాలహృదయంతో చూస్తేనే కాని ఈ విశ్వమంతా మనదే అనే సర్వజనీన మయిన అనురాగాన్ని పొందలేము' అన్నారు. 'ఐతే స్వదేశాభిమానం, స్వసంఘాభిమానం విడిచి పెట్టుకోవా లంటారా?' అన్నాను. 'లోకకళ్యాణానికి భంగం రానీయకుండా పెద్ద సంఘాల మేలు చెడగొట్టకుండా నీ చిన్నసంఘం మేలు నీవు కాపాడవలసినదే. కాని, నీవు చేసే మేలు ఈ విశ్వంలో ఎంతమేర వ్యాపిస్తే అంత గొప్ప దౌతుంది. దానినిబట్టి నీవు చేసినపని గొప్పతనం, నీఘనత ఉంటవి' అన్నారు.

అప్పారావుగారు సంస్కృతము, తెలుగు, ఇంగ్లీషు సాహిత్యాలు లెస్సగా చదివినవారు. ఇంగ్లీషులో చక్కని రచన సాగించినవారు. వీరికి గల ఔదార్యము, విశాలహృదయము, సంస్కృతి ఎక్కువగా వీరు చదివిన ఆంగ్ల వాఙ్మయ గ్రంథాలవల్లనే కలిగింది. సంస్కృత భాషా పాండిత్యం అధికముగా ఉండేదని నేను చెప్పలేను గాని సంస్కృతకావ్యాలు, నాటకాలు కొన్ని లెస్సగా చదివి విజయనగరంలో పేరొందిన పండితుల గోష్ఠిలో ఉండిన వారగుటచేత అనేక శాస్త్ర విషయాలు, కావ్య మీమాంసా విషయాలు అలవరచుకొన్నారు. ప్రాచీనాంధ్ర భాషా పాండిత్యం, వ్యాకరణాల పరిజ్ఞానం చాలా ఎక్కువయినది కాకపోయినా చక్కని రచన సాగించడానికి కావలసినంత ఉండేదని చెప్పగలను. పాండిత్యం కంటె కావ్య రసగ్రహణశక్తి, కళాభిజ్ఞత, రచనాకౌశలము ఎక్కువగా వీరి కలవడినవి. వీరు పెద్ద కావ్యాలు, ప్రబంధాలు రచింపలేదు. వీరు రచించిన ఖండకావ్యా లన్నీ చదవడానికి ఒక గంటకంటె ఎక్కువ పట్టదు. కాని వీరు రచించిన కావ్యపంక్తులలో కొన్ని 'ఆలోచనామృతం' అన్నట్టు ఆలోచన చేసినకొద్దీ అమృతమువలెనే రుచి కలిగిస్తూ హృదయానందాన్ని పెంపొందిస్తూ ఉంటవి.

అప్పారావుగారి "ముత్యాల సరము" లందలి మొట్టమొదటి పద్యమే ఎంత మనోజ్ఞముగా ఉందో చూడండి.

'గుత్తునా ముత్యాలసరములు
కూర్చుకొని తేటైన మాటల
కొత్తపాతల మేలు కలయిక
క్రొమ్మెరుంగులు చిమ్మగా...

ఛందస్సులో విశిష్టత, నడకలో తూగు, భావంలో గాంభీర్యము, పద్యాలలో లాలిత్యము అన్నీ చేరి పద్యానికి కవితాసౌష్ఠవమును చేకూర్చినవి.

'మెచ్చనంటా వీవు, నీ విక
మెచ్చకుంటే మించి పోయెను
కొయ్యబొమ్మలె మెచ్చుకళ్ళకు
కోమలుల సౌరెక్కునా?'

అనే పద్యము భవభూతి చెప్పిన 'యే నామ కేచిదిహ నః ప్రథయన్త్యవజ్ఞాం-' అనే శ్లోకాన్ని జ్ఞప్తికి తెస్తుంది. వారి నూతనఫక్కి కవిత్వాన్ని మెచ్చుకోలేని వారిని మనసులో పెట్టుకొని రచించిన పద్యమిది. 'నిర్జీవమయిన కొయ్యబొమ్మల అందాన్ని మెచ్చుకొనేవారు కోమలాంగుల సౌందర్యాన్ని మెచ్చుకోగలరా? కాంతాసమ్మితమైన కావ్యమును మెచ్చుకోగలరా?' అని వారి భావం.

అప్పారావుగారికి గల ఉదారభావాలు వారి రచనలలో వెల్వడుతూ ఉంటవి. 1910లో బరంపురమందు ఒకరింట పెద్ద విందు జరిగింది. నాలుగు జాతులవారున్ను కలసి పంక్తులు తీర్చి కూర్చుండి భోజనం చేశారు. సనాతన ధర్మం పోషించాలనే పూర్వాచార పరాయణులకు ఇది ఘోరమైన దుష్కర్మగా తోచింది. విందారగించిన వారి నందరినీ వెలి వేశామన్నారు ఆపెద్దలు. ఈకలవరం కొన్నాళ్లు చెలరేగి అణగినది. ఆ ముచ్చటను మనసులో పెట్టుకొని, అప్పారావుగారు,

'మొన్న పట్నమునందు ప్రాజ్ఞులు
మొట్టమొదటిది మెట్టు యిది యని
పెట్టినా రొక విందు జాతుల

జేర్చి వినవై తే.'

అనే పద్యము తన ముత్యాల సరములో చేర్చారు. సంఘసంస్కరణమునెడల వీరికి ఉదారాశయములుండేవి. అందుచేతనే ముత్యాలసరములందు—

'ఎల్లలోకము వక్కయిల్లై
వర్ణభేదము లెల్ల కల్లై
భేద మెరుగని ప్రేమబంధము
వేడుకలు కురియా
మతము లన్నియు మాసిపోవును
జ్ఞాన మొక్కటి నిలిచి వెలుగును
అంత స్వర్గసుఖంబు లన్నవి
అవని విలసిల్లున్.'

అనే పద్యాలున్నూ, 'లవణరాజుకల' అనే ఖండకావ్యమందలి...

'మలినదేహుల మాల లనుచును
మలినచిత్తుల కధిక కులముల
నెల వొసంగిన వర్ణధర్మ ము
ధర్మధర్మంబే.
మంచిచెడ్డలు మనుజులందున
యెంచి చూడగ రెండె కులములు
మంచి యన్నది మాల యైతే
మాల నే యగుదున్.'

అనే పద్యాలున్నూ, 'కన్యక' అనే ఖండకావ్యమందలి...

'ఎక్కడైతే కన్య మానం
కాచుకొనుటకు మంట గలిసెనో
అక్కడొక్కటి లేచె సౌధము
ఆకసము పొడుగై
పట్టమేలే రాజు పోయెను
మట్టి గలిసెను కోటపేటలు
పదం పద్యం పట్టు నిలచెను
కీర్తు లపకీర్తుల్.'

అనే పద్యాలున్నూ వీరి ఉదారభావాలకు ఉదాహరణములు. స్వదేశీ ఉద్యమం, కర్షక కార్మికుల అభ్యుదయం మనసులో పెట్టుకొని 'దేశభక్తి' అనే ఖండకావ్యంలో వీరు రచించిన పద్యాలు తరచుగా మనం మననం చేసికోదగినవి.

'ఈసురో మని మనుషు లుంటే
దేశమేగతి బాగుపడునోయ్
జల్దుకొని కళ లెల్ల నేర్చుకు
దేశిసరుకులు నించవోయ్.
అన్ని దేశాల్ క్రమ్మవలెనోయ్
దేశిసరుకుల నమ్మవలెనోయ్
డబ్బు తేలేనట్టి నరులకు
కీర్తి సంపద లబ్బవోయ్.
సొంతలాభం కొంత మానుకు
పొరుగువాడికి తోడుపడవోయ్
దేశ మంటే మట్టి కాదోయ్
దేశ మంటే మనుషులోయ్.'

వీరి కవితా, నిపుణత కళాధర్మము వీరి 'పుత్తడిబొమ్మా పూర్ణమ్మ' అనే గేయంలో పూర్తిగా వికసించినది. అందులోని విషాదాంతమైన కథ ఎంతటి పాషాణహృదయులైనవారిచిత్తములయినను కరగించి కన్నుల నీరు కారించే విధమున రచిత మయినది. ఈ కథలో కూడా కన్యాశుల్కము, ముసలివానికి చిన్నదానిని కట్టబెట్టిన బాల్యవివాహము ఎంత ఘోరదుర్గంతానికి కారణము లగుతున్నవో నిరూపించారు అప్పారావుగారు.

వీరి రచన లన్నిటను 'కన్యాశుల్క నాటకము' అన్నివిధాలా ఉత్తమ మయినది. వ్యావహారిక భాషలో పాత్రోచితమైన భాషలో రచితమైనది గనుకను హాస్యరసము ఎక్కువగా కలది గనుకను ఇది ప్రహసనమే. కాని నాటకము కాదని కొందరు, ఇందులో నాటక లక్షణాలు పట్టలేదని కొందరు వాదించారు. ఈ విధముగా వాదించేవారు నేడు కూడా కొందరుండవచ్చును. వారి అభిప్రాయాలు సరియైనవి కావని వారికి సమాధానాలు చెప్పడం జరిగింది. వివాదగ్రస్తమైనది ఎట్లున్నా ఒక్క విషయం నిర్వివాద మయినది. దీనియెడల తెలుగువారికి ఆదరాభిమానాలు ఎక్కువయినవి. ఇంతవరకూ దీనితో సరితూగగల సాంఘికనాటకము రచితము కాలేదు. సాధారణముగా సాంఘిక సమస్యలుగల నాటకములు తాత్కాలికప్రయోజనము గలవి. ఆ సమస్యలు తెగిపోగానే ఆ నాటకముల విలువ కూడా తగ్గిపోతుంది. ఈ నాటకము కూడా 50, 60 సంవత్సరముల క్రిందటి సాంఘికసమస్యలు గలదే అయినా కవి విశిష్ట గుణములు గల పాత్రలను సృష్టించుటవలన ఈ నాటకము విలువ తగ్గిపోలేదు, తగ్గదు. మన మిప్పుడు మన సంఘంలో ఉన్న వారినిగూర్చి వీడు గిరీశంవంటివాడు. ఆ వేశ్య మధురవాణి వంటిది. అతడు సాక్షాత్తు అగ్ని

హోత్రావధానులే ... ఈ విధంగా అంటే చాలు. ఆ యా వ్యక్తుల గుణాలు వ్యక్తం కాగలవు. అప్పారావుగారు తమ 54 వ యేటనే అకాలమృత్యువునోట పడుటచేత వీరి ఇతర రచనలు 'బిల్హణీయము,' 'కొండుభట్టీయము' పూర్తిగా చూచి ఆనందించగల భాగ్యం మనకు లభించలేదు.

అప్పారావుగారు తమకాలం వారికే కాక మనకూ, మనతర్వాతి తరాల తెలుగువారికిన్ని అనేకవిషయాలలో మార్గదర్శకులు. దేశాభిమానం ఉందంటే చాలదు. ఏదైనా ఒక మేలు సమకూర్చి చూపించు-అనే ఉపదేశం, ఆ ఉపదేశాన్ని అనుసరించి ఆచరణలో పెట్టి చూపించిన అతని నడవడి మన కెక్కువగా మార్గదర్శక మైన దని చెప్పవలెను. వాడుక భాషలో రసవంతముగా కావ్యరచన, కథా రచన, నాటకరచన సాగింపవచ్చును; సాగించ గలము అని చెప్పడం మాత్రమే కాకుండా చేసి చూపించారు అప్పారావుగారు. వ్యావహారిక భాషావాదం శాస్త్రరీత్యా గిడుగు రామమూర్తిగారు సాగించి పండితులకు రచయితలకు నచ్చజెప్పారు. అప్పారావుగారు గ్రంథరచన సాగించి 'ఈమార్గాన నాటకాలు రచించండి, కథలు వ్రాయండి, కవిత్వం సాగించండి' అని మూడువిధములైన రచనలున్ను చేసి చూపించారు. వీరిద్దరు గావించిన భాషాసేవా ఫలితంగా నవ్యసాహిత్యం పెంపొందినది. నాటకాల విషయంలో అప్పారావుగారు చేసిన ఉపదేశాలు, త్రొక్కిన మార్గాలు చాలా రచయితలకు ఆదర్శప్రాయా లయినవి. "నాటకాలలో సంగీతానికి తావు లేకపోలేదు. జీవితంలో ఏయే సంఘటనలందు గానం వినిపిస్తూ ఉంటుందో ఆ యా సంఘటనలు జీవితాన్ని ప్రతిబింబింప జేసే నాటకాలలో వచ్చినప్పుడు తప్పకుండా గానం వినబడవలసినదే. కాని సంభాషణలు సైతము పాటలతోను, పద్యాలతోను నడిపించడం ప్రకృతివిరుద్ధం. అంతేకాక వచనంలో-సహజమైన వాడుక భాషలో చెప్పినప్పుడు అభినయానికి, భావప్రకటనానికి ఉండే అవకాశం పద్యం పదం పాడినప్పుడు ఉండదు" అని తమ వ్యాసాలలోను, ఉపన్యాసాలలోను చెప్పి, వచనంలో నాటకాలు ఎక్కువ రసవంతంగా ఎట్లు సాగింపవచ్చునో తమ "కన్యాశుల్కం, కొండుభట్టీయం, బిల్హణీయం" నాటకాలలో చూపించారు. రసవంతంగా కథానికలు వ్రాయడంలో వీరే మొదటివారు. మార్గదర్శకులు - సాంఘిక నాటకాలవిషయంలో, కాకపోయినా కథానికల విషయంలో వీరి మార్గాన్ని అనుసరించి వీరిని మించిన కథానికా రచయితలు అనేకులు మన తెలుగు నవ్యసాహిత్యంలో ఉన్నారు.

ఖండకావ్యాల విషయంలో వీరున్ను, శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారున్ను మొదటివారు. ఒక్క విషయంలో వీరిద్దరికిన్ని తేడా ఉన్నది. ఇరువురికిన్ని ఆంగ్లసాహిత్యంలో గల ఖండకావ్యాలే మార్గదర్శకాలు. ఏదో ఒక భావం, ఏదో ఒక కథ ఒకొక్కఖండకావ్యానికి విషయంగానో, కథావస్తువుగానో పెట్టుకొని ఇద్దరున్నూ తమకావ్యరచన సాగించినవారే. కాని రాయప్రోలు సుబ్బారావుగారు భాషావిషయంలోను, కవి సమయాలలోను ప్రాచీనసంప్రదాయాలను పాటించారు; అప్పారావుగారు ఛందస్సులోను, భాషలోను, కవి సమయాల విషయంలోను నూతన మార్గాలను పూర్వ సంప్రదాయాలతో మేళవింప జేసి "కొత్త పాతల మేలుకలయిక క్రొమ్మెఱుంగులు చిమ్మగా" అని తాము చెప్పుకొన్నట్లు తమ 'ముత్యాలసరాలు' తేటయిన మాటలు కూర్చి గుచ్చినారు. రాయప్రోలువారి రచన కొందరికి మార్గదర్శకమైతే, గురుజాడవారి రచన మరి కొందరికి మార్గదర్శక మైనది.

దేశ మనియెడి దొడ్డవృక్షం
ప్రేమలను పూలెత్త వలెనోయ్
నరుల చెమటను తడిసి మూలం
ధనంపంటలు పండవలెనోయ్

—శ్రీ అప్పారావుగారు.

**పదాల పుట్టుపూర్వోత్తరాలు :**

# కన్యాశుల్కం భాష

## శ్రీ నిడదవోలు వేంకటరావుగారు

కన్యాశుల్క నాటకరచనలో అప్పారావుగారు చూపిన ప్రతిభ అపూర్వమైనదీ, అద్భుతమైనదీ అనవచ్చును-ఆయన సంస్కృతనాటకాలామూలాగ్రం చదివినారు-రోమను గ్రీకు నాటక సంప్రదాయాల్లో నిరూఢియైన ప్రజ్ఞ సంపాదించేరు - పరాసునాటకాల పరిపాటి చూచారు. ఆంగ్లభాషానాటకాల్ని-అందులో షేక్స్పియరు నాటకాలను ఆపోసనం పట్టారు- కేవలం నాటకరచన ఒక్కటే కాకుండా అందులో సంఘటనలకు, పాత్రలకుగల సంబంధమును గూర్చి పాత్రోచిత వేషభాషలను గూర్చి నాటకప్రయోగాన్ని గూర్చి, రసవిషయంలో హాస్యరసాన్ని గూర్చి, విదూషకుని పాత్ర గూర్చి, రంగస్థలం నేపథ్యం దుస్తులు— ఒకటేమిటి సమస్త విషయాలని గూర్చి శాస్త్రీయపద్ధతిని కూలంకషంగా వ్యాసంగం చేసేరు- దానికితోడు, తెలుగుభాష - ప్రాచీనచ్ఛందస్సంప్రదాయాలు-యక్షగాన నాటకపద్ధతులు- ముఖ్యంగా కళింగదేశంలో వేషభాషలు ఆచారవ్యవహారాలు కూడా ఆమూలచూడంగా ఆవలోకించేరు. ఆయన ప్రకృతిసిద్ధంగా ఆహారం జీర్ణించుకోలేక పోయినా, ఆంధ్ర భాషా తత్వాన్ని-వ్యావహారిక రచనా పద్ధతిని చిన్నమంతైనా విడువకుండా జీర్ణించుకున్నారు. ఆపైనినిరవధికరసోన్మీలితమైన హృదయం, నిశితమైనట్టి మేధ - నిరవద్యమైన ప్రజ్ఞ - గలిగిన మనీషి కాబట్టి అప్పారావుగారిట్టి స్వతంత్ర నాటకసృష్టిని చేయగలిగినారు-

కన్యాశుల్కంలో వాడబడిన భాష వ్యవహారిక భాష - తెలుగువారి నిత్య వ్యవహారంలో ఇంగ్లీషుభాషా పదాలు కలిసిమెలిసి ఉండిపోవడంవల్ల, యీనాటకంలో ఇంగ్లీషుమాటలు హెచ్చుగా వాడుకైనవి- ఆ వ్యావహారిక భాషలోను, మాండలికత లేక ప్రాంతీయభాషా వాసన ప్రచురంగా ఉంటుంది-దీనికి కారణం- గురజాడకవి [1]కళింగప్రాంతంవాడు కావడమే. (కన్యాశుల్కంలో కథ కూడా పూర్తి కళింగదేశానికి సంబంధించిందే. విజయనగరం-విశాఖపట్నం బొబ్బిలితాలూకాలో కృష్ణారాయపురం చీపురుపల్లితాలూకాలో[2] రామచంద్ర పురం అగ్రహారాలు నాటకంలో రంగస్థలాలు-విశాలాంధ్రదేశంలో, ఉత్తరప్రాంతంలో, ఉత్తర సర్కారులలో, విశాఖమండలంలో, ఒక తాలూకాలో ఒకమూల ఉన్న అగ్రహారంలో, ఒక కాలంలో జరిగినకథను, అప్పారాయకవి సార్వదేశికంగా, సార్వకాలికంగా, సంబంధించేటట్లు నాటకాన్ని రచించేడు ... అట్లే— కళింగప్రాంతంలో వాడుకలో ఉండే మాండలికపదాల్ని సర్వాంధ్రదేశవ్యావహారిక భాషలో వాడి దాని కొక విశిష్టత కల్పించేడు-తెలుగునాటిలోనే ఒక ప్రాంతంలో ఉండేవారి భాషకు, ఏసకు తేడా కనిపిస్తుంది. ఆపదాలు కూడా వెంటనే అర్థంకావు. కాబట్టియే కన్యాశుల్కంలో ఆపదాలకు ప్రత్యేకంగా అర్థాలను గ్రంథకర్తయే యిచ్చియున్నాడు.

గుంట - ఆడపిల్ల. పీక - కంఠము. పేకాట- చీట్లాట. బుఱ్ఱ-తల, సాని - వేశ్య——

పైపదాలే కాక, మఱికొన్ని కూడా యీ నాటకంలో ఉన్నవి. రెండుమూడు మాత్రమే చూపుతాను.

బుగత: పంచమాంకంలో రామప్పంతులు-"మీ బుగత యేం జేస్తున్నాడ్రా?" అంటాడు.

బుగ్గత అనేది భుక్తశబ్దభవం - భూస్వామి అని అర్థం-పేరువడసిన యప్పన ప్రెగడబుగత గారిలోగిలి కెదుటి బంగారుపేట అని మించుపల్లి-ఆ వ్యాఖ్యానంలో దీని వ్యుత్పత్తి చరిత్ర ఉన్నది. అచ్చకళింగపదం.

(76 వ పుట చూడుడు)

1. కళింగప్రాంత మంటే, ప్రస్తుతము, విశాఖపట్టణం - శ్రీకాకుళం జిల్లాలు.

2. ఇదే సుప్రసిద్ధ కళింగకవీ, కవితాశూరుడు అయిన అడిదము సూరకవి నివాసం. "చుక్కలవలె, కర్పూరపు ముక్కలవలె నీదుకీర్తి ముల్లోకములన్ క్రిక్కిరిసి పిక్కటిల్లెను" అని గిరీశం స్వగతంలో ఉన్నపద్యం సూరకవిదే—

**అభినేతల అనువాదాలు :**

# అందరూ మోజుపడిన మధురవాణి

## 'పద్మశ్రీ' శ్రీ స్థానం నరసింహారావుగారు

—:o:—

[మధురవాణి, గిరీశం పాత్రాభినయంతో ఆంధ్రావళిని రసపారవశ్య పరాకాష్ఠ పొందించినవారు శ్రీస్థానంవారు, డాక్టర్ గోవిందరాజుల వారూ. వారే వీరా అన్నంత భ్రాంతి కలిగింది ఆనాడు ఆంధ్రావళికి. వారిద్దరి అభినయానుభవాలను వారి రచనలోనే 'పరిశోధన' పాఠకులకు అందజేస్తున్నది. —సంపాదకుడు.]

"మధురవాణి మా మధురవాణి" అంటూ, అంతా అప్పుడూ ఇప్పుడూ ఆశించే వారే లేండి. ఆ రోజుల్లో మా యింటిచుట్టూ తిరిగినవారే. నన్నా మింటి కెక్కించినవారే. నావంటరితనంకోసం ఎదురు తెన్నులు గాచిన వారే. అంతెందుకు ? నా మాటబద్ధమైతే, నన్ను తెలుసుకొన్న వా ర్నెవర్నయినా అడిగి తెలుసుకోండి. మీ కిట్టే తెలిసిపోతుంది.

ఎవరిదాకానో యెందుకు ? మహాపండితులు వేలూరి శివరామశాస్త్రిగారు ఇప్పటికీ క్షేమంగానే వున్నారుగా ? వార్నడిగి తెలుసుకోండి. మీ కంతా చెప్పేస్తారు. వారూ ఒకప్పుడు నా ఆతిథ్యాన్ని స్వీకరించినవారే లేండి. నా మధురవాణిమీద వ్యాసాలుగూడా వ్రాశారు. మీరు గర్వమని అనుకోకుండా వుంటే ఒక్క మాట విన్నవించుకొంటాను. ఈ విషయంలో ఒక్క మహాపండితులనే మాట గాదు. కవులూ, కళాకార్లూ, కళాభిమాన్లూ, కలవాళ్ళు-లేని వాళ్ళు, ఓః! ఆడామగా అనే భేదం లేకుండా అంతా యీ 'మధురవాణి' మీద మోజుపడే వారే లేండి.

మీరూ ఆ విధంగానే వచ్చిన వారు గనక, నా విషయా న్నొకింత పరిచయం జేసుకొంటాను. అదేమిటి ? తల వూపుతున్నారు ? కాదంటారా ? అంటే—ఆ విధంగా వచ్చిన వారుగా మీరు గారంటారా ? లేక మీరు సరసులే గారంటారా ? ఈ రెంటిలో ఏరకమూ కాక పోతే, ఇంత రాత్రివేళ నా పందిరి మంచం మీద పవ్వళించినవా ర్నేమంటాగో మరి ? అంతా చిత్రం పోతారు మరీన్ని. పైగా నవ్వుతూన్నారా ? మా గృహంలో మీరు దాగితే, నేను దాగుతానా ? ఆపైన మిమ్మల్ని దాగనిస్తానా ? తాగడం గాదండీ ! దాగడం దాగడం. ఛీ! ఛీ! అది మా యింటా వంటా గూడా లేదు. మాటల్లో బెట్టి నన్ను ముందుగానే మీ ఖురిడీలో వేసుకోదలచినట్లున్నారే ? అబ్బో! కాస్త నిదానించండీ ! మా గిరీశం గారి దయవల్ల నేనూ కొన్ని మాటలు నేర్చాన్లేండి. ఏదో ఉన్న విషయాన్ని మనవే గనక ఒకింత ముచ్చటిస్తూన్నాను; అదీ మీరడిగారు గనకనూ. వినండి మనవి జేస్తూన్నాను.

మీ గ్రాంగానే నా పేరేమిటని అడిగారు గదూ ? జ్ఞాపక ముందా ? దానికి నా సమాధానం వినకండానే అడ్డు ప్రశ్నలువేసి, నన్నీ ధోరణిలో పడేశారు. వినండి. నా పేరు మధురవాణి. వూరు విజయనగరం. అవును. 'కన్యాశుల్కం'లోని 'మధురవాణి'నే నేలెండి. నా జీవితంలో జరిగిన గాథనే కొంత మనస్సులో పెట్టుకొని, ఆ మహనీయుడు-శ్రీగురజాడ అప్పారావు పంతులుగారు నన్నీ నాటక రంగానికిగూడా ఎక్కించారు. అందులో వున్న రామప్పంతులుగారే నన్నీ నాటికీ పోషిస్తూ వున్నారు. వార్ని మీ రెరుగరా యేమిటండీ? రామచంద్రపురం అగ్రహారానికి కరణంగా వుంటూన్నారే; ఆయన వారే-ఏంపిటీ అంటారు?

ఆ...కాస్త నాకంటే పొడుగులేండి. ఎర్ర్గా. అంత లావూ గాదు అంత సన్నమూ గాదు. చామనచాయ. ఆ మెలిదిరిగిన మీసం, ఆగిరజాల జుత్తూ, ఆ వెలమవారి తలపాగా, మోకాళ్లవఱకూ దిగజారిన ఆ నల్లటికోటూ, కాళ్ళకు కిర్రుచెప్పులూ, చేతిలో వెండి పొన్ను కర్ర, ఆ వల్లెవాటు మడతల వుత్తరీయమూ, ఆ ముక్కు క్రిందికి దిగజారిన నిక్కెల్ కళ్ళజోడూ, ఆ చెట్లక్రింద సలహాలూ, చూపర్ల కాయనంత అందగాడుగా తోపకపోయినా, ఓ విధంగా ప్రయివేటు పెద్దమనిషిలాగే కనిపిస్తూ వుంటాడు. ఇప్పుడు ఇంట్లోనే గాదు, వూళ్లో గూడా లేర్లెండి.

(తరువాయి 71 వ పుటలో)

# "స్థానంవారి" మధురవాణి

శ్రీ నీలంరాజు వేంకటశేషయ్యగారు



దాదాపు ఇరవై ఏళ్ల నాటిమాట. ఆంధ్ర, కృష్ణా పత్రికలకు బెజవాడలో సన్మాన మహోత్సవం. స్వాతంత్ర్యపోరాటానికి సంబంధించిన రాజకీయ సభలను మినహాయిస్తే సాహిత్య, సాంస్కృతిక రంగాల్లో ఆంధ్రదేశం మొత్తంమీద అప్పటికి అంత మహోత్సాహంగా మరే సభలు జరగనే లేదేమో.

కవులు, కళారాధకులు, పండితులు, పత్రికారచయితలు, విమర్శకులు, విద్యావేత్తలు-ఒక్కరేమిటి, ఆంధ్రదేశంలోని విజ్ఞప్రపంచమంతా నాడు దుర్గా కళామందిరంలోనే ప్రత్యక్షమైంది. శివ, కేశవులకు సాటిరాగల నాగేశ్వర, కృష్ణారాయల కిరువురకు ఆనాడు జరిగిన సత్కారం ఆంధ్రసీమలో అపూర్వం. సంతతమౌనముద్రాలంకృతుడైన కృష్ణాపత్రికాసంపాదకుడు ముట్నూరి కృష్ణారావుగారి మౌనవ్రతానికి భంగం జరిగిన కొలది సందర్భాలలో ఎన్నదగింది ఆనాటి సన్మానసందర్భం.

ఉదయం జరిగిన సన్మాన సభలకు వన్నె పెట్టినవి ఆ రాత్రి ఏర్పాటు చేసిన నాటక ప్రదర్శనాలు. దుష్యంత, దుర్యోధన, సత్యవంతాది ధీరోదాత్త నాయక పాత్రధారణలో అద్వితీయుడైన శ్రీ 'యడవల్లి' దుర్యోధన పాత్రాభినయం; స్త్రీవేషధారులలో నాటికీ నేటికీ, ఆంధ్రదేశంలోనే కాక ఇండియా మొత్తం పైనే అగ్రస్థానం అలంకరించిన 'శ్రీస్థానం' మధురవాణి పాత్ర నిర్వహణం; పేరుకు నగరాజుగా, కళకు నటరాజుగా చెల్లుబడి అయిన శ్రీ నెల్లూరు నగరాజారావు పాషారాయుని పాత్రచిత్రణం; ఒక్కొక్క ప్రదర్శనం ఆంధ్రనాటకకళాదేవతకు అమూల్యాలంకరణం; ప్రేక్షకజనాకర్షణ కిక కొదవేమిటి?

నాటకం ప్రారంభమవడానికి కొన్ని గంటలకు ముందే కళామందిరం ప్రేక్షకజనంతో నిండిపోయింది. పగటిపూట జరిగిన సన్మాన విశేషాలను మెయిల్లో ఆంధ్రపత్రికకు పోస్టు చేసి నాటకశాలకు వచ్చేసరికి హాలులో కాలు మోపడానికే నాకు వీలు కాలేదు. ఆ నాటికింకా నాటకాలపై నాకున్న వ్యామోహం వల్ల ఇంటికి తిరిగి పోవడానికి మనసు రాక, హాలు వెలపల పచారు చేస్తుండగా, సన్మానసంఘం తాలూకు మిత్రులిద్దరు నా అవస్థ పసిపట్టి 'మీ రింకా బయటనే వున్నారేం?' అంటూ లోపలికి వెంటబెట్టుకువెళ్లారు. మొదటి రెండు, మూడు వరసలలో తావు చెయ్యడానికి చూచారు కాని, కూచోన్నవారిని లేవతియ్యడానికి నే నిష్టపడ లేదు. మనసారా అనక పోయినా 'ఇంటికిపోయి పరుంటూ, పగలంతా పని చేసి అలిసివున్నాను కూడా' అని నే నెంత చెప్పినా వినిపించుకోకుండా 'స్టేజిలో కూచుందురుగాని రాండి' అంటూ వారిద్దరు నాచేయి పట్టి లాక్కుపోయారు.

ఆవేళకు స్టేజిపై నడుస్తున్న సీను "కన్యాశుల్కం" లోని చతుర్థాంకం. రంగంమీద రామప్పంతులు, మధురవాణి, లుబ్ధావధానులు; కుటుంబశాస్త్రి, స్థానం, వెంకటసుబ్బయ్య, ముగ్గురూ ముగ్గురే. మెరికెల్లాంటి నటులు. చాతుర్యంలో, సమయస్ఫూర్తిలో, చతుర్విధాభినయంలో, జనవశీకరణంలో ఆరితేరిన చేతులు. అయినా, తక్కిన పాత్రలంతా ఒకయెత్తు. మధురవాణి ఒక్కతే ఒకయెత్తు. ఎక్కడి కెక్కడ? ముగ్గురు నటులున్నా, ఒక్క మధురవాణే రంగమంతా ఆక్రమించింది. రంగస్థలమే కాదు, నాటకశాల మొత్తంలో ఏమూల చూచినా మధురవాణే ప్రత్యక్షం. ఆ కాస్సేపు ప్రతిప్రేక్షకుడు తానొక రామప్పంతులుగా మారిపొయ్యాడు. మధురవాణి నవ్వుల కిలకిలలకు, గాజుల గలగలలకు హాలు మారుమోగింది. మధురవాణి రాచుకున్న అత్తరువాసనలతో నాటకశాలంతా గుబాళించింది. మధురవాణి ధరించిన బనారస్ చీరె పైటచెరగు వొయ్యారంగా ప్రేక్షకుల చెంపలు తాకింది. నవనవలాడే తమలపాకులకు నాజూకుగా సున్నం రాచి, మునిగోళ్ళతో ఈనెలు చీల్చి, ముద్దుముద్దుగా 'మధురం' తన

నోటి కందించే ఆకుమడుపులను రామప్పంతులు ఆప్యాయంగా నములుతున్నాడు. దాన్ని చూచి ప్రేక్షకులు తామే వాటిని ఆరగించినట్టు మైమరచి ఆనందిస్తున్నారు. జారిపోతున్న పమిట చెంగును మాటిమాటికి పైకి సర్దుకోడం చూచి మధురవాణి అవయవశోభకు ముగ్ధులౌతున్నారు. ఎంత ప్రయత్నించినా ఆపుకోలేని ఆ నవ్వుతో, పట్టశక్యంకాని ఆయాసంతో, తూలుతూ, తూలుతూ తీగెలాంటి ఆ మధురవాణి శరీరం తమపై ఎక్కడ విరుచుకపడుతుందో అని పక్కకు పక్కకు జరుగుతున్నారు.

"మీా రొక లొటి—పిట—బావగా రొక లొటిపిట—పో—పో—పోలిస్టేటి—అతడో లొటిపిట—లొటి—లొటి-లొటిపిట - పిట-లొటిపిట—" అంటూ "లొట్టిపిట్ట" లోని నాలుగు అక్షరాలనే కిందు మీాదు, మీాదు కిందు, ముందు వెనక, వెనక ముందూ, చేసి, తిరగవేసి, సాగదీసి, తుంచి, వంచి, ఘనజటలను వల్లించినట్టు, సరిగమలతో స్వరకల్పన చేసినట్టు తెంపులేకుండా, మాట తెమలకుండా నవ్వులతో పువ్వులవాన కురిపించిన మధురవాణి, "నువ్వు భోజనం చెయ్యాలే దన్నమాట జ్ఞాపకం వుందా ? వెళ్లు" అని ఉడుకుమోత్తనంతో రామప్పంతులు అన్నమాటకు కోపం తెచ్చుకుని "మీాచర్య చూస్తేనే కడుపు నిండుతుంది" అని ఛల్లుమంటూ ఇంటిలోకి పోతుంది.

సైడ్‌కర్టెన్ వెనక నేను నిలబడివున్నవైపే మధురవాణి ఇంటికి దారి. "ఏఁవోయ్! ఎప్పుడొచ్చావ్ ?" అంటూ చెయిచాపి మధురవాణి నామీాదికొచ్చింది. ఏం చెప్పను? నాకెందుకో వొళ్లు గగుర్పొడిచింది. ముచ్చెమటలు పోసినంత పనైంది. నోట మాట రాలేదు. చటుక్కున రెండడుగులు వెనక్కువేసి తప్పుకోడానికి ప్రయత్నించాను. మధురవాణి పాత్రధారి స్థానం నరసింహా రావనీ, అతడు నాసహాధ్యాయీ, బాల్యస్నేహితు డనీ, ఇరువురం చిరపరిచితులమన్న పరిజ్ఞానమే లోపించింది నా కప్పుడు. పరాయి ఆడమనిషి-అందులో బోగంపిల్ల నామీాదికొస్తున్న దనే భయ మొక్కటే—క్షణికమే కావచ్చు—అప్పుడు నన్నావహించింది. నటుడికి తాదాత్మ్యం వుందోలేదో ఆవిషయం ఇప్పుడు నాకు అప్రస్తుతం. కాని నేను మాత్రం 'తాదాత్మ్యం' నుంచి తప్పుకున్న తరువాత కూడా, నవ్వుతూ నా పైకి రాబోయింది 'మధురవాణే' కాని స్థానం నరసింహారావని నమ్మలేని స్థితిలోనే వుంటుంటాను.

ఆనాడు బోధపడినంతగా 'స్థానం' కళాప్రతిభ అంతకు ముందు మరెన్నడూ నాకు వ్యక్తం కాలేదు.

మరొక్క మహానటుడు శ్రీ బళ్లారి రాఘవ విషయంలోనే ఇలాంటి అనుభవాన్ని పొందాను.

అది వేరే సందర్భం.

యీసురో మని మనుషు లుంటే, దేశ మేగతి బాగుపడు నోయి ?
జల్దుకొని కళ లెల్ల నేర్చుకు, దేశిసరకులు నించవోయి !
స్వంతలాభం కొంత మానుకు, పొరుగువాడికి తోడుపడ వోయి
దేశ మంటే మట్టి కాదోయి, దేశ మంటే మనుషు లోయి !
మతం వేరై తేను యేమోయి ? మనసు లొకటై మనుషు లుంటే
జాత మన్నది లేచి పెరిగి, లోకమున రాణించు నోయి !
ఆకులందున అణగిమణగీ, కవితకోకిల పలకవలె నోయి !
పలుకులను విని దేశమం దభి, మానములు మొలకెత్తవలె నోయి !

# కన్యాశుల్కంతో నా బంధుత్వం

## డాక్టర్ జి. వి. సుబ్బారావుగారు

కన్యాశుల్కం నాటకాన్ని మొదట్లో నేను చదివింది ఫిఫ్తుఫారం చదివే రోజుల్లో. మా పినతండ్రిగారున్న వుయ్యూరు గ్రామంలో వారి లైబ్రరీలో దొరికింది. మొదటినుండి చివర దాకా ఒకే బిగువున అన్నంనీళ్ల ధ్యాస కూడ లేకుండా దొంగవేటుగా చదివాను. ఎందుకంటే డాన్సింగ్ గర్ల్సు కింద ఖర్చుపెట్టాను అన్నమాట ఓంప్రథమంలోనే వచ్చింది. అందుకని ఇదేదో రహస్యంగా చదువవలసిన నిషిద్ధ సాహిత్య మనుకున్నాను. కాని చదివినకొద్దీ నిజాన్ని రాయిగుద్ది నిఖాల్సుగా నిరూపించే గ్రంథరాజంగా నా మనస్సుకు తోచింది. తరువాత ఎన్నిసార్లో ఈ పుస్తకాన్ని చదివాను. మనము సామాన్యముగా 'లెస్ మిజరబుల్', 'రీసరక్షను' 'వికార్ ఆఫ్ వేక్ఫీల్డు' చదివినట్లు. ఎన్నిసార్లు చదివినా తనివితీరని గ్రంథాలు ఏ సారస్వతంలోనైనా ఇలాంటివి కొద్దిపాటివే వున్నాయి. సర్వజనాదరణీయమైన మానవ సంఘటనలు కొలదిపాటివే వున్నాయి గనుక ఈలాంటి విశిష్టమైన అనుభవాన్ని, రసాన్ని సౌరభాన్ని ప్రసాదించే గ్రంథాల్ని సకలగుణ సంపంగితో పోల్చవచ్చు......

ఈలాంటి నాటకాన్ని యెవరైనా, ఏ సంఘమైనా ఎప్పుడైనా ఆడుతుందా అని నాకు కొంచెం బుద్ధి తెలిసిందాకా కూడా అనుమాన పడుతుండేవాడిని. కాని అప్పుడప్పుడు దీంట్లో గిరీశం సీన్లు అక్కడక్కడ చెదురు చెదురుగా విద్యార్థులు ధైర్యంచేసి కొన్నికొన్ని ప్రత్యేక సందర్భాలలో వేయటము మటుకు చూసాను. ఈ చూడటమువల్ల ఈ గిరీశం పాత్రంటే నాకు చాలా ఆకర్షణీయముగా వుండింది. చిన్నతనంనుంచీ నాలో ఒక గుణం వస్తుతః దాగి వుండేది. అదేమిటంటే దేన్ని చూసినా అవ్యక్తంగాను అమితంగాను ఆనంద పడటము, పైగా గట్టిగా నవ్వడముకూడాను. ఏదైతే నా మనస్సుకు అది కొంచెం లోటు పాట్లతో కనపడివుంటే దాన్ని నేనే స్వయంగా నిర్వహించి సరిదిద్దుదాము, అన్న వుబలాటము అమితంగా నాకు లోపల వుండేది. కాని నా విమర్శన యెప్పుడు కూడా పూర్ణంగా రసాన్ని అనుభవించిన తరువాత గాని అనుభవిస్తున్నపుడు మాత్రం కాదు. పూర్ణంగా ఏరగబడ్డ తరువాత గాని తిరగబడి పృచ్ఛ చేసుకోనేవాణ్ణిగాను. ఈ గిరీశం వేషంకూడా పుస్తకం యెన్నడో యెన్నిమార్లో చదివి జీర్ణము చేసికొని యుండటముబట్టి నేను అప్పటికి చూచిన గిరీశం పాత్రధారులు సందర్భశుద్ధిరహితంగా నటిస్తున్నారని అనిపించేది; మొదట్లో గిరీశం బొంకుల దిబ్బమీద ప్రవేశించి 'సాయంకాలమైంది'— అన్న స్వగతంతో వుపక్రమించేంతవరకు ఒక రకం వ్యక్తి. దాని తరువాత మరొక రకం వ్యక్తి. కేవలం ఫట్కారీగా తిరిగి వుల్ఫాగా జీవనం చేసే సోమరి మాత్రము గాడు, ఎప్పటికి కూడా......

ఒక దారితప్పిన యువకుడుగాను, అందువల్ల తన తెలివితేటలన్నిటినీ స్వప్రయోజనానికి వుపయోగించుకునే ఒక వ్యక్తి అని మొదట్నించీ అదే నా వుద్దేశ్యము. ఎంత దారితప్పినవాడైనప్పటికి ఒక అవ్యక్తమో లేక సువ్యక్తమో అయిన గమ్యస్థానాన్ని చేరాలని, జీవితాన్ని అటు ఇటు పన గలిపి నెట్టుకొస్తున్నవాడు గిరీశం. అందులో పూటకూళ్ళమ్మ, సానెలమాట ఆచూకీ పట్టినప్పటినుంచిన్నీ, వెంకు పంతులు గారి కోడలికి వ్రాసిన 'లవ్ లెటర్, మిస్ ఫైర్ అయి యెదురు తిరిగినదానివల్లను విజయనగరంలో కాలక్షేపం చేయటానికి యేమాత్రము వీలులేకుండా పోయింది. అందుకని వెంకటేశంతో వాడివూరికి 'డిప్లొమాటిక్' గా వుడాయించాడుగాని కేవలం ఒక 'సోంబేరి' వాడే అయినట్లయితే ఆవూరినే పట్టుకుని పీకులాడుతూ కొంచెం అజ్ఞాతవాసానికి పోయి వుండేవాడు. ఆలాంటివాడు కాదు, గిరీశం. అన్నిటికీ తెగించిన రంగునురోడి కాదు, గిరీశం......

ఈవిధంగా అర్థం చేసుకుని ఈ వేషం ఎప్పుడైన వేద్దామని వుబలాటపడుతుండేవాడిని. అది నాకు కొంత వయస్సు వచ్చి బుద్ధి తెలిసిన తరువాతగాని లభ్యం కాలేదు. మొట్టమొదట బందరు జాతీయకళాశాలకొరకు ఈ నాటకం మద్రాసులో వేశాం. అది కీర్తిశేషులైన తాతాచారి, శ్రీ పి. వి. రంగారామ్ గార్ల యాజ

(78 వ పుట చూడుడు)

సాహిత్యమీమాంస :

# మన గురుజాడ

విద్వాన్ విశ్వంగారు

భారత సంస్కృతి విభిన్నమైన పాశ్చాత్య సంస్కృతితో సమ్మేళనం పొంది ఒక విశిష్ట నూతన చైతన్యాన్ని వెలువరించిన రోజులవి.

స్వాత్మ స్వరూప వినాశంతో కాక, స్వోన్నతులనంతో ఇతర సంస్కార స్వభావ సాక్షాత్కారం పొందిన ఏ కాలమూ స్వర్ణయుగం కాక తప్పదు.

అనంత లోకయాత్రలో, అఖండ జనచరిత్రలో, అమేయ జీవన రమణీయ విచిత్రగతిలో ఇలాంటి ఘట్టాలు మనకు అనేకం కనిపిస్తూ ఉంటాయి.

అలాంటి సంపన్న ఘట్టమే మనకు 19 వ శతాబ్ది అంతంలోనూ 20 శతాబ్ది ఆదిలోనూ తెనుగులో కానవస్తుంది.

కేవలం ఏ సాహిత్య రూపంలోనో, శిల్పంలోనో, ఏ కళానైపుణిలోనో, ఏ రాజకీయ సంరంభంలోనో, ఏ సాంఘిక సంస్కారంలోనో-ఇలా ఒకానొక శాఖలో కాక యావజ్జన జీవన హృదయవికాసంలోనే ఒక వినూత్న సంపూర్ణ చైతన్యానికి ఆకారమైన నవ సంచలనం ఆనాడు మనకు కనిపిస్తుంది.

నాదేశం, నాజాతి, నాభాష, నాసంఘం-అన్న భావం తదుచ్ఛ్వస్థితిక దోహదకారి అయినప్పుడు మహోత్తమం అవుతుంది. అదే భావం పరభావోన్నతిని చీదరించుకుని, స్వోత్కర్షకూ పరాపకర్షకూ మాత్రమే ప్రాతిపదిక అయినప్పుడు జాతీయ దురహంకారంగా పరిణమిస్తుంది.

ఆ భావం ఉత్తమ రూపంలో మొలకెత్తిన రోజులవి. కనుకనే తమ స్వాత్మీయ వికాస వైభవాలకు లోకంలోని గొప్పదనాలన్నిటినీ తమలో ఇముడ్చుకొని తాము విశ్వరూపులయి తీరాలన్న ఉబలాటం ఆనాటివారిలో తీవరించింది. అంతే కాని లోకంలోని వన్నీ - గతంలోనివే కాదు, వర్తమానంలోనివే కాదు, భవిష్యత్తులోనివి కూడా—మా పెరడులోనే దొరలాడుతున్నవని ఆత్మసంతృప్తితో అటూ ఇటూ చూడని అంధగతి ఆనాడు బలపడలేదు.

కేవలం ఎక్కడికక్కడ దేనికదిగా ఏచిన్న విషయాన్నో తీసుకొని సతమతం కావడం కాక, మొత్తం మన జాతి జీవితంలోనే సమగ్ర సంస్థితి కోసం వేయివేళ్ళతో లక్ష కొమ్మలు రెమ్మలతో ఒక మహోద్యమం నాడు అంకురించి అటూ ఇటూ అంగలు వేసుకొనిపోయి ఆకాశాన్ని ఆవరించుకొన్నది.

సంఘంలోని కులమత వివక్షలు కుళ్లిన కంకాళాలై జాతిని రోగపూరితం చేస్తున్నవని, తదనారోగ్యకర పరిసర సంక్షాళనంకోసం బయలుదేరిన పెద్దల కానాడు కొదువలేదు.

విజ్ఞానవిస్తృతి కొక పరిధి లేదని గ్రహించి, చుట్టూరా చరచర ప్రాకుతున్న పరిశోధనల పాటవాన్ని పాటించి, తత్సార సమాధానం కోసం శతవిధాలా శ్రమించిన పండితకోటి కానాడు లోటు లేదు.

మన భాషలలోని పాతరూపరీతులే కాక, కొత్త రూపురేఖలను కూడ మన అద్దాలలోనే కాదు చక్కగా కనిపించే ఇతరుల ఆదర్శాలలోనూ చూచుకొని దిద్దుకొనవచ్చునన్న అభ్యూహతో సరికొత్త సంబారాలను సంతరించుకునే సహృదయుల కానాడు కొఱతలేదు.

కులీనత కాక గుండెలలోని మలిన నిష్కాసనం మానవతా ధ్యేయసంగతి కొక సాధనమని సర్వధా గ్రహించిన విజ్ఞానుల కానాడు వెలితి లేదు.

కాబట్టే ఆనాటి ఆంధ్ర జాతీయ వికాస మహోద్యమ మొక సర్వాంగ సంపూర్ణం; సమగ్ర సుందరం. కాబట్టే ఆనాటి జీవన ప్రాంగణంలో ఒక కోటి నూతన విషయాలకు అంకురార్పణం సాగినది.

ఆనాటి ఉద్యమమహోదధిలో పూచిన వెన్నెలపువ్వు మన గురజాడ అప్పారావు.

ఆయనలో ఆనాటి సమున్నత చిహ్నాలన్నీ మనకు కానవస్తాయి. ఆనాటి సంస్కార వైశాల్యవిస్తృతులన్నీ వారిలో సాక్షాత్కరిస్తాయి.

ఆయన కొనసాగించిన బ్రహ్మాండమైన

సాహిత్య వికాస కృషిని ఒకమాటు పునరవలోకనం చేసుకుంటే మన కీవిషయం సుస్పష్టమవుతుంది.

ఆయన సహృదయుడు... సహృదయతను సంపాదించుకునేందుకు నిరంతరం పరిశ్రమించినవాడు. సంస్కృతం, తెలుగు, బెంగాలీ, కన్నడం, ఆంగ్లం మొదలైన భాషలలోని సారస్వత ప్రక్రియలనూ, భాషావిభిన్న లక్షణాలనూ, ఛందస్సంప్రదాయాలనూ క్షుణ్ణంగా ఆకళింపుకు తెచ్చుకున్నవాడు.

ఆయన సారస్వత వ్యాసాలను మనం పరిశీలిస్తే ఎంత సునిశితంగా ఇతర భారత భాషల ప్రగతిని పరిశీలిస్తూ వచ్చినారో తేటతెల్లమవుతుంది.

పతంజలి భాష్యం మొదలు ఆంగ్లేయ భాషా శాస్త్రవేత్తల వివరణలవఱకు ఆయన చదివి జీర్ణించుకొని తన భాషాధికారాన్ని పదిలపఱచుకొన్నాడు.

విస్తృతమైన గ్రంథపఠనం ఆయన సంస్కారానికొక గభీరతను ప్రసాదించింది. విభిన్న భాషాధ్యయనం ఆయన సంస్కారానికొక విశాలతను సంతరించి పెట్టినది.

ఎంత తన భాష, తన దేశం, తన ప్రజ అన్న అభిమానమున్నా, ఎంతగా తను వానికి ప్రోది చేయాలని సంకల్పించుకున్నా, తన సంస్కృతిని విస్తరింపజేసుకోగల పాండిత్యం లేనిది ఎవ్వరూ యుగపురుషులే కాదు నిజమైన రచయితలే కాలేరు.

ఆ పాండిత్యమన్నది భాష విషయంలో మాత్రమే అనుకునే పాత అలవాటు మేరకు నే ననడం లేదు. వేత్తృత్వం భాషకే కాదు విషయ బహుళ విజ్ఞానానికి సంబంధించినది.

మనం చదువుకున్న వన్నీ సరాసరి మనవ్రాతలలో పెట్టకపోవచ్చును. కాని ఆ బహువిషయ పరిజ్ఞానం మన హృదయాన్ని, మన రచనలనూ సుసంపన్నం చేస్తుంది.

ఆవిధంగా వారి బహుముఖపాండితి, సహృదయత వారి రచనలకొక జీవం ప్రాణంగా తయారయినది.

తన పరిసర సమాజంలోని వైపరీత్యాలను పరిశీలించినప్పు డాయన హృదయం జివుజివ్వుమన్నది. అంతతో ఆగక తన గుండెతో పదివేల గుండెలను పలుకరించి రసాన్ని చిలకరించుమని ఉత్తేజపఱచినది.

బెంగాలీభాషలోనూ, వారి సాహిత్య సదస్సులలోనూ వస్తున్న మార్పుల నాయన చూచినప్పుడు తన భాషలో అలాంటి కదలిక కోసం ప్రయత్నించినాడు. సిద్ధసంకల్పుడు గనుక చరితార్థు డైనాడు.

సాహిత్యరూపాలను పరస్సహస్రంగా పరిశీలించినవాడు గనుక, తన తెనుగులో సరికొత్త రూపులకోసం వేసారినాడు. వైవిధ్యంకోసం పరితపించినాడు. తనకు నచ్చినవానిని సృష్టించుకొన్నాడు.

తాను వ్రాయదలచుకొన్న ఖండికలకు తగిన ఛందస్సును ఎన్నుకోవడంలో ఆయన చాల స్వతంత్రపథాన్ని త్రొక్కినాడు.

కన్నడంలోని ఛందఃపరిణామం ఆయనకు తెలుసును. బెంగాలీ బాణీ లాయనకు తెలుసును. అంతే కాదు. తన తెనుగునాడున తల్లుల మొదలు పిల్లలదాకా పాడుకుంటున్న పాటలలోని పట్టువిడుపులు ఆయనకు తెలుసును.

తత్సమగ్ర సమీచీన పరిశీలన ఫలితంగానే ఆయన ముత్యాలసరాలను కూర్చుకో గలిగినాడు. పుత్తడిబొమ్మ పూర్ణమ్మను చిత్రించగలిగినాడు.

భామినీషట్పది ఝంకారం ఆయన తలలో ఒక కొత్త మెట్టును గీసి పోయి ఉండవచ్చును.

“మేలుకొను నవనీతచోరక
మేఘసుందరనీలమేచక
మేలుకొనవయ్యా”

అన్న మేలుకొలుపులు ఆయన గుండెలో ఒక నూతన గీత సరణిని మేల్కొల్పి ఉండవచ్చును.

తత్ఫలితంగా ముత్యాలసరం ముప్పేటలో మురువు చూపినది.

ఉబికివస్తున్న ఆవేదనలకూ, అనుభూతులకే కాదు ఉద్బోధ ప్రబోధాలకూ ఆయన ఆ గీతల మ్రోతలను ఆహారం చేసుకున్నాడు.

సరాసరి పాఠకునితో ‘దేశమును ప్రేమించుమన్నా’ అని ఉద్బోధించుటకు ఉపకరణం చేసుకున్నాడు.

దేశంలో రావలసిన మార్పులనూ, రీతులనూ వరుసపెట్టి వర్ణించివేసి ఒక ప్రణాళికను ముత్యాలసరాలలో కూర్చి యిచ్చినాడు.

పదిమందినీ ముందు కూర్చుండబెట్టుకొని పది ఘడియలలో ఒక పట్టుబడి చెప్పి పలపల మని వారి గుండెలు పగిలిపోయేట్టు చేయడం—నిర

క్షురాస్య ప్రపూర్ణ దేశస్థితి నెఱిగినవాడు గనుక - అత్యవసరమని తలంచినాడు.

తత్ఫలితంగానే పుత్తడి బొమ్మను చూపి గోలుగోలుమని ఏడ్పించినాడు. షడ్జమంలోనే గుండెలుజల్లుమనిపించగల గభీరహృదయుడు. కెవ్వుమని కేక వేయగానే గుండెలు త్రవ్వివేయగల తీవ్రభావుకుడు. కోబలియని బలిపిల్లలను తెగవేయకనే ఒళ్ళు జలదరింప జేయగల వీర మార్తాండుడు.

కాబట్టే ఆయన కవిలెకట్టలను అట్టువలపైకి బుట్టల బుట్టలుగా ఎక్కించి పోలేదు. కాని చిట్టిపొట్టి చిఱుతలలో కట్టవలు త్రెంపివేయగల కన్నీటిసోనలను నింపివేయ గలిగినాడు.

హృదయంలో భావతీవ్రత ముమ్మరమై గోలు గోలు మనునప్పుడు పాఠకునిపై యతిప్రాసల రాగలను ప్రస్తారసౌరభం విరజిమ్మి మైమఱపించడం మంచిది కాదనుకున్నాడో అసలామాటే తోచలేదో స్వేచ్ఛాగానఝరితో రసపరమావధికి నిచ్చెనలు వేసి నిన్నూ నన్నూ ఎక్కించి ఆనందపరవశులను చేసివేసి అలా నిలిపినాడు.

మనిషిలోని వక్రతలను భూతద్దంవేసి చూపిగాని, ఆడబొమ్మలకు మీసాలుగీసి గాని హాస్యం కలిగించకుండా, ఆయా పాత్రలలోని అనుభూతులను ఏ వ్యంగ్య చిత్రీకరణంతోనూ చికిలీ చేయకనే తన కథలలో ఒక వినూత్న సృష్టికి అంకురార్పణం చేసినాడు.

మన ఆఖ్యాయికలనుండి పిట్టకథలదాకా, పాశ్చాత్యకథానికలలోని వివిధరూపాలదాకా చూచి చూచి వేనికీ ప్రతికృతులు గాని విశిష్ట కథలను విరచించినాడు.

వస్తువులోనే కాదు, శిల్పంలోనే కాదు, వాచనంలోనే గాదు, వైయక్తత్వంలోనూ విలక్షణమైన వివేకం ఆయన కథలలో వికసించి వెలుగులు చిమ్ముతుంది.

నాటకకర్తగా ఆయన కున్న ప్రతిభా సంపత్తి అనంతమైనది. అఖండమైన సంస్కారాన్నీ, అపురూపమైన అనుభవాన్నీ, అనాదిసిద్ధమైన నాటక ప్రక్రియ మొదలు అత్యాధునిక నాటకీయ ప్రక్రియ దాకా ఆకళించుకున్న పాండిత్యాన్నీ మేళవించి ఆయన కన్యాశుల్కాన్ని తెనుగుఅట్టవపై ఆడించి విడిచినాడు.

ఆనాటి అత్యవసరమైన సమస్యనే వస్తువుగా స్వీకరించినా, నేటిదాకా అది కళాఖండంగా నిలుపగల జీవం చేవా అందులో మేళవించినాడు. నాటి ఆంధ్రదేశంలోని జనాన్ని అద్దంలా ప్రతిబింబించినా, కలకాలం వారు చైతన్యవంతులై సర్వాంగ సుందరరూపాలతో పరిఢవిల్లునట్లుగా పాత్రచిత్రణం చేసినాడు.

విదూషకుని హాస్యంతో వెఱ్ఱినవ్వులు నవ్వే సంప్రదాయంలో, గుండె కిలకిల మని చిఱునవ్వు పెదవులపై మెఱసీ మెఱయనిరీతిగా ముఖం వికసించే సున్నితమైన హాస్య సంబంధాన్ని రంగరించి తెనుగు వాని కున్న హాస్యసృష్టిపాటవాని కొక కోటను కట్టించి వెళ్ళినాడు.

గీర్వాణ నాటకాలలోని పాత్రోచిత భాషనూ, తనకాలంలోనే గ్రాంథికవాదులు అనుసరిస్తున్న పాత్రోచితభాషనూ శాస్త్రీయ దృష్టితో పరిశీలించి, అసలు కొన్ని పాత్రలకు ఏనాడో కొంత యీసపడి తేచాలు నన్న ధోరణిలోని అంతస్తత్వాన్ని గమనించి అన్ని పాత్రలకూ అచ్ఛమూ స్వచ్ఛమూ అయిన వ్యావహారిక భాషనే ఉచిత భాషగా నిర్ణయించి పాత్రల కొక సజీవతను కల్పించిన గొప్పదనం ఆయనకే దక్కినది.

వాడుకభాషను పరిపాటించాలని మహోద్యమ మొకటి సాగుతున్న తరుణంలో దాని కొక ఆదర్శాన్ని నిర్మించి నిరుపమాన నిర్మాణాన్ని రూపొందించినవాడాయన.

ఏదో ఉదాహరణ కని వ్రాయక, కళారూపరచనా పరతంత్రుడైనాడు గనుకనే అంత ఉద్యమ తీవ్రతలోనూ, అంత ఆవేదనా పరతంత్రతలోనూ ఆయన కళాధర్మాలను గాలికి విడువలేదు గనుకనే గొప్పవాడైనాడు.

ఇంతకూ పాండితీ, సంస్కారమూ, సహృదయతా, స్వానుభవమూ, సునిశిత ప్రతిభా, సువిశాల జనహిత చింతనమూ, వీటన్నిటికి కొలికిపూసగా కవిహృదయ సముద్రావగాహనమూ మూర్తీభవించిన మూర్తి గనుకనే ఆయన పరమోత్తమకవి అయినాడు; నాటకకర్త కాగలిగినాడు; కథకుడైనాడు; విమర్శకుడూ, పండితుడూ అయినాడు.

రససిద్ధుడైన కవిగా ఆయన కివే నా నమస్కృతులు—

# ఆధునికగద్యవాఙ్మయప్రవర్తకుడు

## శ్రీరంగం శ్రీనివాసరావుగారు

వేసిన దారంట వెళ్ళిపోవడం సులభం. అంతే కాదు పదిలం. నలుగురికీ తెలిసిందీ, చిరకాలంనించి నలిగిందీ ఒకదారి సిద్ధంగా సుప్రసిద్ధంగా ఉంటూనే ఉన్నప్పుడు వేరే ఒక కొత్తదారి వెదకడం అవివేకం, ప్రమాదం అని అంటారు కొందరు. కాని పురోగమనానికి కొత్తదారులే రాచబాటలు. అలుపులేని అన్వేషణ గతానుగతికత్వాన్ని సహించలేదు. కాలిబాటలోనే మానవుడు తృప్తిపడిపోయి వుంటే వ్యోమయానాలు సాధ్యమై వుండేవి కావు. ఆ కాలిబాటకూడా ఒకప్పుడు శతాబ్దాల క్రిందట శతాబ్దాలక్రిందట అగమ్యాలైన అరణ్యాలను భేదించి సాధించడానికి మానవుడు చేసిన యత్నమే, వేసిన మార్గమే అని మనం మరిచిపోకూడదు.

ప్రపంచసాహిత్యాలన్నింటిలోనూ వచనరచన ఇటీవలి పరిణామమే. అంతే ప్రాచీన సాహిత్యకారులకు గద్యగ్రథన తెలియని విద్య అని నా ఉద్దేశం కాదు. భారత భాగవతాదులలో, ప్రబంధాలలో, యక్షగానాలలో వలసినంత వచనం లేకపోలేదు. అయితే ఆ వచనం ఏదీ ఆధునిక కాలపు ప్రత్యేకావసరాలకు సరిపోయేది కాదు. కాదంబరి యావత్తూ గద్యంలోనే ఉన్నా ప్రధానంగా అది కావ్యపాకంలోనే సాగింది. అలాగే శ్రీనాథుని వచనం. అలాగే మను, వసు చరిత్రాదులలో వచనం. వాటిలోని కావ్యసౌందర్యం నేటికీ మనలని ఆకర్షిస్తుంది. కాని ఆధునికవచనం అంటే మనకి అర్థంఅయ్యే పద్ధతిలో అవేవీ లేవని మాత్రం మనం అంగీకరించక తప్పదు.

ఈ కారణాలవల్లనే చిన్నయసూరిని కూడా నిరాకరించవలసి ఉంటుంది. ఆయన నవీన కాలంలో పరిశేషించిన ప్రాచీనుడు. ఇప్పటికీ ఆతని వారసులనేకులు మనలో ఉన్నారు. ఆయన ఒరవడి ననుసరించి చక్కని గ్రాంథిక శైలిలో వచన సాగిస్తున్నవారు చాలామంది ఉన్నారు. కాని ఇటువంటి రచనలు చెయ్యడం ఇదివరకు వేసిన దారంట వెళ్లడం వంటిదే. నేటి కాలపు ప్రత్యేకావసరాలను పురస్కరించుకొని ప్రత్యేకపంథాలలో సాగే వచనరచనలకే ఆధునికం అనే విశేషణం అంగీకరించడం యుక్తం.

అటువంటి గద్యరచనకి ప్రారంభకుడూ, ప్రవక్తా గురజాడ అప్పారావు. ఎన్నెన్నో సాహిత్యాంగాలలో ఆయన కొత్తమార్గాలు తెరిచి క్రొత్త ప్రక్రియలు అవలంబించాడు. ప్రత్యేకంగా వచనరచనలో ఆయన వాడుకభాషను స్వీకరించి దానిని మహోన్నతమైన సాహిత్యస్థాయికి తీసుకువెళ్లాడు. గురజాడ చేపట్టక పూర్వం, ఆయన మాటల్లోనే—"గ్రామ్యభాష దిక్కుమాలిన స్త్రీ...ఆమెను పండితులు నిష్కారణంగా దూషించి అవమానించగా కనికరించి ఫీజు లేకుండా వకాల్తా పట్టితిని"—అన్నారు గురజాడ. ఈనాడు వాడుకభాష దిక్కుమాలినది కాదు. గుడిసెల్లో పుట్టిపెరిగి, స్వయంప్రతిభతో కళాశిఖరాలందుకున్న నటీమణితోనో, స్వల్ప ప్రారంభాలనుంచి బైటపడి, స్వయంకృషితో చదువులన్నీ నేర్చి, పార్లమెంటు భవనాల నలంకరించే విదుషీమణితోనో నేటి వ్యావహారికభాషను సరిపోల్చవలసిఉంటుంది. వాడుకభాషకు ఏఒక్కరైనా ఇంత గౌరవం సాధించారంటే అతడు గురజాడ అప్పారావనే చెప్పాలి. అయితే అప్పారావుగారి పేరు స్మరించినప్పుడల్లా, పాయక పాకశాసనికి భారత ఘోర రణంబునందు నారాయణునట్లు...సాయపడి నిలుచున్న గిడుగు రామమూర్తిగారు కూడా జ్ఞాపకం వచ్చితీరుతారు. వ్యావహారిక భాషాస్థాపనకి జరిగిన అనేకానేక యుద్ధాలలో గురజాడవారు సృజనాత్మకమైన రసగోళాలు ప్రయోగిస్తే శాస్త్రీయమైన వ్యూహనిర్మాణాలతో బాసట ఇచ్చినవారు గిడుగుపంతులు.

ప్రధానంగా గురజాడ అప్పారావుగారి వచనరచనలంతటినీ నాలుగు విభాగాలలో చేర్చవచ్చు. 1. నాటకీయం, 2. కథనాత్మకం, 3. విమర్శనాత్మకం, 4. వ్యక్తిగతం. వ్యక్తిగతమైన ఈ నాలుగో విభాగంకింద గురజాడవారి లేఖలూ, డైరీలూ, నోట్సూ వస్తాయి,

వీటిలో చాలామట్టుకు చెల్లాచెదరై పోయి ఇప్పుడు మనకు దొరకవు. దొరికినవైనా కొన్ని ఇంగ్లీషులో, కొన్ని తెలుగులో, రేఖాప్రాయంగా కొన్ని, అసంపూర్ణంగా కొన్ని ఉన్నాయి. వీటి నన్నిటినీ ఒక్కచోట చేర్చగలిగిననాడు అప్పారావుగారి సమగ్రసాహిత్యవ్యక్తి మనకు సాక్షాత్కరిస్తాడు. ఇప్పటిమట్టుకు ఉన్న దానినిమాత్రం ఆధారం చేసుకొని అప్పారావుగారినిమనం అర్థంచేసుకోవాలి. చరిత్ర, సైన్సు, సాహిత్యం ఒకటేమిటి విద్యాపిపాసినాకర్షించే అన్ని వెలుగులవైపూ ఆయనదృష్టి ప్రసరించింది. ఏ విషయాన్ని స్పృశించినా దానిమీద ఆయన వ్యాఖ్యానించే తీరు ఆయనదెంత ఆధునిక మనస్తత్వమో అతి స్పష్టంగా తార్కాణిస్తూనే ఉంటుంది. వ్యక్తిగతమైన ఈ వ్రాతలన్నింటిలోకూడా ఆయన ఆలోచన ఎంతసేపూ సంఘపరంగానే సాగుతూండడం మనకు గోచరిస్తుంది.

ఇక ఇంతకుముందు నేను చేసిన విభాగాల ప్రకారం అప్పారావుగారి రచనారీతు లొక్కొక్కటే పరిశీలిస్తాను. వీటిలో మొదటిది నాటికీయం. మనదేశభాష లన్నింటిలోనూ, పూర్తిగా వచనంతో, అందులోకీ పాత్రోచితమైన వ్యావహారిక శైలిలో మొట్టమొదటిసారిగా నాటకం రాసింది గురజాడ అప్పారావుగారనే అనుకుంటాను. సాంఘిక వాస్తవికతను దర్పణంలోవలె యథాతథంగా ప్రతిబింబించిన కళాఖండం మన భాషలోనే కాదు మరే ఇతర భారతీయభాషల్లోనైనా మొదటిదీ ఆఖరిదీ కన్యాశుల్కమే అనుకుంటాను. కన్యాశుల్కం నాటకాన్ని ఆ తెగలో మించడం మాట అటుంచీ, ఆ దరిదాపులకైనా రాగల నాటకం మనదేశంలో ఏదైనా ఉంటే దాని సంగతి ఇంతవరకూ ఎవరికీ తెలియక పోవడం ఆశ్చర్యకరమే అని మాత్రం నే ననక తప్పదు.

వాస్తవిక నాటకాల్లో స్వగతాలు అస్వాభావికం అనే వాదం ఉంది. ఈ వాదంతో నేనూ ఏకీభవిస్తాను. ఒక ప్రతిమయెదుట మాట్లాడడం, జనాంతికంగా ప్రేక్షకులను మాత్రమేఉద్దేశించి చెప్పడం, తనలో తానుగా స్వగతం ఇవన్నీ సంప్రదాయసిద్ధమైన నాటక లక్షణాలే అయినప్పటికీ, రసపోషణకి ఉపకరించగలిగినవే అయినప్పటికీ ఇటువంటి వాటన్నిటికీ వాస్తవిక నాటకంలో చోటు లేదనే నా నమ్మకం. షేక్స్పియరు స్వగతాలు సాహిత్యకళా కిరీటాలని అంగీకరిస్తాను. యూజీన్ ఓనీల్ ఒక నాటకం నాటకం అంతా వ్యక్తుల మాటలతోనూ, వాటిచాటున వారి మనస్సుల్లో భావాలతోనూ జమిలించి నడిపించాడు. ఇది ఒక పద్ధతిరచన. స్వగతానికి కొంతో శక్తి ఉంది కాబట్టే వాస్తవికతకి విరుద్ధమైనా కన్యాశుల్కంలో స్వగతములు లేకపోతే బాగుండునని అనుకొనేవాళ్లలో నేనొకణ్ణి కాలేకపోతున్నాను. గిరీశం స్వగతాలమాట ఇటుండగా ఎన్నోచోట్ల గురజాడ మహాకవి స్వగతాలను సార్థకంగా ఉపయోగించాడు. ఒకటి రెండు ఉదాహరణలు చూపిస్తాను...

మనిషి మనస్సు లోతులోతులకు దిగి, అతని అవసను అమాంతంగా కేవి పట్టుకొని పైకెత్తి చూపించి అందులోనుంచే ఒక నీతి బోధ చెయ్యడం.

లుబ్ధా: ఓరీ కుంకపీనుగా! నీకళ్లు యేవైఁ పోయినాయిరా... రేపు రాత్రి బయల్దేరి కాశీ పోయి, గంగలో మునిగానంటే అన్ని పాపాలూ పోతాయి. భగవంతుడు బుద్ధొచ్చేటట్టు చేశాడు. లేకుంటే, ముసలి వెధవకి పెళ్లి చేసుకోవడపు పోయీకాలవేఁవిఁ?

దొంగవు తరం తానే బనాయించినట్టు మధురవాణితో చెప్పిన తర్వాత.

రామ: ఇదెక్కడికి పోరిపోతూంది? యిదే చెప్పేసింది - దొంగపని చేసినప్పుడు రెండో వారితో చెప్పకూడదు. వెధవని చెవులు నులుపుకుంటాను.

—ఇది రామప్పపంతులు సుభాషితం...

అన్నిటికన్నా మిన్నగా నేటి సినీమా రంగానికి కూడా సాధ్యంకాని మనోవేగాన్ని స్ఫురింపజేసే స్వగతం ఇంకొకటి ఉంది. రామప్పపంతులు మధురవాణిఇంట్లో మంచం కిందదాగుని ఉంటాడు. గిరీశం వస్తాడు. ఇప్పుడు గిరీశానికీ, మధురవాణికీ జరిగిన సంభాషణలో ఒకచోట యావడీమాటలు పేల్తున్నాడో వాడి పేరు తక్షణం చెబుతావా చెప్పవా? అని గిరీశం అడిగితే మధురవాణి రామ రామ ఒహారు చెప్పేదేమిటి అంటుంది. ఇందులో మొదటి రామ చెవిని పడగానే రామప్పపంతులు గుండెల్లో రాయి పడుతుంది. చచ్చాన్రా, పేరు

చెప్పేసింది అని తనలో అనుకుంటాడు. నాటకంలో రామ-అని మధురవాణి ఆగడం, రామప్పంతులు స్వగతం, రామరామ అని మళ్ళీ మధురవాణి అందుకోవడం అచ్చై ఉంటుంది. ఇక్కడ గురజాడ మహాకవి కాలాన్ని రెండు మూడు క్షణాలపాటు ఆగమని ఆజ్ఞాపించాడు.

ఇటువంటిదే ఇంకొకచోటు. ఈ సారి స్వగతం కాదు సంభాషణ. రామప్పంతులు కొండిభొట్లుని బెల్లిస్తాడు.

మధురవాణి పాడింది కాదేం ?

రామప్పంతులు కేజవాబు కావాలో అదే తప్ప నిజమా అబద్ధమా అన్న సంగతి చూడడు కొండిభొట్లు. పాడిందంటే సంతోషిస్తాడేమో అనుకొని పాడింది అంటాడు. ఆఁ ? అని రామప్పంతులు గద్దించగానే సర్దుకొని కాదండి అని కలుపుతాడు. కొండిభొట్లుపాత్ర చిన్నదే ఐనా ఈ ఘట్టంలో నటించగలిగినవాడిని మహానటు డనడానికి సందేహం మరి ఉండకూడదు.

కన్యాశుల్కంలో ఎక్కడ ఎప్పుడు ఎవరి మాటలైనా తీసుకోండి. ఇక్కడ అప్పుడు సరిగా ఆ పాత్ర ఆ మాటతప్ప మరోటి అనడానికి వీల్లేదు. ఇది నాటకరచనకి పరాకాష్ఠ. గురజాడకవి మహత్తర విజయం.

కన్యాశుల్కమంత గొప్ప నాటకాలు కాకపోయినా, కొండుభొట్టీయం, బిల్హణీయం అనే మరో రెండు నాటకాలు సంభాషణ నడిపించడంలో గురజాడకవి చాతుర్యాన్ని విశదం చేస్తూ కనిపిస్తాయి. వీటిలో బిల్హణీయం అసంపూర్ణం ఐనా అందులో చిత్రించిన పాత్రలు మానవస్వభావ పరిశీలనలో గురజాడ అప్పారావుగారి కళాదృష్టి ఎంత నిశితంగా ప్రసరిస్తుందో నిదర్శిస్తాయి.

తరువాత విభాగం కథనాత్మక వచనం. నిజానికి వచనంయొక్క ప్రథమ ప్రయోజనం కథనమే అనవచ్చును. పూర్వకవులు కథనానికి కూడా పద్యమే ఉపయోగించి ఉండవచ్చును. ఆ మాట కొస్తే వారు పద్యం ఉపయోగించని దంటూ ఏదైనా సందర్భముందా? శాస్త్రాలూ పద్యాల్లోనే రాశారు; శాసనాలూ పద్యాల్లోనే రాశారు. ఇక కథ చెప్పుకుంటూ పోయేటప్పుడు పద్యాలచేత వీరు రకరకాలుగా కథ కదను తొక్కించారు. అదే రసానందం వచనంలో తీసుకురావాలంటే మాటలతో పని కాదు. పొరపాటు; మాటలతో పనికాదనా అన్నాను ? ముమ్మాటికీ మాటలతోనే పని ! దిద్దుబాటు అనే కథలో గురజాడ అప్పారావుగారి ఈ దిగువ ఎత్తుబడి చూడండి...

తలుపు...తలుపు.

తలుపు తెరవబడలేదు. ఒక నిమిష మత డూరుకొనెను.

గదిలోని గడియారము టింగుమని ఒంటిగంట కొట్టింది.

ఎవరి నాకర్షించదు ఈ ప్రారంభం? కథయినా కావ్యమైనా, నవలైనా నాటకమైనా, కళారూపం ఏదైనా సున్నితంగా ఏరోడ్రోమునుంచి బయల్దేరే విమానంలాగ ప్రారంభించి ప్రయాణం యావత్తూ దూరమైనా చేరువైనా సాగించి సాగించి తుదకు సురక్షితంగా గమ్యస్థానంలోకి దిగాలి. విమానచోదకుడిలాగ కళాకారు డెక్కడా కనబడకూడదు.

ప్రారంభం, నిర్వహణ, ఉపసంహారం... ఇవే కళావస్తువు నాణ్యం తెలియజేసే నికషాలు. "దిద్దుబాటు" ప్రారంభం చూశాము. నిర్వహణ ఏయే రీతులుగా సాగిందో పరిశీలించడాని కిప్పు డదను లేదు. ఆఖరివాక్యం మాత్రం ఇక్కడ ఉటంగిస్తాను...

అంతట మంచము క్రిందనుండి అమృతనిష్యందిని యగు కలకల నగవును, కరకంకణముల హృద్యారావమును విననయ్యెను.

ప్రారంభంలో గడియారం చప్పుడు జ్ఞాపకం తెచ్చుకొండి. అప్పుడీ వాక్యంలోని సారస్యం మరీ చక్కగా ఆస్వాద్య మవుతుంది. ఇంతకన్నా గొప్ప కథ "మీ పేరేమిటి ?" అన్నది. కథ చెప్పడం అంటే-ఏమిటో, ఎలాగో తెలుసుకోవాలంటే మన భాషలో ఈ కథను మించిన ఉదాహరణ ఇంకొకటి నాకు కనబడదు. మొపాసాఁ కథన విధానాన్ని మెచ్చుకుంటూ ఒక విమర్శకుడు... మొపాసాలో వర్ణన, సంభాషణ, కవిత్వం, ధర్మబోధ ఎప్పుడు ఏది ఎంతవరకు అవసరమో ఆ మోతాదులో దొరుకుతాయని పేర్కొన్నారు. మీ పేరేమిటి అన్నకథకు కూడా ఈ విమర్శ అక్షరాలా వర్తిస్తుంది.

నేను చేసిన విభాగాలలో నాలుగవదీ ఆఖరిదీ

విమర్శాత్మక వచనం. వ్యాసరచనని ఒక కళా రూపంగా పెంపొందించడం ఇటీవలి కాలంలోనే జరిగిందనడం నిర్వివాదాంశం. ఒకరచయితలో ఉన్న అన్ని సుగుణాలనూ దుర్గుణాలనూ బైటపెట్టగలిగినది సాహిత్యవ్యాసం ఒక్కటే అనుకుంటాను. అతనిలోని అన్ని గుణాలూ ఒక్కుమ్మడిగా వ్యాసరచనలో వెల్లుబుకుతాయి. ఒక పద్యాన్నిబట్టి కవియొక్క యావచ్ఛక్తి సామర్థ్యాలనూ మదింపు వెయ్యడం కష్టమేమో కాని ఒక్క వ్యాసం చదివి ఆరచయితయొక్క అంతుపొంతులు సులువుగా గ్రహించగలం. గురజాడ అప్పారావుగారి వ్యాసం ఏది చూచినా అందులోంచి అతని అసాధారణ ధీశక్తి తొంగిచూస్తూ ఉంటుంది. కత్తివాదరకన్నా పదునైన హాస్యం పలకరిస్తుంది. ఒకానొక క్రమశిక్షణతో కూడుకున్న వాదపటిమ గోచరిస్తుంది.

అప్పారావుగారే ఒకచోట అన్నారు: విద్వాంసుల ధోరణులు వేరువేరురీతులనుంటవి. హాస్యరసముమీద కొందరి కలము పరుగులిడుతుంది. కొందరి బుద్ధులు దోషాన్వేషణములో వాడి తేరుతవి. మరికొందరి బుద్ధులు తిట్లకు తీరివుంటవి. ఈ మూడు రీతులూ చాలినంత లేకపోవడంవల్లనే మనభాష యిప్పటి యీ దురవస్థలో వున్నదని నా అభిప్రాయము...అని. ఇంకోచోట ఆధునిక వచనం తెలుగువిద్యార్థుల మనోవికాసానికి ఉపకరించడం లేదు... అన్నారు. ఆ లోపాన్ని తొలగించడానికే రాశారేమో అన్నట్టుంటాయి అప్పారావుగారి వ్యాసాలు.

బుద్ధి తెచ్చుకొమ్మని ఆకాశరామన్న ఉత్తరం రాసిన ఒకబ్బిని గురుజాడ ఎంతసున్నితంగా వేళాకోళం చేశాడు చూడండి...

“చిన్ననాటి బెత్తపు దెబ్బలవల్ల బుద్ధి రాలేదు. పెద్దల మాట వినక దాట్లువేసినపుడు కాలు విరిగినా బుద్ధి రాలేదు. నాటికి నేటికీ ఎప్పటి కప్పుడు బుద్ధిని యెంత ఆసక్తితో బతిమాలి పిలిచినా రాలేదు. అరవై ఏళ్లకు అగ్గిగండం ఉన్నట్టు ఇప్పుడు మామిత్రులు నొక్కినొక్కి వ్రాసినాడని బుద్ధిని విరిచికట్టి తెచ్చిపెట్టుకున్నా భరించడం కష్టం. ఆ శ్రమ నేను పూనుకోజాలను. మిగిలివున్న నాలుగు రోజులూ కొంచెం స్వేచ్ఛగా బతకవలెననిఉన్నది. యెవరికుండదు? అంతేగాక నావంటి వాళ్లకుకూడా బుద్ధి గలిగితే బుద్ధి చవకై పోతుంది. కనక ఆబుద్ధన్న దేదో ఆకాశరామన్నగారు భద్రంగానూ రహస్యముగానూ దాచుకుంటేనే విలువ.”

అదే వ్యాసంలో వేరొకచోట గురుజాడ అప్పారావుగారు మానవుడిమీద తనకున్న మమకారాన్ని బయలు పెట్టేముక్కలు రెండు మూడన్నాడు. ఆ మాటలు గురుజాడ మహాకవి సాహిత్య వ్యాసంగం అంతటికీ కీలక ప్రాయమైన వని నేను భావిస్తున్నాను. ఆయన ఏమన్నాడంటే...

“చిన్నతనంలో బొమ్మలాట నేర్చివుండుటచేత లోకమనే రంగంలో చిత్రకోటి రీతులను ఆటాడే మనుష్యులనే పాత్రముల సొగసునే కనిపెట్టడము నాకు అలవాటైనది. సొగసులేని మనిషే వుండడు. స్నేహము, ప్రేమా అనే అనాది అయిన్నీ యెప్పటికీ సరికొత్తగావుండే రెండు వెలుగులను నరునిమీద తిప్పి కాంచితే వింత సొగసులు బయలుదేరుతవి. అసూయ అనే అంధకారంలో అంతా ఏకనలుపే.”

మహానుభావుడు గురుజాడ.

## గురుజాడ ఆధిక్యానికి కారణాలు

1909 వ సంవత్సరం మే 1 వ తారీఖున ఉదకమండలములోని ‘ఎల్క్ హిల్ హౌస్’ లో కూర్చుని రెండో ముద్రణ కాబోతున్న తన నాటకానికి పీఠిక రాసుకుంటున్నాడాయన. అతని వయస్సు 45 సంవత్సరాలు. ఇంకో ఆరేళ్లలో అతను విశాఖపట్టణంలో మరణించబోతున్నాడు. ఉన్ని గుడ్డలు కట్టుకొని శాలువలు కప్పుకొని జాగ్రత్తగా శరీరాన్ని కాపాడుకొంటున్నాడు. అప్పటికే అతన్ని పీడిస్తున్న వ్యాధి అత్యంత తీవ్రరూపం ధరించింది. ఆరోగ్యం కోలుకోడానికే ఉదకమండలం వెళ్లాడతను. స్థలం ఊటీ. సమయం 1909 మేడే. రాస్తున్నది కన్యాశుల్కానికి ద్వితీయ ముద్రణ పీఠిక. రాతగాడు గురజాడ అప్పారావు.

ఈ పీఠిక ఇంగ్లీషులో ఉన్నందువల్ల తెలుగు మాత్రమే తెలిసిన ఆంధ్రు లనేకులకి అందులో ఉన్న అమూల్య విషయాలు అందిరాక పోతున్నాయి. నాటక రచన, సంఘ సంస్కరణ, వ్యావహారిక భాషా ప్రాశస్త్యం, రచయితలు

తాము రాసిన పుస్తకాలు అచ్చువేయించుకోవడానికి పడేపాట్లు, పాఠ్యపుస్తక నిర్ణేతల నిరర్థక నిరంకుశత్వాలు, విశ్వవిద్యాలయాధ్యాపకుల సాహిత్య పరాఙ్ముఖత్వం, సమకాలిక విద్వాంసుల ఛాందసాలు ఒకటేమిటి ఎన్నో సంగతు లున్నాయి ఆ పీఠికలో.

"తెలుగు దేశంలో గ్రంథకర్త అయిన వాడు తన పుస్తకాలు తానే అచ్చొత్తించుకోవాలి. తానే అమ్ముకోవాలి" అని ఆనాడు మహాకవి అన్నమాట ఈనాటికీ యథార్థంగానే ఉంది. అందులోనే అత నింకోమాట అన్నాడు:

"Modern life which presents complex social conditions is neglected by play-wrights"

అనగా అతి క్లిష్టమైన అనేక సాంఘిక పరిస్థితుల్ని ప్రదర్శించే ఆధునిక జీవితాన్ని నాటక రచయిత లెవ్వరూ కథావస్తువుగా స్వీకరించడం లేదు అని. కొద్ది మినహాయింపులతో నాటకరచయితల గతి నాటికీ నేటికీ ఒక్కలాగే ఉంది.

ఆ మరుసటి సంవత్సరం తోకచుక్క కనబడ్డ యేడు. బరంపురంలో నానాజాతి సహపంక్తి భోజనం జరిగిన యేడు. మహాకవి గురజాడ అప్పారావు మొట్టమొదటిసారి ముత్యాల సరాలు గుచ్చిన ఏడు. అప్పుడే తెలుగు కవిత్వంలో విప్లవశకం ఆరంభమైంది.

ఈవిషయాన్నిక్కడ కొంచెం విపులీకరించదలచుకున్నాను. కందుకూరి వీరేశలింగం, తిరుపతి వెంకటేశ్వర కవులు, ఆఖరికి రాయప్రోలు సుబ్బారావు వీళ్లెవ్వరూ కారు ఆధునిక సాహిత్య విప్లవ నాయకులు. ఇప్పుడు చెప్పిన వాళ్లంతా గురజాడ అప్పారావు కంటె గొప్పవారు కూడాను. కాని, సాహిత్య పరిణామంలో ఈ చెప్పిన నలుగురికీ గురజాడ అప్పారావుకీ ఉన్న తేడా, సామాజిక వ్యవస్థలో సంస్కరణ ప్రియత్వానికీ, విప్లవ నేతృత్వానికీ మధ్యవున్న భేదంవంటిదే. ఆధునిక సాహిత్యంలో ఆచార్యపీఠం ఎవరిదీ అన్న ప్రశ్నకు కందుకూరి వీరేశలింగం గారిదని కొందరూ, తిరుపతి వెంకటేశ్వరకవులదని కొందరూ, రాయప్రోలు సుబ్బారావు దని మరి కొందరూ జవాబిస్తారు. కొన్ని పరిమితమైన ఆవరణల్లో వీరి జవాబు లన్నీ అంగీకరింపదగ్గవే. నిశ్చయంగా కందుకూరి వీరేశలింగం యుగపురుషుడే. తిరుపతి వెంకటేశ్వరులు మార్గదర్శకులే. రాయప్రోలు ఒకానొక కవితాపద్ధతికి ఒరవడి పెట్టినవాడే. అయితే గురజాడలో ఎక్కడుంది విశిష్టత? ఎందులో ఉంది ఆధిక్యం? రాయప్రోలుమీద అభిమానంకొద్దీ ఆయన భక్తు లతనికాచార్యత్వం ఇచ్చినట్లు గురజాడమీద మూఢవిశ్వాసంతో అతణ్ణి నాయకునిగా అంగీకరిస్తున్నానా లేక వ్యక్తిగతాభిరుచుల కతీతమైన విశేషప్రామాణ్యాలు మరేవైనా ఉన్నాయా?

ఉన్నాయంటాను నేను. వీటిలో ముఖ్యమైనదీ మొట్టమొదట చెప్పుకోవలసినదీ ఏమిటంటే, ఏ కవికైనా సరే అతని చుట్టూ ఒక సమాజం, ఆ సమాజాని కొక చరిత్రా, ఆ చరిత్ర కొక పరిణామం ఉంటాయి. సామాజిక చారిత్రిక పరిణామ గమనంలో కవియొక్క సాహిత్య స్థానం నిర్ణీత మవుతుంది. కవి ప్రగతిశీలీ, ప్రతిభాశాలీ అయితే ఈ గమనాన్ని అతడు మరంత వేగవంతం చేస్తాడు. సామాజిక పరిణామానికి విప్లవపంథాలో వేగం సాధించిన మహాకవిగా గురజాడ అప్పారావుకి నేను నమస్కరిస్తున్నాను.

ఇక రెండోది మొదటి అంశంనుండే మొగ్గ తొడుగుతుంది. మొదటిది టెంపోకి సంబంధించిందైతే రెండోది డైరెక్షన్‌కి చెందింది. పరిణామం ఎంత వేగంగా సాగింది అనే కాకుండా ఏదిక్కుగా సాగింది అని కూడా ఆలోచించాలి. పురోగమనమా పశ్చాద్గమనమా అనే విషయం ఆలోచించాలి. ఇంగ్లండులో టి. ఎస్. ఈలియట్‌ని ఈనాటి మహాకవులలో ఒకడని అందరూ అంగీకరిస్తారు. కాని అతని దృక్పథం మాత్రం అభ్యుదయ నిరోధకం. మన విశ్వనాథ సత్యనారాయణగారున్నారు. ఆయనా అంతే. గ్రీకు రోమన్ కాలాల సంస్కృతి ఈలియట్‌ను ఆకర్షించినట్టే రామాయణ భారత కాలాల వైభవం విశ్వనాథవారిని ముగ్ధుల్ని చేస్తుంది. ఆ వేళకీ ఈవేళకీ మానవజాతి చాలా ముందంజ వేసిందంటే ఇద్దరూ ఒప్పుకో రనుకుంటాను. ఇందుకు నిదర్శనంగా ఈకాలపు మానసికాందోళనలను వేలెత్తి చూపిస్తారు. "ఆ కీనుగులు మనలాగే ఏడుస్తూ వుండేవారు. మనకంటే అధ్వాన్నంగా వుండేవారు" అనగలిగిన సాహసం అప్పా

రావుకే చెందింది. దృక్పథాలలోని తేడా యిది. భూతకాలంమీద ఈలియాట్‌కున్న అభిమానాన్ని ఆసరం చేసుకుంటూనే భవిష్యత్తుమీద గురజాడకున్న విశ్వాసానికి నేనిక్కడ నివాళు లెత్తుతున్నాను.

నవ్యాంధ్ర సాహిత్యానికి ఏకైక నాయకునిగా గురజాడ అప్పారావుని నే నంగీకరించడానికి మూడో కారణం భాషకి సంబంధించింది. ఇందాకా నేను చెప్పిన పీఠికలో గురజాడ ఇలా అన్నాడు: "సంకెళ్లను ప్రేమించేవాళ్లు దాన్ని-అనగా గ్రాంథిక భాషను-ఆరాధిస్తారు గాక. నామట్టుకు నా మాతృభాష సజీవమైన తెలుగు. "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్" అనిపించుకున్న ఈ తెనుగులో మన సుఖాల్నీ మన దుఃఖాల్నీ వెల్లడించుకోవడానికి మనం యెవరమూ సిగ్గుపడ లేదు గాని కాగితంమీద పెట్టడానికి మాత్రం మనలో కొంతమంది బిడియ పడుతున్నారు!" అన్నాడు.

వ్యావహారికాంధ్రం తరఫున గిడుగు రామమూర్తి పంతులు ఆనాటి పండితలోకంతో సంకుల సమరాలు సాగిస్తూ ఉంటే శిల్ప ప్రపంచంలో గురజాడ అప్పారావు నూతన సృష్టికి ఉపక్రమించి నూతనవిజయాలు సాధించాడు. కన్యాశుల్కం మొదటి ముద్రణ పీఠికలో ఈ విషయమై ఆయన ఇలా రాశాడు:

" It has been remarked that the use of what is wrongly termed the vulgar tongue mars the dignity of a literary production but that is a piece of criticism which one need not heed at the present day when the progress of the science of Language has established better standards for judging the quality and usefulness of tongues than the whims of the grammarians of old linguistic strata. "

"గ్రామ్యం అని పొరపాటు పేరు పెట్టి పిలిచే వాడుక భాషను కావ్యరచనలలో ప్రవేశ పెడితే ఉత్తమకావ్యాల కుండవలసిన గౌరవం దిగజారిపోతుందనే విమర్శను మనం లెక్క చెయ్య నక్కరలేదు. ఎందుచేతనంటే కావ్య ప్రశస్తి కావ్యప్రయోజనమూ నిర్ణయించేవి పాతకాలపు వైయాకరణుల ఛాందసాలు కావు. భాషా శాస్త్రవిజ్ఞానం బాగా అభివృద్ధి చెందిన ఈ రోజులలో అంతకన్న మంచి గీటురాళ్లే మన కందుబాటులో కొచ్చాయి."

సినిమాలూ రేడియోలూ అభివృద్ధి చెందిన ఈ రోజులలో జీవద్భాషకు గల ప్రాధాన్యం మరీ స్పష్టంగా మనకి కనిపించక పోదు. కాని ఆనాడు మొదటిసారిగా అభ్యుదయ మార్గం తీసిన వ్యక్తులు ఎన్నో ఆటంకాల నెదుర్కోవలసి వచ్చింది. కాని వాళ్లు సువిస్పష్టంగా భవిష్యత్తును చూశారు. భాషాగమనం ఏదిశగా పరుగుతుతోందో వారికి తెలుసును. యథాపూర్వ స్థితికోసం పెనగులాడే అభివృద్ధి నిరోధకుల అభ్యంతరాలేవీ వారిని అడ్డడం లేదు. ఈ సందర్భంలో ఒక చిన్న సంఘటన - గురజాడ అప్పారావుగారి జీవితంలోది - ఇక్కడ స్మరించవచ్చును. ఆనంద గజపతి మహారాజు అప్పారావుగారిని విజయనగర సంస్థాన శాసన పరిశోధకునిగా నియమించిన తర్వాత అప్పారావుగారు కళింగదేశ చరిత్రను రాయడానికి కావలసిన సామగ్రినంతా సమకూర్చుకున్నారు. ఆ గ్రంథాన్ని తాము ప్రచురిస్తామనీ, అయితే అది గ్రాంథిక భాషలోనే ఉండితీరాలనీ విజ్ఞాన చంద్రికా గ్రంథమండలివారు కోరగా గురజాడ అప్పారావుగా రందు కొప్పుకోలేదు. అప్పుడు ఆయన అన్నమాట లివి. "నాది ప్రజల ఉద్యమం. దానిని ఎవరిని సంతోషపెట్టడానికీ వదలుకోలేను" అని. అంత విశ్వాసం ఉందన్న మాట, ఆయనకి తన ఉద్యమంమీద.

"మాట్లాడినట్టే సరీగ్గా రాయడం కూడా ఎవరికి సాధ్యం? అథవా రాసినప్పటికీ అందులో ఏమి పస ఉంటుంది?" అనేవారికి కన్యాశుల్కంలోని ప్రతీ వాక్యమూ ప్రతీ మాటా తిరుగులేని జవాబిస్తాయి. సామాజిక వాస్తవికతను కన్యాశుల్కం ప్రతిబింబించినంత సంపూర్ణంగా మన దేశంలోని మరే యితర నాటకమూ ప్రతిబింబించలేదని నిస్సందేహంగా చెప్పవచ్చును. సంఘంలోని వివిధ వర్గాలకు, కులాలకు, వృత్తులకు, మనః ప్రవృత్తులకు చెందిన ఎందరో వ్యక్తులు నిత్యజీవితంలో తాము ఎలాగ మాట్లాడతారో అలాగే కన్యాశుల్కంలో మాట్లాడతారు. ప్రేక్షకులను మనస్సులో పెట్టుకొని వారిని నవ్వించడానికి కృత్రిమంగా ప్రవేశ పెట్టిన సంభాషణ లేవీ ఈ నాటకంలో లేవు. గిరీశం, రామప్పంతులు, పోలిశెట్టి, అసిరిగాడు

ఒకరేమిటి ఎవరి గొంతుకయినా ఎక్కడైనా స్పష్టంగా పోల్చుకో వచ్చును. వాస్తవానికి దూరంగా నిలుచుని జీవితానికి మెరుగు పెట్టాలనుకుంటేనే భాషలోకి కృతకత ప్రవేశిస్తుంది. ఈ సందర్భంలో "శిల్పం వాస్తవికతకు అతీతమైనది" అని వాదించి ప్రయోజనం లేదు. ఫోటోగ్రాఫీ కళ కాదని పొరపడే వాళ్ల దృక్పథం ఇది. ఫోటోగ్రాఫీని కూడా ఉత్తమ శిల్పం చేసే నిబంధనలు దీనిలోనే గర్భితమై ఉన్నాయి. గురజాడ సాహిత్యంలో జీవితాన్ని ఫోటోగ్రాఫ్ మాత్రమే కాదు సౌండ్ ఫోటోగ్రాఫ్ కూడా చేశాడు.

గురజాడ ఆధిక్యానికి నాలుగో కారణం అతని సర్వజనీనత. తక్కినవాళ్లంతా తెలుగు దేశంలో యోధానుయోధులైతే ఒక్క గురజాడ మాత్రమే ప్రపంచంలో ఎప్పటి ప్రామాణ్యాలకైనా నిలవగల సార్వజనీనతను సాధించినవాడు. ప్రాచీనాంధ్ర కవులలో వేమన అటువంటివాడు. మళ్లీ ఈనాడు గురజాడ అప్పారావు. తిరుపతి వేంకటేశ్వరుల ప్రతిభను తెలుగుదేశం ఆదరించినంతగా తక్కిన దేశాలు గుర్తిస్తాయని నేననుకోను. పోతనకవి తెలుగు వాళ్ల కరగ్రాహ్యమైనంతగా, తెలుగువాళ్లని ఉత్తేజపరిచినంతగా వెలుపలి ప్రపంచానికి కలిసి వస్తాడనుకోను. నూటికినూరు పాళ్లు తెలుగు కవిగా ఇంట గెలుచుకొని సార్వజనీన సార్వకాలీన విశిష్టత్వంతో రచ్చ గెలువగలిగినవాడు వేమన్న ఒక్కడే వెనుకటి కాలంలో తెలుగుకవి. అలాగే ఆధునికసాహిత్య ప్రపంచంలో తెలుగు దేశపు సరిహద్దుల కవతల అంతర్జాతీయ కవి సమ్మేళనంలో తెలుగువారి తరఫున ప్రతినిధిగా నిలుచుకో గలిగినవాడు గురజాడ అప్పారావు ఒక్కడే. కవిగా మాత్రమే కాదు, కథారచయితగా గురజాడ ధ్రువతార. అతను కాక ముందు ఉన్న కవిత్వానికీ అతను రాసిన తర్వాత వచ్చినకవిత్వానికీ పోలికే లేదు. అతనికి పూర్వం ఉన్న నాటకరంగానికీ అతని తర్వాత నాటకరంగానికీ మహదంతరం ఉంది. కవిగా నాటకకర్తగా గురజాడ ప్రతిభను దేశమంతా గుర్తించింది గాని కథారచయితగా అతనికున్న ఉన్నతోన్నత స్థానం చాలామందికి తెలియ దనుకుంటాను. "దేవుడు చేసిన మనుషులారా, మనుషులు చేసిన దేవుళ్లారా మీ పేరేమిటి?" అనే ఒక్క కథానిక చాలును - కథకులలో గురజాడకి అగ్రేసరత్వం స్థాపించడానికి.

ఒకందుకు నాకు విచారం వేస్తుంది. తమిళులు తమ జాతీయకవిగా సుబ్రహ్మణ్య భారతిని అంగీకరిస్తారు. మళయాళీలకు వల్లథోల్ ఉన్నాడు. వంగీయుల మహాకవి రవీంద్రనాథ ఠాకూరు. అలాగే ఇతర ప్రాంతాలకు ఇతర కవులు. కాని తెలుగులో మాత్రం తమ జాతీయ కవి విషయమై తెలుగువారు ఏకాభిప్రాయానికి రాలేక పోతున్నారు. ఎవరిని గొప్పవాడంటే ఇంకెవరికి కోపం వస్తుందో అనో లేక ఎవరిగొప్ప వారిది మనం ఎవరము నిర్ణయించడానికి అనో! మళ్లీ కవి పూజలో తెలుగువారు మరే యితర ప్రాంతీయులకూ తీసిపోరు. బహుశా భారతదేశం అంతట్లోకీ కవులను హెచ్చుగా ఆరాధించేది తెలుగుదేశమే యేమో కూడా. అయినప్పటికీ రాజకీయాలలోవలెనే సాహిత్యంలో కూడా మనకి బహునాయకత్వం తప్పలేదు.

## హరిహరిరాయలు

హరిహర దేవ! నీ వవినతారుల నద్భుతలీలఁ ద్రుంపఁగాఁ
గరికరి వాజివాజి నవఖండ విఖండ విఖండధారలై
యరుదుగ నీదుహేతి జఠరాగ్నులఁ బర్వఁచు నెప్పు డుండురా
ధరధర ధారధార ధరధార ధరాధర ధారధారలన్.

గురజాడవారిపాత్రలు:

# గిరీశంశీలంలోని కీలకం

శ్రీ శ్రీనివాసచక్రవర్తిగారు

అభ్యుదయ నాటక సాహిత్యానికి గురజాడ అప్పారావు వేగుచుక్క. వారి కన్యాశుల్కంతో తులతూగే నాటకం ఇంతవరకు తెలుగులో వెలువడలేదంటే అతిశయోక్తి కాదు. అందులోనూ గిరీశం పాత్ర ఒక ఎత్తు. తక్కిన నాటకమంతా ఒక ఎత్తు. గిరీశంపాత్ర చిత్రణలో గురజాడ చూపిన ప్రతిభ అసమానం. వారిచేతి చలవవల్ల గిరీశానికి అమరత్వం సిద్ధించింది. అప్పారావుగారి పేరు ఎత్తగానే గిరీశం, గిరీశం పేరు ఎత్తగానే అప్పారావుగారూ మనకి జ్ఞాపకం వస్తారు.

అయితే గిరీశం ఎలాంటివాడు? అతని గుణగణాలెలాంటివి? గిరీశం ఆషాఢభూతా, బటాచోరా, అగత్తాయా, డాబులరాయుడా, సంఘసంస్కర్తా, ప్రోనాచా, ఆంటీనాచా, బఫూనా? ఈ లక్షణాలన్నీ అంతో యింతో అతనిలో కనిపిస్తాయన్నమాట నిజమే. అతని మాటలకూ చేతలకూ సంబంధం కనిపించని మాటా నిజమే. కాని ఇన్ని అవలక్షణాలు కనిపించినా మనకి గిరీశం అంటే సానుభూతి, ఆప్యాయతా కలుగుతుంది. దీనికి కారణం ఏమిటి? ఈ అవలక్షణాలు అతనికి స్వాభావసిద్ధములయినవా, తెచ్చిపెట్టుకున్నవా? అతని మాటలనీ చేతలనీ నడిపించే సూత్రం ఏదయినా ఉందా? అసలు గిరీశం జీవితాశయమేమిటి? అతని శీలంలోని కీలకం ఏమిటి? ఈ ప్రశ్నలన్నీ సామాన్యంగా పాఠకుల మనసులలో తారాడుతాయి. అందుచేత గిరీశాన్ని అడుగడుగికీ ఎదుర్కొన్న సమస్య ఏమిటో, దానిని ఏ విధంగా పరిష్కరించ పూనుకున్నాడో పరిశీలిద్దాం.

మొట్టమొదటి సారిగా తెర ఎత్తగానే బొంకుల దిబ్బమీద గిరీశం ప్రత్యక్షమవుతాడు. తన దుస్థితిని గురించి వాపోతాడు. అప్పటివరకు ఎక్కడెక్కడ ఎలా తిరిగొచ్చినా వేళకి తిండిపెట్టి 'అన్నివిధాలా' ఆదరించే పూటకూళ్లమ్మ అండ ఉండేది. బతుకు నిశ్చింతగా వెలమారి పోతుండేది. అయితే మధురవాణి వంటి వేశ్యారత్నాన్ని ఉంచుకున్న గిరీశానికి తలచెడిన పూటకూళ్లమ్మ 'నేస్తం' కట్టే కర్మం ఏం పట్టింది? నౌకరులాగా బజారు వెళ్లి సరుకులు తెచ్చిపెట్టే గతేంపట్టింది? గిరీశం అంత అగసికుడా? కాదు. అసలు రహస్యమేమంటే, పూటకూళ్లమ్మతో 'నేస్తం' కట్టితే తిండికి కరువుండదు. సిగార్లకి ఇబ్బందుండదు. బతుకు తెరువుకోసం తిప్పలు పడక్కర్లేదు. సమస్త సౌకర్యాలు సమకూరుతాయి. బతుకు హాయిగా గడిచిపోతుంది. ఈ బతుకు తెరువు కోసరమే గిరీశం పూటకూళ్లమ్మతో 'నేస్తం' కట్టాడు. అంతేకాని మోహించికాదు. అయితే పూటకూళ్లమ్మకి తనమీద అమితమోహం, ఏం చేసినా ఊరుకుంటుంది అనే ధీమాకొద్దీ కూరలకని ఇచ్చిన డబ్బు డాన్సింగర్లు కింద ఖర్చుపెట్టాడు. అక్కడే గిరీశం పప్పులో కాలేశాడు. కొంప మునుగుతుందని ఊహించలేకపోయాడు. తనడబ్బు డాన్సింగర్లు కింద ఖర్చుపెట్టాడని తెలిసి పూటకూళ్లమ్మ అగ్గిభరాటయిపోయింది. దాంతో పూటకూళ్లమ్మకీ గిరీశానికీ యుద్ధం అయింది. 'నేస్తం' చెడింది. పూటకూళ్లమ్మ "యిటుపైన తిండిపెట్టేటట్టు కానరాదు." బతుకు తెరువుకు ఆధారం కాస్తా తెగిపోయింది. ఇక మర్నాటినించీ తిండి గడిచేదెట్లా? సిగార్లకెట్లా? పైగా, "ఎటుచూచినా అందరికీ బాకీలే", "వెంకుపంతులుగారి కోడలికి లవ్ లెటర్ రాసినందుకు యెప్పుడో ఒకప్పుడు సమయం కనిపెట్టి దేహశుద్ధి చేస్తారు." వూళ్లో మరి గిరీశం "పప్పువుడకదు." ఆబోరు దక్కదు." అసలు గిరీశం మనుగడకే ప్రమాదం వచ్చింది. బతుకు తాడులేనిబొంగరమయింది. ఉద్యోగం చెయ్యడానికి తగిన చదువు సంధ్యలు లేవు. వాళ్లవాళ్లు: "వాళ్లిప్పుడు చేస్తున్న అక్కరేముంది?" ఇక బతుకు తెరువు ఎట్లా? ఇదీ నాటక ప్రారంభంలోనే గిరీశానికి ఎదురయిన సమస్య.

ఈ సమస్యను పరిష్కరించడం ఎలా అని ఆలోచిస్తుంటే, అదృష్టవశాత్తు, యాదృచ్ఛి

కంగా వెంకటేశం కంట పడతాడు. వెంటనే గిరీశానికి "శలవుల్లో చదువుచెప్పే మిషమీద వీడితో వీడి వూరికి వుడాయిస్తే చాలా చిక్కులు వొదుల్తాయి" అనే ఆలోచన తళుక్కు మన్నది. చదువుచెప్పే మాష్టరుకి ఏ పల్లెటూరి గృహస్థూ తిండిపెట్టడానికి వెనకాడడు. వెంకటేశంద్వారా ఏదో వంకతో నాలుగు డబ్బులు లాగితే పోగాను ఖర్చు వెళ్లిపోతుంది. ఇంకేం. 'అట్నుంచి నరుక్కురా' వడానికి నడుం కట్టాడు. ఎదటివాడి మనసు కనిపెట్టి సమయోచితంగా మాట్లాడడంలో గిరీశం అందెవేసినచెయ్యి. ఇంతేకాదు. "ఏడ్చే వాళ్ళని నవ్వించ" గలడు. వెంకటేశంవాలకం కనిపెట్టి పరీక్ష తప్పాడని గ్రహించాడు. వాడి స్కూలు మాష్టరుని నాలుగు తిట్టి, తండ్రిభయం తీర్చి, "సురేంద్రనాథ బెనర్జీ అంతటివాణ్ణి" చేస్తానని చెప్పి తన మీద నమ్మకం కలిగేటట్టు చేసుకుంటాడు. ఇందుకోసరం ఎన్నిరకాల డాబులు కొట్టాలో అన్నీ కొట్టాడు. అంతే కాదు. పొరుగింట బతుకు హాయిగా వెళ్ళాలంటే ఆడవాళ్ళని మంచిచేసుకోవాలి. అందుకని వెంకటేశంతో నియోగంగా, "మీ వాళ్లు బార్బరస్ పీపిల్ గదా. నన్ను తిన్నగా ట్రీట్ చేస్తారో చెయ్యరో? నీవు నన్ను గురించి మీ మదర్‌తో గట్టిగా రికమండు చెయ్యవలసివుంటుంది" అనిచెప్పి ఒప్పిస్తాడు. తను దివాళాకోరునసీ, కూటికోసరం వెంట బడుతున్నాడని వెంకటేశం అనుమానించకుండా దర్జాఒలికిస్తూ, "నా దగ్గర కరెన్సీ నోట్లువున్నవిగాని మార్చలేదు" అని కోతలు కోస్తాడు. చెప్పినట్లు వింటానని వెంకటేశం చేత ప్రమాణం చేయిస్తాడు. ఇంకేం రొట్టె నేతిలోపడిందిగదా అని వెంకటేశాన్ని మిఠాయికి పంపి, 'మధురవాణికి పార్టింగ్ విజిట్ యివ్వందీ పోకూడదు' అనుకుంటుంటే మళ్ళీ గండం తయారయింది.

ఫోటోగ్రాఫరు బంట్రోతు వచ్చి పాతబాకీ ఇమ్మని నిలవేశాడు. వీణ్ణి తప్పించుకుంటానికి ఎంత నాటకం ఆడాడు. చెవిటివాడిలా నటించాడు. వాడికో సిగారు లంచ మిచ్చాడు. గాయత్రిని పట్టుకుని ప్రమాణం చేశాడు. ఈ విధంగా బంట్రోతుకు టోపీవేసి మధురవాణి ఇంటికి వెడితే అక్కడ 'ఉత్సాహం భంగ'



మవడమే గాక ఇంకో గండం వచ్చి పడింది. చీపురుకట్టతో పూటకూళ్ళమ్మ ప్రత్యక్షమయింది. ఎలాగో యుక్తిచేత చీపురుదెబ్బలు తప్పించుకొని బయటపడ్డాడు.

పకడ్బందీగా ప్లాను వేసికొని తీరా వెంకటేశంవెంట వాళ్ళ ఇంటికి వెళితే, అడుగుపెట్టీ పెట్టగానే అహిరావణ, మైరావణులాంటి కరటకశాస్త్రీ, అగ్నిహోత్రావధాన్లతో గిరీశం వ్యవహరించాల్సి వచ్చింది. కరటకశాస్త్రి పాండిత్యాన్ని పొగడి మంచి చేసుకున్నాడు. కాని అగ్నిహోత్రావధాన్లు ఒక పట్టాన కొరకబడే మనిషి కాదాయె. మొట్టమొదట్లోనే గిరీశాన్ని చూసి, 'యీ తురకవేషమేమిటి?' అనడమే కాకుండా ధుమధుమలాడుతూ, 'యీ శషభిషలు నాకేం పనికిరావు. యితడి వైఖరి చూస్తే యిక్కడే బస వేసేటట్టు బలపడుతూంది. మా ఇంట్లో భోజనం యెంత మాత్రం వీలుపడదు' అని ఖండితంగా చెప్పేశాడు. మళ్ళీ గండం వచ్చిపడింది. అసలు గిరీశంవచ్చిందే బసవేసి తిండికోసరమే నాయె. అతని ప్లానే దెబ్బతినే టట్లుంది. కాగా గిరీశం మాత్రం సామాన్యుడా? ఏమాత్రం తొనకలేదు. 'పేషెన్సువుంటేనేగాని లోకంలో నెగ్గలేం' అనుకున్నాడు. అగ్నిహోత్రావధాన్లకీ, వెంకాయమ్మకీ మధ్య వెంకటేశం చదువు విషయమయి ఉన్న అభిప్రాయభేదాలు పసికట్టి 'యిక మూడేళ్లు నాతరిఫీదులో నుంచితే క్రిమినల్లో వరసగా పోలీసుపరీక్ష ప్యాసు చేయిస్తాను' అని ఆశపెట్టి వెంకాయమ్మని మంచి చేసుకుని తన వైపుకు తిప్పుకున్నాడు. ఇంకేం. ధీమాగా 'నేను యిక యిక్కడ ఉండడం భావ్యం కాదు. సెలవు పుచ్చుకుంటాను' అని బెట్టుచేసి వెళ్ళిపోయేవాడిలా నటిస్తూ వెంకాయమ్మ చేత బతిమాలించుకొని మరీ ఉండిపోతాడు.

ఇక అగ్నిహోత్రావధాన్లని, 'యీ పట్టెని జటలో తమంతవారు' లేరని పొగిడి అతివినయం చూపుతూ పాకెట్లో వేసుకున్నాడు. అంతే కాదు. అగ్నిహోత్రావధాన్లు ఇంగ్లీషురానికొట్టు పక్షి అని గ్రహించాడు. దీన్ని ఆధారం చేసుకొని రికార్డు అంతా తర్జుమాచేసి పెడతానని చెప్పి పూర్తిగా వశంచేసుకున్నాడు. అయితే వెంకటేశం వట్టి తెలివితక్కువ మొద్దు. వాడి

# బుచ్చమ్మపాత్రలో క్రమోన్మీలనం

శ్రీమతి ఎం ఆదిలక్ష్మిగారు

o :--

బుచ్చమ్మ అగ్నిహోత్రావధాన్ల ప్రథమ పుత్రిక. కన్యాశుల్క నాటకంలో ద్వితీయాంకంలో—వెంకటేశం చదువు విషయమైన ప్రస్తావనలో—కరటకశాస్త్రులు భావమరది అగ్నిహోత్రావధాన్లతో "కుఱ్ఱవాడికి రవ్వంత చదువు చెప్పించడానికి ఇంత ముందూ వెనకా చూస్తున్నావు. బుచ్చమ్మ నమ్మిన పది హేనువంద లేం జేశావ్" అంటాడు.

అప్పటి సంభాషణనుబట్టి 'మంచంమీదనుంచి దించెయ్యడానికి సిద్ధంగా వున్న వాడికి కట్టడం, త్వరలోనే బుచ్చమ్మకు వైధవ్యం ప్రాప్తించడం అన్న విషయాలు మన కళ్ళకు కనబడతాయి. బుచ్చమ్మకు వైధవ్యమంటే ప్రాప్తించిందిగాని భర్తతాలూకు ఆస్తియేమి చేయి చిక్కలేదు. ఆమె పాపం అత్తవారింటికైనా వెళ్ళలేదు. అందుచేతనే అగ్నిహోత్రావధానులు గిరీశంగారితో సంప్రదిస్తాడు - 'బుచ్చమ్మగారి కేసు విషయమై జబ్బల్పూర్ హైకోర్టు తీర్పొకటి మనకు మహాబలంగా ఉం'దని గిరీశం చెప్తాడు.

కన్యాశుల్కానికి బుచ్చమ్మకు సన్నిహిత సంబంధం గోచరిస్తుంది. ఆ దురాచార ఫలితంగా ఆమె జీవితం భగ్నమౌతుంది. ఆమె సౌందర్యవతి అని మనము గిరీశం నోటినుండి రెండు మూడుమార్లు వింటాము. నాటకంలో తొట్టతొలిసారిగా—తమ్ముణ్ణి 'అమ్మ కాళ్ళు కడుక్కోమంటున్నదని 'అయ్యా! మీరు చద్దన్నం తింటారా' అని గిరీశంగారిని పిలవడానికి వస్తుంది. ఇంటిలోని సమస్త చాకిరీ చేయడం ఆమెవంతు. తన చెల్లెలు సుబ్బిని పద్దెనిమిది వందలకు లుబ్ధావధాన్లకు తండ్రి ఇవ్వబోతున్నాడని తెలిసి చాలగా బాధపడుతుంది. భోజనాల సమయంలో గిరీశం తాను విడోమేరేజినిగూర్చి లెక్చరిస్తే అగ్నిహోత్రావధానులు తనమీద కేక వేయడమే కాక పెరుగన్నం కుమ్మడం ఆరంభించాడని వెంకటేశంతో చెప్పాడు. అప్పుడు బుచ్చమ్మ కోకిల కంఠంతో 'నాన్నా! తమ్ముడికి పెళ్ళి చెయ్యాలంటే నా సొమ్ము పెట్టి చెయ్యండి కాని దాన్ని కొంప ముంచి లుబ్ధావధాన్లకు ఇవ్వవద్దని చెప్పినది. దాంతో అవధాన్లు గారికి వెఱ్ఱికోపం వచ్చి వుత్తరాపోశనం పట్టకుండానే ఆ పెరుగూ అన్నం విస్తరి తీసికెళ్ళి ఆమె నెత్తిని రుద్దాడని కూడ గిరీశం చెప్తాడు. ఈ మాటలవల్ల బుచ్చమ్మ దయనీయస్థితి మనకు సువ్యక్తమౌతుంది. 'నాన్నా! అమ్మ స్నానానికి లేవమన్న దని చెప్పవచ్చినప్పుడు కూడ అగ్నిహోత్రావధానులు పేరుని సార్థకం చేసుకుంటూ 'వెధవముండా సొద! పెద్దమనుష్యుల్తో వ్యవహారం మాట్లాడుతూంటే రామాయ

---

[42 వ పేజీ తరువాయి]

అగచాడు. 'చెడనివారిని చెడగొట్టవద్దని మా తల్లి చెప్పింది. అందుచేత ముద్దుపెట్టుకోనివ్వను' అని మధురవాణి అంటే, సౌజన్యారావు 'కృతజ్ఞుడనై ఉన్నాను' అంటాడు.

ప్రొఫెసరుకన్నా ఉన్నతమైన పాత్ర సౌజన్యారావుది. అందరికన్నా మహోన్నతమైన పాత్ర మధురవాణిది. 'నేనే ఆమెని చూసి భ్రమసిపోతున్నాను' అని అప్పారావుగారే ఒక లేఖలో వ్రాశారు. ఆయన చెప్పినట్లు 'గ్రంథకర్త తన పుస్తకాన్ని చదివి తానే ఆశ్చర్యపడితే గ్రంథంలో నిజమైన సారస్యం వుందన్నమాటే!'

ఆ లేఖల్లోనే అప్పారావుగారు 'మొదటి ముద్రణముకంటె యిది నాభావాలను సమగ్రంగా వ్యక్తంచేస్తున్నది. మొదటిది దీనిలాగ కాదు. అంతర్గత మనోభావాలను కాక, స్థూలంగా పైపైపూతలనే అది ప్రతిబింబించింది... పైకి కనబడేదానికన్న బలమైన నైతికభావాన్ని పొందింది నా పుస్తకం. జీవితాన్ని నేను చులకనగా భావించ నని తెలుస్తుంది. హాస్యంతో పొంగిపొయ్యే పుస్తకంలో జీవితంలో గంభీరత్వాన్ని జూపడం చాలా కష్టమైన పని. ప్రయత్నించాను నేను' అని వ్రాశారు.

ఆ గంభీరతకి శిఖరాగ్రం మధురవాణి పాత్ర.

ణంలో పిడకల వేట్లాటలాగ అదే పిలవడమా' అని మండిపడతాడు.

తృతీయాంకంలో గిరీశంగారు మున్సబుని పై పెద్ద 'స్వగతం' మాట్లాడుతాడు. తలుపు కన్నంలోనుండి తొంగిచూస్తే బుచ్చమ్మ విస్తళ్లు కుట్టుంటుంది. ఈ అంకంలో బుచ్చమ్మని బుట్టలో వేయడానికి గిరీశం మంచి పన్నాగం పన్నుతాడు. వెంకటేశము చదువు చెప్పడానికి వచ్చానంటాడు. తమ్ముడు పెరట్లో గొట్టికాయ లాడుతున్నాడని తీసికొని రావడానికి వెళ్తుంది. వాళ్లు వచ్చిన తర్వాత గిరీశం శిష్యుని ప్రశ్నలు వేస్తూ......'మన దేశంలో వక దురాచారం ఉన్నది. మొగాడికి పెళ్ళాం చస్తే తిరిగి పెళ్ళాడుతాడు. ఆడదానికి మొగుడు చచ్చిపోతే ఎంత యౌవ్వనంలో నున్నా, ఎంత సొగసుగా నున్నా మరి వకడిని పెళ్ళాడ వల్ల లేదు. ఇది అన్యాయ వంటావా కాదంటావా?' అని ప్రారంభిస్తాడు. మధ్య మధ్య బుచ్చమ్మ జోక్యం కలుగజేసుకొని 'యేమండి గిరీశం గారు! విధవలు పెళ్ళాడడం పాపం కాదూ' అని అడుగతే గిరీశం పరాశరస్మృతిలో స్పష్టంగా విధవలు పెళ్ళాడవలసినట్లున్న దని వేదంలో కూడ ఉన్న దని రాజమహేంద్రవరంలో దీనినిగురించి పండితులు సిద్ధాంతం చేశా రని పూర్వకాలంలో సాధారణంగా విధవలు పెండ్లాడేవా రని చెప్పి 'వెంకటేశం!— నలచరిత్రలో దమయంతి రెండో పెండ్లి చాటించిన పద్యం చదువు' అంటాడు. గిరీశం బుచ్చమ్మవైపు చూసి శాస్త్రాలన్నీ వొప్పుకోవడమే కాకుండా వీరు మిక్కిలి విధవలు పెళ్ళాడకుండా వుండిపోతే దోషమని కూడ చెప్తాడు. ఈ విషయమై శంకరాచార్యులవారు పత్రిక కూడ యిచ్చి ఉన్నా రంటాడు. అమాయకురాలు బుచ్చమ్మ 'మనవాళ్లంతా పెళ్లి చేసికోకూడ దంటారే?' అంటుంది. గిరీశం వెంకటేశంతో మాట్లాడినట్లు 'ఇదంతా యింట్లో చాకిరీ చేయించుకోవడం కోసరము గాని మరేమీ లేదు. మీ అక్కయ్య ఆ చంద్రబింబం ముఖంపైని ఒక బొట్టుంటే త్రినేత్రుడికైనా చూడడానికి అలవి వుండునా?' అని ఇలాగ వెంకటేశమునకు పాఠం చెప్పినట్లు పెద్ద ప్రసంగం ఇస్తాడు గిరీశం. ఆ పాఠముయొక్క ప్రభావము బుచ్చమ్మపై బాగా సోకింది. పైగా దైవభీతి గల ఆ అమాయకురాలికి 'గిరీశం' భగవంతుడు. ఆడవాళ్ళను పెండ్లాడడముకు పిల్లల కనడముకున్నూ సృష్టించాడని గనక పెండ్లాడకుండ ఉన్న విధవ పిల్లలు దేవుని ఆజ్ఞను అతిక్రమించిన పాపములు చేసున్నారు అని భీతి గొలుపుతాడు. దైవభీతి పాపభీతి గల పల్లెటూరి పిల్ల కాబట్టి బుచ్చమ్మ ఆ మాటలకు కొంత లొంగుబాటు చూపిస్తుంది.

మొదట్లో యేమీ తెలియని బుచ్చమ్మకు క్రమక్రమంగా విషయాలను తెలిసికోవా లన్న జిజ్ఞాస కలిగిన దౌతుంది. చావబోతున్న వెంకమ్మను రక్షించడం, వెంకటేశంకు పాఠాలు చెప్పేమిషచే బుచ్చమ్మతో మాటాలాడి పరిచయం చేసికొంటాడు. విధవా వివాహం చేసుకోవడం కర్తవ్య మని వెంకటేశాని కుద్బోధన చేసే గిరీశంతో బుచ్చమ్మ అంటుంది. గురువులు గదా ముందు మీ రెందుకు చేసుకోరు?' ఆ ప్రశ్నకు సమాధానంగా ఎవరితో చెప్పనని ఒట్టేసుకో మంటాడు గిరీశం. ఆమె పాపభీతిని ఆధారంగా చేసికొని తన మీదే ఒట్టు పెట్టుకుంటాడు. ఆమె యెదుట ఒక భూతల స్వర్గాన్ని సృష్టించి దానికి తన్ను రాజుగా ఆమెను రాణిగా చేసి యేమేమో మాటలు చెప్తాడు. అప్పటికి కూడ బుచ్చెమ్మ లొంగదు. తుదకు సుబ్బిపెళ్లి తప్పి పోవడానికి తనతో ఆమె లేచి వస్తేనే గాని వీలుండ దని గిరీశం ఆమెను నమ్మిస్తాడు. తుదకు బుచ్చెమ్మ 'యేం జెయ్యమంటె అది చేస్తాను' అని అంటుంది.

ఈ ఘట్టం ఆంధ్రవాఙ్మయంలోనే అపూర్వమైనది. ఆంగ్లవాఙ్మయాన్ని ఆమూలాగ్రంగా ఆకళించుకొనిన గురుజాడ అప్పారావుగారు ఇచ్చట తన ప్రతిభను చక్కగ వ్యక్తపరచారు. ఏమి తెలియని పల్లెటూరిపిల్లలను గిరీశం తన పాండిత్యాన్నంతా ప్రదర్శించి లొంగదీసికొనే విధానం చాల మహత్తర మైనది. సంభాషణ మూలంగా బుచ్చెమ్మ మనస్తత్వం మనకు చక్కగా వ్యక్తమౌతుంది. అది తనరాత అని సమస్తచాకిరీ చేస్తూ కృష్ణా రామా అని కాలం వెళ్లబుచ్చే బుచ్చమ్మకు గిరీశం విధవలు వివాహాలు చేసుకొనే అవకాశా లున్నాయని, శాస్త్రాలలో ఉన్నది, శంకరాచార్యులే ఒప్పుకున్నారు - విధవావివాహ సంఘవారు విధవలను పెండ్లాడితే నెలకు నూరు రూపాయ లిస్తా

గని, యేమేమో చెప్పి పునిస్త్రీ కావచ్చునని ఆశలు గొలిగిస్తాడు. 'తెల్లని వన్నీ పాలు నల్లని వన్నీ నీళ్లు' అని అనుకొనే బుచ్చమ్మ గిరీశం గారిని నిజంగానే సంఘసంస్కర్తగ అనుకొంది. లోకం మరామ్మత్తు చేయడం అంటే యేమిటని? అని అడిగి తెలుసుకొంటుంది. తనస్వార్థంకోసం కాకుండా, చెల్లెలిపెళ్లి యెలాగైనా తప్పించే చాలు నన్నఉద్దేశ్యంతోనే గిరీశంతో వెళ్లిపోవ డానికి ఒప్పుకుంటుంది.

కన్యాశుల్క నాటకంలో ఈ దురాచార ఫలితంగా పవిత్రమైన బుచ్చమ్మ జీవితం పాడు కావడం ఒకటి, ఏదో సుఖంగా కాలక్షేపం చేస్తున్న లుబ్ధావధాన్లు మళ్ళీ పెళ్లి చేసికో దలచుకొని అనేకములగు కష్టముల పాలవడం అనే రెండు విషయాలను గురజాడవారు ప్రతి పాదించారు.

తండ్రుల ధనలోభానికి ముసలితాతయ్యాల కంటగట్టబడి, జీవితకాల మంతా దుస్సహవైధ వ్యాన్ని అనుభవించడము ఎంత అన్యాయమో కవి బుచ్చమ్మ గాథగుండా నిరూపిస్తాడు. లుబ్ధావధాన్ల కూతురు మీనాక్షి కూడ బుచ్చమ్మ వలెనే కన్యాశుల్క ఫలితంగా చెడినదే. కాని మీనాక్షికి బుచ్చమ్మకు పాతాళానికి ఆకాశా నికి గల అంతరం ఉన్నది. మీనాక్షి రామప్పం తులు వెంట పడి చేసిన ప్రమాణం ప్రకారం పెళ్లి చేసికొమని పోరు పెడుతుంది. కాని తెలి వైనది మీనాక్షి. బుచ్చమ్మ శుద్ధ అమా యకురాలు. కాని గట్టిపట్టుదల గలమనిషి. ఆఖ రుకూడ 'అమ్మ నాయనా! నా ప్రాణం పోతే నేనుమీతోరాను' అంటుంది. కాని తుట్టతుదకు చెల్లెలి పెళ్లిని తప్పించడానికదే మార్గ మని గిరీశం చెప్తే నమ్మి ఒప్పుకుంటుంది. లేవదీసు కొచ్చిన బుచ్చమ్మను గిరీశం విశాఖపట్నం విధవాశ్రమంలో వుంచుతాడు. గిరీశంగారి గుట్టు మధురవాణి బయటపెట్టగానే 'డామిట్ కథ అడ్డంగా తిరిగింది' అని మనదృష్టిపథంలో నుంచి తొలగిపోతాడు. బుచ్చమ్మ రక్షింప బడుతుంది.

బుచ్చమ్మ గిరీశంల సంభాషణను చదువు తుంటే మనకు షేక్స్పియర్ వ్రాసిన రిచర్డ్ లోని ఒక సన్నివేశం జ్ఞప్తికి వస్తుంది. భర్త శవం వెంబడి యేడుస్తూ హంతకుడైన రిచర్డును నిందిస్తూ వెళ్తుండే ఆన్ యువతిని రిచర్డు అతిచాకచక్యంగా మాట్లాడి ఆమె ప్రేమను ఆకర్షించి సఫలుడౌతాడు. (ఈ విషయం డాక్టరు గిడుగు సీతాపతిగారు నాకు సూచిం చారు).

బుచ్చమ్మ పాత్రలో ఉన్మీలనం ఉన్నది. మొట్టమొదటినుంచి ఈమె పాత్ర అతి పవిత్ర మైనదిగా గోచరించినా, శుద్ధ అమాయకురా లైన ఈమెలో క్రమవికాసం గోచరిస్తుంది. గిరీశం తన ప్రగల్భపాండిత్యమంతా విని యోగించి ఆమెను లొంగదీసికో ప్రయత్ని స్తాడు. కాని ఒక రాగానికి చలించే ప్రకృ తిగాదీమెది. తనతల్లి వెంకమ్మను గిరీశం కాపా డడం చూచి ఆమెకు ఇతనిపై కొంత విశ్వాసం యేర్పడుతుంది. పైగా వెంకటేశం గిరీశం సామా న్యుడు గాదని అతన్నిగూర్చి గొప్పగా అక్కతో చెప్తాడు-ని[illegible] కుటుంటే, గిరీశం వెంకటేశంకోసం వచ్చినట్లు వచ్చి, అతనికి పాఠం చెప్పేటట్లు వితంతుపునర్వివాహాలను గూర్చి, స్త్రీలకు జరిగే అన్యాయాలను గూర్చి ఉపన్యాసం ఇస్తాడు. [illegible] బుచ్చమ్మకు తాను మళ్లీ పెళ్లి చేసికోవచ్చు నన్న ఆశ జని స్తుంది. గిరీశం ఆమెతో తనకు ఆమెపై అగాధ ప్రేమ ఉన్నదని మర్నాడు జామిచెట్టు దగ్గర నీళ్లు తోడుండే బుచ్చమ్మకు తెలియజేస్తాడు. ఆమె యెదుట అప్పటి కప్పుడే ఒక భూతల స్వర్గాన్ని సృష్టించి దానికి తన్ను రాజును ఆమెను రాణిని చేసి అరచేతిలో వైకుంఠాన్ని చూపిస్తాడు. బుచ్చమ్మలో స్వార్థం తక్కువ- విషయలిప్స ఆమెలో గోచరించదు. గిరీశం బుచ్చమ్మతో తన దాంపత్యజీవితమంతా ఎలా ఉండబోతుందో ఉగ్గడిస్తూ అప్పుడు వెంకటేశం మనదగ్గరే ఉండి చదువుకుంటాడు. అప్పుడు బుచ్చమ్మ అంటుంది 'అలా అయితే మరి నాన్నకీ ఖర్చుండదు; నాన్నా అమ్మ వాడి చదువుకోసం [illegible]డ్రు. ఇంతవరకు మాట్లాడినదంతా 'మాటవరస' అని గిరీశం అంటే బుచ్చమ్మ 'అంతే కద' అని తన నేస్తం గాంబోట్లుగారి అప్పమ్మను పల్లాడమంటుంది. కాని గిరీశంగారు ఉత్తమ బ్రహ్మచర్యం, లోకోపకారం, ఆమెలాంటి దివ్యసుందర మూర్తికి, గుణవంతురాలికి తప్ప ఇంకొకరికోసం వ్యర్థం చేయదలచుకోలేదంటాడు. ఆమె ఇతని

(తరువాయి ౮ వ అట్టలో)

# రామప్పంతుల లౌక్యం

### శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు

కన్యాశుల్కం నాటకంలో రామప్పంతులు పాత్ర ఒక విధంగా చూస్తే విలన్ పాత్ర అనడానికి సందేహం లేదు. నాటకంలో యెక్కువ భాగాన్ని ఆక్రమించడమే కాక ప్రేక్షకుల హృదయాల్లో గూడా సుస్థిరమైన స్థానాన్ని సంపాదించుకొన్న గిరీశం పాత్ర కంటే గూడ రామప్పంతులికి కన్యాశుల్కం కథలో ఒక ప్రాధాన్యం వుంది. రామప్పంతులువంటి పాత్రలను కందుకూరి, చిలకమర్తి మొదలయినవారు తమ నాటకాల్లో ప్రవేశపెట్టినా, అది కేవలం వినోదం కోసం కల్పింపబడిన పాత్రలే కాని, కథలో వాటికి యేలాంటి ప్రాధాన్యమూ లేదు. రామప్పంతులు పాత్ర అలా కాక మానవుల్లో సహజంగా వుండే లోటుపాట్లతో నియోగిపు దర్జాను ఒలకబోస్తూ తన మాటలతో మనకు చక్కిలిగింతలు పెడుతుంది. సాధారణంగా యే నాటకంలో గాని విలన్ పాత్రలమీద మనకు సానుభూతి కలగడం అరుదు. కాని కన్యాశుల్కంలో అలా కాదు. రామప్పంతులు మాటలకు మనమూ నవ్వుతాం. అతడు చేసే జిత్తులకే, వాడే లౌక్యప్రజ్ఞకే మనమూ ఆనందిస్తాం. చివర అతని నిస్సహాయస్థితిని చూచి మనమూ జాలి పడతాం. రామప్పంతులలో పల్లెటూళ్ళల్లో వ్యవహారజ్ఞానం కొద్దిగా వున్న పెత్తందారూ, వూళ్ళో జట్టీలు పెట్టి పార్టీలు లేవదీసి అక్కడా యిక్కడా కూడా డబ్బు గుంజే చెట్టు కింది ప్లీడరు గుమాస్తాలు మనకు అవుపిస్తారు.

రామప్పంతులు మొట్టమొదటిసారిగా విజయనగరంలో మధురవాణి యింట్లో మనకు దర్శనమిస్తాడు. జేబులోనుండి చుట్ట తీసి పంటి కొనతో కొరికి 'పిల్లా! అగ్గిపుల్ల' అంటూ మనకు ప్రత్యక్షమవుతాడు. అగ్గిపుల్లకు మల్లె యితగాడు కొంపలు ముట్టించే రకంపాత్ర అని మనకు తొలిచూపులోనే అర్థమయేలా చేశారు అప్పారావుగారు. రామప్పంతులిది అసలు రామచంద్రపురం అగ్రహారం. లౌక్యప్రజ్ఞకు పేరు పొందిన నియోగిపు కుటుంబంలో పుట్టాడు. కాని చిన్నప్పుడే పిత్రార్జితం అంతా కరరావుడు చుట్టేశాడు. అప్పటినుండి జుట్టుకీ జుట్టుకీ ముడివేయడం, అక్కడా యిక్కడా నాలుగు డబ్బులు గుంజి కాలక్షేపం చేయడం-యిదీ అతని వరస. చింత చచ్చినా పులుసు చావనట్టు యెప్పుడూ పరాధీనపు బతుకే అయినా దర్జాలో మాత్రం యేమీ లోటు లేదు. చుట్ట తాగడం, సానిదాన్ని వుంచుకోవడం, గుర్రపు బగ్గీ యెక్కి రావడంవంటి అన్ని నియోగపు హంగులు అతనికి వున్నై. పరానికి సంబంధించినంతవరకూ రామప్పంతులు శాక్తేయుడు. అంచేత అతనికి కర్మతో పని లేదు. లోకం కోసం మాత్రమే అతడు తద్దినాలు పెట్టేవాడు. అయితే సానిదాన్ని యెందుకు వుంచుకున్నాడయ్యా అంటే 'కామి గాక మోక్షకామి కాడు' గనక.

తన లౌక్యాన్నిగూర్చి రామప్పంతులే ఒకచోట చెప్పిన నిర్వచనం అక్షరాలా ఆయనకే సరిపోతుంది. లౌక్యమంటే రామప్పంతులు భాషలో అసాధ్యాలు సాధ్యము, సాధ్యాలు అసాధ్యాలు చేయడం. తిరిగి లౌక్యానికీ, మోసానికీ చాలా భేదా వుంది. నమ్మిన చోట చేస్తే మోసమూ, నమ్మనిచోట చేస్తే లౌక్యమూను. ఉద్యోగధర్మం లౌక్యవృత్తి అని ఆ లౌక వృత్తిని భగవంతుడు కల్పించాడు. ఆ లౌక్య వృత్తి యెటువంటిదీ అంటే నిజాన్ని పోలిన అబద్ధమాడి ద్రవ్యాకర్షణ చేసేది. ఇలాంటి ధర్మసూక్ష్మాలు చాలా తెలుసు రామప్పంతులికి.

ఇంకా వ్యవహారంలో రామప్పంతులికి చాలా విద్యలు తెలుసు. కేసును తనకు విరుద్ధంగా రుజువు చేసే దస్తావేజుల్ని అమాంతంగా మాయ చేయగలడు. కాగితమైతే అగ్గిపుల్లతో ఫైసల్. తాటాకైతే నీళ్ళపాయ్యే. కొత్తజాతకం బనాయించడం అతనికి అయిదు నిమిషాలపని. కాని సిద్ధాంతి ముట్టుకు నాలుగు కాలాల పాటు చల్లగా వుండాలి. ఆయన దగ్గర పాతతాటాకులు, ఆలేఖాలు అటక నిండా వున్నవి. ముప్పైయేళ్లనాటి కాగితాలున్నాయి. వాటిలో క్రొత్త దస్తావేజుల్ని

యిట్టే సృష్టింపగలడు రామప్పంతులు. ఎవడైనా నూరు రూపాయలు ఫీజు క్రింద యిచ్చి ఖర్చులు పెట్టుకుంటే గ్రంథం నడిపించే సామర్థ్యం అతగాడికి వుంది. ఇన్స్పెక్టరు పేరు చెప్పి అమాయకులైన పల్లెటూరివాళ్ల దగ్గర యిరవై ముప్పై గుంజడం, అది తెలిసి పోలీసు వాళ్ళు వెంట బడడం, చావు తప్పి కన్ను లొట్ట పోయినట్టుగా యెలాగో ఆ గండం గడచి పబ్బం గడిపించుకోవడం- అతనికి నిత్యకృత్యం లాంటిది. ఏ వ్యవహారం అయినా పదోవంతో అయిదోవంతో ముట్ట చెపితే అతనికి పనికి రాదు. ఆయన బేరం యెప్పుడూ సగానికిసగమే. ఆతడి తలమీద ఎన్ని వెంట్రుకలున్నాయో, అన్ని వ్యవహారాల నతడు ఆపాటికే చూసే శాడు. ఇక కూట సాక్ష్యాల మాట చెప్పవలసిందే లేదు. ఊర్లాం బసవరాజుగారి సంభావనలరేట్లే సాక్ష్యాలకు కూడా ఆయన [illegible] చేశాడు. కుండనాలు వేసుకున్నవారికి మాత్రం అదనంగా ఓ రూపాయి జాస్తా.

ఇక ఫోర్జరీలు బనాయించడంలో అతన్ని మించిన వాడు ఆ చుట్టుపట్ల లేడు. ఆకాశ రామన్న వుత్తరాలు కొట్టడం, దొంగ సంతకాలతో వుత్తరాలు బనాయించడం, జాతకాలు జాతకాలే తారుమారు చేయడం-ఇవన్నీ అతనికి నిత్యక్రీడాకలాపాలు. ఆ తాలూకాలో సివిల్ మాజిస్ట్రేటులు యెక్కడొచ్చినా రామప్పంతులూ, పప్పులేని పులగం వుండదు. అతడికి యింగ్లీషు రాదే గాని యింగ్లీషే వచ్చి వుంటే జడ్జీల యెదుట పెళపెళ లాడించే వాడు. లుబ్ధావధాన్ల ప్రాణానికీ, డబ్బుకీ లంకె. డబ్బుకీ అతనికి స్నేహం కానీ, మరి యెవరితోనూ స్నేహం లేదు. అలాంటి వాడుకూడా వ్యవహారజ్ఞానం లేక పోవడం చేతా, కోర్టులంటే వల్లమాలిన భయంచేతా రామప్పంతులు సలహా కోరేడు. అతనికే అన్నమాటేమిటి? ఆ తాలూకాలో అందరి గతీ అంతే! మంత్రమంటే నియోగపు ప్రభువుదే మంత్రమని అనిపించుకున్నాడు.

విజయనగరంలో మధురవాణిని తన ఆడాలోకి తెచ్చుకొని, అక్కడి ఆమె ఋణాలూ, పణాలూ తీర్చేసి ఆవిడని రామచంద్రపురం అగ్రహారం లేవదీసుకు రావడానికి పూర్వం రెండేళ్లనుంచే రామప్పంతులు లుబ్ధావధాన్ల మీద యెలాగైనా అతని దగ్గర డబ్బు గుంజడానికి వ్యూహం పన్నాడు. అందుకోసం మొదట సిద్ధాంతిని గుప్పిట అతణ్ని జాగ్రత్తచేసుకున్నాడు. సిద్ధాంతి కూడా లుబ్ధావధాన్ల జాతకం యోగాదిగా మాసి శీఘ్రంలో వివాహ యోగం వుందన్నాడు. ఆ వివాహంవల్ల ధన యోగం వుందన్నాడు. దాంతో ముసలాడికి డబ్బొస్తుందనే ఆశ ముందుకీ, డబ్బు ఖర్చవుతుందన్న భయం వెనక్కీ లాగడం ఆరంభించింది. ఇంతట్లో రామప్పంతులు పందాను తయారు చేశాడు. లుబ్ధావధాన్లు తన అనుమానం తీర్చుకుందామని ఆయనకి జాతకం చూపించేసరికి రామప్పంతులు ప్రోత్సాహంతో ఆయన 'వివాహ ధన యోగాలు జమిలిగా వున్నాయి. అయితే మీరు పెద్దవాళ్లు. ఇప్పుడు మీకు పిల్ల నెవరిస్తారు? పెళ్లెలా అవుతుంది? ఇలాంటివి జరిగేదానికి వీల్లేని మహాయోగాలు జాతకాల్లో పట్టినప్పుడు గొప్ప మేలుకు బదులుగా గొప్ప కీడు సంభవిస్తుంది. అనగా మీకు మారకమో, ధననష్టమో సంభవిస్తుంది. గ్రహశాంతి చేసి బ్రాహ్మణ భోజనం బాహుళ్యం చేయండి. కొంత జబ్బో గిబ్బో చేసి అంతతో అరిష్టం పోతుంది. మంచిరోజు చూచి సూర్యనమస్కారాలు ఆరంభించండి' అని చెప్పేసరికి అవధాన్ల గుండె రెండు చెక్కలై వివాహ ప్రయత్నం ఆరంభించాడు. అంతటితో నూరుకోక రామప్పంతులు అగ్నిహోత్రావధాన్ల కూతురు జాతకం కూడా చెప్పడానికి అలవిలేనంత దివ్యంగా వున్నట్లు బనాయించడు. అది కాలు పెట్టిన యిల్లు పదియిళ్ళు అవుతుందని, అది పట్టిందల్లా బంగారం అవుతుందనీ చెప్పి వెఱ్ఱిబాగుల వాడయిన లుబ్ధావధాన్లుని నమ్మించాడు. నిజానికి పెళ్ళిపేరు చెప్పి నాలుగు డబ్బులు గుంజడమే రామప్పంతులు ఆశయమైనా మధురవాణికి కూడా ఆ రహస్యం తెలియగూడదని అతడి వుద్దేశం. మేజువాణీలో మధురవాణికి పదిరూపాయల సొమ్ము ముట్టడమే ఆవివాహం వల్ల తా నాశించిన ద్రవ్యాకర్షణ అని మధురవాణిని బుకాయించాడు. ఎంత సత్యకాలపు దయినా మధురవాణి ఆ మాత్రం వూహించుకొనలేక పోలేదు. మళ్ళ నిలదీసి అడిగేసరికి లుబ్ధావధాన్లు వెధవ కూతురు మీనాక్షి ప్రవర్తన మంచిది కాదనీ, నాలుగు రోజులకు ఒక

మారు అది పీకలమీదికి తెస్తూ వుంటుందనీ, సంసారం కూడ ఆవిడ దూబర చేస్తూ వుంటుందని, అంచేతే పెళ్ళైతే దాని ఆట కడుతుందనీ లుబ్ధావధాన్లు పెళ్ళికి తాను ప్రయత్నిస్తున్నాననీ చెప్పి యెలాగో సమాధానం చెప్పాడు. ఈ ఘట్టం ఘట్టమంతా రామప్పంతులు సమయస్ఫూర్తికీ, లౌక్యానికీ నిదర్శనం.

అసలు నాటక ప్రారంభంలోనే రామప్పంతులు మన కొక చిత్రమైన సన్నివేశంలో అవుపిస్తాడు. అప్పటి కింకా మధురవాణి గిరీశం ఆడాలోనే వుండేది. గిరీశం పట్టి బొట్లేరు ముక్కలు ప్రేలాడనీ, వాడి వుద్యోగం పూటకూళ్ళమ్మ యింట్లో దప్పిక్కి చేరి అరవచాకిరి చేయడమనీ ప్రగల్భాలు పలుకుతాడు. మధురవాణి యీ మాటలను ఆయనని అడుగుదునా అంటే 'తప్పకుండా, కావలిస్తే నేను చెప్పానని కూడా చెప్పు' అని బడాయి కొడతాడు. ఇంతలో అక్కడికి గిరీశం రానే వచ్చాడు. ఇంత బడాయి కొట్టిన వాడూ 'అన్నా! వేళ గాని వేళ వచ్చాడు గాడిదకొడుకు. తంతాడు కాబోలు! ఏవిటి సాధనం?' అని గజ గజ వణికిపోయి మంచంకింద దూరి దాక్కుంటాడు. మధురవాణి, గిరీశం మాటాడుకునే సందర్భంలో మధురవాణి పూటకూళ్ళమ్మ విషయం ప్రస్తావించేసరికి గిరీశం మండిపోయి 'చూడు నా తడాఖా. ఎవడీ మాటలు చెప్పాడో, వాడి పేరు తక్షణం చెబుతావా, చెప్పవా?' అనేసరికి మధురవాణి రామప్పంతులు పేరు చెప్పబోతూ 'రామ' అంటుంది. మంచం కిందున్న రామప్పంతు లది విని తన్ను బయట పెట్టుందేమో నని 'చచ్చాన్రా. పేరు చెప్పేసిం'దని కుంగి పోయ్యాడు. ఇంతలో మధురవాణి ప్లేటు మార్చి 'రామ రామ! ఒహరు చెప్పేదేమిటి' అని చిత్రంగా సర్దేస్తుంది. ఇంతలో పూటకూళ్ళమ్మ చీపురు కట్ట పుచ్చుకొని అక్కడికి రాగా గిరీశంకూడా మంచం కింద దూరుకుంటాడు. అక్కడ రామప్పంతుల్ని చూచి 'ఎవరన్నా మీరుమహానుభావులు? ఈమాత్రానికి మంచంకింద దాగోవాలా? మహానుభావా! నన్నడిగితే యిలాంటి లంజల్ని యిరవైమందిని మీకు కన్యాదానం చేతునే' అన్నాడు. రామప్పంతులు 'బతికాన్రా దేవుడా!' అనుకుంటూ, 'నువ్వురా బాబు దీన్నుంచుకున్నాన్' అన్నాడు. గిరీశం 'మాట వినపడలేదు. కొంచెం యిసుంటా రండి' అని అతన్ని తప్పించుకొని గోడవైపు చేరి పూటకూళ్ళమ్మ చీపురుకట్ట సరసంనుండి తప్పించుకొని బయట పడ్డాడు. పాపం ముందువైపు నున్న రామప్పంతులి వీపు మీద చీపురుదెబ్బలు పడ్డాయి. ఆఖరికి గిరీశం దగ్గర నెత్తిచపేటా పొందడమే కాక పూటకూళ్ళమ్మ దగ్గఱ కూడా 'నీ మొగతనం యేడ్చినట్టే వుంది' అనిపించుకున్నాడు.

తృతీయాంకంలో రామప్పంతులు తిరిగీ ఒక చిత్రమైన సన్నివేశంలో చిక్కుకున్నాడు. మధురవాణీ, రామప్పంతులుగారూ యిద్దరూ లుబ్ధావధాన్లు పెళ్ళివిషయమై మాట్లాడుకుంటూ వుండగా హెడ్ కానిస్టేబిలు ఆడవాళ్లు వున్నారన్నైనా చూడక లోపలికి తోసుకొచ్చాడు. 'రామప్పంతులుగారూ! ఇన్స్పెక్టరుకే టోపీ వేశావటే' అని హెడ్డు మధురవాణి యెదుట అడగానే రామప్పంతులు ప్రాణం నిలువునా యెగిరిపోయింది. 'గారూగారూ అనవయ్యా' అని గడబిడ చేసినా పూరుకోక హెడ్డు కాస్తా తన రహస్యం బయటపెట్టనే పెట్టినాడు. 'ఇనస్పెక్టరు పేరుచెప్పి రావినాయుడుదగ్గఱ పాతిక రూపాయలు లాగేవట.' 'ఇలా యెందఱిదగ్గఱ లాగేడో! రామప్పంతుల్ని నిల్చున్నపట్లాన్ని పిలకట్టుకు యీడ్చుకురా' అని కానిస్టేబులుతో ఖచ్చితంగా చెప్పి యినస్పెక్టరు పాళెం వెళ్ళిపోయినట్టు చెప్పాడు. తన పరువు కాస్తా కానిస్టేబులు తీసేస్తున్నాడని లోపల కోపంవున్నా పైకి యేమీ అనలేక 'చిన్నప్పుడు ఒక్క బళ్లో చదువుకున్నాం - యినస్పెక్టరూ, నేనూను. అంచేత అతని పిలక నేనూ, నా పిలక అతనూ లాగినా ఫరవా లేదు. రావినాయుడుమాట మాత్రం శుద్ధ అబద్ధం. మీరు ముందు పదండి, గుఱ్ఱం కట్టించుకుని స్టేషనుదగ్గర కలుస్తాను' అని నియ్యోగం వెలిగించాడు. స్టేషనుకు వెళ్ళి యెలాగో యినస్పెక్టరును సర్దుకోవచ్చు ననుకున్నాడు. కాని లాభం లేకపోయింది. తిరిగీ రూపాయలకోసమని మధురవాణి దగ్గరకే జవానును వెంట బెట్టుకొని రావలసి వచ్చింది. వచ్చీ రావడంతోనే మధురవాణితో 'ఏదీ మొన్న నీ కిచ్చిన రూపాయలు? సాయంత్రం మళ్లీ ఫిరాయిస్తాను. ఈ సైతాను ప్రాణం తింటు

న్నాడు' అన్నాడు. కాని మధురవాణి అతడిచ్చిన రూపాయలు పట్నం తోలేశానని చెప్పింది. అదృష్టవశాత్తూ కరటకశాస్త్రుర్లు అప్పుడక్కడికి వచ్చి వుండి మధురవాణితో మంత్రాంగం జరిపి రామప్పంతులు సహాయం కోసం యెదురుచూస్తూ వుండడంచేత ఆపాతిక రూపాయలూ తానే దాఖలు చేసుకొన్నాడు. దాంతో రామప్పంతులికి పరువు దక్కింది.

ఇక తరువాత తాపీగా కూర్చుని కరటకశాస్త్రుర్ల కథను విన్నాడు. 'మా బేరం యెప్పుడూ సగానికి సగ'మన్న రామప్పంతులు ఆఖరికి 'అయిదోవంతుకు యేమంటారు' అన్నాడు. కరటకశాస్త్రుర్లు 'యీ పాపపు సొమ్ముకే తమరు ఆశించాలండీ' అంటే 'పాపపు సొమ్ము మా దగ్గరకు రాగానే పవిత్రమై పోతుంది. ఒకర్ల కివ్వడంకోసమని గాని నాక్కావాలా యేవిటీ?' అని జెట్టుగానే వుండి అయిదోవంతుకే ఒప్పుకున్నాడు. కరటకశాస్త్రుర్లు వ్యవహారంలో కొంత తడి తగులడమే గాకుండా, ఆ తరవాత కరటకశాస్త్రుర్లు కుమారుడు మైనరని వాదించి ఆయన ఋణాలూ, పణాలూ గూడా యెగవేయించి తద్వారా కొంత డబ్బు గుంజవచ్చునని రామప్పంతులు యెత్తు యెత్తాడు. పాపం అతడు కరటకశాస్త్రుర్ల వ్యవహారంలో తనకు కొంత లాభిస్తుందనే వుద్దేశంతోనే అగ్నిహోత్రావధాన్లు రాసినట్టుగా లుబ్ధావధాన్లు పేర ఒక ఫోర్జరీ వుత్తరం బనాయించాడు. దాంతో ఆ సంబంధం లుబ్ధావధాన్లు మానుకుంటాడని, అప్పుడు కరటకశాస్త్రుర్ల సంబంధం నిశ్చయించి నాలుగు డబ్బులు చేతిలో పడేసుకోవచ్చునని అతడి వూహ! తన లౌక్యం ఫలోన్ముఖం అవుతుందని అతడు సంతోషిస్తుండగా యింతలో ఒక చిత్రం జరిగింది. లుబ్ధావధాన్లు అగ్గిమండిపడుతూ మధురవాణి యింట్లోకి ఒక వుత్తరం చేత బట్టుకొని వచ్చాడు. అది చూచి రామప్పంతులు అది తాను బనాయించిన వుత్తరమే నని భయపడ్డాడు. తీరా వివరం తెలుసుకోకుండానే రామప్పంతులు ఆ రహస్యం కాస్తా మధురవాణి చెవిలో పడేశాడు. లుబ్ధావధాన్లు కోపంతో గిరుక్కుమని వెళ్లిపోతుంటే, లుబ్ధావధాన్లు అగ్నిహోత్రావధాన్లుకి తిరిగీ జవాబు రాయడం సంభవిస్తే ఫోర్జరీకేసు తనమీదికి వస్తుందేమోనని రామప్పంతులు భయపడ్డాడు. అయితే చక్రం అడ్డువేస్తానని అప్పుడు మధురవాణి తిరిగీ లుబ్ధావధాన్లని లోపలికి తీసుకొచ్చి బుజ్జగిస్తుంది. ఆ తరవాతగాని రామప్పంతులికి అది తాను రాసిన వుత్తరం కాదనీ, గిరీశం రాసిన వుత్తరమనీ, తాను అనవసరంగా భయపడ్డాననీ తెలిసింది కాదు. ఇంతలో రామప్పంతులు బనాయించిన వుత్తరమూ వచ్చింది. గిరీశం వుత్తరం చూసుకొని ఖర్చవుతుందని మండిపడుతుండిన లుబ్ధావధాన్లు, అగ్నిహోత్రావధాన్ల వుత్తరం చూచుకొని పెళ్లి తప్పిపోయిందని దిగాలుపడ్డాడు. అప్పుడు తన పాచిక పారడం కోసం యెదురుచూస్తున్న రామప్పంతులు, సమయం చూసి కరటకశాస్త్రుర్ల సంబంధం కుదిర్చాడు. కరటకశాస్త్రుర్లు పిల్లకు యేమైనా సరే పెట్టవలసిందని కోరగా లుబ్ధావధాన్లు ససేమిరా పెట్టనన్నాడు. అసలు వ్యవహారమే చెడుతుందేమోనని భయపడి రామప్పంతులు లుబ్ధావధాన్లుని యెలాగో ఒప్పించి పెళ్లిలో మధురవాణి కంటెను పిల్లకు యెరువుగా పెట్టడానికి ఒప్పిస్తాడు-పాపం యీ కంటే చివరికి అతడి కొంప ముంచింది.

రామప్పంతులు పెళ్లికి లౌక్యాల్ని సిలవడానికని పెద్దపాలెం పోయి వుండగా, కరటకశాస్త్రుర్లు తంత్రం పన్ని పంచరాత్ర వివాహం యేకరాత్ర వివాహం చేసి, తుదకు అనుకున్న ముహూర్తానికి కాక నాలుగు ఘడియల రాత్రుండగానే పెళ్లయిందనిపించి కన్యాశుల్కం వళ్లో వేసుకొని పరారీ చిత్తగించాడు. ఇదంతా యేమీ తెలియని రామప్పంతులు ముహూర్తవేళకు తాసామరఫా, కావిళ్లూ, చాకళ్లతో ప్రవేశించేసరికి సర్వం సంపూర్ణమని తెలియవచ్చింది. గుంటూరుశాస్త్రుర్లు తనకే టోపీ వేశాడని రామప్పంతులు విస్తుపొయ్యాడు. లుబ్ధావధాన్లు దగ్గిర కెళ్లి గుంటూరు శాస్త్రుర్లకోసం తాను పెళ్ళిఖర్చులకని బదులిచ్చిన నూరు రూపాయలూ అక్కడ పెట్టమని గదమాయించాడు. అంతటితో వూరుకోక గెండో పెళ్లిపిల్లనో, శూద్రపిల్లనో లుబ్ధావధాన్లకి అమ్మివుంటాడని యింకో పాచిక వేశాడు. దాంతో లుబ్ధావధాన్లు తుదకు లొంగిపోతాడనే అనుకొని యింటికొచ్చాడు.

కరటకశాస్త్రుర్ల శిష్యుడు కంటెతో పారిపోయివచ్చి మధురవాణి కంటెను మధురవాణి

కిచ్చి దాసరి వేషంతో దౌడు తీశాడు. అది తెలిసి రామప్పంతులు గుండెగుండె బాదుకున్నాడు. తన కంటె తెచ్చి యిస్తే గాని తలుపు తీయ నని మధురవాణి భీష్మించుకుంది. లుబ్ధావధాన్లు దగ్గర కెళ్లి అడిగితే రెండోపెళ్లి ముండని పెళ్లిచేశాడని అసలే మండి పడుతూన్న లుబ్ధావధాన్లు, కంటె విషయం తన కేమీ తెలియదన్నాడు. అంతటితో ఆట కట్టిపోయింది. ఇక ఒక్కటే తోవవుంది రామప్పంతులికి. లుబ్ధావధాన్లు కూతుర్ని మీనాక్షిని బుజ్జగించి ఆచోకీ తెలుసుకుందా మనుకున్నాడు. రాత్రికి రాత్రి రామప్పంతు లింటికి పోయి అసిరిగాడి చెయ్యి తడిచేసి, మీనాక్షిని లేవదీసుకొనిపోయి పెళ్లాడతా నని మాట యిచ్చి, కంటెవిషయం తెలపమంటాడు. మీనాక్షి దీపం ఆర్పి ప్రమాణం చేయమంటుంది. ఆలాగే దీపం ఆర్పి చీకటిలో మీనాక్షిని కౌగిలించుకుంటూండగా, లుబ్ధావధాన్లు మేలుకుని అలికిడి విని వచ్చి యిద్దరికీ బడితపూజ చేసి తన్ని తగలేశాడు. తిరిగీ రామప్పంతులు మధురవాణి యింటికి వచ్చేసరికి వెంటనే మీనాక్షి తయారయింది. ఎన్నివిధాల చెప్పినా మీనాక్షి వెనక్కి వెళ్లిపోడానికి యిష్టపడలేదు. మధురవాణి ససేమిరా తలుపు తీయనంది. ఇక చేసేది లేక రామప్పంతులు ఆ నిశిరాత్రిలో చెరువుగట్టుమీది కెళ్లి అక్కడ ఆ నాలుగు ఘడియలూ కాలక్షేపం చేద్దా మనుకుంటే దాసరివేషంలో వున్న కరటకశాస్త్రుల్ల శిష్యుడు తత్త్వాలు పాడుతూ అక్కడికీ వెంట బడ్డాడు. ఇంతలో తెల్లారిపోయింది. పెళ్లికోసమని కృష్ణారాయపురం అగ్రహారంనుండి అగ్నిహోత్రావధాన్లు బళ్లమీద సపరివారంగా ఆ చెరువుగట్టుకే చేరుకున్నాడు. తన లౌక్యం తనకే బెడిసికొట్టిం దని యేడుస్తూవుండిన రామప్పంతులికి మరో అవకాశం చిక్కింది. అగ్నిహోత్రావధాన్లుని లుబ్ధావధాన్లుమీదికి ప్రయోగించాడు. అతడిదగ్గఱ యేమీ పప్పు లుడక్క, అగ్నిహోత్రావధాన్లు వెనక్కి తిరిగి వచ్చాడు. లుబ్ధావధాన్లమీద డేమేజీ దావా వేస్తేగాని లాభంలేదని అగ్నిహోత్రావధాన్లు మురుగు తాకట్టు పెట్టించి ఒకవంక గ్రంథం సాగించాడు. లుబ్ధావధాని తన రెండోపెళ్లి పెళ్లాన్ని హత్యచేశాడనీ, సోదా వేయవః సిందనీ పోలీసులకి ఖబురెట్టాడు. ఈ విషయమై చర్య తీసుకోవలసిం దని కలెక్టరుకి ఆకాశరామన్న అర్జీలు కొట్టాడు.

డిప్టీకలెక్టరు నాయుడు కదా అని, వకీలు నాయుడికి యింగ్లీషు రాకపోయినా ఆయన దగ్గఱ కాస్త లౌక్యం చేయవచ్చు నని ఆశపడి అగ్నిహోత్రావధాని కేసులో వకీలు నాయుడికి వకాల్తినామా యిప్పిద్దా మనుకున్నాడు రామప్పంతులు. కాని ఆ చాదస్తుడు అగ్నిహోత్రావధాని డబ్బు పెట్టడం యిష్టంలేక ఆ యెత్తు కాస్త చెడగొట్టాడు. తుదకు అనుకున్నంతా అయింది. నాయుడు రామప్పంతులు పీకమీదికి తెచ్చాడు. అగ్నిహోత్రావధాని కూతురి జాతకం రామప్పంతులు బనాయించిందే నని నాయుడు కలెక్టరు గారికి చెప్పేశాడు. దానికి తోడు అగ్నిహోత్రావధానికూడా, జాతకంలో భవసంవత్సరంలో పుట్టినట్లు తాను బనాయించగా Cross Examination లో అంగీరసలో పుట్టిందని యేడ్చాడు. ఫోర్జరీ కేసు రామప్పంతులు నెత్తిని పడ్డానికి సిద్ధంగా వుంది. పరిస్థితులు యెదురు తిరగడంమూలాన కేసు అడ్డంగా కాకుండా తనకు యెదురు కూడా తిరిగింది.

పోనీ సౌజన్యారావు యోగ్యుడూ, ధర్మస్వరూపుడూ, చాలా గొప్ప తెలివయినవాడూ- అని అతణ్ణి ఆశ్రయించాడు. కాని సౌజన్యారావు రామప్పంతులులాంటి నియ్యోగపాడి బుద్ధిసత్తువ అర్థం చేసుకోలేక పొయ్యాడు. అసలు రామప్పంతు లింకా ఉపోద్ఘాత మన్నా ప్రారంభించలేదు. బయటికి నడవమని సౌజన్యారావు యేకవచన ప్రయోగం చేశాడు. అంతటితో పాచిక పారక తోక ముడుచుకుని వెనక్కి తగ్గాడు రామప్పంతులు.

రామప్పంతులి లౌక్యం రామప్పంతులికే బెడిసికొట్టింది. కానయితే యీ లౌక్యప్రజ్ఞంతా మధురవాణి తెలివితేటలకు ముందు దిగదుడుపే. లుబ్ధావధాన్ల పెళ్ళిమాటల సందర్భంలో రామప్పంతుల లౌక్యం చచ్చుపడ్డట్టు మనకు తెలుస్తుంది. ఆ పెళ్లికి గిరీశం వస్తాడని చెప్పగానే రామప్పంతులు హడలెత్తిపొయ్యాడు. కాని పైకిమాత్రం అతడు రానేరా డన్నాడు. వస్తాడని రూఢిగా మధురవాణి చెప్పగానే యేది గతి అని తేలిపొయ్యాడు.

బయటికి కనబడకుండా ఆ నాలుగురోజులూ గడియ వేసుకొని యింటిలోనే వుండిపోతే సరి అని కొంత సర్దుకున్నా యింతలో గిరీశం తలుపు గొళ్లెంపెట్టి కొంప ముట్టిస్తేనూ అని భయమెత్తి పొయ్యాడు. కాని మధురవాణి చక్రం అడ్డు వేస్తానని అతణ్ణి కాచింది. 'పెళ్ళికి పూటకూళ్లమ్మని వంటకి కుదురుస్తే సరి. గిరీశం ఆ పెళ్లికి రా' డని మధురవాణి ఉపాయం చెప్పగానే రామప్పంతులికీ ఆ ఆలోచన బాగానే వుందని పించింది. అలా పెట్టినా గిరీశం వస్తాడేమో నని సందేహం వెలిబుచ్చగా, మధురవాణి అలా యెన్నటికీ జరగదంది. ఇలా రామప్పంతులి లౌక్యప్రజ్ఞంతా మధురవాణి తెలివితేటలకు ముందు యీ ఘట్టంలో తేలిపోయింది అలాగే కరటకశాస్త్రి దగ్గరకూడా. ఇతడు ఒకందుకని యెత్తు వేస్తే, ఆయెత్తు కాస్తా చెడగొట్టాడు కరటకశాస్త్రులు. సౌజన్యరావు దగ్గర లౌక్యం చూప దలచుకోగా అతడీతగాణ్ణి దగ్గరికే చేరనివ్వలేదు. ఇలా అంతా రామప్పంతులికి యెదురే అయింది.

రామప్పంతులు విజయనగరంలో మధురవాణి ఋణాలూ పణాలూ తీర్చడంకోసమని రెండొందల రూపాయ లిచ్చి, ఆ తరవాత ఆవిడని తన స్వగ్రామమైన రామచంద్రపుర అగ్రహారానికి తీసుకొచ్చి, అప్పటినుండి నెలజీతంయిస్తూ తన ఆడాలోనే వుంచుకొన్నాడు. కాని రామప్పంతులు మహాఅనుమానం మనిషి. విజయనగరంలో కూడా మధురవాణి గిరీశం పేరెత్తితే ఉడుకెత్తేవాడు రామచంద్రపురం అగ్రహారంలో సరేసరి. తాను హెడ్ కానిస్టేబుల్ వెంట స్టేషనికి పోతూ గుమ్మందాటి నాలుగడుగులు వెళ్ళి తిరిగి వచ్చి 'యీ వూళ్ళో మా దుర్మార్గులున్నారు. నా స్నేహితుల మనీ బంధువుల మనీ పేరు పెట్టుకొస్తారు. రానీకుమా' అని చెప్పి తలుపు పైనించి గడియవేసి లోపలగడియ వేసుకోమని మధురవాణిని మందలించి వెడతాడు. స్టేషనునుండి తిరిగి వచ్చి రావడంతోనే కరకట శాస్త్రిని చూచి అతనితో మెల్లగా లోపలికి యెవరైనా వెళ్లారా' అని అడిగాడు. కరటక శాస్త్రి గట్టిగా 'యెవరో యిద్దరు ముగ్గురు వచ్చారు గాని మీ యిల్లాలుగారు వచ్చి పైకి పొమ్మని గెంటేశారు' అని కార్య సాధకం మాత్రం ప్రయోగించాడు. లుబ్ధావధాన్ల పెండ్లికి లౌక్యల్ని పిలవడం కోసం పెదపాలెం వెళ్లి తిరిగివచ్చి అసలు విషయం తెలుసుకుని విస్తుపోతూ వుంటే పూజారి, మధురవాణి రామప్పంతులు లేక పోవడం మూలాన బ్రాహ్మణ్యాం యావన్మందీ గెడ్డం పట్టుకొని యెంత బతిమాలుకొన్నా పాడింది గాదనీ, కొండిభొట్లు అంతసేపూ హెడ్ కానిస్టేబుగారితో మాట్లాడుతూ నిలుచుందనీ పరస్పర విరుద్ధంగా చెప్పే సరికి రామప్పంతులి హృదయంలో అనుమానం బలపడింది. ఇంటికి పోతూ కొండిభొట్లుని వెంట పెట్టుకొని వెడుతూ దారిలో మళ్ళీ ఆవిషయం ప్రస్తావించాడు. అతడూ ఔనని ఒకసారీ, కాదని ఒకసారీ చెప్పి, మధురవాణి మాకొడ్డ మనిషని చెప్పేదాకా రామప్పంతులిక తృప్తి కలగలేదు. లుబ్ధావధాన్లు జుట్టుని మధురవాణి సవరించడం, అతని ఛాతీ యెంతుందో నని కొలవడం - యివేమీ రామప్పంతులికి సరిపడలేదు. వకీలు నాయుడు మధురవాణి బస పెరటి దొడ్డివేపునుంచి వస్తుండగా చూచి వీడు కూడా మధురవాణిని మరిగాడా యేమిటి ? వీణ్ణి యీ కేసులోనుండి తప్పించెయ్యాలి అని అప్పటినుండి ఆ ప్రయత్నంలో నిమగ్నుడవుతాడు. మొత్తంమీద రామప్పంతులికితానుతప్ప మధురవాణితో యెవరూ మాట్లాడరాదనీ, ఆవిడ యెవరినీ చూడరాదనీ మనస్సులో యెంతో యిది వుండేది. కాని దానికి విరుద్ధంగా యెంత పిసరు జరిగినా అతడు సహించలేక పొయ్యేవాడు.

ఆఖరుకి ఫోర్జరీ మాట కోర్టులో రాగానే సన్నసన్నగా ఆ ఆవరణనుండి జారుకున్నాడు. అగ్నిహోత్రావధాన్లూ, నాయుడు 'రామప్పంతులేడీ, రామప్పంతు లేడీ'అని వెదుక్కునే సమయానికి వారిపూరికి సగం తోవదాకా పుడాయించాడు. తాను అనుకున్న దంతా, తాను చేశిందంతా తనకే యెదురుతిరికి బెడిసికొట్టడంచేత అతడూ గిరీశంలాగే 'డామిట్ - కథ అడ్డంగా తిరిగింది' అని అనుకోక తప్పలేదు. నిజానికి రామప్పంతులికథ అడ్డంగానే తిరిగింది !

# వసంతసేన-చింతామణి-మధురవాణి

శ్రీ సెట్టి ఈశ్వరరావుగారు

మహాకవి గురుజాడ అప్పారావు చేసిన అపూర్వ సృష్టి-మధురవాణి. 'కన్యాశుల్కం' లోని ఏపాత్రా, శిల్పదృష్టితోనూ, పాత్రపోషణ దృష్టితోనూ చూస్తే, మధురవాణి పాత్రకు యీడురాదని గట్టిగా చెప్పవచ్చును. నాటక కర్త తాను సృష్టించిన యీపాత్ర తననే ముగ్ధుణ్ని గావిస్తూ వుందని, ఒక సందర్భంలో యీ పాత్రపట్ల తన మమకారాన్ని వెల్లడించారు. తన సృష్టికర్తనే మురిపించినటువంటి అద్భుతమపాత్ర అన్నమాట, మధురవాణి.

జీవితంలో గాని, సాహిత్యంలో గాని సాధారణంగా మహిళామణులుగా పరిగణింపబడుతూ వున్నవారు పతివ్రతలు. ఇప్పుడంతగా లేకపోయినా, పూర్వం యిటువంటి అభిప్రాయం ప్రబలంగా వుండేది. కాని మధురవాణి యిందుకు పూర్తిగా భిన్నమైన సృష్టి.

ఈమె పతివ్రత కాదనీ, అసలు యీమెకు పతిలేడనీ మనకు తెలిసిన విషయాలే. జన్మవల్ల- ఆమెకా అదృష్టం అనండి, అవకాశం అనండి కలగలేదు. పుట్టుక, పెంపకమూ ఆమెను దుర్వృత్తిలో ప్రవేశపెట్టాయి. కాని అవినీతిలోనే పుట్టినా, అవినీతిలోనే పెరిగినా మహోన్నతమైన నైతికదృష్టిని అలవర్చుకుందీమె. పరమహేయమైన అవినీతినుండి నైతిక మార్గానికి పరివర్తన—అంటే ఉత్తరధ్రువంనుండి దక్షిణ ధ్రువానికి గమనాన్ని అన్నమాట—సాధించడానికి, యీమెకు జీవితంలో అనుకూలమైన పరిస్థితులేవీ లేవు. స్వీయానుభవం చేతా, స్వీయచింతనచేతా, స్వీయకృషిచేత యీమె బహు కష్టసాధ్యమైన మార్గాన్ని గడచి గట్టెక్క గలిగింది. కులవృత్తియైన వేశ్యావృత్తిలో వుంటూనే ధర్మచింతనూ, పరోపకారబుద్ధినీ అలవర్చుకుని తాను పాపపంకంనుండి బయటపడి, కష్టాలలో కూరుకపోయినవారిని వెలికితీసి ఉద్ధరించ గలిగిందీమె. అందుచేతనే సౌజన్యారావువంటి పెద్దమనిషి యీమెను "నువ్వు మంచిదానివి. యెవరో కాలుజారిన సత్పురుషుడి పిల్లవై వుంటావు" అంటాడు.

ఈమె ప్రతిభాసామర్థ్యాలు కూడా సామాన్యమైనవి కావు. కాటికి కాళ్లు చాచుకునివున్న వృద్ధుడు లుబ్ధావధాన్లుకు, తన పసిపిల్లను యిచ్చి పెళ్లిచేయడానికి పూనుకుంటాడు పరమ మూర్ఖుడు అగ్నిహోత్రావధాన్లు. సర్వసన్నాహాలు జరిగిపోయిన తరువాత యీ పెళ్లిని తలక్రిందులు చేయడం, కరటకశాస్త్రి శిష్యునితో లుబ్ధావధాన్లుకు పెళ్లిని కుదర్చడం, జిత్తుల మారి రామప్పంతుల్ని సైతం మూడు చెరువుల నీళ్ళు తాగించడం మధురవాణి సద్బుద్ధికీ, పరోపకారచింతకూ తార్కాణాలైనట్లుగానే ఆమె ప్రతిభాసామర్థ్యాలకు కూడా తార్కాణాలు.

మధురవాణి చాకచక్యాన్ని, చలాకీతనాన్ని చిత్రించడంలో కూడా అప్పారావుగారు అపూర్వమైన ప్రతిభను ప్రదర్శించారు. కరటకశాస్త్రి తన చెల్లెలి కూతురికి (అగ్నిహోత్రావధాన్లు కూతురు--సుబ్బి) షష్టిపూర్తి వయసు దాటిన లుబ్ధావధాన్లుతో పెళ్లి తప్పించడానికి వేసిన పథకానికి మధురవాణి నడిపిన హంగు, యిచ్చిన మద్దతు నిశే వెల్లడిస్తుంది. "కన్యాశుల్కం" నాటకంలోని యించుమించు ప్రతిపాత్రా, మధురవాణి ఎత్తుగడలకు తలక్రిందులైనవే. ఆమె అందర్నీ బొమ్మల్ని చేసి ఆడిస్తుంది. పేరుమోసిన వకీలూ, విద్యాధికుడూ అయిన సౌజన్యారావు కూడా ఆమె క్రాసెగ్జామినేషన్‌కు తట్టుకోలేక పోతాడు; "అట్టే సేపు నువ్వు నాయెదుట గాని నిలిచివుంటే, నువ్వు యేతగువు తీరిస్తే ఆ తగువుకు వొప్పుదల అవుతానేమో అని భయం వేస్తూంది" అంటూ తన నిస్సహాయతను ప్రకటిస్తాడు.

"కన్యాశుల్కం" లో నాటకం సాగుతూ వున్నకొద్దీ మధురవాణి పాత్ర పుష్పంలాగ వికసిస్తూ, సువాసనలు వెదజల్లుతూ నిండు జీవంతో మనకళ్ళ ఎదట సాక్షాత్కరిస్తుంది. ఈనాటకంలోని ఏపాత్రనూ... ఉన్నత కళా ప్రమాణాల దృష్టితో కూడా—అద్భుతంగా లేదని అనలేము; అదేవిధంగా మధురవాణి అన్నిటినీ మించిన పరమాద్భుత పాత్ర కాదని అనడం కూడా సులభమూ కాదు, సాధ్యమూ

కాదు. మనసాహిత్యం అంతట్లోనూ, యీపాత్ర నిర్మాణంస్థాయిని అందుకున్న శీలాన్ని చూపడం ఏమంత తేలికైన పనికాదు. తిక్కన ద్రౌపదీ పాత్రపోషణను సాటిలేనిదానిగా విజ్ఞులు చెపతారు. దేశకాలపాత్రలలో ఎంతో భిన్నత్వం వున్నప్పటికీ, మధురవాణి చిత్రణను దానికి సాటియైనదానిగా చెప్పడం ఎంతమాత్రమూ అతిశయోక్తి కాదు.

తన పూర్వజీవితపు అంధకార కూపంనుండి సన్మార్గానికీ, సజ్జనత్వానికీ హఠాత్తుగా ఎగిరి తేజశ్శిఖరాలను అందుకున్నది కాదు, మధురవాణి. జీవితమార్గంలో ఎదురైనా లేమిగా, కష్టసుఖాలను అనుభవించినది మధురవాణి; మంచి చెడ్డలను పుస్తకాలనుండో బోధనలనుండో అవిమర్శకంగా గ్రహించి, శీలాన్ని నడిపిన మనిషి కాదీమె; స్వానుభవం వల్ల యీమె మంచిచెడ్డల తత్వం తెలుసుకొని తన నడతకీ, బ్రతుకుకూ ఒరవడులు దిద్దుకుంది. ఈ వికాసాన్నే గురజాడ అప్పారావుగారు కళ్ళకు కట్టినట్టుగా తన నాటకంలో చిత్రించారు.

నాటక ప్రారంభంలో గిరీశంవంటి తుంటరిని, రామప్పంతులువంటి జిత్తులమారిని ముప్పతిప్పలు పెట్టే [illegible] మనిషిగా కనిపించే మధురవాణి క్రమంగా సాగుతూ వున్నకొద్దీ దయా దాక్షిణ్యాలనూ, పరోపకారబుద్ధినీ, వేశ్యావృత్తిపట్ల జుగుప్సనూ, సంసార జీవిత వాంఛనూ, సత్పురుషులపట్ల భక్తిభావాలను గలదిగా రూపొందుతుంది. ఈ పరిణామాన్ని, పరివర్తనను చిత్రించడం అప్పారావుగారివంటి సిద్ధహస్తులకు మాత్రమే సాధ్యమైనపని. దేవతల గుణాలతోనూ, అతిమానుష ధర్మాలతోను కాకుండా, యీలోకపు మంచిచెడ్డలకు అతీతంగా లేని మానవకాంత రూపంలో మధురవాణి శిల్పాన్ని మలచడం, తీర్చిదిద్దడము అప్పారావుగారికి కళాబ్రహ్మ పదవిని చేకూర్చింది.

* * *

"కన్యాశుల్కం" రచనాకాలంలో ఆంధ్రదేశంలోని వాతావరణాన్ని అర్థంచేసుకుంటేనే గాని మధురవాణి పాత్ర సృష్టిలోని ఘనతను తెలుసుకోలేము. వీరేశలింగంగారి సంఘసంస్కరణోద్యమంలో బాల్యవివాహాలూ, వృద్ధవివాహాలూ, కన్యాశుల్కాలూ మొదలైన స్త్రీ సమస్యకు సంబంధించిన వాటిపైనే కాకుండా వేశ్యావృత్తిపైనకూడా తీవ్రమైన దాడిసాగింది. ఈ దాడి చేసేవారిలోని ఒక వర్గానికి ప్రతినిధి గిరీశం, యింకో వర్గానికి ప్రతినిధి సౌజన్యారావు. గిరీశం లోకం మనుష్యత్వం మాటలకు మాత్రమే పరిమితం అయితే; సౌజన్యారావు త్రికరణశుద్ధి గలవాడు. అయితే యీ సమస్యపైని ఆయన అభిప్రాయాలు అంత సహేతుకమైనవి కావు. ఆనాటి ఉద్యమంలోని ఛాందసాన్ని అవి ప్రతిబింబిస్తాయి. వేశ్యాసంపర్కం కలవాడు ఎన్నడూ మంచివాడు కానేరడనే కాకుండా అటువంటి వారిని చూడకూడదు, వారితో మాటాడకూడదు అనికూడా అభిప్రాయం గలవాడాయన. మధురవాణికూడా వేశ్యావృత్తికి వ్యతిరేకమే; కాని "సానిలో మంచి వుండకూడదా? మంచి ఎక్కడున్నా గ్రాహ్యం కాదా?" అని సౌజన్యారావును అడుగుతుంది; "మృచ్ఛకటిక"ను ఉదాహరిస్తుంది. "వేశ్యలను దేవాలయములలో భగవంతుణ్ణి చూడడమునకు పోవద్దనుగదా, సత్పురుషులైన తమవంటివారి దర్శనమునకు నిరోధమా?" అని ఆయనను ప్రశ్నిస్తుంది. అంతేకాదు. సౌజన్యారావును ఒప్పిస్తుంది కూడా. వేశ్యావృత్తి గురించి ఆకాలంలో ప్రబలంగా వున్న భావాలకంటె, 'లోకమందలి మంచి చెడ్డలు లోకులెరుగుదురా?' అని వ్రాసిన మంచి చెడ్డల మర్మమెరిగిన అప్పారావుగారి భావాలు ఎక్కువ సమంజసమైనవని మధురవాణి పాత్ర నిరూపిస్తుంది; "సానికి మంచితో పనివుండదు" దన్న అభిప్రాయానికి విరుద్ధంగా, "వసంతసేనవంటి మనిషి వెర్రికవీశ్వర్ల కల్పన" లోనే కాక, లోకంలో వుండ సాధ్యమైనదే నని రుజువు చేస్తుంది.

ఇప్పుడు కేవలం జారత్వానికి మారుపేరుగా పరిగణింపబడుతోన్న వేశ్యాకులం, పూర్వం, "కన్యాశుల్కం" రచనాకాలానికి కూడా సంగీత సాహిత్య నృత్యకళలకు, రసజ్ఞతకూ పుట్టినిల్లుగా వుండేది. రాజాస్థానాలలోనూ, దేవాలయాలలోనూ వీరు తమ నృత్యగానాలతో ఆనందింప జేసేవారు; గౌరవాన్ని పొందేవారు. వీరిలో తమకళాప్రావీణ్యంచేత పండితుల మెప్పులను అందుకున్నవారు కూడా వుండేవారు. కులంవల్ల హీనవృత్తిని చేపట్టిన దాసీలత.

పరోపకారబుద్ధి మొదలైన సద్గుణాలుగలవారు సైతం వేశ్యాకులంలో కనిపించడం అరుదేమీ కాదు. వేశ్యాకులంలోని మంచి చెడ్డలను రెంటినీ చూపి, మధురవాణి పాత్రను చిత్రించడంలో కర్తవ్యబోధను చేయడం అప్పారావుగారి లక్ష్యమైనట్లుగా వుంది. వేశ్యాకులంలోని ఉత్తమ సాంప్రదాయాలతో పుట్టిపెరిగిన దానిగా, తల్లి తరిఫీదులో విద్యాసౌందర్యాలు రెండూ దోహదం చేసుకున్న దానిగా మధురవాణి "కన్యాశుల్కం"లో ప్రదర్శింపబడింది. అంతేకాదు, "మంచివారియెడల మంచిగానూ, చెడ్డవారియెడల చెడ్డగానూ వుండమని" కూడా మధురవాణికి తల్లి ఉపదేశం. కాని ఆమె సౌజన్యారావు సలహాను విన్నతర్వాత "తమ వాక్యం గురూపదేశంగా భావించి యిటుమీదట చెడ్డవారియెడల కూడా మంచిగా వుండడమును ప్రయత్ని"స్తుంది.

వేశ్యావృత్తిమీద జుగుప్స అంకురించినప్పటినుండి మధురవాణి బుద్ధి యెలా పరిపక్వత చెందిందో, ఆమె 'ఆదర్శశిఖరాలను అందుకోడానికి ఎలా కృషి చేసిందో ఉదాహరించడమంటే, "కన్యాశుల్కం" నాటకమంతట్నీ యించుమించుగా ఉదాహరించవలసి వుంటుంది. కాబట్టి కొన్ని ముఖ్య ఘట్టాలను మాత్రం పరిశీలించి, మధురవాణి పాత్ర పరిణామాన్ని గమనిద్దాం.

సాని వలపు—

'మధు—...బతుకనేది వుంటే' వలపు వన్నె తెస్తుంది. అంగడివానికి మిఠాయిమీది ఆశా, సానిదానికి వలపూ మనస్సులోనే మణగాలి; కొద్దికాలం వుండే యవ్వనాన్ని జీవనాధారంగా చేసుకొన్న మా కులానికి వలపు ఒక్కచోటే.

కరటకశాస్త్రి—యక్కడో?

మధు—బంగారంమీద. శృంగారం వన్నె చెడినదగ్గరనుంచీ, బంగారంగదా తేటతేవాలి. ఆ బంగారం మీకు ధారపోస్తూవున్నప్పుడు నాస్నేహం యెన్నసేల?' అంటూ తిరిగి వస్తుందన్న ఆశ అట్టే లేకపోయినా, కష్టపడి ఆర్జించిన కంటెను కరటకశాస్త్రి కిచ్చివేస్తుంది.

వేశ్యల ద్రవ్యాకర్షణ, దయాదాక్షిణ్యాలు—

'మధు—...వృత్తిచేత వేశ్యనిగనక చెయ్యవలసినచోట ద్రవ్యాకర్షణచేస్తానుగాని, మధురవాణికి దయాదాక్షిణ్యాలు సున్న అని తలచారా? మీ తోడబుట్టుకి ప్రమాదం వచ్చినప్పుడు నేను డబ్బుకి ఆశిస్తానా?' అని కరటకశాస్త్రికి చెప్తుంది, సాయం చేస్తే సంతోషపెడతానని అతను అన్నప్పుడు.

మధురవాణి లేకపోతే సృష్టికి చాలా లోపం వచ్చి వుండేదని కరటకశాస్త్రి చేసిన పొగడ్తలకు 'సృష్టికల్లా వన్నె తెచ్చిన మధురవాణి అనే వేశ్యాశిఖామణి గిరీశంగారివంటి కుక్కలపాత్తుకే తగివున్నది గాని, సౌజన్యారావుపంతులుగారివంటి సత్పురుషులను చూడడమునకైనా అర్హతకలిగి వుండలేదు' అని జవాబు చెప్పి తనస్థితిని గ్రహిస్తుంది. 'రాయబారాలు' పంపుతోన్న, 'చేతికముకలేని' డిప్టీ కలెక్టరంతటివాడి దగ్గరికి వెళ్లదలుచుకోలేదంటుంది. 'చిత్రగుప్తుడికి లంచం యివ్వగలరా? అతడి దగ్గరకి మధురవాణిని పంపి, చేసిన పాపాలు అన్నీ తుడుపు పెట్టించడానికి వీలుండదు గాబోలు' అని కరటకశాస్త్రిని చీవాట్లు పెడుతుంది. 'కాపు మనిషినై పుట్టి మొగుడి పొలంలో వంగమొక్కలకూ, మిరపమొక్కలకూ దోహదం చేస్తే, యావజ్జీవం కాపాడే తనవాళ్లన్నవాళ్లుందురేమో' అని దిగులుపడుతుంది.

దుష్టులతోనూ, విటులతోనూ (ఆమె పరిభాషలో 'కుక్కల'తోనూ) సంపర్కంవల్ల విసుగెత్తి రోతకలిగి, సౌజన్యారావువంటి సత్పురుషుని దర్శనం దొరికితే చాలు తన జన్మ తరిస్తుందని మధురవాణి భావిస్తుంది. వెర్రికోరిక అని తెలిసివుండి కూడా ఆయనతో వివాహానికి అభిలాషను ప్రకటిస్తుంది. మధురవాణి మనస్సు యెలా పరిపక్వతను చెందుతూ వుందో అవగాహన చేసుకోవడానికి ఉపకరిస్తుంది, 'కన్యాశుల్క' నాటకాంతంలోని యీ ఘట్టం. మధురవాణితో సంభాషణ సౌజన్యారావుకు పెద్ద విషమపరీక్షగా పరిణమిస్తుంది. లుబ్ధావధాన్లను రక్షించడానికి, ఆమెనుండి కీలకాన్ని సంపాదించడానికి ఆయన సకలవిధాలా ప్రయత్నిస్తాడు. వేశ్యను చూడను, తన యింట ప్రవేశింప నివ్వను అని భీష్మించుకుని కూచున్న సౌజన్యారావు యింటిలో మధురవాణి పురుషవేషంతో ప్రవేశించి—లుబ్ధావధాన్లను

చిక్కుల్లోనుండి తప్పించడంకోసం, సౌజన్యారావువంటి సత్పురుషుణ్ని దర్శించడంకోసము-ఆయనను సంభాషణలోనికి దింపుతుంది. ఆమెతో సంభాషిస్తూ వున్నప్పుడు ఆయన ఆమె పరోపకార బుద్ధికి ఆశ్చర్యచకితు డవుతాడు. కాని ఆమె చేసిన వివాహ ప్రతిపాదన ఆయనకు కోపం తెప్పిస్తుంది. లుబ్ధావుధాన్లను రక్షించడానికే వచ్చినప్పటికీ తన షరతుకు ఒప్పుకోనని తరవాత, చిక్కు విప్పకుండానే మధురవాణి వెళ్లిపోబోతుంది. తాను లుబ్ధావధాన్లకు చేయబోయే సహాయానికి, లుబ్ధావుధాన్లను గండంనుండి తప్పించడానికి కంకణం కట్టుకున్న సౌజన్యారావుకు మధురవాణి ఫీజుగా 'చిన్న ముద్దు' కోరుతుంది. ఆయన ఒప్పుకోడు. వెయ్యి రూపాయ లిస్తా నంటాడు. వేయివిధాలా చెపతాడు. చివరకు విధిలేక యీ 'అడుగుమెట్టు' షరతుకు అంగీకరిస్తాడు. కాని యీ దశకు వచ్చేసరికి మధురవాణి, సౌజన్యారావు వ్రతభంగానికి అంగీకరించదు. 'మంచివారిని చెడగొట్ట వద్దని మా తల్లి చెప్పింది. అందుచేత మిమ్మల్ని ముద్దు పెట్టుకోనివ్వను' అని మనసు మళ్లించుకుంటుంది. చిక్కును విప్పి లుబ్ధావుధాన్లను రక్షిస్తుంది. గిరీశం బూటకాన్ని బహిరంగపరచి బుచ్చెమ్మ బ్రతుకును ఆ ఆషాఢభూతి వలనుండి కాపాడుతుంది. తాను వృత్తిని మానుకోడానికి నిశ్చయించుకుంటుంది.

* * *

సాహిత్యంలో మధురవాణి కోవకు చెందినవే యింకో రెండు పాత్రలు గోచరిస్తాయి. ఈ రెండు కూడా సంఘ దురన్యాయ ఫలితంగా ఏర్పడిన వేశ్యాకులంలో పుట్టినవే. ఇవి, శూద్రకుడు రచించిన 'మృచ్ఛకటిక' లోని వసంతసేన, లీలాశుకుని జ్ఞానోదయానికి కారణభూత మైన దని చెప్పబడే చింతామణి.

మధురవాణిలాగ 'సత్కులం' లో పుట్టక పోయినా వసంతసేన ఎన్నడూ కులవృత్తిలో ప్రవేశించలేదు. అంతే కాదు. ఆమె మహా పతివ్రతల గుణాలుగల మహా సౌశీల్యవతి; తన సౌందర్య సౌశీల్యాలచేత చారుదత్తునివంటి సత్పురుషుణ్ని, సత్కులసంజాతుణ్ని చేపట్ట గలిగింది. అయితే వసంతసేలకూ మనపురాణ గ్రంథాలలోని పతివ్రతలకూ తేడా కనిపించదు. ఈమె ఉత్తమపతివ్రత. చారుదత్తుడు తప్పితే యీమెకు వేరులోకం లేదు. ఇందుకు భిన్న మైనది, మధురవాణి. మధురవాణి సంఘజీవి; అప్పటికే సంస్థాపిత మై వున్న నీతులనూ, సూత్రాలనూ అనుసరించుకుంటూ పోయే మనిషి కాదు; స్వీయజీవితానుభవంద్వారా సత్యాన్ని కాచి వడపోసి సిగ్గును స్వీకరించిన యథార్థ వ్యక్తి, మధురవాణి.

చింతామణి జన్మించినదికూడా అవినీతిమయ మైన మధురవాణి జాతిలోనే. ఈమె కులవృత్తిలోనే వుంటూ విరక్తి చెంది, తదుపరి సర్వసంగపరిత్యాగిని అయింది. కాని మధురవాణి దుర్వృత్తిని విడిచిపెట్టి అవలంబించిన మార్గం, జీవితం నుండి పలాయనం చేసే వైరాగ్యమార్గం కాదు. ఇందుకు పూర్తిగా భిన్న మైనది మధురవాణి మార్గ...ఐహిక జీవితంనుండి నిష్క్రమించని, సాంఘిక మైన ప్రయోజనంగల సచ్చింత, సద్వర్తనల మార్గం ఆమెది. తన కులవృత్తిని విడిచిపెట్టని కాలంలోకూడా ఆమె ఆదర్శం, మంచివారిపట్ల మంచిగానూ చెడ్డవారిపట్ల చెడ్డగానూ వుండడం. తరవాత నామె తనవృత్తినీ, ఆదర్శాన్నీ కూడా మార్చుకుంది; మంచి చెడ్డల భేదం లేకుండా అందరిపట్లనూ మంచిగా వుండవలె నన్న జీవితాదర్శాన్ని చేపట్టింది.

ఒకనాటి వసంతసేననూ, చింతామణినీ యీనాటి జీవన్నాటకపాత్ర అయిన మధురవాణితో సరిపోల్చినప్పుడు, పైని చెప్పినకారణాలవల్ల మధురవాణి మనకు కల్పనలాగా కాకుండా, నిండుజీవంతో యథార్థంగా గోచరిస్తుంది. 'కన్యాశుల్కం' వీరేశలింగంగారి సంఘ సంస్కరణోద్యమ సాగర మథనంలో ఉద్భవించిన అమృతకలశంగానూ, మధురవాణి ఆ అమృతకలశంనుండి ఆవిర్భవించిన అమృతమూర్తిగాను గోచరించడం యిందువల్లనే.

---

మంచిచెడ్డలు మనుజులందున, యెంచి చూడగ రెండె కులములు,
మంచి యన్నది మాల యైతే, మాలనే అగుదున్ !

—శ్రీ అప్పారావుగారు.

ఛందస్సు-అలంకారం :

# ముత్యాలసరాలు-మరికొన్నిపాటలు

శ్రీ శ్రీవాత్సవగారు

-:o:-

తెలుగు నవకవితకు యుగకర్త యని పేరు సంపాదించిన అప్పారాయకవి చేసిన ప్రయోగములలో 'ముత్యాలసరములు' అను నూతన ఛందస్సృష్టి యొకటి. ఒక శుభ సన్నివేశమున వారికి వచ్చిన కవితావేశమే యీ రూపు దాల్చినదట. దానికి వారు పెట్టిన శీర్షికయే, ఆ కవిత ఆకారము దాల్చిన ఛందోరూపమునకు సైతము శీర్షిక యైనది.

1910 లో ఒక హిందు అనంతరము జాతి భేదాలు నిర్మూలించవలెననే కోరిక ఫలించి ప్రబుద్ధుడైన ఒక సంస్కర్త భావావేశమే ఒక వేడుకవేళవిన్న స్త్రీలపాటలో తేటపారించినది. ఆయనలో క్రొత్త సంగీతములు త్రిప్పిన స్త్రీల పాట ఏమై యుండునో? కొందరు 'గుమ్మడేడే గోపిదేవి' అని యందురు. ఆ పాట నడకలో ముత్యాలసర మున్నమాట నిజమే కాని ఆపాట ఛందస్సు అప్పారావుగారిని ఆవేశపరచి యుండదు.

స్త్రీల మేలుకొలుపు పాటయే ఆయన నావేశపరచిన పాట యని నిస్సందేహముగా చెప్పవచ్చును. ఈ పాటపరుసలో వచ్చిన వాటినే అప్పారావుగారు ముత్యాలసరము లని ప్రకటించినారు.

“ముత్యాలసరములలో నే చేసుకొన్న నియమ మిది. మొదటి మూడు చరణములలోను సామాన్యముగా పదునాలుగేసి మాత్రలుండును. నాలుగవ చరణమున యేడు మొదలు పదునాలుగు వరకు వుండును. విరామము అర్థానుస్వారముగా చెవి కింపగునట్లు మార్చ యత్నించితిని” అని అప్పారావుగారు వ్రాసిరి.

ఈ చివరిసాసను కుదించుట-మేలుకొలుపు పాటనుబట్టి వచ్చినట్లే యగును.

మేలుకోనవే రాజహంసా
మేలుకోను చైతన్యమా
మేలుకోనవే శుద్ధనిలయా
మేలుకో గదవే—అని చివరి పాదము తొమ్మిదిమాత్ర లున్నను పదునాలుగుమాత్రలకు సరిపోవునట్టు లయలోనికి పాడుకోవచ్చును.

'మేలుకో' అని రాగము తీయుట యీపాటలో సంప్రదాయము. అయిదుమాత్రలతో కూడా పదునాలుగక్షరముల తాళము సరిపుచ్చి కొందురు. 'మేలుకో కృష్ణా మేలుకో' యని 5+4+5లో పదునాలుగక్షరములు చేతురు. ఈ పద్ధతినే యనుసరించి ముత్యాలసరమును అప్పారాయకవి కట్టినాడు. ఇందు యతిప్రాస నియమములగూడ కొన్నియెడల పాటించినట్లు వారే చెప్పుకున్నారు.

“ఒక జాతి పార్శీగజలుయొక్క నడక ముత్యాలసరములలో తెచ్చుటకు నే యత్నించి యుంటిని.” అని కూడ వారు వ్రాసిరి. పార్శీగజలులు మాటలకూర్పు 4+3, 4+3 పద్ధతిలో ఉండును.

నానన నాన, నననన నాన్న 4+3, 4+3
నననన నాన, నానా నాన్న 4+3, 4+3
నాననాన్నన, నన్ననానాన 4+3, 4+3
నానన, నా,-నాని-నానా 4+2, 4+4

అనే ధోరణిలో కొందరు రుబాయీలు కూడా యీలయలో పాడుకొందురు. మనడప్పు వాద్యమువంటి చర్మవాద్యముమీద మూడు దెబ్బలలను అందించినపిమ్మట పాట శ్రుతి కలియును. ఆ మూడు దెబ్బలును 3+2+2 మాత్రలకు సరిపోవును. మరొకసారి 2+2+3 అనునట్లు కూడ సరిపోవును. ఇట్టి పార్శీగజల్ హాఫీజ్ వ్రాసినవి అప్పారావుగారి కాలములో ప్రసిద్ధములు. దర్బారులలో నర్తకీగాయకులు పాడుకొనెడివారు. తెనుగుఛందస్సు సంస్కృతమునుండి వృత్తములు, దేశిభాషలనుండి కందము, గీతము, సీసమువంటి జాతులు, స్త్రీల పాటలనుండి 'ద్విపద'లు గ్రహించినట్లే, స్త్రీల పాటలనుండి మాత్రాచ్ఛందస్సు గ్రహించినది. ఈ ఛందస్సులను అప్పకవి, అనంతుడు మున్నగు లక్షణకర్తలు పేర్కొనినట్లు తార్కాణ లున్నవి. అప్పకవి రగడలభేదములను చూపుచు వృషభగతిరగడ లక్షణము చెప్పెను.

ఇరువది యెనిమిది లఘువులు

(తరువాయి 3 వ అట్టలో)

# ఉపమాలంకారము

శ్రీ కుంటిమద్ది శేషశర్మగారు

(గతసంచిక తరువాయి)

"సుద్దముద్దవోలె సొబగుమీఱు విధుండు
కాంచనాంగి నీ ముఖంబుఁబోల"

అనుచో అప్రకృతమగు విధుఁ డుపమేయము. కనుక "ప్రకృతవస్తువునకు పోలిక" అను ఆంధ్రప్రతాపరుద్రీయ నిర్వచనమును అసంగతము.

అంతేగాక, "తానే గుణగరిష్ఠమని విఱ్ఱవీగుచు వేఱొండు వస్తువున కుపమానమగుటను గూడ సహింపని దానికి ఉపమానతను గల్పించుట" అను ప్రతీపమునందు అతివ్యాప్తము. ఎట్లన,

పొగరు పడెద వేల మృగలాంఛనా ! నీవు
సాటిలేనికాంతి మేటి నంచు ?
కలదు చల కనీనికా కాంత కామినీ
వదన మీఁడు నీకు ప్రతిగృహమున.

తానే కాంతియందు సరిసాటిలేనివాఁడని పొగరుపడు చంద్రునకు ఇంటింటను —అతనివంటిదే యగుగాక— సౌందర్యముచేత జనుల హృదయముల నాకర్షించిన కామినీవదనమును చూపి, "గర్వపడవలదు" అనుట, అతని గౌరవమునకు న్యూనతాపాదకము. ఇందు అప్రకృతముతో ప్రకృతమునకు సామ్యము వర్ణితము. కాన ప్రతీపమునందు లక్షణ మతివ్యాప్తము.

పై దళముచేతనే, "అతని కతండె సాటి చతురబ్ధిపరీత మహీతలంబునన్" అను అనన్వయమునందు వ్యావృత్తి గల్గుచుండ అందుకై భిన్న మనువిశేషణము దండుగ.

ఇక ఉపమేయోపమావ్యావృత్తికొఱకు, "ఉపమేయ కోపమయట్లు సామ్య మినుమారు వరుసలఁ దడవకున్న" అను విశేషణముచేత,

"శరణాగతభరణంబున
నరసింహుని సాటి వచ్చు నరసాహసుఁ డీ
నరసింహుఁ డితని కెనయా
నరసింహుఁడె"

అను ఇనుమారు పేర్కొన్న పోలికగల ఉపమేయోపమయొక్క వ్యావృత్తి సాధించినను,

ఒక్కమాఱుగ వికసించి చక్కనైన
రెండు నొండొంటి రాపాడుచుండు నీదు
నలిత సుకుమార తార లోచనము పోలు
ప్రచలితేందిందిరమ్ము నీ పంకజమును.

"రెండును ఒండొంటితో రాపాడుచుండును" అనుచో పరస్పర సామ్యము ఒక్కమాఱే వర్ణింపఁబడినది. ఇట్టి యుగపత్ప్రవృత్త సామ్యకమైన ఉపమేయోపమయందు అతివ్యాప్తి తదవస్థము. అదియుఁగాక,

"అతని నుతింప శక్యమె
జయంతుని తమ్ముఁడు సోయగమ్మునన్
పతగకులాధిపధ్వజుని
ప్రాణసఖుండు కృపారసంబునన్
క్షితిధరకన్యకాధిపతికిన్
ప్రతిజోదు సమిజ్జయంబునం
దతని కతండె సాటి చతురబ్ధి
పరీతమహీతలంబునన్"

అను విజయవిలాసములోని విజయవర్ణనమున, అందమున జయంతునిఁ బోలినవాఁడు, దయయందు వెన్నునికి సమానుఁడు, సంగర విజయమున శంకరునివంటివాఁడు" అని మూఁడుపాదముల యందును సౌందర్య దయా విజయములను అధ్యాహార్యపదగమ్యుఁడగు నర్జునునకు జయంత విష్ణు శంకరులతోడి పోలిక అనేకవారము వర్ణింపఁబడినది. సామ్యబోధకములైన, "తమ్ముఁడు, ప్రాణసఖుఁడు, ప్రతిజోదు అనుపదములు నిజముగ వాచ్యార్థోపపాదకములుగ అర్జునునివిషయమై తూచి ప్రయోగింపఁబడినవై కవియొక్క ఉచితజ్ఞతను స్ఫురింపఁజేయుచున్నవి. ఇందు సామ్య మనేకవారము తడవఁబడినది. కాన లక్షణ మవ్యాప్తము.

మఱి, "ఇచ్చట సామ్యము ఇనుమారు గాదు; మున్మారు తడవఁబడినది. కనుక అవ్యాప్తి లేదు." అంటే,

శతే పంచాశత న్యాయముచేత మున్నూరులో నినుమారు లే కెట్లు పోవును? పోనీగాక,

శాతకుంభమునకుఁ జాంపేయమునకుఁ దా
ననుగుణం బగుఁ గాంచనాంగి యనుట,
కంజాతమునకును గైరవంబునకుఁ బ్రి
యంవదంబు మహోత్పలాక్షి యనుట,
శక్రోపలమునకు జలధరంబునకును
వినయోక్తి ఘననీలవేణి యనుట
కలహంసమునకు శిఖావళంబునకు హి
తాలయ మండజయాన యనుట
ఉభయభావంబు లతివ గుం దునికి సార్థ
కముగ నిట్లంట చతురత కల్పనాంశ
లందు వలసినయ ట్లందు రనఁగనిమ్ము
వారి కేమి నిరంకుశుల్ గాదె కవులు.

అను అనిరుద్ధ చరిత్రములోని పద్యమున ఒక్కొక వస్తువునకు రెండింటితోడ సామ్యము వర్ణితము. శాతకుంభమున కనుగుణము; చాంపేయమున కనుగుణము అని ఇనుమారు సామ్య వర్ణన గలదు.

"అదెట్లు, ఉపమాద్వయమున్నను సామ్య బోధకము "అనుగుణము" ఇత్యాది పదము లొకేసారి పేర్కొనబడినవి. కాన, ఇనుమారు పేర్కొన బడలేదు" అంటేని

సౌరభములేని యట్టి పుష్పంబువోలె,
గండుఁగోయిల వెలియైన కానవోలె,
అధిప ! దమయంతితోడి సఖ్యంబులేని
నీదు సౌందర్యవిభవంబు నిష్ఫలంబు."

అను శృంగారనైషధపద్యమున, దమయంతీ సఖ్యములేని నలసౌందర్యమునకు రెం డుపమానములతో నినుమారు ప్రత్యేకముగ సామ్యము వాచ్యము. కాన అవ్యాప్తి.

"ఇది మాలోపమ అనేకోపమాసముదాయమే గాని, ఒకే అలంకారము గాదు" అని అనరాదు. అట్లేని ఉపమేయోపమ ఉపమా ప్రతీపముల సంగతియేగాన, తన్నివారణ ప్రయాసము వ్యర్థము. ప్రత్యేకగణన రెంటను సమము. అదియుఁగాక,

"వారి వాహసమాన వారణంబులతోడ-"

అను పరస్పరోపమయందును, అవ్యాప్తము.

అందుచేత కావ్యాలంకార సంగ్రహములోని ఉపమాలక్షణము అసంగతము.

అటులనే విద్యానాథుని లక్షణము ననువదించి, "ఈ లక్షణవాక్యములోని విశేషణపదము లన్నియు తూచి తూచి వేయఁబడినవి. 'ప్రకృతమును సాదృశ్యముగల అప్రకృతముతో పోల్చుట' అను ప్రధానవాక్యార్థమున ఈ విశేషణపదములన్నియు అన్యవ్యావర్తకము లగుచు అతివ్యాప్త్యవ్యాప్తిదోష దూషితము గాకుండఁగఁజేసి, లక్షణరక్షకము లగుచున్నవి' అను శ్రీచలమచర్ల రంగాచార్యుల వివరణమును లక్షణములోఁబాటు దుష్ట మని వేఱు చెప్పఁబని లేదు.

కువలయానందసారమున బులుసు వేంకట రమణయ్యగారి, "వర్ణింపఁబడినది ఉపమేయము. వర్ణింపఁబడు దానికి సమానము ఉపమానము. అనగా ప్రస్తుతమైనది ఉపమేయము. అప్రస్తుతమైనది ఉపమానము" అను వివరణ

'తన ధర్మగుణములు తన ధర్మగుణములట్లు'

అను పద్యమున రెండును ప్రస్తుతములు గనుక,

"ఇటువంటయ్యెలె గారా
తటుకు మనక యుండ సందె చీకటివేళ
ఘటచేటీవిటులై యి
క్కటకంబులఁ దిరుగువారు కంజదళాక్షీ!"

అను వైజయంతీ విలాస పద్యమున ప్రస్తుత ముపమానము అప్రస్తుత ముపమేయము గనుక దుష్ట మగుచున్నది.

ఇక, "అందమైన సామ్య ముపమ." అనున దెంతవఱకు సమంజసమో పరికింతము. "అతని కతండె సాటి" అను అనన్వయమున సామ్యము ద్వితీయ సదృశ వ్యవచ్ఛేదమునకై యుపాత్తము. అంతియగాని అందు సామ్యమునకు స్వరూపసిద్ధి లేదు. చమత్కార జనకత్వ మెక్కడ? అటులనే,

ఎటుల పోల్పవచ్చు నిందీవరాక్షి నీ
యనిశనయనకాంత మానసమును
రాత్రులందు నిస్సరచ్చంచరీకాబ్జ
మునకు కొనకు లేశమునకుఁ గాని.

అను వ్యతిరేకమున సామ్యనిషేధమే చమత్కార జనకము. కాని, నిషేధమునకు ప్రతియోగిగ గ్రహింపఁబడిన సామ్యము గాదు. అదే విధముగ అభేద ప్రధానములైన రూపకము అపహ్నుతి, పరిణామము, భ్రాంతిమత్తు, ఉల్లేఖము మొదలైన వానియందును, భేదప్రధానకములైన దృష్టాంత ప్రతి వస్తూపమా దీపక తుల్యయోగితాదులయందును, అవి నెఱవేరుటకు మాత్ర మవస్థిత మగుచున్న సాదృశ్యము చమ

త్కార జనకము గాదు. కాన నది యలంకారము గాదు.

"కాంతమోముఁబోలు కమలవైరి"

అను ప్రతీపమునందు "చంద్రునట్లు మోము చంద్రుడు మోమట్లు" అను నుపమేయోపమ యందును సామ్య మందమైన? దని అతివ్యాప్తి దోష మాశంకింపరాదు. అవియునూ లక్ష్యములే. ప్రస్తుతమే ఉపమేయము అప్రస్తుతమే ఉపమానము అను నియమము లేనందున, చంద్రప్రతియోగిక ముఖానుయోగికమైన నేమి సాదృశ్యము? ముఖప్రతియోగిక చంద్రానుయోగిక మైన నేమి? చమత్కార జనకత్వము సమానము. కాన ఉపమాలక్ష్య మనుటలో బాధకము లేదు. ఇనుమారు దడవి నంత మాత్రమున ఉపమేయోపమ ఉపమా భిన్నముగా నవసరము లేదు.

"భువిని దివివలె దివిని భువికై వడిని."

అనుపరస్పరోపమ యందువలెనే ఇందును సాదృశ్యము చమత్కారజనక మనుట సమానము. ఏకసాధారణ ధర్మమువల్ల ఉపమానాంతర వ్యవచ్ఛేదము ఫలించిననూ,ఆనందకర సాదృశ్యమూల కోపమాలంకారతకు క్షతిలేదు. ఉపమాలంకారములో నదియు నొక భేదముగా ప్రత్యేకించిన ప్రత్యేకంతురు గాక.

"చంద్రబింబమునుండి విషమ్మువోలె"

అను నసంభావితోపమయందు ఉపమాన మసంభావితము గాన సాదృశ్యమే నెలకొనదు. చమత్కార జనకత్వ మెచ్చట? అంటేని, ప్రత్యేకముగ చంద్రవిష విషయక జ్ఞానముగల కవి స్వేచ్ఛతో చంద్రబింబ సంజనితముగ విషము నూహించి, అట్టి దానితో సామ్యము కల్పించిన ప్రతిబంధక మేమిగలదు? కల్పితము చమత్కారము గలిగించ గలదా? అనిన ఊహా కల్పితయు కేవల కాంతిమయయు దంతమరీచి దూరీకృత ధ్వాంతయు ప్రోత్తుంగ స్తన స్తబక భరంబున వడఁకు నెన్నడుముతో వెండితెరపై నటించు నట్టువకత్తె హావ భావముల కనులారఁ గాంచి యానందించు రసికలోకమే యందుకు సమాధాన మీయఁగలదు. "అందమైన సామ్యము" అను లక్షణమున ఉపమానోపమేయములకు వాస్తవికస్థితి చెప్పనలేదు.

ఈ యుపమకు కొన్ని భేదములు :—

ఉపమకు "పూర్ణ, లుప్త" యని రెండు భేదములు. పూర్ణ శ్రౌతి ఆర్థి అని ద్వివిధ. శ్రౌతి వాక్యసమాస గతమై ద్వివిధ. ఆర్థి వాక్యసమాస తద్ధితగతమై త్రివిధ. మొత్తమునకు పూర్ణ పంచవిధ.

ఏకలుప్త:—"ఉపమాన లుప్త, ధర్మలుప్త, వాచకలుప్త" అని ఏకలుప్తలు మూడు.

"ధర్మోపమానలుప్త, ధర్మవాచకలుప్త" అని ద్విలుప్తలు రెండు.

"ధర్మవాచకకోపమేయ లుప్త, ధర్మవాచకోపమానలుప్త" అని త్రిలుప్తలు రెండు.

ఇందు ఉపమాన లుప్త:—వాక్యసమాస గతమై ద్వివిధ.

ధర్మలుప్త:—శ్రౌతి ఆర్థి అను రెండుతెగలలో శ్రౌతి వాక్యసమాసములచే, ఆర్థి వాక్యసమాస తద్ధితములచే భిన్నమగుటచేత మొత్తమునకు పంచవిధ.

వాచకలుప్త:—సమాస, ణముల్, ణిజ్, క్విప్, కజ్, ప్రత్యయగతమై పంచవిధ.

ధర్మోపమాన లుప్త:—వాక్య సమాస గతమై ద్వివిధ.

ధర్మవాచకలుప్త :—కర్మాధార క్యచ్, క్యజ్, క్విప్, కజ్, ణముల్, సమాసగతమై సప్తవిధ.

ధర్మవాచకోపమేయలుప్త ఏకవిధ.

ధర్మవాచకోపమాన లుప్త ఏకవిధ.

మొత్తము లుప్త ఇరువదిమూడు విధముల నిరూపించఁబడును.

పూర్ణవాక్యగత శ్రౌతి:— విజయవిలాసమున,

"తెలివ తెరవైచు నెపమున
నెఱిగట్టిన చలువవిడిచి నిలిచిన గడుసు
తత్తి మెఱసె నొరకుఁ బాసిన
కలికంఠునరాతిచేతి ఖడ్గముఁ బోలెన్."

విప్రనారాయణుని లోఁగొని, కట్టిన వలిపంపుఁ బుట్టము తెరఁగట్టు దిగనాడిన దేవదేవి, "యొర నుండి విడివడిన పువ్వువింటివాని కరవాలము వోలె విరాజిల్లుచుండెను" అను వాక్యార్థమున, "తెలివ, కలికంఠు నరాతిచేతి ఖడ్గమువోలెన్, మెఱయుట" అను ఉపమాసామగ్రి వేర్వేఱు పదములచేత చెప్పనుటచే, సాక్షాత్సాదృశ్య వాచకమగు "వోలె" పద ప్రయోగముచేతను, పూర్ణవాక్యగత శ్రౌతి.

మరి, ఇచ్చట, 'ఖడ్గమువోలెన్' అనునది అలుక్సమాసము. త్రిలింగలక్షణ శేషమున లుగలుక్ సమాస ప్రకరణమున, "అట్లు పోలె బలె శబ్దంబు లివారకంబులు—" ఇత్యాది సూత్రితము. కావ్యాలంకార సంగ్రహమున,

"కరముల శంఖము చక్రము
నిరవుగ నురమందుఁ గెంది యిందిర దనరన్
హరివలె వెలయుదు వౌరా!
నరసాహస యోబరాజ నరసింహనృపా!

అనుచో, "హరివలె" ననునది సమాసగత ముదాహృతము" అంటేని,

సంస్కృతమున, "ఇవేన సహ నిత్య సమాసః పూర్వపద ప్రకృతిస్వరత్వంచ" అను వార్తికము గలదు. తదనుగుణముగ సీతారామాచార్యులు దీనిని అలుక్సమాసములో చేర్చిరి. రామరాజభూషణుడును అటులనే భావించెను. కాని దీనిని సమాస మనుటకు ఆవశ్యకత ఔచిత్యమూ కానరావు. స్వరప్రధానమగు సంస్కృతమున స్వరమునకై అట్టి నియమము ఆవశ్యకము గావచ్చును. దేశీయభాష కా నిర్బంధము లేదు. "సమాస మనుట", "ఐన విభక్తి యేల లోపించలేదు?' అనిన "అలుక్" అనుటయు వృథాశ్రమము. "సమాసము కాదు, వ్యస్తమన్నచో వచ్చులోటు కొంచెమేనిలేదు. కనుకనే ఆంధ్రప్రతాపరుద్ర యశోభూషణమున వ్యాకరణ శిరోమణి చలమచర్ల గంగాచార్యులు :—

"ఆతత విక్రమంబగు యయాతి
భుజార్గళిఁ బోలి త్రోల్లి ప్ర
ఖ్యాత ధురీణ మా దశరథాత్మజు
బాహు శిరంబునన్ బలెన్
గ్రేతి ప్రభూతశౌర్యము యుధి
ష్ఠిరు దోస్స్థల రీతిఁ బిమ్మటన్
భూతలనాథు బాహువున భూ
సతి నేఁడు రమించు నెమ్మదిన్."

అను పద్యము రచించి, "పోలి మొదలగు శబ్దములు సాదృశ్య వాచకములు. ఇట ఔపమ్యము వాక్యగత మౌట, ఇది వాక్యగత సాదృశ్యవాచక శబ్దము ప్రయోగించుటశ్రౌతి" అని వాకొనిరి. అంతేగాక, "వేవెల్గువలె" అనునది సమస్తమనుట వింతగఁ దోఁచుచున్నది. 'వేవెల్గు, వలె' అని వ్యస్తముగ కనుపడుచుండ, దీనిని "సమస్త మను టెట్లు? అయినను ఇది యే సమాసము?" అని శంకించి, "వేవెల్గు అనునది అవ్యయీభావ సమాసము. "ఇవేనసహ నిత్యసమాసం, విభక్త్యలోపశ్చ-పూర్వపద ప్రకృతిస్వరత్వంచ" అను వార్తిక మనుశాసనము. తెలుగుశబ్దముల సమాస విషయములో సంస్కృత వ్యాకరణ సూత్రములే అనుశాసనములుగ ఆంధ్ర వైయాకరణులచే అంగీకరింపబడినవి" అని సమాధానించియూ తనియక,

"సంస్కృతమున సమాసము గలదనిననూ, దానికి ఫలము స్వరవిశేషమన్ననూ, వైదికములో సమన్వయము చేసికొనుటకు వీలున్నది. సంస్కృతములో నైనను లౌకికభాషలో నీ సమాసమునకు ప్రయోజనమంత గాఁ గన్పట్టదు. 'వాగర్థా వివ' అనుదానిని మల్లినాథసూరి సమస్త పదమని వ్యాఖ్యానించినది వాస్తవమే. కాని, దానివలన సాధించిన విశేష మెంతయో గానరాదు. తెలుఁగునను అంతే" అని వ్రాయుచూ, "ఇది సమస్తము గాదు; వ్యస్తము" అని తమ యభిప్రాయమును తెల్పుచూ, "అట్లయినచో సమాసగత శ్రౌతి పూర్ణకు ఉదాహరణము లేకపోవలసివచ్చును. ఇబ్బందిలేదు. విభాగములో ఒకకోటి తగ్గినట్లు అగును" అని సిద్ధాంతము తేల్చివేసిరి.

కాని అట్లు కాకపోయినచో వాక్యగత పూర్ణశ్రౌతికి తా మొసగిన "ఆతత విక్రమంబగు" అను పద్య మెట్లు ఉదాహరణ మగునో ఊహింపక పోయిరి.

అదియును గాక, వారు ఆతతవిక్రమంబగు ఇత్యాది పద్యమున, భుజార్గళిఁ బోలి, బాహు శిరంబునన్ వలెన్" అను తెనుగు పదములను సమస్తములన్నను వ్యస్తములన్నను, "తెలుగునకున్న వ్యాకరణ దీపము చిన్నది" కాన అడుగువారు లేరు. స్వతంత్రించవచ్చును. కాని, "దోస్స్థల రీతి" అను సిద్ధసమాసములయెడ మనయాటలు సాగవు. అది వ్యస్త మనుటకు వీలులేదు. అట్టి తరి, "పోలి మొదలగు పదములు సాదృశ్యవాచకములు; ఔట ఔపమ్యము వాక్యగతము" అనుట చింత్యము.

ఏలన, పోలి అనునది ఔపమ్యసాక్షాద్వాచకమయి, స్వసిద్ధాంతానుసారము వ్యస్తములన్నను, "దోస్స్థలరీతి" అట్లు వ్యస్తము గాదు గదా!

అటుగాక పైవి రెండే ప్రకృతోదాహరణములు. ఇది సమాసగతము" అనిన ప్రకృత పద్యమునే రెండింటికినీ ఉదాహరింపవచ్చును. ఉదాహరింపనూ వచ్చును మఱియొక దృష్టాంతమును. కాని, "సమాసగత శ్రౌతికి పూర్ణకు నుదాహరణ లేకపోవలసివచ్చును. ఇబ్బందిలేదు. విభాగములో నొక్కటి తగ్గినట్లగును" అను స్వకీయగ్రంథ మసంగతి మగును.

అసలుకు, "భుజాగ్రశీఁ బోలి తొల్లి" అనుచో, "పోలి" యనుట కర్థ మేమి? వారు పోలి మొదలగు పదములు సాదృశ్య వాచకములని, శ్రౌతి కుదాహరించిరి. అది పొరబాటు. పోలు=సరిపోలు, అని అర్థము. దానికి క్త్వార్థక "ఇ"కారాంతరూపము "పోలి". కనుకనే, "వలె, మాడ్కి"లతో బాటుగా దీనిని ప్రయోగించిన శ్రౌతి యనుట ప్రమాదము. ఈ ఉపమాపక క్రియకు కర్త యెయ్యది? ప్రధాన క్రియాకర్త యగు 'భూపతి' "పోలి" తో నెట్లన్వయించును? కాన అర్థమే విచారణీయము. పోలి ధర్మి పర్యంతవాచి గాన శ్రౌతి గాదు. ఇక, "దోస్స్థలకీర్తి" ఏ సమాసము? షష్ఠీ తత్పురుషయా? సప్తమీ తత్పురుషయా? లేక వేఱొక్కటియా? అట్లునూ గాక "దోస్స్థలి" అనుటకు ముద్రణ దోషమా? అప్పుడు మాత్ర మేమన్వయ సౌలభ్యము? "ప్రభూత శౌర్యము" అనునది బాహు విశేషణ బహువ్రీహిగా పద్యోత్స్ఫోరకము గాదు. "దోర్దండే చ యుధిష్ఠిరస్య విలసచ్ఛౌర్యే యథా ద్వాపరే" అను మూలములోని ప్రసాదము కోల్పడినది.

"ఆత్తవిక్రమం బగుయయాతి
భుజంబునఁ బోలె తొల్లి ప్ర
ఖ్యాత....................
....................బలెన్
త్రేతను మీఁద సుస్థిరయుధి
ష్ఠిరదోస్స్థలియందు వోలె నీ
భూతల....................
.........రమించు నెమ్మదిన్."

అని రచించుట మేలు అని మిత్రకావ్య విమర్శనము చాలింతము.

కావ్యాలంకార సంగ్రహ వివరణకర్త సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు, "ఆంధ్రమున 'హరివలె' ఇత్యాది వ్యస్తసమస్తము లోకేవిధముగ నుండును. ఇట సమస్తముగానే గ్రహింపవలయును" అనిరి. కాని ప్రమాణము చూపలేదు. అంతకు పూర్వము "సంస్కృతమున 'ఇవ' శబ్దముతో, 'ఇవేన సహ సమాసో విభక్త్యలోపశ్చ పూర్వపద ప్రకృతిస్వరత్వంచ' అను సూత్రముచే సమాసము గానవచ్చుచున్నది" అని వివరించుట చేత, చలమచర్ల రంగాచార్యుల వారును తెనుగునందు 'వలె' తో సమాసము వచ్చుటకు నదే వార్తికము ప్రమాణముని భావించినట్లున్నది.

కాని, యిట్లు పొసగును? 'స్వం రూపం శబ్దస్యాశబ్దసంజ్ఞా' అన్నందువల్ల, 'ఇవ' కు విధించిన కార్యము సంస్కృతమందే తదర్థకము 'యథా' కు రాదన్నప్పుడు భాషాంతరమందలి 'వలె' కు ఎట్లు వచ్చును? కాన, 'హరివలె యనునది సమస్తముగ గ్రహింపవలెను' అనుట ప్రమాణరహితము. ప్రయోజనశూన్యము.

కావ్యాలంకార సంగ్రహమున, 'దివిజేంద్రతటినియో యన నతిధవళముగఁ బొల్చె నీదు యశము నృసింహా!' అని సంభావనా వాచకము, 'ఓ యన' అనునది ఉపమావాచకముగ ప్రయోగించుట అరుచిరము.

సమాసగత పూర్ణశ్రౌతి :—నన్నయ భారతమున,

"పాయక పాకశాసనికి భారత
ఘోరరణంబునందు నా
రాయణునట్లు దానును ధరా
మరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురం
ధరుఁడుం దనకుం సహా
ధ్యాయుఁడు నైనవాఁ డభిమతంబుగఁ
దోడయి నిర్వహింపఁగన్."

ఇచ్చట నన్నయ, 'నారాయణభట్టు తనకు భారతాంధ్రీకరణమున నొసర్చిన తోడ్పాటు అర్జునునకు శ్రీకృష్ణుఁ డొసర్చినట్టిది" అని ప్రశంసించుచున్నాడు. నారాయణార్జునులు ఉపమానములు. నారాయణభట్టు, 'తనకు' అను సర్వనామోక్త నన్నయభట్టు ఉపమేయములు. తోడ్పాటు సాధారణ ధర్మము. అట్లు వాచకము. ఇట్లుపమాసామగ్రి పరిపూర్ణమైనందున పూర్ణోపమ. 'అట్లు పోలె బలె శబ్దంబు లివార్థకంబులు' అన్నందున శ్రౌతి 'నారాయణు

నట్లు' సమస్తము గాన సమాసగత. ఉపమాన వాచకము నారాయణ నామ పదమునకు 'అట్లు' పరమైన షష్ఠి వచ్చును. ఆ షష్ఠియు నిందు లోపించినది. ఆ లోపము సమాసమాత్ర సాధ్యము కావున నిది సమాసగత యనుట నిర్వివాదము.

ఇందువల్ల చలమచర్ల రంగాచార్యుల "సమాస గతశ్రౌతి పూర్ణకు ఉదాహరణము లేకపోవలసి వచ్చును. ఇబ్బంది లేదు" అనుట ప్రత్యాఖ్యాతము.

ఇక త్రివిధమగు నార్థి :—

"చందురునకు సాటి సౌందర్యమున మోము
కమల సమము కాంతిఁ గన్నుగవయు
శృంగలగ్న మేఘ శిఖరి దేశ్యములు నీ
చనులు హృదయహరణమున లతాంగి!"

ప్రథమవాక్యమున సౌందర్యమను ధర్మము నిమిత్తముగ చందురుని తోడి మోమునకు సామ్యము 'సాటి' అను వ్యస్త ధర్మిబోధక పదముచే వర్ణించుట వాక్యగత పూర్ణ ఆర్థి. ద్వితీయమున కాంతియను ధర్మముతో కమలములతో కన్నులకు సామ్యము "కమల సమము" అను సమాసగత ధర్మివాచక 'సమ' పదముతో వర్ణితము. తృతీయమున హృదయ హరణమను ధర్మమున చనులకు శృంగలగ్న మేఘములైన పర్వతములతో "దేశ్యము" అను ధర్మిబోధక తద్ధిత ప్రత్యయముతో పోలిక అభిహితము.

"ఈషదసమాప్తౌ కల్పప్ దేశ్య దేశీయరః" అను సూత్రముచే విహితమైన ప్రత్యయములు సామ్యబోధకములుగ నంగీకృతములు. మఱియొకటి విజయవిలాసమున,

"అతని నుతింప శక్యమె జయం
తుని తమ్ముఁడు సోయగంబునన్
పతగ కులాధిప ధ్వజుని ప్రాణ
సఖుండు కృపారసంబునన్
క్షితి ధర కన్యకాధిపతికిన్
బ్రతిజోదు సమిజ్జయంబునం
దతని కతండె సాటి చతుర
బ్ధి పరీతమహీతలంబునన్."

ఇందు తృతీయపాదమున వాక్యగత పూర్ణ ఆర్థి. ప్రథమ ద్వితీయములయందు సమాస గత.

ఉపమానలుప్త వాక్యగత :—

"సుదతి! వైదగ్ధ్య సౌరభ్య సౌకుమార్య
చారుతాధరతల నీకు సాటి యైన
దానిఁ బలుమఱు వెదకియుఁ గానవైతి
సేతుశీతనగాంతరసీమలందు.

ఇందు, 'వైదగ్ధ్యాదుల, నీకు, సాటి' అని ధర్మవాచకోపమేయములు పేర్కొనఁబడినవి. ఉపమానము, 'కానవైతిని' అనుటచేత, ఉపమాన లుప్త.

మఱి, 'ఉపమానము లేదనిన సాదృశ్యమే లేదు. ఉపమాలంకృతి బీజమైన సాదృశ్యమే లేకపోయిన, ఉపమాలంకృతి నిర్వాహమెట్లు? అంటేని,

ఇచ్చట ఉపమానమునకు ఆత్యంతిక నిషేధము లేదు. తనకంటికి అగుపడనిదిగాని, సేతుశీతనగ బహిర్భాగములయందు గాని సదృశముండవచ్చును. అట్టిదానితో సాదృశ్యసిద్ధికి బాధకము లేదు.

మఱి, "ఇచ్చట 'నీకు సాటి లేదు' అనిన, ఉపమాన లుప్తయా ఉపమేయ లుప్తయా? చందురునకు సాటి సౌందర్యమున మోము" అన్నప్పుడు షష్ఠ్యంత పదవాచ్యుఁడగు చందురుని,

"పొగరు పడెద వేల మృగలాంఛనా నీవు
సాటిలేని కాంతి మేటి నంచు"

అనుచో ప్రథమాంత పదవాచ్యుఁడగు చందురుని, 'క్షితి ధర కన్యకాధిపతికిన్ ప్రతిజోదు;' అన్నప్పుడు శంకరుని ఉపమానముగ గ్రహించుటేమి? 'నీకు సాటి' అన్నప్పుడు మాత్రము, 'నీ' పదవాచ్యమును ఉపమేయమనుటేమి? అంటేని,

'కవి సమయ ప్రసిద్ధి వక్తృ వివక్షయేని కారణము' అని సమాధానము. లేకున్న,

"చంద్ర బింబము నీమోము సమము లింతి"
అన్నప్పు డుపమేయ మేది? ఉపమాన మేది?

'ఉత్కృష్ట గుణముగలది గాన చంద్రబింబ ముపమాన పదవాచ్యము' అంటేని,

'ఈడు జోడుగ నున్నవి యింతి! కంటె
అబ్జకాంతము కాసార మాకసమును'

అనుచో నిర్ణాయక మెయ్యది?

పోనీ, నీకు సాటి యైన దానిఁ గానవైతి' అన్నప్పుడు, 'నీకు' ఉపమాన వాచక మనియే గ్రహింతము. దాన సాధించిన దేమి?

'ఇది ఉపమాన మన్నందున, గుణాధిక్యము సిద్ధము' అంటేని; తరువాత నుపమేయ నిషేధముచే నేమి సాధించినట్లు? ఉపమేయ ప్రతి

పాదన వల్లనైన, ఉత్కృష్ట గుణవంత మగుట నుపమాన మగుటను గూడ నోర్వలేనిదానికి, 'ఉపమేయ రూప సదృశ వస్తు ప్రాతిపాదన వల్ల ననాదరము వర్ణించుట' అను ప్రతీపాలంకార మేర్పడును. అది ఉపమేయ నిషేధముచే గల్గదు. కనుక ఉపమేయ నిషేధ మకించిత్కర మగును. అందువల్ల యథోక్తము రమణీయము. దీనినే,

'చారుతాధ్వరతలను నీసాటి యైన' అని మార్చిన సమాసగత.

మఱొకటి విజయవిలాసమున,

'చూడమె దేవతాసతుల శో
భన కాంతి విలాస వైఖరుల్
చూడమె నాగకన్యకల లోక
మనోహర రూప సంపదల్
చూడమె మర్త్యకామినుల సో
యగముఁ దమకంపు పెంపుదీ
పాడఁగ దీనివంటి యొరపైన
మిటారినిఁ జూడ మెందులన్.'

కావ్యాలంకార సంగ్రహము నందలి, 'పాసఁగ నీతోడ నెవ్వానిఁ బోల్పవచ్చు?' అను లుప్తోపమోదాహరణము, 'ఎవ్వానిఁ బోల్ప వచ్చును?' అనుటచేతఁ బోల్పదగినవాఁడు లేడని తేలినది' అను సన్నిధానము వారి వివరణ, అటులనే,

'మూఁడుజగాల రుద్ర నృపుఁ బోలు వదాన్యుఁడు లేఁడు లాతి.'

'మునులే దిప్పుడు గానరాదు మఱి
యున్ మున్నుండఁ గాఁబోదు భూ
వనితావల్లభుఁడైన రుద్రుని
ప్రతాప శ్రీసమం బీయిలన్.'

ఇత్యాది మూలానుసారములైన ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణోదాహరణములూ, ఉపమానాత్యంతిక నిషేధకములుగాన ఉపమాబీజభూత సాదృశ్య నిష్పత్తికే ప్రత్యూహ మేర్పడినందున, ఉపమోదాహృతులు కాఁజాలవు.

ధర్మలుప్త. వాక్యగతశ్రౌతి. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి గాథాసప్తశతీసారమున,

"గోధనంబులు విడిచిన గొల్లదొడ్డి
కరణి, ద్రవ్యంబులేని మందిరము పగిది,
వట్టిపోయిన సెలయేటి వాయివోలె
దాని మొగ మయ్యె నీవు కన్ దాటిపోవ."

ప్రియుడు మీఱరాని పని తొందరవల్ల ప్రియను వీడి పోవుచున్నప్పుడు, చూపుపాఱునంతవఱకు నిర్నిమేష నయనములతో నతనిఁ బరికించుచుండిన ఆమె మోము అతెడు కనుమరుగైనంతనే, ఆలమందలేని గొల్లదొడ్డివలె, వస్తుశూన్యమైన యింటివోలె, ఇంకిపోయిన సెలయేటి వాయికైవడి శోభావిహీనమై 'బిచ్చుగు' మనుచుండెను.

ఇచ్చటి కాంతి విహీనతయను సాధారణ ధర్మము మాత్రము పరిత్యక్తము. 'వాయి, వోలె' భిన్నపదములుగాన వాక్యగతి.

"నుఱి దొడ్డి కరణి, మందిరము పగిది" అనునవి వాక్యగతము లెట్లు? "అట్లు వోలె బలె శబ్దంబు లివాన కంబులు---" అను సూత్రమున, 'అట్లు పరంబగుచో నుపమానంబులగు నామతదస్త్రద్యుస్త్రదాత్మ్రగకములకు షష్ఠియు' అని షష్ఠి విహితము. 'అట్లు కరణ్యాదులకు గ్రాహ్యము' అన్నందున కరణి, పగిది' పరమగుచో షష్ఠి యవిహితము. అది లోపించుటచే నవి సమాసము లనవలసి యుండును' అంటేని,

అవి సమాసగతములే యగుగాక; 'సెలయేటివాయివోలె' అనుచో, 'వోలె బలెలు పరమగుచో నామతచ్ఛబ్దార్థములకు ప్రథమయు,' అని ప్రథమ విహితము కాన వాక్యగతమనుటలో ప్రతిబంధకము లేదు. 'ఇదిసమాసమనుట అనావశ్యకము' అని నిరూపితపూర్వము. లేకున్న వాక్యగతశ్రౌతికి ఇతర లాక్షణికు లొసగిన ఉదాహృతు లన్నియు అవకతవక లగును.

మఱొకటి:—వైజయంతీ విలాసమున,

దితిజ రక్తారుణ నృసింహమూర్తిఁ
బోలి యొప్పారెఁ బొడుపు కెంపున విధుండు
తద్విశాలాంకతల దైత్యతనువువోలె
లాంఛనం బొప్పె నమ్మండలంబునందు.

ఇందు ద్వితీయార్థమున కళంక దైత్య తనువులకు గమ్యమానమగు నైల్యరూప సాధారణ ధర్మముతో సామ్యము. కనుక వాక్యగతధర్మలుప్త. పూర్వార్థములోని పూర్ణోపమతోడ నంగాంగిభావము విశేషము.

'తనువువోలె'ను, 'తనువునట్లు' అని మార్చిన సమాసగతము. అని ద్వివిధధర్మలుప్తశ్రౌతి,

ధర్మలుప్తవాక్య సమాసగత ఆర్థి
విజయవిలాసమున,

"అన్నన్న మొగము వెన్నుని
యన్నన్న జయించు కన్నులన్నన్ నలినా
సన్నములు నడుము మిక్కిలి
సన్నము మాటలు సుధాప్రసన్నము లెన్నన్'

గంగాతటమునన్నున్న తన్నుగాంచి, మేలువడి, నాగలోకమునకుఁ గొని తెచ్చిన ఉలూపి సౌందర్యమునకు అక్కజపడి విజయుడు మదినామె యంగాంగముల వర్ణించుచున్నాడు. ఆమె మోము వెన్నుని, అన్న=లక్ష్మియొక్క; అన్నను=సోదరుడగు చంద్రుని; జయించును. కన్నులు నలినాసన్నములు, ఇత్యాది.

ఇట జయించు, ఆసన్నములు సామ్యబోధకములు. మొదటి వాక్యమున వాక్యగత ధర్మలుప్త ఆర్థి. ద్వితీయమున సమాసగత.

ధర్మలుప్త తద్ధితగతార్థి :—

"చంద్రదేశ్యము వదనము చంచరీక
వారదేశీయ చికురముల్ బహుగిరిస్త
నములు వాతెర బింబకల్పమును నీకుఁ
గలుగనీ గాక మాకేమి కఠినహృదయ!"

ఒక్క పరువంపు టందగాడు పలుగనములనుండి ఎదురు చూచి, కాచి, మూపుల రాయబారమంపి, తార్పు కత్తెలతో చెప్పిపంపియు, నా పగలాడి యొప్పుదల నొందఁజాలక తల్లడిల్లువాడు, తలపని తలంపుగా నారభూదోట మూరుమూలఁ దారసిలిన యానాతి బతిమాలియు, కోరికఁ బడయలేక యామెతో నీరీతి ననుచున్నాడు.

'ఓ రమణీమణీ! ప్రాయపు టెక్కున నీ మోము జిగిదేర చల్లని వెన్నెలలఁ జల్లు చందమామను బురుడించుఁగాక; నీ కెరికురులు ఎలదేంట్లఁబోలుఁగాక, నీ గబ్బిగుబ్బలు కొండలఁబోలి కౌగిలికబ్బకుండుగాక; నీ యెఱ్ఱనివాతెర దొండపండువోలె మధుస్యందియగుగాక; దాన మాకేమి? నీ హృదయము కర్కశము. ఎంత వేడినను మెత్తపడదు' అనుట పై యంగములు పరువపు బలిమిచే ననురూపపరిణతి నందియు కేవల హృదయ తాపాపాదకములే యనుచున్నాడు.

ఇచ్చట 'చంద్రదేశ్యము, చంచరీకవారదేశీయము, బింబకల్పము' అనునవి సాదృశ్య బోధక తద్ధితాంతములు. 'బహుగిరి' అనునది, 'విభాషాసుపో బహుచ్ పురస్తాత్తు' అను సూత్రముచే పై యర్థమున నే విహిత మగు బహుచ్ ప్రత్యయ పూర్వకము. ఇందు ధర్మము పేర్కొనఁబడలేదు గాన ధర్మలుప్త తద్ధితగ ఉపమ. అది కాంతావయవదర్శనోద్దీపితమై కాంతాలంబనకమై నాయక గతమయి, ఏకత్రానురాగ మగుటచే రసాభాసముగ పరిణమించు రతి కుపస్కారకము.

చలమచర్ల రంగాచార్యులు అనుక్తధర్మ ఆర్థివాక్యగతకు,

'వీరరుద్ర దేవ విజయ యాత్రాగంధ
పటహ నిస్వనమును వైరినృపులు
అశనిరవము సాటి యాలించుచున్నారు
ధరణి వడఁకి వడఁకి దద్దరిల్ల.'

అని యుదాహరించిరి. అశనిరవము సాటి యనుచో 'తుల్యార్థైరతులోపమాభ్యాం తృతీయాన్యతరస్యాం' అను సూత్రముమేరకు తృతీయ లేక షష్ఠివచ్చి, 'రవముతో, లేక రవమునకు' అని కావలయును. కనుక నే, 'తుల్యం దంభోళి నిర్ఘోషైః' అని మూలమున విద్యానాథుడు. ఆ విధ కి సమాసమున లోపించిన గాని, 'రవముసాటి' అనిగాదు. అట్టిచో దీనిని వాక్యగతగ నుదాహరించుట పొరబాటు.

అనుక్తధర్మ సమాసగత లుప్త శ్రౌతికి రంగాచార్యులు

'భద్రగుణుఁడు వీరరుద్ర భూనాథుని
స్వర్ణపాద పీఠ ప్రణుతు లగుచుఁ
గూర్మి భూమిపతులు గొలుతురు దేవత
వోలె సతము భక్తి పొంగులెత్త.'

ఇందు పాదపీఠి ఉపమేయము. దేవత ఉపమానము. వోలె వాచకము. సమాసగతత్వము శ్రౌతత్వము పూర్వమువలె తెలియగునది' అని వివరించిరి. 'దేవత వోలె' సమాసమనుట, 'ఇట్లయినచో సమాసగతశ్రౌతికి ఉదాహరణము లేకపోవలసివచ్చును. ఇబ్బందిలేదు.' అను స్వోక్తికి విరుద్ధము. ఐనను ప్రాచీనపద్ధతి ననుసరించి అలుక్ సమాసము అంటే, కావచ్చును. ఐనను 'వోలె' వాచక మెట్లు? 'వు వూ వా వో'లు తెనుగుపదముల తొలుత నుండవని లాక్షణికుల సిద్ధాంతము. అట్టి తరి వోలె యెట్లేర్పడెను? 'వివరణమున ముద్రణదోషము. పద్యమున 'గ స డ ద వాదేశసంధి' కృతము. అంతే,

(సశేషము)

**అముద్రితరచనలు :**

# గురుజాడవారి రెండు సాహిత్యలేఖలు

శ్రీ అవసరాల సూర్యారావుగారు

ఈ ఉత్తరాలు రెండూ శ్రీ గురజాడ అప్పారావుగారు శ్రీ వొంగోలు మునిసుబ్రహ్మణ్యం గారికి, ఆయన వ్రాసినవి. కన్యాశుల్క రచనా వివాదంలో వొంగోలు మునిసుబ్రహ్మణ్యంగారు పాల్గొన్నారు. వారిప్పుడు ఒంగోలులో లాయరు. వారికీ, గురజాడకు జరిగిన ఉత్తరప్రత్యుత్తరాలు నావద్ద వున్నవి. వాటిని శ్రీ సుబ్రహ్మణ్యంగారు 1947 లో నాకిచ్చినారు. అవన్నీ ఆంగ్లంలో వున్నాయి. వాటికి తెలుగు చేశాను. ఇవి ఆంగ్లంలో వ్రాసిన ఉత్తరాలు; అనువదించి ప్రచురిస్తున్నాను. శ్రీ సుబ్రహ్మణ్యంగారు వీటినిగురించి వ్రాసినపంక్తులు యిక్కడ యథాతథంగా ఉదహరిస్తాను.

'1909 సంవత్సరం జనవరి నెలలో నేను బి. ఏ. పట్టభద్రుడనై నా స్వస్థలమగు నెల్లూరులో స్కూలు మేష్టరుగా ప్రవేశించితిని. అక్కడ ఆరుమాసములు పనిచేసిన తరువాత కాకినాడ కాలేజీలో ఇంగ్లీషు ట్యూటరుగా మూడు సంవత్సరములు పని చేసి యుంటిని. ఈ కాలములో అప్పారావు పంతులుగారికిన్ని నాకున్ను జరిగిన ఉత్తర ప్రత్యుత్తరములు, నాజీవితములో నేను గర్వముతో జెప్పుకొనదగిన భాగముగ నెంచదగి యున్నది. ఉత్తరములద్వారా పంతులుగారు నాకు యెన్నిరకములగు విజ్ఞానములనో ఉపదేశించి యుండిరి. సారస్వత విమర్శలో విశేష నైపుణ్యమును నేర్చుకొను మని నన్ను అనేకమార్లు ప్రోత్సహించువారు. ఉత్తరములద్వారా ఈ విద్య నాకు నేర్పుటకు వారు తోడ్పడిరి. అప్పట్లో కన్యాశుల్కము రెండవ ముద్రణ జరుగుచుండెను. నేను నెల్లూరులో ఉపాధ్యాయుడుగ నుండుకాలములో అనగా 1909 సంవత్సరములో Proofs నా కంపబడి యుండెను. నేను జూచి అచ్చుకు బంపి యుంటిని. కొన్ని సందర్భములలో పంతులవారికిని, నాకును భేదాభిప్రాయముకలిగి ఉత్తరప్రత్యుత్తరముల ద్వారా చర్చ జరిగి యుండెను. మీనాక్షీ యను బాల వితంతువును మధురవాణి యనువేశ్యయు గనపడు నాటకరంగములు ఔచిత్యవ్యతిరేకములనియు, ఆభాగముల ప్రదర్శనము యువకులకు బాలబాలికలకు శ్రేయోదాయకములు గావనియు నేను విమర్శించి యుంటిని.'

దీనికి సమాధానపూర్వకాలే యీరెండు ఉత్తరాలూ. సుబ్రహ్మణ్యంగారినిగురించి *డైరీల సంపుటిలో వివరాలు చూడగోరినాను. వారంటే అప్పారావుగారికి గల అభిప్రాయం యిది : "నాకును నీకును గల అనుబంధమువల్ల నీకు సారస్వత సంబంధ మను ఉత్సాహము జనించిన దని నీవు చెప్పినయెడల, నావెనుక రానున్న నీవారు యువకులు మాకన్న యెక్కువ సారస్వతకృషి జరపగల రని నా నమ్మకము."

## ౧. వాస్తవికరచన: మానవజీవితం

ఉదకమండలం,
21 మే 1909

ప్రియమైన సుబ్రహ్మణ్యం,

నువ్వు పంపిన "పదములపట్టిక" అందింది. నానాటకం నీకు నచ్చినందుకు సంతోషం. నీ అభిప్రాయ మంటే నాకు విలవ హెచ్చు. నువ్వు పంపిన 'ఫారాలను' చదివాను. మళ్లీ మళ్లీ చదవాలని మనసు పుట్టింది. నేను ముగ్ధుణ్ణయాను. చదవతగ్గ కావ్యానికి అదే పరీక్ష. విస్మయకారణా లయిన సన్నివేశాలను చూసి ఏ రచయితా ముగ్ధుడు కాడు. రచయిత కొక గ్రంథం నిజంగా బాగుందీ అంటే అది అక్షరాలా సొగసుగా వుందనే దానర్థం. "కన్యాశుల్క" నాటకంలో, నిజమే; మీనాక్షి కనిపించే దృశ్యాలు అంత అద్భుతావహ మైనవీ, ఉపదేశక మైనవీ కావు. అయితే ఒక సంగతి; నీకు కొన్ని దృష్టాంతాలనుచూపిస్తాను. షేక్స్పియరుతో మొదలెట్టామంటే నాలుగవహెన్రీ, ఐదవహెన్రీ, మెర్రీవైవ్స్ అనే నాటకాలలో వచ్చేడాల్ షీర్ షీట్, మైన్ హోస్టెస్, డేమ్క్విక్లీ; ఇవన్నీకూడ సర్ జాన్ ఫాల్ స్టాఫ్ తో ఒక

* అప్పారావుగారి డైరీలు. విశాలాంధ్ర ప్రచురణ. విజయవాడ.

కోటముగా యేర్పడి యెంతో ఆసక్తిని కలిగింప చేస్తాయి. ఈ పాత్రలలో ఏదీ కూడా ఉజ్వల నైతికశక్తికలది కాదు. వీరిలో ఎవరికీ మర్యాదా మప్పితమూ వున్నట్లు కనిపించదు. కానీ పోకిల్లా అయిన ఫాల్‌స్టాఫ్... సానికొంపలలో ఉద్ధృతంగా రేగిపోయి తలదిమ్మ తిరించే వాతావరణంలో జీవించే ఫాల్‌స్టాఫ్... షేక్స్‌పియరు హాస్యానికి మహాప్రవంతిలాగ ప్రాతినిధ్యం వహిస్తున్నాడు. నాకు సమంగా జ్ఞాపకమున్నట్లయితే, అట్వే అనే నాటకకర్త అనుకుంటాను, "వెన్నిస్ ప్రిజర్వ్"డనే తన నాటకంలో నిసిగ్గైన వొకరంగాన్ని సృష్టించాడు. అందులో వొకానొక ఉన్నత ప్రభుత్వోద్యోగి అతినీచమైన వొక వుంపుడుకత్తె ముందు తనను తానే క్షుణాత పరుచుకుంటాడు.

వాస్తవికరచన అనేదానిని కళలలో ఎంత ఆదర్శపూరితం చేసినప్పటికీ మానవుని నైతిక ప్రమాణాలను అది స్పృశించక తప్పదు. అతని నైతికదృష్టికీ, భావాలకూ కష్టం కలగక మానదు. కొంతవరకు నైతిక భావాలను గురించిన యీ అధిక్షేపణ వారివారి స్వభావాలను బట్టి వుంటుంది.

మీ సోదరుడు పట్టాభిరామమూర్తితో కలిసి తిరగడంవల్ల నువ్వు అవినీతిని యేవగించుకుంటున్నందుకు సంతోషం. వొక సానిపిల్ల నిన్ను "షాక్" చేస్తుంది. నీతిపై నీకుగల యీ సుందరాతి సుందరమైన అభిప్రాయానికి నిన్ను నేను అభినందిస్తున్నాను. అందువల్ల యీ సమస్యను సాకల్యంగా నీతో నేను చర్చింప దలచుకోలేదు. వయస్సుకు మించిన జ్ఞానవంతుడివి నువ్వు.

కవితాన్యాయం నిన్న మొన్నటిలాగ యీనాడు లేదు. మానవజీవితాన్ని నేను చిత్రిస్తాను; కళలో ఆదర్శపూరితము చేస్తా ననుకో. కవితాకళకు నేను లొంగి వుండవలసిన వాడినే ఐనా, నాకు మానవసమాజంపట్ల మహత్తర బాధ్యత అనేది వొకటి వున్నది. కనుకనే పాఠకులు నన్నొక ప్రశ్న అడగవచ్చును. వొక దోషాన్ని దుర్నడతను అవినీతిని ఆకర్షవంతం చేశానా? చేయలేదనే భావిస్తున్నాను. మొదటికూర్పులో "కన్యాశుల్క" నాటకంలో మధురవాణి వర్ణింపలేని హేయమైన నడవడిగలది; ఆపాత్రకు ఎట్టి వన్నెలూ చిన్నెలూ లేవు. నాటకం రచిస్తున్నకొద్దీ మధురవాణి పాత్రమీద నాకున్న దృక్పథం మారుతూ వచ్చిందని నేను చెప్పక తప్పదు. అలాగ చేయడంవల్ల మధురవాణి పాత్రలో వొకదానికొకటి సరిపడని విషయాలు దొర్లాయేమో మరి నాకు తెలియదు.

అయితే మానవస్వభావంలోనే పరస్పర వైరుధ్యంవున్నది కనుక దీనిని గణుతింపనక్కర లేదు. మధురవాణిపాత్ర అంటే నాకు నేనే ముచ్చట పడుతున్నాను. కనుక ఆమెను చివరి అంకంలో సంస్కరించాను. ఇంక నీకు నాతో వివాదగ్రస్తవిషయ మేమీ లేదు.

కన్యాశుల్కం నాటకం పిలవని పేరంటానికి 'మా అప్ప పట్టుచీర కట్టుకొస్తానని' బయలుదేరి యేదో వొక నైతికోద్దేశాన్ని ప్రత్యక్షంగా బలవంతంగా నెత్తిన రుద్దదు. కానీ, మహత్తరమైన నైతికప్రయోజనమొకటి దానికి వుంది.

మానవజీవితంలో నేను చెలగాటం ఆడం లేనే లేదని యీనాటకం చదివితే నీకు తెలుస్తుంది. ఎట్టి త్రుణీకారభావమూ లేకుండా, మానవజీవితాన్ని గంభీరమైన దానినిగా భావించి ఈనాటకంలో దానిని యితివృత్తంగా స్వీకరించాను. మొదటనుంచి చిట్టచివరవరకూ పొట్ట చెక్కలయేటట్లు నవ్విస్తూ రాస్తూ అందులో యింత గంభీర యితివృత్తాన్ని నిర్వహించడం అంత తేలికైన పని కాదు.

సానిపిల్లలో వుండే మానవత్వాన్ని నువ్వు మరచి పోకు. ఆమె విచారం, కన్నీళ్ళు, సంతోషం, ఆనందబాష్పాలూ, నీ నా సుఖదుఃఖాలవంటివే! మన అనుభూతులకు వలె ఆవీ గంభీరమైనవే! ఉదాత్తమైనవే.

అవినీతిపరురాలైన వొక భార్యా, లేక వ్యభిచారి అయిన వొక భర్తా, కాదా వీరిద్దరితోనూ నిండిన సమాజమూ, ఏరీత్యా వొక సానిపిల్లకంటె మిన్న? వ్యభిచారమే తన వృత్తిగా 'లేబిల్' వేయబడ్డ సానిపిల్లకంటె యేదృష్ట్యా వీరు నయం? సానిపిల్ల వివాహ బంధనాలను వుల్లంఘించడం లేదు.

ఈ సంగతి చూడు; ఎంత చిత్రమో మరి! జపానులో 'గైషా' అనే వొక తరగతి వేశ్యలను రాజవంశీకులు, ప్రభువులు వివాహమాడతారు; అనుభవిస్తారు. గ్రీకుదేశపు ఆశ్వేషియాలను గురించి నీకు తెలిసే వుంటుంది. చరిత్రలో

యివి ప్రసిద్ధికెక్కిన దేశాలనిగణాతికెక్కాయి!

ఉన్న అసలు విషయం యిదీ: సృష్ట్యాది వివిధ పరిణామాలను తెలపేదే మానవశాస్త్రం. మానవ పరిణామశాస్త్రాధ్యయనం, విమర్శన శక్తీ ఎక్కువవుతున్నకొలదీ, ఈ జ్ఞానం వొక పరమసత్యాన్ని నొక్కి నొక్కి చెబుతున్నది. ఇప్పడున్న సాంఘిక భావాలు పోయి, వాటి స్థానే కొత్తవి రావలసిన అవసరానికి, అనిత్యానికి మానవపరిణామందారితీస్తున్నది. కంటిఎదుట స్పష్టంగా కనిపిస్తున్న వాస్తవిక విషయాలకు భయపడి సత్యాన్ని ముసుగుపుచ్చి తప్పించుకు తిరగడంవల్ల ప్రయోజనం శూన్యం. స్త్రీపురుష లైంగిక సంబంధాలకు అనవసర ప్రాముఖ్యము నీయడంలో ఔచిత్యమేముంది? అర్థమేముంది?

మానవసమాజ పరిణామ చరిత్రలో వివాహ సంస్థకున్న ప్రాధాన్యమును నేను తక్కువ చేస్తున్నాననుకోకు. మానవజాతి గడచిన రెండు శతాబ్దాలలోను అమోఘమైన విజ్ఞానాన్ని పొంది పురోగమించింది. గొప్ప గొప్ప ఆలోచనాపరులు, ధీశాలురు పాతకాలపు అభిప్రాయాలనీ, ఆదర్శాలనీ పరీక్ష చేయడాని కుపక్రమించారు. వివాహ సంస్థ మానవ పురోగతికి దోహదం చేసినదనేమాట నిజమే; నేను కాదనడం లేదు. అయితే వివాహ బంధాన్ని వుంచుకోగూడదనే నియమమే యీ చెప్పనలవి కాని కన్నీటి గాథలకు హేతువు. ఈ సత్యాన్ని మన మెవరమూ విస్మరించలేము. ఈకన్నీటి గాథలతోనే యీ కథ ముగియడం లేదు.

ఇంగ్లీషువారికి వివాహం వొక సివిల్ కాంట్రాక్టువంటిది. షెల్లీ, జార్జియిలియట్సు జుగుప్సతో వివాహమనే భావాన్ని త్రోసి పుచ్చి ఎగురకొట్టి వేశారు.

ఆధునికమహిళలు మానవచరిత్రను మార్చి తిరిగి రచియిస్తారు. ఉదాత్త సారస్వత కల్పనలలో శృంగారకథలు క్రమక్రమంగా తగ్గుతున్నాయి. వాటికి ప్రాముఖ్యము తగ్గిపోయి అవి ద్వితీయస్థానాన్ని పొందుతున్నాయి. స్త్రీపురుషశారీరక వాంఛలను గురించి, కామప్రవృత్తిని గురించి యితివృత్తాలలో మార్పు వున్నప్పటికీ, సాహిత్యం కేవలం వీటితోనే యెందుకు నిండివుండాలి? 'స్త్రీ పురుష శారీరక వాంఛలు, కామప్రవృత్తి' అనే పదాలను యిప్పుడు ప్రత్యేకంగురుతుపెట్టుకో. లైంగికవాంఛలనేవి శారీరకపరిస్థితులపై ఆధారపడి వున్నాయి.

చికాకులతో జీవితంలో నలిగిపోయిన ఏ స్త్రీయో వొక్క ముసలిదానిని వొక నవయువ్వనుడు యెందుకు ప్రేమించడు? వేడివేడి భోజన పదార్థాలవల్లనో, వికసించిన ఎర్రగులాబీలవల్లనో, కాలంలోవున్న ఆడది యింద్రియాలను ఆకర్షిస్తుంది. మేపల్లావున్న చల్లనిఅన్నం. చదివిపోయిన అన్నం; వాడిపోయిన పువ్వు: వీటిని నువ్వు ఖాతరు చేయనన్నా చేయవు. వేడి వేడి అన్నం, మల్లె పూవుల్లా తెల్లగా వుమ్మగిల్లిన అన్నం, నీ చవులూరిస్తుంది! ఆదేవిధంగా వికసించిన రేకుల, పరిమళాల గులాబీ! వాసనలతో శోభిల్లే గులాబీ నిన్నాకర్షిస్తుంది. ఇవి దుమ్ములో కలసిపోక ముందు, చెడిపోనప్పుడు, మంచి పసందుగా వున్న తరుణంలో నువ్వు వాటిని అనుభవించకుండా, అవి నిన్ను వారించడం లేదు!

'జీవితం నీటిబుడగవంటిది, సౌందర్యం అశాశ్వతము' సిద్ధాంతాలు వల్లించే వేదాంతుల సూక్తులమాటకేం లే! ఈవృత్తి కబుర్లన్నీ తీసి అవతల పెట్టు. జీవితమూ, సౌందర్యమూ అశాశ్వతమైనవని చెప్పే సిద్ధాంతాలు, యింద్రియసుఖాలు పరిత్యజింప తగినవనేవాదానికి బలాన్నీయవు. జీవితమూ సౌందర్యమూ అశాశ్వతమైనవని చెప్పినంతమాత్రంచేత, యింద్రియసుఖం విడువతగిందీ కాదు. నిజమాలోచిస్తే యిలాంటి వాదముల వల్ల యింద్రియ సుఖాలు అనుభవింప తగినవనే వాదం ధ్రువపడుతున్నది.

దోషమనేది అతిలోలత్వంలో, ఇంద్రియచాపల్యంలోనే యిమిడి వుంది. మితిమీరిన చపలత్వం దోషంకాదా మరి? ఈ అతిలోలత్వపు ఫలితం వెంటవెంటనే కనిపిస్తుంది.

మానవజీవితంలో కానీ, లేదా సారస్వత కల్పనలలో కానీ, ఎందులోనైనా స్త్రీ పురుష శారీరకానుభవాలూ, ఆనందాలూ మితిమీరకుండా తత్తదుచితస్థానంలో వుండాలి. ఇప్పుడు వీటికి అనుచిత ప్రాధాన్యము నిచ్చి గోరంతలు కొండంతలు చేస్తున్నారు.

గోమనుడైన 'కీట్సో' ఎవరికో సరిగ్గా జ్ఞాపకం లేదు కాని తన భార్యను ఎరువు యిచ్చాడు. చంద్రవంశపు పట్టమహిషులను

వుండాకోరులై బ్రాహ్మణులకు బాహాటంగానే తార్చినట్లు కనిపిస్తున్నది. బాహాటంగా జరిగినవే యిలా వుంటున్నప్పుడు, యింక రహస్యంగా ఎన్ని దుర్మార్గాలు, అవినీతులు, దోషాలు జరిగాయో కదా? మీ యితిహాసాలను, పురాణాలను, వొక్కసారి చదివి చూద్దూ, నీకే తెలుస్తుంది!

నువ్వు, వాస్తవిక విషయాలను యథార్థాలను కప్పిపుచ్చకు. ఇంతే నేను నిన్ను కోరుతున్నది. డాక్టరు రోగికి శస్త్రచికిత్స చేసినట్లు సమాజంలోగల రుగ్మతలను కత్తి తీసుకునికోసి, దేని కది విడదీసి వివిధభాగాలనూ పరీక్షించి చూడు.

మనం మూర్తీభవింప చేయవలసిన ప్రేమ విశ్వమానవప్రేమ. సాటిమానవుణ్ణి, తోటిమానవుణ్ణి హృదయ మిచ్చి ప్రేమించు. నిజమైన ఆరాధించతగిన ప్రేమ యేది? తన యుగంలో వున్న అవధులలోనే, పోనీ క్రీస్తు యేది బోధించాడనుకుంటున్నామో; దేన్ని కలావిలాసమని, దేన్ని కవితాసత్య మని షెల్లీ ప్రవచించాడో; ఇదీ ఉత్తమమైన రాజమార్గమని, ఆశయమని ఆదర్శ మని దేన్ని బుద్ధుడు మనకు ఉపదేశించాడో; అదే నిజమైన ఉన్నతమైన ప్రేమ! ఒక మానవునిమీద యింకొక మానవునకు వుండవలసిన ప్రేమ! మానవజాతిపై మనకు గల ప్రేమ!

ఏ నాడు బౌద్ధమతం, భారతదేశంలో తుడిచిపెట్టబడిందో, ఆనాడే భారతదేశం మతవిషయిక ఆత్మహత్యను చేసుకుంది!

## ౨. మనసామాజిక నీతిసూత్రాలు

ఉదకమండలం,
2 జూన్ 1909.

ప్రియమైన సుబ్రహ్మణ్యం,

నీ ఉత్తరం నా కెంతో ముచ్చటనిపించింది. నిన్ను నే నెన్నటికీ అపార్థం చేసుకోలేదు. 'కన్యాశుల్కం' నాటకంలో వేశ్య కనిపించే రంగాలు చెప్పుకో తగ్గంత గొప్పనీతిస్ఫోరక మైనవి కావని నువ్వు వ్రాసిన వాక్యాలను మాత్రమే నేను విమర్శించాను. ఇలాగ విమర్శిస్తున్నపుడు మన భావనాత్మక సాహిత్యంలోని నీతి సూత్రాలు జ్ఞాపకం వచ్చి అచ్చెరువు కలిగింది.

నైతికజ్ఞాన మనేది గుణస్వభావాలను బట్టి కొంతవరకూ తప్పక ఏర్పడుతున్న మాట నిజం; అయినా కేవలం వీటిపైననే అది ఏర్పడుతున్నదని నే నెన్నడూ చెప్పలేదు. ఇది నీతి, ఇది అవినీతి అనేవిచక్షణ గుణస్వభావాలనుబట్టి కలుగుతున్నదని మాత్రమే నేను నీకు వ్రాసినవిషయం. అలాగ వ్రాస్తున్నపుడు, సాహిత్యసిద్ధాంతాలనూ తీరులనూ ప్రస్తావించాను. నేను "వున్న యథార్థ మిదీ" అని మాత్రం చెప్పాను. సాహిత్య విమర్శ చరిత్రను పరిశీలిస్తే నేను అన్నది నిజమే నని సాక్ష్యం పులుకుతుంది. ఆధ్యాత్మిక, నీతిశాస్త్రాలను నువ్వొకసారి పరికించినట్లయితే యిక మన కీ వాదమే వుండదు.

స్త్రీ, పురుష లైంగిక సంబంధాలను దేటి కవి ప్రత్యేకించి విశ్లేషించి సమగ్రంగా పరీక్షించాలని నా అభిమతం. లేబరేటరీలనుంచి కన్వెన్షన్ రంగు దీపాలను తొలగించి యీ స్త్రీ పురుష శారీరక సంబంధాలను చాలా సూక్ష్మాతిసూక్ష్మంగా దేని కది విభజించాలని నాకోరిక. శారీరకశాస్త్ర సూత్రాలతో చారిత్రకదృష్టితో వీటిని పరిశీలించు; పరీక్షించు. అపుడు వాటికి గల నిజమైన మూల్య మెంతో నిర్ణయించడం నేర్చుకో.

మానవజీవితంలో నువ్వు సత్యాన్ని ప్రేమిస్తున్నావుకదా! సత్య మనేదానిని నువ్వు ఆరాధిస్తున్నావు కదా! మరి, సెంటిమెంటులోవున్న సత్యమును ఎంచేత అన్వేషించవు? అనుస్యూతంగా మనస్సు నంటి పెట్టుకున్న భావాలలో వున్న నిజాన్ని ఎందుకని పరిగ్రహించవు? దాని సత్వంతో మగవాళ్ల అధికారం కింద, పెత్తనం కింద ఆడవాళ్ళు ఎలాగ మ్రగ్గిపోతున్నారో, ఎన్ని దురవస్థలకు లోనవుతున్నారో నే నూహించుకోగలను. నువ్వామాత్రం వూహించుకోలేవా? ప్రయత్నించి చూడు.

బలహీనులైన, కురూపులైన, దుర్మార్గులైన, డబ్బులేని పేదభర్తలను గురించి, భార్యలు ఏమనుకుంటారో కాస్త వూహించేందుకు ప్రయత్నించు.

నీ చుట్టూరా కనిపిస్తున్న వైవాహిక జీవితాన్ని పరిశీలించు. అవగాహన చేసుకో. 'అయితే దుష్టురాళ్ళూ, కురూపులూ అయిన భార్యలు మాత్రం లేరా?' అని నువ్వు ప్రశ్నించవచ్చును. కాని, స్త్రీలు బానిసలు. స్వతంత్రత అనే దేమిటో ఎరుగరు వాళ్ళు. భార్యలు తమ

భర్తలయం దుండగోరు సద్వర్తన పతివ్రతల కంటె ఎక్కువ సద్వర్తన, పవిత్రతలను భార్యలయందు వుండవలె నని భర్తలు వాంఛిస్తున్నారు. ఇదే యీ భేదానికి గలకారణం.

మాటవరసకి అనుకుందాం. సద్వర్తనపరులు కాని మగవాళ్ళ నందరినీ నువ్వు అసహ్యించు కుంటున్నా వనుకుందాం. ఇపుడు నీ స్నేహితులలో యీ పరీక్షకు ఎంతమంది నిలబడతారు? అలాగ నిలబడిన మిత్రులు నీ కెంతమంది వుంటారు?

స్త్రీ ఖిన్నురాలు కావడానికి కారణం, తాను యివ్వగలిగిన దానికంటె అధికంగా, పురుషుడు తననుంచి వాంఛిస్తున్నాడు కదా అని! అయితే పురుషుడు తను కోరుతున్నంతగా స్త్రీ తనను పువ్వుల్లో పెట్టి పూజించ లేదని విచారపడుతున్నాడు; దుఃఖపడుతున్నాడు.

ఈర్ష్య అంటే ఏమిటి? తనభర్త రూపురేఖావిలాసాలు లేనివాడు; కనుక అతని అందచందాలను ఆమె మెచ్చుకోలేదు. అందచందాలున్న వొక అపరిచయస్తుణ్ణి మెచ్చుకోకుండా వుండలేదు. అయితే ఆవిడ అలాగ మెచ్చుకోరాదు! ఎంత అసాధ్యమిది? తనమగడు తెలివితేటలులేని వొకశుంఠ. అతనికి యింగితజ్ఞానం పూజ్యం. అయినా సరే, అతని మేధాసంపత్తి గొప్ప దని ఆమె ప్రస్తుతించాలి! తార్కిక దృష్టితో దీన్ని యిలాగ యింకా తరిచి తరిచి చూడవచ్చు.

జపానుదేశంలో "గైషా" అనే నృత్యం చేసే భోగంపడుచులను గురించి నువ్వు చదివే వుంటా వనుకుంటాను. స్త్రీపురుషశారీరకసంబంధాలు ఆదేశంలో అంతపట్టింపుగా లేవు. ఇలాగ యివి వొకప్రక్కనే యథేచ్ఛగ వుంటూనే వున్నవి; మరొకవంక ఖండితమైన జాతీయ జీవితమూ, భౌతిక జీవితావసరవస్తు సంపద పుష్కలంగా వుంటూనే వున్నాయి. ఇంత కంటె విచిత్ర మేమంటే, ఆదేశంలో ఉన్నత రాజకీయాదర్శాలు బోలెడు.

సెంటిమెంటు పూసుకేంగాని, స్త్రీ పురుష శారీరక సంబంధమైన సమస్యలను నే నిలాగ విభజిస్తాను; విశ్లేషిస్తాను; పరిశీలిస్తాను.

సమాజం నిర్ణయించిన కొన్ని శాసనాలు వున్నాయి. వాటిని గౌరవించడం మనవిధి. స్త్రీ పురుష పరస్పర సంబంధాలను విధించే శాసనాలు మరికొన్ని వుంటున్నవి. ఈ శాసనాలే స్త్రీ పురుష శారీరక సంబంధాలను నడుపుతున్నాయి. ఈ సాంఘిక శాసనాలు మన కవరోధం కలిగిస్తున్నవని, మన కడ్డంకిగావున్నవని మనకు రుజు వవుతున్నపుడు తప్ప, వీటిని నతిక్రమించటం వొకనేరమే. అయితే ఈ సాంఘిక శాసనాలు, ధర్మాలు లోపభూయిష్టంగా వున్నప్పుడు వాటిని మనం బాహాటంగా ఎదుర్కొని సంస్కరించవలసి వుంటుంది. నువ్వొక న్యాయానికి, ధర్మానికి, సామాజిక నియమానికి లోబడి వుండవలె నన్నపుడు, వాని ననుసరిస్తున్నా నీకూ వొక హక్కు వుంది. అది ఎంతవరకూ అంగీకార యోగ్యమో దానిని సూక్ష్మాతి సూక్ష్మంగా పరిశీలించే నీకు గల యీహక్కును ఎవరూ రద్దు చేయరాదు. అది లోపభూయిష్టమైనదని నువ్వు భావిస్తున్నపుడు దానిని సంస్కరించే హక్కు అధికారమూ నీకు వుంది.

నీతి,నైర్మల్య పవిత్రతలనే భావాలను నేను కొనియాడుతున్నాను. అయితే అట్టి భావనకు గల నిజస్వరూప మెటువంటిది? వీటి నిజతత్వ మేమిటి? వీటి పుట్టుకలు నడత యేవిధమైనవి? ఈపవిత్రభావాలు ఎందులో యిమిడివున్నాయి?

అందుకోలేని దుస్సాధ్యమైన సామాజిక నీతి సూత్రాలపై, స్త్రీ పురుష సంబంధాలు ప్రస్తుతం ఆధారపడి వున్న వని నాఅభిప్రాయం. ఈ సామాజిక నియమాలు నిర్ణయిస్తున్న స్థాయిని ఎవరూ చేరుకోలేనంత దుస్సాధ్య మైనదనీ, ఎవరికీ అందుబాటులో లేని దనీ నా నమ్మకం. ఈ ఆదర్శాలలో అనేక లోపాలు వున్నాయని నే ననుకుంటున్నాను.

త్రికరణశుద్ధిగ యేదయితే నిజమని నమ్ముతున్నామో, దానిని, ఆ పరమసత్యాన్ని మనం నిర్మొహమాటంగా, నిష్కర్షగా, పైకి చెప్ప వలసిన సమయం యిది. మనకు మనమే, సత్యం పట్ల విధేయులమై వుండాలి. నువ్వంటున్నావు కదా, అపవిత్రులైన వివాహిత స్త్రీ పురుషు లిద్దరూ, వొక భోగం పడుచువలె ఏవగించుకోదగినవారని! ఈ రెండు తరగతులవారికి వున్న వ్యత్యాసం ఏమిటో నువ్వాలోచించి నిర్ధారించ లేవూ? శాస్త్ర దూరమాలోచిస్తే అసలు విషయం నీకిట్టే అవగత మవుతుంది. నీ ఆలోచన కట్టి శక్తి కలదు కనక ఈ

వ్యత్యాసాన్ని అవలీలగా పోల్చుకో గలుగుతావు. కొంచెం నిశితంగా ఆలోచించి చూడు. వొక్క సంగతి. భోగం పడుచు తన వృత్తికి బద్ధురాలు. విధేయురాలు. ఉన్న విషయమంతా కాక వొక్క సంగతిని మాత్రమే పేర్కొంటున్నాను.

ఇన్నోటి విషయాలను గురించి విస్తరించి ఎందుకు చెబుతున్నా నంటే, నా రెండవ నాటకంలో ఈ సమస్యనే కొద్దిగా నైనా చర్చించ దలుచుకున్నాను.

అవును; నిజం. కాన్టే అనే పాజిటివిస్టు తత్వవేత్త మానవత్వమనే దానిని వొకమతంగా విస్తృతార్థంలో నిర్వచించాడు. మానవత్వమంటే ఆయన ఏవిధంగా భావించాడో అదే పద్ధతిని 'తు, చ' తప్పకుండా నేను దానిని పరిగణించను. ఏమంటావా, మన నమ్మకాలనేవి ఆచరణలో విలువపడనివి. మానవుని ప్రేమించడమనేది అతి సాధారణమైన మామూలు జీవితసూత్రం. ఇతరులను ప్రేమించడంవలన మానవునికి చెప్పలేనంత ఆనందం సిద్ధిస్తున్నది. మానవులను ప్రేమించడంలో ఎంతో ఆనందం వుంది. మనం వొకరికి యిచ్చిన ప్రేమ, మళ్లీ మనకు ప్రేమను కొని తెస్తుంది. వొకరి నొకరు ప్రేమించుకోవడమనేది ఎంత గొప్ప దని! ఈ భూమిమీదను స్వర్గం దిగివచ్చినంత ఆనందం! భూలోకస్వర్గం!

ఆధునిక పాశ్చాత్య రాజ్యాంగవ్యవస్థ, పరిపాలనపద్ధతి వొక విచిత్రమైన కలగూరగంప. యిందులో కొద్ది మానవత్వం వున్నప్పటికీ, మితిలేని స్వార్థపరత్వంతో యిది కూడుకుని వుంది. మితిలేని స్వార్థపరత్వం, తగుమాత్రపు మానవత్వం, ఈ రెండింటిలో ఏది జయిస్తుంది? స్వార్థపరత్వమే జయించేందుకు అవకాశం వున్నట్లుంది!

వేదం వేంకటరాయశాస్త్రిగారి ''ఉష'' నాటకంగురించా? ఈమధ్యనే, నేనీ నాటకం చదివాను. నాకు తోచిన అభిప్రాయాలను వెంటవెంటనే నాటకప్రతిలో అక్కడక్కడ వ్రాసివుంచాను. నారాయణమూర్తిగారు చదువుతాను యిమ్మన్నారు; పుస్తకంయిచ్చాను.

పాపం! వెంకటరాయశాస్త్రిగారు బొత్తిగా పసిపిల్లల ఊహాలకి దిగజారిపోతా రని నేను కలలో కూడా అనుకోలేదు. ఆయనకి బలమైన భావనాశక్తి లోపించినట్లు నిరూపితమవుతున్నది. ఒక అంకం 'ఉషావిరహం', మరొక అంకం 'ప్రద్యుమ్న విరహం'! శైలి చూస్తా వంటే తలనొప్పి. భోజనప్రియులు, విషయలోలురు, విరహతాపం, చంద్రకిరణాలు, అన్నీ పాతసంప్రదాయాలే! అంతా కన్వెన్షన్ మయం! పాత్రౌచిత్యమూ కనిపించక, సన్నివేశకల్పనా కనిపించక, మరీ నాటకం ఏమయినట్టు? బాణాసురుని మేనల్లుడికీ, ఉష చెలికత్తెకూ మధ్య నాటకకర్త నడిపిన ప్రేమఘట్టాలు చదవడానికే అసహ్యమే; వినడానికి రోతే! వొట్టి అశ్లీలం తప్ప మరేమీ కనిపించదు. శ్రీ వేంకటరాయశాస్త్రిగారు 'బఫూనరీ'నే హాస్య చమత్కారాలను కుంటున్నారేమో కొంపదీసి!

'కన్యాశుల్కం' దాదాపు అయిపోయి నట్టే. చివరిరంగం అచ్చవుతోంది. త్వరలోనే పూర్తి నాటకం నీ చేతికి వస్తుంది. శ్రీ నారాయణమూర్తి దీనిని అత్యద్భుత కళారచన అంటున్నారు. కాపీలు త్వరత్వరగా చెల్లుబడి అవుతా యని పెద్దపెద్ద బుక్సెల్లర్లు ఉవాచ. మిస్టర్ యేట్సు నాటకాన్ని కొనియాడుతూ బహుచక్కని పీఠిక వ్రాశాడు. మరి మనం పొగడ్తలమీదనే బదుకుతున్నాం కదూ!

ఈఏడు నాఆరోగ్యం సరిగా లేదు. చాలా నీరసించి పోయాను. కాని ఉదకమండలం వచ్చాక కాస్త తిన్నబడింది. ఇప్పుడు కులాసాగానే వుంది.

నాటకం చివర నువ్వు పంపిన 'పదముల పట్టిక' తప్పక చేరుస్తాను. మీ నాన్నగారికి నా వందనాలు. నెల్లూరు నువ్వెప్పుడు తిరిగి వెడతావు?

పి. యస్. : మద్రాసునుంచొచ్చే మెయిలు నెల్లూరు ఎన్ని గంటలకు చేరుతుందో?

(10 వ పుట తరువాయి)

ఆయనకు దావాలంటే మా చెడ్డ సరదా. ఆ పనులమీదనే నిన్ననే పట్నానికి వుడాయించారు. మళ్ళీ వచ్చేదాకా నేను వంటరిగా వుండడం యిష్టం వుండక, ఇదిగో మీ వంటి వారొస్తూ వుంటే, మాటల్లో ఇలా సర్దాపడుతూ వుంటాను. నాకు పనిమనిషితో ఎప్పుడూ మాట్లాడుతూ వుంటేనే గాని పొద్దుపోదండీ. అది మా పంతులుగారికి గిట్టదు. అంచాత ఆయన లేని సమయంలో ఇలా భళ్ళున తెల్లవారినా నాకా బాధుండదు.

ఏమిటీ అంటూన్నారు? మా పంతులుగారితోనా? ఆ—మా పరిచయాలకు పెద్ద ప్రయత్నాలంటూ గావాల్నటండీ? కన్నుగీటితే చాలు గిరుక్కున తిరుగుతారు మీ మగవారు. వత్తి గంగిగోవుల్లాంటివారు. అది గాక, మధురంగా పలకరించే వారికల్లా యీ 'మధురవాణి' పలుకుతూనే వుంటుందాయె. ఇక ఇందులో విపరీత మేముంది?

వస్తున్నా, వస్తున్నా, చెబుతాగా, తొందర పడతారేం? ఎలా అయిందంటారా? వినండి. మొదట గిరీశంగారనే ఒక మహా మేధావి నాకు విజయనగరంలో పాఠం చెప్పడానికి పరిచయం అయ్యారు. ఇంగ్లీషు గూడా చెబుతా వుండేవారు లెండి. మాంచి షోకిలా. అదే లెండి. పరిచయ మంటే మీ రనుకొన్నదే లెండి. పోదురూ, ఆఁ. అన్నీ కుంటిప్రశ్నలు. వినండి మరి. నేనూ ఆయన మాటల మోజులో పడిపోయి, కొంతకాలం అలాగే వుండిపోయ్యాను. ఆ పైన డబ్బుకి అటూ మొటీగా వుంటూ వచ్చేది. ఆయన పోషణకే అంత కష్టంగా వుండేటప్పుడు ఇక నా తనువు గడవడఁవెలాగా అనుకొని ఏదో వృత్తిచేత వేశ్యను గనక. చెయ్యవలసిన చోట్లల్లా ధనాకర్షణ జేస్తూ వచ్చాను. దాని కాయన గూడా చూచీ చూడనట్లే వుండిపోతూ వుండేవారు.

ఇలా వుండగా, ఈ రామప్పంతులుగారే మా యింటి కోమారు తారసిల్లారు. ఆనాడు మాత్రం మాకు ఇష్టాగోష్టితోనే గడిచిపోయింది. మళ్లా నాల్రోజులకే తిరిగివచ్చేశారు.

వచ్చీ రావడంతోటే జేబులోంచి చుట్ట ముక్కను దీసి, పంటితో కొరుకుతూ 'పిల్లా, అగ్గిపుల్ల' అన్నారు. అప్పుడు నేను అగ్గిపుల్ల గీచి, వినయంగా వంగి, చుట్ట కంటించబోయ్యానండీ. ఇంతలోనే ఆయన నా బుగ్గను గిల్లేశాడు. అప్పుడు నేను, చటుక్కున వెనక్కు తగ్గి, ఆ పుల్లను ఆయన మొఖాన విసిరేసి, 'ఏమిటండీ! మగాడికైనా ఆడదానికైనా నీతుండాలి. తాకొద్దంటే చెవిని పెట్టరుగదా' అని కాస్త విసుక్కొన్నాను.

వయ్యారమా? ఏమ్చే. నేను వంగడం వినయంగానే వంగానండీ! అది ఆయన కంటికి వయ్యారంగా కనబడ్డది గాబోలు. వినండి. మధ్యమధ్య ప్రశ్నలేస్తూ వుంటే ఎలా చెప్పను?

అవునా? అప్పుడాయన 'ఏమిటోయి! నిన్ను వుంచుకోడానికంతా నిశ్చయమై, నేడో రేపో మంచి ముహూర్తం చూచి మా వూరు లేవదీసుకు పోవడానికి సిద్ధమై వుంటే, ఇంకా ఎవళ్లో కోన్కిస్కాగాడి ఆడాలో వున్నానంటూ పాతివ్రత్యం నటిస్తావేమిటి?' అని వెక్కిరింపుగా అన్నాడు.

అప్పుడు నాకు మరింతగా కష్టం వేసిందనుమా అండీ! ఎందుకంటే, మా గిరీశంగార్ని అన్నాడని గాదు. నా నిజాయితీని నటనన్నాడే అని.

అప్పుడు నే నన్నాను — కోపం తగ్గించుకొని. 'ఏమిటండీ! వేశ్యనగానే అంత చులకనా పంతులుగారూ! సానిదానికి మాత్రం నీతనే దొకటుండొద్దా? మా పంతులుగార్ని పిలిచి 'అయ్యా! ఇటుపైని మీ త్రోవ మీది. నా త్రోవ నాది' అని తెగతెంపులు జేసుకొనే దాకా నేను పరాధీనురాలనే గదండీ. మీరు చెప్పి పొడిచినట్లు ఆయన వైదీకైతేనేం? కరణాన్నైతేనేం? పూటకూళ్లమ్మను వుంచుకొంటేనేం? ఇన్నాళ్లూ ఆ మహారాజు పోషించాడు గాదా?' మళ్లా ఏమన్నా కష్టపడతాడేమో అనుకొని కొంచెం సౌమ్యంగానే—'మీ రంతకన్నా రసికులైనా, నా మనస్సు నెంత జూఱకొన్నా, ఆయనయెడల నాకు మాత్రం విశ్వాసం వుండొద్దా యేమిటండీ?' అని నా నిజాయితీ గంధాన్ని మళ్లా ఆయనమీద కాస్త చిలికించాను.

అందుల కాయన ఏమన్నాడంటే...''అదేమిటి? పెద్దపెద్దమాటలు ప్రయోగిస్తూన్నావేమిటి? వాడి బతుక్కు వాడు పూటకూళ్ళమ్మను గూడా వుంచుకోవడమా? పూటకూళ్ళమ్మే వాణ్ణుంచుకొని, ఇంత గంజి పోస్తూ వుంది'' అని ఆయన మీదుండే యీర్ష్యను కాస్తా నామీద దులిపేశాడు.

అప్పుడు నే నందుకొని-"అన్యాయంమాటలనకండీ! ఆయన యెంత చదువుకొన్నాడు? ఎంత ప్రఖ్యాతి వుంది? నేడో రేపో గొప్ప వుద్యోగం గూడా కానుంటేను" అని నేను విస్తుబోతూ అన్నాను.

దాని కాయన వెకిలినవ్వు నవ్వుతూ "ఏం వెర్రినమ్మకంవే నీది? సానివాళ్లల్లో తప్ప పుట్టినట్లున్నావే? గిరీశంగారు గిరీశంగారంటూ పెద్ద పేరు పెడతా వేమిటి? మా వూళ్ళోవున్న లుబ్ధావధాన్లు పింతండ్రి కొడుగ్గాడూ వీడు? గ్రిడని పిలచేవాళ్లం. భోట్లేరుముక్కలు రెండు నేర్చుకోంగానే వుద్యోగాలేనా? వాడి కల్లా ఒక్కటేఉద్యోగం దేముడు వ్రాశాడు. ఏమిటో తెలిసిందా? ఆ పూటకూళ్ళమ్మింట్లో జేరి, దప్పిక్క అరవచాకిరీ చెయ్యడం" అని అన్నాడు.

"ఇదుగో - ఇక్కడి రుణాలూ పణాలూ తీర్చుకోడానికి మీ రిస్తా నన్న ఆ రెండువందలూ ఇస్తే, ఈ క్షణమే తెగతెంపులు జేసుకొంటాను" అని నే నన్నాను.

ఇలా అన్నానోలేదోనండీ వెంటనే పంతులు తన జేబులో చెయ్యిపెట్టి, ఆ రెండువందల పది రూపాయల నోట్ల కట్టా దీసి, నా చేతిలో పెట్టాడు. పెట్టాడుగదా, పోనీ అంతటితో వూరుకోగూడదూ?

ఛప్పున నా చెయ్యిపట్టుకొని తన వైపుకు లాక్కున్నాడు. ఆ. అంతలోనే. మరొక సిబ్బి మొగండే అయితే, ఆ లాగుడుకు ఆమాంతం తూలి ఆయనమీద పడి పొయ్యేదే. కాని, నేను గనుక కాలు నిలవద్రొక్కుకొని వెనక్కే నిలబడి పొయ్యాను. ఆ కోపంతో ఆ నోట్ల కట్టను విసిరి ఆయనమీదను కొట్టాను. కొట్టి "ఏబ్బే! ఏమిటండీ ఈ ఇసపసరసం? మీతో కాలక్షేపం జెయ్యడం కష్టమే సుమా! ఒక నిర్ణయంమీద నిలవని మనిషిని యేవని నమ్మను?" అని గిరుక్కున తిరిగాను. ఆతర్వాత ఆయనే అవన్నీ ఏరి, "క్షమించు అపరాధం" అంటూ ఈ మారు మర్యాదగా ఆ నోట్లనన్ని నా చేతికందిచ్చాడు. ఇక "క్షమించు" అన్న తర్వాత, తీసుకోకపోవడం నా అపరాధం అవుతుం దని తీసుకొని, వాటిని నా రెవికెలో దాచుకొంటూన్నానో లేదో ఇంతలోనే వీధి గుమ్మంముందు "వెల్ మైడియర్" అంటూ మా గిరీశంగారే కేక పెట్టారు. దాంతో యీ పంతులికి గుండె తార్మన్నది. తత్తర చూపులతో త్రోవలు వెతుకుతున్నాడు. నే నది కనిపెట్టి ఈ పంతులికి కన్ను గీటాను. గ్రహించాడు. ఛప్పున మంచం క్రిందికి దూరేశాడు. అవును. ఈరామప్పంతులే. వెంటనే గిరీశంగారు తలుపు తెఱచుకొని లోనికి దూసుకొని రానే వచ్చేశారు. కాస్సేపు అనుమానంతో ధాంధూంమ్మని దబాయించారు. సరసంలో బెట్టి, మనిషిని తేల్చేస్తూ వున్నాను. ఇంతలో ఆపూటకూళ్లమ్మే వీధిలోగుండా మా యింటికే గబగబా వచ్చేస్తూన్నట్లు కనబడింది. ఎట్లా?—

ఇది కనిపెట్టి గిరీశంగారు, ఈ పంతులుగారు దూరిన మంచంక్రిందనే పోయి దూరుకొన్నాడు. అక్కడికీ నేను "మీరన్న మనిషిక్కడ లేరులే రంటూనే ఆమెను బయట నుంచే పంపెయ్యడానికి ముందు కేగాను. వింటేగా? త్రోసుకొని మా గదిలోకి రానే వచ్చేసింది—దండుముండ. అంతా వెతికింది. కన్ను గీటాను. "మంచంక్రిందికిదూరాడేమో" అంటూ ఆ మంచంక్రిందికి తానూ పోయి దూరింది. దూరి, ఆ చీపురుతో ముందున్న రామప్పంతుల పీపే విమానం మోత మోగించింది. పాపం! ఆయన ఆ దెబ్బకు అదిరిపడి, రివ్వున వెలికి వచ్చేసి తిట్టడం సాగించాడు. అప్పుడు గిరీశంగారు గోడవైపుగుండా ఎగిరి, మంచంమ్మీదుగా గెంతేసి, రామప్పంతుల తలమీద ఒక చపేటా వేసి, బయటికి వుడాయించాడు. ఆ పూటకూళ్లమ్మగూడా వెలికి వచ్చి యీసడించుకొంటూ దానిదోవన అదెళ్లిపోయింది. తర్వాత పంతులూ నేనూ మిగిలిపొయ్యాం. ఆ తర్వాత క్రమంగా పంతులకే నేను స్థిరపడి పొయ్యాను. ఇది మా తొలిపరిచయం కథ.

ముఖ్యమైన కథ ఇంకా ముందుంది. మళ్లా వచ్చినప్పుడు చెబుతాన్లెండి. ఆవలిస్తూన్నారు మీరు. కాస్త వత్తిగిల్లి పడుకోండి. నాకూ నిద్ర వస్తూంది-అదేమిటి? నిజంగానే వత్తిగిల్లుతూన్నా రేమిటి? పొరపడి నన్నెవర్నిగా అనుకొన్నారో ఏమిటో - అసలు 'మధురవాణ్ణి' గాను-నేను, ఆ 'మధురవాణి' మనస్థానాన్ని, శెలవు.

# అముద్రితగ్రంథచింతామణి-
# *కన్యాశుల్కనాటకవిమర్శనము

"1. శ్రీ విజయనగర రాజ్యమునఁ బ్రాచీన లిపి పాఠకులగు మహారాజ శ్రీ గురుజాడ అప్పారావు పంతులు బి. యే. గారిచే రచితమైన 'కన్యాశుల్కము' అను నాటకము గ్రంథకర్తగారిచేఁ బంపఁబడినందునఁ గృతజ్ఞతాభివందనములతో నందికొని సాంతముగఁ జదివినారము. ఈ నాటకమున కిడిన పేరువలననే గ్రంథకర్తగారి యభిప్రాయము స్పష్టమగుచున్నదిగదా. మన దేశములో నీ దుర్వృత్తి నానాట వృద్ధియగుచున్నది. ప్రతి మండలములో నిట్టి కార్యములు పెచ్చు పెరుగుచున్నవి. వీనిని రాజ్యాధిపతులు నివారింపవలెను. ఈ విషయము నంతయు నాలోచించియే గాఁబోలు రసికజనవతంసులగు శ్రీ విజయనగర సంస్థానాధ్యక్షులు కొంతకాలము క్రిందట దీనిని నివరించు నుపాయ మారసి రాచరికమువారితోఁ బ్రస్తావించి యుండిరి గాని యే కారణముననో వారి యుద్యమము కొనసాగదయ్యె, నయ్యది మనవారి దౌర్భాగ్యముకదా! అది యటుండనిండు. మా మండలమునను వంగోలు తాలూకాయందు నిట్టి యకృత్యము లిప్పటికిని జరుగుచున్నవి. ఇట్టి యకృత్యములు దండనముచేగాని చక్కబడవని రూఢిగఁ జెప్పఁగలము. అయినను లోకములోని దుర్నీతి యిట్టిదని నాటకములచేఁ బ్రదర్శించిన నట్టివారికిఁ గొంతవిషయమైనను బోధపడు నని గాని యెంచికాఁబోలు గ్రంథకర్తగారీ గ్రంథమును లిఖించినందులకు మే మెంతయు సంతసించుచున్నారము. బహుకాలమునుండి సర్వతోముఖముల వ్యాపించి యున్నయట్టి యకార్యముల నొక్కపెట్టుగఁ గొట్టుటకు నెట్టివారికైన సాధ్య మగునా.

2. ఈ నరమాంస విక్రయ మను కన్యాశుల్కము ముఖ్యముగ నింగ్లీషు వాసన తెలియని వారిలో నిపుడు జరుగుచున్నది. దాని నాపవలయు నని గ్రంథకర్తగారి యుద్దేశము. అట్టి వారికి స్పష్టముగ దెలియుటకై గ్రామ్యోక్తులిందుఁ జేర్పఁబడినందులకై మే మామోదించితిమి. ఇట్టి గ్రంథములకు సలక్షణమగు గ్రాంథిక భాష నిరుపయోగము గాన "శశిరేఖ" యభిప్రాయముతో మే మేకీభవింపము గాని యింగ్లీషు పదములు విశేషముగఁ జేర్చినందులకై మాత్రము కొంచ మాలోచించుచున్నారము. గ్రంథకర్త యభిప్రాయానుసారముగ నీ కాలమునందలి తెలుఁగు సంభాషణలలో నింగ్లీషు పదములు జేరుచున్న వనుట నిజమే. అయిన నవి యందఱకు వాడుకగా నుండు నైడుకాలుక, మిటికిలేషన్, బియే పరీక్ష, ఫయిరుబాక్సు - ఆక్టింగు పని, మిషను స్కూలు, కలెక్టరుదొరగ, జడ్జీ, కోర్టు, అనునట్టి సర్వ సాధారణపదముల వలె గాక "సింప్లిసిటీ — లవ్ సిగ్నల్సు — ఇన్సిన్సిరిటీ— కంపారిజన్ — డ్రెడ్ ఫుల్లీ యిన్ లవ్ - లోనగు నపూర్వపుఁబదము లింగిలీషురాని వారి కెట్లు బోధపడునో తెలియదు. సర్వసాధారణమగు సంభాషణ కానందున గ్రంథకర్తగారి యుద్దేశమునకు భంగము గలిగిన దని సంశయించుచున్నారము. నాటకరంగమున నిట్టి మాట లుచ్చరించుటయు నందులకై లోకము నవ్వుటయు నొక ముఖ్యోద్దేశము కాదుగదా. పాత్రల సంభాషణలు సంపూర్ణముగఁ దెలిసినఁ గాని దానియందలి నీతిని గ్రహింపఁజాలరుగదా! అర్థము గాని నాఁడిది బధిర శంఖారావమే గాని వేఱు గాదు. "సీ॥ కడు శ్రద్ధఁ గల్గి యకౌంట్యాంటు లకౌంట్లు స్ట్రిక్టుగాఁగం పేరుఁజేయుచుండ" నను నదియును, మఱియు 'నెసఁగ ఫస్టెగ్జామినేషని నార్ట్సచ్చి' యను వాక్యము లింగ్లీషురాని వారి కెంత యర్థ మగునో యీ గ్రంథమునందలి కొన్ని యింగ్లీషు పదము లంతమాత్ర మందఱకు నర్థ మగు నని యనెదము. ఇంగ్లీషు పదములలో వాడుకలో నుండువానిని ప్రయోగించినచో నా భాషాజ్ఞానము లేనివారికిఁ దెలియు నని మా వాదము గాని వాని బొత్తుగాఁ

* అముద్రిత గ్రంథచింతామణి మయూఖము సం. 10. - సం. 3 మార్చి 1899 పుటలు 21, 22, 23.

# గురుజాడవారి రచనల పరిచయం

## శ్రీమతి బాణగిరి రాజమ్మగారు

గురుజాడ అప్పారావుగారు 1864 నవంబర్ 30 జన్మించారు. వారి రచనలను నాటకాలు, కథలు, గేయరచనలు, వ్యాసాలు ప్రకీర్ణకాలు అని విభజించవచ్చు.

నాటకాలు :

ఈయన నాటకాలలో ప్రసిద్ధమైంది 'కన్యాశుల్కం'. ఆ కాలపు సాంఘికవాతావరణం అద్దంలోవలె ఈ నాటకంలో ప్రతిబింబితమైంది. విజయనగరపు భాషలో దీనిని అప్పారావుగారు అచ్చు గుద్దినారు.

'కొండుభట్టీయం', 'బిల్హణీయం' అసంపూర్ణ నాటకాలు. 'కొండుభట్టీయం' లో కన్యాశుల్కంలో లాగే సంఘ దురాచారాలు వర్ణించబడ్డాయి. కన్యాశుల్కంలో మధురవాణి ఉండగా దీనిలో మంజువాణి ఉన్నది.

'బిల్హణీయం' లో రాజపుత్రికి, కాశ్మీర కవికి కలిగిన ప్రేమోదంతం ప్రధానం కాదు. రాజాశ్రయంలో బ్రదికే కవులకు కలిగే పరస్పర ద్వేషాలు, వైషమ్యాలు దీనిలో అతి స్వాభావికంగా చిత్రితమైనవి.

కథలు :

ఇంగ్లీషులోని 'షార్ట్‌స్టోరీస్' అనే చిన్న కథలవలె తెనుగున మొదట కథలు రచించినది అప్పారావుగారు. వీరి 'దిద్దుబాటు' 'మీ పేరేమి', 'మెటిల్డా' అనే చిన్న కథలను వావిళ్లవారు ప్రచురించినారు. 'దిద్దుబాటులో' 'అంటినాచి' గా ఉండి కొత్త సానిని చూచి 'ప్రోనాచి' అయిన పంతులుగారికి భార్య పాఠ మెలా చెప్పిందీ కథా వస్తువు. 'మీ పేరేమి' కథలో శైవ వైష్ణవ మతాచారాలు, వాటిపై మూఢ విశ్వాసాలు వస్తువు. 'మెటిల్డా' కథలో ఇతరులపై అనుమానపడి భార్య స్వేచ్ఛను అడ్డుకొనిన భర్తకు పాఠం నేర్పబడింది.

గేయాలు :

గేయరచనలో అప్పారావుగారిది అందె వేసిన చేయి. మన మేలుకొలుపు పాటల ధోరణిని రచించబడిన వీరి 'ముత్యాల సరాలు' ఆధునికాంధ్ర రచయితలను విశేషంగా ఆకర్షించాయి.

ఈ ముత్యాల సరాలలో రచించబడిన 'పూర్ణమ్మకథ' ఆంధ్రావళిని కరగించి వేసింది. కన్యాశుల్కం ఫలితంగా మూడుకాళ్ల ముసలికి ముడిపెట్టబడి, తోటివారు తనభర్త తాత అంటుంటే సహించలేక ప్రాణాలు వదలుకున్న పూజారి కన్య పూర్ణమ్మ కరుణగాథ ఇది.

---

(73 వ పేజీ తరువాయి)

ప్రయోగింపఁగూడదని కాదు. ప్రాకృతమునకు ఛాయ వ్రాసినట్టుగ నట్టి వాడుకలేని యింగ్లీషు మాటలకు నొక తెలుగర్థముగల యొక ఛాయ గ్రంథమున సంపూర్ణముగ నున్నను గొంత మేలని తోఁచెడి. అది నాటకరంగమునకు నిష్ప్రయోజనమైనను జనులకు గ్రంథమును జదువునపు డుపయోగపడు నని నమ్ముచున్నాము. అన్యదేశీయములు గ్రంథములందుఁ బ్రయోగింపబడి యున్నవి. అట్లే దీని ననుఁగా నింగ్లీషు నిట్టి నాటకములలోఁ బ్రయోగించుట రుచికర మని మా తాత్పర్యము. ఉద్గ్రంథముల దీనిని గ్రాంథికభాషగాఁ జేర్పవచ్చునా కూడదా యను విషయము మఱికొంత చర్చమీఁద గాని నిర్ణయించుటకు వలనుపడదు.

క॥ "నీతం బని దేశీయము
జాతీయం బని వసించు సమయమున నిజ
ఖ్యాతలభాషాకృతులకు [రజా."
ఖ్యాతిగ మ్లేచ్ఛోక్తు లాదిగాఁ గూర్తు

అని యున్నది గాన హాజార్థము, బిజమాడు లోనగు పదములు గ్రంథములయం దగపడు చున్నవి. ప్రకృతమున నీ నాటకమునందలి యింగ్లీషు పదములలోఁ గొన్ని యందఱకు సుబోధములు గావని మా యభిప్రాయముగాన గ్రంథకర్తగారు తమ యుద్దేశము నెఱవేర్చు కొనుటకు వాడుకలో నుండు హూణభాషా పదములు గాని, లేక కష్టమైన పదములకు నర్థప్రాయముగానుండు నొక ఛాయను గాని గ్రంథమునఁ జేర్చి ప్రకటించి యున్న వారి యుద్దేశము సఫలమై యుండు నని యెన్నుచున్నారము.

—పత్రికాధిపతి.

దీనిని డాక్టర్ గిడుగు వేంకటసీతాపతిగారు సంస్కృతభాషలోకి అనువదించారు కూడా.

'ముత్యాల సరాలు' అనే గేయరచనలో నేటి వాస్తవిక జగతులో భార్యాభర్తల ప్రణయకలహం కథావస్తువు.

'లవణరాజు కల' మడికి సింగన జ్ఞాన వాశిష్ఠంలోని కథే. ఈ కథను అప్పారావు గారు గ్రహించి, మలినత్వమె మాల గాని, మాలత్వము మనుష్యులకు ఎంత మాత్రమూ చెందదని, అంటరానితనాన్ని బహిష్కరిస్తూ చక్కని రచన చేశారు.

'కాసులు' అనే గేయకావ్యంలో ప్రేమ గుడ్డిదని, దానికి బహిరాకారైశ్వర్యాదులు కారణాలు కావని ప్రతిపాదించాడు కవి.

'కన్యక' అనేది వైశ్యుల దేవత అయిన కన్యకాపరమేశ్వరి కథ. 'ఇందులో వాడబడిన ఛందస్సు 'ఉదాహరణ' మనే కావ్య విశేషంలో ప్రాచీనులు వాడిన 'ఉత్కళికా' కారణాలు వికారమే.

"పండిత రాజసంవాదము" "మన విద్యల అవస్థ" అనేవి మానవస్వభావ పరిహాసకాలు. 'డామన్ పితియస్' ఇద్దరు మిత్రుల స్నేహానుబంధాన్ని తెలిపే రసవత్తరగేయం. 'లంగరెత్తుము' 'దింపులంగరు' అనే గేయాలు ప్రథమ ప్రపంచ సంగ్రామ సమయంలో వ్రాసినవి. దేశభక్తిగేయాలలో దేశమును ప్రేమించుమన్నా అనేది నిజమైన ఆంధ్రజాతీయగీతం అనవచ్చు. ఇది అంతగా తెలుగునాడు నాలుగు చెరగులా వ్యాపించింది. 'మనిషి'అనే దానిలో మానవసేవే మాధవసేవ అనేతత్త్వం ప్రకటించబడింది. 'నీలగిరిపాట'లో ప్రకృతే సాహిత్యోపాసకులకు పరదైవమని నిరూపితం.దీనిని అప్పారావుగారే "బ్యూటిఫుల్ ఆర్ ది బ్లూ హిల్స్" అని ఆంగ్లంలోనికి అనువదించినాడు.

## వ్యాసాలు :

అప్పారావుగారు కొన్ని సారస్వతవ్యాసాలను కూడా రచించినారు. "ఆంధ్రకవితాపిత" అన్న వ్యాసంలో సత్యాన్వేషణ,చారిత్రకదృష్టి వ్యక్తమవుతాయి. విశాలాంధ్రవారొక వ్యాస సంపుటి ప్రచురించారు.

ఆయన చరిత్రకారులుకూడ. చారిత్రకపరిశోధకులు కన్నులు తెరవనికాలంలో ఆయన కళింగ దేశచరిత్రను వ్రాశారు. దీనిని కీర్తిశేషులు కొమర్రాజు లక్ష్మణరావుగారు విజ్ఞానచంద్రికా గ్రంథమండలిలో ప్రచురించ దలచారు. కాని; ఎందువల్లనో అది జరుగలేదు. నవ్యకవిత్వమందే కాక ప్రాచీనకవితలోను ఈయన సిద్ధహస్తుడనిపించుకొనినాడు. ఆయన ప్రాచీన ప్రబంధ ధోరణిలో రచించిన "సుభద్ర" అనే కావ్యం విజయనగరంలో శ్రీరామానుజాచార్య విద్యాసమితి వారు 1939 లో ప్రచురించారు.

ఈయన సమస్యలు పూరించినట్టుకూడ తెలుస్తున్నది. 1903 లో ఈయన పూరించిన ఒక సమస్య 'మంజువాణి' పత్రిక 5 వ సంపుటి, 11 వ సంచిక (1903) లో ప్రచురించబడింది. దీనిని ఈయన మహారాణి అప్పలకొండయాంబా మహాదేవిగారి ఆజ్ఞానుసారం పొందించారట.

## సమస్య :

వెలవాలంటి కుమారు లౌదురు గదా
విప్రోత్తముల్ రావణా !

మ. కలిచేతన్ విమతిత్వ మొందుచు మహా
కామాంధకారంబునన్
కులధర్మంబు పరిత్యజించి గణికన్
గూడిమ్మ అమ్మా నినున్
బలుమా ర్వేడెద మంచు బల్కెదర హా!
పాండిత్య మూహింపకే
వెలవాల్గంటి కుమారు లౌదురు గదా
విప్రోత్తముల్ రావణా !

ఈ సమస్యను గురుజాడవారే కాక వారి మిత్రబృందమైన 1. శ్రీముదుంబై నరసింహాచార్యస్వామి గారు, 2. శ్రీ మండ లక్ష్మీరామశాస్త్రులవారు, 3. శ్రీ పేరి కాశీనాథశాస్త్రుల వారు 4. శ్రీ కె. యన్. జి. రాజామణి శెట్టిగారు పూరించినారు.

దీనిని కళింగదేశపు చాటువులు అను దాని లో ప్రత్యేకముగా శ్రీ నిడదవోలు వెంకటరావుగారు ప్రచురించనున్నారు. దీనిని ఆ వెనుక దాసు శ్రీరాములుగారు మొదలగు తొమ్మండుగురు కవులుకూడా పూర్తిచేసినారు.

1915 ఏప్రిల్ 9వ తేదిన ఆయన కీర్తిశేషు లయినారు.

(9 వ పుట తరువాయి)

<u>గుడ్డె</u>: పంచమాంకంలో సౌజన్యారావు 'మీ రప్పుడే గుడ్డెమీదికి వెళ్లి ఉన్నారు' గుడ్డె అనగా చేను, పొలము-'పెరటిలో క్రొత్త నాటిన మిరపగుడ్డె' అని మించుపల్లి, మాండలికం.

<u>పెరడు</u>: తృతీయాంకం-పెరటిలో జామిచెట్టు కొమ్మమీద వెంకటేశం. ఇంటికి అనుకొని, ఆ ఆవరణలో ఉండే ప్రదేశము. ఇందులో నుయ్యి, చెట్టుచేమ, మరుగుస్థలం ఉంటవి. ఇది మాండలికమే. తక్కిన మండలాల్లో, దొడ్డి అంటారు. పశువులు కూడా యిందులో ఉంటవి-కళింగంలో దొడ్డి అంటే, మరుగుప్రదేశం అని అర్థం.

<u>ఊరుబిండి--</u>

వెంక: అక్కయ్యా—కొంచం ఊరుబిండి.

బుచ్చ: అమ్మ చూస్తే తంతుంది.

వెంక: అమ్మ చూడదులే (ఊరుబిండి చేతులో వేసుకొని నాలుకతో నాకి గంతును)

(తెర దించవలెను)

కళింగదేశంలో ఊరుబిండి అంటే - తెలగపిండి - నువ్వులు నూనె ఆడగా, మిగిలినపిండి - దీనిని నీళ్లలో పడగట్టి, ఉప్పు పచ్చిమిరపకాయలు వేసి, ముద్దగా చేస్తారు. అది చలిలో నంచుకొంటారు. ఆ ముద్ద వొడియాలుగా తయారుచేసి యెండబెడతారు కూడా. దీనిని తక్కిన జిల్లాలవారు వాడుక చేయరు. వారి కది నిషేధం. గానుగపిండి అని వాడుతారు-కళింగేతరప్రాంతాల్లో ఊరుబిండి అంటే - పచ్చడి అని అర్థం-దీనికి కవిప్రయోగాలూ ఉన్నవి.

ఈలాగ అక్కడక్కడ మాండలికాలు చిలికించినా, కేవలము వ్యవహారభాషలోనే, ఉత్తమనాటక రచన సాగించవచ్చునని చాటి చెప్పినవారు అప్పారావుగారే-కన్యాశుల్కానికి ముందు నాటకవాఙ్మయంలో, (ఒక్క వీరేశలింగం పంతులుగారి ప్రహసనములు తప్పిస్తే) నాటకములన్నీ గ్రాంథికభాషలోనే ఉండేవి. సంస్కృతనాటకా లనువదించినా, పాత్రోచితభాష వాడుక లేదు.

కన్యాశుల్కంలో వ్యావహారిక భాషావిషయంలో అప్పారావుగారు, గిడుగువారికంటె ముందంజవేసినారు. కావ్యరచనకు గ్రాంథికభాషవలె, కావ్యత్వంగల నాటకానికి వ్యవహారభాష ఉపయుక్తమని నిరూపించి నాటకసృష్టి చేసినారు కాబట్టియే గురజాడను వర్తమానాంధ్రవ్యావహారికభాషాసాహిత్యానికివాల్మీకిగాను ఆరాధించవలసిఉంటుంది. ఆ భాషావేదంలో చిక్కులు విడదీసి, గ్రాంథిక వ్యవహార విభాగంచేసి, వ్యవహారిక భాషా ప్రపంచాన్ని ప్రకాశమానం చేసిన గిడుగువారిని వ్యాసులుగాను భావించాలి.

కన్యాశుల్కంలో వ్యవహారిక భాష వాడబడడమే కాక, ఆ భాష యేవిధంగా వ్యాప్తిలోనికి తేవలెనూ ఆ పద్ధతులు అందులో నిరూపితమై ఉన్నాయి. అవి భాషా తత్త్వశాస్త్రం. (Philology) స్వరశాస్త్రం. (Phonetics) చదువుకొన్నవారికి గాని తెలియవు. ప్రజలయొక్క ఉచ్చారణ విధానాన్నిబట్టి భాష యేవిధంగా మార్పులు పొందుతుందో, వ్రాత మూలంగా చూపించినారు. చూడండి.

1. మకారవకారముల మార్పు—

ఏవఁండీ-మీపేరేవిఁటండీ - రావాఁధాన్లు. వ్యావహారిక భాషలో మకార, వకారంగా ఉచ్చారణలో సహజంగా మారుతుంది-రెండూ ఓష్ఠ్యవర్ణాలే కాబట్టి-ఈమార్పు సూచించడానికి లోపించిన మకారం-అనుస్వారం కాబట్టి 'మ' 'వ'గా వ్రాసి. దానివెనుక అనుస్వార చిహ్నమైన 'ఁ' పెట్టినారు.

2. ఉ-'ఒ'లుమువు వొలుగా వ్రాయడము.

అలావుణ్ణండి-ఈసమ్మంధం వొదులుకుంటే కొత్తసంగతి వకటి అప్పారావుగారు 27-3-1911 లో తన డైరీలో - నాది ప్రజల వుద్యమము అని వ్రాసుకున్నారు.

3. ఎకారముతో మొదలైనాపదాలు-యకారముతో వ్రాయడము.

యెన్నెళ్ళైతేనేం-'నీలాలకా యేల నీయులకా'-అని శిష్యుడు పాడితే, అగ్నిహోత్రావధాన్లు - యాలకేవిటినీశ్రాద్ధం - అంటాడు శిష్యుడు ఎలక్కాదు-పిల్లి అంటాడు.

4. జ్ఞ-గ గా వ్రాయడము-గాజుకుప్పెలో నెగడగుచు దీపంబు యెట్టు లుండు గ్యాన మట్టు లుండు-

5. బ్రాహ్మడు-అబ్బెంతరం-మతప్రవేశం-రుగ్మత - మొదలైన వ్యావహారికాలు. యథామాతృకంగా ఉపయోగించడం. పై విధంగా సూచితములైన మార్పులు - భాషాతత్త్వ

శాస్త్రానుసారంగా ఉన్నవనీ, మన ప్రాచీన భాషా సంప్రదాయము ననుసరించి యివి సరియైన వనీ, ప్రామాణికులైన కవుల ప్రయోగములను బట్టి చూపింపవచ్చును.

వ్యావహారిక భాషలో వ్రాసినా, కన్యాశుల్కంలో పాత్రోచిత భాష వాడబడిన దనే అభిప్రాయం మనకు స్ఫురించినందున ఇందులో తలచుగా గిరీశం పాత్రలో కనబడుతూ ఉన్న ఇంగ్లీషు పదాల వాడుకనుగూర్చి కొంత అభిప్రాయభేదం కలిగింది. కాని పాత్రోచిత దృష్టితో పరిశీలిస్తే గురుజాడవారి అభిప్రాయం విశద మవుతుంది. గిరీశం యింగ్లీషు సంస్కారం బాగా ఉన్నవాడు-అందుచేత అతని మాటల్లో ఇంగ్లీషుభాష సరిగా ఉచ్చారణరూపంలో ఉండేటట్లుగా ఉన్నది. ఈ నాటక దృష్ట్యా గిరీశం ఉత్తమపాత్ర-కాబట్టి అందలి భాష సంస్కారం పొందినరూపంలో ప్రయుక్తమైంది. అసిరిగాడు-బండ్రోతు నీచపాత్రలు-వారిమాటల్లో యింగ్లీషు అపభ్రంశాన్ని పొందినట్టుగా ప్రయుక్తమైంది-ఇన్స్పెక్టరుకు ఇనస్పికటరు-ఫోటోగ్రాఫునకు పోటికరాపు-మొదలైనవి ఉదాహరణాలు-అట్లే-అగ్రహారికుల్లో-కేవలము వేదము చదువుకొన్న అగ్నిహోత్రావధాన్లు సంభాషణలోను సాహిత్య సంస్కారాన్ని పొందిన కరటకశాస్త్రి సంభాషణలోను తారతమ్యం వ్యక్తమౌతుంది- మొదటిదానిలో వైదికుల - ఛాందసపరిభాష, రెండవదానిలో శిష్టజన వ్యవహార భాష వాడబడింది-గురజాడ భాషా సంప్రదాయాలు బాగా అవగాహన చేసుకొన్నకవి అవడంచేత, భాషాసంస్కారంలో ఉత్తమమధ్యమ అధమతరగతులలో, ఉచ్చారణతారతమ్యం నిరూపిస్తూ, రసోచితంగా నాటకాన్ని నడిపించినాడు - గ్రాంథిక భాష కూడా, గిరీశం ఉత్తరంలోను, మనవాళ్ళయ్యా మాటలలోను కనిపిస్తుంది-అది గ్రంథకర్త గ్రాంథికములోనైనా వచనరచనలో సితప్రజ్ఞుడని తెలుపుతుంది-స్త్రీ పాత్రలుకూడా వారికి సహజమై, సజీవమైన వ్యావహారికంలో సంభాషణ జరుగుతుంది. మనము నాటకము చదువుతూన్నప్పుడు ఆపాత్రలు సజీవంగా సాక్షాత్కరించి మాట్లాడుతూన్నట్లుగా రచన సాగింది.

గురజాడ మనసు యెట్టిదో తెలియజేయడానికి మాతండ్రిగారిని గూర్చి ఆయన వ్రాసిన జాబొకటి యిందుతో ప్రకటిస్తున్నాను.

Fort Vizianagaram
9th May 1904

My dear Rajah Saheb,

I have a favour to ask of you. The bearer Mr N Sundaram Pantulu is a great Telugu scholar who has collected at great trouble and cost a splendid manuscript library of Telugu Books which contains some rare works not yet printed. He is employed in the Local Fund Service under Mr Arbuthnot. Owing to his absence from his library Vizianagaram he is now a sufferer. I shall consider it a great personal favour if you kindly recommend him to Mr Arbuthnot for transfer here i.e. to Vizianagaram.

I hope you will do this one request of mine.

Yours very sincerely
G Apparao

(13 వ పుట తరువాయి)

మాన్యం క్రింద జరిగింది. 1920 అని నాకు జ్ఞాపకము. నేను నాయెరుక వున్నంతవరకు పరికించి చూస్తే ఈ పెద్దలిద్దరే తమ వేషభాషలతోనేమి, తమ ముఖారవిందాలతోనేమి, తమ నడకలతోనేమి చాలా తగిన వ్యక్తులని నేను అనుకుంటూ వుండేవాడిని. ఈ ఇద్దరిలో శ్రీ తాతాచారి గారు ఈ వేషానికే అవతరించాడంటే నమ్మండి. మీరు చాలామంది మరచిపోయినా రేమోగాని, ఆయన మా కందరకు శిక్షణ ఇచ్చారు. కాని నేను యెన్నిసార్లడిగినా తాను మాత్రం ఈవేషం వేయడానికి ఒప్పుకున్నాడు కాదు......

ఆదినం నాటకంలో, నేను నాలుగుపాత్రలు-వాటిమీద నాకున్న అనురాగంకొద్దీ—ఫోటోగ్రాఫ్ పంతుల బంట్రోతు, కరటకశాస్త్రి, పోలిశెట్టి, అసిరిగాడు వేషాలు వరుసగా వేశాను. కావలసినంతమంది పాత్రధారులు లేకపోవటము కూడా దీనికి కారణ మయింది. నాటకం చాలా జయప్రదంగా జరిగింది. ఆదినం శ్రీ డి. వి. ఆర్. సుబ్బారావు గారు గిరీశం; కీర్తిశేషులైన డాక్టర్ గుళ్లపల్లి నారాయణమూర్తి గారు మధురవాణికీ; కీర్తిశేషులైనడాక్టర్ రాఘవరావుగారు బుచ్చమ్మ, మీనాక్షి పాత్రలు, డాక్టర్. కె. సత్యనారాయణగారు రామప్ప పంతులుపాత్ర ధరించారు. అది రేనివల్లనో గానీయండి ఇప్పటికి 35 సంవత్సరాలైనప్పటికి ఇది నాకు నిన్న మొన్న జరిగిన విషయములాగా కనపడుతోంది. ఇది అసలు నాటకంలో వున్న నవ్య జీవితమేమో మీరందరు ఆలోచించి చూసుకోండి. నేనుకూడా చూస్తాను......

తరువాత తెనాలిరామవిలాససభలో మేమీ నాటకాన్ని ప్రదర్శించాము. ఈతడవ నేను బహుపాత్రత్వాన్ని వదులుకుని గిరీశం పాత్ర నే వేశాను. మాస్టర్ అంజి రామప్పంతులు, స్థానంవారి చిన్నవాడు మధురవాణి, మా కుటుంబశాస్త్రి లుబ్ధావధానులపాత్రల ధరించారు. గద్యనాటకాలకి ప్రాముఖ్యంతీసుకువచ్చి వాటికి నాటకకళలో వుండవలసిన స్థానాన్ని హద్దుపెట్టి నిరూపించి చూపుదా మని కేవలం నేను పట్టుపట్టి మాసభవారి చేత ఆడించిన నాటకమిది. గద్యమే నాటకానికి జీవకర్ర గాని, పద్యం కీర్తనకావని ఇప్పటికి నా నిశ్చితాభిప్రాయము.

ఆదినం రాత్రి పదిగంటలకు మొదలుపెట్టి నాలుగుగంటలదాకా ఆడాము. అగ్నిహోత్రావధానులు "వీడి ఇంగ్లీషుచదువు నాకొంప తీసింది" అనేదానితో స్వస్తి చెప్పుతుండే వాళ్ళం మొదట్లో. తరువాత తరువాత గాని సౌజన్యరావుపంతులు సీనులువరకు వేశేవాళ్ళం కాదు. ఏ అల్లరి లేకుండా కిక్కురుమనకుండా తదేకంగా మా తెనాలి ప్రేక్షకజనం ఆనందించారు. ఆదినం నాటకరుసుం 87 రూపాయలని ఇప్పటికి నాకు జ్ఞాపకము. రోషనార, మొదలైన మిగతా నాటకాలకి దాదాపు 2000 దాకా కళ్ళ జూస్తుండేవాళ్ళము, ఆరోజుల్లో. ఈలాంటి గద్యనాటకాల్ని, సంస్కృత నాటకాల ఆంధ్రీకరణాల్ని వీటిని పైకితీసుకురావాలనేదే మొదటి ఆశయం మాసభది. అందువల్ల వరుమానం తక్కువైనా దీన్ని ప్రచారంకోసం ఆడుతూవుండేవాళ్ళము. యేవూరనైనా ప్రతాపరుద్రీయం, కన్యాశుల్కము నాటకాలు వేయదలచుకుంటే, ముందుగా కన్యాశుల్కము అనే వాళ్ళము. ఎందుకంటే ముందుగా ప్రతాపరుద్రీయము వేస్తే, ఆపిచ్చివాడి కేకలతో నాగొంతుకు పోతూ వుండేది......

మొదట్లో యెంత వరుమానం వచ్చిందో ముందరగానే చెప్పాను. తరువాత యెంతో ప్రచారం చేయగా చేయగా ఎనిమిది, తొమ్మిది వందలకంటేయెక్కువవచ్చిందికాదు. అయినప్పటికి దీనిమీద పెట్టిన గురివదలకుండానే ఆరాధిస్తూ వుండే వాళ్ళము. ఒకప్పుడు ఈనాటకం విజయనగరంలో ఆడేము. నారాయణదాసుగారు మొదలగు ప్రముఖులు యెంతమందో వచ్చారు. ఆరోజున ప్రేక్షకులు అమితశ్రద్ధాభక్తులతో చూచారు; ఆనందించారు. అగ్నిహోత్రావధానుల మాటలతో ముగించాము. ప్రేక్షకులు ఇంకా నాటకం వుందని అలాగే కూర్చున్నారు. నేను రంగస్థలం మీదికి వెళ్లి నాటకం సమాప్త మయిందని అని నేను మనవి మాటలు చెప్పుకునేసరికి వాళ్లు యెంతో నొచ్చుకున్నారు కూడా. మరొకప్పుడు బందరులో ఈ నాటకాన్ని శ్రీ ముట్నూరి కృష్ణరావుగారు మొదలైన ప్రముఖుల యెదుట ఆడాము. ఆ దినం కూడా వారి మన్ననలకు అభినందనాలకు పాత్రులమైనాము. ఈలా తరచిన కొద్ది నాకు యెన్నెన్నో జ్ఞాప

కము వస్తున్నాయి. కాని వీటి నన్నిటిని యేకరవు పెట్టడము సమంజసముగా కనబడటము లేదు కావున వదలివేస్తున్నాను......

ఈ నాటకానికి ఇంత ప్రతిభ, ఇంత ప్రచారం తెచ్చింది నా చిరమిత్రులు, సోదర నటులు అయిన 'పద్మశ్రీ' స్థానం నరసింహారావు, మాష్టరు తంగిరాల ఆంజనేయులు. నేను చేసినకృషి చాలా తక్కువ అని నాకు తోస్తుంది. గిరీశం సీనులు, రామప్పంతులు సీనులు, మధురవాణిసీనులు ఒక దాని తర్వాత ఒకటిగా వస్తుండేవి. వీళ్ళని మించి చేయాలని నేను, నన్ను మించి చేయాలని వాళ్ళు పట్టుదలతో వుండేవాళ్లము. అందువల్ల మాలో వున్న నటనాకౌశలాన్నంతా ప్రకటించటానికి ఇది వొక ఆస్పదంగా వుంటుండేది. కొన్ని కొన్ని కొత్త సందర్భాలు, మా మధురం నాకు సృష్టిస్తుండేది. సమయస్ఫూర్తి వుంటేనే గాని వీటిని నిర్వహించటానికి వీలుగా వుండేది కాదు. ఒకప్పుడు "అదేవిటే పికారం" అని నేనన్న తరువాత "ఆఖరు వికారమని" జవాబుచెప్పి "శేక్ చేర్" అన్నాడు నరసింహారావు - కాదండి!—మా మధురవాణి. దానికి నేను కూడా ఏదో వయ్యారంగా అదేస్థాయిలో జవాబు చెప్పానని బాగా జ్ఞాపకము.

ప్రేక్షకులు నా బుచ్చమ్మ సీను యెప్పుడై పోతుందా యెప్పుడు మధురం, రామప్పంతులు సీనులు చూదామా అని వుత్సాహపడుతుండేవాళ్లు. కారణం నా సీనులు కొంచెం దీర్ఘంగా వుండేవి. యెంతసేపు లెక్చర్లలాగా భోయిష్ఠంగా వుండేవి నా బుచ్చెమ్మతో సంభాషణలు. తరువాత రానురాను వీటిని కురచపరచాననుకోండి. అయిప్పటికి పెద్దసీనులుగా కనిపిస్తుండేవి. నేను గిరీశంపాత్ర యెప్పుడువేసినప్పటికీ ఒకగమ్యస్థానాన్ని ఈబుచ్చమ్మ సీనులలో చేరటానికి ప్రయత్నిస్తుండేవాణ్ణి. నేను చెప్పే మాటలు, నేను చేసేచేష్టలు చూసి తల్లులు, తరుణ యువతులు లోలోపల తిట్టుకుని శపించాలన్నంత భావప్రకటన చెయ్యాలని అనుకుంటుండేవాడిని. నిజంగా బుచ్చెమ్మ సౌందర్యానికి గిరీశం వ్యామోహపడ్డాడంటే నేను నమ్మను. బుచ్చమ్మ నా దృష్టిలో అంత సౌం[illegible] కూడా కాదేమో అనిపిస్తుంది. కాని అనాఘ్రాత పుష్పం ఆ చిన్నది. అందులో వైదిక కుటుంబంలో పుట్టి ఆ కట్టుబాట్లలో, ఆ స్నానాల్లో, ఆ నిష్ఠల్లో మునిగి తేలుతుండేది. పట్నంలో తాను చూచిన సానెలనుగాని, యువతులనుగాని మరిపించే అభూషిత నగ్న సౌందర్యము ఆవిడలో కనిపించింది.

అదీ గాక మరోసూక్ష్మంకూడా వుంది. అలభ్యమైనదాన్ని, అందరాని పండును ఆశించి దాన్ని లభ్యం, భోజ్యం చేసుకోటంలోనే వుంది పురుషప్రయత్నమంతాను. ఇంత అవ్యక్త కుటుంబములో వున్న బాలవైధవ్యమనుభవిస్తున్న బుచ్చెమ్మను ఒప్పించి, లేవదీసుకుపోవటంలో, 'మజా, ప్రయోజకత్వం'వుంది గాని యేదో కేఫు మారి వ్యవహారం చేసి ఇల్లు వెడలనీయటంలో ఏ మాత్రం Romance కనిపించింది కాదు. అందుకని మొదట్నించి, చివరదాకా కూడా ఒక కార్యాచరణం స్థిరపరచుకున్నాడు ఈ కార్యవాది; దాన్ని ఆచరణలో పెట్టాడు. చివరకు రుబ్బురోలు సీనులో బుచ్చెమ్మను తాను చిత్రించినదాంపత్యదృశ్యంతో తాను పూర్ణంగాఆవిణ్ణి జయించాను అనుకున్నప్పుడు తాను, అయితే నాతోలేచి పోయిరా అన్నప్పుడు ఆవిడ 'నా ప్రాణంపోయినా మీతోరా'నని కుస్సున జవాబిచ్చేసరికి మరో తెలివితక్కువసీనుగైతే వెనకంజ వేసేవాడే. కాని వాడు, 'నిసద భీషణ శంఖము దేవదత్తమే' లాంటి Resourceful గిరీశం వెంటనే పెద్ద యెత్తు వేశాడు. తిరుగులేనిది. ముందుగా పెద్దజుట్టు వేయించుకున్నాడు గనుక దాన్ని జ్ఞాపకానికి తెచ్చి తను ప్రాణత్యాగం చేసుకుంటానని కొంత హంగమా చేస్తాడు. వెంటనే బుచ్చెమ్మ నిర్ఘాంతపోయి అవ్యక్తంగా 'మీరేం చేయమంటే అది చేస్తా' నని తెల్లబోయి చెప్పింది. వొట్టిచ్చిన తరువాత ఇక యేమొచ్చినప్పటికి బుచ్చెమ్మ తిరిగి పోదు అని గిరీశానికి ధైర్యం వుంది. లేకపోతే ఇన్ని లెక్చర్లే యిచ్చేవాడే కాదు మొదట్నించి. కొండెక్కినంత పనై పోయింది. ఆ మందార మొగ్గలను చెట్టునుంచి త్రుంచాడు. ఇక దాన్ని అవతలికి దాటించడమే తరువాయి. అంతే...

ఏదో విమర్శనాత్మకంగాను, అన్యోపదేశంగాను చెప్పుకొచ్చాను క్షమించాలి. వెంటనే హనుమంతుడికి వచ్చినంత వుత్సాహం వచ్చేస్తుంది నాకు. వెంకటేశం మిడతను పట్టుకొస్తాడు. వూరుపిండి పెట్టమంటాడు అక్కయ్యను. నేనేమో మిడతల్ని పట్టటమనేది ఒక Natural

**History** అని చెప్పి ఏదో ఏదో కొంచెం ఆనందబాష్పాలతోనే అంటాను. వళ్లు తెలియని స్థితి ఏం చేయమంటారు? పెళ్లికి ఎప్పుడు ఎంత తొందరగా తరలిపోవటమా? ఎప్పుడు బండి తోవ తప్పించుటమా? ఎప్పుడు రామవరం దాకా ఆరాత్రే అంచీబళ్ళమీద దాటిపోవటమా అనే ఆలోచనలోనే వుంటాను......

చివరకు సౌజన్యారావు పంతులు సీనులో వచ్చేసరికి అత్యంతమైనటువంటి నటనోత్సాహాలు నాలో వుద్భవించేవి. నా కృత్రిమ జీవితాన్నంతా మధురవాణి మగవేషంలో వచ్చి బట్టబయలు చేసేటప్పుడు నాలో వున్న కౌశలాన్ని యావదాస్తి విని యోగపరచాలి, ప్రకటించాలి అని వువ్విళ్లూరుతూ వుండేవాణ్ణి. ఆ సందర్భము ఎంతో క్లిష్టమైనది కనుక. యెంతదూరం విజయం పొందేవాణ్ణో నేను చెప్పలేను. కాని నా శాయశక్తుల చేసేవాణ్ణి. బుచ్చెమ్మదగ్గర ఎంత టక్కుటమారం చేసినా పరిశిపోయింది. కాని సౌజన్యారావు పంతులు గారిని, నేను 'నెపోలియన్ ఆఫ్ యాంటీనాచ్' నని, ఒక గొప్ప ఆశయాలు గల వర్ధమాన యువకుణ్ణని, ఇంద్రియ నిగ్రహాల సాధకుడనని నమ్మకంగా ఒప్పించడంలోనే వుంది నా తెలివితేట లంతా. నేనెంత గట్టిగా ఒప్పిస్తానో దానికి నూరురెట్లు సిగ్గుతీసేటంత ఘట్టిగా ఆయన నన్ను 'నెపోలియన్ ఆఫ్ యాంటీనాచ్ గాయాం! ఈశ్వణ్ణి మా రెరుగుదురా?' అని బయటవేసేటట్లు నేను నటించినప్పుడే నేను గిరీశం పాత్రను సరిగ్గా నిర్వహించా నని అనుకునేవాణ్ణి. బయటపడ్డ తరువాత నిజంగా విపరీతమైన పశ్చాత్తాపతప్తుణ్ణైనట్లు నటించడము నా కంత కష్ట మనిపించేది కాదు. 'ట్రూ రిపెంటెన్స్‌కు ట్వెంటీఫోర్ అవర్సు చాలదా అండీ' అని అన్నప్పుడు 'డామిట్-కథ అడ్డంగా తిరిగింది' అని ఎగ్జిట్ కొట్టినప్పుడు ఇంకా పూర్వపు గిరీశంగానే ముగిస్తూ వుండేవాణ్ణి. ఏదో బాబు! నా చేతనైనంత కృషి చేశాను ఈ వేషానికి. యుగంధరుడు వేషం ఈ వేష మంత కష్ట మనిపించేది కాదు. ఎన్నిమార్లు వేసినా మళ్లీ వెయ్యా లనిపిస్తూ వుండేది. ఇప్పటికి 60 సంవత్సరాలు వచ్చినై నాకు. ఇంకా ఈ వేషంమీద మోజు తీరలేదంటే నమ్మండి. నిజం చెప్తున్నా. వేషం చిన్నదైనప్పటికీ, గిరీశంగా నాయువస్సు ఒప్పకపోతే, చివరకు, అసిరిగాడివేషం వేసి రామప్పంతుల దగ్గర రూపాయి పుచ్చుకున్న తరువాత 'ఓ, రాజో నా రాజో. నా రాజనిమ్మల పండో, నా తెలిమామిడిపెలుగో '......' అంటూ గెంతుతూ నా వృద్ధాప్యంలో కూడా వెయ్యలేకపోతా నన్నంత వుత్సాహం నాలో వుందింకా ... ... ... ఈలాంటి సంబంధబాంధవ్యాల్ని, ఈలాంటి అనురాగాల్ని నాకు సంధానంచేసి పరలోకగతుడైనాడు ఈ గ్రంథకర్త గురజాడ అప్పారావు పంతులుగారు. 'గిరీశం గారి పునరాగమన' మని ఒక చిన్న నాటకాన్ని రేఖామాత్రంగా వ్రాశాను కాని దాన్ని మరింత విస్తరించి కన్యాశుల్కం మంతటివిదిగా వ్రాయాలని మనస్సులో నిశ్చయించుకున్నాను. నా స్వామిదయవల్ల యెప్పుడైనా చేసి తీరుతాను. ఆవిధంగా కూడా అప్పారాయకవి బ్రహ్మకు నేను పడ్డ ఋణం తీర్చుకుంటాను.

దేశాభిమానం నాకు కద్దని, వొట్టిగొప్పలు చెప్పుకోకోయి!
పూని యేదైనాను వొకమేల్, కూర్చి జనులకు చూపవోయి!

చెట్టపట్టాల్ పట్టుకుని దేశస్థు లంతా నడవవలెనోయి!
అన్నదమ్ములవలెను జాతులు, మతము లన్నీ మెలగవలెనోయి!

Edited and Published by T. Ramachandra, 2/583, Pycrofts Road, Madras-5.
Printed by G. Bhavanarayana at the Weldun Press, 146, T. H. Road, Madras-21.

[45 వ పేజీ తరువాయి]

ఆవశ్యం చాల యెత్తైన దని అనుకుంటుంది. మళ్లా రుబ్బుతుంటే తాటాకులు రోట్లో పడుతున్నా యని కొంచం జరిపి పెట్ట మంటుంది. గిరీశం నిజంగా సంఘసంస్కర్త అని నమ్మింది. అతడు 'మీకోసం యేం చెయ్యమంటే అది చేస్తాను. ప్రాణం విచ్చెయ్యమంటే ఇచ్చేస్తాను. దాఖలా చూడండి. ఇదిగో కత్తిపీట' అంటే 'పెళ్లికి ఈసంబంధం తప్పించారు కారు' అంటుంది. గిరీశం 'అదొక్కటిమటుకు నాకు సాధ్యమైందిగాదు' అంటే బుచ్చమ్మ అంటుంది 'అయి నావిూతో నా కేంపని' అని. ఈ ఒక ముక్క ఆమెవ్యక్తిత్వాన్ని మనకు తెలియజేస్తుంది. గిరీశంతో ఆమెమాట్లాడడంలోగల ఉద్దేశ్యం చెల్లి పెళ్లి తప్పించడమే. పైగా లుబ్ధావధాన్లు గిరీశానికి అన్నగారవుతారు కాబట్టి 'మీరు చెప్తే లుబ్ధావధాని పెళ్లి మానుకుంటా' రంటుంది. గిరీశం బుచ్చెమ్మను పునిస్త్రీని చెయ్యడంగూర్చి ప్రస్తావిస్తాడు. ఆమె ఎంతసేపటికీ చెల్లెలి పెళ్లిని తప్పించడాన్నిగూర్చే అడుగుతుంది - చివరకు గిరీశం 'ఈ పెళ్లి తప్పించే సాధనం నీ చేతిలోనే ఉన్న'దంటే బుచ్చెమ్మ ఆశ్చర్యపడుతుంది 'నీ చెల్లెలి పెళ్లి తప్పించడం నీచేత అయితే చేస్తా నని ప్రమాణపూర్తిగా చెప్పమంటాడు గిరీశం - అప్పటికి బుచ్చమ్మ 'నేను మీతో లేచివస్తే మాచెల్లెలు పెళ్లి పోతుందీ' అని ప్రశ్నిస్తుంది. గిరీశం ఆమెను పెళ్లాడతా నని ప్రతిసారి చెప్పడంవల్ల, దానివల్ల తప్ప చెల్లెలి పెళ్లి తప్పే మరో గత్యంతరం లేనందువల్ల, బుచ్చెమ్మ గిరీశంతో వెళ్లడానికి ఒప్పుకుంటుంది. ఆమె చరిత్ర పాఠకులకు అప్పారావుగారెక్కడ సూచించలేదు. లేవదీసుకొని పోయిన గిరీశం ఆమెను విధవాశ్రమంలో ఉంచి సౌజన్యరావును కలుసుకొంటాడు. అక్కడ మధురవాణి మూలంగా అతని గుట్టు బయట పడుతుంది. బుచ్చెమ్మ రక్షింపబడుతుంది. కన్యాశుల్క నాటకంలో తండ్రి ధనాశాఫలితంగా జీవితం పాడు చేసుకొని, తనవారికోసం యేవిధమైన త్యాగము చేయడానికైనా సిద్ధమైన పవిత్ర యువతి బుచ్చెమ్మ. అంతా మోసం, అంతా స్వార్థం, అంతా విషంచిలిప్పే వ్యాపించి యున్న వాతావరణంలో బుచ్చెమ్మ స్వచ్ఛమైన నిస్స్వార్థత్యాగజ్యోతిగా భాసిల్లుతూ ఉన్నది.

---

[56 వ పుట తరువాయి]

ఏనిట విశ్రాంతియుం గూర్చిన - యని రెండుపాదములలో కూర్చెను.

అనంతుని ఛందస్సులో దీనినే 'వృషభగమన' యని చెప్పినాడు.

"శ్రీ మనోహర సంబుజోదరుం
జితజాతగురుం దలంచెద !"

ఈ లక్షణము ముత్యాలసరమునకు సరిపోవును. అప్పకవి చెప్పిన రగడ అంతగా సరిపడదు. దేశిభాషలలో కన్నడములోని 'భామినీషట్పది' యను వృత్తమునకు ముత్యాలసరమునకు పోలికలున్నవి. 3+4+3+4 రెండుపాదములు నడిచి, మూడవపాదములో 3+4+3+4+3+4+2 అగును. ఇట్టి మూడుపాదములు జంటగా 'భామినీషట్పది' యగును.

కాని 'గోవుపాట' అనునది యీ ముత్యాలసరమువలె నడచినట్టు కానవచ్చుచున్నది. అందు 14 మాత్రల ఛందస్సు నాలుగుపాదములను నడపినది. కథాగేయములకు ఈ ఛందస్సు ఒదిగిన వీలుచూచియే కాబోలు అప్పారాయకవి తాను రచించినవానిలో 'లవణరాజు కల' 'కన్యక' 'డామన్ పిథియస్' 'కాసులు'—అను పద్యకథలకు ముత్యాలసరమునే వాడుకొనెను. పూర్ణమ్మ మాత్రము పాడుకొనుటకు వీలుగాను కరుణరసస్ఫూర్తిదాయకమైన రాగముల కనువుగాను 16 మాత్రలలో నడిపినాడు.

'పుత్తడిబొమ్మా పూర్ణమ్మా!' అని జాలిగా పాడుచో వాడివత్తె లయిన ఒక బంగారు బొమ్మ కన్నుల ప్రాణములతో కట్టెదుట నిలుచును. 'దేశభక్తి' అను రచనలో ప్రబోధగీతముగా ముత్యాలసరములనే అప్పారాయకవి ప్రయోగించినాడు.

దేశమును ప్రేమించు మన్నా
మంచి యన్నది పెంచు మన్నా
దేశ మంటే మట్టికాదోయ్
దేశ మంటే మనుషులోయ్...

14 మాత్రల ముత్యాలసరమే ఇది...'మనిషి' అనుపాటలో కూడా ఇదే ఛందస్సు.

మనిషి చేసిన రాయిరప్పకి
మహిమ కలదని సాగి మొక్కుతు
మనుషు లంటే రాయిరప్పల
కన్న కనిష్టం!

చివరిపాదములో నాలుగు, ఎనిమిది మాత్రలతో యీగేయరచన సాగినది - కాని వీటిని తొమ్మిది లేక ఏడుమాత్రలలోనికి మలచుకొని పాడుకొనవచ్చును.

ముత్యాలసరము ఎక్కడ వాడినను అప్పారావుగారు ముచ్చట లుట్టిపడినట్లుచేసి రానున్న కవులకు మార్గదర్శకు లయినారు.

సంవత్సర చందా : ఆరు రూపాయలు.

*[Approved for the use of all Libraries]*

# EXTRACTS FROM THE PROCEEDINGS OF THE DIRECTOR OF PUBLIC INSTRUCTION, ANDHRA, MADRAS.

*Dis. No. 2505/55.* *Dated: 24-8-'55.*

---

The following journal is commended for use in the libraries of schools, Colleges and Public Libraries.

*Name:* A Bi-monthly journal entitled 'Parisodhana' devoted to Research of Indology.

*Price:* Re. 1/- per copy. (Annual subscription Rs. 6/-) The journal can be had from Sri T. Ramachandra, Editor, Parisodhana, 2/583, Pycrofts Road, Triplicane, Madras-5.

K. RAGHAVA REDDY,
*For Director of Public Instruction.*

---

*For Copies:—*
*The Manager,*
**'Parisodhana'**
**2/583, Pycrofts Road, Madras-5.**



# పరిశోధన

(సారస్వత ద్వైమాస పత్రిక)

మన్మథ - శిశిరం

## 12

ఒక రూపాయ

ఫిబ్రవరి, మార్చి 1956

# అనుక్రమణిక

# పరిశోధన


| పుటి 2. | సంపాదకుడు : తిరుమల రామచంద్ర | సంయుక్త సంపాదకుడు : తిమ్మావజ్ఝల కోదండరామయ్య | సంచిక 6 |
| --- | --- | --- | --- |


## మనవి మాటలు

నాడు సాతవాహనులు ప్రారంభించి, కాకతీయులు కొనసాగించిన ఆంధ్ర ప్రాంతాల ఏకీకరణ నేడు సమాప్తప్రాయంకావడం ఆంధ్రావళికి గర్వకారణం. కాని, వేదభాష్యాలు వెలసిన మన పావన పంపాతీరాలు, తంత్రవార్తికాలు తనిసిన మన శాబర భూములు, కనకవర్షాలు కురిపించే కోలారు నేలలు మనతో కలిసిన నాడే ఏకీకరణ సమాప్తం కాగలదు. "తెలుగుతల్లికి తొల్లింటి వెలుగుతోడ నవకళామోదం" ఒనగూడుట ఆనాడే.



శ్రీనివాస సోదరులన్నట్టు,

"పరులమేరలకొఱకు కాసపడను నేను,
సూదిమోపినయంత నాచోటు విడువ,
పోరుకోరను, కవిసిన నూరకుండ,
నేది ఎటులున్న ధర్మమే నాదుదీక్ష"

అనేది మన సత్యప్రతిజ్ఞ. వారే అన్నట్టు,

"చెఱిగిపోవని నాలుగు చెఱగులారసి,
తఱిగిపోవని సిరిసంపదలను బెరసి,
అన్నిటను సాటిలేనిదై......"

మన తెలుగుతల్లి మెఱయునదీ ఆనాడే,

# ఎఱ్ఱా ప్రెగ్గడ - హరివంశరచనాకాలము

శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు

-:o:-

తెనుగు వాఙ్మయములో నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలు కవిత్రయమను పేర ప్రసిద్ధులైన విషయ మందఱకును పరిచితమైనదే. నన్నయ రాజరాజనరేంద్రుని కాలమునను (క్రీ. శ. 1019-1060), తిక్కన మనుమసిద్ధి కాలమునను (క్రీ. శ. 1249-1280), ఎఱ్ఱన ప్రోలయ వేమారెడ్డి కాలమునను (క్రీ. శ. 1325-1353) విలసిల్లి యుండుటచే వీరి కాలములు సునిశ్చితములని, నిర్వివాదములని చెప్పవచ్చును. పై రాజుల కాలనిర్ణయము ననుసరించియే, కవిత్రయ రచితమైన భారత రచనాక్రమమును నిర్ణయింపఁ బడినది. రాజరాజు దీర్ఘ రాజ్యపాలన కాలములో చివరిదశయందు-అనగా క్రీ. శ. 1050 వెనుక నన్నయభట్టు భారతాంధ్రీకరణము ప్రారంభించి అందు మొదటి రెండును నగు ఆదిసభా పర్వములు నరణ్యపర్వమున 4 వ యాశ్వాసమున 142 వ పద్యమువఱకు రచించెను. రాజరాజు కాలముననే సంభవించిన నన్నయ మృతివలననో లేక రాజరాజు మరణానంతరమున రాజమహేంద్రవరమున సంభవించిన రాజకీయ కల్లోలముల వలననో భారత రచన యంతటితో నాగినది. ఆ వెనుక సరిగా రెండు శతాబ్దులకు తరువాత తిక్కన విరాటపర్వమాదిగా స్వర్గారోహణపర్వాంతము వఱకుగల పదునైదు పర్వములను రచించెననియు, తిక్కనకు నలువది యేబది సంవత్సరముల కావలికాలమున, ఎఱ్ఱాప్రగడ నన్నయ విడిచిన యారణ్యపర్వశేషమును పూర్తిచేసెననియు, నందుచే వీరి మువ్వురకు కవిత్రయమను పేరుగలిగినదనియు, కవి చరిత్రకారులును, వాఙ్మయ చరిత్రకారులును తెలుపుచున్నారు.[1]

పై మువ్వురిలో నరణ్యపర్వ శేషము పూరించిన ఎఱ్ఱాప్రెగ్గడ కాలము ప్రస్తుతము మనము పరిశీలింపవలసి యున్నది. ఈతని కాలమును గూర్చి వీరేశలింగము పంతులవారు ఆంధ్రకవుచరిత్రములో "ఇతఁడు తిక్కన సోమయాజి తరువాత నించుమించుగా నేబదిసంవత్సరముల కాలమున నుండినవాడు (పుట 153). ఇతడు తిక్కన సోమయాజి తరువాత నిరువది ముప్పది సంవత్సరముల లోపలనే యుండి యున్నట్టు కనబడుచున్నాఁడు (పుట 169). ఎఱ్ఱాప్రెగడ 1280 వ సంవత్సర ప్రాంతమునందు జననమొంది 1350 సంవత్సర ప్రాంతము వఱకును జీవించియుండును (పుట 173)" అని మూడువిధములుగా వ్రాసియున్నారు. ఆంధ్ర కవితరంగిణి నాల్గవసంపుటము (ఎఱ్ఱాప్రెగడ జీవితము) 58 వ పుటలో "క్రీ. శ. 1280 వ సంవత్సరకాలమున ఎఱ్ఱాప్రెగ్గడ జన్మించి యుండును" అని వ్రాయఁబడియున్నది. ఆతని గ్రంథరచనాకాలములను, మరణమును గూర్చి యిట్లు గలదు: "ఎఱ్ఱాప్రెగ్గడ యరణ్యపర్వశేష నరసింహపురాణములను 1315-1325 ప్రాంతముల రచియించియుండును. అటుపిమ్మట 1330-1340 సంవత్సరము నడుమ రామాయణమును, హరివంశమును చేసి వేమారెడ్డికి కృతి నొసఁగి యుండును. వేమారెడ్డి జీవితకాలములోనే 1345 ప్రాంతమున నీకవి 65 సంవత్సరముల వయస్సున తన భౌతిక దేహమును వీడియుండును."

పై వానినిబట్టి ఎఱ్ఱాప్రెగడ కాలము క్రీ. శ. 1280-1350 అని తేలుచున్నది. ఇంతియేకాక ఎఱ్ఱాప్రెగడ రచనములలో ఆరణ్యపర్వ శేషము తొలికృతియని, హరివంశము తుది కృతియని గూడ తెలియుచున్నది. హరివంశమే ఎఱ్ఱాప్రెగడ రచనలలో కడపటిదని ఎఱ్ఱాప్రెగడ

---

1. ఈ సందర్భమున నీ క్రింది గ్రంథములు తప్పక పరిశీలింపఁదగినవి.

1. The Eastern Chalukyas- Dr. N. VenkataRamanayya, M. A., Ph. D. Putlishers. Vedam Venkataraya Sastri & Bros, Madras.
2. History of the Telugu Cholas Dr. M. Venkataramayya (Thesis).
3. History of the Reddy Kingdoms- M Somasekharasarma, Andhra University Publications.
4. The Reddis M.LT. Thesis of Dr. V. Yasoda Devi D. Litt.

వంశీయుఁడగు చెదలవాడ మల్లన యిట్లు చెప్పి యున్నాఁడు :—

"ప్రతిభతో నారణ్యపర్వ శేషముజెప్పె
కవులకు చెవులపండువులుగాఁగ,
వల్మీక భవు వచో వైఖరి రామాయ
ణంబు నాంధ్రప్రబంధంబుసేసె,
నారసింహుని పురాణ మొనర్చె హరిమెచ్చి
నన్నునెన్నడుచూచి నాఁడవనఁగ,
ప్రౌఢిమై హరివంశభాగముల్ రెండును
రచియించె సభలందు ప్రాజ్ఞులెన్న,
దురితహరు ప్రబంధ పరమేశ్వరుని జెద
ల్వాడ నిలయు నాదువంశకర్త
ధన్యమూర్తి శంభుదాసు నెఱ్ఱాప్రెగ
డన్నుతింప బ్రహ్మకున్ను దరంబె."

(విప్రనారాయణ చరిత్ర - కృత్యాది.)

రెడ్డిరాజ్య చరిత్రకారులును హరివంశమే చివరకృతియని నిర్ధారించియున్నారు - "The Hari vamsam was the lastwork which Errapregada has written at the reguest and under the patronage of Prolayavema"(Reddi kingdoms Chapter IX Page 498). కవితరంగిణీకారుల యభిప్రాయమునుగూడ హరివంశము తుదికృతియని స్పష్టమగుచున్నది.

ఎఱ్ఱాప్రెగడ కాలనిర్ణయమునకు చక్కఁగా తోడ్పడునది హరివంశము. ఆ తోడ్పాటునకు సాధనములా గ్రంథముననే కలవు. హరివంశము రెడ్డిరాజులలో ప్రథముఁడగు ప్రోలయ వేమారెడ్డి కంకితము సేయఁబడినది. ప్రోలయ వేమారెడ్డికాలము 1320-49 వరకునని కొందఱును, 1325-53 వరకునని రెడ్డిరాజ్య చరిత్రకారులును వ్రాసియున్నారు. ఈ కాలములలో రెండవది శాసనస్థ, ప్రమాణములచే నిర్ణయింపఁబడినది. కాని హరివంశావతారిక పరిశీలించినచో క్రీ. శ. 1320 ప్రాంతము రెడ్డిరాజ్యారంభకాలమని తెలియుచున్నది. ఎఱ్ఱన ప్రోలయ వేమారెడ్డి వంశమును నాతని ప్రతాపాదికమును, రాజ్యస్థాపన విషయములను హరివంశావతారికయందు సవిస్తరముగా వర్ణించియున్నాడు. అతఁడు వేమారెడ్డినిఁ గూర్చి హరివంశావతారిక యందు చెప్పిన విషయములను, వేమారెడ్డి కాలమున మనకు లభ్యములైన శాసనములోని విషయములను సమన్వయించినచో హరివంశరచనాకాలము సూక్ష్మముగ నిర్ణయింపగలము. ఎఱ్ఱన చెప్పిన వంశక్రమము వివరములివి:

(1)

పంటవంశమున
వేమయ
|
ప్రోలయ - అన్నమాంబ (భార్య, దొడ్డయకుమార్తె)
|
- మాచయ (1) — కోమటి
- వేమయ (2) (హరివంశ) కృతిభర్త — అనపోతయ
- అన్నయ (3)
- మల్లయ (4)

(2) దొడ్డయ - కృతిభర్త వేమయకు మాతామహుఁడు. అతని వంశము.

దొడ్డయ
|
- పోతయ (1)
- చిట్టయ (2) — సూరయ
- నాగయ (3)

దొడ్డయ ముగ్గురు కుమారులును వేమయ మేనమామలు. రెండవ మేనమామ కుమారుడు నాకయ ప్రత్యేకముగ వర్ణితుఁడైనవాడు.

వేమయకు రాజధాని అద్దంకి. హరివంశ రచనాకాలము నాటికి వేమయ మహాపరాక్రమవంతులగు తమ్ముల సహాయముతోను, మేనమామల సహాయముతోను సామ్రాజ్యము స్థాపించెను. తన కుమారుఁడగు పోతయను యువరాజుగా నొనర్చెను. కృతిపతియగు వేమయ తమ్ములలో అన్నయయు, మల్లయయు "మహావిష్ణువునకు మాఱటచేతుల క్రియ" నొప్పిరి. అందు ముఖ్యముగా మల్లయ వేమయ్యకు "రామునికి లక్ష్మణుడట్లు ప్రకాశించెను." ఈ సందర్భమున నొక ముఖ్యవిషయ మిట చెప్పవలసియున్నది. వేమయను, వేమారెడ్డియనియు, అన్నయను, మల్లయను అన్నారెడ్డి, మల్లారెడ్డియనియు, పోతయను అనపోతారెడ్డియని ఆకాలము నాటి శాసనములలోను, నేటి చరిత్రలయందు వ్యవహారమున్నను ఎఱ్ఱాప్రెగడ హరివంశమం దెచ్చటనుగాని ప్రోలయవేముని 'రెడ్డి' నామముతో పేర్కొనలేదు. (మల్లారెడ్డిని గూర్చి వ్రాయుచు నొక్కచోట యీ శబ్దము నుపయోగించియున్నాడు: "రత్నాకరనాయక గుణ రత్నోజ్జ్వల రెడ్డిమల్ల రాజిత" - హరి. ఉ. భా. ఆ. 5. ప. 249[1]) వేమయ శాసనములోనే రెడ్డిపదము ప్రయుక్తమై యున్నదను మాట వాస్తవమే కాని, ఎఱ్ఱన రెడ్డిపదమునకు తనకాలమున సంతగౌరవార్హమైన యర్థము లేనందున కాబోలు కృతిలో నెచ్చటను దానిని ప్రయోగింపలేదు. హరివంశావతారికలో నీ విషయమునుగూర్చి స్పష్టముగా నిట్లు వ్రాసియున్నాఁడు: "ఇట్లు పూజ్యపూజాతత్పరుండైన నాకు నభీష్టార్థ దాతయై, యవదాత చరితంబున నఖిలజన రంజనంబొనర్చుటం జేసి రాజ శబ్దంబునకు భాజనంబగుచు" (హరివంశము. పూ. భా. 1-10) అని వ్రాయుటయే గాక యాతని బిరుదము లన్నింటిని సమర్థించియున్నాడు. ఏలననగా నవి వంశక్రమాగతముగా వచ్చినవి కావు. వేమారెడ్డితో ప్రారంభమైనవి. అప్పటికి నొక రాజ్యమును పరాక్రమముచే నార్జించి, స్థాపించుటచే, వారిని భూవిభులనియు, ప్రభువులనియు వ్యవహరించెను. ప్రస్తుతము ఎఱ్ఱన యభిప్రాయమును వ్యక్తము చేయుటకు వంశవృక్షమున నట్లు వ్రాసియు, నిక ముందు రెడ్డిపదమును చేర్చియే వ్యవహరించుచున్నాను. అది పాఠకలోకమునకు సుగమముగ నుండును.

వేమారెడ్డి తమ్ముడగు మల్లారెడ్డి మోటుపల్లి నిజయించి దానిని రెడ్డిరాజ్యమునఁ జేర్చెను. వేమారెడ్డి బిరుదములు-పల్లవాదిత్య జగనొబ్బగండ - సంగరక్షపాల - కేళాదిరాయ - భుజబలభీమ - వీరనారాయణ - గుజ్జరదళవిభాళ - జగరక్షపాల - చెంచుమల చూఱకాఱ - మండలీకరగండ - పేర్కొనఁ బడినవి. ఇవి వేమారెడ్డిని గూర్చి హరివంశమునఁ జెప్పబడినవి. ఇక వేమారెడ్డి శాసనములను, వానిలోని వివరములును నిచ్చెదను.

క్రీ. శ. 1325 మల్లవరశాసనము-ఇందు ప్రోలయవేముని రాజ్యవిస్తారము చెప్పబడినది. 1330 వడ్వేరుశాసనము - దానాదికములు. 1332 నకరికంటి శాసనము, కుంకలగుంట్ల శాసనము - దానాదికములు 1335 చీమకుర్తి శాసనము- శ్రీశైల సోపాన ప్రస్తావము. 1340 మంచాళ్ల శాసనము - కొండవీడు రాజధాని - శ్రీకుండిననామపురీమతిష్ఠత్, ప్రోలయ వేముని కైదుగురు పుత్రులు.

"ప్రోలాభిదప్రాప పురాతనోద...
తతశ్చపుత్రాన పిపంచలేభే", శ్రీశైల సోపాన ప్రస్తావము, "శ్రీశైల శిఖరాక్రాంత సోపాన రచనాశ్రేయస్సంపాదిత".

1345 ముట్లూరిశాసనము- ప్రోలయ వేముని కైదుగురు పుత్రులు, "మాచనృపతిం శ్రీవేమ పృథ్వీపతిం దొడ్డక్ష్మాభుజ మన్నభూమిరమణం శ్రీమల్ల భూవల్లభమ్", శ్రీశైల సోపాన

1. ఇట్టే నిశ్శంక కొమ్మనయును కవి క్రీ. శ. 1434 ప్రాంతమున 'శివలీలావిలాసము' అను కావ్యమును నీ వంశీయులలో నొకడును, రాజమహేంద్రవరపాలకుడునగు దొడ్డారెడ్డి కంకితమిచ్చియుండియు రెడ్డి పదము నెంతమాత్రమును వాడియుండలేదు. (చూ. శివలీలావిలాసము అను నా వ్యాసము. రెడ్డి సంచిక. ఆంధ్రేతిహాస పరిశోధక మహామండలి, రాజమహేంద్రవరము. 1935)

ప్రస్తావము. "యేన శ్రీగిరి రప్యహోబలగిరి స్సోపాన మార్గాంకితా."

1345 అనవేముని ఆతుకూరు శాసనము- వేముడు మ్లేచ్ఛులనెడు సముద్రమునకు అగస్త్యుని వంటివాఁడు. ప్రోలయవేముని కైదుగురుకుమారులు. 1345 పెరవలి శాసనము - అగ్రహార దానము. క్రీ. శ. 1345 వేమారెడ్డి అమరావతీ శాసనము- మల్లారెడ్డి పుణ్యమునకు గుడిమీద సువర్ణకలశము లెత్తింపబడినవి. క్రీ. శ. 1353 మణికేశ్వరము శాసనము. దానాదికముల దెల్పును. ఇంకను మఱికొన్ని శాసనములు. స్థానిక సంపుటములయందు కలవు అవియును పరిశీలింపవలసి యున్నవి.

పై శాసన విషయములను సమన్వయము చేయునప్పుడు మనము మొదట పరిశీలించ దగినది—

1. మల్లారెడ్డి విషయము - హరివంశ రచనా కాలమునకు మల్లారెడ్డి జీవించియున్నట్లును, వేమారెడ్డికి మల్లారెడ్డికి నెంతయో సౌభ్రాత్రత్వ మున్నట్లును నా గ్రంథములందలి యీ క్రింది పద్యములు వ్యక్తమొనర్చుచున్నవి. మఱియును ఎఱ్ఱాప్రెగ్గడకు తొలుత నాశ్రయమిచ్చినవాడు మల్లారెడ్డి యనియు, నాతడే వేమారెడ్డికి నెఱుకపఱచెననియు, నీ క్రింది పద్యము వలనఁ దెలియుచున్నది.

" నా తమ్ముండు ఘనుండు మల్లరథిని
నాథుండు నిన్నాతత
శ్రీతోడన్ సముపేతుఁజేసి యెలమిం
జేపట్టి మాకిచ్చుటం
జేతోమోద మెలర్ప రామకథముం
జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతిం బొందితి నిం కనుం దనియనే
గావ్యామృత స్వాదనన్."

పై దానినిబట్టి ఎఱ్ఱాప్రెగడ రామాయణ రచనమునకు కారణము మల్లారెడ్డియే యని స్పష్టమగుచున్నది. హరివంశమున మల్లారెడ్డి ప్రశంస యాశ్వాసాంతముల నీ క్రిందివానిలో గలదు.

"సకల ద్వీపాంతర ర
త్నకలాప నిరంతరార్చనా కలనారం
భక కురుమలూరి పురనా
యక మల్లచమూవరేణ్య హరినివేద్యా."
(ప్రథమాశ్వాసాంతము-పూర్వభాగము)

"సర్వధురీణ గుణోదయ
సర్వజ్ఞో దాత్తవృత్త సంసిద్ధయశో
గర్వితి మల్లచమూవర
నిర్వంచక సోదరత్వ నిత్యారాధ్యా."
(ద్వితీయాశ్వాసాంతము)

"రామాయణ హరివంశ
శ్రీ మన్మధుర ప్రసంగ సిద్ధచిరయశ
స్స్వామర్త్య కరణ నిపుణా
శ్రీ మల్లచమూవరేణ్య సేవిత హృదయా"
(తృతీయాశ్వాసాంతము.)

"శ్రీ మల్లచమూ వల్లభ
సామాదిక చతురుపాయ సామర్థ్య సమ
త్వాసుమంతోజ్జ్వల వైభవ
సామగ్రీ లబ్ధ సఫల సౌభ్రాత్రసుఖా"
(ప్రథమాశ్వాసాంతము-(ఉత్తర భాగము)

"బహుజలధి ద్వీపాంతర
మహీశ్వర ప్రణిత జాతిమణి మౌక్తిక హ
స్తి హయాద్యగ్రపణ సేవా
బహుమత మల్లరథినీశ భక్తప్రేమా"
(ద్వితీయాశ్వాసాంతము)

"ధీయుక్త మల్లరథినీ
నాయక మంత్రప్రయుక్త నయపూర్వకశా
ర్యాయత్త ఖడ్గవిభవ
స్థాయద్విభవాభి పోషు భాసురివేషా"
(తృతీయాశ్వాసాంతము)

"రత్నాకర నాయకగుణ
రత్నోజ్జ్వల రెడ్డిమల్ల రాజితశశ్వ
ద్యత్నాంతర ద్వీపాంతర
రత్నాలంకృత సమస్త రాజ్యరమాంగా!"
(పంచమాశ్వాసాంతము)

"శ్రీమల్లచమూపతి నే
వామధురిమ నిత్య సుముఖ నామవిచార
వ్యామోహ విముఖ యాచిత
వామార్ధాంగ పరతత్త్వ వాసవసత్త్వా"
(సప్తమాశ్వాసాంతము)

పై యుదాహృతులనుబట్టి హరివంశ రచనా కాలమునకు మల్లారెడ్డి జీవించి యున్నట్లు స్పష్టము. అతఁడు క్రీ. శ. 1345 లో మరణించి

నట్లును, నాతని పుణ్యమునకుగాను అన్నయగు వేమారెడ్డి అమరావతీ క్షేత్రమున అమరేశ్వర స్వామి యాలయమునకు పైడు సువర్ణకలశము లెత్తించినట్లుగను నా శాసనము తెలుపుచున్నది.

(1) "స్వస్తిశ్రీ శకవర్షంబులు 1267 అగు నేంటి పార్థివ సంవత్సర కార్తిక శు॥ ౭ అగు నాంటి మన్వాది మహాకార్తిక పుణ్యకాలమునందు స్వస్తిశ్రీ ధాన్యవాటీశ్వర అమరేశ్వర మహాదేవరకు స్వస్తి సకలగుణగణాలంకార, వెంజిమల చూఱకార........త్రిపురాంతకదేవ దివ్యశ్రీపాదపద్మారాధకులైన శ్రీమతు వేమయరెడ్డింగారు తమతమ్ముడు మల్లయరెడ్డింగారికి అక్షయ పుణ్యముంగాను గుడిమీంది సువర్ణ కలశాలు అయిదున్ను పసిండిపట్టమును కల్పాంతర స్థాయిగాను సమర్పణ సేసి"

ఈ శాసనము, దక్షిణహిందూదేశ శాసన సంపుటములు 6 వ సంపుటములో 213 సంఖ్యగా నీయబడినది. రెడ్డిసంచిక యనుబంధమున (పుట 14) ప్రకటితమైనది.[1] మల్లారెడ్డి. క్రీ. శ. 1345 లో మరణించినట్లు శాసన ప్రమాణము కనబడుచుండగా రెడ్డి సామ్రాజ్యముల చరిత్రలో (**History of Reddi Kingdoms** లో) పై విషయము విస్మృతమగుట వింతగ నున్నది. వారు వ్రాసినది చూడుడు.

**"Mallareddi the youngest brother of Vema was according to the Mallavaram inscription of the Telugu work Harivamsam, the Commander of the Reddi army. He warded off a Muslim invasion...... by defeating Turuska Mallas like Allauddin. This Allauddin was no other than Allauddin the first Bahmini Sultan of Gulbarga who ascended the throne in 1347 AD. (Saka 1269). The Muslims did not stop with invading Telingana, the warrangal kingdom of Kapaya Nayaka, but seem to have crossed the Krishna river and attacked the Reddi dominion Malla Reddi the Commander of the Reddi force drove them away after inflicting a severe defeat on the Bahmini Sultan Allauddin and protected the Kingdom. It must have however have taken place some time after the coronation of Allauddin in 1347 A.D" (The History of Reddi Kingdoms, Sri M. Somasekhara Sarma Pp. 78)**

("వేముని కనిష్ఠ సోదరుడగు మల్లారెడ్డి మల్లవరము శాసనమునను సరించియు, హరివంశము ననుసరించియు వేముని సైన్యాధిపతియని తెలియుచున్నది. ఈతడు అల్లావుద్దీను అను తురుష్కమల్లుని జయించెను. ఈ అల్లావుద్దీను క్రీ. శ. 1347 లో గుల్బర్గాలో సింహాసనము నధిష్ఠించిన మొదటి బహమనీ సుల్తానేగాని వేఱొకరు కాదు. ముస్లిములు, వరంగలు రాజధానిగా గల కాపయనాయకుని తెలంగాణా ప్రాంతముపై దాడివెడలుటతో నిలువక, కృష్ణానదిని దాటి రెడ్డిరాజ్యముపై దాడివెడలిరి. రెడ్డి చమూపతియగు మల్లారెడ్డి ముస్లిములను తరిమి, అల్లావుద్దీనుసుల్తానును జయించి, రాజ్యమును సంరక్షించెను. ఈ యుద్ధంతము. క్రీ. శ. 1347 లో అల్లావుద్దీను పట్టాభిషేకము పిదప కొంత కాలమైన వెనుక జరిగి యుండును.")

క్రీ. శ. 1345 లో మల్లారెడ్డి మరణమును గూర్చి శాసనములు ఘోషించుచుండగా మల్లారెడ్డి జయము క్రీ. శ. 1347 తరువాత జరిగి యుండుననుట దురూహముగ నున్నది. మఱియు నీ సందర్భమున రెడ్డిసంచిక 24 పుటలో నేమి వ్రాయబడినదో చూడుడు. "మల్లారెడ్డి జయించిన అల్లావదీనాది తురుష్కమల్లుడు క్రీ. శ. 1347 లో రాజ్యమునకు వచ్చిన అల్లావుద్దీను బహమనీ కాఁజాలఁడు. అతఁడు ఢిల్లీసుల్తాను, మహమ్మదు బిన్ తుఘ్లకు కాదగును."

దీనినిబట్టి హరివంశము క్రీ. శ. 1345 సంవత్సరమునకు ముందుగానే రచితమైనదని నిర్ధారణ చేయవచ్చును. ఇంక నీ రచనము క్రీ. శ. 1340 కి ముందుగా జరిగినదని నిర్ణయము చేయుటకు మనకు రెండవయంశము తోడ్పడుచున్నది.

(2) హరివంశమున నెల్లెడ అద్దంకి రాజధానియని చెప్పినట్లుగా మునుదాహరించియే యున్నాను. వేమారెడ్డి రాజ్యపాలన ప్రారంభ కాలములో అద్దంకి రాజధాని. క్రమముగా

1. 1897 శాసన నివేదికయందును (**AR 263.**), ఆంధ్రకవి తరంగిణి యందును నీ శాసనముదాహృతమైనది.

నాత డుత్తరము కృష్ణానది పర్యంతప్రదేశముల నాక్రమించినాడు. ఆక్రమించిన ప్రదేశములను తన స్వాధీనములో నుంచుకొనుటకు నచ్చటికి దగ్గఱగానుండునది, మహాబలిష్ఠమగునది యగు కొండవీడును మఱియొక రాజధానిగాచేసినాడు. ఈ విషయము క్రీ. శ. 1340 సంవత్సరమున మంచాళ్ల శాసనమున పేర్కొనఁబడినది. కాబట్టి కొండవీడు మఱియొక రాజధానిగా నాకాలమున నున్నట్లు స్పష్టము. హరివంశమున కొండవీటి ప్రస్తావన లేకపోవుటచే నది క్రీ. శ. 1340 సంవత్సరమునకు ముందే రచితమైనదని చెప్పనగును.

ఇంకను సూక్ష్మముగా క్రీ. శ. 1335 ప్రాంతముల కు ముందే హరివంశము రచితమైనదని మూడవ యాధారముచే నిర్ణయింప వచ్చును.

(3) శ్రీశైల సోపాన నిర్మాణ ప్రశంస: హరివంశ కృతిపతి యాచంద్రార్కముగా నొనరించిన మహాకార్యములలో శ్రీశైలమునకు, నహోబలమునకు సోపాన నిర్మాణముగావించుట ప్రధానమైనది. ఈ ఘనకార్యము వేమారెడ్డి శాసనములలోను, నాతని తరువాతివారి శాసనములోను ప్రస్తుతమైనది. శ్రీనాథమహాకవియు 'శ్రీ పర్వత సోపాన స్థాపితుఁడగు రెడ్డివేమ జగతీపతికిన్' అని చెప్పియున్నాఁడు. కాని యీ ఘనకార్యము హరివంశమున పేర్కొనబడి యుండలేదు - కాబట్టి హరివంశ రచనము దీనికి ముందే జరిగియుండుననుట నిర్వివాదాంశము.

వేమారెడ్డి శాసనములలో క్రీ. శ. 1335 నాటి చీమకుర్తి శాసనమున 'శ్రీపర్వతాహోబిల పర్వత సోపాన దిక్కాంతా మనోహర కీర్తి కుసుమామోద' అని యీ కార్య ప్రశంస చేయబడియున్నది. ఆవెనుక వేముని శాసనము లను నీవిషయ ముట్టంకింపబడియున్నది. కాబట్టి హరివంశరచనము క్రీ. శ. 1335 ప్రాంతమునకు ముందే జరిగియుండవలెనని నిశ్చితమగుచున్నది. మఱియు వేమారెడ్డి శాసనములలో ప్రథమమగు మల్లవరము శాసనములో -అనగా క్రీ. శ. 1325 వ సంవత్సరమున నీ సోపాన ప్రస్తావన లేదు. దీనినిబట్టి యీ సోపాన నిర్మాణము క్రీ. శ. 1325 - 1335 మధ్యకాలమున జరిగి యుండునని నిర్ణయింపవచ్చును. దీని ననుసరించి, హరివంశరచనము 1325 - 1335 మధ్యకాలమున జరిగియుండునని నిర్ణయింప వచ్చును.

ఇంకను హరివంశ రచన కాలము క్రీ. శ. 1325 కు ముందేయని నిర్ణయించుటకు నాల్గవ సాధనమున్నది. అది:

(4) దొడ్డారెడ్డి ప్రశంస. ఎఱ్ఱాప్రెగడ హరివంశావతారికలో నిచ్చిన వంశక్రమము ముందు చూపియే యున్నాను. అందు, ప్రోలయరెడ్డికి మాచ, వేమ, అన్న, మల్ల అను నలుగురు కుమారు లున్నట్లు స్పష్టమగుచున్నదిగదా! అనగా కృతిపతియగు వేమారెడ్డికి ముగ్గురు సోదరులు - అనికూడ తెలియుచున్నదిగదా! కాని క్రీ. శ. 1325 తరువాతి వేమారెడ్డి శాసనములలో మంచాళ్ల శాసనము (క్రీ.శ. 1340) లోను, మల్లవరముశాసనములోను 'ప్రోలాభిధః ప్రాపపుత్రానతో ద..తతశ్చ పుత్రానపి పంచ లేభే' యనియు, ముట్లూరి శాసనము (క్రీ. శ. 1345) లో స్పష్టముగా "సాధ్వీ వీర మనూత మాచ నృపతిం, శ్రీ వేమపృథ్వీపతిం, దొడ్డక్ష్మాభుజమన్న భూమిరమణం శ్రీ మల్లభూవల్లభమ్" అని ప్రోలయ వేముని కొమారులైదుగురు పేర్కొనబడియున్నారు. దీనినిబట్టి వేమారెడ్డికి దొడ్డారెడ్డి యని వేఱొక సోదరుఁడున్నట్లును నాతఁడు క్రీ. శ. 1325 నాటి మల్లవర శాసనముననే యుదాహృతుఁడైనట్లు తెలియుచున్నది.

కావున దొడ్డారెడ్డి ప్రస్తావనలేని హరివంశము క్రీ. శ. 1325 సంవత్సరమునకు ముందే రచితమైనదని నిర్వివాదముగా నేర్పడుచున్నది. హరివంశావతారికలోని విషయములను, శాసన విషయములను సమన్వయింపకపోవుటచే నీ దొడ్డారెడ్డినిఁగూర్చి యీవఱకు చరిత్రకారులును, వాఙ్మయచరిత్రకారులును నెట్టి యహోహలకుఁ బాల్పడిరో తెలుపుచున్నాను.

"His son Prola......married Annamamba. He had by her five sons, named Macha, Vema, Dodda, Annaya and Malla of whom Macha and Malla were the eldest and the youngest respectively. Erra Preggada does not mentian Dodda in his work Hari. vamsam while describing his patrons family the reason for which might be his premature death" (Reddi Kingdoms, Page 67)

("ప్రోలరాజున కన్నెమాంబవలన మాచ, వేమ, దొడ్డ, అన్న, మల్ల - అను నైదుగురు

పుత్రులు జన్మించిరి. అందు మాచయ జ్యేష్ఠుఁడు, మల్లయ కనిష్ఠుఁడు. ఎఱ్ఱాప్రెగడ హరివంశమున దొడ్డయను పేర్కొనలేదు. బహుశా అతడు చిన్నతనముననే చనిపోయి యుండును''

దీని ననుసరించియే శాబోలును ఆంధ్రకవితరంగిణి (పుట 101. నాల్గవ సంపుటము) యందిట్లు వ్రాయఁబడియున్నది:—

''కాని పైనిచెప్పిన శాసనములో (మల్లవర శాసనము) కోమటిప్రోలయ కైదుగురు కుమాలని చెప్పుచు నందు దొడ్డారెడ్డి పేరుదాహరించియున్నారు. కావున దొడ్డారెడ్డి యున్న మాటనిజము. హరివంశ రచనము నాటి కాతఁడు చనిపోయియుండును. అందుచే కవి యాతని పేరు చెప్పలేదని తలఁపవలసి యున్నది.''

పై వారి యభిప్రాయము ననుసరించి, హరివంశరచనాకాలమునాటికి దొడ్డారెడ్డి మరణించినచో క్రీ. శ. 1325 శాసనములోను, క్రీ. శ. 1340 శాసనములోను, క్రీ. శ. 1345 లోను నాతఁడెట్లు పేర్కొనబడియుండునో వారూహింపలేదు. మరియు నాంధ్రకవితరంగిణిలో నా పుటలోనే యిట్లు వ్రాయబడియున్నది:-

హరివంశరచనాకాలమునకు మల్లారెడ్డి జీవించియుండుట తథ్యము. కావున హరివంశము క్రీ. శ. 1345 కు పూర్వము, 1325కు తరువాతను రచియింపబడి యుండెననుట స్పష్టము''. హరివంశరచనాకాలము 1325—1345 మధ్యకాలమని చెప్పినప్పుడు, ఆ కాలమునాటికి అనగా క్రీ. శ. 1325-1340-1345 ప్రాంతములలో పై శాసనాధారములనుబట్టి దొడ్డారెడ్డి జీవించియే యున్నాఁడు గదా! మఱి యానాటికి దొడ్డారెడ్డి చనిపోయెనని వ్రాయుట యెట్లు సంభవించినది! రెడ్డిరాజ్య చరిత్రము నాధారముగ గొనుటచేత నీయపోహ కవితరంగిణీకారునికి గలిగినది. హరివంశరచనాకాలమునాటికి దొడ్డారెడ్డి జన్మించియుండ లేదనుటయే సమంజసము. ఆ నాటి కాతడున్న ఎఱ్ఱన తప్పక పేర్కొనియేయుండును. కాగా హరివంశము క్రీ. శ. 1325 ప్రాంతమునకు ముందే రచితమైనదని నిశ్చితమైనది. ఇక నది క్రీ. శ. 1320 ప్రాంతములకే రచితమైనదని నిరూపింతును.

పూర్వచరిత్రకారు లందఱును రెడ్డిరాజ్యము క్రీ. శ. 1320 ప్రాంతమున ప్రారంభమైనదని వ్రాసియున్నారు. కాని రాజ్యస్థాపకుడగు వేమారెడ్డి శాసనములు క్రీ. శ. 1325 ప్రాంతమునుండి కాన నగుటచే, రెడ్డిరాజ్యచరిత్రకారు లీ సంవత్సరమేయని నిర్ణయించినారు. మల్లవరము శాసనమునాటికి (1325) రెడ్డిరాజ్యము ఉత్తరమున కృష్ణాగౌతమీ నదుల వఱకును దక్షిణమున శ్రీశైల, అహోబలక్షేత్రములవఱకు, వ్యాపించినది. ప్రథమమున అద్దంకి రాజధానిగా వేమారెడ్డి రాజ్యము స్థాపించి దానిని క్రమముగా నభివృద్ధి చేసినట్లు, హరివంశావతారికవలన తెలియుచున్నది. రెడ్డిరాజ్యము మొదట నెల్లూరి మండలములోని అద్దంకిచుట్టుపట్లనుండు చిన్నరాజ్యము. ఉత్తరమున కృష్ణాగౌతమీతీరమువఱకును, దక్షిణమున శ్రీశైలము వఱకు వ్యాపించుట కైదు సంవత్సరముల కాలమైనను పట్టియుండవలెను. ఈ పరిస్థితిని గమనించియే పూర్వ చరిత్రకారులు క్రీ. శ. 1320 వ సంవత్సరము రెడ్డిరాజ్యస్థాపకవత్సరమని వ్రాసిరి. హరివంశావతారిక చూచిన నది క్రీ. శ. 1320 ప్రాంతములలో అద్దంకి రాజధానిగా నేర్పడి, రాజ్య విస్తరణకు ప్రారంభించిన దినములలో రచితమైనట్లు తెలియుచున్నది.

ఎఱ్ఱన వేమారెడ్డి రాజ్య విస్తారమును వర్ణింపలేదు. కొండవీడురాజధాని, శ్రీశైల సోపాన నిర్మాణ ప్రస్తావ నిందులేకపోవుట యా పై యూహను బలపఱచుచున్నది. మఱియు వేమారెడ్డి దానాదికములంగూర్చి చెప్పునప్పుడు ఎఱ్ఱన ''హేమాద్రి పరికీర్తితామితవ్రతదాననివహంబు లన్నియు నిర్వహించె; చేసెఁ, జేయుచు నున్నాడు, సేయనున్నవాఁడు, పునరుక్తకృతి శుభావళులనెల్ల''అని భూతకాలిక, వర్తమాన, భవిష్యదర్థకములను ప్రయోగించుటచే అట్టి దానముల నేకములు ముందుచేసెననియు నింకముం దింతకంటె ఘనముగా (రాజ్యము దినదినాభివృద్ధిగాంచుచున్నదిగాన) చేయగలడని సూచించుటయేకాక, రాజ్యస్థాపన ప్రాథమిక దివసములో కృతి నిచ్చితినని కూడ సూచించి యున్నాఁడు. ఈ కాలము క్రీ. శ. 1320 ప్రాంతమే. మఱి యే కవియు కృతిపతిని వర్ణించుపట్ల నిట్టి క్రియావిశేషముల నుపయోగింపలేదు.

హరివంశరచన మీ కాలమునాటిదే యను

టకు వేఱొక యాధారము చూపుచున్నాను:- హరివంశము భారతములో ఖిలపర్వము. హరివంశముకూడ నాంధ్రీకరింపబడినగాని భారత రచన సంపూర్ణముగాదు. అప్పుడే శతపర్వ సంహితయగు భారతమంతయు నాంధ్రీకరింపఁ బడినట్లగును. తిక్కన సోమయాజి పదునెను పర్వము లాంధ్రీకరించిన వెనుక, ఖిలపర్వమును హరివంశము నాతని శిష్యుఁడగు మారనయే రచించి గురువుగారి రచన సంపూర్ణత్వము ప్రసాదించి యుండవలసినది. కాని మారనకట్టి యవకాశము కలుగలేదని యాతని మార్కండేయపురాణ రచనమే చాటిచెప్పుచున్నది. మార్కండేయపురాణ రచనాకాలము క్రీ. శ. 1320-23 ప్రాంతమని నిశ్చయింపవచ్చును. అప్పటి కింకను కాకతీయ సామ్రాజ్యము తురుష్కుల వశము కాలేదు. తత్కృతిపతియగు నాగయగన్నడు కాకతీయసేనాని, ముస్లిముల దండయాత్రలలో వరంగలు కోటను రక్షించిన వాడు. కావున క్రీ. శ. 1320 ప్రాంతమునకు కొంచెము ముందుగానే హరివంశరచనము నెఱ్ఱప్రెగ్గడచేసియుండును. దానితో భారతము పూర్తియగుటచే, తిక్కన శిష్యుఁడగు మారన మార్కండేయపురాణమును నాంధ్రీకరింపవలసి వచ్చినది. అనగా క్రీ. శ. 1320 నాటికే మహాభారతము సంపూర్ణముగా హరివంశముతోకూడ నాంధ్రమున నవతరించినది.

## కృతులపౌర్వాపర్యం :

ఎఱ్ఱన రచించిన గ్రంథములలో హరివంశము కడపటిది యనియు, నది క్రీ.శ. 1320 ప్రాంతమున రచితమైనదనియు ముందు నిరూపించి యుంటిని. ఇంక నాతని కృతులయొక్క పౌర్వాపరములనుగూర్చి వివరించెదను.

ఎఱ్ఱనకృతులు మనకుఁ దెలిసినవి నాల్గు- 1. అరణ్యపర్వశేషము, 2. నృసింహపురాణము, 3. రామాయణము, 4. హరివంశము. వీనిలో రామాయణము మనకు లభ్యముకాలేదు. కాక పోయినను, ముం దుదాహరించిన రీతిని హరివంశములో నిది పేర్కొనబడుటచే నిది హరివంశముకన్న ముందు రచితమైనదని నిర్ణయింపవచ్చును. రెండవ గ్రంథమగు నృసింహపురాణములో నరణ్యపర్వశేష ముదాహృతమగుటచేత నది నృసింహపురాణముకన్న ముందురచనమని నిర్ణయింపవచ్చును. రామాయణము లభ్యము కాలేదు. కావున నందు నృసింహపురాణ రచనము పేర్కొనబడినది, లేనిది మనము చెప్పజాలము. కాని, క్రీ. శ. 1400 ప్రాంతమునున్న జక్కన నాటినుండియు నీతని కృతుల ప్రశంస కానవచ్చుచునే యున్నది. జక్కననుండి నేటివఱకు నాకృతుల పౌర్వాపర్యములనుగూర్చి వ్రాసిన వివరముల నీక్రింద నిచ్చుచున్నాను.

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| *జక్కన | మల్లన | వీరేశలింగముగారు | శేషాద్రిరమణకవులు |
| అరణ్యపర్వశేషము | అరణ్యపర్వశేషము | అరణ్యపర్వశేషము | అరణ్యపర్వశేషము |
| నృసింహపురాణము | రామాయణము | రామాయణము | నృసింహపురాణము |
| రామాయణము | నృసింహపురాణము | హరివంశము | రామాయణము |
| | హరివంశము | నృసింహపురాణము | హరివంశము |

| (5) | (6) | (7) | (8) |
|---|---|---|---|
| కవిత్వవేదిగారు | సోమశేఖరశర్మగారు | శేషయ్యగారు | పింగళివారు |
| రామాయణము | అరణ్యపర్వశేషము | అరణ్యపర్వశేషము | రామాయణము |
| హరివంశము | నృసింహపురాణము | నృసింహపురాణము | హరివంశము |
| అరణ్యపర్వశేషము | రామాయణము | రామాయణము | అరణ్యపర్వశేషము |
| నృసింహపురాణము | హరివంశము | హరివంశము | నృసింహపురాణము |

*1. జక్కన విక్రమార్కచరిత్ర- అవతారిక - కవిస్తుతి. వావిళ్ల ముద్రణము.

2. విప్రనారాయణచరిత్ర- అవతారిక. మల్లనపద్య మీవఱకే ఉదాహరించితిని. ఆంధ్ర సాహిత్య పరిషన్ముద్రణము.

3. శ్రీవీరేశలింగము-ఆంధ్రకవులచరిత్ర. ప్రథమభాగము పుట 158. (1917 ముద్రణము.)

పై పట్టికను పరిశీలించినచో నెఱ్ఱన గ్రంథములలో మొదటిది యరణ్యపర్వ శేషమైనట్లును, హరివంశము చివరి గ్రంథమైనట్లును స్పష్టమగుచున్నది. అయినను ప్రథమమున నీతని గ్రంథములను గూర్చి చెప్పిన జక్కన హరివంశమును పేర్కొనలేదను నభిప్రాయము కొందఱకుఁ గలుగవచ్చును. జక్కన యెఱ్ఱన హరివంశ రచనము నెఱుంగనివాఁడు కాఁడు. తనకు ముందు రెండుశతాబ్దుల క్రిందనుండిన నన్నయభట్టారకుని రచనమువలెనే యారణ్యపర్వ శేషమును రచించిన యెఱ్ఱన ప్రతిభ లోకోత్తరమని గ్రహించి దాని కీప్రాధాన్యమొసగి జక్కన యారణ్యపర్వ శేషమును పేర్కొనెను. వేఱొండు హేతువు కాదు. కేవలము కవితాదృష్టిని పరిశీలించినచో జక్కన చెప్పిన గ్రంథములకు గల ప్రాముఖ్యము హరివంశమునకు లేదనియే చెప్పవలెను. ప్రాచీన గ్రంథములనుండి బహుళముగా లాక్షణికోదాహృతుల నిచ్చిన యప్పకవి, ఎఱ్ఱన కృతులలో నరణ్యపర్వ శేషమునుండి ఏడుపద్యములను, నృసింహపురాణమునుండి పద్యములను నుదాహరించి, హరివంశమునుండి యొక్కటైన నుదాహరణము గొనలేదు. పూర్వపద్య సంకలన గ్రంథకర్తలలో పెదపాటి జగన్నాథకవి* ప్రబంధరత్నాకరమున నృసింహపురాణమునుండి యనేక పద్యములను సంగ్రహించి యున్నాఁడు. ఈ కారణముచేతనే యెఱ్ఱన రామాయణమునుండి యుదాహరించిన యేకైకకవి, కూచిమంచి తిమ్మన సర్వలక్షణ సార సంగ్రహములో హరివంశమునుండి యైదు పద్యములుదాహరించి యున్నాఁడు. కాని హరివంశము జక్కన కాలమునకే శిలాశాసనముల కెక్కినది.

"విప్రేభ్యః ప్రదదౌ యథేష్ట వసుధాం
పాతాళగంగాపథే
సోపాన ప్రతతిం వ్యరీరచదసౌ
రామాయణం సత్కృతిం
యశ్చాంధ్రం హరివంశ మప్యకథయత్
శ్రీశంభు దాసేన యః"

(క్రీ. శ. 1398-1399. నెల్లూరు శాసన సంపుటములు. 2 వ సంపుటము. పుట 554. కందుకూరు శాసనములు)

పై రాచవేముని కందుకూరి శాసనమున రామాయణ హరివంశములు రెండును శంభుదాసనామముతో నుదాహృతములైనవి. జక్కన యభిప్రాయమున గూడ హరివంశరచనము కడపటిదే. హరివంశము సందు లాక్షణికులకు గల యభిప్రాయమును వ్యక్తపఱచుటకే పై విషయము లుట్టంకింపబడినవి గాని వాఙ్మయమునగల హరివంశ కృతి విశిష్టస్థానము కొంచెపఱచుటకు గాదని విమర్శకులు గ్రహింతురు గాక. ఈ తరువాత యావిశిష్టత తెలుపఁబడును.

ఎఱ్ఱన రచనాక్రమమును, పరిశీలింపగా, నరణ్యపర్వ శేషము, నృసింహపురాణము, రామాయణ హరివంశములు క్రమముగా రచించినట్లు స్పష్టము.

అరణ్యపర్వశేషము :

(1) అరణ్యపర్వ శేషము ఎఱ్ఱన ప్రాథమిక కృతి. ఆతఁడు "నన్నయ భట్టమహాకవీంద్రు సారస్వతాంశ ప్రశస్తి తన్నుఁ జెందుటయు, సాధుహర్షణసిద్ధి గోరి" యరణ్యపర్వ శేషము పూరించెను. ఆ గ్రంథరచనాకాలమునాటి కతఁడు "శివపదాబ్జధ్యాన సంసక్త

4. శేషాద్రిరమణకవులు - హరివంశము పీఠిక. వావిళ్లముద్రణము. (1926)
5. కవిత్వవేది - ఆంధ్రవాఙ్మయ చరిత్ర సంగ్రహము.
6. శ్రీ శేషయ్యగారు - ఆంధ్రకవితరంగిణి - నాలవ సంపుటము. పుట 58.
7. శ్రీసోమశేఖరశర్మగారు-రెడ్డిరాజ్యముల చరిత్ర.(**History of the Reddi kingdoms, Chapter IX Page 497.**)
8. శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు - ఆంధ్రవాఙ్మయచరిత్ర. ఆంధ్రసర్వస్వము 7 వ భాగము, తెలుగుభాష 22 అధ్యాయము. 275 - 302 పుటలు. ఇది తిరిగి వారి గౌతమీ వ్యాసములు అను గ్రంథములో ముద్రితమైనది.

* కీర్తిశేషులు ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించిన ప్రబంధరత్నావళిలో కవులపేర్లుదాహరింపఁబడకుండనున్న పద్యములలో పెక్కుపద్యములు ఎఱ్ఱన నృసింహపురాణములోనివిగా నేను కనుగొంటిని,

చిత్తుఁడు", "అద్వైత తత్పరాత్ముఁడు" ఎఱ్ఱనార్యుఁడు మాత్రమే.

సీ. "భవ్యచరిత్రుఁ డాపస్తంబ సూత్రుండు
శ్రీవత్సగోత్రుండు శివపదాబ్జ
సంతతధ్యాన సంసక్త చిత్తుఁడు సూర
నార్యునకును బోతమాంబికకును
నందనుం డిల పాకనాటిలో నీలకం
ఠేశ్వర స్థానమై యెసక మెసఁగు
గుడ్లూరు నెలవుగ గుణగరిష్ఠత నొప్పు
ధన్యుఁడు ధర్మైక తత్పరాత్ముఁ
డెఱ్ఱనార్యుండు సకలలోకైక విను
తుఁడయిన నన్నయ భట్టమహాకవీంద్రు
సరస సారస్వతాంశ ప్రశస్తి దన్నుఁ
జెందుటయు సాధుజన హర్ష సిద్ధిగోరి.

క. "ధీర విచారుఁడు తత్కవి
తారీతియుఁ గొంతఁదోపఁ దద్రచనయకా
నారణ్యపర్వశేషము
పూరించెఁ గవీంద్రకర్ణపుట పేయముగాన్."

ఇది చాల ముఖ్యవిషయము. తరువాతి గ్రంథములయందన్నిటి యందు నాతడు శంభుదాసనామముతో వ్యవహృతుఁడైనాడు. గద్యలలో "ఇది శంకరస్వామి సంయమీశ్వరచరణ సరోరుహధ్యానానంద సౌందర్యధుర్య శ్రీసూర్యకవి మిత్రసంభవ శంభుదాస లక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయ ప్రణీతంబైన లక్ష్మీనృసింహావతారంబను పురాణకథయందుఁ బ్రథమాశ్వాసము. హరివంశమునందును గద్యయిదియే. పై గద్యలలో చెప్పబడిన శంకరస్వామి సంయమీశ్వర ప్రశంసగాని, శంభుదాసనామధేయముగాని లేకుండుటచే, యారణ్యపర్వశేషమే యాతని తొలిరచనము.

(2) శంకరస్వామిగురుప్రశంస:

నృసింహపురాణము:

ఉ. యామము లెన్మిదింట నియ
తాకృతిఁ బ్రత్యహమున్ శివార్చనా
రామతనొప్ప నిత్యశివ
రాత్రివ్రతంబుగఁబూని భవ్యయో
గామృత తృప్తిమైఁ ద్రిజగ
దర్చిత లీలఁదనర్చు శంకర
స్వామి గురుండు మాతలపు
సర్వముదానయి యుండు గావుతన్.
పీఠిక. 1—11

హరివంశము:-

కామవిలోభక స్ఫుర్వహాల
గర్వపరంపర క్రిందువాపినె
త్తామరసి స్థితుండగు స
దాశివుఁ గాంచిఁ దదేకచింత చిం
తామణియై తలిర్ప తుది
దాకనయున్నతిగన్న శంకర
స్వామిగురుండు మాతలపు
సర్వముదానయియుండు గావుతన్.

ఈతడు విద్యారణ్యుల గురువగు విద్యాశంకర తీర్థుఁడని యభిజ్ఞుల యభిప్రాయము.

(3) "సూర్యసుకవిమిత్ర సంభవ"—అని పై గద్యలలో నేగాక, తన తండ్రినిగూర్చి "శ్రీ సూర్యుఁడీ విజ్ఞానాత్మక వాఙ్మయంబున ముదావేశోజ్జ్వలుండయ్యెడున్" అని చెప్పియున్నాడు. (నృసింహ 1-26.)

ఆరణ్యపర్వశేషమున తన్నుఁగూర్చి తన రచనను గూర్చి చెప్పుకొన్నప్పుడు, తన తండ్రి పేరుమాత్రమే తెలిపి, నన్నయ సారస్వతాంశ తన్ను చెందినదని చెప్పుటచే. తన విద్యారంభదశయందు నన్నయయే కవితాగురువని స్పష్టమగుచున్నది.

(4) నన్నయ సారస్వతాంశ ప్రశస్తి తన్నుఁ జెందుటయు ననుటచేత నాకాలమున కవితా ప్రారంభదశయందు కవుల కుపజీవ్యమైన నన్నయభట్టు భారత భాగము నీతఁడు పలుమాఱు పారాయణము జేసి, జీర్ణించుకొనెననియు నాతని యదృష్టవిశేషమున నాతనికి నన్నయ రచనావిశేషములు, కవితాకళయు పట్టువడెననియు, నాకారణముచేతనే నన్నయ విడిచిన యారణ్యపర్వ శేషమును పూర్తిచేసెననియుఁ గ్రహింపవలసియున్నది.

భవికవులనేకాక, శివకవులనైన నుతింపని వీరశైవ కవిసార్వభౌముఁడగు పాల్కురికి సోమనాథుఁడే తన కవితాప్రారంభదశ యందు నన్నయభట్ట భారతభాగమును జదివి దానిని తన పద్యకృతియగు చతుర్వేద సారమున ననుకరించినాడన్నచో, [1]నిక తక్కిన కవులను గూర్చి వేఱుగా చెప్పనవసరములేదు. తిక్కన,

1. చూడుఁడు శా బసవపురాణ ద్వితీయ ముద్రణ పీఠిక.

కేతన, మంచెన, మాదన కవులు నన్నయ గ్రంథమును చదివినవారే. ఎఱ్ఱనయు, నీయుగము వాడే కావున నన్నయ గ్రంథమును, నాతని కవితా ప్రభావమును హెచ్చుగా నాతని నాకర్షించినవి.

నన్నయయే ఎఱ్ఱనకు కవితాగురువు. అట్టి భావనచేతనే యెఱ్ఱన తన గ్రంథము నన్నయ రచనయే యని యనుకొనదగిన రీతిని రచింపఁ గలిగినాడు. మఱియు నన్నయవలన బడసిన కవితానుభూతిచే రచించిన కావ్యమును గురు ప్రాయుఁడగు నాతని పేరనే వెలయించుట సమంజసమని భావించి యాశ్వాసాంత గద్యల నాతని పేరనే వెలయించినాడు. ఆతనివలెనే, కృతి రాజరాజున కంకితమొనర్చినాడు.

అరణ్యపర్వమున సప్తమాశ్వాసము చివర, నాశ్వాసాంత గద్య వెనుక తన్ను గూర్చి చెప్పు కొన్నాఁడు. తన్ను గూర్చి చెప్పుకొన్న "భవ్య చరిత్రుఁ డాప స్తంభసూత్రుఁడు" అను సీసపద్యమును, "ధీరవిచారుడు" అన్న కందపద్యమును, నేటి ముద్రితప్రతులలో నాశ్వాసాంత పద్యముల ముందున్నను వ్రాతప్రతులలో గద్య చివరనే వ్రాయఁబడియున్నవి. నేటి ముద్రిత ప్రతులలో నా విషయము పుటయడుగున నిట్లు తెలుపఁబడియున్నది. "సీ. భవ్యచరిత్రు...... అని అచ్చుప్రతుల మాత్రమే గన్పట్టెడిని" (ఆనంద ముద్రణాలయము. పుట 321).

ఎఱ్ఱన తన తండ్రి సూరనార్యుడు కవియని యితర గ్రంథములోఁ జెప్పినియు, నరణ్య పర్వ శేషమున నా విషయము చెప్పక, నన్నయ సారస్వతాంశ తన్నుఁ జెందుటయనియు, నదియే తన కవిత్వమునకు హేతుభూతమనియు నందుచే గురువునకుఁ జూపవలసిన కృతజ్ఞతను చూపుట కాతని పేరనే వెలయించెననియు, నది ప్రాథమిక కృతియనియు చెప్పనగును.

## నృసింహ పురాణము :

ఎఱ్ఱన తరువాతి గ్రంథమగు నృసింహ పురాణ రచనము నాటి కాతనికి వాఙ్మయమున నొక స్థానమేర్పడు నవకాశము లభించినది. నన్నయ పేర వెలయించిన తన యారణ్యపర్వ శేషకృతి కవులచే భారత భాగముగా నంగీకృతమైనది. శంకరస్వామిసంయమీంద్రుని శిష్యుఁడై, గిరీశపదభక్తిరసతత్పర భావముకలిమి శంభుదాసుండనఁగాఁ బరగియు గోవింద గుణాదర సంభృత భావనధన్యుఁడైనాఁడు.

తన వంశ వృత్తాంతమును తెలిపి యున్నాఁడు. ముఖ్యముగా నన్నయపేర తాను వెలయించిన కృతి యరణ్యపర్వ శేషము తానే రచియించి నట్లు లోకమునకు తెలియబఱచినాడు. అట్లు తెలియఁబఱచుటలోను నెంతయో యౌచితిని పాటించినాఁడు. తాను స్వయముగ రచించితి నని చెప్పిన యాత్మస్తుతి దోషము తగులునని, తనతాత స్వప్నమున కనఁబడి చెప్పినట్లు వ్రాసి యున్నాడు. మఱియు నిందు నన్నయభట్ట తిక్కకవినాథుల నిర్వురను పేర్కొన్నాడు. వారిరువురు భారతార్థము నాంధ్రలోకమునకు బ్రసాదించినారని స్తుతించినాడు. దీనికిముం దాతడు ప్రత్యేక కావ్యరచన చేయలేదుకావున, "రాయంచలు కూయఁ గ్రౌంచమును నావలఁ గూయగడంగు భంగిఁ బ్రౌఢాంచిత శబ్దసారులు మహాకవులాద్యులు కావ్యశయ్యాగేలించిన కీర్తి సంగ సుఖలీలకుఁ గాంక్షచేసి" నృసింహ పురాణ ప్రబంధము రచియించి యున్నాడు. దానికిఁ దగిన సామగ్ర్యము తనకుఁ గలదని తన తాతచేతనే, ప్రబంధపరమేశుడనంగ ఖ్యాతిఁగాంచితివని చెప్పించికొన్నాఁడు. కవితాదృష్టిచేఁ బరిశీలింపగా నృసింహపురాణము ఎఱ్ఱన ద్వితీయరచనమును నద్వితీయరచనమును నని చెప్పవచ్చును.

నృసింహపురాణ రచనము నాటికి ఎఱ్ఱనకు మల్లారెడ్డితోఁగూడ సంబంధమేర్పడి యుండ లేదు. ఈ గ్రంథరచనమే యాతనికి తొలుత మల్లారెడ్డితోడను, నావెనుక నాతని యన్నయగు ప్రోలయవేమారెడ్డితోడను పరిచయము గలిగించినది. ఏలననగా వేమారెడ్డి అహోబల నృసింహస్వామి భక్తుడుకూడ. శ్రీశైలమున పాతాళగంగ కెట్లు సోపానములు కట్టించి నాడో, యట్లే అహోబలమునకు గూడ సోపానములు కట్టించి నట్లాతని శాసనములు తెలుపుచున్నవి.

## రామయణ రచన :

అన్నగారగు వేమారెడ్డికి అహోబలపతి యందుగల భక్తిపరత నెఱిగిన వాడగుటచే మల్లారెడ్డి యీ గ్రంథమూలమున నెఱ్ఱనను వేమారెడ్డికి బరిచయమొనర్చి యుండును. వేమారెడ్డి యాతని రామాయణ కథ వ్రాయుటకుఁ బ్రోత్సహించి యుండును. ఎఱ్ఱన రామాయణ కథ వ్రాయుటకు సావకాశమునాటి పరిస్థితులు రెండుమూడు తోడ్పడుచున్నవి. —

(1) తానిదివఱకే యరణ్యపర్వ శేషమున గల రామాయణకథను రెండాశ్వాసములలో నా గ్రంథమున వ్రాసియున్నాఁడు. కాని వాల్మీకి రామాయణములోని రామకథకును దానికిని భేదములున్నవి. కాబట్టి వాల్మీకి రచన ననుసరించి రామాయణకథ వ్రాయుటకాతని కుత్సాహము పొడమియుండును. వేమారెడ్డి ప్రోత్సాహము దానికి దోహదమిచ్చియుండును.

(2) ఎఱ్ఱన రామాయణ రచనమునాటికి తెనుగులో మంత్రి భాస్కరరామాయణ పద్యకృతియు, రంగనాథరామాయణ ద్విపద కృతియు వెలసియేయుండెను. కాని యీ రెండును యథావాల్మీకములు గావు. అందు మొదటిది పద్యచనమే యైనను నది యాశ్వాసాద్యంతములు విభక్త్యంతములుగానుండి విలక్షణముగా నున్నది. రెండవది ద్విపదకృతి కావున నీరెండును దనకు రామాయణరచనమునకు కారణములై యుండ నోపును.

(3) ప్రోలయ రెడ్డికి రామాయణమున దశరథ మహారాజునకువలె, నలువురు పుత్రులు. వారిలో పుట్టుకచే జ్యేష్ఠుఁడు కాకపోయినను గుణగణము చేతను, పరాక్రమము చేతను జ్యేష్ఠుఁడగు వేమారెడ్డి, శ్రీరాముని యట్టివాఁడు. కనిష్ఠ సోదరుఁడు మల్లారెడ్డి లక్ష్మణుని యట్టివాఁడు. వీరిరువురి సౌభ్రాత్రము రామాయణము నందలి రామలక్ష్మణుల సౌభ్రాత్రము వంటిది. ఇది ఎఱ్ఱనను చాలగా సాకర్షించినది.

"రామునకు లక్ష్మణుఁడు సు
త్రామసుతుఁడుధర్మజునకు తగ సౌభ్రాత్రం
బేమెయి నెఱపుదు రామెయి
వేమప్రభుగొలిచె మల్లవిభుఁడును భక్తిన్"
హరి. 1—29

రామాయణ రచనమైన వెనుక హరివంశమున గూడ నీవిషయ ముట్టంకింపబడినది. క్రీ. శ. 1325 లో మల్లవరమున రామలక్ష్మణ విగ్రహములను వేమారెడ్డి ప్రతిష్ఠించుట, ఎఱ్ఱన రామాయణ రచనా ప్రభావమే యని యూహింప వచ్చును.

ఎఱ్ఱన రామాయణము యథావాల్మీకమనుటకు చదలువాడ మల్లన చెప్పిన "వల్మీకభవు వచో వైఖరి రామాయణంబు నాంధ్రప్రబంధంబు సేసె" అను పద్యపాదమే సాక్షీభూతము. ఈ రామాయణ మిప్పుడు కానరాదు. ఎఱ్ఱన రామాయణము నందలి పద్యములు నేటి భాస్కరరామాయణ ప్రతులయందున్నవని విమర్శకులు గుర్తించి యున్నారు. ఎఱ్ఱన రామాయణము పూర్తియైనవెనుక, హుళక్కి భాస్కరాదులు, మంత్రి భాస్కర రామాయణమును తమపేరిట ప్రచారములోనికి దెచ్చిరనుటకు నేటి భాస్కరరామాయణము నందలి రచనావైవిధ్యమే సాక్ష్యము.

**హరివంశము :**

ఈ రచనయైన వెనుక రచనము హరివంశము. ఈగ్రంథ రచనాకాలము క్రీ. శ. 1320 ప్రాంతమని ముందు నిశ్చయమైనది గదా. ఇక గ్రంథ రచనాక్రమమును బట్టి కాలనిర్ణయము చేయగడంగుదము.

హరివంశ రచనము క్రీ. శ. 1320 ప్రాంతమైనప్పుడు రామాయణ రచనము క్రీ. శ. 1300-10 ప్రాంతమనియు, నృసింహపురాణ రచనము 1290-1300 ప్రాంతమనియు, ఆరణ్యపర్వశేష రచనము, 1280-90 ప్రాంతమనియు నిర్ణయింపవచ్చును. అట్లయిన ఎఱ్ఱన జననము క్రీ. శ. 1260 ప్రాంతమగుచున్నది. ఇదియు నాతఁడు నృసింహపురాణమున చెప్పిన తనవంశ విషయములతో సరిపోవుచునే యున్నది.



భీమనమంత్రి వెలనాటి చోడనివలనమన్ననc గన్నవాడు. వేగినాటిలో కరావర్తి వృత్తి నుండువాcడు. కరావర్తి వృత్తియనగా పన్నులు వసూలుచేయుట (Tax collector) అని యర్థము.

ఈ వెలనాcటి చోడడు, దుర్జయవంశ్యులగు వెలనాటి రాజులలో తొలివాcడు. ఈతcడు క్రీ. శ. 1115-1136 ప్రాంతముల రాజ్యము చేసెను. ఆరాజుచే మన్ననగన్న భీమనమంత్రి క్రీ. శ. 1130 ప్రాంతమువాడై యుండదగును. భీమనమంత్రికి నెల్లనకు నాలుగుతరములు గడచినవి. తరమునకు ముప్పది సంవత్సరముల కాలము లెక్కించిన నెల్లన జననకాలము క్రీ. శ. 1250-60 ప్రాంతమగుచున్నది.

ఎల్లన పేర్కొనిన వెలనాటి చోడడు క్రీ. శ. 1163-80 లలో రాజ్యము చేసిన రెండవ వెలనాటి చోడడనియు, నప్పటినుండి నాలుగు తరములు లెక్కించిన నించుమించుగ క్రీ. శ. 1280 ప్రాంత మాతని జననకాలమై యుండుననియు నాంధ్రకవి తరంగిణికారులు వ్రాసియున్నారు (పుట 58).

ఎల్లన పేర్కొనిన వెలనాటిచోడడు మొదటి వెలనాటి చోడుడనుటకే యాధారము లున్నవి. ఈతని మొదటి పేరు కుళోత్తుంగ చోడుcడు. ఈతడు వెలనాటిని స్వతంత్రముగ రాజ్యాధిపత్యము వహించిన యనంతరము మొదటి వెలనాటిచోడుడని వ్యవహృతుcడైనాడు. చరిత్రకారులందరును నీతని మొదటి వెలనాటి చోడుడనియే వ్యవహరింతురు.

ఇక రెండవ వెలనాటి చోడనికి వీరరాజేంద్ర చోడనామము చాలప్రసిద్ధము, శాసనముల యందిది ప్రయుక్తము. "రాజేంద్ర చోడవిభుc"డని, 'రాజేంద్రచోడవిభునిచేసని' యీతని గూర్చి మంచెన జక్కనలు చెప్పియున్నారు. కాబట్టి ఎల్లన పేర్కొన్న వెలనాటిచోడుడు మొదటి వెలనాటిచోడుcడని నిర్ణయింపవచ్చును.

అప్పుడు పైనెల్లన కాలము సమంజసమే యగుచున్నది.

ఇదివఱలో చరిత్రకారు లూహించిన ఎఱ్ఱాప్రెగడ జననకాలము క్రీ. శ. 1280 ప్రాంతము. వారట్లూహించుటకు కారణము ఎఱ్ఱాప్రెగడ హరివంశమును క్రీ. శ. 1320 నుండి క్రీ. శ. 1353 వఱకును పరిపాలించిన ప్రోలయ వేమారెడ్డి కాలమే గాని వేఱొకటి కాదు. వేమారెడ్డి కాలము ముప్పది, ముప్పదిరెండు సంవత్సరములలో హరివంశ రచన మెప్పుడు జరిగినది స్పష్టముగా తెలియ సందునను, క్రీ. శ. 1330-40 నడుమ హరివంశ రచనమని భావించుటచేతను, పై జననకాలము క్రీ. శ. 1280 అని, ఆకాలమునుండి లెక్కింప బడినది.

ప్రస్తుత మీ రచనాకాలము క్రీ. శ. 1320 ప్రాంతమగుటచేత, ఆతని జననకాలము క్రీ. శ. 1260 ప్రాంతమనుటలో విప్రతిపత్తిలేదు.

ఎల్లన వేమారెడ్డి కాలములోనే అనగా క్రీ. శ. 1345-53 ప్రాంతములలో ముగణించి యుండునని చరిత్రకారు లూహించినారు. ఇది సమంజసమే. ఏలయనగా, వేమారెడ్డి వెనుక సింహాసన మధిష్ఠించినవాcడు అనపోతారెడ్డి. క్రీ. శ. 1353-1364 వఱకును పాలించెను. ఎల్లన అనపోతారెడ్డిని యువరాజుగ హరివంశమున చెప్పియున్నాడు.

క. "వితత యువరాజ విభవో
న్నత పోతయమై న్యనాథ నయమార్గసమీ
హిత సంతత సేవావిల
సిత పుత్రశ్రీసమృద్ధ శివగుణసిద్ధా!"
(హరి-ఉ-9-260)

అనపోతారెడ్డి కాలములో వెన్నెలకంటివారు ఆస్థానకవులై యున్నట్లు నావంశములోని వాడగు సూరన యిట్లు చెప్పియున్నాడు.

ఉ. "ఈనిఖిలంబు మెచ్చ... ...అన్నపోతిభూ
జానికి సత్ప్రబంధము లొ
సంగిన వెన్నెలకంటివారిలోన్."

కాబట్టి ఎల్లన యనపోతారెడ్డి కాలములో లేడు. క్రీ. శ. 1364 నుండి క్రీ. శ. 1386 పాలించిన యన వేమారెడ్డి కాలములో కొల్లూరి శాసనమున నొక ఎల్లయప్రెగడగారు పేర్కొనబడియున్నారు. కాని పై కాలక్రమము ననుసరించి యీ ఎల్లయప్రెగడ శంభుదాసుడైన ఎఱ్ఱాప్రెగడ కాదు. ఆతని మనుమcడై యుండును.

1. కొల్లూరి శాసనము. రెడ్డిసంచిక అనుబంధము 1. పుట 23.

ఎఱ్ఱన వంశములో నాతని వెనుక క్రీ. శ. 1540 ప్రాంతమున చదలువాడ మల్లన, యాతని చిన్నమనుమడనని చెప్పికొన్నాడు. ఎఱ్ఱన గద్యవలెనే, తన కృతియగు విప్రనారాయణ చరిత్రమున గద్యవ్రాసికొన్నాడు. అందాతడు తన తండ్రిని, తాతను, ముత్తాతను మాత్రమే పేర్కొన్నాడు. ముత్తాతసాళ్వ నరసింహరాయలచేతను, గజపతులచేతను సన్మానితుడని చెప్పియుండుటచే ముత్తాత క్రీ. శ. 1450-80 ప్రాంతము వాడగును. అతఁడిచ్చిన వంశక్రమమును, ఎఱ్ఱప్రెగ్గడనుండి వంశక్రమమును చూడగా నడుమ రెండు మూడు తరములు మాత్రమే లోపించినట్లు కనబడుచున్నది.

ఎఱ్ఱన శంభుదాసుఁడు.
|
1. తరము
|
ఎఱ్ఱన అనవేమారెడ్డి కొల్లూరిశాసనమున
(1364-86) పేర్కొనబడిన [యతడు
1. తరము
|
1. తరము
|
మల్లన 1450 - 80 ప్రాంతము.
విప్రనారాయణచరిత్ర కర్త [ముత్తాత
|
ఎఱ్ఱన
|
లింగన
|
మల్లన [1]విప్రనారాయణ చరిత్రకర్త
క్రీ. శ. 1550 ప్రాంతము

ఎఱ్ఱన తరువాతి వారి వంశముతో మనకు పనిలేదుగాని వాఙ్మయచరిత్రకారుల కుపయోగముగనుండునని యిందు పొందుపఱచినాడను.

**తిక్కనకు సమకాలికుడు :**

ఎఱ్ఱన కాలము క్రీ. శ. 1260-1340 ప్రాంతమగుచో నాతడు తిక్కన సోమయాజి మహాభారత రచనాకాలము నాటికి సమకాలికుడే యగుచున్నాడు. ఇచట తిక్కనకాలము, మహాభారత రచనాకాలము కూడ కొంత ప్రసక్తమగుచున్నది. తిక్కనకాలము మనుమసిద్ధికాలమును బట్టి నిర్ణీతమైనది. మనుమసిద్ధి క్రీ. శ. 1240-నుండి 1268 వఱకు పాలించినట్లు శాసనములు దెల్పుచున్నవి. తిక్కన మనుమసిద్ధి వద్ద నెప్పుడు మంత్రిపదవిలో ప్రవేశించెనో మనకు తెలియదు కాని తిక్కన కంకితమైన దశకుమారచరిత్ర రచనాకాలము నాటికాతడు మంత్రియై దండనాయకుఁడై యుండెనని తెలియుచున్నది. క్రీ. శ. 1260 ప్రాంతమున మరణించిన కాకతీయ గణపతిదేవ చక్రవర్తి మనుమసిద్ధి కొనర్చిన సహాయ ప్రశంస దశకుమార చరిత్రమున లేకపోవుటచే నది క్రీ. శ. 1260 కి ముందు రచితమైనదని, అప్పటికి తిక్కన మంత్రియని మనము నిశ్చయింపవచ్చును. కేతన దశకుమార చరిత్రమున తిక్కనను వర్ణించిన విధము చూడగా నతడిరువదియైదు ముప్పది సంవత్సరముల ప్రాయమువాడని స్పష్టమగుచున్నది. కాగా యాతని జననము 1230 ప్రాంతమని చెప్పవచ్చును.

తిక్కన నిర్వచనోత్తర రామాయణము మనుమసిద్ధి కంకితమిచ్చియున్నాడు. అందు మనుమసిద్ధి విజయములు వర్ణితములైనవి. అందుదాహృతములైన చారిత్రక విషయములను బట్టి చూడగా క్రీ. శ. 1268-70 ప్రాంతములలో నది రచితమైనట్లు స్పష్టమగుచున్నది.

నిర్వచనోత్తర రామాయణము రచించిన వెనుక తిక్కన మహాభారత రచనకు పూనుకొన్నాడు. ఆ రచనమునకు ముందాతడు యజ్ఞముచేసి సోమయాజియైనాడు. తిక్కన భారత రచనము ప్రారంభించినకాలము క్రీ. శ. 1280-90 ప్రాంతము కాదగును.[2]

---

1. విప్రనారాయణచరిత్ర - ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రచురణము. పీఠికాకర్త ఎస్. వేంకటరావు.

2. తిక్కన భారత రచనాకాలము సరిగా నిర్ణయించుటకు మనుమసిద్ధి శాసనములే యాధారము. మనుమసిద్ధి శాసనములు క్రీ. శ. 1249 నుండి క్రీ. శ. 1280 వఱకును కానవచ్చుచున్నవి. భారతరచనా ప్రారంభ కాలముకూడ క్రీ. శ. 1280-90 ప్రాంతములలోనని

తిక్కన భారతమున విరాటపర్వమును ప్రారంభించుచు, నంతకు పూర్వకథ జగత్ప్రసిద్ధమైనదని తెలుపుచు నన్నయభట్టు మొదటి మూడుపర్వములను రచియించెనని "ఆదిదొడంగి మూడు కృతులాంధ్ర కవిత్వ విశారదుండు విద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్"అని స్పష్టపఱచినాడు. తిక్కన శిష్యుడగు మారనయు, నన్నయ మూడు పర్వము లొనర్చెనని మార్కండేయ పురాణమున చెప్పియున్నాడు. తిక్కన స్పష్టముగా మూడుకృతులు నన్నయ రచితములు తనకాలము నాటి కున్నవని చెప్పుచుండగా, తరువాతివారు ఆరణ్యపర్వములో నొకభాగము తిక్కనకు వెనుక నేబది యరువది సంవత్సరములకు పూరింపబడినదని యెట్లు చెప్పిరో దురూహము. మఱియు, నిక్కడ, తిక్కన మహాకవీంద్రునికి కళంకమును ననౌచిత్యమును నాపాదించు మఱియొక యభిప్రాయమునుగూడ వాఙ్మయ చరిత్రకారులు వెల్లడించి యున్నారు.

తిక్కన కాలమునాటికి నన్నయ రచితములైన రెండున్నర పర్వములు. (అనగా, ఆది, సభా, అరణ్యపర్వములోని సగము భాగమును) మాత్రమే యుండెనట! అది రెండున్నర పర్వములని తిక్కన చెప్పుటకు వీలుపడక, లోకవ్యవహార సామాన్యముగ, మూడు పర్వములని చెప్పినాడట! ఇది యెంత హాస్యాస్పదముగ నున్నదో చూడుడు. తక్కిన యన్ని చోట్లను మహాభారతమున తిక్కన పల్కిన

(తరువాయి 55 వ పుటలో)

---

యీ క్రింది యుపపత్తులచే నిర్ణయింపవచ్చును.

(1) కేతనదశకుమార చరిత్ర తిక్కనకు కృతియొసగి, యందు తిక్కన పూర్వుల వృత్తాంతమును తిక్క మనుమసిద్ధి వద్దన మంత్రి, దండనాయక పదవులలో నున్న విషయమును వర్ణించియున్నాడు. ఈ దశకుమార చరిత రచనాకాలము సూక్ష్మముగ క్రీ. శ. 1253-60 మధ్యకాలమని నిర్ణయింపవచ్చును.

మనుమసిద్ధి శాసనములు క్రీ. శ. 1249 నుండి కానవచ్చినను, మనుమసిద్ధి తండ్రి తిక్కరాజు శాసనములు క్రీ. శ. 1252 సంవత్సరము వఱకు గానవచ్చుచున్నవి. ఆవత్సర మాతనిరాజ్యపాలనలో చివరిది. కాబట్టి మనుమసిద్ధి క్రీ. శ. 1253 సంవత్సరమున స్వతంత్రముగ రాజ్యమునకు వచ్చి తిక్కనకు మంత్రి పదవి నిచ్చెను. దశకుమార చరిత్రయందలి వర్ణన బట్టి తిక్కన 25-30 యేండ్లవాడని యూహించిన నాతని జననము క్రీ. శ. 1225 ప్రాంతము కాదగును. ఇది యీవఱకు చరిత్రకారు లంగీకరించినదే. దశకుమార చరిత్రమున తిక్కన కాకతీయ గణపతి వద్దకు వెళ్లిన ప్రస్తావములేదు. గణపతిదేవచక్రవర్తి మరణకాలము 1260 కావున అది క్రీ. శ. 1260 ముందే రచితము.

(2) దశకుమార చరిత్రమున ఖడ్గతిక్కన ప్రస్తావింపబడియున్నాడు. కాటమరాజు కథ, ఖడ్గతిక్కన మరణము సమకాలికములు. అయుద్ధకథనము తేది 1258-అదికాళయుక్తి-అంబర రవి శశికాళయుక్తియే. అదిసరియగుచో 1253-1258 లోపుగా దశకుమారచరిత్రరచన. తిక్కన ఉత్తరరామాయణ కృత్తి యందు పేర్కొనబడియుండలేదు. నిర్వచనోత్తర రామాయణమున మనుమసిద్ధి జయించిన విజయత్క్ష్మాధీశుఁడు కొప్పెరుజింగడు ద్వితీయుడు. ఈతని శాసనములు క్రీ. శ. 1243-1270 వఱకును కాన్పించుచున్నవి. కావున నిర్వచనోత్తర రామాయణము. క్రీ. శ. 1270 ప్రాంతముల రచితమైనది.

(3) తిక్కన నిర్వచనోత్తర రామాయణ రచనము నాటికి యజ్ఞముచేసి సోమయాజి కాలేదు. ఆ రచనయైన తరువాత భారతము. క్రీ. శ. 1273-80 వఱకును కాకతీయ రాజ్యము నందలజడులు, క్రీ. శ. 1280-నాటికి శాంతి చేకూరినది. కాబట్టి 1280-90 ప్రాంతముల మధ్య భారత రచనమైనది. భారత రచన క్రీ. శ. 1280-90 ప్రాంతమైనపుడు హరివంశ రచనాకాలము నిర్ణయము ననుసరించి ఎఱ్ఱాప్రెగడ ప్రథమరచనమగు అరణ్యపర్వ శేషము అప్పటికి పూర్తియైనది. కాబట్టియే తిక్కన, అతని శిష్యుడగు మారన మూడుపర్వములని చెప్పినారు.

# నాటకపితామహుని నాటకాలు : నీతి

శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు

ఏ కావ్యమునకైనను రసానందమే [illegible] హిత ఫలమని ప్రాచ్యలాక్షణికుల యభిప్రాయము. రసానందప్రాప్తికి నీతిబోధమాట యెట్లున్నను దుర్నీతిలేకుండుట మాత్రము మిక్కిలి యవసరము. ఏలయన, దుర్నీతి పఠితల హృదయమున నసహ్యాభావము కలిగించి రసానందానుభవమున కాటంకము కలుగఁ జేయును. అందుచేఁ గవి తన కావ్యమున నీతి బోధ కావించినను, గావింపకున్నను దుర్నీతిని దొలఁగించుటకు మాత్రము ప్రయత్నింపవలెను. మఱియు నీతిబోధ కావ్యమున నతిమాత్రమైనచో నదియు కావ్య గౌరవమునకు భంగకారియే. ఏలయన, నీతిమాత్ర ప్రయోజనమైన కావ్యము ధర్మశాస్త్రాదులవలె వ్యుత్పత్తి జనకమే కాని రసానంద ప్రాప్తికి సహకారి కాదు. అందుచేఁ గవి తన నాటకమున నానందానుభవమున కాటంకము కలిగింపని నీతిని గథానిర్వాహణము ద్వారా గూఢముగా నుపదేశించుట యుత్తమరీతి. ఇందున్నంత బలము, శక్తి, కవి నీతి సూత్రములఁ దెచ్చి యుద్ఘాటించుటలో లేదు. రసవంతముగా వ్రాయబడిన హరిశ్చంద్రుని చరిత్ర నొకమాఱు పఠింపగా గలుగు సత్యాభినివేశము 'సత్యంవద' అని కవి నిల్లుకట్టుకొని వేయిమారులు చెప్పినను గలుగదనుటలో నతిశయోక్తిలేదు.

కావ్యములలో నుత్తమమనఁబడు నాటకములలోఁగూడ నీతికి స్థానమింతే. దశరూపకకర్త ధనంజయుఁ డానందైక ఫలములగు రూపకములను వ్యుత్పత్తిమాత్ర ఫలకములని నమ్ము జనుఁ డల్పబుద్ధియని తెగడెను. అనఁగా నాటకమునకు రసానంద మపరిహార్యమైన పరమ ప్రయోజనము. వ్యుత్పత్తి నీతి మొదలగునవి యానుషంగికములైన ప్రయోజనములు. కాని లోకకళ్యాణార్థము కవి రచించు కావ్యములలో దోషదూషణమును గుణభూషణమును గూడ నుండుట కొంత యవసరమే. దుష్టులకుఁ గష్టమును, శిష్టులకు సుఖమును గలుగఁజేయుట సామాన్య నీతి. ఈ నీతికి భిన్నముగా ప్రవర్తించుట దుర్నీతి బోధకు దారిచూపును. కలియుగమున నయ విహీనులే ధనకనకవస్తువాహనాది సకల సౌఖ్య నిధులై విలసిల్లుచుండుటయు, నీతిపరులు కష్టపరంపరల కాకరములగుచుండుటయు మనము చూచుచున్నాము. కాన సహజముగా నుండుటకై నాటకమునఁగూడ సత్ఫల సంధానము చేయరాదని కొందఱందురు. కాని దుర్మార్గలబ్ధమైన సంపద క్షణికము నాపదుత్పాదకము నగుటచే దానినాదర్శముగాఁ గైకొనుట కూడనిపని. మఱియు నీతిబోధ సహజముగ, గూఢముగ, చిరస్థాయిగ నుండవలెను. దానికి నీతిబోధకనువగు కథనే వస్తువుగా గైకొనుట యవసరము. ఇట్లు చేసినచో నాటకముల యానంద నిష్యందిత్వమునకును, నీతి బోధనమునకును గూడ నాటంకము వాటిల్లదు.

పాశ్చాత్యులలోఁగూడ నీ నాటకముల నీతి విషయమై భిన్నాభిప్రాయములు కలవు. ఒక తెగవారు నాటకములలో నీతి కేవిధమైన స్థానమును లేదందురు. Ogier, Molier మున్నగువారీ తెగకుఁ జెందినవారు. "Dramatic poetry is made for pleasure and amusement" అని వారియూహ. తరువాత బయలుదేఱిన విమర్శకులు పెక్కురానందబోధనములు రెండునుకూడ నాటకకవి దృష్టిపథమున నుండవలయుననిరి. Sir Philip Sydney మోదాంత నాటకములు సామాన్య దోషములను, విషాదాంత నాటకములు రాజదోషములను వ్యక్తము చేయుచుఁ బ్రపంచముయొక్క యశాశ్వతత్వమును జాటుచున్నవని నుడివెను. ప్రేక్షకుల కానందము కలిగించుటయే నాటకముయొక్క ముఖ్య ధర్మమైనను, అట్లు పొందఁబడిన యానందమున నీతికూడ నంతర్భూతమై యుండునని Pierre Corneille అను నతడు వ్రాక్రుచ్చెను. మఱియొక విమర్శకుఁడు నాటకశాల దోషనిరాసమునకు పాఠ

కాలవంటిదని సూచించెను. Dryden సంతోషముగా బోధించుటయే సర్వకావ్యముల సామాన్య ప్రయోజనమని పల్కెను. Lessing అను నతఁడు నాటక మొకానొక నీతిసూత్రమునకు లక్ష్యముగా నుండుట తప్పులేదు గాని యందలి కథాసంవిధానము లన్నియు నట్లే యుండవలెనను నిర్బంధము లేదనెను. నీతి సూత్రముల యుద్ఘాటనము లేకయే గాఢముగా నీతిని బోధించు నాటకములు పెక్కులుండుటయే దీనికిఁ దార్కాణము. నీతిబోధను బట్టియే మనము నాటకముయొక్క న్యూనాధిక్యములనుఁ బరీక్షింపరాదు. అసలు నాటకమున మనము ప్రప్రథమమున నపేక్షించునది యానందమే కాని నీతి కాదు. అట్లని నాటకమున నీతికి స్థానమే లేదనరాదు. కవి Sophocles వలె సుదాత్తచిత్తుఁడైనచో నతఁ డేది యొనర్చినను అతని ప్రభావము నైతికముగనే యుండు నని Goethe చెప్పుటలోని సత్యమును మన మిచ్చట గమనింపవలయును. **(If a poet has a high soul as sophocles, his influence will always be moral, let him do what he will).**

శ్రవ్యకావ్యములకంటె దృశ్యకావ్యములు నీతిబోధనకు మిక్కిలి యుపకరించునని ఆచార్యులుగారి తప్పని యభిప్రాయము. అందును సాధారణ నాటకములకంటె విషాదాంత నాటకములే పనిని నిర్వర్తించుటలో నెక్కువ శక్తికలవని యాయన నమ్మిక. ఏదో యొక నీతిని సూక్ష్మముగానైనను బోధింపని నాటక మాయన రచనలలో లేదు. సాధారణముగా నాయన యా నీతుల నన్నింటి నుత్తరరంగమునఁ గ్రోడీకరించుచుందురు. నాటకమునందలి పాత్రల యాదర్శ్యార్హతనుబట్టి యాయన యందు స్త్రీలకు, బాలురకు, పురుషులకు వేర్వేరుగా నా నీతుల నుపన్యసించుచుందురు. ఆయన స్వీకరించిన కథలన్నియు నీతిబోధకనువగునట్టివే. ఆ కథలను బ్రపంచించుతఱి నాయన నీతిబోధ నెట్లోయొక విధమున సందిముడ్చుచుందురు. నాటకమున వేషములు వేయుట శాస్త్రదూష్యమగుటచే నా కాలమున మిక్కిలి నీచముగాఁ బరిగణింపఁబడుచుండెను. కాని యా నిషేధము నాటకమువలన జీవించువారికి సంబంధించినదియే కాని "వేఁడుక కొఱకును, నీతిబోధ కొఱకును నాటక ఖేలన మొనరించువారి విషయమునఁ జెప్పఁబడినట్లు లే"దని యాయన వాదము. ఏలయన, "ఒక వేళ అట్టె యున్నట్లెంచి దూష్యమని తలంచినను ఉద్దేశము మంచిదై జనులకు సుబోధ కలిగించినయెడల నిస్సంశయముగ స్వల్పదోషముగూడ నడఁగిపోవు" నని యాయన చిత్రనళీయ ప్రస్తావనలో వివరించెను. ఈ హేతువును బురస్కరించుకొనియే ఆయన స్వయముగాఁగూడ నాటక ఖేలనము నారంభించెను.

కావ్యన్యాయము (Poetic justice) ప్రకారము దుష్టులు దుఃఖము ననుభవించుటయు, శిష్టులు సుఖముల ననుభవించుటయు సాధారణ నీతి. ఆచార్యులుగారి నాటకములలో నీ నీతికిఁ దార్కాణము పెక్కుచోట్లఁ గన్పించుచున్నది. నలుఁడు, సత్యవంతుఁడు, రుక్మాంగదుఁడు, పాండవులు, రాముఁడు, భరతుఁడు మొదలగు వారు సత్పురుషులలో నెంచఁదగుటయే కాక మానవలోకమున కెల్ల నాదర్శప్రాయులు. అట్టివారు మధ్య నెన్ని కష్టములు పడినను అంత్యమున నానందముఁ బడయుట సమంజసము. హిరణ్యకశిపుఁడు, దుష్టబుద్ధి, నాగకేతుఁడు, పుష్కరుఁడు మొదలగువారు దుష్టగణములలోఁ జేరినవారు. ఇట్టివా రంతమున నిధనమును బొందుటయే నీతిబోధకు సులువైన మార్గము. లేనిచో దౌర్జన్యము సైతము జయముచే బహూకరింపఁ బడునను చెడ్డతలంపు సామాజికులలోఁ గలిగి నీతి ధ్వంసమైపోవును. ఇట్లే సజ్జనులకుఁ జివరికి సుఖములు కలుగక పోయినచో సత్ప్రవర్తనమునకు దుఃఖమే ప్రతిఫలమను నైరాశ్యముదయించి ధర్మాభినివేశమును క్షీణింపఁజేయును. నాటకకవి నీతిని బోధించినను బోధింపకపోయినను దుర్నీతిని సమర్థించుట మాత్రము లోకమునకు మహాపకారము.

ఆచార్యులుగారి నాటకము లన్నిటిలో విషాద సారంగధర మీనీతిసూత్రమునకు మిక్కిలి ప్రతికూలముగా నున్నది. సర్వసద్గుణవిభాసితుఁడును, పితృమాతృభక్తిసేవధియును జితేంద్రియుఁడునగు సారంగధరుఁడు తన సత్ప్రవర్తనకుఁ బ్రతిఫలముగా ఘోరశిక్ష ననుభవించుటతోడనే నాటకము మెత్తని చిత్తము కలవారి కుత్తలంపాటు కలిగింపక మానదు. సజ్జనులుకూడ లోకమునఁ గష్టము లనుభవిం

చుట గాననగుచుండుటయు, సారంగధరుఁడు తన ప్రియమిత్రుఁడైన సుబుద్ధి మాటల నుపేక్షించుటయు నను నీ రెండు విషయములు నీ శిక్షను సమర్థింపఁగలవని యాచార్యులుగారు వ్రాసిరి. కాని సజ్జనులు కష్టముల పాలగుట యెడనెడఁ గానవచ్చుచుండుట నిక్కువమే యైనను అది విశ్వజనీనము కాదు. ఇట్టివానిని గావ్యములలోఁ బ్రకటించినచో గంభీరమును శాశ్వతమును గావలసిన కావ్య సత్యము లౌకిక సత్యమువలెఁ దాత్కాలికమును, ఏకదేశమును నగుట తటస్థించును. సారంగధరుఁడు సుబుద్ధి మాటల వినకుండుట యొక దోషమే కాని యంత ఘోర శిక్ష ననుభవింపవలసినంత దారుణమైనది కాదు. ఈ కారణముచే నాచార్యులుగారు నీతి పరిపోషణముకొఱకీ కథ యుపసంహృతిలో కొంత మార్పుచేసి యుండవలసినది.

స్త్రీలలోఁ బాతివ్రత్యమును బోలిన మహోదార గుణము మఱొకండు లేదని యాచార్యులుగారు పెక్కు నాటకములలో విశదీకరించిరి. అదివినా యితర సద్గుణము లెన్ని యున్నను వారికి శోభ లేదు. సావిత్రీ చిత్రాశ్వమున నాచార్యులుగారి యీ భావమత్యుదారముగఁ బోషింపఁబడినది. సావిత్రికి "చటుల దుస్తర తపశ్శక్తిచేనైన, పటు నియమాంచిత భక్తిచేనైన, ఘనతర బహు యోగ గరిమలనైన, కనఁగొనఁగారాని కాలుండువచ్చి, యగణితరీతి ప్రత్యక్షమాయెల్ల" నామె పతివ్రతా మహిమవలననే. ఇంతియేగాక యామె శ్యామాదేవిని గాంచి యామెచేఁ గొనియాడఁబడుటయు, అత్తమామలకును దల్లిదండ్రులకును మనోరథావాప్తి కలిగించుటయుఁ, దనపతి ప్రాణములను మరల సంపాదించుకొనుటయు నీ పాతివ్రత్య ప్రభావమును వేనోళ్లఁ జాటుచున్నవి. సావిత్రి శ్యామాదేవికిఁ జెప్పిన పతివ్రతా ధర్మములలో స్త్రీ తన భర్తయెడఁ బ్రవర్తింపవలసిన పద్ధతి యంతయు నుపన్యసింపఁబడియున్నది. దమయంతి యన్ని యిక్కట్లు పడినను తుదకుఁ దన మనోవల్లభునిఁ గలసికొని సుఖించుట కామె పాతివ్రత్య ప్రభావము తప్ప మఱి యేహేతువును గానరాదు. స్త్రీలకుఁ బాతివ్రత్యము పెట్టనికోట. దమయంతి యడవిలో నేకాకినియై యొకవానిచే బలాత్కరింపఁబడినపుడామె సంతత సన్నికృష్టమైన యీ పాతివ్రత్యమును పావకునిచే నాతని భస్మసాత్కృతునిఁ గావించెను. సంధ్యావళి సవతులు రుక్మాంగదుఁడు మోహినిని వలచుట విని యాతని చర్యను నిరసించుచున్నప్పుడు వారికి బుద్ధిచెప్పి, యాతఁడామెతో సుఖముగా నుండుటకు నయాచితముగాఁ దనంతఁదానే యంగీకారమును సూచించుచుఁ బత్రమును బంపెను. ఏవిధముననైనను భర్త సుఖించుటయే యామె మనోరథము. ఆతని సుఖముచేఁ దన సుఖమున కాటంకము కలిగినను ఆమె లెక్కచేయదు. అతి మానవమైన యీ పాతివ్రత్యము మోహిని కాశ్చర్యమును గలిగించెను. సంధ్యావళి పాదపద్మములపైఁబడి క్షమింపుమని ప్రార్థించినఁగాని తన పాపము పోదని యామె యాతురపడెను. రోషనార శివాజీని ప్రేమించినది మొదలు తన పాతివ్రత్యమునకేవిధముగను భంగము రాకుండుటకై ప్రయత్నించెను. తన్ను మిక్కిలిగా ప్రేమించిన యౌరంగజేబు నాజ్ఞను సైతము ధిక్కరించి తన పతికిఁ గారాగార విముక్తిఁ గావించెను. అహల్యాప్రముఖులగు శివాజీ యితర భార్యలు రోషనార నీర్ష్యాళువులై పరికింపక తమకు పతిభిక్షనిడిన దేవతగా భావించుట హిందూనారులకు మాత్రమే శక్యమైన యసాధారణ కార్యము. కళావతి తన భర్తయుఁ దనవలెనే స్త్రీ యగుట గుర్తించినను, ఆమెను (ముక్తావళిని) ప్రేమించుట యద్భుతము. ఒకసారి కన్నారఁ జూచి ప్రేమించిన యాతఁడెట్టివాఁడైనను నిశ్చల భక్తితో నాతని సేవించుచుండుట స్త్రీకిఁ బరమ ధర్మము. జగంధరుఁడెంత భయపెట్టినను ముక్తావళి యాతనికి లొంగకుండుట కతిమానుషమైన యామె పతిభక్తియే కారణము. చంద్రరేఖ తన భర్త చిరకారిని తన్ను వధింపుమని పంపినప్పుడు తనలో నేదేని దోషముండెనేమోయని యాలోచించెను కాని, నిజముగాఁ దానెట్టి దోషము నాచరించి యుండమి నెఱింగియు భర్త యవిమృశ్యకారిత్వమును నిరసింపలేదు. భర్త యాజ్ఞ ననుసరించుటయే పరమ పుణ్యమని యామె భావించెను. ఇట్లే రత్నాంగి, లీలావతి, ద్రౌపది, కౌసల్య, సీత మొదలగువారు కూడ నీ పాతివ్రత్యమను మహోదార గుణముతో శోభిలునట్టివారే. చిత్రాంగి యనురాగము నిర్మలమైన

దియు, గాఢమైనదియు నగుట నిజమే కాని యామె యగ్నిహోత్ర సాక్షిగాఁ బెండ్లాడిన భర్తను వీడి యితరుని, అందుని కుమారుని, కామించుట పరమ తుచ్ఛము. ఆమె ప్రేమ నైర్మల్యమామె చర్యకు హేతువును జూప జాలునేమోకాని యందలి పాపమును బరిహరింపలేదు. అందుచేతనే ఆమె యట్టి నికృష్టపుఁ జావు చచ్చెను. పాతివ్రత్య సంపదలేని స్త్రీల గతి యిట్టిదే. "భామకు పతిభక్తి బహుజన్మ ఫలము; రామకు పతిభక్తి రత్నభూషణము; కలికికి పతిభక్తి కామితదాయి; నిరత వ్రతాదుల నెల్లను మోక్ష, మతివలు పొందంగ నడరుటలెల్ల, రిత్తపోవఁగ నల్లరేగుపండులకు, ముత్తియంబులు పోయుట మూర్ఖతకాదె." సారంగధర నాటకమున నీతిభంగ మొకటి కలిగినదని కొందఱి తలంపు. ఆద్యంతము నీచ శృంగారపు ముద్దయిన యీ నాటకము నుర్వితిని దప్పిక కలిగించుననియు, చిత్రాంగి శృంగార చర్యలన్నియు వర్ణించి వర్ణించి చివరికిఁ జెరలో నామె గింజుకొని చచ్చెనన్నంత మాత్రమున నీతి ప్రబోధము కలుగదనియు, వారి వాదము. స్థూలదృష్టికట్లే తోఁచును కాని ఆచార్యులుగారామె నిర్మల ప్రేమప్రకాశనముద్వారా, పశ్చాత్తాపముద్వారా, ఆ క్రౌర్యమును చాలవరకు తగ్గించిరి. పైఁగా మంచి పాత్రలకు వన్నె చేకూర్చుటకై చెడ్డపాత్రలు కూడ వర్ణింపఁబడుట మిక్కిలి యవసరమని యాచార్యులుగారి తలంపు. కాని నాటకములు పామర లోకము యొక్క నీతిభావములపై నెక్కుడు ప్రభావమును ప్రదర్శింప సమర్థములై యుండును గావున నీనీతివిషయమై కవి అతి మాత్రమైన శ్రద్ధవహింపవలెను. విషము మందునకేయైనను స్వల్పముగా మాత్రము గ్రహింపఁబడవలెనుకదా!

పురుషుఁడు పరసతిని గాంక్షించుటకాని, స్త్రీ పరపురుషుని గాంక్షించుటకాని మహాపాతకము. ఆచార్యులుగారికీ వ్యభిచారముపైఁ గల వైముఖ్య మింతింతయని చెప్పలేము. ఏ ఘోర పాపమునైనను సైరించునుగాని యాయన యీ పాపమును మాత్ర మేపరిస్థితులలోను సైరింపఁజాలరు. ఇట్టి ప్రసంగము వచ్చిన చోటుల నెల్ల నీ విషయమును గూర్చి యాయన నొక్కి చెప్పుచుండును. కీచకుఁడు కామాంధుఁడై మహా పతివ్రతయగు ద్రౌపదిని మోహించెను. దానికి ప్రతిఫలముగా నాతఁడు బలాఢ్యుఁడే యైనను భీముని చేతి నికృష్టమైన చావు చచ్చెను. ఆచార్యులుగారీ విషయము నుత్తర రంగములో నిట్లు చెప్పుచున్నారు. కీచకుఁడు "ఘనబాహు బలధుర్య! కంజాప్త శౌర్య! జనదద్రి ధైర్య! కీచకవర్యయంచు, భూజనంబులు సర్వభూముల పొగడ, రాజన్యులరుల నిరంతరమివ్వ, దారుణంబుగ వసుంధర నేలినాఁడు! కాని పరసతీమణి భంగపరచిన పాప భరమున మతి మాలి పరశక్తి సోలి, ప్రాభవగతి మాలి పడియుండఁగా కన్న నా భీముఁడైన నేమాతని కెదురగు?" కామమువలన:

"అపకీర్తియొకటి పాయని పాపమొకటి
యుపతాప మొక్కటి యురు దుఃఖమొకటి
పరిభవమొకటి ప్రాభవ హాని యొకటి
నిరభీతియొకటి హెచ్చిన వైరమొకటి
ధనహానియొక్కటి తనుహాని యొకటి
ఘన భయంకర నరకంబు నందొకటి
అతికామమున రావణాసురుఁ డీలై
క్షితి నిందఁ దలపోయ కీచకుఁ డీల్గె
కావున ధరపరకాంతలమీఁది
భావమెన్నఁడుకాని వలవదుసుండి."

శేఖర్జీ ముందు వెనుక లాలోచింపక పతివ్రతయైన గోషనారను బలాత్కరించుటచే పరుసాతిము ననుభవించెను. ముక్తావళిలో నామెను పరిభవించిన తురకలును చిత్రనళీయములో దమయంతిని కాంక్షించిన యొుక నాయకుఁడును నిట్లే తమ ప్రాణములను విడువ వలసినవారైరి. పరకాంతలమాట యటుండ, వేశ్యల కామించుట సైతము పాపకారణమే. అందు తమ్ము నొల్లనివారి మాయోపాయమునఁ గాని నిర్బంధమునఁగాని కవయఁజూచుటమతియుఁ బాపహేతువు. వీరసేనుఁడు వరూథినిని మాయామార్గమునఁ గవసినందులకుఁ బదునాలుగేండ్లు పాషాణాకృతిని వహింపవలసివచ్చెను. మనోహరుఁడు మోహినిని మోహించి తన ధనమును, అభిమానమునుగూడఁ గోల్పోయెను.

స్త్రీల విషయమునఁగూడ నింతే. పరపురుషులఁ జూచుటకాని, స్మరించుటకాని వారి నంధతామిస్రమునఁ గూలఁద్రోయును. ఇంతియే కాక పురుషరూపమున నున్న స్త్రీల స్పృశించినను వారు పాపమునకు గురియగుదురు. చంద్ర

రేఖ మొట్టమొదటఁ బురుషవేషమునఁ దనతో శృంగారాలాపము లొనర్చుచున్న మోహినిని మిక్కిలి దూషించెను. కాని యది మోహినిచే హాస్యమునకు గావింపఁబడిన నాటకమని యెఱింగి యామె నాలింగనము చేసికొనెను. ఈ సమయమున నచటికి వచ్చిన మేధానిధి వారి నిరువురినిజూచి చంద్రరేఖను ఖండింపుమని కళానిధి కాజ్ఞాపించెను. పతివ్రతయైన చంద్రరేఖ విమర్శించి విమర్శించి రాజు తనకంత దారుణ శిక్ష విధించుటకుఁ దాను పురుషాకృతి నున్న మోహిని నాలింగనము చేసికొనుటయే కారణమనియు, నిజమున కా పాపమున కట్టి శిక్ష విధింపఁదగినదే యనియుఁ దలపోసెను. వేశ్యలు స్వైరిణులయ్యు ననాలోచితముగాఁ దమకంటికి సుందరులుగాఁ గానిపించిన యేరినైనను గామించుటకు వీలులేదు. వరూధిని పవిత్రుఁడైన ప్రవరాఖ్యుని మోహించి దానికిఁ దగిన శిక్ష ననుభవించెను.

ఆచార్యులుగారిట్టివే తమ నాటకములలోఁ బెక్కు నీతుల నుద్బోధించి యున్నారు. హాస్యము చేయుట యానందహేతువే కాని దానికి సమయాసమయములు కలవు. అట్లు సమయాసమయములఁ బరికింపక హాస్యముఁ జేసినచో దానివలన నివారింపరాని మోసము వాటిల్లును. మోహిని వేళాకోళమునకుఁ జేసిన హాస్యమే పతివ్రతయగు చంద్రరేఖ మరణమునకు హేతువయ్యెను. దైవవశమునఁ జిరకారి మాతృభక్తికిని, పిత్రాజ్ఞకును దన మనసునఁ గలిగిన యంతర్యుద్ధమువలన శ్రేయోమార్గము నన్వేషించుచు నాలసించెను గాని లేకున్నచో నన్యాయముగా, నకారణముగా నా పతివ్రత ఖండింపఁబడియుండును. చిరకారి మేధాశాలి కాన తొందరపడక యా విషయమునుగూర్చి యాలోచించుచుఁ గొంత కాలయాపనము చేసెను. అదియే నాటకము యొక్క సుఖాంతమునకుఁ గారణమయ్యెను.[1] తొందరపడి పనులాచరించుట కష్టనష్టములు రెంటికిని మూలహేతువగును. రాజరాజనరేంద్రుఁడు చిత్రాంగి చెప్పిన మాటలు విని సదయుఁడు కోరినను గాలవ్యవధానమున కంగీకరింపక యాత్రముతో సారంగధరుని కా శిక్ష విధించెను. అతఁడు కొంత కాలవ్యవధానము నంగీకరించి యుండినచో నా నిజము బైటఁబడుటయు, సారంగధరుఁడు విముక్తుఁడగుటయుఁ దటస్థించియుండును.

కామక్రోధాదియగు నరిషడ్వర్గము మానవు నాకర్షించి యాతనిచే చేయరాని పనులు చేయించి యైహికాముష్మిక సౌఖ్యములకు వెలి చేయును. రాజరాజనరేంద్రుఁడంత వివేకి యయ్యు తన సుతునికై యేర్పఱుపఁబడిన తరుణిని సౌందర్యలాలసుఁడై తానే వివాహమాడఁగోరుట కాతని కామాంధతయే కారణము. చిరకారిలో మోహిని నుడివినట్లు మోహము (శాశ్వతప్రేమ) వలన దోషములేదు కాని కామము నీచాతినీచము. క్రోధము మనుష్యునిఁ బరవశునిఁగాఁ జేయును. 'క్రుద్ధో హన్యా ద్గురూనపి' అను నానుడిలో నెంతేని యాథార్థ్యము కలదు. లోభము నీచాతినీచ గుణములలో నొకటి. ఈ రెండును గూడినా మనుష్యునికి రాని యాపదయుండదు. దుష్టబుద్ధి మిక్కిలి కోపస్వభావము కలవాఁడు. మంచి యైనను చెడ్డయైనను నితరులు చెప్పుటయే చాలును. అతని కోపము మితిమీఱి సాహసమున ఫలించును. ఈర్ష్య కతఁడే పుట్టినిల్లు. తనకు సంబంధమున్నను లేకున్నను ఇతరులు సౌఖ్యపడుటచూచి యోర్వలేఁడు.[2] ఐహికమైనట్టియు, క్షణికమైనట్టియు రాజ్యసంపద కాసపడి యాతఁడు తన యేకైక కుమారిని ముదివగ్గునకిచ్చి వివాహముచేయ నొప్పుకొనెను. ఆ కారణముచేతనే చంద్రహాసుని నన్యాయముగాఁ జంపుట కొడిగట్టెను. అసలు చంద్రహాసునిపై నతనికి క్రోధ ముదయించుట కీర్ష్య తప్ప మఱి యే హేతువును గానరాదు. ఈ యీర్ష్యయే యతని యధఃపతనమునకు మూలహేతువయ్యెను.[3] ఇట్లే

1. ఏకార్యమైన బరీక్షించి యోర్చి, ప్రాకటగతి చేయవలయును సుండి.
2. ఇతరు లెవ్వారైన నిద్దరు మంచి, హితులన్నమాట నొక్కింత విన్నంత సైపలేని క్రోధంబు హృదయంబు కలప, మనసు నిల్వగలేక మాటాడలేక వగల హితంబు వారింపుగాక, కూడును నిదుర నే కోరకయుండు.
3. నా యసూయగుణంబునకు ఫలంబిదియె నా యీర్ష్య జన్మంబునకు ఫలంబిదియె కాదు క్రోధగుణంబునకు ఫలంబిదియె కాదు మాత్సర్యంబునకు ఫలంబిదియె,

దుర్యోధనుఁడు పాండవులఁ బలుపాట్లు పెట్టుటకుఁ బెక్కు విధముల ప్రయత్నించెను. లోభేర్ష్యాపరాయణుఁడైన యాతని ప్రయత్నము లన్నియు భగ్నములై తుదకాతనికిఁ దలవంపు చేకూర్చెను. కీచకుని మోహమునకు ఫలితము తత్క్షణమే కానిపించెను. హిరణ్యకశిపుఁడు వరగర్వముచే మదోన్మత్తుఁడై సంచరించెను. అతనికి హరిభక్తిపూరితుఁడైన ప్రహ్లాదు 'డంగ్రాతములోని దుష్టాంగము'వలెఁ గానిపించెను. అతఁడు ప్రహ్లాదునిఁ బెట్టిన పాట్లన్నిటికిని మదక్రోధములే కారణమాయెను. నరసింహావతారముగా ప్రాదుర్భవించిన [illegible] ఆతనిని నఖాగ్రదారితోదరునిగాఁ [illegible] చేసి మదముగలవారి కందరికిని మంచి నీతి గఱపెను.

ఏకార్యమునందైనను అవిచలితమైన యవధానముంచి పట్టుదలతో పనిచేయుట శ్రేయమునకు రాచబాట. ఆ పట్టుదల, నిష్ఠ, లేకపోయినచో మానవశక్తి (energy) నష్టమే కాని ఫలితము కానిపించదు. కష్టనిష్ఠురముల కోర్చి తాను మనసార ధర్మ్యమని నమ్మిన యొక కార్యమును వీడని యుత్సాహముతో నొనరించువారికి విజయము తథ్యము. ప్రహ్లాదుఁడు చచ్చుటకైన నోర్చెఁగాని తన మనమున నాటియున్న హరిభక్తిని మాత్రము విసర్జించుట కంగీకరింపలేదు. సావిత్రి తన పతి ప్రాణములు సంపాదించుటకుఁ గాలుని ననుసరించుచునే యుండెను. రుక్మాంగదుఁడు తన కుమారుఁడు మృత్యుముఖమునఁ బడనున్నప్పుడు సైతము ఏకాదశీ వ్రతనిష్ఠ పరిత్యజింపలేదు. ముక్తావళి, చంద్రమతి, ఘోషనార, యెన్ని కష్టముల కోర్చియైనను పాతివ్రత్య భంగమున కొడిగట్టలేదు. వీరందఱును దమ నిష్ఠకుఁ బదులుగా కష్టములను తరించి యంత్యమున నవ్యయమైన సౌఖ్యము నందఁగలిగిరి.

ధర్మానుసారియైన సత్యవస్తువు కడగండ్లఁ గడచి యఖండమైన విజయముఁ గాంచుట ధ్రువము. ధర్మనైర్మల్యము లెన్నఁడు నొంకొంటి విడుననే విడువవు. అవి పరస్పరాశ్రయములు. నైర్మల్యముతోడి పొత్తులేని ధర్మము విజయముఁ బొందుట కవకాశము కలదుకాని ధర్మహీనమైన నైర్మల్యము సిద్ధిఁ బొందనేరదు. చిత్రాంగి ప్రణయమున నైర్మల్యము కలదుకాని ధర్మము కొఱవడియున్నది. ఆ కారణముచే నామె కోరిన సిద్ధిపడయలేదు. దమయంతి, సావిత్రి, ఘోషనార, ముక్తావళి, చంద్రరేఖ, ద్రౌపది మొదలగువారి యనురాగము ధర్మనైర్మల్యములు రెంటికిని ఆటపట్టులు. ఆ హేతువుచేతనే వారి యనురాగములు దైవకల్పితములైన వియోగవిఘ్నములచేఁ గొంత యొడుదుడుకు పోకపోయినను తుదకు సుస్థిరమైన యనంతమైన రాచబాటలోఁ బడెను. సత్య ప్రణయము (true love) అంత్యమున సుఖసంపూర్ణమైన యఖండసిద్ధిని పొందితీరును. (triumphs in the end).

## రామాధిపా!

తినమాటల్ ప్రభు వాలకించినపుడే తా దక్షుఁడైనప్పుడే
తనకైశ్వర్యము కల్గినప్పుడె దయాదాక్షిణ్యముల్ కల్గి స
జ్జనులన్ దీనుల బంధులం దెలిసి కాక్షంజూచి రక్షించబూ
నిన వాఁడే నిను వేఁడినట్టి సుకృతాన్వీతుండు రామాధిపా!

# ద్విపదభారతము

శ్రీ కొమ్మనమంచి జోగయ్యశర్మగారు

[ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు చేయ తలపెట్టిన ఉత్తమకార్యములలో తంజావూరు సరస్వతీ మహాలులోని అముద్రితాంధ్ర వాఙ్మయ సంపాదన సంస్కరణ ప్రచురణము లొకటి. దానికి శ్రీకారమే ద్విపదభారతావిష్కరణము. దీనిని గూర్చి క్లుప్తముగా ఆలిండియా రేడియో విజయవాడ కేంద్రమునుండి తే 28-4-55 దిని ప్రసంగించితిని. ఆ ప్రసంగము పరిశోధనలో (అక్టోబరు నవంబరు 1954 సంచిక) ప్రకటింపబడినది. అది ప్రస్తుత వ్యాసమునకు స్థూలరూపము మాత్రము. ద్విపదభారతము సంపూర్ణ స్వరూప స్వభావములను వెలయించుచు పరిశోధనాత్మకమగు విపుల వ్యాసమును పరిశోధనద్వారమున నేడు ఆంధ్ర మహాజనులకు అందిచ్చుచున్నాను. సహృదయులకు పాఠకులు ఇందలి మంచినే గ్రహించి నీహారలేశములను మన్నింతురుగాక.

ఈ సందర్భములో ఒక్కమాటమాత్రము చెప్పక తప్పదు. ఏమనగా, ద్విపదభారతమన్నంతనే మిత్ర శ్రీ తిరుమల రామచంద్రగారు నాకు గుర్తునకు వత్తురు. ఏతన్మాతృకనుండి ప్రత్యంతరము రూపొందుటలో వారి వ్రాయసము ఆధారకముగా నుండుట ఇందులకు ప్రబల కారణము. అంతియకాదు, అంతకుమున్న తాళపత్రగ్రంథ పఠనము నాకు సరికొత్త. ఆయన అప్పటికే ఆ విషయమున ఆరితేరినచేయి. నాకు ఇందు పరిచయము గలుగుటకు ఆయనే మార్గదర్శకులు. ఆయన యనుభావమును అడుగడుగునను అగ్గింతును.]

భాష, భావము, ఛందము, రచనావిధానము, కొంతవఱకు నితివృత్తము వీనిచే ఆంధ్ర సరస్వతికి "స్వంత యాస్తి" యని చెప్పుకొనదగినది పదకవిత్వము. ఇది పాటలుగా, పదములుగా, ద్విపదలుగా, యక్షగానములుగా ననేక రూపములతో నాంధ్రావని నవతరించినది. వీనిలో నే తెగను దీసికొనియైనను జాగరూకతతో నిదానముగా పరికించినచో సున్నితములైన భావములు, దేశీయమగు భాష, కమ్మని తెనుగు నుడికారము అడుగడుగునను పొడకట్టుచుండును. కాని, యీ పదకవిత యెంత నిసర్గరమణీయమైనను, ఛందోడంబరమును, సంస్కృత బాహుళ్యమునుగల మార్గకవిత యెదుట మసలలేక, పామరజనాశ్రయమై చిరకాలము పల్లెపట్టులయందే పొరాడవలసి వచ్చినది.

దీనియందలి సహజమాధుర్యమును, సర్వజనీనతను గుర్తించి, దీనికిని నాగరకలోకమున నాదరమును, సారస్వత ప్రపంచమున నుచిత స్థానమును, గలిగించుటకు యత్నించిన మహానుభావులే ద్విపదకావ్యకర్తలు. వీరిలో ప్రథమాచార్యుడుగా పేర్కొనదగినవాడు పాల్కురికి సోమనాథుడు. ఇతడు, కావ్యగౌరవమును పోషించునది సర్వజనీనతగాని ఛందఃప్రయాసాతిశయముగాదని గుర్తించి, వివిధవృత్తములతో సంస్కృత బహుళముగా గద్య పద్యాత్మకమగు గ్రంథరచన మొనర్పవలయు ననెడి యాకాలపు మార్గకవులకు

"ఒప్పదు ద్విపద కావ్యోక్తి నాఁజనదు;
ఆరూఢ గద్యపద్యాది ప్రబంధ
పూరిత సంస్కృతభూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబుగామి
జానుఁదెనుఁగు విశేషము ప్రసన్నతకు."
(పం. ఆ. చం.)

అని సమాధాన మొసఁగి,

"ఉరుతర గద్యపద్యోక్తుల కంటె
సరసమై పరఁగిన జానుతెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్యమగుటఁ
గూర్చెద ద్విపదలు కోర్కి దైవాఱ'
(బ. పు.)

అని ప్రతినవట్టి, రెండు జాతిరత్నములు సానలు దీర్చి, ఆంధ్రవాణి కుపహార మర్పించినాఁడు.

ఈతఁడేర్పఱచిన ద్విపద కవితామార్గమందలి రచనా సౌలభ్యమును, సర్వజనోపయోగిత్వమును పలువు రాంధ్రకవులు పసికట్టిరి. రంగనాథుడు, గౌరన, చిన్నన మున్నగువారు రామాయణము, హరిశ్చంద్రోపాఖ్యానము,

అష్టమహిషీ కల్యాణము మొదలగు కావ్యములను ద్విపదగా రచియించి ఆంధ్రభాషకొక నూత్న వికాసమును, ఆంధ్రులకొక ప్రత్యేక వాఙ్మయ శాఖను ప్రసాదించిరి. క్రమముగా కవులకును, పోషకులకును ద్విపదవాఙ్మయముపై ఆదరాభిమానములు కలిగినవి. ఇందలి సర్వజనోపయోగిత్వమును, విశేష విషయముల నప్రయాసముగా చెప్పుట కనువగు సౌకర్యమును గుర్తించి, కొందఱుకవులు భిన్న భిన్నేతివృత్తముల నైకొని ద్విపద కావ్యములు రచింపగా, మరికొందరు ప్రాచీనములగు నాంధ్ర పురాణము లందలి పరమార్థము నాబాలగోపాల మందరి కందింప దలచి, వానిని ద్విపదలలో సంతరింపజేయ మొదలిడిరి. ఆరీతిని ద్విపద రచనగా నవతరించిన ఆంధ్రమహాగ్రంథములలో ఈ భారత మొకటి.

దీనిని ద్విపదగా రచించిన మహానుభావులు ముగ్గురు. వారు తిమ్మయ, బాలసరస్వతి, సోమన యనువారలు. వారిలో తిమ్మయ ఆది పర్వము మొదలు ద్రోణపర్వాంతము (సభాపర్వము తప్ప) మొత్త మారు పర్వములను రచించినాడు. ఇతడు వల్లభసూరి కుమారుడు, కాశ్యప సగోత్రుడు; [1]శుక్లయజుశ్శాఖా బ్రాహ్మణుడు; శివభక్తుడు; నెల్లూరు మండలములోని [2]బట్టేపాడు నివాసి; ఇంటి పేరును బట్టేపాటివారే. పై విషయ మీ క్రింది పద్య భాగములవలన తెలియనగును.

"ఇది సదాశివభక్త హితగుణాసక్త
సదయ స్వరూప కాశ్యప గోత్ర దీప
స్తుతిపాత్ర వల్లభసూరి సత్పుత్త్ర
మతిమద్విధేయ తిమ్మయ నామధేయ
విరచిత......పర్వమున
నరుదుమీఱంగ......నాశ్వాసమయ్యె."

ఇతని యితర పర్వములందన్ని యాశ్వాసాంతములును నైరీతినే యుండును. ఇతడు రచించిన పర్వములలో (ఆదిపర్వములో కొన్ని యాశ్వాసములు, విరాటపర్వమును తప్పతక్కిన) అన్ని యాశ్వాసముల యారంభమునను

"శ్రీరామ, రఘురామ, సీతాభిరామ,
ధారుణీపతిరామ, దశరథరామ!" ప్ర. ఆ.
"శ్రీ లక్షితాకార, శ్రితజటాభార,
లాలితగుణధామ, లంకావిరామ!" ద్వి. ఆ.
"శ్రీతనయాకార, సితకీర్తిహార,
చాతుర్యఘన, రామ, జానకీరమణ!" తృ.ఆ.

అని రామసంబోధనలు గలవు. పై యాశ్వాసాద్యంత భాగములను బట్టి కవి శివభక్తుడయ్యు హరిహరులయెడ నద్వైత భావముగలవాడై తన రచనలను శ్రీరామున కంకితమొనర్చినాడని తలపవచ్చును. కాని, ఆదిపర్వములోని నాల్గవ యాశ్వాసము మొదలు తుదివరకు నీ దిగువ రీతిని వేరు సంబోధనలు చూపట్టుచున్నవి:

---

1. ఆదిపర్వమున ద్రౌపదీ స్వయంవర ఘట్టములో నర్జునుడు తనపై నెత్తివచ్చిన రాజులను నిర్లక్ష్యముగా చూచుచు బాణప్రయోగ మొనర్చెనని వర్ణించు సందర్భములో కవి:

"నగి పెద్దలడుగు ప్రశ్నములకు సరగ దగ యాజ్ఞవల్క్యుండుత్తర మిచ్చినట్లు"

అని చెప్పియున్నాడు. ఈ దృష్టాంతమున కిచట ప్రసక్తి లేకపోయినను, పరరాజులను లెక్కసేయక అర్జునుడు బాణప్రయోగము చేయుటను, పెద్దలడుగు ప్రశ్నములకు నవ్వుచు యాజ్ఞవల్క్యుడు సమాధానము చెప్పినట్లున్నదని పేర్కొనుటచే గ్రంథకర్తకు యాజ్ఞవల్క్యునియందు భక్తిగౌరవము లున్నట్లు తోచుచున్నది. కనుక తిమ్మయ యాజ్ఞవల్క్యశాఖీయుండై (శుక్లయజుశ్శాఖ) యుండవచ్చుననియు నూహించుటకు వీలగుచున్నది. భవభూతియు నిట్లే యుత్తరరామచరితలో:

"యాజ్ఞవల్క్యో గురుర్యస్మై బ్రహ్మపారాయణం జగౌ" అని తన యాజ్ఞవల్క్యాభిమానమును, శుక్లయజుశ్శాఖీయతను భంగ్యంతరముగా వచించినాడు. కావున తిమ్మయయు ఆరీతినే యొనర్చియుండునని నా యూహ.

2. "రామాయణంబు భారతమును ద్విపదలై మీఱజేసిన యారంగనాథు
ధీరు బట్టేపాటి తిరుమలభట్టు గారి ప్రౌఢోక్తులు కలయ స్మరించి"
(లేకుమళ్ల రంగశాయి ద్విపదభాగవతము, అముద్రితము)

"శ్రీ సమాశ్రితనేత్ర, శృంగారగాత్ర,
ధీ సార, నరసయాధిపు చోడ, ధీర,
అసమాన దాన విద్యావినోదముల
దెసల వర్తిల్లు మంత్రీ! చిత్తగింపు." చ. ఆ.

"శ్రీరామ విఖ్యాత చిరతరోల్లాస!
నారీనుతక్రీడ, నరసయచోడ!
తక్కక కర్ణావతారుండ వనఁగ
దిక్కులవెలయు మంత్రీ! చిత్తగింపు." పం.ఆ.

"శ్రీయుత వాగ్జాల, సిదవిశాల,
న్యాయ నూతన చోడ, నరసయచోడ!
పంచమ వేద ప్రబంధ సత్కీర్తి
మించిన సత్యధర్మీ! చిత్తగింపు." ష. ఆ.

"శ్రీవర, శ్రితకల్పవృక్షావతార!
పాకశాసనభోగ, భవ్యసంయోగ!
నీలవర్ణునిమీఁద నిజమైన భక్తి
గీలుకొల్పెడు వివేకీ! చిత్తగింపు." స. ఆ.

"శ్రీకర గుణజాల, సితకీర్తిలోల,
నాకేంద్రవైభవ, నరసయచోడ!
ప్రకటిత నిఖిల సౌభాగ్యవర్తనల
నకలంకుఁడగు నమాత్యా! చిత్తగింపు.
అష్ట. ఆ.

పై ద్విపద పంక్తులవలన శృంగారగాత్రుడును, ధీసారుడును, న్యాయ నూతన చోడుడును, శ్రితకల్పవృక్షావతారుడును, నిఖిల సౌభాగ్య వర్తనల నకలంకుడును, అసమాన దాన విద్యావినోదముల కర్ణావతారుడని దిక్కుల వెలయు నమాత్య పుంగవుడు నగు నరసయ చోడునికి తిమ్మయ ఆదిపర్వములోని కొన్ని యాశ్వాసములు కృతియిచ్చినట్లు తెలియుచున్నది. కాగా, నితడు తొలుత రామార్పణ బుద్ధితో గ్రంథరచన మారంభించి, మూడాశ్వాసము లా శ్రీరామచంద్రునిపేరనే వెలయించి, యింతలో ప్రభువు నాదరము బడయ గోరియో, 'పంచమవేద ప్రబంధ సత్కీర్తి' నాశించిన [1] నరసయామాత్యుని కోర్కె మన్నించియో, తరువాతి యైదాశ్వాసము లతని కంకితముచేసి యుండును.

"ఐతే, ఏక కర్తృకమగు కృతిలో భిన్న భాగములందు వేర్వేరు కృతిపతులుండుట యేమి!" యని ఎవరికైనను వింతగా దోప వచ్చును. తోచుట అసంగతముకాదుగాని, అట్లుండుటమాత్ర మసంభవముగాదు. కొన్ని ప్రాచీనాంధ్ర గ్రంథములందును ఈ సంప్రదాయము కన్పట్టుచున్నది. తొలుత భగవదర్పణ బుద్ధితో గ్రంథారంభ మొనర్చి నడుమ 'నేకారణముననో మనుజాంకితము చేయుటయు, ఇహపరముల రెండిటి నొక్కమారు సాధించు చూపుతో గాబోలు భగవంతునకును ప్రభువునకును గలిపి కృతి యిచ్చుటయు, మోక్షేచ్ఛ యున్నను ఐహికవాంఛల వీడలేక పరమేశ్వరార్పణముగా మనుజులకు కృతి నొసగుటయు, పూర్వాంధ్రకృతులు కొన్నిట కానవగును.

భాస్కర రామాయణమునందలి బాలకాండము పరమశివున కంకితము. అయోధ్యారణ్యకాండములు సాహిణి మారునిపేర వెలసినవి. కిష్కింధాకాండము శివసంబోధనతో నారంభమై "రథినీ పాలాగ్రణీ! సాహిణీ!" యని మనుజాంకితమైనది. సుందరకాండము సాహిణి మారునికి కృతిగా మొదలిడి,

1. ఈ నరసయామాత్యుఁడెవరో యిదమిత్థముగా నింతవరకు తెలియరాలేదు. కాని నాయూహ యిది: జంగాల మమ్మయ యను పంటవంశప్రభువు బట్టెపాటి పరిపాలకుడు (ఈతడు తిమ్మయకృత విరాటపర్వము కృతిభర్త. ఈ విషయము మున్ముందు నిరూపింపబడును) నరసయచోడు డీతని యమాత్యుడై యుండును. బట్టెపాటి నివాసియగు తిమ్మయ తన భారతమును మమ్మయకు కృతి నొసగ దలచి, అమాత్యుని ద్వారమున నాతని యనుగ్రహము పడయనెంచి, మున్నుగా నరసయచోడు నాశ్రయించి యాతనిని మెప్పించుటకై యాదిపర్వములోని కొన్ని యాశ్వాసములు కృతి యిచ్చియుండును. రాజాదరణమునకు మంత్రుల ప్రసన్నభావముగదా ద్వారము! శ్రీనాథు నంతటివాడు రెడ్డిరాజుల యాదరమును బడయ గోరి, తొలుత, వారి యమాత్యులకు తన కృతులలో కొన్నిటిని కానుకపెట్టలేదా! ఆ రీతినే తిమ్మయయు నొనర్చియుండును. అట్లే యైనచో ఈ నరసయచోడుడు ఆ జంగాల మమ్మయ కొలువులోని ప్రెగ్గడయై యుండుట సంభావ్యమే యగును.

"సవనభుగభివంద్యా, సర్వలోకైకవంద్యా,
రవిశశిశిఖి నేత్రా, రమ్యరామార్ధ గాత్రా!"

యని శివసంబోధనతో ముగియుచున్నది. యుద్ధ కాండమును సాహిణి మారుని సంబోధనలతో నారంభించి "కనకకుధరచాపా!......సర్వ నిష్పన్నహారా!" యని శివార్పణముగా పరిసమాప్తిసందినది.

రాఘవపాండవీయమును, కృతిపతి వంశావతార పీఠికతో నారంభింపబడి,

"దీపితరాగ శివాత
న్వీపుంద్రేక్షునకు నాకువీటిపురాంక
శ్రీ పెదవెంకట నృపక్ష

రూపాంబక లక్ష్యునకు విరూపాక్షునకున్"

అని శివార్పణముగా ఆకువీటి పెదవేంకటాద్రికి అంకిత మీయబడినది. ఇందలి అన్ని యాశ్వాసాద్యంతములను పెదవేంకటాద్రి ప్రసంగగర్భితములగు పరమశివ సంబోధనలు కానవగును.

కనుక తెనుగు కృతులలో కొంతభాగము దైవపరముగను, మరికొంత మనుజపరముగను, కొంత యుభయులకు గలిపియు కృతియిచ్చుట క్రొత్తవిషయముగాదు. ఆ రీతినే తిమ్మయయు రామార్పణముగా కృత్యాది గావించి, తరువాత 'పంచమవేద ప్రబంధ సత్కీర్తి' నాశించినసరసయాధపుని కోర్కె మన్నించియో, తాను ప్రోత్సహించియో తక్కిన యాశ్వాసము లాతనికి కృతియిచ్చి యుండును.

విరాట పర్వము కృతిపతిత్వ విషయమున గూడ నిట్టిదే ద్వైవిధ్యమొకటి చూపట్టుచున్నది. దానినిగూర్చి తరువాత వివరింతును. అసలు ఈ ద్విపదభారతమును మొట్టమొదట వెలుతురులోనికి దెచ్చినవారు శ్రీ పనప్పాకం శ్రీనివాసాచార్యులుగారు. వీరు 1912 వ సంవత్సరములో విరాటపర్వమును సంస్కరించి చెన్నపురి మాంటురోడ్డులో నున్న శ్రీ వైజయంతీ ముద్రాశాలలో ముద్రింపించి ప్రకటించినారు. దాని భూమికలో ఆచార్యులుగారు వ్రాసిన మాటలివి :

"ఈ గ్రంథమును ముద్రణమునకై సంస్కరించునెడఁ గొన్ని పాదములను మార్చియు, ననేకములగు క్రొత్తపాదములను జేర్చియు, సమగ్రమొనర్చి ముద్రింపించి యున్నాఁడ. ఇంకను గొన్ని పర్వములు ముద్రణమున నున్నవి. అవియు శీఘ్రకాలమున వెలువడఁగలవు."

పై వాక్యముల ననుసరించి ఆచార్యులుగారు ద్విపదభారత పద్యముల నన్నిటినో, కొన్నిటినో సంపాదించి సంస్కరించి ప్రకటింప నున్నారనియు, అందు విరాటపర్వమును మాత్రము తొలుత వెలువరించిరనియు తెలియుచున్నది. కాని, నాటికిని నేటికిని వారు ముద్రింపించి ప్రకటించిన విరాట పర్వమొక్కటే కన్పట్టుచున్నదిగాని తక్కిన పర్వములు ముద్రణములో లభించుటలేదు. బహుశా ఆచార్యులుగారు తక్కిన యే కొన్ని పర్వములనో సంపాదించి సంస్కరించుచు ముద్రణము కాకుండగనే కీర్తిశేషులైరో, ఆ పర్వము లేమైనవో, వాని సమాచారమే యింతవరకును దెలియరాదు. ఆచార్యులవారైనను ఆ పర్వముల నెచ్చట సంపాదించిరో, వాని స్వరూప స్వభావము లెట్టివో పీఠికలో దెలుపరైరి. శ్రీవారు ఈ పర్వముద్రణము మద్రాసులో సాగించినట్లు గ్రంథము నందలి ప్రకటన పత్రమున గన్పట్టుచున్నది. మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంధాలయమందు ద్విపదభారతము విరాటోద్యోగ భీష్మ ద్రోణపర్వముల ప్రతులున్నవి. ఆచార్యులవారు పై ప్రతులకు ప్రత్యంతరములు వ్రాయించి మున్నుగా విరాటపర్వమును వెలయించి యుందురనియు, తరువాత నేకారణము వలననో తక్కిన పర్వముల ముద్రణము సాగలేదనియు నూహింప వీలగుచున్నది. అది యట్లుండినిండు.

విరాటపర్వమునకు ఆచార్యులవారి ముద్రిత ప్రతిగాక, మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోను, ఆంధ్ర విశ్వకళాపరిషత్ గ్రంథాలయమందును, కాకినాడ ఆంధ్ర సాహిత్య పుస్తక భాండాగారము నందును, తిరుపతి శ్రీ వెంకటేశ్వర ఇన్స్టిట్యూటు లైబ్రరీలోను వేర్వేరు తాళపత్ర ప్రతులు గలవు. వీనియందలి ఆశ్వాసాద్యంత భాగములు పరిశీలింపగా, ఆ పర్వమును అర్థిమందారుడును, సాహస విక్రమార్కుడును, మదనసన్నిభ గాత్రుడును, డిండీరకీర్తియు, వాసవ ప్రతిమానుడును, శ్రితజనాధారుడును, శివభక్తి తత్పరుడును, చెరవిూరగండడును, బట్టేపాటి పాలకుడును, మలిరెడ్డి పౌత్రుడును, దేవయపుత్రుడును అగు

జంగాల ముమ్మయయను పంటవంశ ప్రభువునకు తిమ్మయ కృతియిచ్చినట్లు తెలియుచున్నది. ఆ భాగములివి :

"శ్రీ రమ్యగుణవార, శ్రితజనాధార,
కారుణ్యపూర, జంగలముమ్మధీర !"
ప్ర. ఆ. ఆది.

"శ్రీరాజితాకార, శివభక్తిపూర,
గౌరవాకార, జంగలముమ్మధీర !"
ద్వి. ఆ. ఆది.

"శ్రీ భవ్యదోర్దండ, చెరమీరగండ,
వైభవోపేంద్ర, దేవయముమ్మధీర !"
తృ. ఆ. ఆది.

"శ్రీ సమంచితనేత్ర, చిరకృపాపాత్ర,
వాసవాకార, దేవయముమ్మధీర !"
చ. ఆ. ఆది.

"శ్రీ కరచారిత్ర, శృంగారగాత్ర
ధీకల్పితోద్ధార, దేవయముమ్మ !"
పం. ఆ. ఆది.

"అర్థిమందార, సాహస విక్రమార్క-
పార్థివనుతశౌర్య, పంటవంశేంద్ర !"
ప్ర. ఆ. తుది.

"అనఘాత్మ, పంటవంశాంభోధిచంద్ర,
జననుత ప్రభురాజ, సాహిత్యభోజ !"
ద్వి. ఆ. తుది.

"డిండీరకీర్తి బట్టెపాటినిలయ
మదనసన్నిభగాత్ర మలిరెడ్డి పాత్ర !"
తృ. ఆ. తుది.

"వాసవప్రతిమాన, గిరిజానాధీశ,
కీర్తి నిజపాత్ర, దేవయపుత్ర"
చ. ఆ. తుది.

"మహితాయురారోగ్య మంగళచయము
సమయ బట్టెపాటి రామలింగంబు
క్రమమున దప్పక యిచ్చుc గలకాలమెల్ల.
దేవయ ప్రభువంశ తిలకంబు పేర
మడియు జంగాలముమ్మయధీరు పేర
మహితకావ్యము ధాత్రిమను......"
పం. ఆ. తుది.

ఆ వేల్పుc గొల్చిన యనఘాత్ము పేర
సరణిగాc బంటవంశ ప్రభు పేర
సహజ సజ్జను పేర సంప్రోక్తమైన

పై వాక్యములనుబట్టి చూడగా, తిమ్మయ్య, ఆదిపర్వములో కొన్ని యాశ్వాసములు రామాంకితముగా వ్రాసి నడుమ నేకారణముననో తక్కిన యాశ్వాసములు నరసయామాత్యునకు కృతియిచ్చినట్లు, అరణ్యపర్వము మరల రామార్పణముగా రచించి యది ముగియుట తోడనే తన నివాసగ్రామమగు బట్టెపాడు పరిపాలకుడును, ప్రసిద్ధ పంటవంశ ప్రభువునగు జంగాలముమ్మయకు, రాజాదరణమునకులోగి, విరాటపర్వమును గృతియిచ్చి యుండునని యూహింపనగుచున్నది. తరువాత, ఉద్యోగ భీష్మద్రోణ పర్వములను మరల రామాంకితముగనే రచియించినారు. ప్రతి పర్వమునుండియు నొక్కొక్క యుదాహరణము మాత్రము మచ్చునకు చూపుదును :

"శ్రీ నిత్యసౌందర్య, చిరకృపాధుర్య,
మానితగుణధామ, మనువంశరామ !"
అర. ప.

"శ్రీరామచంద్ర, యాశ్రితవార్ధిచంద్ర,
చారునిర్మలగాత్ర, శశిసూర్యనేత్ర !"
భీష్మ. ప.

"శ్రీరత్నయుతవక్ష, శ్రితసత్కటాక్ష,
కారుణ్య గుణధామ, కౌశల్యరామ"
ఉద్యో. ప.

"శ్రీరత్నయుతవక్ష, సితసత్కటాక్ష,
కారుణ్యనిధి, రామ, కౌశల్యరామ !"
ద్రోణ. ప.

కాగా, తిమ్మయ భగవదంకితముగా కావ్యారంభ మొనర్చి యెడనెడ నుదారులగు దాతలు లభించినపుడు వారికి కృతియిచ్చుచు, లేనపుడు రామార్పణము చేయుచు గ్రంథరచనము సాగించి యుండునని తోచుచున్నది.

ఇక, విరాటపర్వ కృతిపతిత్వములో ద్వైవిధ్యము చూపట్టుచున్నదని యింతకుపూర్వము వ్రాసియున్నాను. అదేమనగా — ముద్రిత ప్రతియును, మద్రాసు ఓరియంటల్ లైబ్రరీ ప్రతియును, తక్కిన యాంధ్రదేశపు ప్రతులును

విరాటపర్వము ముమ్మయకు కృతియిచ్చినట్లు ఏకకంఠముతో చెప్పుచుండగా, ఒక్క తంజావూరి ప్రతిలో మాత్రము :

"శ్రీ రఘురామ, యాశ్రితనాథ, నాథ,
వారిజనాభ, శ్రీ వనితా సమేత!
వాలి రావణులను వధియించి జనముఁ
బాలించు శ్రీరామభద్రావధారు." ద్వి. ఆ.

"శ్రీ సముంచితనేత్ర, శృంగారగాత్ర,
వాసవామరసేవ్య, వందితచరణ,
సాకేతపురినున్న జనములందఱకుఁ
జేకొని ముక్తియిచ్చినరామ, వినుము."
తృ. ఆ.

"శ్రీవర, గుణధామ, శ్రీరఘురామ,
పావనాతీత, సౌభాగ్యసమేత,
హరివిల్లు విఱిచి సీతను పెండ్లియాడి
కరుణ దాసులఁ బ్రోచు ఘన, చిత్తగింపు."
చ. ఆ.

"శ్రీకర చారిత్ర, శృంగారగాత్ర,
ప్రాకట గుణధామ, భవ్యసుత్రామ,
ఆ విభీషణుని లంకారాజ్యమునకుఁ
గావించి నిలిపిన ఘన, చిత్తగింపు." పం.ఆ.

అని ముమ్మయకు మాఱుగా రామ సంబోధనలు చూపట్టుచున్నవి. తిమ్మయ తక్కిన పర్వములలో తన్నుగూర్చి యనూచానముగా వ్రాసికొనెడి యాశ్వాసాంత్యభాగము ఈ తంజావూరి విరాటపర్వము చివర తొలగింపబడి దాని చోట :

"భోసలాన్వయ సుధాంభోధి చంద్రునకు
ననఘ సన్నుతికి శాహావనీపతికి
నింబాజి వ్రాయించె నిఖిలార్థవితతి
కంభోధి యగుచుండు నట్టి భారతము
నిటలాక్షు పదపద్మ నిహితప్రసన్న
పటుచిత్తుఁడైన కుప్పయ మంత్రిచేత"

అను ద్విపదలు కూర్పబడినవి. ఈ విషయములు పూర్వాపర విరుద్ధములుగను, రచనా సామ్యము గల ఒక్క విరాటపర్వపు ప్రతులలో వేర్వేరు కృతిపతులు కర్తృకర్తలు నున్నట్లుండుటచే అన్యోన్యాసంగతములుగను స్థూలదృష్టికి తోపవచ్చును. సూక్ష్మముగా నాలోచించినచో నిందలి పరమార్థమిది :

తంజావూరి ప్రతితప్ప తక్కినయన్ని ప్రతులును ముమ్మయాంకితములుగనే గలవు. ఒక్క తంజావూరి ప్రతియందు మాత్రము శ్రీరాముడు కృతిపతిగా చూపట్టుచున్నాడు. పర్వము చివర మాత్రము శాహజీ యాదేశము ననుసరించి, నింబాజీ ప్రేరణమువలన, కుప్పయమంత్రి వ్రాసినట్లున్నది. తిమ్మయకృతి కర్తృత్వము ఈ పర్వము చివర తప్ప తక్కిన యాశ్వాసాంతముల నన్నిటను గలదు.

తెనుగు తాళపత్రప్రతులు తంజావూరునకు పోయిన చరిత్ర మనసులో నిడుకొని పై విషయములను సవిమర్శముగా నాలోచింపగా, ద్విపద భారతమంతయును నెల్లూరు మండలములోని బిట్రగుంట ఆతుకూరు గ్రామవాసులగు తిమ్మయసోమన బాలసరస్వతుల కృతులుగా వెలసినవనియు, అందు విరాటపర్వము తిమ్మయ తొలుత జంగాల ముమ్మయ కంకితమొసగియుండుననియు, తంజావూరి పాలకుడగు శాహజీ దేశము నలుమూలలనుండియు తాళపత్ర గ్రంథములు సంపాదింపజేయుటలో ఆంధ్రదేశమందలి ద్విపద భారతమునకు ప్రతి వ్రాయించెననియు, ప్రత్యంతరము వ్రాయునపుడు భగవదంకితమగు మహాభారత గ్రంథములో నడుమ పంటవంశపు ముమ్మయ కృతిపతిగా నుండుట కిష్టములేకయో, యింకేకారణములవలననో, లేకవుడు ముమ్మయను తొలగించి ఆతనిచోట శ్రీరాముని ప్రతిష్ఠచేసియుండుననియు నూహింప వీలగుచున్నది. కానిచో ముత్తము లభించిన యారుప్రతులలో నైదింట ముమ్మయ కృతిపతిత్వము గన్పట్టి, ఒక్క తంజావూర ప్రతిలోమాత్రము రాముడు పొడచూపుటకు వేరే ప్రబలమైన కారణము కానరాదు.

లేదా, తిమ్మయ తొలుత రామార్పణ బుద్ధితోనే విరాటపర్వమునుగూడ రచించి, తగువాని ముమ్మయ కోరుటవలననో తాను స్వయముగా కోరియో తన రచనలో [1] గసవత్తరమును, కవిబ్రహ్మయగు తిక్కన రచించిన భారత భాగములలో తొల్లిటి రచనకు ఛాయయు నగు విరాటపర్వమును ముమ్మయాంకితములుగా ఆశ్వాసాద్యంతములు మార్చియుండును. తిమ్మయ మొదటి రచనయు రామాంకితము నగు ప్రతి తంజావూరువారికి లభించియుండును. తరువాత ముమ్మయాంకితముగా తిరిగి వ్రాయబడిన

1. ద్విపద భారతమునందలి భాగములలో విరాటపర్వరచన మేల్తరముగా నున్నది. ఆవిషయము వేరే వ్యాసమున నిరూపింపబడును.

ప్రతియు, దాని పుత్రికలును ఆంధ్రదేశమున వ్యాపించి యుండును.

పై నూహించిన విధముగా తిమ్మయయైనను విరాటపర్వమును మొదట రామార్పణముగా వ్రాసి తరువాత తన యూరి ప్రభువు నాదరమునకు లోనై ముమ్మయాంకితముగా మార్చి యుండవలెను. లేదా, తంజావూరియందు ప్రత్యంతరము వ్రాయుటలో లేఖకులైనను ముమ్మయను తొలగించి, ఆతని స్థానమున శ్రీరాముని నెలకొల్పి యుండవలయును. అంతియేగాని, మొత్తముపై నన్ని ప్రతులును ఏకకర్తృకములై కన్పట్టుచుండగా, కృతిపతిత్వము నెడ వేరె యెవరో తారుమారు చేసి యుండునని యూహించుట కవకాశమును అవసరమును కన్పట్టుట లేదు.

"అయితే, ఈపర్వముతుదిని శాహజీయాజ్ఞ ననుసరించి నింబాజీ ప్రేరణచే కుప్పయమంత్రి వ్రాసినట్లున్నదని యున్నావుగదా! దాని కేమందు" వని యెవరైన నడుగవచ్చును. వారికి నా సమాధానమిది :

తంజావూరి పాలకులగు మహారాష్ట్ర రాజులలో శాహజీ (క్రీ. శ. 1684-1710) తెనుగులో మంచికవి. ఇతడెన్నియో యక్షగానములను ముద్దులు మూటగట్టు తెనుగులో స్వయముగా రచించినాడు. ఈ మహారాజు కేవల మాత్మానందమునకై యేవో గ్రంథములను వ్రాయుచుండుటయే గాక, కవులను పండితులను పోషించుచు, వారిచే పలు తెరగులగు రచనలను వెలయింపజేయుచు, నిరంతరమును విద్యావినోదములలో మునిగి తేలుచుండెడి భాషారసికుడు. అంతియే గాదు, దేశము నలుమూలల నుండియు వివిధ భాషలలో వ్రాయబడిన పలు విధములగు ప్రాచీన గ్రంథములను వీలైనవి సంపాదించియు, కాకున్నవి వానికి ప్రతులు వ్రాయించియు, నాయకరాజులు ప్రతిష్ఠించిన శారదా మందిరమును (నేడు సరస్వతీ మహాలని వాడుక) బహుళముగా పెంపొందించినాడు. నింబాజీ యనునతడీతని యాస్థానమున రాజకీయోద్యోగి. కుప్పయమంత్రి లేఖకుడు. ప్రభువగు శాహజీ యాజ్ఞ ననుసరించి నింబాజీ ప్రేరణమున కుప్పయమంత్రి ద్విపద భారతమునకు ప్రతి వ్రాయుచు, ప్రభువుల సారస్వత సేవను గ్రంథస్థము చేయుటకో, వారి యాదరాభిమానములు చూరగొన నెంచియో, తాను వ్రాసిన ప్రతులయం దచ్చటచ్చట శాహజీ నామమును, నింబాజి పేరును పేర్కొనినాడు. అమూల్యమగు భాషాసేవ చేయుచున్న ప్రభువుల నామము చిరస్థాయిగా నుండుటకును, వారి యెడ తనకు గల భక్తి గౌరవముల చూపుటకును, కుప్పయమంత్రి ఈ రూపమున వారి నామములు పర్వాంతమునందలంకరించినాడే గాని, తిమ్మయకృతి కర్తృత్వమును అపహరించు తలంపు కలవాడుమాత్రము కాడని యూహింపబడుచున్నది. అశ్వమేధ పర్వాంతముననున్న యీ దిగువ నిచ్చిన ద్విపదలు చూచినచో పై సందేహము చాలవరకు నివారితము కాగలదు :

"భోసలాన్వయ సుధాంభోధి చంద్రునకు - భాసుర..............మనుజభావుండు రామామనోజుండు—అనఘ సన్నుతుండు శాహవనీ విభుండు ఒకనాడు తనమది నుల్లాస మొదవ... ......................ఆస్థాన వేదికమీద- నొప్పుగా గూర్చుండి..............పంచమవేదమై ప్రబలు భారతము - సంచితపాపముల్ సడలించుగాన నింబాజి గనుగొని నీవు వ్రాయింపు-మంబుజోదరుకీలలన్నియు దానఁ గనవచ్చునని చెప్ప గడువేడ్క తోడ - నెలమి సన్నిలిపించి యిట్లను సతడు. భారత పర్వముల్ ప్రభువు శాహేంద్రు - డారయ వ్రాయింపుమని పల్కెగాన, కదురుగా, నొరుగక, కొదుకక తప్పు -లాదవకుండగ వ్రాయు మొప్పుగా ననుచు ఘనసార తాంబూల గంధమాల్యములు - చనువొప్పగా నిచ్చి చనుమన్న నేను ఘనతర సంతోష కలితుండనగుచు - మనమునఁ బొంగి మార్తాండవంశ మహితాంబుధీ సుధామయామూర్తి పేర..........విభవనిర్జిత దేవ విభు పేర శాహ - విభు పేర సకల ప్రవీణుని పేర వ్రాయంగ బూనితి వరమతియుతులు- మాయురే యని పలుమారులు మెచ్చ. నిటలాక్ష పదపద్మ నిహితప్రసన్న -పటుచిత్తుడైన కుప్పయ మంత్రివరుడ."

ఈ విధముగనే పై యర్థముగల ద్విపదలే విరాటోద్యోగభీష్మపర్వాంతములయందును గలవు. కాగా, కుప్పయమంత్రి శాహజీకొరకు నింబాజీ ప్రేరణమున ద్విపద భారతమును

"ఎదురుగా" "తప్పులొదవకుండ" ప్రతి వ్రాసియిచ్చిన లేఖకుడని తేలుచున్నది. ఐతే, పై ద్విపదల యందలి సారాంశమును పరిశీలించినచో, భారతమువంటి యుద్గ్రంథములకు ప్రత్యంతరములు వ్రాయు లేఖలనుగూడ, మహాకావ్యమును కృతియొసగు కవులనుబోలె నాదరించుట శాహాజీ యాస్థాన మర్యాదలలో నొకటియని పొడకట్టుచున్నది.

ఇంతతో నొక తుది నిర్ణయమునకు వచ్చినచో, బట్టుపాటి తిమ్మయ, ఆది - అరణ్య - విరాట - ఉద్యోగ - భీష్మ - ద్రోణపర్వములను ద్విపదలలో రచియించి, ఆదిపర్వమునందలి కొన్ని యాశ్వాసములు నగసయామాత్యునకును, విరాటపర్వమును జంగాల ముమ్మయకును, తక్కిన భాగములను ఆ శ్రీరామచంద్రునకును అంకిత మొసగ్చెనని తేలుచున్నది.

ద్విపద భారతకర్తలలో రెండవవాడు బాలసరస్వతి. ఇతడా వైయాకరణ బాలసరస్వతికాడు. వేరొకడు. 'అసమసాహిత్య విద్యాచతుర్ముఖు'డగు నీతడు సభాపర్వమును మాత్రము రచించెను. అందలి ఆశ్వాసాద్యంత భాగము లివి:

"భాను కులాంభోధి పావనచంద్ర!
భానుకోటి ప్రభాభా భాసమాన!
..............................
ధరణిజాలింగన తాత్పర్య శీల!
అసమసాహిత్య విద్యాచతుర్ముఖుడు
రసికుఁడు బాలసరస్వతీశ్వరుఁడు
పసనొసర్చిన సభాపర్వంబునందు
నసదృశంబుగఁ బ్రథమాశ్వాసమయ్యె."
(సభా. ప. ప్ర. ఆ. అది)

"పంచఘంటా నాద, పాండవాహ్లాద!
పంచాస్యసమశౌర్య, ధరణీంద్రధైర్య!
శ్రీరంగయామాత్య శేఖరపుత్రి!
కారుణ్యనిధి, దానకర్ణావతార!
శ్రీయనంతామాత్య శేఖరోత్తంస!
[illegible] సగుణ [illegible], కమనీయ [illegible]!"
(ద్వి. ఆ. అది)

"అసమసాహిత్య విద్యాచతురుర్ముఖుఁడు
రసికుఁడు బాలసరస్వతీశ్వరుఁడు
పసనొసర్చిన సభాపర్వంబునందు
నసదృశంబుగ ద్వితీయాశ్వాసమయ్యె."
(ద్వి. ఆ. తుది)

పై పంక్తులు పరిశీలింపగా, తిమ్మయవలెనే బాలసరస్వతియు రామార్పణముగా రచనయారంభించి రంగయామాత్య పుత్రుడగు అనంతామాత్యునకు సభాపర్వమును కృతి యిచ్చెనని తెలియుచున్నది.

ఇందు చూపట్టు రంగయామాత్య - అనంతామాత్యులెవరో, యెచ్చటివారో, యెప్పటివారో నిర్ణయించి చెప్పుటకు సరియగు నాధారము లేవియు నింతవరకు లభింపలేదు. కాని, బాలసరస్వతి సభాపర్వమును మాత్రము రచించుటయు, తరువాత తిమ్మయ మగల నైదుపర్వముల రచన నిర్వహించుటయు చూడగా, తిమ్మయ బాలసరస్వతు లిర్వురును సమకాలికులై సమష్టిగనే గ్రంథరచన కారంభించి, చెరియొక పర్వమును గైకొని ద్విపదీకరించి యుండగా, బాలసరస్వతి రచన పేలవముగా నుండుట చూచి తిమ్మయయే తక్కిన పర్వముల రచనను నిర్వహించి యుండునని యూహించుట కనువు పడుచున్నది. తత్త్వము పరిశీలించినచో బాలసరస్వతి రచన (సాహిత్య విద్యాచతుర్ముఖుడు కావచ్చునుగాని కవితలో మాత్రము) నీరసముగనే యున్నది. అందుకే ఆతని రచనకు సభాపర్వము తోడనే స్వస్తి చెప్పబడినదికూడ. ఈ విషయము మున్ముందు నిరూపింతును.

ఇక మిగిలినవాడు సోమన. ఇతడు ద్విపద భారతకర్తలలో మూడవవాడు; కర్ణపర్వము మొదలు స్వర్గారోహణ పర్వాంతము మొత్తము పదునొకండు పర్వముల రచనను ఒక్కచేతి మీదుగా నిర్వహించిన మేటి. ఇతడు వేంకటేశ్వర భక్తుడు, తిమ్మయకుమారుడు; ఇంటిపేరు ఆతుకూరివారు. తాను రచించిన పర్వముల నన్నిటిని:

"శ్రీ వేంకటాధీశ, సృష్టిప్రకాశ,
భావనాతీత, సౌభాగ్యప్రదాత,
కమలామనోహర, గజరాజవరద,
[illegible], సుంధాద్రిధరా, చిత్తగింపు" మని

ఆ తిరువేంగళనాధునికే సమర్పించి ధన్యుడైనాడు. ఇట్లే తక్కిన పర్వములలో నన్ని యాశ్వాసములందును వేంకటేశ్వర సంబోధనలే చూపట్టు చుండును.

ఆశ్వాసాంతము లన్నియు:

"ఇది వేంకటాచలాధీశ్వర దివ్య
పదపద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ
సుగుణాఢ్య సోమన సుకవీంద్రవర్య
విరచిత.....పర్వమున
అరుదుమీఱఁగ.....ఆశ్వాసమయ్యె."

అనురీతిగా ముగియుచున్నవి.

పై యాశ్వాసాంత ద్విపదలో "తిమ్మార్య తనూజ.....సోమన" యని యుండుటవలన, మొదటి యారుపర్వములను రచించిన తిమ్మయ కుమారుడే ఈ సోమన యై యుండుననియు, తండ్రికొడుకు లిర్వురును గ్రంథరచన మొనర్చి యుందురనియు నెవరైన తలంపవచ్చును. ఎవరో యననేల! నేనే యట్లూహించి "తంజావూరి మహాలులోని యముద్రిత ద్విపదవాఙ్మయము"ను గూర్చి ఆంధ్ర వారపత్రికలో ప్రకటింపబడిన వ్యాసమున (సుమారు 1949 వ సంవత్సర ప్రాంతమున అని గుర్తు) "తండ్రికొడుకులగు తిమ్మయ సోమన లిర్వురును ద్విపదలో భారతము వ్రాసి"రని ప్రాసంగికముగా పేర్కొన్నాడను. శ్రీ చిలుకూరి నారాయణ రావుగారుకూడ కంఠోక్తిగ చెప్పకున్నను తమ పండితారాధ్య చరిత్ర పీఠికలో ఆ యర్థముగల సంక్తులనే వ్రాసిరి.1 స్థూలదృష్టికీయుహ సమంజసముగనే తోచవచ్చునుగాని, సూక్ష్మముగ పరిశీలించినచో పొరపాటని గ్రహింపవచ్చును.

ఏమనగా, సోమన తాను "ఆతుకూరి తిమ్మార్యతనూజుడ" నని చెప్పికొన్నాడు. ద్విపదభారత కర్తయగు తిమ్మయ యింటిపేరు బట్టేపాటి వారని తేకుమళ్ల రంగశాయి కంఠోక్తిగ చెప్పుచున్నాడు. పైగా, సోమన వెంకటేశ్వర భక్తుడు. ద్విపద భారత కర్తయగు తిమ్మయ సదాశివ భక్తుడు.

అదియుగాక, తక్కిన పర్వములతోపాటు తిమ్మయ అరణ్యపర్వమును గూడ రచించినాడు. కాని, యేకారణమువలననో కవిత్రయ భారత భాగమందలి యుపాఖ్యానముల చాలవరకు విడనాడి, కేవల ప్రధానకథను మాత్రము గైకొని, యారణ్యపర్వ రచన నైదాశ్వాసములలో ముగించినాడు. అంకితము శ్రీరామునకే యొసగినాడు. కర్ణపర్వము మొదలు తుదిదాక ద్విపదభారతరచనను సాగించిన సోమన తన పూర్వుల రచనలను పరిశీలించి, అందరణ్యపర్వ ముపాఖ్యానరహితమై కేవల మూలకథాప్రధానమై యుండుటచూచి, యుపాఖ్యానములు లేని కేవలారణ్యపర్వకథ రచనలో వెలితిగా నుండునని యెంచిగాబోలు తిమ్మయ విడిచిన కథల నన్నిటిని ద్విపదలలో గూర్చి, వాని నాతని మూలకథారచనలో నచ్చటచ్చట పొందుపరచి, దానినే యేడాశ్వాసముల గ్రంథముగా పెంచి వ్రాసినాడు. ఆ వ్రాయుటలో నొక్క యౌచిత్యమును మాత్రము పాటించినాడు. మొదట నా పర్వమును రచించినది తిమ్మయ గాన, ఆదికవియగు నాతనియెడగల గౌరవభావముచే తన పూరణమును ఆతని రచనయం గలిపి మొత్త మాతని పేరనే వెలయించినాడు. అనగా నాశ్వాసాంతములన్నియు:

"ఇది సదాశివభక్త......
తిమ్మన నామధేయ......
విరచితారణ్యాఖ్య విపుల పర్వమున
అరుదు మీరగ...ఆశ్వాసమయ్యె."

అను రీతిగా తిమ్మయ పరముగనే కూర్చినాడు. తాను "వేంకటాచలాధీశ్వర దివ్య పదపద్మ మకరంద పానద్విరేఫము" గాన, తిమ్మయ మొదలిడిన రామసంబోధనలకు బదులు వేంకటేశ్వర సంబోధనలు ప్రత్యాశ్వాసాదిని నెలకొల్పినాడు.[2] ఈ రీతిగా తానారణ్యపర్వమును పూరించినట్లు ఆ పర్వము చివర కంఠో

1. చూ. పం. ఆ. చ. పీఠిక 143. పు.

2. తంజావూరి సరస్వతీ మహాలులో ద్విపద భారతారణ్య పర్వప్రతులు నాలున్నవి. అందు 103 నెంబరుగల ప్రతి యైదాశ్వాసముల గ్రంథము. ఇది తిమ్మయ రచన. 104 నెంబరుగల ప్రతి, తిమ్మయ రచన కుపాఖ్యానములు కూర్చి యాతని పేరనే యేడాశ్వాసములుగా పెంచి సోమన వ్రాసినది. తక్కిన రెండుప్రతులును అసమగ్రములు. పై ప్రతులలో ప్రత్యాశ్వాసాంతమందును తిమ్మయపేరే కన్పట్టుచుండుటచేతను, 104 నెంబరుగల ప్రతిచివర, పై చూపినభాగము - సోమనపూరణగా సాక్ష్యమిచ్చునది - క్రిమిదష్టమై సూక్ష్మపరిశీలనచే గాని

క్తికి చెప్పినాడు. ఆ రచనగల యాకులు క్రిమిదష్టములై యందందుకులుగా నున్నవి. ఉన్నంత వరకు నీదిగువ జూపుచున్నాను:

"........................

నిత్యర......గతి...గు నిదియ థార్థంబు

......రణ్య పర్వంబునందు

......తిమ్మనార్యుఁడు విడిచిన కథలు

కువలయంబున నాతుకూరి......

........................

...వేంకటాచలాధీశ్వరదివ్య

పదపద్మ మకరంద పానద్విరేఫ

మగు నాతుకూరి తిమ్మార్యతనూజ

సుగుణాఢ్య సోమన సుకవీంద్రవర్య

విరచితారణ్యాఖ్య విపుల పర్వమున

నరుదు మీఱంగ సప్తమాశ్వాసమయ్యె."

(సోమన రచితారణ్య పర్వాశ్వాసాంతము)

ఆదిపర్వ కర్తయగు తిమ్మయ తనజనకుడే యైనచో, సోమన, అతనిగూర్చి నిరుపపదముగా కేవలము 'తిమ్మనార్య' డని పేర్కొని యుండడుగదా! "ఒకవేళ నాతడట్టిదేమైన వ్రాసెనేమో! అది శిథిల భాగములో జారి పోగూడదా!" అని యనుకొన్నను, అను పదమునందే మరల "ఆతుకూరి తిమ్మార్యతనూజ" యని చెప్పుకొననేల? పోనిండు, తన తక్కిన రచనలలో నెచ్చటనైనను ఆదిపర్వ కర్తయగు తిమ్మయ తనజనకుడైనట్లు స్మరింపకుండునా! తానెంతటివాడైనను, తన తండ్రి మొదటి భాగముల రచింపగా, తాను తరువాయి భాగముల పూర్తిచేయుచున్నాడనని మర్యాదకైన చెప్పకుండునా! కావున, నామసామ్యము తప్ప ప్రబలములగు నితరాధారములు లభించువరకును ద్విపద భారతకర్తలగు తిమ్మయ సోమనలు తండ్రి కొడుకులని యూహించుట పొసగదు; మిత్రులు గావచ్చును. ఇంతకును దేలిన సారాంశ మిది:

ఆతుకూరు బట్టేపాడు అనునవి నెల్లూరు మండలములోని[1] పరిసర గ్రామములు. తిమ్మయ, సోమన, బాలసరస్వతులు మువ్వురును పై గ్రామ నివాసులును, కంకంటి పాపరాజు, పుష్పగిరి తిమ్మయ, తేకుమళ్ల గంగశాయులవలె సమకాలికులైన కవిమిత్రులై యుందురు. వారిలో తిమ్మయ కృత్యారంభముగా ఆదిపర్వమును మొదలిడి వ్రాయుటచే మువ్వురిలో పెద్దవాడై యుండుననియు, రచనావిధానమును పరిశీలించినచో తక్కిన యిర్వురికన్న నెక్కువ పాండిత్యబలము వ్యుత్పన్నత కలవాడనియు గ్రహింపవచ్చును. బాలసరస్వతి, తిమ్మయకు శిష్యుడో శిష్యప్రాయుడో యై యుండును. తిమ్మయ, ద్విపద భారత రచన కుపక్రమించి తానాదిపర్వము గైకొని, సహాయునిగా బాలసరస్వతిని గూర్చుకొని, సభాపర్వ రచన యాతనికి నియోగించియుండును. ఈ పని రచన పేలవముగా నుండుటచూచి, యంతతో నాతని నాకార్యమునుండి విరమింపజేసి, యాదిపర్వముతో పాటు అరణ్యపర్వాది ద్రోణపర్వాంతము మొత్త మారు పర్వముల రచనయు తానే నిర్వహించియుండును. ఇంతలో నే కారణమువలననో యాతని రచన మాగిపోగా, బట్టేపాడునకు సమీప గ్రామమగు ఆతుకూరు నివాసియు కవిమిత్రుడునగు సోమన, తిమ్మయ రచింపగా మిగిలిన కర్ణపర్వాది స్వర్గారోహణ పర్వాంతము గల పదునొకండు పర్వముల రచననేగాక యాతని యారణ్య పర్వమునుగూడ సర్వాంగ సుందరముగా సంతరించి, ద్విపదభారత రచనను పూర్తిచేసి యుండును. ఇది నా యూహ కందిన విషయము.

ఇక, వీరెప్పటివారై యుందురో కనుగొనవలసియున్నది. తిమ్మయవలన విరాటపర్వమును కృతినందిన జంగాల ముమ్మయ, తిరుమల శ్రీనివాసాచార్యుల శిష్యుడగు పాలచూరి కృష్ణ

---

గుర్తింప వీలుగాకుండుటచేతను, మొత్త మీ ప్రతులు నాల్గును తిమ్మయ రచనలుగా తంజావూరి కేటలాగులో తత్కర్తలు పేర్కొనిరి. అది పొరపాటై యుండును.

1. ఉదయగిరి రాజ్యలక్ష్మికి సదనము నెల్లూరు; అట్టి సాధ్వీమణికిఁ
వదనంబు కందుకూరగు; పదయుగళం బాతుకూరు, బట్టేపాడున్.

(చాటుపద్య మణిమంజరి)

# పాల్కురికి సోమన స్త్రీపాత్రలు

శ్రీమతి ఎమ్. ఆదిలక్ష్మిగారు

కవి ప్రతిభ కొంతవరకు అతఁడు సృష్టించిన పాత్రల మీఁదకూడ ఆధారపడి యుండుననుట అసమంజసము కాదు. కేవలము ఆదర్శవంతములైన పాత్రలను చిత్రించడము కన్న, స్వభావోచితములగు, సాధారణ మానవపాత్రలను సృష్టించి వారిలోఆదర్శాన్ని స్ఫురింపజేయుట మహాకవుల కందఱికి పరిపాటియే. సామాజిక జీవనానికి సన్నిహితులై, సాధారణ మానవ చిత్త ప్రవృత్తులకు వశులై అతి సహజముగా ప్రవర్తించేవి సోమనాథుని పాత్రలు. వాఙ్మానస గోచరమగు మనస్తత్త్వమును విపులముగా మాటలచే గోచరింపజేసే శక్తి సోమనాథునికి వెన్నతో బెట్టిన విద్య. సూక్ష్మగతి సూక్ష్మములగు విషయములను హృదయములకు హత్తుకొనునట్లు వివిధోపమానములతో వర్ణించి తాఁ జెప్పెడి విషయములకు లేక తాను వర్ణించే వస్తువునకు ప్రామాణ్యము నాపాదించుట సోమనాథునికి జిన్ననాటి యుగ్గుపోత. సోమనాథుఁడు ప్రతిపాదించిన మతము పాశుపతమని కొందరు అనుచున్నారు. కాని, ఇతని పాత్ర సృష్టి మాత్రము సర్వ జనసమాదరణీయ మనుటలో విప్రతిపత్తి గలుగ నేరదు. మనోహరములగు, తేట తెనుగు పలుకులలో ఆనాటి ప్రజల యాచార వ్యవహారములను సాంఘిక సంప్రదాయములను, జీవనవిధానములను, తన ప్రతిభతో పాటు ప్రకటించుచు ఆయాపాత్రల తత్త్వములను పాఠకుల మనోవీథిని నాటుకొనజేయుటలో సోమనాథుఁడు సిద్ధహస్తుడు. సోమనాథుఁడు తన మతము ననుసరించి 'భవిజన దర్శన స్పర్శనాలాప వివిధ దానాదాన విషయ దూరగుఁడైనను' భక్తిప్రపత్తిచే ప్రపంచము సంతతిని తనలో నాకళించుకొనిన వాఁడు. కేవల శాస్త్రాభ్యాస వశంవదమగు సంస్కారముచే కొంత లౌకికజ్ఞాన మలవడుట నిజమైనను, హృదయరంజకముగా పాత్రాధీన కర్మలను, ఆచరణములను, మనోభావములను, ఇతనివలె వర్ణించుటకు మంచి నిశితమైన పరిశీలన, అనుభవజ్ఞానము, దూరదృష్టి ఆవశ్యకములగుచున్నవి. సోమన పాత్రలు మౌగ్ధ్యమునకు, నిర్మలమగు నిశ్చలభక్తికి మచ్చుదునకలైనను,

(32 వ పేజీ తరువాయి)

భూపాలునకు కూతు నిచ్చిన 1 మామగారు. ఇతడు 'ఇందుమతీ పరిణయము'నకు కృతిభర్త. ఈ గ్రంథము రచించిన యతడు తెనాలి రామభద్రకవి. ఈతడు క్రీ. శ. 1575 సంవత్సర ప్రాంతమువాడని ఆంధ్రకవితరంగిణి నిరూపించుచున్నది. కాగా, మామ కొకఁడును, అల్లున కొకడును తమ కృతుల నంకిత మొనర్చిన తిమ్మయ రామభద్ర కవు లిర్వురును ఇంచుమించు సమసమకాలము వారని తేలుచున్నది. ఆ కారణముచే ఈ ద్విపద భారతకర్తలు ముప్వురును పదునారవశతాబ్దము తుదిభాగములో నున్నవారని నిర్ణయింప వీలగుచున్నది.

---

తే. "తిరుమల శ్రీనివాసాఖ్య దేశికునకుఁ, బ్రబల షడ్దర్శనైక పారంగతునకు
శ్రీవరునకుఁ బ్రియ శిష్యుఁడగుచు (?), భక్తి చిగురొత్తఁ గృష్ణ భూపాలుఁడలరు.

శా. బంగారంబు మణుల్ కలాపములుగా భావింపఁడాత్మన్, యశ
స్సాంగత్యంబున కాదికారణములౌ సత్యక్షమాధర్మముల్
రంగంచున్మదినెంచు చందమున శ్రీరంగాధిపుంగొల్చు మేల్
జంగాలాన్వయ ముమ్మభూవిభుఁడ చాంచల్యైక భావంబునన్.

క. ఆ మహిపతి యక్కాంబా, సీమంతిని వలనఁ గనిన చెలి నలమేలుఁ
సేమమునఁ దాను రెండవ, భూమినిఁగాఁ గృష్ణవిభుఁడు పరిణయ మయ్యెన్."

(ఇందుమతీపరిణయపీఠిక. ఇది తంజాపూరు కేటలాగులో 138 నెంబరుగల గ్రంథము)

వారి చిత్రణములో కవి తన అనుభవ జ్ఞానమును మిక్కిలిగా వ్యక్తపఱచియున్నాడు. అమాయికమగు విశుద్ధ భక్తిని వెగటుపుట్టకుండ వెల్లడించుటలో సోమనాథుఁ డందెవేసిన చేయి. కేవలము ఊహాప్రపంచమున విహరించునవి గాక యథార్థమానవ ప్రపంచమునకు జెందిన సజీవములగు పాత్రల నీతడు సృష్టించినాడు. ఇతఃపూర్వము చూచాయగానైన నే పురాణముననో, ఇతిహాసముననో వర్ణితములుగాని వీతని పాత్రలు. చాలవరకు తనకు కొంతముందో, సమకాలముననో జీవించియుండిన చారిత్రక వ్యక్తుల నీతఁడు తన కావ్యములలో పాత్రలగా గైకొన్నాఁడు. కావున నీ పాత్రల మూలమున నాకాలపు సాంఘిక జీవితముగూడ సువ్యక్తమగును. భక్తునకు భగవంతునకు, తల్లికిపిల్లకు, గురువుకు శిష్యునికి, పాలకునకు పాలితునకు - ఒకటి యననేల - సర్వవిధముల సంబంధములను తెలిసికొనుటకు పాల్కురికి సోమన పాత్రలు ఆచార్య ప్రాయములనుటలో నాశ్చర్యములేదు. మానసిక ప్రవృత్తి పరిశీలనను నికషోపలముగా గ్రహించితిమేని సోమనకు కవితాలోకమున నగ్రతాంబూలమిచ్చి తీరవలసినదే. ముఖ్యముగా స్త్రీపాత్ర చిత్రణమున సోమనాథుఁడు చాల విశిష్టతను చూపియున్నాఁడు. ఇతని స్త్రీ పాత్రలు పురుషుల మరుగున మసక మసకగా గోచరించు మట్టిబొమ్మలు కావు.

కావ్యలోకమున కనివిని యెఱుగని స్త్రీల స్వాతంత్ర్య దృక్పథ మీతని రచనలలో గోచరించును. పురుషులకువలె స్త్రీలకును సమానమైన ప్రతిపత్తుల నిచ్చినది వీరశైవమతము. ప్రాచీన హైందవ ధర్మము ననుసరించి స్త్రీలకు వేదపఠనాధికారములేదు. ఆశ్రయ రహితయైన స్త్రీని సంఘము అవహేళన చేసెడిది. 'నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి' అన్న మనుస్మృతిని తుచ తప్పకుండ పాటించిన కాలమది. తెలివిగల స్త్రీలున్నను వారు తమ భర్తలను సత్కార్యములకు ప్రోత్సహించుట కవకాశముండెడిదేకాని స్వతంత్రముగ కావ్యరంగమున కుఱికి తమ ప్రత్యేక వ్యక్తిత్వమును నిలుపుకొను సదవకాశము ఆనాఁడేకాదు, ఈనాటివరకు భారతదేశ స్త్రీలకు లభించలేదు. సోమనాథుని స్త్రీ పాత్రలను పరిశీలించితిమేని వారు నేటి యిరువదియవ శతాబ్దపు స్వేచ్ఛాభావములతో నొప్పుచున్నారనుట సాహసము కానేరదు. బెజ్జమహాదేవి భర్తప్రశంస యెచ్చటను కానరాదు. ఆమె 'కలకంఠ శ్రీపాదకమలాంతరంగ.' ఆమె భక్తి పరాకాష్ఠనంది భగవత్సాక్షాత్కారము కలుగుటకు, తండ్రికాని, భర్తకాని, పుత్రుడుకాని అవసరముకాలేదు. ఆమె ముగ్ధభక్తికి మెచ్చి భక్తపరాధీనుఁడు శివుడామెకు శిశువైనాఁడు. ఆమె తన మాతృత్వమును చక్కగా నిర్వహించి 'అమ్మవ్వ' యను పేర ప్రసిద్ధురాలైనది. లింగపూజకు, లింగధారణకు స్త్రీలకు పురుషులవలె సమానాధికారము కలదు. పురుషుల ఆజ్ఞనలో బ్రతుకక, ప్రత్యేకము తామొక 'కాయక' మును చేసి జీవించువారు. నిమ్మవ్వ భక్తకోటుల యిండ్లకు సామానులు మోసికొని పోయి యిచ్చెడిది. దాని వలన లభించు తృణమో పణమో జాగ్రత్తగా ఖర్చుచేసి, దానిలోనే జంగమారాధన కూడ జరపెడిది. సోమనాథుని స్త్రీలు అబలలుకారు. వారు శివునికూడ ముఖాముఖిని ధర్మవిచారణకు దింపి, యెదిరించి నిలువగల ధైర్యవంతులు. నిమ్మవ్వ శివుడు మోక్షము నిచ్చెదనన్న శివభక్తుల కది సులభముగా లభించునదేయని శివునితో 'నీ చమత్కారము లిక్కడ మానుము. అతిథివై వచ్చితివి ఆరగించికాని కదల వీలులే'దని యానవెట్టినది.

గుడ్డవ్వ పట్టుదలకు ప్రథమోదాహరణము. 'కుష్ఠువట్టి రూపఱియున్నను' ఆమె నిరాశ జెందలేదు. సౌరాష్ట్రమున కరిగి 'కాయంబు' బడసిగాని యీ యగ్రహారము చొరనని ప్రతిన వట్టి బయలుదేరినది. తన భక్తిచే శివుని తన కెదురువచ్చునట్లు చేసినది.

వైజకవ్వ పాత్ర మఱింత స్ఫుటమైనది. ఆమెభర్త జైనుడు. ఆమె అతనిని లెక్క సేయదు. జంగములకు నారాధన సేయుచుండును. శివుడు ప్రత్యక్షమై యేమనుచున్నాడో చూడుడు: "పురుషుడు శివభక్తి విరహితుఁడేని బురుషుని మీఱుట దరుణికిఁ ఖ్యము" అని

పొరండ్ల వీరసానమ్మ వితంతువు. కాని భలిదేలి ఫేమనారాధ్యులతోగూడ పండితా

# తమిళవాఙ్మయము : శైవ, వైష్ణవాచార్యయుగములు

శ్రీ చల్లా రాధాకృష్ణశర్మగారు

జైన భౌద్ధమతబోధకుల ప్రాబల్యము హ్రాస్వమగుకొలది తమిళనాడులో శైవ వైష్ణవములు మరల విజృంభింపజొచ్చెను. శైవము చాల ప్రాచీనమయిన మతము. తమిళ శైవులు నాడును నేడును శాకాహారులే! కనుక నే మాంసాహారులు, మద్యపాన నిరతులు నైన ఆర్యుల యాచార వ్యవహారములు తమిళ శైవులకు తొలుదొలుత నచ్చినవి కావు. కాని శైవ మతమునందు నానాటికిని క్రతుకలాపము కొండ వలె పెరిగిపోయిన హేతువుచే జైన బౌద్ధ మతము లనాయాసముగా తమిళుల యాదరాభిమానములను మాఱగొనినవి. చాలమంది శైవులు జైన బౌద్ధములు స్వీకరించిరి. తమిళరాజుల సహకారముకూడ జైన బౌద్ధమత వ్యాపనమునకు సాహాయ్యపడెనని నుడువదగును. కాని కాలక్రమమున వైదిక విజ్ఞానము జనాదరమును సముపార్జించుటతో జైన బౌద్ధమతముల ప్రాభవము తగ్గుముఖమును పట్టెను. ఇంతలో బసవేశ్వరుని వీరశైవముకూడ తమిళనాడులో స్థానము సంపాదించెను. కాగా వైదిక శైవము, అవైదిక శైవము (వీరశైవము) నను ప్రభేదములతో తమిళదేశమునందు శైవము బహుళప్రచారము గడించెను.

ఒకవైపు శైవము, మఱియొకవైపు వైష్ణవము ను ప్రబలుచుండిన కాలమది. శైవసమయాచార్యులకు నాయన్మారులనియు, వైష్ణవాచార్యులకు ఆళ్వారులనియు వ్యవహారనామములు కలిగెను. వీరెల్లరు భక్తివాదముచేతను, తమతమ అత్యద్భుత మహిమలచేతను ప్రజల మన్ననలు చూఱగొనుచుండిరి. జైన బౌద్ధమతాచార్యులతో వాదోపవాదములు సలిపి వారిని జయించుచుండిరి. తమిళనాడులో క్రీస్తుశకము 700 ప్రాంతమున ఎచ్చట చూచినను మత సంబంధమైన సమావేశములే! మతచర్చలలో మునిగిపోయిన నాయన్మారులుగాని, ఆళ్వారులుగాని పేర్కొనదగిన గ్రంథములు సంతరింపక పోయినను భక్త్యుద్బోధక గీతము లనేకములు పాడిరి. ఆ భక్తిగీతములే పిమ్మట సంపుటములుగా వెలువడినవి. శైవగీతావళి సంపుటమునకు తిరుముఱై అనియు, వైష్ణవ భక్తిగీతముల సంపుటమునకు నాలాయిర ప్రబంధమనియు నామములు కలిగెను. కనుక శైవవైష్ణవ మతాచార్యుల యుగమునందు ప్రచారములోనికి వచ్చిన తమిళ సాహిత్యము గేయమయమై భక్తి ప్రధానమై యుండెనని చెప్పనగును. ఈ గేయ సంపుటములు మతవిజ్ఞాన సర్వస్వము లనుటలో సందేహములేదు.

(34 వ పేజి తరువాయి)

రాధ్యుల యొద్దకు బసవని వృత్తాంతము గొని తెచ్చిన ధన్య యామె.

సోమన స్త్రీపాత్రలు కేవలము పురుషుల కొఱకై సృష్టింపబడిన భోగ్యవస్తువులుకారు. తమ స్వాతంత్ర్యమును, చాటి, వ్యక్తిత్వమును నిలబెట్టుకొన్న కార్య తత్పరలు. వృత్తినిబట్టి వేశ్యలైనను నీతి నియమములను దప్పరు. అజ్ఞానమున మునిగినవారికి జ్ఞానబోధచేసి సన్మార్గమునకు ద్రిప్పగలరు. భగవద్భక్తి మార్గమున మార్గదర్శకులు కాగలరు. కష్టములు సంభవించిన కలగి క్రుంగిపోరు. ధైర్యముతో జరుగవలసిన భావికర్తవ్యమును నిర్వహింతురు. సోమనాథుని స్త్రీపాత్రలు నిజముగా వీరాంగనలు. పదుమూడవ శతాబ్దినాటికన్న నేటి సమాజమున అట్టివారుమిక్కిలిగా కావలసియున్నది. సోమన యొన్నో శతాబ్దులకుముందే స్త్రీ స్వాతంత్ర్యావశ్యకతను కాంతా సమ్మితముగా చెప్పినాడు. ఇది ఈతని దూరదర్శిత్వమును వీరశైవమతౌన్నత్యమును వేనోళ్ల చాటుచున్నది.

పదునొకండవ శతాబ్ద ప్రారంభమున నంబి ఆండార్ నంబి అను అర్చకుడొకడు శైవుల ప్రార్థనాగీతములను క్రోడీకరించి వానిని పదునొకండు భాగములుగా చేసెను. ఈ గీతములను మాణిక్యవాచకర్, అప్పర్, తిరుజ్ఞానసంబంధర్, సుందరర్ మొదలగు నాయన్మారులు పాడిరి. ఇవి యన్నియు నేటికిని శైవులకు పరమప్రీతి పాత్రములు. నిజమునకీ గీతికా గుచ్ఛములు సుధారస ఖండములు; భక్తిరస ప్రభూతములును.

## మాణిక్యవాచకర్ :

నాయన్మారులలో మాణిక్యవాచకర్ చాల విశిష్టుడు. తమిళనాడులో శైవమతమును బౌద్ధమతమునుండి సంరక్షించిన విఖ్యాతి యీతనిదే. వీరశైవులీతనిని పరమాచార్యునిగా సంభావింతురు. ఆర్యవిజ్ఞానసర్వస్వ మీతని జిహ్వాగ్రమునందుండెను. అట్టి గరీయః ప్రతిభుడు! ఈతని గీతములందీ విషయము ప్రవ్యక్తమగుచున్నది. ఈతని శాస్త్ర వైదుష్యము, ఐతిహాసిక పరిజ్ఞానము, అకలంకభక్తి విశేషము మున్నగునవి మాణిక్యవాచకర్ గీతములలో మూర్తీభవించినవి. ఈతని నిజనామధేయము వాదవూరార్. మాణిక్యవాచకర్ అనునది బిరుదనామము. మాణిక్యములవంటి ప్రవచనములు చెప్పిన కారణమున నీతనికీ వ్యవహారనామ మేర్పడెను.

మాణిక్యవాచకుని అపూర్వ ధీవిశేషమును, అనూన ప్రతిభాసంపత్తిని కనుగొని అప్పటి రాజయిన అరిమర్దనపాండ్యుడీతనిని తన ప్రధానామాత్యునిగా చేసికొనెను. శక్తిసామర్థ్యములతో మంత్రాంగమును నిర్వర్తించుచు మాణిక్యవాచకుడు శైవమత ప్రచారముకూడ చేయుచుండెడివాడు. ఈ సందర్భమున ప్రచారమునందున్న రుచికరమైన ఒక కథ నుట్టంకించెదను.

ఒకప్పుడు పాండ్యుడు కొంతధనము నొసగి ఉత్తమాశ్వములు కొనుమని మాణిక్యవాచకుని కాజ్ఞాపించెనట! రాజాజ్ఞను శిరసావహించి అతడొక పట్టణమునకు వెళ్లెను. అచ్చట నొక శివలింగము నెదుట జనులు చాలమంది గుమిగూడి భజనచేయుచుండిరి. ఆ దృశ్యమును తిలకింపగనే మాణిక్యవాచకుని హృదయము భక్తిప్రపూర్ణముకాగా నతడు భక్త్యావేశముతో భజనచేయ మొదలిడెను. అంతటితో రాజాజ్ఞనుగూడ విస్మరించి అతడు తాను తెచ్చిన ధనరాసులను శివాలయములను వినిర్మించుటయందును, జీర్ణాలయములను పునరుద్ధరించుటయందును వినియోగించెను. పిమ్మట రిక్తహస్తములతో అతడు మధురకు జని పాండ్యునితో గుఱ్ఱములు వచ్చుచున్నవని నుడివెను. కాని ఎన్నాళ్లకును గుఱ్ఱములు రాకపోవుటచే మహోగ్రుడై పాండ్యుడు మాణిక్యవాచకుని కఠినముగా ప్రశ్నించెను. అప్పుడతడు శివుని ప్రార్థింపగా ఈశ్వరుడు కొన్ని నక్కలను గుఱ్ఱములుగా మార్చి వానిని పాండ్యుని అశ్వశాలకు పంపెను. వానిని చూచి పాండ్యుడు హర్షామోదములు చెందెను. అదేమి చిత్రమో, ఆ రాత్రియే అవియన్నియు నక్కలై కూయజొచ్చెను. మోసమేదియో జరిగెనని గ్రహించి పాండ్యుడు మాణిక్యవాచకుని కారాగారమునం దుంచెను. అంత వైఘునదిలో వెల్లువవచ్చి మధురానగరమునకు మహోపద్రవము కలిగించెను. అటుపిమ్మట పాండ్యుడు మాణిక్యవాచకుని భక్తిమహిమల కలరి అతనిని బంధవిముక్తునిగా చేసెను.

ఇతనికి సంబంధించిన ఇట్టి అద్భుతములగు కథలు పెక్కులు కలవు.

మాణిక్యవాచకుని కృతులలో పేర్కొనదగిన 'తిరువాచకం' (పవిత్ర ప్రవచనము) అతనికి తమిళ సాహిత్య ప్రపంచమునందు సముచితస్థానమును సమకూర్చినది. ఇందలి గీతములు పొంగులు వారు భక్త్యావేశముతో రచితములై యుండుట యొక విశేషము. క్లిష్టములైన ఆధ్యాత్మిక రహస్యములను పామరులు సహితము సులభముగా అర్థముచేసికొనురీతిగా రచితములై యుండుట మరియొక విశేషము. ఇంకొక విశేష మేమనగా దేశికవితాశాఖకు చెందిన అమ్మానై[1] (అచ్చనగాయలాడు సందర్భమున

1. ఈ అచ్చనగాయలకు అచ్చనగండ్లు, అచ్చనలు అను ప్రసిద్ధనామములు గలవని తెలియుచున్నది. పింగళి సూరనామాత్యుడీ క్రీడావిశేషమును పేర్కొనినాడు. " దినముల్ కొన్నిచనంగ

స్త్రీలు పాడెడి పాట), తెల్లేణం (గొబ్బిపాటలు) సాళ్ళల్ (ఉయ్యాలపాటలు) మున్నగు మధుర రచనలందును మాణిక్యవాచకుడు గీతములు రచియించినాడు. ఈ కారణములవలన ఈతని రచనలకు పండితపామరుల యాదరాభిమానములతో బాటు బహుళీ వ్యాప్తియు కలిగినవి. కాళహస్తీశ్వరశతక కర్తయగు ధూర్జటివలె నితడును ప్రతిగీతమునందును ఆత్మోద్ధరణకై భగవంతుని ప్రస్తుతించినాడు. మచ్చునకు రెండు గీతములు:

(1) సాహాయ్య మేమియు సలుపక మ్రాతశ
రీరమువలె సంచరించు హృదయమ !
ఆద్యుడై భాసించు నా నటరాజ
మూర్తియం దిక నీకు మోహమ్ము సున్న
ఆనందతాండవం బాతనియెదుట
చేయనే చేయవు, హాయిగా పాట
పాడవు భామికలు పాడియగు దాక
భక్త్యంజలులు ఘటింపవు నీ వతనికి
శివుపదంబులు తలఁ జేర్చవు నీవు
కుసుమంబులన్ మాల గ్రుచ్చవు నీవు.
అతఁ డన్న చో భయం బసలే హుళిక్కి !
అతని కేమి సపర్య లాచరించెదవు ?
వాడవాడలు శూలపాణికై తిరుగ
వీవు, నీవలన నా కేమి లాభమ్ము ?

(2) సురల కిధనాఘుఁడౌ పురందరుని చేత
తెలియబడనట్టివాఁడును, జలజ నూతి
హరిహరాదులలో నొకఁడై సయట్టి
వాఁడు, వారల కాద్యుఁడై పరగువాని,
గురిత సంహారు, హరునిఁ బ్రస్తుతియొనరు.
అతఁడు జగదేక సంసేవ్యుఁ, డమలచరితు,
డతఁడు సన్నుదరించువాఁ డితరదైవ
ములను నే గొల్వ, నతనిభక్తులు మదీయ
సఖులు, మెలఁగును వారితో సంతతమ్ము.

## అప్పర్ :

శైవసమయాచార్యులలో నొకడగు అప్పర్ కూడ కొన్ని భక్తి గీతములు పాడియున్నాడు. ఇతడును, ఇతని సహోదరి తిలకవతియు జైనమతమును పరిత్యజించి శైవము స్వీకరించిరి. పైతృకమైన సిరిసంపదలను దానధర్మ కార్యములకై వినియోగించిన మహా వితరణి అప్పర్. ఎన్నియో గుళ్లుగోపురములు, సత్రములు చావడులు కట్టించెను. తటాకములు బావులు త్రవ్వించెను. కొన్నాళ్లు గార్హస్థ్యము నవలంబించి పిమ్మట సన్న్యసము స్వీకరించెను.

అప్పర్ సంగీతప్రియుడు. ప్రకృత్యుపాసకుడు. అర్థగాంభీర్యముకంటె శబ్దసౌందర్యమే యీతని గీతికలందు మిక్కుటముగా నుండును. శ్రవణసుభగత్వమును వాంఛించినంతగా, భావసౌందర్యము నుపలక్షింపలేదు. ఏలకో తెలితెలియదు కాని అప్పర్ గీతములకు ప్రజాదరము ప్రలభ్యముకాలేదు. అయినను తమిళుల నాగరకత, మత చరిత్ర మున్నగునవి యీతని గీతములందు ప్రతిఫలించుచున్న కారణమున అప్పర్ గీతము లమూల్యములని చెప్పనగును.

ఈ క్రింది గీతమును చవి చూడుడు :

నవ్యమోహన మధుర వీణానినాద
మధురిమమువోలె, చల్లని మందమారు
తము విభాతి, ప్రశాంతసంధ్యా సుధాంశు
కిరణములరీతి, పంకజాకరము మాడ్కి
లలితవాసంతికా శోభవలె చెలంగు
పావనుండైన నాతండ్రి పరమశివుని
చరణకమలంబు లతిమనోహరము, లతుల
శీత లమ్ము, లశేష సంప్రీతిదములు.

మతసహనములేని జైనమతసులు శైవమును స్వీకరించిన అప్పరును ఆపదు నందుంచిరట ! అప్పుడా భక్తాగ్రేసరుడు నిశ్చల చిత్తుడై సర్వేశ్వరు నుద్దేశించి పయిగీతమును పాడెను.

## తిరు జ్ఞానసంబంధర్ :

శైవవాఙ్మయమునందు మణిపూసగా గణింపబడుచున్న గ్రంథము తేవారము. ఇది శైవమతసులకు పరమప్రీతిపాత్ర మయిన పారాయణ గ్రంథము. తేవారమునందలి గీతము లన్నియు భక్తిప్రధానములని వేఱుగ నుడువ నవసరము లేదు. ప్రతిగీతములోను గేయాంశము మిక్కుటముగ నుండుటచేత తేవారము గానానుకూలమగు గ్రంథమనుట యత్యుక్తి కాదు. ఈగీతికా సంపుటమునకు గల ప్రచారము మఱి యేయితర శైవగ్రంథమునకును లేదని పేర్కొనదగును. ఇట్టి యుద్గ్రంథమును సంతరించినవాడు తిరుజ్ఞాన సంబంధ నాయనారు.

---

కంత గడునర్థిన్ బొమ్మపెండ్లిండ్లు, గుజ్జనగూం, డ్లచ్చనగండ్లు పింపళులు........''

—కళాపూర్ణోదయము. 6 ఆ.

నాయనార్లలో జ్ఞానసంబంధము చాల విశిష్టుడు. తమిళనాడులోని శైవాలయములం దీతని విగ్రహము తప్పనిసరిగా ప్రతిష్ఠితమై యుండును. నిత్యపూజాకైంకర్యములే కాక జ్ఞానసంబంధమునకు ఏటేట మహోత్సవములు కూడ జరుగుచుండుట ఎంతేని హర్షింపదగిన విషయము. ఇట్టి భక్తప్రపత్తులు సముపార్జించిన మహాభక్తుడు, మహాకవియు తిరుజ్ఞానసంబంధము. ఈతని సమకాలికులైన అప్పర్, సుందరర్ మున్నగువారేకాక, యీతని తరువాతివారు కూడ జ్ఞానసంబంధమును బహుధా ప్రస్తుతించి యున్నారు.

భగవదనుగ్రహ విశేషమున జ్ఞానసంబంధము కవిత్వము చెప్పదొడగెనని యొక యైతిహ్యము కలదు. మూడేండ్ల వయసున జ్ఞానసంబంధము తండ్రితోగూడి యొక తటాకమునకు పోయెనట. స్నానసంధ్యాదులలో నిమగ్నుడై పోయిన తండ్రి కుమారుని విషయమునే విస్మరించెను. కొంతవడికి జ్ఞానసంబంధము 'అమ్మా అమ్మా' యనుచు విలపింపసాగెను. అప్పుడు జగజ్జనని యొక స్త్రీవేషము దాల్చి జ్ఞానసంబంధమును సమీపించి యతని కొక పాలగిన్నె నొసగెను. ఆక్షీరమును త్రాగిన పిమ్మట జ్ఞానసంబంధము కవితచెప్ప సాగెనట. ఈ కథయందలి సత్యాసత్యములమాట నటుంచి చూచినచో, జ్ఞానసంబంధ మసాధారణ ప్రతిభావిశేషములు కలవాడని యితని తేవారము సువ్యక్త మొనర్చుచున్నది. మధుర నేలు గూనిపాండ్యుని పట్టమహిషి యగు మంగైయర్క్కరసి యీతని యపూర్వధీశక్తిని గ్రహించి యితనిని తననగరమున కాహ్వానించెను. జ్ఞానసంబంధము జైనమతావలంబకుడైన గూనిపాండ్యుని శాస్త్రచర్చలలో నోడించి యతనిని శైవునిగా నొనర్చెను. ఇది మాత్రము చారిత్రకసత్యము. తమిళనాడులో నితడు మెట్టని శివాలయములేదు; ఇతడు చూడని శివవిగ్రహములేదు; పాడని పుణ్యస్థలము లేదు.

శైవమతాచార్యుడుగా, కవిగా ప్రఖ్యాతియశస్కుడైన తిరుజ్ఞానసంబంధుని కవితాశక్తిని గ్రహించుట కాతని తేవారమే శరణ్యము. అందలి యొక గీతమును పరికింతము.

"తోడుడైయ సెవియన్ విడైయేఱి
యోర్ తూవెళ్ మదిసూడి
కాడుడైయ సుడలై ప్పొడిపూసి,
యెన్నుళ్లం కవర్ కళ్వన్
ఏడుడైయ మలరాన్ మున్నాట్
పణిన్దే త్తవరుళ్ సెయ్ద
పీడుడైయ పిరమాపుర మేవియ
పెమ్మా నివనన్రే.

"చెవులన్ కుండలమున్ ధరించి, తలపై
చెన్నార బాలేందు రే
ఖ, విభూతిన్ మెయినిండుగా నలది,
బింకంబార బక్కెద్దు నె
క్కి, విరుల్ మాలలుగాగ దాల్చి మెడ,
యోగిశ్రేణి సంసేవ్యుడౌ
శివుడీ [1]బ్రహ్మపురీశుడౌ నితడు
నన్ చేపట్టుగా కెప్పుడున్."

ఇంకను సుందరమూర్తి మఱికొందఱు శైవకవులు భక్తిగీతములు వెలయించి శైవసారస్వతమును సుసంపన్నము చేసినారు. వీరెల్లరు తమిళనాడులో జైన బౌద్ధమతముల నుండి శైవము నుద్ధరించి తన్మతవ్యాపనమునకు విశేష సాహాయ్యము సలిపిన ధన్యజీవులు! మతవ్యాపనముతో బాటు తమిళసాహిత్యమును పరిపోషించిన రసప్రలుబ్ధులు!

శైవముపలె వైష్ణవముకూడ చాల ప్రాచీనమయిన మతము. దక్షిణభారతములో, ముఖ్యముగా తమిళదేశమునందు, వైష్ణవమత వ్యాపనమునకు తోడ్పడినవారు ఆళ్వారులే యనవలసియున్నది. ఆళ్వార్ అనుమాటకు ఆధ్యాత్మిక జ్ఞానసంపన్నుడని యర్థము. అతని హృదయము ప్రేమకు నిలయము. అతడు ధ్యానసిద్ధుడు. అతడు గీతాస్వరూపము[2]; ఉపనిషద్వాయువులను పీల్చుచుండును. శ్రీమన్నారాయణుడే పరమదైవమని యతని ప్రగాఢవిశ్వాసము. ఆళ్వారులు పన్నిద్దరు కలరు. తొలుత పదిమంది ఆళ్వారులే యుండెడివారనియు, తరువాతి కాలమున మఱియిరువురు ఆళ్వారులుగా వ్యవహృతులైనారనియు పండితుల విశ్వాసము. పొయ్‌గై ఆళ్వారు, భూతత్తాళ్వారు, తిరుమళ్లిశై ఆళ్వారు (భక్తిసార), తిరుప్పాణాళ్వారు (మునివాహన), తొండరడిప్పొడి

1. బ్రహ్మపురము: షియాలి. తిరుజ్ఞానసంబంధుని జన్మస్థలము. 2. చూడుడు: స్వామి శుద్ధానంద భారతిగారి "ఆళ్వారులు" పుట 3.

ఆళ్వారు (భక్తాంఘ్రిరేణు లేక విప్రనారాయణ), తిరుమంగై ఆళ్వారు (నీల), కులశేఖరాళ్వారు, పెరియాళ్వారు (విష్ణుచిత్తుడు), శ్రీ ఆండాళ్ (రంగనాయకి), నమ్మాళ్వారు (శఠగోప), మధురకవి-వీరే పన్నిద్దరాళ్వార్లు. సనాతన వైష్ణవులు నేటికిని ఆళ్వారులు విష్ణుమూర్తి వస్తువాహనములకు ప్రతిరూపములని విశ్వసించుచున్నారు. వెన్నుని భక్త్యతిశయమున ప్రస్తుతించుచు వీరు పాడినగీతములు నాలుగువేలు కలవు. వీనిని సంకలించిన మహనీయుడు నాథముని యను విష్ణుభక్తుడు. ఈ సంకలన కావ్యమునకు నాలాయిర ప్రబంధమని పేరు. వైష్ణవులకీ కావ్యమునందుగల యాదరాభిమానములు నిరుపమానములు. వారికి వేదములకంటెను పరమప్రీతి పాత్రమయిన గ్రంథ మిది యనియే నుడువవలెను. దీనికి దివ్యప్రబంధ మనునామాంతరము కూడ నున్నది. వైష్ణవాలయములందీ పవిత్రగ్రంథము సతతము పఠింపబడుచుండుట హర్షింప దగిన విషయము.

## తిరుమళిశై ఆళ్వారు : (భక్తిసార)

"కులము ప్రధానమె గుణములేకున్నఁ
గలశాబ్ధిఁ బుట్టదె కాలకూటంబు—"

అని గౌరన మహాకవి నుడివినట్లు కులమును బట్టి కాక గుణమును పురస్కరించుకొని మానవుని మంచి చెడ్డలు విచక్షితములు కావలయును. దైవారాధనమునకుగాని, మోక్షసాధనకుగాని కులము ప్రధానము గాదని తిరుమళిశై ఆళ్వారు జీవితము ప్రవ్యక్తమొనర్చుచున్నది. పొయ్గై ఆళ్వారు, భూతత్తాళ్వారు, పేయాళ్వారు వీరు మువ్వురును వైష్ణవసమయాచార్యులందు ప్రథములుగా పరిగణింప బడుచున్నారు. వీరికి తరువాతివాడే తిరుమళిశై. "కులంగళాయ ఈరిరండిన్ ఒన్ఱిలుం పిఱన్దిలేన్" (కులములు నాలుగింటిలో దేనియందును జన్మింపనివాడను) అని యీతడు చెప్పికొనియుండుటచే నితడు నిమ్నజాతికి చెందినవాడని పండితులు తలచుచున్నారు.

తిరుమళిశై ఆళ్వారు తమిళమునందే కాక సంస్కృత వాఙ్మయమునందును విద్వాంసుడు. వేదాంతగ్రంథ సారమును హృద్గతము చేసికొనిన మహామనీషి. శైవ, జైన, బౌద్ధములను తొలుత నవలంబించి తరణోపాయమును కనుగొనలేక తుద కతడు వైష్ణవమును స్వీకరించెను. అతని గీతములందు విష్ణుపారమ్యము పరాకాష్ఠ చెందెను. మచ్చున కొక గీతము నందలి భావమును చూడుడు.

"పృథివ్యాపస్తేజోవాయురాకాశము లను పంచభూతము లందును నీ వున్నావు. ఈ పంచభూతముల సంయోగ వియోగముల వలన ఏర్పడుచున్న ప్రతిరూపములలోను నీవున్నావు. అట్టి నిన్ను నే నెట్లు భజింపగలను?—"

## నమ్మాళ్వారు : (శఠగోపన్)

ఆళ్వారుల యందితడు చాలప్రముఖుడు. నాలాయిర ప్రబంధము నందలి గీతములలో వెయ్యికి పైబడి యితనివి కలవు. నమ్మాళ్వారునకు మహాకవి యను బిరుదము కూడ నున్నది. బాల్యమునం దితడు పాలుత్రాగ లేదనియు, ఒక కోవెలయందలి చింతచెట్టుక్రింద నివసించుచు యోగాభ్యాసము చేయుచుండె ననియు ఐతిహ్యము నుడువుచున్నది.

నమ్మాళ్వారు ప్రతిగీతమునందును భవసాగరమునుండి తన్ను బంధవిముక్తుని గా చేయుమని విష్ణుమూర్తిని ప్రార్థించినాడు. ఈతని కవిత మనోరంజకముగ నుండును. చతుర్వేదముల సారము నమ్మాళ్వారు గీతములందు నిబిడీకృతమై యున్నదని తమిళపండితులు విశ్వసించుచున్నారు. ఒక గీతమునందు నమ్మాళ్వారిట్లు పేర్కొనుచున్నాడు.

"నేను నా దనుభావముల్ పూన కెపుడు
వాని మొదలంట నఱకి విశ్వస్వరూపు
దేవదేవుని శ్రీహరిఁ దెలిసికొనుము
ఆత్మ కద్దియగాదె గమ్యస్థలమ్ము—"

## పెరియాళ్వారు (విష్ణుచిత్తుడు)

అనభ్యస్త శాస్త్రుడైనను పెరియాళ్వారు సంతరించిన గీతములు సాహితీపరు లందఱకు పరమప్రీతి పాత్రములు. విష్ణుమహిమవలన నితడు కవిత లల్లగలిగెనని ప్రతీతి. అన్యమత సహన మీతని గీతములందు కన్నులకు కట్టుచున్నది. "పల్లాణ్డు, పల్లాణ్డు" అను నీతని గీతము చాల ప్రసిద్ధమయినది.

## ఆండాళ్ :

విష్ణుచిత్తుని కుమార్తెయే శ్రీ ఆండాళ్. (గోదాదేవి). తండ్రివలె నీమెయు ముప్పది పాశురములు పాడెను. ఇవి రసగుళికలని పండితుల మతము. విష్ణుమూర్తిని సేవించునుద్దేశమున పేరు పేరున సఖురాండ్ర నుద్దేశించి

ఆండాళ్ పాశురములు పాడినట్లు తలంప బడుచున్నది. రచన సంవాదరూపమున సాగినది.

"అందాలకొలికి! లే జిలుక! ఇంకను నిద్రలో నున్నావా?

మాటిమాటికి పిలుచుచునాకు నిద్రాభంగ మొనర్చుచున్నావు.

మాటలాడి పోవే! నీవే నన్ను నిద్రనుండి లేపెదనంటివి.

అవును, నేను మాటలాడనే. నిద్రపోవు చున్నాను.

అందఱువచ్చినారు. ఇంక నిద్రపోవుట తగునా?

అందఱు వచ్చిరా?

నా మాటలో నమ్మకము లేకున్నచో వెలుప లికి వచ్చి చూడుము.

ఇట్లు ఎల్లరు సమావేశమై మాయగాడు, త్రిలోకపూజ్యుడు నగు శ్రీమన్నారాయణుని సేవింప నభిలషించి స్నానార్థమై వెడలిరి—"

ఇట్లు ప్రతిపాశురమునందును శ్రీ ఆండాళ్ మధురభక్తి ప్రవ్యక్తమగుచున్నది. తిరుమొళ్ళి అను మఱియొక రచనలోగూడ ఆండాళ్ భక్ ప్రపత్తులు ప్రతిబింబించుచున్నవి. ఇందు నూట నలుబదిమూడు గీతములు గలవు. నేటికిని శ్రీ విల్లిపుత్తూరునందు గీతోత్సవ మహావైభవముగా నుత్సవము జరుగుచుండుట గమనార్హము.

కులశేఖరాళ్వారుకూడ మహావిద్వాంసుడు. ఇతడు రాజకవి. సంస్కృత ద్రావిడభాషలయం దుద్దండ పండితుడు. తొలుత నితడు ముకుంద మాలను సంస్కృతమున సంతరించి పిమ్మట తమిళములో 105 పద్యములుగా నా కృతిని రచించెను. విప్రనారాయణ నామాంతరము గలిగిన తొండరడిప్పొడి ఆళ్వారుకూడ కడు ప్రసిద్ధుడు. ఈతని గీతములందు జైన బౌద్ధులకు సంబంధించిన విమర్శన లచ్చటచ్చట కనబడు చున్నవి.

## తిరుమంగై ఆళ్వారు :

ఆళ్వారులలో నితడు కడపటివాడయినను చాల విశిష్టుడు. నిర్ఝరాంభః ప్రవాహమువలె నితని కవిత సాగుచుండును. ఇతని ప్రకృతి వర్ణనలు మధురములు; లలితములును. భక్తి మార్గమే విష్ణుసాన్నిధ్యమునకు సోపానమని యితడు ప్రబోధ మొనర్చెను.

[1]"సారములేని యట్టి భవ
సాగర మందు మునింగి మార్గమే
తీరునఁ గానలేక యతి
దీనతఁ గన్నులు వాడిన ట్లె
సారమువోవ, నిన్ను కడ
సారి కెటో తిలకించినాడ, నా
భారము తీరెనయ్యా, భగ
వంతుటవీవె రమాధనాయకా!"

తిరుమంగై ఆళ్వారురచనయంతయు నిటులనే సాగినది. అకలంకమైన భక్తి ప్రతిపద్యము నందు సంతర్లీనమై యుండుటచే నీతని పద్య ములు సంతత పఠనార్హములై యెక్కుడు ప్రచారములో నున్నవి.

ఉపసంహారమున, శైవ వైష్ణవ సమయా చార్యులకాలపు తమిళ వాఙ్మయము భక్తిరస ప్రపూర్ణమై భాసించుచున్నదని పేర్కొన దగును. శైవ వైష్ణవ కవులందఱు నొకవర్ణము నకు చెందినవారుకారు. కులభేదములను నిర సించిన విశాల హృదయులు. వారిలో నంత్య కులజులు కూడ కొంద ఱుండుట గమనింపదగు విషయము. భక్తిమార్గమే తరణోపాయమునకు నిశ్రేణి యని వారు ముక్తకంఠముతో ప్రబో ధించిరి. కనుకనే పాంగులు వారు భక్త్యావేశము శైవ వైష్ణవకవుల మధుర రచనములం దంత ర్వాహినియై జాలువాఱుచున్నది. ఈ భక్త్యా వేశమే యారచనలకు జీవము పోసినదని నుడువ నగును.

మఱియొక విశిష్ట లక్షణముకూడ నీ కాలపు వాఙ్మయమునందు కనబడుచున్నది. శైవ వైష్ణవ కవులు వృత్తరచన సాగించినను, సంస్కృత సాహిత్య సంపర్కము కలవారేయైనను వారికి తమిళభాషయందుగల యాదరము నిరుపమాన ము. తమిళవేదములు సంతరించిన మహాకవులు వారు! ముఖ్యముగా వైష్ణవకవుల రచనములందు తమిళభాష యందాలు దిద్దుకొనినది. శైవకవుల కృతులలో సంస్కృత శబ్దములు బహుళముగా ప్రయుక్తములైనవి. ఈ కృతు లన్నియు గానానుకూలములైయుండుట మఱియొక విశే షము.

1. ఈ పద్యానువాదము శ్రీ చల్లా లక్ష్మీనారాయణ శాస్త్రిగారిది.

# శాస్త్రీయసంగీతం-శ్రుతులు

'శ్రీ శార్ఙ్గదేవ'గారు

--:♦:--

**భా**రతీయ సంగీతంలో శ్రుతుల సమస్య తొలినుండి చిక్కు సమస్యగా నిలచియున్నది. స్వరములకంటే స్వల్పప్రమాణములుగా స్థాయివిభజనము, ఇతర సంగీత సమస్యలకంటెను అధికముగా శాస్త్రజ్ఞుల కలవరపెట్ట సాగింది. నాట్యశాస్త్రకారుడైన భరతుని కాలమునుండి ఈనాటివరకును అది తెగలేదు. శ్రుతులు వట్టి మనః కల్పితములుకావు. ఏలనంటే సంగీతాభ్యాసముతో గాయకులు, జాంత్రికులు శ్రుతులను గ్రహించుటయేగాక, తమ కళకు మెఱుగు దెచ్చునటుల ఉపయోగపఱచు కొనుచున్నారు. శాస్త్రీయ సంగీతంలో వాని ఉనికిన గూర్చిగాని, ఉపయోగమును గూర్చిగాని ఎట్టి సందేహమును లేదు. స్థాయిలో మొత్తమెన్ని శ్రుతులున్నవనీ, శ్రుతులకంటె పెద్ద అంతరములైన స్వరములలో ఎట్లవి పంపిణీ చేయబడుచున్నవనీ వారు వివాదపడుచున్నారు. శ్రుతులను గ్రహించు శక్తి సంగీతజ్ఞునికున్నను, ఒక రాగముతో నెన్ని సూక్ష్మాతి సూక్ష్మ ధ్వనుల (శ్రుతుల) నత డుపయోగించునో లెక్కింపలేకున్నాడు; శాస్త్రీయ సంగీతమున తెల్పలేకున్నాడు. మనచెవి నాదములయొక్క సూక్ష్మభేదముల కొలుచుటకు తగి యుండడ నందువల్లను, శ్రుతులు ఏ ఉపకరణమునకు అందనివై యుండుటచేతను, ఇది గడ్డు సమస్యగా మారింది. నాదశాస్త్రము ఆధునిక యుగంలో చాల ప్రగతిజెందింది. కాని శ్రుతులు కొలత కతీతమై తప్పించుకొనుచున్నవి. ఇద్దరు గాయకులొకే రాగమును పాడునపుడు ఒకే స్వరమునకు వేర్వేరు స్వరౌన్నత్యముల వ్యక్తముచేయుటయే దీనికి కారణము. ఒకే గాయకుడుకూడ తన పాటలో నొక స్వరమును పాడునపుడు ముందు వెనుక స్వరములనుబట్టి వేర్వేరు స్వరౌన్నత్యముల సూచించుచున్నాడు. స్వరసమాసములోని స్వరముల స్థానముల పరస్పరసంబంధమునుబట్టి వాని ఔన్నత్యము మారుచున్నది. కావున రాగాభ్యాసములో స్వరముల ఔన్నత్యము లివియేయని, నిరాక్షేపణీయంగా నిర్ధారణజేసి చెప్పలేకున్నాము. అనుభవముతో తేలిన చిక్కు అటుండినా, సంగీత శాస్త్రజ్ఞుల కది అడుతగులలేదు: పూర్వమునుండి వారి వారికి తోచినట్లు శ్రుతి నిర్ణయముజేసిరి. కావున సంగీత చరిత్రలో నీ సమస్య స్వానుభవ ప్రదర్శనమువల్ల పరిష్కరింప బడక కేవలము సూత్రప్రాయముగ నిలచియున్నది.

ఆదినుండి శ్రుతులు రెండు ముఖ్యవ్యాపారముల నెఱవేర్చుచున్నవి: రాగమునకు జీవకళనిచ్చి రక్తిని కలుగజేయుటకై అవి ఉపయోగపడుచున్నవి; స్వరముల మధ్యనుండు అంతరములను శ్రుతుల సహాయముచే నిర్ణయించుచున్నారు. మన సంగీతమునకు మూలాధారములు శ్రుతులే కావున, శాస్త్రములో కొఱత లేక యుండవలెనంటే, శ్రుతుల సమస్యను పరిష్కరింపక తప్పదు. చారిత్రకంగాను, ఆధునిక పదార్థ విజ్ఞానశాస్త్రరీత్యాను దానిని పరిశీలించి యుక్తమైన సిద్ధాంతమును కనుగొనుటకు ప్రయత్నింతము.

శ్రుతులను నిశ్చయించుటకై చాల ప్రయత్నించినవారిలో "సంగీత రత్నాకరము" ను రచించిన శార్ఙ్గదేవుడు ముఖ్యుడు. అతడు స్థాయిని 22 సమశ్రుతులుగా విభజించి అందు స్వరముల నమర్చినాడు. ద్వావింశతి శ్రుతులు క్రమముగా ఆరోహణ జెందుచున్న నిశ్రేణి వంటిదనియు, వీటిమధ్య స్వరూపమాత్రముగ వినబడుచున్న ధ్వని మరేది యుండదనియు జెప్పియున్నాడు. ఆధునిక సంగీత శాస్త్రజ్ఞులు చెప్పునటుల శ్రుతికి ఇన్ని వేపనలనిగాని, ధ్వనించుచున్న తంత్రియొక్క ఇంత కొలతలో ఈ శ్రుతి పుట్టుననిగాని పూర్వపు సంగీత విద్యావిశారదులు నుడువుటలేదు. స్వరప్రమాణముల జెప్పునపుడుమాత్రము "సంగీతపారిజాత" కారుడైన అహోబిలుడు వీణతంత్రియొక్క కొలతలతో ఆయా స్వరములు జనించు స్థానము

లను జెప్పియున్నాడు. శార్‌ఙ్గదేవుడు షడ్జ గ్రామ మధ్యమ గ్రామ పంచమముల అంతరమే శ్రుతి ప్రమాణమని అకారణముగా నిర్ణయించి, స్థాయిలోని ద్వావింశతి శ్రుతులొక్కొక్కటియు, ఈ యంతరమునకు సమానమని నుడివినాడు సంస్కృత గ్రంథకర్తలందరును ద్వావింశతి శ్రుతులను స్థాయిలోని సప్తస్వరములకు పంచిపెట్టి, స్వరస్థానముల స్థాపించియున్నారు. పూర్వాచార్యుల వ్రాతలనుబట్టి, వారు ప్రథమమున 22 శ్రుతులను కనుగొని, ఆ పైని సప్తస్వరము లనువానినుండి గైకొన్నట్టు కనబడుచున్నను, స్వరములనుబట్టియే శ్రుతులకు ప్రాముఖ్యం హెచ్చినదని చెప్పక తప్పదు. కొన్ని శ్రుతులు స్వరములతో ఏకీభవించినను, మిగిలినవాని యోగ్యతలగూర్చి లెక్కింపలేకున్నాము.

శ్రుతుల విషయములో ఆధునిక సంగీత శాస్త్రజ్ఞుల కెంత అభిప్రాయ భేదమున్నదో, అట్లే పూర్వాచార్యుల గ్రంథములును పరస్పర విరుద్ధ భావముల ప్రకటించుచున్నవి. శ్రుతి ప్రమాణ నిర్వచనములందే కాక, స్వరములకు వాని పంపకమునందును వివాదగ్రస్త భావముల వెల్లడించియున్నవి. శ్రుతులు రాగములకు జీవకళనిచ్చి రక్తిని కలుగజేయునను ఆధునికాభిమతము దత్తిలుని నిర్వచనమునకు సన్నిహిత సంబంధమును గల్గియున్నది: స్వరూపమాత్రముగ మొదట వినబడుచున్న ధ్వనులు శ్రుతులనబడును; వీటిలో కొన్ని గానములో తీసికొని పోషింపబడుచున్నవి.

స్వరనిర్ణయములోతప్ప శ్రుతులకు ప్రత్యేక ప్రభావము లేనట్లు కొందరి రచనలవలన తేలుచున్నది. పూర్వపు సంస్కృత రచయితలు శ్రుతులను ప్రమాణములుగ నెంచి స్థాయిలో స్వరస్థానములను స్థాపించినారు. మనమిపుడు వేపనలనుబట్టియో లేక ధ్వనించుచున్న తంత్రి యొక్క నిడుపునుబట్టియో స్వరస్థానముల నిర్ణయింతుము.

విదేశ సంగీతశాస్త్రజ్ఞులెట్లు ఈ సమస్యను పరిష్కరించిరో తెలిసికొనుట యుక్తము. ప్రాచీన తమిళ, చీన, గ్రీకు, అరబు గ్రంథములను పరిశీలించిన, ఈ సమస్య వారినికూడ వేళాకోళము చేసినదని తెలియుచున్నది. వారి కాలమునకు తగినట్లుగా వారు ఏదోనొక సంతృప్తికరమైన నిర్ణయమునకు వచ్చినారు.

ప్రాచీన తమిళులు స్థాయిని నాలుగు విధములుగా విభజించిరి. 12 అలగులు లేక శ్రుతులు గలది అయపాలై; 24 శ్రుతులుగలది వట్టపాలై; తిరికోణపాలై 48 అలగులను, చతురపాలై 96 అలగులను కల్గియుండును. కర్ణాటక సంగీతమునకు 24 అలగులుగల వట్టపాలై తగినదని కొందరు దాక్షిణాత్య పండితుల యభిప్రాయము. స్థాయినిట్లు పలువిధములుగా విభజించుట, పెద్దచిక్కు సమస్యను పరిష్కరించుటకై వారు చేసిన ప్రయత్నమేనని ఒప్పుకోతప్పదు.

చైనాసంగీత శాస్త్రజ్ఞులు షడ్జపంచమ భావమువలన ఉత్పన్నమైన స్వరములను తప్ప తక్కినవాటి నన్నింటిని త్రోసిపుచ్చిరి. కాని వాదమునకై స్థాయిని 60 భాగములు చేయగా కలిగిన శ్రుతికి "ల్యూ" అని పేరిడిరి. గ్రీకులు, మిశ్రదేశసులు చాల్డియనుల ననుసరించి, 24 పాదధ్వనులు (క్వార్టర్ టోన్స్ లేక ఎన్‌హార్మానిక్ డివిషన్స్) స్థాయిలో కలవని యెంచిరి. గ్రీకులయు, హైందవులయు సంపర్కము కలిగియుండిన అరబ్బులు స్థాయిని 24 లేక 22 భాగములుగా విభజింప వచ్చునని చెప్పుచు, ఇస్లాం మతానుగుణముగ 17 శ్రుతులను స్వీకరించిరి.

పై నుదహరించిన వాదములన్నియు ఒక్క విషయమును నిర్ధారణచేయుచున్నవి. శ్రుతులను గ్రహించినను శాస్త్రజ్ఞులు వాటి పరిమాణమును తెలిసికోలేక పోయిరి. ఒక శ్రుతి అరుదుగనో, అనేకముగనో - ఎన్ని తడవలు ఉపయోగింప బడునో వారికి చెప్ప సాధ్యపడలేదు; అట్టి శ్రుతులెన్ని యొక స్థాయియందుద్భవించునో వారి కెఱుకపడలేదు. పరిస్థితులిట్లుండ, ఈ కాలపు సంగీత శాస్త్రజ్ఞులు గణితశాస్త్ర సిద్ధాంతముల సహాయముతో పూర్వాచార్యులు చెప్పిన శ్రుతుల వివరము దూషితమని నిందింపబూనుటగాని, సరియని ప్రశంసించుటగాని తగదు. పూర్వుల శ్రుతి నిర్ణయము ఆధునిక శాస్త్రరీత్యా సరిగాకున్నను, ఆ కాలమునకు సరిపోయెననియే చెప్పవచ్చును.

ఇటీవల పలువురు శ్రుతి నిర్ణయము చేయ ప్రయత్నించి విఫలులైనారు. ఆధునిక సంగీత శాస్త్రజ్ఞులలో భాత్‌ఖండే పండితుడు,

శ్రీ హేమేంద్రలాల్ రాయ్‌గార్లు మాత్రమే వెట్టిలేని అభిప్రాయముల వెల్లడించియున్నారని తెల్పుటకు సాహసించుచున్నాను. భాత్ ఖండే తన "సంగీతపద్ధతి"లో వ్రాయుచు, రాగములను ఏ భయమునులేక 12 స్వరముల నుపయోగించి మాత్రమే వివరింపవచ్చుననియు, దీనికై వివాదగ్రస్తమైన శ్రుతివాదములు పనికిరావనియు తెల్పియున్నాడు.

తంజావూరి అబ్రహాం పండితుడు చిరకాలము శ్రమించి, ప్రాచీన తమిళగ్రంథములలో చెప్పబడిన శ్రుతి నిర్ణయమును సముద్ధరింప ప్రయత్నించినను, అతని "కరుణామృత సాగరము" లోని 24 శ్రుతుల వాదము సరికాదని తోచుచున్నది. కారణము అతనివాదము "ఈక్వల్ టెంపరమెంట్" లేక సమశ్రుతులకు దారితీసింది. అలయిన్ డానియేలూ అను ఫ్రెంచి శాస్త్రవేత్త శ్రుతి నిర్ణయమునకై ప్రాక్పశ్చిమ సంగీత శాస్త్రముల మర్దించి, మన కిన్నినాళ్ళు అందుబాటులో లేని పలువిషయములను తెలిపినాడే కాని, అతని అంతిమాభిప్రాయము సరియైనదని చెప్పలేకున్నాను.

శ్రుతి నిర్ణయమునకై చేసిన పాత క్రొత్త వాదములన్నియు, సమస్యను సంపూర్ణముగా పరిష్కరించి తగిన సమాధాన మియ్యనందువల్ల, ఆధునిక పదార్థవిజ్ఞానశాస్త్ర సహాయముతో శ్రుతుల చిక్కును విడదీయ ప్రయత్నింతము. మన "రాగధారీ" సంగీతాభ్యాసములో తంబురిలోని నాలుగు తంత్రులును మేళవించి శ్రుతిగూర్చుకొనుట అందరెఱిగిన విషయమే. ఈ తంత్రులు నాలుగును మూలాధార స్వరముల (ఫండమెంటల్ నోట్స్) తో అనంతమువైపు స్వయంభువుల ప్రసరింపజేయును. ఇట్లు ప్రసరింపబడుచున్న స్వయంభువుల నొక చిత్రపటముగా తీసికొన్న, మనగానము దానిపై గీయబడుచున్న చిత్రమును బోలియుండును. తంబుర తంత్రీజనిత ధ్వనులను పోగులతో నల్లబడిన స్వయంభువుల చిత్రపటముపై గాయకుడు తన రాగరేఖలను చిత్రించును. గానమాధురి చాలవరకు రాగరేఖల ప్రకృతిపైనను, స్వయంభువులతో రాగరేఖల సంక్రమణపైనను, వాటి పొందికలోని మార్దవముపైనను ఆధారపడి యుండును. స్థాయిలో నుద్భవించు స్వయంభువు లెన్నియని మనము లెక్కింపగలుచో, సమస్య తృప్తికరముగా పరిష్కృతమైనట్లే అనుకొనవచ్చు. పదార్థ విజ్ఞానశాస్త్ర రీత్యా స్థాయిలో స్వయంభువులు (హార్మోనిక్స్) 53 ఉన్నవని తెలియుచున్నది. ఏ రాగధారీ సంగీతములోనైనా ఈ స్వయంభువుల చిత్రపటముపైననే గానమును చిత్రించుచున్నాము. కావున, 53 స్వయంభువులలో ఏ కొన్నిటిని మాత్రమే మనము శ్రుతులుగా వాడుచున్నాము — అనగా మన రాగరేఖలతో స్పృశించి మేళవించుచున్నాము. ఇవియే మన శ్రుతుల పరిమాణమును, ఔన్నత్యమును చక్కగా తెలియజేయును. కంఠములోగాని, జంత్రములోగాని పుట్టు నాదముల అంతరములన్నియు ఈ స్వయంభువుల చిత్రపటములో ఇమిడియున్నవి కాన మన పరిష్కారము విస్తృతము, సమంజసమును. ఒక రాగములో ఏయే శ్రుతులు ఎన్నెన్నిసార్లు ఉపయోగమునకు వచ్చునో గట్టి నిర్ణయము చేయలేము. అది కళాకారులైన వ్యక్తులపై *నాధారపడియున్నది. భారతదేశమంతటను పాడుకలోనుండు 12 స్వరముల మూలముననే రాగముల వివరించుట మంచిది. ప్రకృతి సిద్ధముగా జనించు 53 స్వయంభువులే మన రాగధారీ సంగీతములోని శ్రుతులని చెప్పుటకు సాహసించుచున్నాను.

శహాజీ

విద్యాసు హృద్యాసు మనోజ్ఞగద్య
పద్యాసు సుర్యాసు నవీనభోజం,
ఆద్యం సతాం నీతిమతాం నృపాణాం
త్యాగేశరూపం శహాభూపమీడే,

**సాహిత్యం—సంకలనం :**

# ప్రబంధరత్నావళి

## శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు

కమ్మనైన కవిత చెప్పగల అదృష్టము ఏ కొందఱికో మాత్రమే అనుగ్రహింపబడిన వర ప్రసాదం! కాని కవితను చదివి రసానుభూతి పడయడ మన్నది సహృదయు డైనవానికి చేత కానిపని కాదు. ప్రాచీనము లయిన రచనములనూ, సమకాలిక రచనములనూ చదివి ప్రాచీనులే కొందఱు సహృదయులు ఆ యా రచనములలో తమకు నచ్చిన పద్యములను, తాము మెచ్చిన పద్యములను ప్రత్యేకముగా వ్రాసి యుంచుకొనినారు. అట్లు వారు సంకలించి యుంచుకొనిన పద్య సముచ్చయములకే సంకలనకావ్యములు లేక సంకలనగ్రంథములు అని పేరు.

“పెఱవారి రచనలలోని రామణీయకాన్ని గుర్తించి గౌరవించడ మనేసహృదయతా పరాకాష్ఠకు పట్టాభిషేకం తొలిసారిగా తెలుగునాటనే జరిగింది. హాలసాతవాహనుడు తన కాలంలో ఆనోట ఆనోట వినిపించే కమనీయ ప్రాకృత కవితలను-పూర్వపువి, సమకాలంవి-ఏర్చి ‘గాథాసప్తశతి’గా కూర్చి యీ రంగంలో తర్వాతివారికి తెన్నులు తీర్చాడు. కాని హాలునికి వేయేండ్లకు తర్వాత కాని యీలాంటి ప్రయత్నం మరల ప్రారంభం కాలేదు. ప్రాకృతగాథాసప్తశతి ఫక్కిని సంస్కృతంలో సంకలిత మైన తొలి కవితా కదంబకం కవీంద్రాచార్యుని ‘కవీంద్ర వచన సముచ్చయం’. పిదప పేర్కొనదగినవి మల్లికార్జునుని సూక్తిసుధార్ణవం (12 వ శతాబ్ది), దేవగిరి యాదవులనాటి జల్హణుని సూక్తిముక్తావళి (13 వ శతాబ్ది), తెలుగుదేశపు అజ్ఞాత సంస్కృతకవుల రచనలూ, మన కిప్పుడు లభ్యం కాని కొన్ని సంస్కృత గ్రంథాలలోని పద్యాలూ లభించే వట్టం పోతయార్యుని ‘ప్రసంగరత్నావళి’ (1380), వల్లభదేవుని సుభాషితావళి (15 వ శతాబ్ది), అజ్ఞాత ఓఢ్రకవి యెవడో గ్రథించిన ‘ప్రపంచదర్పణం’ (16 వ శతాబ్ది) మున్నగునవి యెన్నో ఉన్నవి.

“వివిధకావ్యాల ఘట్టాలతో వేఱొక యితివృత్తాన్ని పొసగించే వింతపద్ధతి కూడా సంస్కృతంలో బయలుదేరింది. ఈ పద్ధతి కావ్యాన్ని ‘సంచితకృతి’ అంటారు. ఇలాంటి సంచితకృతులు సంస్కృతంలో విస్తారం. తెలుగులో కూడా యిలాంటి సంచితకృతులు కొన్ని వెలసినవి.

“ప్రాకృతగాథా కదంబకాన్ని సంకలనం చేసుకొన్న గౌరవం తెలుగుదేశానికి దక్కినట్టే తెనుగుసూక్తుల సంకలన సౌభాగ్యం కూడా తెలుగుదేశానికే దక్కింది. పదునాలుగవ శతాబ్దివాడైన మడికి సింగన రాజనీతిదృష్టితో తనకుముందూ, తనకాలంలోనూ ఉన్న నీతి శాస్త్ర గ్రంథాలలోని విషయాలు సేకరించి ‘సకలనీతి సమ్మత’ మనే నీతిగ్రంథం కూర్చాడు.

‘ఆలోల కల్లోల మగుదుగ్ధనిధి దచ్చి
దేవామృతము తేట తేర్చుపగిది

* * * *

కృతులు మును చెప్పినట్టి సత్కృతులు ద్రవ్వి
కాంచుకంటెను నొకచోట గానఁబడఁగ
సకల నయశాస్త్ర మతములు సంగ్రహించి
గ్రంథ మొనరింతు లోకోపకారముగను’-

అని సింగన తన రచనాప్రకారం వివరించినాడు. దీనిని పోలినవే ప్రబంధమణిభూషణము, ప్రబంధరత్నావళి అనుసంకలన గ్రంథాలు.”

ప్రబంధరత్నావళిని సంపాదించిన ప్రభాకర శాస్త్రిగారు చెప్పినట్టు ‘ప్రాచీన కవీశ్వర కృతములై యీనాడు దొరకకున్న ప్రబంధ ములనుండి ప్రాచీనులే సేకరించియుంచిన పద్య సముదాయమే ‘ప్రబంధరత్నావళి’ అను పేరుతో ప్రకటింపబడినది. ఇందులోని పద్యములను సంకలనముచేసినవారు ఇరువురు. వారిలో ఒకడు పెదపాటి జగన్నాథకవి. నారాయణస్తుతి, శంకరప్రభావము, త్రిపురవిజయాభిరామము అర్ధనారీశ్వరము, హరిహరాత్మకము, బ్రహ్మస్తుతి, త్రిమూర్తిస్తుతి, లక్ష్మీగౌరీ సరస్వతీ ప్రభావము ఇత్యాదిగా పెక్కు వర్ణనాంశములను ఏర్పఱుచుకొని పెదపాటి జగన్నాథకవి అయిదాశ్వాసములుగా ‘ప్రబంధరత్నాకరము’ అనుపేరుతో నొక గ్రంథమును సంధానించినాడు. ఆగ్రంథములో మొదటి మూడు ఆశ్వాసములు మాత్రమే తంజావూరు సరస్వతీ పుస్తకభాండాగారమునందు దొరకినది. కడమగ్రంథ మెక్కడనూ కానరాలేదు.

‘ప్రబంధరత్నావళి’లో చేర్పబడిన మఱి కొన్ని పద్యముల సంధానకర్త పేరు తెలియ

రాలేదు. అతని సంధానగ్రంథము ఆంధ్ర సాహిత్య పరిషత్పుస్తక భాండాగారమునందు లభ్య మయినది. ఆసంధానమునకు పేరు కాన రాదు. దానికి మొదలు, తుద రెండును లేవు. పరిషత్తువారు దానికి 'ఉదాహరణ పద్యములు' అని పేరు పెట్టిరి.

పయి యిరువురు సంధానకర్తల కూర్పుల యందలి పద్యములతో 'ప్రబంధరత్నావళి'ని కూర్చినారు ప్రభాకరశాస్త్రిగారు. పై రెండు సంకలన గ్రంథములం దుండినను—నిప్పటికి ముద్రితములై సుప్రసిద్ధములై దొరకుచున్న నన్నయాదుల భారతాదులలోని పద్యములను వారందు చేకొనలేదు. వానిని పునః ముద్రించుట వలన ప్రయోజనము లేదనియే వారట్లు చేసి నారు. మఱి వారుచేసిన గొప్పవిషయ మొకటి యేమనగా ఆ సంధాన గ్రంథములలో పేర్కొనబడిన కవులనూ, కావ్యములలోని పద్యములనూ కూడ అకారాద్యక్షర క్రమము నకు తార్చుట. భాషాపరిశోధకుల కీ విధానము మిక్కిలి సాహాయ్యక మగు ననుటలో సందే హము లేదు.

పెదపాటి జగన్నాథకవి కృష్ణామండలము నందలి యేలూరునకు చేరువగానున్న పెదపాడు నం దున్నవాడు. తాను సంధానించిన 'ప్రబంధ రత్నాకరము' నాతడు నీలాచలమునందు నెల కొన్న జగన్నాథస్వామి కంకితము చేసినాడు. గ్రంథావతారికలోని యీ పద్యాలు వినండి.

"జననుతు లొకవీశ్వరుల
సత్కృతిసారము కావ్యసార వ
ర్ణన మని చేసి నీలగిరి
నాథునకర్పణ సేయు టొప్పుఁ జ
క్కని పదియాఱు వన్నెకన
కంబున వాసన, కమ్మకస్తురి
గనదురుకాంతియుక్తి, జెలువ
నణఁ ఫల ముబ్బుట భాగ్యమే కదా!

"శ్రీ పెదపాటి పురీబాల గోపాల
కృష్ణప్రసాదితశ్రీల వెలసి
ఘనవైష్ణవ మతజ్ఞ కందాళతిరుమలా
చార్య కృపాకటాక్షమున నలరి
కావ్యలక్షణ లక్ష్య గణితాది సత్కళా
ప్రజ్ఞావిశేషవైభవము గలిగి
రాజవిద్వత్సభా రసిక బాంధవమాన
నీయ ధర్మాచారని యతి మెఱసి

గీ. మల్లప్రెగ్గడ వీరనామాత్యపుత్రి
రామ నభిరామ గుణధామ రామనామ
కామినీమణిఁ బెండ్లియై ఘనగృహస్థ
మహిమఁ జెలువారు జగ్గన మంత్రివరుఁడ."

ప్రబంధరత్నాకరమును సంధానించిన పెదపాటి జగన్నాథకవియు, మఱొక సంధాన గ్రంథకర్తయు నిరువురును గొంచె మించుమిం చుగా సమకాలమువా రనియే మనము తలపవలసి యున్నది. పెదపాటి జగన్నాథకవి యుదా హరించిన కవులలో మాదయగారి మల్లన్నయు, తెనాలి రామలింగయ్యాయును నర్వాచీనులు. పరిషత్తు గ్రంథసంధాత యుదాహరించిన వారిలో అల్లసాని పెద్దనార్యుఁడు అర్వా చీనుఁడు. అందుచేత ప్రబంధరత్నాకరమును సంధానగ్రంథకర్త సుమారు ఇరువదియేండ్లు ప్రాచీను డైనను కావచ్చును. మొత్తమునకు వీరిరువురును పదునాఱవ శతాబ్దివఱకు నున్న కవీశ్వరులను మాత్రమే పేర్కొనుటచేత నీ సంధాన గ్రంథకర్త లిరువురును పదునాఱవ శతాబ్దమున నివసించి యుందు రని తలచుటలో తప్పు లేదు.

ప్రబంధరత్నావళి భాషాపరిశోధకులకు పరమోపాదేయ మయిన ప్రామాణిక సంకల నము. సాహిత్యచరిత్రమున దానికి గల స్థానము మహోన్నత మైనది. ప్రబంధరత్నావళి మూలమున సాహిత్య చరిత్రకారులకు తెలియ వచ్చిన నూతనవిషయము లెన్నో కలవు. ఇంతకు పూర్వము పండితలోకమునకు తెలియనికవులు కొందఱు తెలియవచ్చినారు. పూర్వకవులు రచించిన గ్రంథాంతరములు కొన్ని తెలియ వచ్చినవి. ప్రబంధరత్నావళిలో పేర్కొన బడిన కవీశ్వరు లనేకులు ప్రాయికముగా శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులుగారి కవుల చరిత్రము ప్రథమభాగమునఁ జేరదగినవారు. ఇంతవఱకు నాంధ్రభాషలో కవిజనాశ్రయము తప్ప జైనప్రసక్త మగుగ్రంథము కానరాలేదు. సోదరభాష లగుద్రవిడకర్ణాటభాషలలో జైనగ్రంథము లనేకము లున్నవి. ప్రబంధ రత్నావళిలో జినేంద్రపురాణ మనియు, నాచి పురాణ మనియు రెండు జైనప్రబంధము లుదా హరింపబడినవి. కాని యిందు వానిలోని పద్యము లెక్కువగా నుదాహరింపబడక

పోవుట శోచనీయము. ఉన్న పద్యములలోని రచనమునుబట్టి, వాని యాథార్థ్యమును నిశ్చయించుటకు వీలు కాకున్నది.

ప్రబంధరత్నావళి తరువాతి భాషాపరిశోధకులకు ఎట్లు మార్గదర్శకమై కనువిప్పు కలిగించినదో యించుక వివరిస్తాను. అధర్వణాచార్యుల భారతమునుండి యిందులో నాలుగు పద్యము లుదాహరింపబడినవి. అప్పకవీయము మొదలగు లక్షణగ్రంథములలోకూడ నధర్వణాచార్యుల భారతమునుండి కొన్నిపద్యము లుదాహరింపబడినవి. ఈ పద్యముల సహాయమున నధర్వణాచార్యులు భారతములో నెంతవఱకు రచించె నన్నవిషయము తెలిసికొనుటకు భావిపరిశోధకులకు వీలయినది. ఉపలభ్యమానము లగుచున్న యధర్వణభారతములోని పద్యముల నెల్ల నొకచోటచేర్చి వానిబట్టి కొన్ని నిర్ణయములు చేయుచు నేను భారతితో నొకవ్యాసము వ్రాసితిని.

తాళ్లపాక అన్నమయ్య తిరువేంకటేశ్వర శతకములోని దని యొక్క పద్యముమాత్రమే యిం దుదాహరింపబడినది. కాని రాగిరేకులలో భద్రపరుపబడిన తాళ్లపాక సంకీర్తనములతో బాటు అన్నమయ్య వేంకటేశ్వర శతకము కూడ నిప్పుడు నూతనముగా చేపడినది. అది యిటీవలనే వావిళ్లవారిచే ప్రకటింపబడినది కూడ.

ఇందు అప్పన 'చారుచర్య'నుండి మూడు పద్యము లుదాహరింపబడినవి. ఇది భోజమహారాజుచే సంస్కృతమున రచియింపబడిన 'చారుచర్య'కు తెనుగేమో తెలియదు. అప్పన యేనాటివాడో సరిగా తెలియరాదు. ముక్త్యాల ప్రభువుల ప్రోత్సాహమున శ్రీ ప్రభాకరశాస్త్రిగారు దీనిని పరిష్కరించి ప్రకటించినారు. ఇటీవల దీనినికూడ వావిళ్లవారు ప్రకటించినారు.

ఇందులో రావిపాటి త్రిపురాంతకుని 'ఉదాహరణము'లోని యొకపద్యము మాత్రము పేర్కొనబడినది. కాని తరువాత శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు 'త్రిపురాంతకోదాహరణము'ను పూర్తిగా తెలుగులోకమున కందించినారు. నిడుదవోలు వెంకటరావుగారు దానికి విపులమైనపీఠికను వెలయించుట మాత్రమే కాక యాంధ్రవాఙ్మయములోని యుదాహరణ గ్రంథముల చరిత్రము నంతను గూడ పరిశోధించుట కిది కారణభూత మయినది. ఇందు పేర్కొనబడిన త్రిపురాంతకుని యితర గ్రంథములు 'అంబికాశతకము,' 'చంద్రతారావళి,' అనునవి. త్రిపురాంతకునిగూర్చి క్రొత్తగా కొన్నివిషయములను తెలిపినవి.

ఇందులో పేర్కొనబడిన దగ్గుబల్లి దుగ్గన నాసికేతోపాఖ్యానము ఆతరువాత పూర్తిగా ముద్రణభాగ్యం పొందినది. అతని శివకాంచీ మాహాత్మ్యము దొరకలేదు. అందలివని ప్రబంధరత్నావళిలో నుదాహరింపబడిన పద్యములు మనకు వెలలేని రత్నములు.

నన్నెచోడుని కళావిలాసము మనకు నూతనముగా తెలియవచ్చిన గ్రంథము. అందలి పద్యములు కొన్ని యిం దుదాహరింపబడినవి. తిక్కన విజయసేనము, నందిమల్లయ మదనసేనము కూడ నట్టివే.

రంగనాథునివిగా ప్రబంధరత్నావళిలో పేర్కొనబడిన మూడు పద్యములును చారిత్రకముగా మిక్కిలి విలువ యయినవి. రంగనాథుని నయనరగడ యను శివభక్తిదీపిక, నమశ్శివాయ రగడ యనునవి యిటీవలనే యుపలబ్ధము లయినవి. ప్రభాకరశాస్త్రిగారు వీని యాధారముననే 'రంగనాథుని శివకవిత్వము' అని యొక గొప్పవ్యాసమును వ్రాసినారు. తరువాత జరిగిన యింతగొప్ప పరిశోధనమునకును నిం దుదాహరింపబడిన పద్యములే మూల కారణము లనక తప్పదు.

తెనాలి రామలింగని విందు 'కందర్పకేతువిలాసము', 'హరిలీలావిలాసము' అను రెండు గ్రంథము లుదాహరింపబడినవి. అవి యింకను దొరకవలసి యున్నవి.

వల్లభరాయని వీధినాటకము తరువాత ముద్రిత మయినది. పిల్లలమఱ్ఱి పినవీరన 'పురుషార్థ సుధానిధి' ప్రబంధరత్నావళి మూలమున క్రొత్తగా తెలియవచ్చిన గ్రంథము. నూతనకవి సూరన ధనాభిరామ మిటీవల ముద్రిత మయినది. వావిళ్లవారు ప్రకటించిరి.

ఇది గాక గ్రంథనామము, గ్రంథకర్తృనామము కూడ తెలియనిపద్యము లెన్నో రసవత్తరము లయినవి ప్రబంధరత్నావళిలో కూర్పబడినవి. భావిపరిశోధకుల కవి పని కల్పింపగలవు.

# తొలితెలుగు విజ్ఞానసర్వస్వం

(సోమనాధసంచిక తరువాయి)

సప్తగ్రామములు :

షడ్జము, ఋషభము, గాంధారి, మధ్యమము, పంచమము, ధైవతము, నిషాదము.

శ్రుతులు :

సకళ, గూఢ, నిష్కళ, సంవృత, నావళి, మధుర, ఏకాక్షరి, భృంగి, జాతి, పరేంగిత, పూర్వవాస, రంజక, అలంకారిణిని, రేణుక, ప్రస్తవాసి, లలిత, స్వరవాసి, భాషాగ్ని, నర్తకి, నాపూర్ణ, ప్రచ్ఛన్న, సర్వవ్యాపి.

గమకములు :

దీర్ఘ, లాలిత, దీర్ఘిక, ఆదీర్ఘ, దీర్ఘోల్లసితము, దీర్ఘకంపితము, ఉల్లసితము, సమోల్లసితము, ఉల్లాసితము, ఉచ్చరితము, మూర్ధ్నిక్షిప్తము, కోమలము, అక్షిప్తము, భ్రమితము, లలితోత్తమము, లలిత, ప్రస్తుతము, గుంఫితము, సూక్ష్మాంతము, కుంచితము, కరస్థితము.

ప్రత్యేకగమకములు :

కంపితము, స్ఫురితము, లీనము, త్రిభిన్నోత్తర, సప్తధా, ఆందోళితాహతము, సూక్తకలనము.

రాగములు :

శ్రీరాగము, ఆందోళి, చిత్రాంగి, లలిత, సౌర, గౌళి, శంకరాభరణ, గాంధారి, మధ్యమగాంధారి, రక్తగాంధారి, పంచమగాంధారి, దేవగుప్త, శ్రీకాళికగుప్త, గాంధారిగుప్త, కన్నడిక, దేశి, గుంభకము, ధన్నాసి, కాంభోది, దేశాక్షి, మధుకరి, దివిమేఘరంజి, రంగవరాళి, తరంగిణి, బహుళి, బంగాళము, ఆహురి, బ్రహ్మణి, శుద్ధవాహిని, బృహతి, దేవప్రియ, రూప, సోహరి, సైంధవి, శుద్ధవరాళి, సౌరాష్ట్రసైంధవి, పౌరాణి, భిన్నపౌరాణి, ఉత్పలి, పదపంజరము, నాగవరాళి, కర్ణాటవరాళి, నాగదివికురంజి, నాట, త్రినేత్రి, మాళవగౌళ, రామక్రియ, సాయగౌళ, ద్రావిళగౌళ, కర్ణాటగౌళ, సౌరాష్ట్రగౌళ, దేసాళగౌళ, భైరవి, సారంగభైరవి, మదయంతి, నాదోత్తరి, అన్యసైంధవి, వసంత, మేఘచ్ఛవి, సౌందరి, ఠక్కరాగము, ఛాహారి, రక్కసి, సోమరాగము, అసారవరాళి, భల్లాతకాళింది, ధైవతి, ఘంటారవము, వ్యాళింది, దేశాళి, అభ్రపంచమము, గంధికామోది, శ్రీకంఠ, కాంభోజి, సింధువరాళి, కౌశికి, పూర్ణ, నాట, గుజ్జరి, సౌరాష్ట్రగుజ్జరి, ద్రవిళగుజ్జరి, మలహారి, కోలాహలము, మాళవి, గౌళిక, మధ్య, విభిన్న, సాళగనాట, భూపాళము, సాయ, తోడి, దివ్యావతి, తుండక్రియ, నటనారాయణి, ఋషభి, నర్తకి, శుద్ధహీర, కైతకి, వ్యభిచారి, కర్మారి, వేళావుళి, చిత్రవేళావుళి, మాళవ, శ్రీమధుమావతి.

నారాటకావుళ ధ్వనులు :

బంబళనారాట, మిశ్ర, కావుళ, ధ్వని.

సరివాచకములు :

జయ, ఉజ్జయ.

అనువాచకములు :

హాయి, సుహాయి, గాణాయి, గూఢాయి, గాఢాయి, వాయి, దేణాయి, బహుళాయి, బడియాయి, నిబిడాయి, బొక్షుయి, దిక్షాయి.

జయపంచకము :

షట్స్వాదు, సప్తస్వాదు, అష్టావళి, నవస్వాదు, సరసమాయాయి.

జయత్రయము :

దేహావళి, మదావళి, కంఠావళి.

తిరువులు :

విజయస్థానకము, వళిగ, అంతరము, ఉప్పరవట్టు, మంధరణ, వాళ, సర్వగత, భంగాస్థానము, గమళాయి, నాభిగతి, ఉదరగతి, కంఠగతి.

వహణులు :

దేహనాభికక్షోదరకంఠ జాతములు, వరిహారి సక్కట, సరివాగవహణి, కంఠికాపాళివహణి, ఉన్కుటము, ముగువ, సైతము.

విశుద్ధతాయములు :

లలిత, గాఢ, గాఢలలిత, బొచ్చలలిత,

సేవళ, లవులంగితము, గహగుహకము, బొచ్చగాథ, వివరణ, మహిమది, గమకముది, కంపితము, వివళ, గాణాయిలము, ఇంపు, గోష్ఠాగోష్ఠి, నుంపు, దీనకాకు, పెల్లాపెల్లి, కల్లి' స్వభావకాకు, కొంకు, కంపితము, అణుకు' దరహరము, అనుతాయి, ఓజి, సంది, పేటాపేటి, సరిబరసము, మొట్టాయితము.

సాళగతాళగతులు :

నెవణ, సుత్తి, పూరణ, రంగు, సోమరక్త, జీగి, గమళ, కంపితము, ఆలాడము, ఆనైకము, సమణ, ఘోట్టాయి, గవణ, నావాళ, వ్యక్తి, ప్రబంధము, అలంకూళి, నిహతంబు, ఉభయశాళాసము, తాహుత్తర, భజవణి.

ఆళతులు :

నాగావతి, నందావతి, వరభద్రావతి, వినయావతి, చరభోగావతి, ఇంద్రావతి.

నాట్యభేదములు :

అంగరాగము, గీతాంగరేఖ, రంగశోభ, ముఖరాగము, తతము, వితతము, నిలయము, విగతి, అంసగతి, ఆవర్తన, గ్రహగతి, లవణి, దేసికారతసభాధీరధి, కళాసము, సాక్కి, సళావళి, భ్రమరి, అవధానము, సంధ, వ్యవసాయము, నిజవణి, లంఘితము, తాళము, అభినయోపతాపన, సుతాళము, ప్రసన్నత, వివర్తనము, పయవాటము, లలితవస, కనిష్ఠక, అప్పణము, బళ, గోమళిక, ఉల్లాసము, లలిమనోహరము, డిల్లాయి, దుత్తాణి, శేవణి, జంకె, డాలము, రవళి, సౌష్ఠవము, విభ్రమము, చాళి, ఒయ్యారము, సరసము.

చతుర్విధ వక్త్రవిభ్రమము, సప్తవిధ భ్రూలతానటనము, షడ్వింశతిక్రమ చక్షురంకితము, షడ్విధనాసాలసత్కుంచితము, దశవిధ కర్ణావధానము, నవవిధ గళముఖోల్లసనము, త్రివిధవక్షోవిలాసము, పాదద్వయపంచకము, ఊరుద్వయకలితపంచకము.

సుగతి, సమభంగి త్రిభంగి మొదలగు వింశతి అంగహారములు, ఇరువదిరెండు తానకములు, ఛత్తీసుదృష్టు, చౌషష్టిహస్తములు, బత్తీసుచారులు, ఏడుభ్రమరులు, కరణములు అష్టోత్తరశతము, నూఱు అలంకారములు, పదమూడు శిరోభేదములు, ముప్పదిరెండు దండనములు.

గతులు :

హంసగతి, మాతంగగతి, వృషభగతి, మర్కటగతి, మేషగతి, మాయూరగతి, భోగిగతి.

మానార్థకములు :

త్రేలెడు, నల్లెడు, చుట్టెడు, జేనెడు, మూరెడు, చేతెడు, బారెడు, కూగెడు, పాటెడు, ఆమట.

ఏకాదశ తీర్థములు :

గుప్తమాహేశ్వరము, చరుకేశ్వరము, సంధ్య, సమాధి, గరుడేశ్వరము, కాలహ్రదేశ్వరము, పాపవినాశనము, గణేశ్వరము, దేవహ్రదేశ్వరము, సిద్ధేశ్వరము, నీలహ్రదము.

తీర్థములు :

రామేశ్వరము, ఉమామహేశ్వరము, సంగమేశ్వరము, చరమేశ్వరము, అచలేశ్వరము, తిలేశ్వరము, సిద్ధముక్తీశ్వరము, గౌతమేశ్వరము.

పర్వతములు :

వేదపర్వతము, శ్వేతాద్రి, నీలమేదినీధరము, అశ్వమేధ శిలోచ్చయము, లింగశృంగము, కన్యానగము, ఉమాగిరి, కనకనగము, కుండశిఖరి.

కుండములు :

రామకుండము, భీమకుండము, ప్రయాగకుండము, వేదకుండము, తిలకుండము, నీలకుండము, పిశాచకుండము, గౌరికుండము, రసకుండము.

నంది భేదములు :

ప్రమథనంది, ఆకాశనంది, కృష్ణనంది, బ్రహ్మనంది, సోమనంది, మహానంది, గరుడనంది, భగవతీనంది, భీమనంది, పినాకనంది, నాగనంది, శివనంది, శ్వేతనంది, భైరవనంది, గ్రామనంది, ఏకనంది, గౌరినంది, ముక్తినంది, ఇంద్రనంది.

ఈశ్వరములు: ఏకాదశనవ్యతీర్థములు:

మోక్షేశ్వరము, భుజంగేశ్వరము, నారదేశ్వరము, బ్రహ్మేశ్వరము, రాజరాజేశ్వరము, నగ్నేశ్వరము, భోగీశ్వరము, సోమేశ్వరము, కలకలేశ్వరము.

శ్రీశైలతీర్థములు :

బ్రహ్మేశ్వరము, బలభద్రేశ్వరము, కమఠీ

శ్వరము, పాపవినాశనము, యాగేశ్వరము, అగస్త్యేశ్వరము, నాగేశ్వరము, సప్తకోటీశ్వరము, వక్కంటేశ్వరము, అశ్వమేధేశ్వరము, లకులేశ్వరము, శ్రీరామేశ్వరము, లక్ష్మణేశ్వరము, ధవళేశ్వరము, ధర్మేశ్వరము, విమలేశ్వరము, ఇంద్రేశ్వరము, కర్ణేశ్వరము, వ్యాసేశ్వరము, వరుణేశ్వరము, మలత్రయేశ్వరము, ఉత్తరేశ్వరము, అనలేశ్వరము, ఏలేశ్వరము, సకలేశ్వరము, కనకేశ్వరము, సిద్ధేశ్వరము.

జంగమకోట్లు :

సంబువులు, పసిండిగొడుగులు, సావలు—పావలు—లోహపుపావలు, దంతపుపావలు, రాగి పావలు, వాగెల పాదరక్షలు, చందనకావులు, సరిసాటికావులు, కఱకంచుకావులు, వలిపొత్తిపచ్చడములు, కౌపీనములు, గూడకట్టులు, వెలిబేరెములు, కళుకులు, జోడుకుప్పసములు, పట్టుత్రాళ్లు, ప్రాంతపట్టువస్త్రములు, పట్టుతొంగళ్లు, పట్టువీణెలు చందురుకావి పల్చని వల్వడోల్లు.

కావిపచ్చడములు, కావిదుప్పట్లు, తావుమంజిళ్లు, ఖండంబుదోంపులు, చల్లడాలు, దట్టిపచ్చడములు, రత్నకంబళులు, వెలిపొత్తి పచ్చడములు, బూరవడములు, పట్టుపచ్చడములు, వెలిపట్టుపైంబెట్లు.

మకుటములు :

ఉప్పరమునందుల పటికవలయము, రుద్రాక్షవలయములు, మీద కలశములు, కంచుగుబ్బలు, కెలకులయందు చంద్రసూర్యులుకల చీరమకుటములు, కంబళిమకుటములు, నందిమకుటములు, పులితోలుమకుటములు, కంచిమకుటములు, రుద్రాక్షమకుటములు, రాగిమకుటములు, నవరత్నమకుటములు, సోగతప్పరములు, బోడతప్పరములు, గొప్పుతప్పరములు.

కుండలములు :

స్ఫటికకుండలములు, రుద్రాక్షకుండలములు, మణికుండలములు, హేమకుండలములు, రజతకుండలములు, రాగికుండలములు, నందికుండలములు, నాగకుండలములు.

బెత్తములు :

వన్నెబెత్తములు, వలిబెత్తములు, వలయపుబెత్తములు, మలకబెత్తములు, కక్కబెత్తములు, వాదిబెత్తములు, ఖర్జురపొంజాయబెత్తములు, సైరంగోలలు, సందనములు, గైరంబులాకులు, కనుపదండములు, అనసులకోలలు, అనసుల మొగడలు, అనసుల సందుల జనులు, ఆకులములు, జలపోసనములు, కలశములు, పట్టుంగుచ్చులు, చిత్తరువులు, వెలిగొడుగులు, ఫీలిగొడుగులు, ముత్యాల గొడుగులు, వెలిపట్టుగొడుగులు, మొద్దుగొడుగులు.

ఆభరణములు :

రాగి కుండలములు, రాగి నందులు, రాగి నూలులు, రాగి కంటెలు, రాగి యుంగరములు, రాగి దండలు, రాగి జన్నిదములు, రాగి యుత్తెరలు, కొక్కెరలు, పాలెలు, సరిపెణలు, నేవళములు, కీలుకొలుకులు, రాగికీర్తిముఖములు, అందెలు, రాగి కటకములు, రాగి పదకములు, రాగి ఒడ్డియాణములు, కటిసూత్రములు.

వృద్ధతపోధనుల వేషము :

సగముఅట్టలు విడిసినపాత్రలగు గూడచెప్పుటట్టలు, కట్టినగుడ్డల గోర్పడములు, అడ్డప్రాత కచ్చడములు, చింపిగొడుగులు, ఊతగోలలు. మిండజంగముల వేషము - శీలవంతుల వేషము- పుణ్యాంగనల నడకలు- జోగుల నడకలు_ పిచ్చుకగుంటుల నడకలు- చెంచుధర్మాత్ముల వేషము.

నీరు నింపుపాత్రవిశేషములు :

ఉత్తిలములు, పోకపొత్తులు, గల్లతిత్తులు, రాగిబిందెలు, పేరుపులు, కుండలు, కలంతులు, గుళ్ళగోరలు, గిండులు, కమండలములు, గరిగలు, బటువులు, కావళ్లు, గూడగర తిత్తులు.

పత్తిరులు :

దేవగందలి, దవనము, రుద్రజడ, మరువము, అఖండబిల్వపత్తిరి, ఆవురుపత్తిరి, మాచిపత్తిరి, నేరేడుపత్తిరి, జమ్మిపత్తిరి, కాంచనపత్తిరి, పచ్చపత్తిరి, మారేడు పత్తిరి, వెలగ పత్తిరి, వావిలి పత్తిరి, ఉమ్మెత్త పత్తిరి, గన్నేరు పత్తిరి, నెల్లిపత్తిరి, సంపెంగపత్తిరి, మునిడి పత్తిరి, సోమిందపత్తిరి.

పుష్పములు :

గోగు, గేదంగి, మల్లె, చేవంతి, మొల్ల, కరవీర, తుమ్మి, జిల్లేడు, రేల, గురివింద, పొన్న, విరవాది, మొలక, ప్రాకుడు, జాది, తామర, కలువ, కింశుక, సురగి, ఉమ్మెత్త, క్రోవి, గుమ్మడు, కలిమి, తంగేడు, ముళగు,

కాంచన, గంటె, మారేడు, మంగ, గోరింట, కొమ్మి, చెంగల్వ, వెలగ.

పండ్లు :

రేను, మామిడి, ఈడె, నేరేడు, మొరలి, ఖర్జూరము, పరికె, హింతాలము, జీడి, చిడిముడి, జాన, దానిమ్మ, మేడి, చిఱునెల్లి, మొలుగు, మారేడు, బలుసు, చిరివింద, తుమికి, నారంగము, అనటి, గజనిమ్మ, కలివె,గుమ్మడి, వెలగ, కలుజువ్వి, ద్రాక్ష, మాదిఫలము, రావి, న్యగ్రోధము, వేప, గొడపుడు, బుడమ, జంబీరము, పనస, పులుపురు, పాల, బలివిలి, అరిగి.

అడవి దినుసులు :

వెల్లంకి, రేమిడి, కలివె, మామిడి, చిగురు నిప్పపువ్వులు, తేనెలు.

గుడారములు :

గూడచప్పరములు, గుడిసెలు, గూళ్లు, గూడారములు, తెరలు, గొల్లెనలు.

పరుసలు :

ఆంధ్రదేశము పరుస, కన్నడ పరుస, ఆరె పరుస, అరవదేశము పరుస, గీర్వాణభాష పరుస.

పలుకుబళ్లు :

జలబుద్బుదములు, శారదాభ్రములు, జలతరంగములు, ఇంద్రచాపములు, నిట్టపాటలు, బయలిదీపములు, బాలకులమాటలు, పీలికామార్గములు, ఎండమావులు, మొయిలుల మహిమలు, మెఱుగుదీవెలు, గతాగత ద్విరదకర్ణములు, వానవఱ్ఱులు, నీటవ్రాతలు.

లింగములు :

మణి లింగములు, రత్నమయ లింగములు, స్వర్ణలింగములు, రజతలింగములు, తామ్రలింగములు, కాంస్యలింగములు, లోహలింగములు, చంద్రకాంత లింగములు, సూర్యకాంత లింగములు, అయస్కాంత లింగములు, అమృత లింగములు, స్వయంభు లింగములు.

పర్వతములు :

కైలాసము, శుక్తిమంతము, గౌరీతుషారము, నీలము, మైనాకము, మాణిక్యము, మహేంద్రము, సైంధవము, కల్యాణము, సారంగము, గుహ్యము, గంధమాదనము, కింశుకము, శ్వేతము, మాల్యవంతము, విశాలోదయము, వర్ధమానము, హిమవంతము, విద్యుత్తు, అస్తము, ప్రవాళము, సువేలము, సోమము, నైమేషము, కుసుమము, చిత్రకూటము, హేమకూటము, క్రౌంచము, సీమము, ఇంద్రకీలము, హారితము, పూర్వము, సంధ్య, ఋశ్యమూకము, వైరోచనము, నిషధము, వజ్రము, అభ్రము, తామ్రము, మలయగోహణము, వింధ్యము, మానసోత్తరము, వకులము, రౌప్యము, కేసరము, గోవర్ధనము, శతమేరువు, కుంజరము, వృషము, మేచకము, శృంగము, పారియాత్రము.

నదులు :

గంగ, భాగీరథిగంగ, పాతాళగంగ, భీమరథి, సౌగంధిక, విరజ, కౌశికి, గాంధారి, కావేరి, అసి, విపాళ, వరుణ, తుంగభద్ర, ప్రయాగ, నంద, సరస్వతి, నర్మద, యమున, మందాకిని, గయ, గోమతి, తామ్రపర్ణి, స్రోత, వేత్రావతి, సోమప్రభాస, వైతరణి, తమస, వంజర, సరయు, వేగవతి, సురస, విశ్రుతి, చంద్రభాగ, మహాభాగ, వాసవి, చిత్ర, పంచనది, గాయత్రి, ఉత్సాహ, విమల, వేత్రవతి, విమలాభ్ర, కనకశోణ, వేదవతి, శుక్లప్రభాస, వేణి, పుష్కర, కృష్ణవేణి, మలాపహారి, గోదావరి.

పూవులు మఱికొన్ని :

బొడ్డుమల్లియలు, కుందములు, చేవంతులు, నాగకేసరములు, పున్నాగములు, పొగడ పూవులు. (సశేషము)

# శ్రీనాథుని శివభక్తి

—:o:—

కవిసార్వభౌముడైన శ్రీనాథుడి పేరు వినని వారు ఎవరూ వుండరు. తెలుగుకవులలో అతనివలె దేశాటనం చేసినవాడూ, రాజసన్మానాలు పొందినవాడూ, ప్రత్యర్థిపండితులగుండె బెదురుగా కవితచెప్పి వారి విజయఢక్కలను పగులగొట్టినవాడూ అయిన కవి మరొకడు లేడనడంలో అతిశయోక్తి ఎంత మాత్రము లేదు. శ్రీనాథుడు తన దేశపర్యటన సందర్భంలో ఎన్నో అనుభూతులనూ, అనుభవాలనూ, జీవితంలోని ఎత్తుపల్లాలనూ, పట్నవాసపు వైభవాన్నీ, పల్లెటూరి మురుగు కంపునూ సమానంగా సందర్శించినాడు. ఆయా సందర్భాలలో అతడు తాను చూచిన కొన్ని దృశ్యాలను తాను కవి కనక వూరుకొని వుండలేక వుబుసుపోకకై ఆశువుగా ఎన్నో చాటుపద్యాలను చెప్పినాడు. ఆ చాటుపద్యాలనూ, వాటిలోని శృంగారాన్ని మాత్రమే చూచి అనేకులు శ్రీనాథుని భోగలాలసు డనీ, విషయలోలు డనీ, శృంగారప్రియు డనీ ఒకతప్పు అభిప్రాయం కలిగి వున్నారు. కానీ, నిజానికి శ్రీనాథుడు అలాంటివ్యక్తి కాడు. ఆయన రచించినగ్రంథములనూ, వాటిలో ఆయన ప్రతిపాదించిన శివభక్తి మహిమనూ చదివినవా ళ్లెవరూ శ్రీనాథుడి విషయంలో అలాంటి దురభిప్రాయం కలిగి వుండరు.

శ్రీనాథుడు మరుత్తరాట్చరిత్ర మొదలుగా ఎన్నో ప్రబంధాలను రచించినా, వాటిలో మతం దృష్టితో మనం చూచినప్పుడు హరవిలాసమూ, కాశీఖండమూ, భీమఖండమూ, శివరాత్రి మాహాత్మ్యమూ అనే గ్రంథాలు పేర్కొనదగి యున్నవి. వీటి అన్నిటియందూ శివభక్తి మహిమా, శివక్షేత్ర ప్రభావమూ అనే రెండుతత్త్వాలు ముఖ్యంగా ప్రతిపాదింపబడినవి.

ఆయన రచించినహరవిలాసము పరమేశ్వరుని పంచవింశతి—అనగా ఇరవై అయిదు—లీలలలోకొన్నిటిని మనోహరంగా వివరిస్తున్నది. ఇందులో చిఱుతొండనంబికథ, మన్మథదహనము, గౌరీకల్యాణము, దారుకావనవిహారము, గరళధారణము, కిరాతార్జునీయము అన్న కథలు—శివలీలలకు సంబంధించినవి—రచింపబడినవి. హరుడు అనగా పరమేశ్వరుడు-అతని యొక్క విలాసములనుగూర్చి తెలిపే గ్రంథం కావడంచేతనే దీనికి శ్రీనాథుడు హరవిలాసం అని పేరు పెట్టినాడు. ఇది ఏ సంస్కృత కావ్యమునకూ తెలుగులోకి అనువాదం చేసిన గ్రంథం కాదు. ఇది ఒక స్వతంత్ర ప్రబంధం. శివలీలలకు సంబంధించిన స్వతంత్రప్రబంధమును శ్రీనాథుడు రచింప దలచడంలోనే అతడి వుద్దేశం ఎలాంటిదో మనకు స్పష్టం అవుతుంది.

శ్రీనాథుడు అవిరళ శివభక్తి తత్పరుడు. షట్కాల శివపూజా ధురంధరుడు. అనగా ప్రతిదినమునూ ఆరుకాలములయందు మహాభక్తి తత్పరుడై శివపూజ చేసేవాడు అన్నమాట. హరవిలాసములో కడపటి దైనకిరాతార్జునీయ కథలో ఒకచోట శ్రీనాథుడు షట్కాల శివపూజావిధానమును వివరముగా తెలిపినాడు. అర్జునుడు తమకు శత్రువు లైనకౌరవులను జయింపదలచి పరమేశ్వరునిదగ్గర పాశుపతాస్త్రం మొదలైన దివ్యాస్త్రములను పొందదలచినవాడై యింద్రకీలపర్వతముమీద ఘోర మైనతపస్సు చేసినాడు. అతని తపస్సు వర్ణించే సందర్భంలో శ్రీనాథుడు తనకు అలవాటైన, తాను నిత్యమూ చేస్తున్న షట్కాల శివపూజనే అర్జునుడూ చేసినట్లు వర్ణించినాడు-అరుణోదయము, తపనోదయము అనగా సూర్యోదయము, సంగవకాలము, మధ్యాహ్నము, సాయంకాలము, అర్ధరాత్రము అనునవి శివపూజ చేయువలసిన షట్కాలములు. అర్జునుడి తపశ్చర్యలో యీ పూజావివరములను శ్రీనాథుడు మనకు తెలిపినాడు.

అర్జునుడు అరుణోదయకాలములో బూడిద పడకమీదనుండి లేచి, చేత రుద్రాక్షలను ధరించి, తన పర్ణశాలలోనే అరుణోదయపూజ జరుపుతుండేవాడు. అతరువాత అతడు ఇంద్రకీలపర్వతముమీది సెలయేళ్లకు పోయి అక్కడ

స్నానము మొదలయిన కాలకృత్యములు తీర్చుకొని వచ్చి ఆతరువాత పరమశివుడికి షోడశోపచారములతో సూర్యోదయకాలమునందు పూజ చేసేవాడు. సంగవకాలములో అతడు పన్నీరు, కర్పూరము, కస్తూరి, అగురు, చందనము మొదలయిన పరిమళద్రవ్యములనూ, పూవులనూ, అగురుమొదలయినధూపములనూ, సమర్పించి పూజ చేసేవాడు. పిదప మధ్యాహ్నకాలములో మహానిష్ఠతో బీజసహితముగా పంచాక్షరీ మంత్రము—అనగా * నమశ్శివాయ అనే మంత్రమును- జపించేవాడు. సాయంకాలమునందు ఇంద్రకీల పర్వతము మీది మారేడు చెట్టునీడలో పాషాణప్రదేశంమీద పులితోలు పరుచుకొని దానిపై పద్మాసనం వేసి కూర్చుండి సంధ్యానటునిగూర్చి భక్తితో పూజ జరిపినాడు. అర్ధరాత్రములో కొండ గుహలకు పోయి అక్కడ కొండగోగులు,గుండవర్ధనములు మొదలయిన పుష్పములతో పూజ చేసి తిరిగి పర్ణశాల చేరుకునేవాడు.

అర్జునుడు చేసినట్టుగా చెప్పబడిన యీ షట్కాలశివపూజ శ్రీనాథునికి కూడా ఎంతో ప్రీతిపాత్ర మయిన దనీ, అందుచేతనే అతడు అంత అభిమానముతో—వివరములతో సహా- దానిని వర్ణించినా డనీ మనము నమ్మవచ్చు.

హరవిలాసములో వర్ణింపబడిన శివలీలల కన్నింటికంటే గూడా చిరుతొండనంబికథ చాలా హృదయంగమ మయినది. మనోహర మయినది. ఈ చిరుతొండనంబి అరువతు మూవురు నాయనార్లు అని పేర్కొనబడే అరువదిముగురు శివభక్తులలో ఒకడు. అతని యొక్కయూ, అతని కుటుంబముయొక్కయూ శివభక్తితత్పరత యెలాంటిదో మనకు యీ కథలో తెలియగలదు. ఆ కథ వినండి.

పూర్వం కాంచీనగరంలో చిరుతొండనంబి అని ఒక వైశ్యుడు ఉండేవాడు. అతడు గొప్ప శివభక్తుడు. అతని భార్య తిరువెంగనాంచి, సిరియాలుడు వారి కుమారుడు. వారు శివపూజలు జరుపుతూ జంగమారాధనలు చేస్తూ కాలం గడుపుతుండగా, ఒకనాడు ఒక మిండ జంగం వారియింటికి వచ్చినాడు. చిరుతొండనంబి అతనిని ఆహ్వానించి అనేకవిధములుగా సత్కరించినాడు. అంత ఆ మిండజంగము చిరుతొండనంబిని దీవించి...శివుని అభిషేకమునకై ఒక తూమెడు చెరుకురసం మాకు సమర్పించ వలసినది...అని కోరినాడు. జంగములు ఏది కోరినా, ఏవేళ ఏ పదార్థం వేడినా లేదనకుండా యివ్వడమే చిరుతొండనంబి వ్రతం కావడంచేత, అల్లే అని ఒప్పుకుని చెరుకుగడలు తేవడంకోసం అతడు బయలుదేర పోయినాడు.

తూమెడు రసమునకు నూరు చెరుకుగడలు చాలు నని తలచి ఒకచోట ఆ నూరుగడలనూ కొని మోపుకట్టి అతడు నెత్తిమీదికి ఎత్తుకొనబోయినాడు. కాని అది ఎక్కువ బరువవడం మూలాన దా నెత్తలేక కిందపడుతూ తంటాలు పడుతుండగా చూచి శివుడే ఒక వైపు ఆ మోపును బట్టి చిరుతొండనంబికి సహాయం చేసినాడు. చిరుతొండనంబి మోపు క్రింద పడవేసి చూచేసరికి శివుడు లేడు. అతడు చాలా ఆశ్చర్యపడి శివుడే తనకు సహాయం చేసినా డని తెలుసుకుని చేతియంత్రంతో చెరుకు గానుగాడి మిండజంగం కోరిన తూమెడు రసమూ సమర్పించి ధన్యు డయినాడు. ఈ సందర్భంలో చెరుకు మోపు మోయడంచేత కైలాసంలో పార్వతితో వినోదిస్తున్న శివుడి ముఖం చెమట పట్టింది. అది చూచి పార్వతి అసూయతో తనచేతిలోని లీలాకమల మెత్తి కొట్టగా ఆ పుప్పొడి పడి పరమేశ్వరుడి కన్నుల్లోనుండి కన్నీరు కారడం మొదలెట్టింది. అప్పుడు శివుడు తనముఖం చెమర్చడానికి కారణం ఫలానా అని తెలపగా, పార్వతి ఆశ్చర్యపడి నాకు ఆ వీరమాహేశ్వరుని చూడవలె నని యున్నది. కనుక నన్ను కంచికి తీసుకొని పొండి అని ప్రార్థించింది. పరమేశ్వరుడు వెంటనే తనదగ్గర నున్న యింద్రుణ్ణి పిలిచి కంచిలో మూడువారములపాటు కుంభవర్షం కురిపించవలసింది. మా కొక రహస్య కార్య మున్నది...అని ఆజ్ఞాపించినాడు. వెంటనే దేవేంద్రుడు మేఘములను పంపి కుంభవృష్టి కురిపించినాడు. ఇరవై ఒక్కదినములపాటు వర్షం కురిసి కంచి తెప్పలలో తేలింది. ఇరవై రెండవదినం కొంత వర్షం వెలిసింది. ఆ ముసురు పట్టిన రోజులలో చిరుతొండనంబి అర్థులకూ, జంగములకూ ఎవ రేది కోరినా యిస్తూ తృప్తి పరుస్తుండేవాడు. ఎప్పుడూ తన పంక్తిలో అథమపక్షం ఒక్క

డైనా మిండజంగం లేనిదే భుజించ నని చిరుతొండనంబి వ్రతం. వర్షం వెలిసిన మరురోజు మధ్యాహ్న శివపూజ నిర్వర్తించి బయటికి వచ్చి చూచేసరికి అక్కడ తనయింటి పంచలో అతనికి శివయోగు లెవరూ కానరాలేదు. ఊరి లోపలికి వెళ్లి ఎవరైనా శివయోగులు కనబడితే పిలుచుకొని వస్తా నని చెప్పి చిరుతొండనంబి బయలుదేరి ఊరంతా వెతికాడు. వీధి వీధులూ గాలించినాడు. కాని ఎక్కడా, ఆయనకు శివభక్తులు కనబడలేదు - తుదకు ఊరిబయట ఒక పాడుపడిన గుడిలో ఒక ముసలిజంగం, అతనిభార్యా వుండడం చూచి, వారిని తన యింటికి వచ్చి ఆతిథ్యం స్వీకరించవలసిం దని కోరారు. ఆ మిండజంగం చిరుతొండనంబి పుట్టుపూర్వోత్తరాలు విచారించి తా నొక సంవత్సరంగా ఒక వ్రతం చేస్తున్నా ననీ, దానికి వుద్యాపనగా పిన్నవయసువాడయిన నరపశువు కావలయు ననీ, ఆ యువకుని మాంసముతో వంట వండి అతనితలిదండ్రులు తనతో కూడా భుజించవలెననీ, యీ నియమానికి అంగీకరించి నప్పుడే తాను జంగమారాధనకు వస్తా ననీ చెప్పినాడు. చిరుతొండనంబి అలాగే అని ఒప్పుకొని విభూతి యిచ్చి వారిని తనయింటికి తెచ్చినాడు. ఇంతలో శివుడు మాయా బ్రాహ్మణవేషంతో పాఠశాలలో చదువు తుండిన సిరియాలుడి దగ్గరకు పోయి...నీతండ్రి నిన్ను ఎవడో మిండజంగం అడిగినా డని నీ మాంసంతో వంటకం వండిపెట్టబోతున్నాడు. అతడు నీకు తండ్రి గాడు. హంతకుడు. నా మాట విని ఎక్కడికైనా తప్పించుకొని పారిపో ...అని హెచ్చరించినాడు. కాని సిరియాలుడు బాలు డయినప్పటికీ గొప్ప శివభక్తి కలవాడు కావడంచేత ఆ మాటలకు అంగీకరించక తన మిండజంగం వ్రతోద్యాపన జరగడం తనకూ సంతోషమే నని చెప్పేసరికి ఆమాయాబ్రాహ్మణుడు అతనిని లొంగదీయడం సాధ్యం కాదని తలచి వెళ్లిపోయాడు. చిరుతొండనంబి పాఠశాలనుండి సిరియాలుని పిలిపించి అతని మాంసంతో వంటకము లన్నీ సిద్ధం చేశాడు. భోజనాని కని పంక్తిని కూర్చున్న మిండజంగం చుట్టూ కలయజూచి... నేను సంతానవంతులు కానివాళ్లయింటిలో భుజించను. కనక నీ కొడుకును పిలిపించు. అతడు కూడా వచ్చి భోజనం చేస్తే గాని నేను అన్నం ముట్టను... అని భీష్మించుకుని కూర్చున్నాడు. అప్పుడు చిరుతొండనంబి ఏమి చేయడానికీ తోచక తన భార్య అయిన తిరువెంగనాంచిని పిలిచి పాఠశాలలోనుండి సిరియాలుణ్ణి పిలుచుకొని రావల సిందిగా సెలవిచ్చినాడు. అంత తిరువెంగనాంచి తనపతి యనుమతితో—

సీ. రారా వణిగ్వంశవారాశిహిమధామ
రారా వికస్వరాంభోరుహాక్ష
రారా మహాఘోరవీరశైవాచార
రారా ఘనౌదార్యరాజరాజ
రారా కుమారకంఠీరవేంద్రకిశోర
రారా సమగ్రధీరాహిణేయ
రారా మనోహరాకారరూపవిలాస
రారా యసారసంసారదూర
రార నాచిన్నివడుగ రారా తనూజ
రార సిరియాల రారా నాప్రాణపదమ
రార నాకుట్టి నాజియ్య రార యనుచు:

పిలిచినది. అలా పిలవగానే సిరియాలుడు మహావేగంతో వచ్చి వారియెదుట నిలచినాడు. పిదప పరమేశ్వరుడు పార్వతితో కూడ ప్రత్యక్షమై చిరుతొండనంబియొక్కయూ, అతని కుటుంబముయొక్కయూ శివభక్తికి మెచ్చుకొని వారు నరజన్మ మెత్తడానికి కారణం తెలిపి యీ జన్మ ముగిసిన తరువాత తిరిగీ కైలాసమునకు వచ్చి మీ మీ స్థానములలోనుండి నన్ను గొలిచి సేవింతురు గాక...అని చెప్పి అంతర్ధానం చెందినాడు. ఈ చిరుతొండనంబికథలో చిరుతొండనంబియొక్కయూ, అతడి భార్యలయిన తిరువెంగనాంచియొక్కయూ శివభక్తికంటే కూడా చిన్న వయసులో వున్నవారి కుమారుడు సిరియాలుని శివభక్తి తత్పరత యెంత కఠినహృదయుల నైనా కరిగించి తీరగలదు.

హరవిలాసానికి తరవాత శ్రీనాథుడి గ్రంథాలలో ముఖ్యదృష్ట్యా పేర్కొనదగిన గ్రంథాలు కాశీఖండము, భీమఖండము. ఇవి రెండూ రెండు క్షేత్రమాహాత్మ్యములను వివరించే స్థలపురాణాలు. కాశీఖండం భారతదేశంలో ప్రసిద్ధయాత్రాస్థలమైన పుణ్యక్షేత్రమైన కాశీక్షేత్రముయొక్క మాహాత్మ్యమును తెలుపుతున్నది. ఇతని భీమఖండమునకే భీమేశ్వరపురాణ మని కూడ పేరు. ఇది ఆంధ్రదేశంలో

గోదావరీతీరంలోవున్న ద్రాక్షారామ మనే పంచారామక్షేత్రాలలో ఒకటైన శైవక్షేత్రానికి సంబంధించిన స్థలమాహాత్మ్యం తెలిపే గ్రంథం. భక్తులయినవారు తమ భగవద్భక్తిని అనేకవిధములుగా, అనేకమార్గములలో ప్రకటించుకొనవచ్చును. జపము, ధ్యానము, భజన, గానము, తపస్సు మొదలయిన మార్గముల మూలముననే కాక భగవంతుడు వెలిసినట్లు చెప్పబడే పుణ్యక్షేత్రాలకు యాత్ర పోయి అక్కడ ఆ పుణ్యక్షేత్రంలో వెలసిన భగవంతుణ్ణి సందర్శించి అక్కడి పుణ్యతీర్థాలలో, నదీజలాలలో స్నానం చేసి పాపములనుండి విముక్తి పొందవచ్చునన్న విషయమును యీరెండు గ్రంథములూ చాటుచున్నవి. ఎంత దుర్మార్గుడైనా, జీవితంలో ఎన్ని పాపకార్యాలుచేసినా, అవసానకాలంలో ఏ పుణ్యక్షేత్రంలో నయినా తనువు చాలిస్తే తానుచేసిన పాపాలకు ఫలితంగా అతడు నరకలోకబాధను అనుభవించడు సరిగదా దేవదూతలచేత సగౌరవంగా విమానంలో స్వర్గానికే సరాసరిగా తీసుకొనిపోబడతాడు అన్న విషయం యీ స్థలమాహాత్మ్యములలో కవి ప్రతిపాదించిన విషయం. ఆ గ్రంథములను చదివినవారికి ఆ క్షేత్రముయొక్క గొప్పతనం తెలియజేయడమే శ్రీనాథునియొక్క వుద్దేశం. కాశీఖండంలో గుణనిధి కథ అని ఒక కథ వున్నది. ఆ కథ యీ సత్యమునే చాటుచున్నది. గుణనిధి పవిత్ర మయిన బ్రాహ్మణ వంశంలో పుట్టి జూదమూ, త్రాగుడూ, వేశ్యాలంపటత్వము మొదలయిన దుర్గుణాలకు లోనై తన జీవితాన్నంతా కలుషితం చేసుకున్నాడు. కొడుకుమీది మోహంచేత గుణనిధితల్లి కూడా అతడి దుష్కార్యాలకూ, దుష్ప్రవర్తనకూ దోహదం చేస్తూనే వచ్చింది. తుదకు తన కుమారుడి ప్రవర్తననుగూర్చి తెలుసుకుని అతని తండ్రి—తల్లితోసహా కొడుకును—యింటి నుండి వెడలగొట్టినాడు. తిండి లేక, తిండి దొరకక—గుణనిధి ఆకలితో అలమటించి తుదకు కాశీపట్టణం చేరుకున్నాడు. అక్కడ తనువు చాలించగా శివభక్తులు వచ్చి యమభటులను తరిమి అతనిని కైలాసమునకు తీసుకొనిపోయినారు. ఇది గుణనిధి కథావృత్తాంతము.

ఈ క్షేత్రమాహాత్మ్య గ్రంథములకు పిదప పేర్కొనదగినది శ్రీనాథుని శివరాత్రి మాహాత్మ్యము. దీనికే సుకుమార చరిత్రము అని కూడ మరొకపే రున్నది. ఇందులోని సుకుమారుని చరిత్రముకూడా యించుమించుగా కాశీఖండములోని గుణనిధి కథనే పోలియున్నది. సుకుమారు డనే బ్రాహ్మణయువకుడు—తన జీవితకాలంలో ఎన్ని చేయగూడని పాపకార్యాలు చేసినారో వివరంగా వర్ణించి తుదకు అలాంటివాడుకూడా శివరాత్రినాడు శివ పూజాదర్శనంచేసి మరణించడంచేత అతనికి తుదకు కైలాసప్రాప్తి చేకూరినది.

ఈ విధంగా శ్రీనాథుని గ్రంథములలో శివభక్తి విశేషముగా ప్రశంసింపబడినది. వీటిలో శివభక్తి ప్రశంసింపబడినంతమాత్రం చేత శ్రీనాథుడు వీరశైవు డనీ, అతడు ప్రతిపాదించిన మతం వీరశైవ మనీ మనం భావించకూడదు. అద్వైతియైనపోతన్న విష్ణుభక్తి ప్రతిపాదకమైన భాగవతాన్ని రచించి భక్తిమార్గముయొక్క ఉత్కృష్టతను తెలిపినట్లుగా శ్రీనాథుడు కూడా తాను స్మార్తుడూ, అద్వైతీ అయివుండికూడా శివభక్తియొక్క ఉత్కృష్టతను తెలిపి ఆ భక్తిమార్గమునే ప్రతిపాదించినాడు. అద్వైతులైనవారికి శివ, విష్ణుభేదం లేదు. పోతన్న విష్ణుభక్తి గొప్ప దని భావించి భాగవతం రచింపగా, శ్రీనాథుడు శివభక్తిని ప్రతిపాదించే గ్రంథములను రచించినాడు.

శ్రీనాథుడు కేవలం భోగైకపరాయణు డనీ, భక్తిరహితు డనీ మనం భావించకూడదు. పోతన్న నివృత్తిలో ప్రవృత్తి మార్గాన్ని అవలంబించిన జ్ఞానయోగి. శ్రీనాథుడు ప్రవృత్తిలో నివృత్తిమార్గాన్ని సందర్శించిన కర్మయోగి. వారి గ్రంథములు కూడ యీ విషయముల నే—యీ సత్యముల నే—చాటి చెప్పుచున్నవి.

—విమర్శకుడు.

(16 వ పుట తరువాయి)

పల్కులెల్ల నాగమములై యొప్పినవి. ఆతడు కాంచన గర్భతుల్యుడని యనిపించుకొన్న మనీషి. అట్టిచో, నీయొక్క సందర్భమున మాత్రమే, లోకసామాన్యముగ చెప్పినాడనుట యాతని బ్రహ్మత్వమునకు న్యూనత నాపాదించుటయే గదా!

తిక్కన వ్రాసిన పల్కులు నిజముగా నాగమములే! తిక్కన భారతరచనాకాలము నాటికే, ఎఱ్ఱప్రెగ్గడ నన్నయ పేర, అరణ్యపర్వశేషమును పూర్తికావించి యున్నాడు. నన్నయపేరనే యీ కృతిని వెలయించినాడు. ఎఱ్ఱన తిక్కనకు సమకాలికుఁడే గాక, తిక్కన నివాసస్థానమగు నెల్లూరికి 40-45 మైళ్ల దూరములోనున్న గుడ్లూరి నివాసి.

ముందు నేను వివరించినట్లుగా నెఱ్ఱన, తొలుత నన్నయ కవితానుభూతివడసి, యప్రయత్నముగా నారణ్యపర్వశేషమును రచియించి నన్నయ భాగము పూరించినాడు. అది నన్నయపేరనే యున్నది. కావున తిక్కన్నయు నన్నయ మూడుపర్వములు రచించెనని, నన్నయ కర్తృత్వమునే స్థిరపఱచియున్నాడు.

తిక్కన భారత రచనానంతరమున, నెఱ్ఱన నృసింహపురాణమును రచించెను. తిక్కన విరాటపర్వావతారికలో తన తండ్రి స్వప్నములోవచ్చి, భారతము తెలుఁగు చేయుమని కోరినట్లుగా, నెఱ్ఱన నృసింహపురాణావతారికలో తన తాత యగు నెఱపోతసూరి కలలో గాన్పించి, నరసింహావతార కథ చెప్పుమన్నట్లు వ్రాసియున్నాడు గదా! ఇంతేకాక, భారతమున నరణ్యపర్వశేషోన్నయ మాచరించి, ప్రబంధపరమేశుఁడ వైతివని తనతాతచేతనే చెప్పించినాడు. ఇచ్చట యరణ్యపర్వశేష ప్రసక్తి ఎఱ్ఱన యేల తెచ్చెనో గమనింపదగినది. అరణ్యపర్వశేషము తన రచనమైనను, నది నన్నయ పేర వెలయింప చేయుటచే నది నన్నయదిగానే యంగీకృతమైనది. భారతమున తిక్కన దానికి ముద్రవైచినాడు. కాని రచన యంతయు తనదే! కావున యెఱ్ఱన తనగ్రంథ కర్తృత్వము నిచ్చట సమర్థించు కొనవలసి వచ్చినది. నన్నయ యందలి గురుభావమే యెఱ్ఱనకు తిక్కన యందును గలదు. కావుననే కవిస్తుతియందు, తానప్పటి కరణ్యశేషము కర్తయని మనకు తెలియఁజేసినను, నన్నయ తిక్కన లిరువురే మహాభారతమును తెనుగు చేసిరని యిట్లా గ్రంథముననే చెప్పియున్నాఁడు.

"ఉ. భాసురభారతార్థముల
భంగుల నిక్కమెఱుంగ నేరమిన్
గాసట బీసటే చదివి
గాథలుత్రవ్వ తెనుంగువారికిన్
వ్యాసముని ప్రణీత పర
మార్థము తెల్లముచేసినట్టి య
బ్జాసన కల్పులందలఁతు
నాద్యుల నన్నప తిక్కనార్యులన్"

తాను నొక ప్రత్యేకభాగమునకు గర్తనని చెప్పుచు, తన వ్యక్తిత్వ ముపసంహరించుకొని, నన్నయ తిక్కన లిరువురనే మహాభారత కర్తలుగా నాతడు పేర్కొనుటయే, ఎఱ్ఱనకు వారిరువురి యందుగల యపార భక్తి గౌరవములు తేటపఱచుచున్నవి. నృసింహ పురాణముననే కాక, హరివంశమునగూడ, "నన్నయ తిక్కనాది కవినాథులు చూపిన త్రోవ పావనంబు" అని వారిరువురనే తా ననుసరించినట్లు స్పష్టపఱచినాడు. మఱియు నన్నయ తిక్కన లిరువురను ప్రత్యేక పద్యములచే నిట్లు స్తుతించినాడు :—

నన్నయ

"ఉ. ఉన్నతగోత్ర సంభవము,
నూర్జిత సత్త్వము భద్రజాతి సం
పన్నము నుద్ధతారి పరి
భావిమదోత్కటము న్నరేంద్రపూ
జోన్నయ పూజితంబునయి
యొప్పెడు నన్నయ భట్ట కుంజరం
బెన్న నిరంకుశోక్తిగను
నెందును గ్రాలుట ప్రస్తుతించెదన్.

తిక్కన

"మ. తను కావించిన సృష్టి తక్కొరులచే
తంగాదుగా, నేముఖం
బునఁ దాఁబల్కిన పల్కులాగమములై
బొల్పొందునా, వాణి న
త్తను నీతండొకరుండు నాఁజనుమహా
త్మాప్తిం గవిబ్రహ్మనా
వినుతింతుం గవి తిక్కయజ్వనిఖిలో
ర్వీ దేవతాభ్యర్చితున్."

తిక్కన శిష్యుడును, నెఱ్ఱన సమకాలికుఁ

డును నగు మారనకూడ నన్నయ తిక్కన లిరు వురే మహాభారత కర్తలనియు,నన్నయ మూడు పర్వము లొనర్చెనని జెప్పియున్నాడు. పై గ్రంథస్థ సాక్ష్యములనుబట్టి యారణ్యపర్వ శేషము, తిక్కన రచనకుముందుగానే రచిత మైనదని నిర్ధారితమగుచున్నది.

నాటినుండి యనగా క్రీ. శ. 13 వ శతాబ్ది ప్రథమదశకమునుండి 19 వ శతాబ్ది కడపటి దశకమువఱకు నారణ్యపర్వ శేషరచనమును గూర్చి యేజిజ్ఞాసయు, ననుమానమును గలుగ లేదు. తమ కాలమునకు లభించిన సాధన సామగ్రి ననుసరించి వీరేశలింగము పంతులు వారు, ఎఱ్ఱన తిక్కన సోమయాజి వెనుకనే బదిసంవత్సరముల కాలమున నుండినవాడని వ్రాయుటచేతను, నెఱ్ఱన కాశ్రయుఁడగు ప్రోలయ వేమారెడ్డి క్రీ. శ. 1353 వఱకును పరిపాలించుటచేతను, వాఙ్మయ చరిత్రకారు లకు, విమర్శకులకు తిక్కన భారతరచనా నంతరమే యరణ్యపర్వ శేషరచన మనునభి ప్రాయము నాటుకొనిపోయి, దానిపై విమర్శన సౌధమును నిర్మించిరి. ఆపై కొంతకాలమునకు 20 వ శతాబ్ది ద్వితీయదశకములో నీ యారణ్య పర్వశేషము స్వంతరచన కాదనియు, శిథిల పూరణమనియు మఱియొక వాద ముత్పన్న మైనది. దానిపై వాదప్రతి వాదములు చెల రేగినవి. సాహితీవిమర్శకు లెవ్వరును దాని నంగీకరింపలేదు. ఆ వాదముత్పన్నమైన కొలది కాలమునకే యుత్సన్నమైనది. ఆనాటికిని ఎఱ్ఱన కాలము తొలుత నిర్ణయింపకుండుట చేతనే నిట్టి యనవసర వాఙ్మయము పెరిగినది.

పై సందర్భమునుబట్టి అరణ్యపర్వ శేషమున నెఱ్ఱనపై తిక్కన సోమయాజి ప్రభావమున్న దన్న విమర్శనములును, యరణ్యపర్వము హరి వంశము తరువాతిది యనిచెప్పు వ్రాతలును ఆధారరహితములైయున్నవి.

నృసింహపురాణ రచనానంతరము రామా యణ రచనమని, అది మల్లారెడ్డివలన జరిగినదని యీవఱకే చెప్పబడినది. రామాయణ రచనము వలన రాజాశ్రయమును నెఱ్ఱన సంపూర్తిగ వినియోగించెను. అతఁడు మహాభారతమునకు ఖిలపర్వమగు హరివంశ రచనకుఁ బూను కొనెను. గ్రంథము రచితమైనను నది వ్యాప్తిలోనికి రావలెనన్నచో నది రాజుల కంకితము కావలెను. అప్పుడు కృతి పుచ్చు కొన్న రాజులే, ఆ గ్రంథవ్యాప్తికి తోడ్పడు దురు. ప్రస్తుతము మహాభారతము వంటి యుద్గ్రంథము వ్యాప్తిలోనికి రావలెను. కాబట్టి ఎఱ్ఱన ఖిలపర్వమగు హరివంశమును రచించి ప్రోలయ వేమారెడ్డి కంకితమిచ్చి, తన్మూలమున భారతగ్రంథ వ్యాప్తికి, భారత పురాణ ప్రవచనమునకు తోడ్పడినాడు. కాబట్టి హరివంశరచనమువలన ఖిలపర్వమును సాంధ్రీ కరించి భారతాంధ్రీకరణ సంపూర్ణతకు హేతు భూతుఁడగుటయేగాక యాంగ్రంథవ్యాప్తికి తోడ్పడినవాడైనాడు. హరివంశగ్రంథాంత మున భారత పుస్తక మాహాత్మ్యము, ఫలశ్రుతి భారతమెట్లు పురాణముగా చెప్పవలెను, ఎట్లు చదువవలెను, పురాణకాలక్షేపమంతయు నైన తరువాత నా పురాణవేత్తనెట్లు సత్క రింపవలెనన్న విషయములన్నియు విపులముగా వ్రాసి యున్నాఁడు. కావుననే, నన్నయ తిక్కనలతోపాటు ఎఱ్ఱనను, భారత కవిత్రయ ములో నొకనిగా తరువాతివారు పరిగణించి యున్నారు.

హరివంశము ప్రోలయ వేమారెడ్డి కంకిత మిచ్చినను, తిక్కనవలె షష్ఠ్యంతము లుపయో గింపలేదు. నన్నయ "దేవా నీయనుమతంబున" అని యన్నట్లుగా నెఱ్ఱన "ప్రోలయవేమా"అని సంబోధించి కథ ప్రారంభించినాడు. అరణ్య పర్వశేషములోవలె, మధ్యాక్కర లుపయో గింపలేదు. నన్నయ శైలిని వెన్నాడుచు, తిక్కన రచనల నక్కడక్కడ నెక్కొల్పుచు నెఱ్ఱన, సంస్కృతాంధ్రముల సమపాళ్ళుగల సులభ మనోహర పౌరాణిక శైలిలో నీ గ్రంథము రచించి, చివఱ గ్రంథాంతమున తిక్కన ననుసరించి,

"మీరును పారాశర్యో
దారఫణితియందుఁగల్గు తాత్పర్యమ్మున్
ధీరములగు చిత్తంబులఁ
జేరిచి యానందసిద్ధిఁ జెందుడు నియతిన్."

అని ఆనందపదమునను సంధించి గ్రంథ సమాప్తి గావించినాడు; అనగా నన్నయవలె ప్రారంభించినాడు తిక్కనవలె ముగించినాడు. హరింశరచనమువలన నెఱ్ఱన నన్నయ తిక్కన లతో సమానప్రతిప త్తిగడించి, భారత కవిత్ర యమున ప్రబంధ పరమేశ్వరస్థానమాక్రమించి నాడు.

# ఉపమాలంకారము

శ్రీ కుంటిమద్ది శేషశర్మ గారు

(గతసంచిక తరువాయి)

—:o:—

"దేవత" ప్రథమాంతమా? అట్లయిన "భూమి పతులు పాదపీఠిని దేవతను వలె కొలుతురు." అను వివక్షితార్థము దుర్లభము. "ద్వితీయాంతము" అంటేని, ఉపమేయమగు పాదపీఠితో భిన్నవిభక్తికత్వము ఉపమా దోషము. "పాదపీఠిఁ బ్రణతులగుచు అని సవరింతుము." అనిన, 'దేవతన్' అను ద్వితీయాంతమువిూద, "ప్రథమమీది పరుషములకు గసడదవలు బహుళంబుగానగు." అను సూత్ర విహితమగు 'వ' కారము దుస్సాధ్యము. "అదియును, "దేవతఁబోలె", అని సంస్కరణీయము." అంటే. తథాస్తు.

తద్ధిత గత ధర్మ లుప్తోమకు వారు,

"కందర్ప కల్పమగు భూ
మందారము వీరరుద్రు మహిమాకృతినిన్
మంద ద్విప గామిను లా
సుందరులెల్లడలఁబొంగిఁ చూచెదరు పురిన్"

అని యుదాహరించిరి. "రూపసంపదలో కందర్ప కల్పమైన వీరరుద్రుని యాకృతిని సుందరాంగులు చూతురు - అనుచో, ఉపమేయము వీరరుద్రుని ఆకృతి." అని వివరించిరి.

ఇచ్చట నుపమేయమైన వీరరుద్రుని యాకృతికి ఉపమానము కందర్పుని యాకృతిగాని కందర్పుడుగాడు. 'కందర్ప' పదమునకు లక్షణతో, తదాకృతి యనుట అపద్ధమాడి కుచోద్యము చేయుట.

కాన, వీరరుద్రు డుపమేయమంటేని కందర్ప కల్పమను అమహద్విశేషణము యుక్తము. అన్వయము దుష్కరము. కాన ఉదాహరణ మరుచిరము.

మరి, "ప్రతాపరుద్రనృపతేః
జగన్మహిత తేజసః।
కందర్ప కల్పమాకారం
పశ్యం త్యర్థపురంధ్రయః॥

అని మూలముననూ, "కందర్పకల్పం" అని యున్నదే అంటే, అచ్చటనూ అంతే, ఆకారము కందర్పకల్ప మెట్లగును? "ఈషదసమాప్తం కందర్పేణ, కందర్పకల్పం." అనవలయును. లక్షణ నాశ్రయింపకున్న అర్థమసంగతమగును. తప్పెవరిదైననూ తప్పే.

"లక్షణ నాశ్రయించి కందర్ప పదమునకు తదాకారమనిన తప్పేమి?" అనిన, అందుకే అరుచిరమన్నది. లక్షణ నాశ్రయించి అర్థము సరిపుచ్చినను, "కాకతాళీయ" మన్నప్పటివలె, "ఉపమానమునూ లుప్తము" అని ప్రకృత కేవల ధర్మలోపమునకు ఉదాహృతి కాజాలదు.

వాచకలుప్త:- సమాసగత:- నా "చీదరింత" లోని

'కాంచిన పెంచినట్టి మమ
కారము చిప్పిలఁ బల్కునావు "పు
ష్పించినలేగులాబి యిది;
యించుక చల్లని పిల్లగాలి కో
పించిన నోపలేని సుమ
పేశల" యంచు; నిజమ్ము సుంత భా
వించిన కాముడాడి కర
వీరమటంచు పరిగ్రహించితిన్".

"చాల సుకుమారిణి; ప్రయాస కోర్వలేనిది." అని యప్పగించిన భార్యనుగూర్చి యల్లుడు మామగారితో భార్య చర్య లవగతము చేసికొన్న మీదట నాడు సందర్భములోని వీ పల్కులు. ఇచ్చట, "సుమపేశల ఇది" అనుచో, 'నుపమానాని సామాన్యవచనైః'అను సూత్రముచే సమాసము. వాచకము లుప్తము.

ణముల్ గత:—

"కృత్తి వాసను నెడ నభీకీయితుండు,
సాయకీ యితుడంబికా కాయవల్లి,
దీపదర్శము దర్శించి త్రిపురహరుని
శలభ నాశము నశియించె శంబరారి."

కృత్తివాసుడు = శంకరుడు; అభీకుడు = కాముకుడు; "అభీకః కాముకోభికః" అని అమరము. సుందోపసుందౌ సహజావభీకౌ"అని చంపూభారతము. శంకరుని యెడకాముకుని యంఁదువలె నాచరించువాడు. పార్వతీదేహవల్లిని సాయకమునువలె నాచరించువాడు, శంబ

రారి = మదనుడు త్రిపురహారుని = రుద్రుని; దీపదర్శము దర్శించి = దీపమును చూచినట్లు చూచి; శలభనాశము నశియించెను = మిడుత చచ్చినట్లు చచ్చెను.

ఇచ్చట, "దీపదర్శము దర్శించి, శలభనాశము నశియించె" అనునెడ, "ఉపమానే కర్మణిచ." అను సూత్రముచే, ఉపమానమగు కర్మ లేక కర్త ఉపపదమైన ధాతువునకు 'ణముల్' విహితము. అందుపై, "కషాదిషు యథా విధ్యనుప్రయోగః." అని అదేధాతువు అను ప్రయుక్తమై తెనుగున తత్సమముగ ప్రయోగింపబడినది. "ణము"లంత మవ్యయము, "యథావిధి, యథావిధము." ఇత్యాదులవలె తెనుగున ప్రయోగించుటలో బాధకములేదు. "మిడుతవలె చచ్చెను." అనుటలో చచ్చుట సాధారణ ధర్మము. కాన కేవల వాచకలుప్త. "దీపదర్శము దర్శించి త్రిపురహారుని," అను నది ప్రకృతోదాహృతిగాదు. దీప త్రిపురహారులకు సాధారణ ధర్మము అభిగమ్యత్వాది కూడ లుప్తము.

అభీకీయితుడు సాయకీయితుడు అనునవి, "ఉపమానా దాచారే" అను సూత్రమువల్ల, "అధికరణాచ్చేతి వక్తవ్యం" అను వార్తికమువల్లనూ "క్యచ్" ప్రత్యయమురాగా, దానిపై 'క్త' ప్రత్యయాంతరూపములు. సాధ్యత్వము, లక్ష్యసాధకత్వము సాధారణధర్మములు, వాచకముతోబాటు లుప్తములు. కాన నవియూ ధర్మవాచక లుప్త కుదాహార్యములు.

'క్యచ్' క్యఙ్' ప్రత్యయములు ఆచారార్థకములు. "అభీకీయితుడు, సాయకీయితుడు," అనునవి అభీకాది సాదృశ్య ప్రయోజకాచారకర్తృశక్తములు; కేవల సాదృశ్యమును గాని, కేవల సాదృశ్య విశిష్టమునుగాని తెలుపుట లేదు. కనుక వాచక లోపము. ఆచారార్థక ప్రత్యయము లున్ననూ, కేవల ఆచారము ఉపమాప్రయోజక ధర్మము కాజాలదు.

"వదన మిందునికైవడి వస్తువొకటి"

అనుచో వస్తుత్వము సాధారణ ధర్మమైనను ఉపమాప్రయోజకము కాదుగదా! కాన ఉభయ లుప్త.

మరి "రంగాచార్యులు, 'క్యజాదులు వచ్చిన రూపములు తెలుగున ప్రయోగింప వీలు లేదు. కాన మూలకారుని శ్లోకములే ఉదాహరించి సమన్వయింపఁబడును.' అనిరి. కావ్యాలంకార సంగ్రహమున ఉదాహరింపనే లేదే." అంటే,

"అనుక్త మన్యతో గ్రాహ్యము." కనుక తెనుగు వ్యాకరణమున చెప్పని విశేషములు ఇసంస్కృతమునుండి గ్రహింపవలయు గదా! తరులు వదలినవి వ్యాకరణోపపన్నములు గ్రహించిన తప్పేమి?

మరి "ప్రయోగమున్నదా?" అంటే, ప్రవాహినీదేశ్యా. నిత్యనూత్నమగు భాషా స్రవంతి ఎన్నిపోకలఁ బోవునో ఎవ్వడెరుగు?

"పూర్వకవి ప్రయోగము లుండిననే గ్రాహ్యములు." అను పట్టుదలగలదేని, కవిబ్రహ్మ మంగళశ్లోకము,—

"శ్రీయన గౌరినా బరగు చెల్వకు
చిత్తము పల్లవింప, భ
ద్రాయిత మూర్తియై హరిహరంబగు
రూపము దాల్చి, "విష్ణు రూ
పాయ నమశ్శివాయ." యని పల్కెడు
భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్వముఁ
గొల్తున భీష్టసిద్ధికిన్."

పరికించిన, "భద్రాయితమూర్తి" అని, వాగను శాసనుని ఆదిపర్వమున,

"ఆయము గర్వమున్ విడిచి యస్య
పతుల్వని సేయనిట్లు గాం
గేయ భుజాశ్రయంబున నికృత్త
విరోధి సమాజుడై కుమా
రాయిత శక్తిశాలి ధృతరాష్ట్రుఁడు
రాజ్యము సేయుచుండె న
త్యాయత కీర్తితోఁ దనకు హస్తిపురం
బది రాజధానిగాన్."

అను పద్యమున, "కుమారాయిత శక్తిశాలి," అనియు 'క్యఙ్' ప్రత్యయాంతము చూడనగును.

దీనికి అప్పకవి "కుమారవదాచరితా శక్తిః కుమారాయితశక్తిః. కుమారాయిత శక్త్యా శాలత ఇతి కుమారాయితశక్తిశాలీ. కుమార సమాన పరాక్రమద్యోతవానిత్యర్థః- అని వివరించెను. ఇచ్చటను కుమార పదమునకు కుమార శక్తియందు లక్షణ. శక్తికి కుమార శక్తియేగాని కుమారుడుగా దుపమానము. "కర్తుఃక్యఙ్ సలోపశ్చ." అను సూత్రముచే ఉపమానము మీదనే 'క్యఙ్' విహితము.

వసుచరిత్రమున :—

'ఉద్ధతరిపు విద్ధ తపన
పద్ధతి కరి భవన దవని పటదంబుధి సం
పద్ధరణ సముద్ధరణ స
మిద్ధరణ రజోవ్రజోద్య దిభమద సృతికిన్.'

అని, "పటత్, భవనత్," అని, 'క్వి' బంత ముపై శత్రంతములు ప్రయుక్తములు.

"భుజగ గజగామిని మిటారి పొలుపు మీరి.' 'అను విజయవిలాస పద్యమున "గజ గామిని" అని 'ణిన్' ప్రత్యయాంతము. ఇత్యాది బహుధా ప్రయుక్తము. కనుక, 'క్యజాదులు వచ్చిన రూపములు తెలుగున ప్రయోగింప వీలులేదు.' అనుట క్షోదక్షమము గాదు.

వాచకలుప్త 'ణిన్' ప్రత్యయమున :—

"శారికాలాపిని గజేంద్ర చారియును
చారుహాసిని పార్వతి చేరగానె
నారి సారించి మదనుడు నారసమును
వింట సంధించినాడు ముక్కంటి నేయ."

గోరవంకవలె కలభాషిణియు, గజేంద్రగామినియు నగు పార్వతి హిమాలయసానువుల తప మొనరించుచున్న శివుని యుపచరించుటకు సమీపించగానె, అది యదనుగ గైకొని, దేవకార్యము నెరవేర్ప నేతెంచిన కుసుమాయుధుడు ముక్కంటిపై నేయుటకు - భావి నూహింపక - బాణమును వింటం దొడిగినాడు.

ఇచ్చుట, 'కర్తర్యుపమానే.' అని 'ణిన్' ప్రత్యయమురాగా, "శారికాలాపిని, గజేంద్ర చారిణి' అను రూపము లేర్పడినవి. ఆలాపము, గమనమును సాదృశ్య ప్రయోజక ధర్మములు కాన కేవల వాచకలుప్త.

క్విప్ ప్రత్యయమున :—

"మారాజా ధవల కీర్తులు
హారితములు దేవతా కుచాంతరమందున్
క్షీరితములు కీనుల సుమ
కోరకితములయ్యె తచ్చికుర హస్తములన్."

ఇందు వర్ణనీయుడగు రాజుయొక్క కీర్తులు, "స్వర్గలోకపర్యంత ప్రసృతములు." అను నభిప్రాయమును దేవతాస్త్రీల కుచముల ముక్తాహారములవలెను, చెవుల వజ్రములవలెను, కేశసముదాయమున పూమొగ్గలవలెను, ఆచరించుచున్నవి. అని వాచ్యవిధముగం దెల్పుచున్నాడు.

ఇచ్చుట, "సర్వ ప్రాతిపదికేభ్యః క్విబ్వా వక్తవ్యః." అను వార్తికముచే, ఆచారమున క్విప్. దానికి సర్వమునకు లోపము. అందుపై 'క్త' ప్రత్యయము. ధవల కీర్తి హారాదులు ఉండి, వాచకము లేనందున వాచకలుప్త.

మరొక్కటి రామాభ్యుదయమున :—

"కదనోగ్రారి చమూ రజోవ్రజ
తమః ఖద్యోత కీటాయితా
రిదురంతాసి లతాస్ఫులింగు
డయి ధాత్రీరక్షణోదార సా
ర దయారంగ దపాంగ వీక్షణుడు శ్రీ
రంగ క్షమాజాని స
ర్వ దిశావారణ కర్ణచామరిత
భాస్వత్కీర్తియై వర్తిలున్."

"చామరిత భాస్వత్కీర్తి." అనుచో క్విప్ గత వాచకలుప్త.

కన్ ప్రత్యయమున :—

"సారహీనమైన సంసార మానంద
కందమగు రమేశు కరుణం జేసి;
అతనిం గొలువం బోని యతడు పాంచాలిక
యాత్మ హితము సహిత మరయకుంట."

సంసారమును ఆనందకంద మొనరించు భగవానుని కొలువక ఆత్మహితాహిత మెరుగని మానవుడు పాంచాలికా సదృశుడు. "పాంచాలికా పుత్రికాస్యా ద్వస్త్రదంతాదిభిః కృతా" అని అమరము. "పాంచాలిక" అనునది, ఇవార్థమున; "ఇవే ప్రతికృతౌ" అను సూత్రముచే "కన్." దానికి, "లుమ్మనుష్యే." అని లోపమురాగా, "పాంచాలికా" అని సిద్ధించినది. "దీర్ఘాణాం హ్రస్వస్స్యాత్." అని తెనుగున హ్రస్వము. పాంచాలిక = పాంచాలికా సదృశుడు అని ఫలితము.

అని వాచకలుప్తోదాహరణములు.

ఇక ధర్మోపమాన లుప్త :—

"గాలించినాడ వంతట
లోలంబా! అడవిలో విలోకించితివే;
మాలతి పూలను బోలిన పూలను ?
నామోముం జూచి బొంకక చెపుమా!"

అడవియంతయూ గాలించినను జాజిపూలవంటి పూలు లేవనుటతో ఉపమానలుప్త. ధర్మమునూ అనుపాత్తము. కనుపించనివి యుండ వచ్చును గాన ఉపమానాత్యంతిక నిషేధము లేదు. పూలను బోలిన అనుటతో వాక్యగత.

ఇదియే, "మాలతిపూల సమానము పూలను," అని మార్చిన సమాసగతయగును.

మరి, "ఇదెట్లు సమాసగతము? పైదెట్లు వాక్యగతము? ఉపమావాచకమగు "సమానము," "మాలతిపూల సమానము" అన్నప్పుడు పూర్వపదముతో సమస్తము. "పూలను బోలిన పూలను" అన్న పూర్వోదాహరణమున ఉత్తర పదముతో సమస్తము. కనుక రెంటనూ సమాసగతమే." అంటేని,

నిజమే. ఇది ఆర్థ. ఆర్థియందు వాచకము ధర్మిపర్యంత బోధకము. 'పోలిన' యనునది ధాతుజ విశేషణము. అది నామముతో గాని, సర్వనామముతో గాని చేర్చక ప్రయోగించుట వాడుకలేదు.

"ధాతుజవిశేషణంబులకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తంబగు." బాలవ్యాకరణము. మరొకదానితో చేరునప్పుడు నామమైననేమి? సర్వనామమైననేమి? కనుక వాక్యగతత్వము ఉపమేయ వాచకముతో సమసించకుండుటయే. ద్వితీయోదాహరణమున 'పూలసమానము పూలను,' లేక 'సమానపుంబూలను' అని ఉత్తర పదముతో సమసించుట సమసించకుండుట అకించిత్కరము.

ధర్మవాచకలుప్త—కర్మక్యచ్, ఆధారక్యచ్, క్యఙ్ గత : . .

"కాననీయిత మణిమయాగారమందు
చండభానూయిత సుధాంశుమండలమున
తరుణి నిర్జల మీనాయిత విరహమున
గాలిసోకిన నీవని కౌగిలించు."

దూతిక నాయకకు శిశిరోపచారము లొనర్చియు, అవి మరింత తాపజనకములైనందున, కాంతకు సదా నాయకచింత తప్ప వేరు చింత లేనందున, నాయకుని తోడితేర నతని కడకుం బోయి, ఆమె వేదనను అతనికి వినిపించుచున్నది. 'ఆమెకు మనోహరమగు మణిమందిరముగూడ, మనోవేదనాకరమగుటచే ఘోరారణ్యమువలె తోచుచున్నది. తాపశాంతికై వెన్నెలలో విహరింపం జంద్రకిరణములుగూడ మండు టెండవలె తాపమునే ఇనుమడింపం జేయుచున్నవి. ఎందును నిబ్బరమున నుండలేక గడ్డునం బడిన మీనువలె తల్లడిల్లుచున్నది. గాలి సోకినను నిన్నుగానే భావించి రిత్తకౌగలించుకొనుచున్నది.'

ఇచ్చట 'కాననీయిత,' అనునది, 'అధికారణాచ్చ.' అను వార్తికముచేతను, 'చండభానూయిత' అనునది, 'ఉపమానాదాచారే.' అను సూత్రముచేతను విహితమగు 'క్యచ్' ప్రత్యయముపైన 'క్త' ప్రత్యయాంతములు. 'మీనాయిత' అనునది 'కర్తుః క్యఙ్ సలోపశ్చ.' అను సూత్రముచే వచ్చిన 'క్యఙ్' ప్రత్యయముపై 'క్త' ప్రత్యయాంతము. 'బాధాకరత్వము, తాపకరత్వము, తల్లడిల్లుట క్రమముగ ధర్మములు లుప్తములు. కాన ధర్మవాచకలుప్త. మరియొకటి శృంగార శాకుంతలమున:—

"ఎంచి నుతింప శక్యమె య
హీశ్వరు సంతతికి వానికైన ర
త్నాంచితరోచిరుద్గమ ని
రస్తసమస్త రవీందుజాలముఙ్
గాంచన కందరాయవని
కాయితవారి ధరాంతరాళ ని
ర్వాంచిత దేవతా మిథున
వాంఛిత మూలము శీతశైలముఙ్."

హిమవన్నగ కందరములయందు దేవతా మిథునములు రహఃక్రీడలం దేలుచున్నవి. ఆ గుహలకు తెరలవలెనుండి మేఘములు సుపర్వ సుందరులకు బయటివారి దర్శన ప్రతిబంధకము నరికట్టుచు, వారవిచ్ఛిన్నముగ నిర్లజ్జముగ రమింప నానుకూల్యము నాపాదించుచున్నవి.

'యవనికాయిత' 'క్యఙ్' ప్రత్యయాంతము. ధర్మవాచకము లింగు లోపించినవి.

"పై క్యజాది నిష్పన్నరూపోదాహృతులు ప్రాచీన మతానుసారము, ఆచారమునే ధర్మముగ భావించి, కేవల వాచకలుప్తలు." అని ప్రతిపాదించియు, పండితరాయలు 'కేవలాచారము సాదృశ్య ప్రయోజకముగాద'ని, అందసారతను గమనించి, 'ధర్మవాచకలుప్తలు' అనుటయే సమంజసమని నిశ్చయించెను.

"క్యజాదులు వచ్చినరూపములు. తెనుగున ప్రయోగింప వీలులేదని, మూలకారుని శ్లోకమునే

"దుగ్ధార్ణవీయత్యంబోధిః
కైలాసీయతి భూధరాః."

అని ఉదాహరించి, రంగాచార్యులు 'యశస్సుకును దుగ్ధార్ణవ కైలాసములకును సాధర్మ్యము ధావళ్యము. అది యిందు చెప్పంబడలేదు.' అని వ్రాసిరి. ఇది సాహసము. వ్యాఖ్యానములోని,

'ధావళ్యమత్ర సాధర్మ్యం గమ్యతే.' అను వాక్యమును గ్రహించి, యశస్సునకు దుగ్ధార్ణవ కైలాసములకు ధావళ్యము సాధారణ ధర్మ మనుట అప్రస్తుతము. ఏలన, ఉపమానోపమేయములకు సాధారణ ధర్మము అభిహితమో, అనభిహితమో అగుట ప్రస్తుత విషయము. యశస్సు, ఉపమానోపమేయములలో నొక్కటియు గాదు. 'ఉపమానాదాచారే' అను సూత్రమువల్ల క్యజంత వాచ్యములైన దుగ్ధార్ణవ కైలాసములకు ఉపమేయములు సామాన్యజలధి పర్వతములు. కాని, యశస్సు గాదు. అట్టిచో వానికి యశస్సుతోడి సాధర్మ్యముతో నిమిత్తము లేదు.

ఇంకనూ వారు, "ఈ లుప్తోపమలలో క్యజాదులు ఉపమానార్థమునను ఆచారార్థమునను వచ్చుటవలన ఏర్పడిన భేదములు చేరియున్నవి." అనిరి. ఇదియు పొరబాటు. "పై ప్రత్యయములు ఉపమానార్థమునగాక, ఉపమాన వాచకముల కంటె పరముగ వచ్చును" అని అనవలసియుండెను. 'ఉపమానాత్ కర్మణస్సుబంతాదాచారే క్యచ్ స్యాత్.' అను వృత్తి గమనింప దగును.

క్విప్ గత :—

"ఓ రాజ నీదు కీర్తులు
హారితములు దేవతా కుచాం తరముంగుల
హీరహారములు వీనుల సుమ
నోగకతములయ్యెఁ దచ్చిరుర హంసములకు"

అనుచో సాధారణ ధర్మమునూ వదలుటచేత ధర్మవాచక లుప్త. మరొకటి రామాభ్యుదయమున :—

"లాటీ కుచహారత్ క
ర్ణాటీ వక్షోజ చందనత్ కరహాటీ
చోటీ కబరీ భర పరి
పాటీ సుమదసమ కీర్తి పరిణాహునకున్."

పూర్వోదాహరణమున 'క్త' ప్రత్యయాంతములు. ఇందు శత్రంతములు. అగుట భేదము.

కన్ ప్రత్యయగత :—

"సారహీనమైన సంసార మానంద
కంద మగు రమేశు కరుణఁ జేసి
అతనిఁ గొలువఁ బోని యతడు పాంచాలిక
రెండిటికిని జెడిన రేవణుండు."

ఇందు 'ఆత్మహితము నహితమరయకుంట' అను ధర్మమునూ వాచకముతోపాటు లోపించినది. మరొకటి :—

"ఏల తలమోసి శివుని నీ వింటి కింటి
కటుల దిరుగుచు నున్నాడ? వీతడేమి
గరలమును మ్రింగునా? మూడు పురములేని
భంగ పెట్టున? ఇచ్చునా వరము లేని?"

భిక్షుకులు జీవికార్థము శివాది విగ్రహముల ధరించి తిరుగుచుందురు. అట్టివానిఁ జూచి, 'ఇది వట్టి బరువుచేటుగాక ప్రయోజనమేమి?' అని యొకఁ డాక్షేపించుచున్నాడు. ఇచ్చట 'శివ ఇవ' అను నర్థమున పూర్వము వలెనే, 'ఇవే ప్రతికృతౌ' అని 'కన్'. 'కాని, 'జీవికార్థే చాపణ్యే' అను సూత్రముచే లోపము. కాన శివుని అనుటకు 'శివునివంటి బొమ్మను,' అని యర్థము. దేవాలయస్థపూజా విగ్రహములకు, అమ్ముట కంగడియందుంచిన వానికీ ఈ రూపము సిద్ధించదు. 'శివుని, ఈతడు' అనుచో క్రియాను గుణముగ మహద్వివక్షు.

ణముల్ గత :—

"కృత్తివాసను నెడ నభీకీయితుండు
సాయకీయితు డంబికా కాయవల్లి,
దీపదర్శము దర్శించి త్రిపురహరుని
శలభనాశము నశియించె శంబరారి."

ఇట 'దీపదర్శము దర్శించి' యన్నపుడు ధర్మ వాచక లుప్త.

సమాసగత: శృంగార నైషధమున :—

"కమలేందీవరషండ మండితలస
త్కాసార సేవారతిన్
గమికర్మీకృత నైక నీవృతుడవై
గంటిన్ విదర్భంబునన్
రమణీన్ పల్లవ పాణిఁ బద్మనయనన్
రాకేందు బింబాననన్
సమపీన స్తని నస్తినాస్తి విచికి
త్సా హేతు శాతోదరిన్.'

పై పద్యమున 'పల్లవపాణి, పద్మనయన,' ఇత్యాదులందు ధర్మముతోఁ బాటు వాచక లోపము.

ధర్మవాచకోపమేయ లుప్త:—

"పచ్చిగడ్డి కొసను బ్రాలేయ బిందువుల్
మౌక్తికీయితములు మహికి నొక్క
హారి సంచికీర్ష నాగ్రహాంగణికుండు
నూదిఁ గ్రుచ్చుచున్న సొబగు నొంద."

'మార్గశీర్షమున వరువాత పచ్చికొన నంటిన మంచు బిందువులు ముత్యములవలె రాణించుచున్నవి?' అన్నచోట మౌక్తికీయితములు,

ముత్యముల వోలె తమ్మినాచరించునవి అని కర్మార్థకోపమానమున కంటె విహితమగు క్యచ్ ప్రత్యయమువల్ల తెలియుచున్నది. 'అవి మార్గశీర్షము పంటపలతికి కంఠహారము కూర్చుటకు సూదికెక్కించి నట్లున్నవి.' అని భావము.

ఇచ్చట ఉపమానమగు ముత్యముల తెలుపు మౌక్తికపద ముపాత్తము. ఉపమేయము తమ్మి (బిందువులను) అని ద్వితీయాంత ముండవలసినది; లేదు. ధర్మవాచకములునూ లేవు. కాన ధర్మవాచకోపమేయ లుప్త.

ధర్మవాచకోపమాన లుప్త:—

ఉద్యోగపర్వమున:

"దాన దయాపరుండయిన
ధర్మతనూభవు నేమమెట్లు? పం
చానన విక్రముండగు బ
కారికభద్రమె? యస్త్ర శస్త్ర వి
ద్యా నిపుణుండు క్రీడి సుఖి
యే? వినయాభరణుల్ కవల్ సమా
ధాన సమేతులే? అకట
ద్రౌపదిసాధ్వి సుఖంబె దానికిన్?"

అడవుల నిడుములం గుడిచి, విరాటునగరంబునం బెంపుం దక్కియు, పదుమూడేడులు గడపియు, తెంపునకు చొరక పాండవులు పీనిగని కడకుం బంపిన రాయబారము మోసి తెచ్చిన యల్లుని కృష్ణునిం గాంచి, కడుపుతీపెల్ల పుడికి వెలిబెట్టు నుడులతోం గుంతి, కొడుకుల సేమ మడుగుచున్నది. 'ధర్మతనూభవుడు దాన దయాపరుడు. పరమ ధార్మికుడు. అట్టి కష్టములు పడవలసిన వాడుగాడు. అతడు సేమమే? భీముడు బకడాదిగాగల రక్కసుల దునిమిన జగజెట్టి. ఒక్కని యదుపున నుండువాడుగాడు. అతని పరాక్రమమే మమ్ముద్ధరించునని నమ్మియున్నాము. అతనికి భద్రమేగదా? అస్త్రవిద్యలో గురువు నంతటివాడు. శివుని మెప్పించి పాశుపతాద్యస్త్రముల గొన్నవాడు క్రీడి. అతడునూ ఒక్కనికి ఒదిగ యుండవలెనెగదా! అతడు కుశలియా? కవలు ఉడుకు నెత్తురుగల చిరుతవారు వినయవంతులేగాని, తమకు గలిగిన చెట్టలకు నెమ్మది నున్నవారే? కటకటా పరమ పతివ్రత ద్రౌపది పలుబాములకు లోనయ్యె; విధికి నేమందు? ఆమె సుఖమున్నదే?' అని.

ఇందు 'పంచానన విక్రముండు బకారి,' అనుచో పంచానన విక్రమమువంటి విక్రమము గలవాడని, భీమవిక్రమము సింహవిక్రమముతో పోల్చంబడినది.

'సప్తమ్యుపమాన పూర్వ పదస్య బహువ్రీహిర్వాచ్యః, వాచోత్తరపద లోపశ్చ' అను వార్తికముచే ఉపమానమగు విక్రమము వాచకముతోంబాటు లుప్తము. అసహ్యత్వాది ధర్మమూ లోపించినది. కాన ధర్మవాచకోపమాన లుప్త.

ఇట్లు దిఙ్మాత్రముగ ప్రదర్శింపంబడిన యుపమా విభాగము కేవల శబ్దశాస్త్ర వైదగ్ధ్యమును వెల్లడింపంగాలునే గాని, అలంకార శాస్త్రమున ఎక్కువ ప్రయోజనకారిగాదు. ఇంతకూ భేదము లంతమాత్రమే అనియూ లేదు. ఉపమాన లుప్త వాక్యసమాసగతముగ ఇరు తెగలం జూపంబడినది. అందునూ శ్రౌతీ ఆర్థీ భేదములు చూపవచ్చును. ప్రకారాంతర భేదము ముందు చూపంబడును.

ఇక ఉపమానోపమేయముల సాధారణ ధర్మముయొక్క భేదములంబట్టి రమ్యములగు కొన్ని యుదాహరణములు :—ధర్మము 'అనుగామి, బింబ ప్రతిబింబ భావాపన్నము, వస్తు ప్రతివస్తు భావాపన్నము, బింబ ప్రతిబింబ భావసంకలిత వస్తుప్రతివస్తు భావాపన్నము, శ్లిష్టము, ఉపచరితము,' అని అనేకవిధము.

అనుగామి:—శృంగార నైషధమున:

"పాలతి లలిన్ మలిమ్లుచుల
పోలిక నీరతి కేళిజన్మ ని
ర్మలతర ఘర్మ బిందుమయ
మౌక్తికమండనముల్ హరించుంగా
కలసగతిన్ జలద్ధిర
సాంబుధితుంగ తరంగ మాలికా
వలి పృషతచ్ఛటా చమర
వాలకరంబిత మారుతౌఘముల్."

వాగ్దేవి, దమయంతికి క్రౌంచద్వీపాధిపతిని వరించిన సమకూరు సౌభాగ్యముల వివరించుచున్నది.

"దాపునగల పెరుగు కడలి తరంగల తుంపురుల నివతాళించు చమర వాలముల కమ్మగాడ్పులు దంపతుల రతికేళి జనిత ఘర్మబిందు మౌక్తికముల నలసగతి నరుదెంచి దొంగలవలె హరించును." అనుటచే హరణము ఉపమానోపమేయములకు అనుగామి ధర్మము.

బింబప్రతిబింబ భావాపన్నము :—

ప్రభావతీ ప్రద్యుమ్నమున :—

"తొడలు తలాడగా నిడి రుక్మిణి భజింపఁ,
బదము లొత్తుచు సత్యభామ కొలువ,
సురటి చేకొని భద్ర శుశ్రూష యొనరింప,
విరిచామరము మిత్రవింద యిడఁగఁ,
గాళింది వేడ్కతోఁ గాళంజిఁ దాల్ప, జాం
బవతి తములపాకు మడిచియొసఁగ,
గొడుగుపావలు కేలఁగొని యాగ్నజితి యుండ,
జలముల గిండి లక్షణ వహింపఁ,
గ్రొమ్మెఱుంగులతోడి కార్మొగిలువోలె
నొప్పుకృష్ణుని చేరువ నొప్పెహంసి,
నిండునెల రీతిఁ దారకాన్విత నభంబు
పోలుపుఁ దలిపెడి నెత్తమ్మి కొలని కెలన"

"క్రొమ్మెఱుంగు తోడికార్మొగిలువోలె నొప్పు కృష్ణుని' అనుచో కృష్ణునికి మేఘమునకు సాదృశ్య నిర్వహణమునందు, అష్టమహిషులు క్రొమ్మెఱుంగులు బింబ ప్రతిబింబ భావమొందిన సాధారణధర్మము.

'నిజమునకు వేరైనను సాదృశ్యముండుట వల్ల ఒక్కటిగా నూహింపఁబడిన ఉపమానోపమేయ ధర్మములను వేర్వేర పేర్కొనుట బింబ ప్రతిబింబ భావము.'

కాంతలు చంచలలు వేరైనను వానికిగల పోలికవల్ల నొక్కటిగా నూహించి, కృష్ణునికి మేఘ సాదృశ్యము వర్ణితము.

మరి, 'కాంతలు చంచలలు వస్తుతః భిన్నలు. వానికి కల్పితమైన ఏకత ఎట్లు ధర్మసాధారణతానిర్వాహకము,' అంటే 'కన్నులు పద్మములవలె ప్రకాశించుచున్నవి' అనుచో ప్రకాశము మాత్రమెట్లు సాధారణ ధర్మమగును?

'చన్నుల్ కాక పసిండి కుండలఁటవ
క్షశ్చర్మ దుర్మాంసముల్
కన్నుల్ క్రొవ్విరిదమ్మిరేకులఁటవే
ల్లద్దూషికాగోళముల్
వెన్నుల్ సోగ యసంటి యాకులఁటసం
వీతాసి పుంజంబు లీ
యన్నుల్ సౌఖ్యము గాఁ దలంచుజనులా
హా! యెంతమూఢాత్ములో.'

అని కవి కర్ణరసాయనకారుడన్నట్లు హస్తిమశకాంతరమగు పద్మకాంతికీ నయనకాంతికీఏకత ఎట్లు? అదియు నూహాకల్పితమే గదా? అటులనే యిచ్చటనూ. ఊహాకల్పితము కార్యసాధనలో ప్రతిబంధకముకాదని నిరూపితపూర్వము.

మరి, 'ఇంత దురవస్థయేల? కృష్ణమేఘములకు గమ్యమాన నైల్యము ఉపమా నిర్వాహకమేలకారాదు?' అంటే, కావచ్చును. కాని ఆకాశ కాసారములకు గమ్యమానమైననూ ఏది ప్రసిద్ధ ధర్మము? "తారకాన్వితనభమ్ము, నెత్తమ్మి కొలను' అనుటచేత విశేషణములైన తారకలు తామరలు బింబప్రతిబింబ భావాపన్న సాధారణ ధర్మముగ నేర్పడుచున్నవి. అచ్చట నావశ్యకమగు బింబప్రతిబింబ భావము ఇందును నుపాత్తము గనుక అదియు కార్యసాధకమనుట పాడి.

వస్తు ప్రతివస్తుభావము = ఒకే ధర్మమును సంబంధిభేదముచేత ప్రత్యేకముగ పేర్కొనుట. ఉదాహరణము: - కాళహస్తి మహాత్మ్యమున:

"జడము నాలుక; జలము రాజీవదళము;
అడుసుఁ గ్రుమ్మరి పురువుదేహంబు; గచ్ఛ
కాయ బూడిదఁ; బోరియని కరణి, విటులఁ
గలసియును గలియకుండఁగవలయు లలన."

కలిసీ, కలియకుండుట సాధారణ ధర్మము. అది 'పొరయని, కలియక' అని భిన్నపదములచే నిర్దిష్టము.

వస్తు ప్రతివస్తుభావ సంకలిత బింబ ప్రతిబింబ భావము కొలది మార్పుతో అనంతకృష్ణ శర్మగారి గాథ :—

"సూర్యమండలమును జొచ్చిన యకలంక
మిందు బింబమౌళుల సందగించె
నెవని కౌస్తుభమున దవిలిన లచ్చి నె
మ్మొగము వాని కీరు మ్రొక్కలిడుడు."

ఇట చొచ్చిన, తవిలిన యను భిన్నపదములచే నొకే యర్థము పేర్కొనబడినది. అదియునిట విశేష్యము. విశేషణ సూర్యమండల కౌస్తుభములకు బింబప్రతిబింబ భావము.

వస్తు ప్రతివస్తుభావము విశేషణముగా:—

"చల దిందిందిర జలజము
గెలువంగాజాలు జానకీసతిమోముగ్
విలులతారకమును గనె
నలవొకను రాము డంగజారిధనువునుగ్."

సుకుమార శరీరుడు రామచంద్రుని గాంచి, వర పరీక్షకై తెచ్చిపెట్టియున్న శివుని మహోన్నత కోదండమునూ పరికించి, "పరీక్షయందీ కుసుమ కోమలుడు నెగ్గునో నెగ్గడో; కఠిన పరీక్షయందు కడతేరకున్న, వీని పాణిగ్రహణభాగ్యము తప్పి

పోవుచేమోయ్ అను సందియమువల్ల కలిగిన యుద్వేగముచేత చంచలమైన తారకలుగల జానకి మోమును, చలించు తుమ్మెదలుగల తామరవోలె నొప్పుదానిని రాఘవుడు కాంచెను. ఆ చూపులచే నాకర్షింపఁబడి, 'తత్పాణిగ్రహణమునకు నీ పాతవింటిని ఎక్కుడుట యొక లెక్కా,' అన్నట్లు అలక్ష్యముగ నా ధనువును జూచెను.

ఇచ్చట, 'చలత్, విలులత్' పదములు వస్తుప్రతివస్తు భావాపన్నములు. తద్విశేష్యములైన చంచరీక తారకలకు బింబ ప్రతిబింబ భావము.

వస్తుప్రతివస్తుభావ సంపుటిత బింబ ప్రతిబింబ భావమునకు :—

"చలదంచరీక రాజిత
జలజమ్మను గెలువజాలు జానకిమోముగ
విలులిత తారాదీప్తము
జలజాప్తకులుండు గాంచె శాంకరధనువుగ"

'చల, విలులిత' ములకునూ, 'రాజిత, దీప్తము' లకునూ వస్తుప్రతివస్తు భావము. వానిమధ్య, 'చంచరీక, తార'లకు బింబ ప్రతిబింబ భావమునూ.

శ్లిష్టము :—రామాభ్యుదయమున :

"సారంగండ్ల కన్నులు
సాచ్చి, లతాంగుల కన్నుఁ బ్రామి, బంగారమువంటి యంగలతి
కాంతికాంతులు దొంగిలించె నా,
కారుమెఱుంగు సంగులెస
గణ దమిఁ జోరుల తీరునన్ జనున్
వారిదముల్ నిజాగ్రతర
వారి నెదిర్చినవారి నొంచుచున్."

మేఘములకుఁ జోరులకూ 'నిజాగ్రతరవారి నెదిర్చినవారి నొంచుచూ చనుట.' సాధారణ ధర్మము. నిజాగ్ర తరవారి శ్లిష్టము. ఉత్ప్రేక్ష ఉపమాంగము.

మరియొక్కటి వసుచరిత్రమున :—

"తనభవ్యధామంబు తనభవ్యధామంబు
కరణి మిత్రోన్మేషకరముగాగ,
తనధర్మగుణములు తనధర్మగుణము ల
ట్లతులిత శ్రుతిమార్గ గతుల నెసఁగ
తనమహోహవ దీక్ష తనమహోహవ దీక్ష
పగిది నానావనీపకులఁ బెంప,
తన యంబకంబులు తనయంబకము లట్ల
పరభీరు విముఖతఁ బరిఢవిల్ల,"

అను పూర్వోక్త పద్యమున అనుగతమగు నేక సాధారణధర్మము లేదు. శ్లేషవల్ల నేర్పడిన యర్థద్వయమునకు అభేదాశ్రయణముతో నుపమా నిర్వాహము. శ్లేషయూ 'మిత్ర, శ్రుతి, పరభీరు,' పదములలో సభంగము. 'నానావనీపకులు,' అనుచో సభంగము.

ఉపచరిత ధర్మము :—అనంతకృష్ణ శర్మ గారి గాథ:

"మగని తప్పుపనుల మనసెంత నొగిలినఁ
గాని వానిమీఁది దానియలుక
సడలి కారిపోవఁ దొడఁగెను, బిడికిటఁ
బట్టికొన్న యిసుము పగిదిఁజూడ."

భర్త యొనరించు తుంటరి పనులకు మనసు బెడిసి పోవునంత యలుక నొందెమినది. అట్టి కాంతకడ కాతుంటరి వచ్చుకతే, వానిఁజూచి నాయికకుఁ గలిగిన పరిస్థితిని ఆమెచెలి మరొకతెతో నుడువుచున్నది.

అంతకోపమూ అతనిని జూడగనే పిడికిటఁ బిగ్గఁబట్టిన ఇసుమువోలెఁ గారిపోఁదొడగినది. ఉపమానోపమేయములగు సికతాకోపము లకు కారిపోఁదొడగుట ధర్మము. అది మూర్త ధర్మము.అమూర్తమగుకోపమున ఉపచరితము.

సమాస భేదాశ్రయణము :—

"అధరపల్లవ, లతవోలె నానతాంగి
తరుణి కుచ షట్పదాంచిత స్తబకములను,
పూలు చేసాచి యందీయ మూడుకనుల
రాగమిగు నొత్తఁ గనుఁగొనసాగె శివుడు."

చివురువంటి మోవి గలిగి, తుమ్మెదలు వ్రాలిన పూగుత్తులవంటి శ్యామచూచుకములై ఆప్రాంత పాండురములైన చనులతో లతవోలె నాన తాంగి యగు పార్వతి చేజేత పూజాసుమాంజలి సర్పింప, అదనుగని మదనుడు ప్రేరేప, శివుడు ప్రేమార్ద్రములగు చూపులతో కనులారగాంచ సాగెను.

ఇచ్చట, 'అధరపల్లవ, కుచ షట్పదాంచిత స్తబకములు,' సమాసభేదముతో నుభయానిత్యములు.

మరొకటి:—కవిజన మనోభిరామమున:

"ఇందింది రాలక బృంద సంపదఁ జూపి
బేడిసతలుకు కన్బొలుకుఁ జూపి,

(సశేషము)

Edited and Published by T. Ramachandra, 2/583, Pycrofts Road, Madras-5.
... Bhavanarayana at the Weldun Press, 146, T. H. Road, Madras-21.

సంవత్సరం చందా : ఆరు రూపాయలు.

[*Approved for the use of all Libraries*]

# EXTRACTS FROM THE PROCEEDINGS OF THE DIRECTOR OF PUBLIC INSTRUCTION, ANDHRA, MADRAS.

*Dis. No. 2505/55.* *Dated: 24-8-'55.*

---

The following journal is commended for use in the libraries of schools, Colleges and Public Libraries.

*Name*: A Bi-monthly journal entitled 'Parisodhana' devoted to Research of Indology.

*Price*: Rs. 1/- per copy. (Annual subscription Rs. 6/-) The journal can be had from Sri T. Ramachandra, Editor, Parisodhana, 2/583, Pycrofts Road, Triplicane, Madras-5.

* * *

K. RAGHAVA REDDY,
*For Director of Public Instruction.*

*For Copies :—*
*The Manager,*
**'Parisodhana'**
**2/583, PycroftsRoad, Madras-5.**